## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals
Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions |
Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మధురాంతకం రాజారాం

# కథలు

## 3

### మూడవ భాగం





విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,

హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

# చలువ పందిరి కింద కథా శ్రవణం

విశ్వకవి, గురుదేవులు శ్రీ రవీంద్రనాథ టాగోర్‌ను బెంగాలీ కథకు సఫలమైన రూపకల్పన చేసిన ఆది రుషిగా పేర్కొంటారు. కాని ఆయన సమకాలికుడు, యావదాంధ్ర తెలుగు పాఠకులకు పరిచితుడైన శరత్‌చంద్ర చటోపాధ్యాయినే– వంగదేశపు స్త్రీ ఆత్మకు ప్రతినిధి అని విమర్శకులు తేల్చారు. సత్యజిత్ రే సినిమాలకు గొప్ప సాహిత్య ప్రేరణగా నిలిచిన విభూతి భూషణ వంద్యోపాధ్యాయ, మానిక్ వంద్యోపాధ్యాయులను ఉభయ దిక్పాలకులన్నారు. అయితే రవీంద్ర కవిచంద్రులు – ప్రసిద్ధ రచయిత తారాశంకర్ బందోపాధ్యాయను మాత్రం వేరొక ఉన్నత కక్ష్యలో నిలువరించి యిట్లా అన్నారు: "ఆయన మట్టినీ మనిషినీ తెలుసుకొన్నాడు. వీటిని జతపరచి ఒక యోగాన్ని స్థాపించాడు." యోగం ఆంతరిక సంబంధమైనది కావటంవల్ల ఎప్పుడూ నిరాడంబరంగానే వుంటుంది.

ఆధునిక తెలుగు కథా సాహిత్యంలో మొదటితరం కథకుల్ని మినహాయిస్తే, రవీంద్రుల ప్రశంసలాంటి ప్రశంసను పొందదగిన వ్యక్తీ, రచయితా – మధురాంతకం రాజారాం – అని నేను ఎంతోకాలంనించి విశ్వసిస్తున్నాను. ఎవరి జీవన దృక్పథమూ, సాహిత్య వ్యాసంగమూ జంటగా, శ్రుతిలయలై, దార్శనికతగా రూపుదిద్దుకొంటాయో, ఏ రచయితకు మానవాదర్శంమీద, మానవ సామర్థ్యంపట్ల గౌరవమూ అకుంఠిత విశ్వాసం వుంటాయో, ఏ కథకుడు – అన్ని విధాల వితండ వాదనలకు, తర్క కుతర్కాలకు, నినాదపూరిత సిద్ధాంతాలకు అతీతంగా మానవతనే మహామంత్రంగా రచనా జపయజ్ఞం చేస్తాడో – అతగాడి సృజనను కాలం కుదిపి వేయలేదు. చెరిపి వేయలేదు.

మధురాంతకం రాజారాం ఆ కోవలోనివాడు. ఆధునిక మానవుడిలో నెలకొన్న– తాత్విక శూన్యత – అతని దరిచేరలేదు. ఆంగ్ల భాషలో చెప్పాలంటే అతని సాహిత్య దృక్పథం, దృష్టి – Pro-life insight which is deep and powerful. It will with stand the sweep of the broom of History.

రాజారాం కథలను Museum of human history గా పోల్చవచ్చు. రాబోయే తరం వారుగూడా చారిత్రక చిత్రశాలను దర్శించకుండా వుండలేరు గదా!

ఆ రాజారాంగారి కథలను ఏర్చికూర్చి పెద్ద సంపుటాలుగా పాఠకులకందిస్తూన్న విశాలాంధ్రవారికి గూడా యీ చారిత్రక చిత్రశాలలో సముచిత గౌరవం వుంటుందని నా నమ్మకం. ఎందుకంటారా ఒక గొప్ప కథకుడికి నివాళి మాత్రమే కాదు యీ ప్రచురణ. సాహిత్యంలో మాసిపోతున్న విలువలకు అడ్డుకట్టవేసి, క్షుద్ర సాహిత్య రీతులనుంచి విముక్తిచేసి అనేకమంది యువరచయితల ముందు ఒక సుందర స్వప్నాన్ని ఆదర్శంగా నిలిపి, ప్రేరకుడై, గురుసత్తముడై – ప్రేమనూ, ప్రకృతినీ, సమాజ సమస్యలనూ కావ్య మర్యాదకు భంగం కలుగకుండా – ఐతిహాసమూ కాల్పనికతలతో మిళితంచేసి, అధిక్షేపణా వ్యంగ్యమూ రంగరించి పోసి – తెలుగు పల్లెల కథాగానాన్ని లోకానికి వినిపించిన యాత్రీ గాయకుడికి – ఆరాధనోత్సవంగూడా. ఆ యాత్రికుడు రాజారాం. ఆ గాయకుడు రాజారాం. నాకన్నా చిన్నవాడు వయసులో! పెద్దవాడు – అనుభవాదర్శాల్లో!

ఈ పరిచయ వాక్యాల సార్థకత – ఈ సంపుటిలోని కథలను విశ్లేషించటంలోకన్నా, ఆ కథకుడి వేదాంతసారాన్నీ, వ్యక్తిత్వ ఔన్నత్యాన్నీ కొంతవరకైనా వెలువరించగలిగితే,

యితగాడి కథల్ని ఎందుకు అధ్యయనం చేయాలో పాఠకుల్లో ఆలోచనాంకురార్పణ చేయటంలో వుంటుందని విశ్వసిస్తున్నాను.

విమర్శకులు అతగాడిని పెద్దగా పట్టించుకోకముందే పాఠకులవల్ల బతికిన చిరంజీవి మధురాంతకం - అని కీ॥ శే॥ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులుగారు అంటుండేవారు. బొమ్మకంటివారు పండిత కవులేకాదు. ప్రసిద్ధుల్లో సిద్ధులైన విమర్శకులు. రాజారాంగారితో ఆయనకు ముఖ పరిచయం లేదు. నన్నయ పదకోశంకోసం విశేష కృషి చేసినవారు. "రాజారాంగారి కథల్లోని అతి సుందరపదాలను, నుడికారాలను, యిదివరలో వెలుగుచూడని సామెతలను - పరిశోధకులు ప్రోదిచేసి భద్రపరచవలసిన ఆవశ్యకత ఎంతోవుంది. ఈ మాటు ఆయన వచ్చినప్పుడు నాకు పరిచయం చేయటం మరచిపోకు" - అంటుండేవారు.

రాజారాంగారి గద్య శైలిలో వున్నది - కవిత్వ శబ్ద మైత్రి. ఆ శైలిలో నాదానికి తక్కువ ప్రాధాన్యం. ధ్వనికి అధిక ప్రాధాన్యం. వ్యంగ్య రచనకు ప్రాతిపదిక అది. ఎక్కడా తిట్టు వినిపించదు. ఇది రాజారాం కథల ప్రత్యేక శైలి.

తన జననం, బాల్యం, విద్యాభ్యాసం, ఉద్యోగం, వివాహం, సాహిత్యాధ్యయనం అన్నీ పల్లెబాటలోనే. కాని ఆ నిరాడంబర మార్గమే - ఢిల్లీలో కేంద్ర సాహిత్య పురస్కారానికి ఆస్కారమైంది. అమెరికా పర్యటనకు అప్రయత్న మార్గమైంది. కారణం - అతని కథల్లోని ఆంతరంగికత హార్దికమైనది. ఆ పలుకుబడీ, స్నిగ్ధలావణ్యాలు పెద్ద బాలశిక్ష చదువుతున్నట్లే వుంటాయి. ఆ కథల్లో అస్థిరతలేదు. ఆ కథల్లోని ఒక నిశ్చలమైన విశ్వాస ప్రకటన - పిరికి మానవుడికి, వ్యథిత జీవికి ఊరట కలిగించే ప్రాణ శంఖనాదం. అభద్రతను పారదోలే ఆత్మజ్యోతి దర్శనం. అంతటి అనుభూతితోనే కావచ్చు ఒక ప్రసిద్ధ రచయిత్రి నాతో అన్న మాటలు : "కారణం ఏదైతేనేమిగాని అశాంతితో సతమతమవుతున్నప్పుడు, ఏదో వేదనతో నిద్రాభంగమైనపుడు రాజారాం కథలు నాకెంతో వూరట కలిగించేవి. మళ్ళీ మళ్ళీ చదువుకొనేదాన్ని. చాలా చాదస్తం, అమాయకత్వం అని మొదట్లో అనిపించేవి. నిజానికవి గీతోపదేశాలు. చదివి యాదమరచి నిద్రించేవాణ్ని." రాజారాంగారితో ప్రాథమిక సాహిత్య పరిచయం చాలామందికి "తాను వెలిగించిన దీపాలు" కథ ద్వారా కలిగింది. ఇన్నేళ్ళ తర్వాతగూడా అది మాకిచ్చిన స్ఫూర్తికి విలువకట్టలేం, మరిచిపోలేం. అనే సాధు పాఠకుల్ని ఎందరినో నేనెరుగుదును.

విశిష్ట ఆంగ్ల భాషోపన్యాసకుడు, వక్త, వ్యాసకర్త అయిన శ్రీ జి.జోగారావుగారు కాబోలు - ఒక వ్యాసంలో యిట్లా వ్యాఖ్యానిస్తారు- "కొలంబస్ అమెరికాకు సముద్రమార్గం కనిపెట్టి వుండకపోతే ఇంకెవరో ఆ పనిచేసి వుండేవారు. కాని షేక్స్పియర్ లేకపోతే హేమ్లెట్ నాటకం సాహిత్య ప్రపంచానికి దక్కి వుండేదికాదు. వాస్కోడిగామాకు బదులు ఇంకో నావికుడు ఇండియా సముద్రతీరాన్ని చేరి వుండేవాడు. కాని కాళిదాసు జన్మించి వుండకపోతే అభిజ్ఞాన శాకుంతలమ్ విశ్వవాఙ్మయానికి దర్శనమిచ్చేదా?"

మధురాంతకం వారు తెలుగు కథా పరిచయాన్ని అంత ఆరాధనా భావంతో చేసి వుండకపోతే, యీనాడు దానికంత విస్తృత ప్రచారం వుండి వుండేదికాదు. తొలితరం కథకుల్ని, ఆ కథల యింపుసొంపుల్ని వివరిస్తూ ఎన్నో రచనలు చేశారు. సాహిత్య ఎకాడమీకి - రెండు సంకలనాలను కూర్చిపెట్టారు. తన కథలకన్నా విశిష్టుల రచనలకే ఎక్కువ ప్రాధాన్యతను చేకూర్చారు.

రష్యన్ మహారచయిత ఆంటన్ చెహోవ్ – తన జీవితకాలంలో (ఆయన 1904లో క్షయవ్యాధితో మరణించాడు) అరువందల కథలు రాసినవాడు. దీనుల ఆంతరంగిక సమస్యల్ని అంతక్షుణ్ణంగా ఏ రచయితా పరిశీలించలేదు– అన్నాడు గోర్కీ. ఇంకొక విమర్శకుడు – He teaches us - us - (ఆయన మనల గురించి మనకే బోధించాడు)– అని నివాళులర్పించాడు.

పాలగుమ్మి పద్మరాజుగారు మధురాంతకం వారి గురించి యీ విధంగానే వ్యాఖ్యానించారు– "ఈ కథలు చదువుతుంటే మనలను మనం బాగా అర్థం చేసుకోగలుగుతాం. మనలోవున్న పిచ్చి ప్రవృత్తులను చూసి నవ్వుకోగలుగుతాం. మన అవివేకాన్ని గూర్చి జాలిపడగలుగుతాం. ఇంతకన్నా గొప్ప ప్రయోజనం కథారచనకు మరొకటి లేదు."

రాజారాంగారు మూడొందల కథలను జీవనగతి నిత్య పరిశీలకుడుగా ఆంధ్ర లోకానికి సమర్పించారు. మరొక మూడొందల పైనే కథా సాహిత్య వ్యాఖ్యానాలు, కథా సంపుటాల ఉపోద్ఘాతాలు, వైభవోన్నతమైన కథా రచయితల పరిచయాలు మనకందించి పోయారు. ఎక్కడా పక్షపాతంలేదు. ఎచ్చోటా తన వినయ పథాన్ని వీడలేదు. సంప్రదాయ రచనలు, కావ్యాల్లోని జీవనసారాన్ని మదిలో నిలుపుకున్నాడు. భగవంతుడి మాట వినబడితే భయం నటించి తామే అభ్యుదయానికి ప్రతినిధులం అనని ప్రకటించుకునే కృతక సాహితీకారులకు జడిసి తన మార్గం మార్చుకోలేదు. సామాజిక ఆర్ద్రతలేనిచోట సామాజిక స్పృహ అన్న పదానికి అర్థం వుండదని ఆయన కథలు చదివిన పాఠకులందరూ అంగీకరిస్తారు.

ఈ సంపుటిలోని 37 కథలు, వాటి వైవిధ్యం పలాయనవాది పలవరింతలు కావు. అభూతకల్పనలు ఉబుసుపోని ఉదంతాలు కావు. సామాన్య మానవుడు, సగటు పౌరుడు, నాగరిక సమాజంలో బతుకుతున్న స్త్రీ పురుషులు – ఏ సమయంలో ఏ సమస్యలనెదుర్కొంటారో, వాటి పర్యవసానమేమిటో – నిబ్బరంగా నిలిపి మెలోడ్రామాను పరిహరించి, జీవితమంటే యిదే, భయపడనక్కరలేదు – అని భరోసా యిచ్చే కథలివి. ఆధునికత అంటే కాలం కాదు, నీ హృదయంలో రావలసిన పరివర్తనే – అని వక్కాణించే కథలివి.

'ఆగనివేగం' – అనేది చిన్నకథే. అందులో చిన్నాయన నలభై ఏళ్ళ పోస్టల్ సర్వీసులో నడచిన దూరం – మూడు లక్షల యిరవైవేల కిలోమీటర్లు. ఆ పైన పుణ్యక్షేత్రాల సందర్శనలో మరో ఎనభైవేలు. ఈ శ్రమజీవి – జీవనగీతోపదేశం వింటే బతుకుమీద ఎంత విశ్వాసం పొలముకుంటుందో– "కళ్ళున్నందుకు చూడాలి. చెవులున్నందుకు వినాలి. చేతులున్నందుకు పని చెయ్యాలి. కాళ్ళున్నందుకు తిరగాలి. ఆఖరిక్షణంవరకూ బతకాలి. బతికుండగానే చనిపోకూడదు."

వారి స్వగ్రామం దామల్‌చెరువులో తామరపూలను చూపిస్తూనో, తోట మధ్య నిర్మించిన చిన్న సినిమా హాలులోనో, తోటల మధ్యే నెలకొన్న రైల్వేస్టేషన్‌లోనో, మదనపల్లి రోడ్డు పక్కన బండరాయిమీద ఆసీనులమైనప్పుడో అటువంటి అరుదైన వ్యక్తుల్ని తన రచయిత మిత్రులకు పరిచయంచేసి ఆనందించటం ఆయన అలవాటు. రామాలయం వీధిలో వారి స్వగృహంలో ఆతిధ్యం తీసుకోకుండా తిరుపతి దాకా వచ్చిన ఏ రచయితా తిరుగు ప్రయాణం చేయలేదుగదా!

ఇందులో కొన్ని ప్రయాణం కథల్నిగూడా మీరు చిరకాలం జ్ఞాపకం పెట్టుకొంటారు. కర్ణామృతం, అరచేతిలో గ్లోబు, గాలివీడునుంచి న్యూయార్క్‌దాకా, మిస్ ఎమరాల్డాలాంటి కథల్ని ట్రావెలాగ్‌లు మాత్రమే అనగలమా? ప్రయాణ దృశ్యాల్ని, కథా సన్నివేశాల్ని, ప్రాణమున్న పాత్రల్నీ ఒక అపురూపమైన సృజనాత్మకతతో మన మనోల్లాసంకోసం చైతన్యంకోసం – మలచిన తీరులో – ఎక్కడా అపశ్రుతి వుండదు. అహింసా నినాదమే వినిపిస్తుంది. గాంధీగారిపేరు వినబడకపోయినా, (విక్టర్ హ్యూగో కథలోని బిషప్ – దొంగను క్షమించిన తీరుగా) కొండారెడ్డి కూతురు కథలో కిరాయి హంతకుల హృదయ పరివర్తన గాంధీజీ వేదాంతమే గదా! "మా బొంబాయి ప్రయాణం" చదివి, మీరు ఆ మహానగరాన్నీ దర్శిస్తారు. మామిడిపళ్ళ వ్యాపారంలో ఒడుదుడుకుల్ని అర్థం చేసుకుంటారు– అన్నింటినీ మించి దామల్‌చెరువు గ్రామాన్నీ, మానవ సంబంధాలు మెరుగుపడే ఉపనిషత్ సూత్ర జ్ఞానాన్నీ ఒకేమారు కంటారు, వింటారు. పద్యంనుండి వచన కవిత్వంలోకి అడుగిడుతున్న అక్షర ప్రపంచాన్ని చూసి వగపెందుకు? రెండు ప్రక్రియలూ కాలధర్మంలో మనకు లభించినవేగదా – అని యుగారంభం కథలో నాయని వారిని పరిచయం చేస్తారు. పంచవర్ష ప్రణాళికలు కుగ్రామంనుంచే ప్రారంభం కావాలనే ధర్మయ్యకలలో ఎంతశక్తివుంది అనుకుంటాం. నిమ్నజాతుల Empowerment, స్త్రీ విముక్తి, కులాంతర వివాహప్రసక్తి అన్నీ కాలం తెచ్చే మార్పులేగదా? ఎందుకింత అలజడి, ఏలనయ్యా యీ అశాంతి? – అని ప్రశ్నించే కథలూ మీ రీ పుటల్లో చదువుతారు. ఎక్కడా శుష్క నినాదం కన్పించదే, అంతా సూచ్యమేగాని, వాచ్యం కాదు గదా – అని ఆశ్చర్యపోతారుగూడా. క్షుద్ర సాహిత్యాన్ని రుద్రభూమి అనీ, కామదహనం అనీ – యిదివరలో ఎవరూ అనలేదే అనిగూడా విస్తుపోతారు!

రచయితను అతను పుట్టి పెరిగిన సాంఘిక ఆర్థిక కాల నేపథ్యంనుండి విడదీసి, వర్తమాన రంగు కళ్ళజోడుతో పరిశీలించటం – కొందరు కువిమర్శకుల వినోద ప్రదర్శనం మనం గమనిస్తూనే వున్నాం. 1930 దశకంలో (5–10–33) జన్మించిన రాజారాం గారు – బాల్యంలో, ఆ మారుమూలపల్లెలో ప్రకృతి రమణీయకత మధ్య జ్ఞాపకం పెట్టుకొన్నది. ఒక విధమైన బార్టర్ సిస్టంలాంటి ఆర్థికవ్యవస్థ. ఆర్థికమాంద్యపు క్రూర వీక్షణాలు ఆ మూలకు సోకి వుండవు. ఆ నీరవ వాతావరణంలో గ్రామస్థుల సౌజన్యంతో తన తండ్రి బతికిన తీరు – తనను చాలా ప్రభావితం చేసిందనే చెప్పేవారు. ఆనాడు విన్న పౌరాణిక నీతిచంద్రికల వాక్యాల సరళి – అనంతరం ఆయన రచనల్లో ప్రముఖంగా ప్రతిబింబించింది. సంఘర్షణలు – పైకి పొర్లని – ఆ సమన్వయ గ్రామీణ వాతావరణం – శాంతి సామరస్యాల అహింసా వివేచన ఆయన కథల్లో అట్లా ప్రవేశించింది. ఎవరితోనో ఒక ఇంటర్వ్యూలో "నాకెన్నడూ దుర్మార్గం ఎదురుపడలేదు" అన్నారు. కాని కాలంలో వచ్చిన ఉత్థాన పతనాల్ని అతిసూక్ష్మంగా పరిశీలించాడాయన. పతనమవుతూన్న విలువలను గురించిన పరితాపశిఖలు అట్లా కొన్ని కథల్లో మనకు కన్పిస్తాయి. కాని మౌలికమైన భారతీయ గ్రామీణ అహింసాతత్వం జీవితంలోనూ, రచనా వ్యాసంగంలోనూ, కథా సంవిధానంలోనూ చివరివరకూ అంటిపెట్టుకొనేవుంది. అంతటి నిగర్వం ఒక్కో సందర్భంలో సన్నిహితుల్నిగూడా చికాకులో తోసివేస్తుంది.

రష్యన్ భాషలో కథానిక ప్రక్రియ ఎంతో ఉన్నతమైన శిఖరాగ్రం మీద నిలిపిన వారిని రష్యన్ మాస్టర్స్ అంటారు. పుష్కిన్, టాల్‌స్టాయ్, దోస్తోవిస్కీ, తుర్గనీవ్ యిత్యాదులు

అజరామరమైన మానవీయ కథా సాహిత్యాన్ని సృష్టించిన వారిలో అగ్రభాగాన నిలుస్తారు. మొదట్లో వాళ్ళని హ్యూమనిస్ట్ రైటర్స్ అన్నారు – విప్లవకాలంలో. తర్వాత "వీళ్ళే రష్యన్ ఆత్మ – వీళ్ళే యీ భూమికి సాహిత్య ప్రతినిధులు" అన్నారు. చదవండి – అద్భుత ఆధ్యాత్మిక గాథ – కూతురు కాపరం!

తుర్గనీవ్‌ను రష్యన్ ఆత్మ వైలక్ష్యాన్ని సున్నితంగా ప్రదర్శించిన మహారచయిత అన్నారు. రాజారాం గారు సామాన్య జీవి ఆత్మకు ప్రతినిధిగా రూపుదిద్దిన కథకుడిగా నిలిచిపోగలడనటంలో అతిశయోక్తి లేదు.

ఆయన అధికార భాషాసంఘంలో మూడేళ్ళు సభ్యులుగా వున్నారు. కార్యదర్శి సి.ధర్మారావుగారు. అధ్యక్షులు డా॥ నండూరి రామక్రిష్ణమాచార్యులు, డా॥ నాగభైరవ, డా॥ కొలకలూరి ఇనాక్, మల్లెమాల వేణుగోపాలరెడ్డిగార్లు తోటి సభ్యులు. వారి పర్యటనలలో సాహిత్య విశేషాల సంభాషణలు దొర్లుతున్నప్పుడు, నిత్య విద్యార్థిగా మధురాంతకం రాజారాం గారు పోషించిన మైత్రీ సుగంధపాత్రను గురించిన విశేషాలు ధర్మారావుగారినుండి వినవలసిందే.

నిత్య విద్యార్థి కనుకనే నిత్య సాహితీ పౌరాణికుడైనాడు ఆయన అంతేవాసులుగా కుటుంబ సభ్యులందరూ కథా రచయితలైనారు. ఇది చాలా అరుదైన అదృష్టం. పుత్రుడు మహేంద్ర అకాల మరణంతో కొన్నాళ్ళు అంతర్ముఖమౌని అయినాడు. కాని తన దుః ఖాన్ని యితరులమీద ప్రసరించని స్థితప్రజ్ఞత్వం ఆయనది.

భోగ భాగ్యాలకన్నా నిరాడంబర స్నేహ సౌభాగ్యమే – మానవధర్మం – అని కథల్లో, సంభాషణల్లో, లేఖల్లో సుతిమెత్తగా చాటి చెప్పిన శాంతయోగి ఆయన. కథా సాహిత్య ట్రస్టీగా నూతలపాటి గంగాధరం, రావిశాస్త్రి స్మారక సంఘాల్లో నిశ్శబ్దంగా ప్రముఖపాత్ర వహించాడు. జయకాంతన్ కథల్ని తెలుగువారికి తర్జుమాతో పరిచయం చేశాడు.

నూతలపాటి గంగాధరం దివ్యస్మృతికి ఆయన రాసుకొన్న అంకిత పద్యం వినండి:

*"మంచి గంధము వంటి మనసు కలిగినవాడు*
*అమృత కలశము వంటి హృదయమ్ముగలవాడు*
*ఎదురైన ప్రతివాని ఎదకు మోదము గూర్చి*
*చెలిమితో చలువ పందిరులు వేసినవాడు."*

నిజానికివన్నీ రాజారాం గారికి చెందే భూషణాలే.

రాజారాం గారు ఎవరిబాకీని వుంచుకోని అద్భుత వ్యక్తి. తను అపరిచితుడుగా ఎకాడమీ పురస్కారం కొరకు భాగ్యనగరం వచ్చినపుడు (1967 కావచ్చు) ఆతిధ్య మిచ్చిన మిత్రుణ్ణి ఒక కథలో రమణీయంగా తలచు కొన్నాడు. మనం తలచుకోడానికింత ఉత్తమకథా సాహిత్యాన్ని మనకందించి 1.4.99న నిరాడంబరంగా వెళ్ళిపోయాడు.

ఈ నాలుగు వాక్యాల నివాళితో నా బాకీగూడా నేను తీర్చుకుంటున్నాననే నమ్మకంతో – సెలవు తీసుకొంటున్నాను.

మీ

**–మునిపల్లె రాజు**

హైదరాబాద్,
4 ఆగస్టు, 2004.

# ఇందులో కథలు...

# సంఘజీవి

మంచి కబురు గానివ్వండి, చెడు కబురు గానివ్వండి, పెదవి దాటిన తర్వాత అది పెన్నునే లంఘించగలదంటారు. పెన్నునే దాట గలిగినప్పుడు కమలాకరంద్వారా పద్మావతికి తెలిసి, పద్మావతిద్వారా ఎదురింటి సుందరమ్మక్కకు, ప్రక్క యింటి పార్వతమ్మ పిన్నికి తెలిసిన కబురు వాయువేగంతో చిలవలు పలవలుగా వీధి వీధంతా అల్లుకపోవడంలో ఆశ్చర్యమేముంది?

వీనుల విందుగా ఒక పాటను వినిపించి, ఆ పాటకు అనుబంధంగా తలనొప్పిమందు కొనుక్కోమని హితవుజెప్పే సిలోను రేడియో ప్రసారంలాంటి ప్రచారం ఎదిరింటి సుందరమ్మక్కది! "విన్నావా రంగమ్మత్తా! మరీ... పద్మావతికట, పది పదిహేనురోజుల్లో ఒక వంటలక్క అత్యవసరమట! ఎందుకూ అనండి! అదేం ప్రశ్నండీ, వచ్చే అతిథులకు కాఫీలు, ఫలహారాలు ఆఫీసు గదిలోకి సరఫరా చేయిస్తూ, వాళ్ళకు లభ్యం కావలసిన ఆదరణ మర్యాదలో ఎలాటి లోపమూ జరక్కుండా చూసుకోవలసిన బాధ్యత తన భుజాలపైన వుండగా, ఆవిడ వంటగదిలో గంజి వార్చుతూ కూచుంటే ఎలా జరుగుతుందండీ, మీ పిచ్చిగానీ! ఆ వచ్చే అతిథీ తాశీల్దారుగావచ్చు, లేదా ఏ పంచాయతీబోర్డు ప్రెసిడెంటో కావచ్చు, అదీ కాదంటావా ఎం.ఎల్.ఏగారి బావమరిదికి తోడల్లుడి ప్రేలు విడిచిన మేనల్లుడైనా గావచ్చు" అంటూ ఆమె ప్రతీవాక్యం చివరా ఏ సింధుభైరవో, ఏ అఠాణానో, లేదా ఏ హిందూస్థానీ కాఫీయో ఆలాపించి, చిట్టచివర "విషయమేమిటంటే రంగమ్మత్తగారూ! ఆవిడ భర్తగారికి ప్రమోషను రాబోతున్నదట! 'అట' ఏమిటండీ అపశకునంలాగా! వచ్చేసినట్టే లెక్కట!" అంటూ అసలు సంగతికి రంగులు పూసి, మెరుగులుదిద్ది గాలిలోకి వదిలేసింది.

నలుగురైదుగురు బిడ్డలతో వేగుతూ, తాలూకాఫీసులో పనిచేస్తున్న భర్తకూ, మరిదికీ వేళకు సరిగా వంటలూ, వడ్డనలూ నిర్వర్తింపవలసి వున్న సుందరమ్మకంటే ప్రక్క యింటి పార్వతమ్మ పిన్ని బాగా తీరుబడివున్న మనిషి! కొడుకులూ, కోడళ్ళూ కాపురం చక్కబెట్టుకుంటూ వుండగా, యిక సంసారంతో మనకేంపని అన్నట్లు నాళంవారి వీధిలో ఈ కొసనుంచీ ఆ కొసదాకా దిగిన కడప ఎక్కకుండా ప్రతి యింటికీ వెళ్ళిరావడం ఆమె అనుదిన కార్యక్రమం. పోస్టుమేన్ పొరుగూళ్ళనుంచి వచ్చిన ఉత్తరాల్ని ఎవరివి వాళ్లకు అప్పజెప్పుతాడు, పార్వతమ్మ స్థానిక వార్తల్ని యింటింటికీ చేరవేస్తుంది. కాదంటే ఒక చిన్న తేడా లేకపోలేదు. అతడు కొలువుచేసేది రూకలకు! ఈమె యిల్లిల్లూ తిరిగేది ప్రొద్దుపోకడకు!

"ఐనా అదృష్టమంటే అలా వుండాలి."

పార్వతమ్మచేత అదృష్టంగా భావింపబడుతున్నదేది? ఆ అదృష్టం యిప్పుడెవర్ని వరించింది? అన్న ప్రశ్నలకు జవాబుకోసం ఎదుటివాళ్లు తనవైపు కుతూహలంతో చూస్తుంటే, వాళ్ళల్లో ఉత్కంఠ రగులుకోడానికి నాలుగైదు క్షణాలు తెరపియిచ్చి మళ్ళీ ప్రారంభించేది పార్వతమ్మ.

"ఉద్యోగంలో చేరి అయిదారేళ్ళయినా కాలేదు, అప్పుడే ప్రమోషనా! అందులోనూ ఆ డిపార్టుమెంటులో వినడానికే అబ్బురంగా వుంది. గుమస్తాగా వున్నంతకాలం అతడు సైకిలుతోనే సరిపెట్టుకున్నాడనుకో! కానీ యిక మీదట ఆఫీసరు హోదాకు, సైకిలుకు ఎక్కడి కెక్కడి చెప్పు! అందుకని కమలాకరం సైకిలమ్మేసి మోటారు సైకిలు కొనుక్కోబోతున్నాడట! ఇక రేడియో కొనడమేమో తప్పనిసరి! అంతేనా! ఇంట్లో టెలిఫోను లేకపోతే క్షణం సాగుతుందా పిన్నిగారూ అంది పద్మావతి! అవును మరి! ఎలా సాగుతుంది? భర్త ఆఫీసులో కూచుని 'అలోమదీరా' అంటే, యిటు యింట్లోనుంచీ ఈవిడ..."

"అలో మదీరా ఏమిటండీ పిన్నిగారూ, మక్కామదీనాలాగా! 'హలో మైడియర్' అనాలి."

"అదేమిటోనమ్మా, ఆ చోద్యాలు నాకేం తెలుస్తాయి?" అంటూ అమాయకత్వం ప్రకటించి ప్రమోషను రాగానే కమలాకరం యింట్లో తీసుకరానున్న మార్పుల్ని గురించి తను పద్మావతిని వుబుకించి తెలుసుకున్న విషయాలన్నింటినీ ఏకరువు పెట్టసాగేది పార్వతమ్మ.

విస్తృతరంగంలో, విరివిగా కొనసాగుతున్న ఈ ప్రచారంవల్ల కలిగిన సద్యఃఫలితాలు యిటు పద్మావతికీ, అటు కమలాకరానికీ అమందానందాన్నే కలిగించాయి. వీధిలో ఎదురైనప్పటికీ పెదవి కదిపి పలకరించడమే బ్రహ్మాండమైన రిటయిర్డు సబ్‌కలెక్టరు రాజాద్రిరావు నాయుడుగారు, కమలాకరం ఆఫీసుకు వెళ్తుండగా కిటికీలోనుంచీ చూచి "ఏమిటోయ్ కమలాకరం ఈ మధ్య కనిపించడమే మానేశావే! తీరికైనప్పుడు యిలా రాగూడదూ! ఏదైనా మాట్లాడుతూ కూచోవచ్చు. ప్రొద్దుపోయి చావడం లేదయ్యా పాడూ!" అన్నాడు. అదే వీధిలో కాపురముంటున్న డిప్యూటీ తాశీల్దారు చిదానందం, సైకిలుపైన వెళ్తున్నవాడు కమలాకరం యింటిముందర ఆగి, ఏమండోయ్ కమలాకరంగారూ! పైవారం క్లబ్బు కార్యవర్గాన్ని కొత్తగా ఎన్నుకోబోతున్నారన్న సంగతి మీకు తెలుసుగదూ! నా మట్టుకు నేను రెండేళ్ళు సెక్రెటరీగా పనిచేశాను. నా తల బొప్పికట్టింది. మీ కభ్యంతరం లేకపోతే నేను సెక్రెటరీగా మీపేరు ప్రతిపాదింపదలచుకుంటున్నాను. ఏమంటారు? అన్నాడు. ఎన్నడూ లేనిది, ఎదురింటి శ్రీమన్నారాయణ పండుగా పబ్బమూగానీ మామూలు రోజున కమలాకరాన్ని భార్యాసహితంగా తీసుకెళ్ళి విస్తరి వరహాచేసే విందు భోజనం పెట్టాడు!

కమలాకరానికి ఆశ్చర్యం కలిగింది! ఐతే తన హోదా రిటయిర్డు సబ్‌కలెక్టరుతో బాతాఖానీ వేయడానికి తగినంతవరకూ పెరిగిందన్నమాట! రిక్రియేషన్ క్లబ్బుకు కార్యదర్శిత్వం నెరప గలిగినంతవరకూ పెరిగిందన్నమాట! లోలోపల అసూయవున్నా, ఎదుటివాడు తనను తప్పనిసరిగానయినా గౌరవించక తీరనంతవరకూ పెరిగినదన్నమాట!

'ధన్యోస్మి, ధన్యోస్మి' అనుకోబోయాడు కమలాకరం!

'ఆ ప్రమోషను కాస్తా వచ్చేంతవరకూ ఆగకూడదటయ్యా' అంది అంతరాత్మ.

'పోనీ, అలాగేలే! ఇప్పుడేం తొందర' అనుకున్నాడు కమలాకరం.

గాలిలో తేలిపోతూ కమలాకరం యింట్లో ప్రవేశించేసరికి, పద్మావతి ద్వార బంధాలకు ఎలాటి తెరలు వ్రేలాడదీయాలన్న తలపోతలో లీనమైవుంది. ఆమె ఆలోచనకు అంతరాయం కలిగించడమెందుకని కమలాకరం నిశ్శబ్దంగా కుర్చీలో కూర్చున్నాడు.

అర్ధనిమీలిత నేత్రాలతో, గోడకానుకుని ఆలోచిస్తూ నిల్చున్న పద్మావతి పెదవులపైన శుక్ల పంచమినాటి లేత వెన్నెల్లా ఓ హాసరేఖ మెరసిపోతూ వుండడం కమలాకరానికి కనిపించింది. కారణమేమిటా అని అతడూ ఆలోచిస్తూనే వున్నాడు. ఇంతలో పద్మావతి వున్నట్టుండి పక్కున నవ్వనే నవ్వేసింది!

"ఏమిటి పద్మా?" అన్నాడు కమలాకరం.

పద్మావతి ఉలికిపడి "మీరెప్పుడొచ్చారు?" అంది.

"నేనిప్పుడే వచ్చానుగానీ, నువ్వెందుకు నవ్వావో చెప్పవూ" అన్నాడు కమలాకరం.

"అదిగాదండీ! లోకపు తీరును తలచుకుంటే ఎవరికైనా నవ్వేవస్తుంది."

"ఆ లోకపు తీరెలాటిదో నన్నూ తెలుసుకోనివ్వు మరి!"

"ప్రక్కింటి సరోజమ్మ వుందిగదండీ! ఆవిడ పుట్టింటినుంచీ వస్తూ ఓ డిజైన్ల పుస్తకం పట్టుకొచ్చింది. 'ఈ పుస్తకాన్ని తీసుకెళ్తాను సరోజా! ఒకటి రెండు డిజైన్‌లు కాపీ చేసుకుని మళ్ళీ ఇచ్చేస్తాను' అన్నాను. 'రేపు తీసుకెళ్దువులే, మాపు తీసుకెళ్దువులే' అంటూ నాలుగైదురోజులు జరిపేసింది. ఆ తరువాత నేనడగడం మానుకున్నాను. ఈరోజు ఉదయం ఆవిడ వచ్చి 'మరే మనుకోకు వదినా! ప్రక్క వీధిలో ఎవరో ఈ పుస్తకాన్ని తీసుకెళ్ళి ఇప్పుడే తెచ్చి యిచ్చారు. అవసరమున్నంతవరకూ దీన్ని నీ దగ్గరే వుంచుకో' అని చెప్పి వెళ్ళింది."

"ఇందులో నవ్వడానికేముంది పద్మా?"

"లేకేం; వుంది! నేను ప్రతిరోజూ ఆ సరోజమ్మ కూతుర్ని అడిగి తెలుసుకుంటూనే వున్నాను. ఆ పిల్ల 'పుస్తకం అలమారాలో వుందత్తయ్యా! నేనిప్పుడుగూడా చూచాను' అంటుంది. ఆ అయిదేళ్ళ పిల్లకింకా అబద్ధాలు అలవాటుకాలేదు కదండీ మరి!" అంటూ మళ్ళీ నవ్వేసింది పద్మావతి.

"ఐతే నువ్వికమీదట ఏ వస్తువుకోసంగానీ యిరుగింటి వాళ్ళనీ, పొరుగింటి వాళ్ళనీ, ప్రాధేయపడవలసిన అవసరం లేదేమో పద్మా! కాకితో కబురంపినా వాళ్ళే స్వయంగా తెచ్చి యివ్వగలరనుకుంటాను" అన్నాడు ఇంచుక విస్మయంతో కమలాకరం.

"కానీ ప్రపంచకంలో అందరూ సరోజమ్మలాంటి భోళా మనుషులే వున్నారటండీ! అబ్బో, నోటితో మాట్లాడుతూ నొసలితో వెక్కిరించే వాళ్లెంతమంది? కొళాయి దగ్గర నుంచీ నేను నీళ్ళు తెచ్చుకుంటున్నప్పుడు చూడాలి వీళ్ళ ముఖాలు! కత్తివేటుకు నెత్తురు చుక్క కనిపించదనుకోండి! అవలా పాలిపోవడం ఎందుకంటారు?"

"అసూయ పద్మా అసూయ!" అన్నాడు కమలాకరం! "ఐతే 'అసూయ' అనేది ఎదుటి వాళ్లని హింసించే ఆయుధంగా ఎన్నడూ ఉపకరించలేదు. అది ఎవరికి వాళ్ళనే చెడదినే వ్యాధి. అందుకు నువ్వు మరేం బెంగపెట్టుకోకు పద్మా! కుళ్ళే వాళ్ళ ముందరే కులకాలన్నారు..."

***

జీవితం మానవు డాశించినంత సాఫీగానే గనుక జరిగిపోతే ఆ తరువాత లోకంలో కథలకు అభావమేనేమో అనిపిస్తుంది.

ఇదెంతవరకూ నిజమోగానీ కమలాకరం ఆశించినట్టుగా అతనికి పదిరోజుల్లో ప్రమోషనే గనుక లభ్యమై వుండినట్టయితే, ఇప్పుడిక్కడ కథంటూ ఒకటి సంభవించడానికి ఆస్కారమే లేదు.

కమలాకరానికి ప్రమోషను రాలేదు!

ఆఫీసులో ఏర్పడిన ఖాళీకి కమలాకరాన్ని ప్రమోట్ చేయడానికి బదులు, మరొకచోటునుంచి ఒక ఉద్యోగిని ఆ స్థానానికి బదిలీ చేశారు.

ఆఫీసరుగారు కమలాకరాన్ని తన గదిలోకి పిలిపించి "మనలాంటి ఉద్యోగులు ఆశాభంగానికి తట్టుకోవలసివుంటుంది కమలాకరం! కానీ నువ్విందుకు పెద్దగా విచారం పెట్టుకోవలసిన అవసరంలేదు. కాళ్ళకు చుట్టుకున్న పాము కరవక మానదు! నీ పేరు లిస్టులో వుంది. ఎప్పుడో నీకు తప్పకుండా ప్రమోషను వస్తుంది" అన్నారు.

సూర్యాస్తమయం తర్వాత చెన్నుదొరగిన పద్మాకరంలా ఆ వార్త విన్న కమలాకరం ముఖం చిన్నబోయింది.

"ఏ ముఖం పెట్టుకుని నేను పద్మావతిని చూడను" అని లోలోపలే బిట్టు వాపోయాడు కమలాకరం.

కానీ ముఖం తప్పించుకుని తిరగడానికి మరొకరూ, మరొకరూ గాదు! స్వయానా అర్ధాంగి! సాయంత్రం ఎనిమిది గంటలకైనా యింటికి వెళ్ళక తప్పలేదు కమలాకరానికి!

"ఈయన యుద్ధంలో ఓడిపోయి వచ్చిన సేనానిలా వున్నారేమో?" అనుకుంది పద్మావతి.

కొండ కొమ్ముమీద నిలబెట్టిన పద్మావతిని హఠాత్తుగా లోయలోకి తోసివేయ లేకపోయాడు కమలాకరం. చేతిని పట్టుకుని నిండు చెరువులోకి తీసుకెళ్ళినట్లు ఆమెను నిరాశలోకి మెల్లమెల్లగా నడిపించుకుని వెళ్ళాడు. అందుచేత అసలు విషయాన్ని వివరించి చెప్పడానికి అరగంటసేపు పట్టింది.

ఈ అరగంటసేపట్లో పద్మావతి ముఖాన కృష్ణపక్షం కళలు మార్చుకుంది. చిట్టచివర అక్కడ నిండు అమావాస్య నెల నాటుకపోయింది.

వేదనలతో, వేడి నిట్టూర్పులతో భార్యాభర్తల కా రాత్రి గడచిపోయింది.

తెల్లవారుజామున కాసేపు నిద్రపోయి లేచిన తర్వాత వాళ్ల కా వేదన కాస్తా వుపశమించినట్లే కనిపించింది.

కానీ పుండుపైన కారం చల్లడానికి సంఘమంటూ ఒకటి తమ చుట్టూ వున్నదన్న సంగతి వాళ్లకప్పటికి అంత స్పష్టంగా తెలియదు. ఒకవేళ తెలిసినా, 'బాధలో బాధ! దాని లెక్కేమిటి!' అనే వాళ్ళు తలపోశారు.

కానీ పుండువల్ల కలిగే బాధకంటే, దానిపైన కారం చల్లడంవల్ల కలిగే బాధే దుర్భరమన్న సంగతి ఆకళించుకోడానికి వాళ్లకెంతో కాలం పట్టలేదు.

ప్రమోషను రాబోతున్నదన్న విషయానికి మల్లెనే, అది రాలేదన్న విషయాన్నిగూడా మున్ముందుగా పసిగట్టి, పనిగట్టుకుని ఆ వార్తను ప్రచారం చేసిపెట్టిన ఘనత మళ్ళీ ఎదురింటి సుందరమ్మకు, ప్రక్క యింటి పార్వతమ్మకే దక్కింది.

పదకొండు గంటలకు కమలాకరం భోజనంచేసి ఆఫీసుకు వెళ్ళిపోయిన తర్వాత, పద్మావతి చాపమీద పడుకుని ఏదో చదువుకోడానికి ఉద్యమిస్తుండగా "ఏమిటమ్మోవ్ పద్మావతీ! ఏవైనా డిటెక్టివ్ నవలలున్నాయా?" అంటూ లోపలికి వచ్చింది సుహాసిని. సుహాసిని చిదానందంగారి భార్య.

పద్మావతి తెల్లబోయి "అబ్బే, నేను డిటెక్టివ్ నవలలు చదవను గదండీ!" అంది.

"పోనీగానీ మీకు వంటలక్కతో అవసరముందన్నావట! సుందరమ్మ చెప్పింది. నా ఎరుకలో ఒకావిడ ఎక్కడైనా పని చూపించమని వేధించుక తింటోంది. మీకు కావలసి వస్తే రేపటినుంచే ఏర్పాటు చేస్తాను."

"అబ్బే, మాకు వంటలక్క ఎందుకండీ?" మోకాళ్లమీద తలానించుకుని చాపపైన గీత గీస్తూ అంది పద్మావతి.

"ఏమోలే! ఒక మాటడిగి చెబుతానన్నాను. ఐతే డిటెక్టివ్ నవలలు లేవన్నావు గదూ! వెళ్తాను మరి. ఎలాగూ రేడియో వుంది గదా! వింటూ కూచుంటాను."

వెళ్ళిపోతున్న సుహాసినిని చూస్తూ అలాగే బొమ్మలా కూర్చుండిపోయింది పద్మావతి. ఈమె తనను వెదుక్కుంటూ వచ్చింది నిజంగా డిటెక్టివ్ నవలలకోసమేనా! కాదు. తను అలాటి నవలలు చదవదని ఈమెకు రూఢిగా తెలుసు. ఈమె వచ్చింది – ఒకటి, నీది వంటలక్కను పెట్టుకునే ముఖమేనా అని దెప్పి పొడవడానికి – రెండు, తమకు రేడియో వుందన్న విషయం తనకు జ్ఞాపకం చేయడానికి!

ఆ రోజు రాత్రి పదిగంటలప్పుడు ఎవరో తలుపు తట్టుతూ వుండడం విని, కమలాకరం గబగబా వెళ్ళి తలుపు తీశాడు.

మెట్లమీద నిల్చున్న యువకుడు "నేను అత్యవసరంగా గుంటూరులోవున్న మా బంధువులతో మాట్లాడాలిసార్! మీ యింట్లో ఫోన్ వుంది గదండీ!" అన్నాడు.

"మేము ఫోను పెట్టించుకోలేదండీ!" అన్నాడు కమలాకరం.

"అలాగా! మన్నించండి సార్! ఎవరో రాంగ్ ఇన్ఫర్మేషన్ ఇచ్చారు" అంటూ అతడు తల వంచుకుని చరచరా వెళ్ళిపోయాడు.

అతడిలా అడిగినందుకే కాదుగానీ, ఈ దృశ్యాన్ని ఎదురింటి శ్రీమన్నారాయణ కిటికీలోంచి చూస్తున్నందుకు నిలువునా కృంగిపోయాడు కమలాకరం.

అంతటితో ఏమైంది? నాలుగునాళ్లు గడిచిపోయిన తర్వాత ఓరోజు సాయంత్రం ఆరుగంటలకు ఓ కంపెనీ ఏజంటు మోటార్ సైకిలుపైన హుటాహుటిగా వచ్చి కమలాకరంతో భేటీ అయ్యాడు. ఏమిటి, ఎందుకు ప్రశ్నిస్తూ వుండగానే అతడు కమలాకరాన్ని వీధిలోకి లాక్కొచ్చి "చూచారా సార్! ఇది సైకిలు, ఎంత గంభీరంగా వుందో చూచారా! కొనుగోలుదార్ల సౌకర్యార్థం ఉగాది పండుగ దాకా 10% తగ్గించాము. పెట్రోలు ఖర్చు చాలా తక్కువ. మీరు సైకిల్లో వెళ్తున్నట్టు వుండదు. రెక్కలు గట్టుకుని గాలిలో పరతెంచినట్టుంటుంది. అందుకే మన తెలుగుదేశానికి సంబంధించినంతవరకూ దీనికి 'పంచకళ్యాణి' అని పేరు మార్చాలనుకుంటున్నాము" అంటూ ఉపన్యాసం ప్రారంభించాడు.

సదరు ఉపన్యాసాన్ని వినడానికీ, సైకిల్ను చూడడానికీ, దోషిలా నిల్చున్న కమలాకరాన్ని చూపుల తూపులతో గ్రుచ్చడానికి అక్కడొక గుంపు ప్రోగైంది.

పబ్లికు ప్రాసిక్యూటరుకు మల్లే గడగడా వాగేస్తున్న ఆ ఏజంటు కద్దుతగిలి, ఓ పెద్దమనిషి నేరస్థుని తరఫున వకాలత్తు పుచ్చుకున్న న్యాయవాదికి మల్లే "ఈయన మోటర్ సైకిలు కొనదలచుకున్నమాట నిజమేనండీ! కానీ పరిస్థితులు అనుకూలించలేదు. అందువల్ల ప్రస్తుతం దీన్ని బేరమాడే ప్రసక్తే లేదు. మీరు సెలవు తీసుకోవచ్చు" అని నచ్చచెప్పాడు. 'ఓస్, యింతేనా!' అన్నట్టు ఏజంటు కమలాకరాన్ని ఒకటి రెండుసార్లు ఎగాదిగా చూచి, చెవులు జాడించుకుని సైకిలు పైకెక్కి వెనుదిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి పడుకోడానికి ముందుగా వాలు కుర్చీలో మేనువాల్చి పైకప్పుకేసి చూస్తూ, "అబ్బబ్బ, ఈ లోకుల కంటే యినుప ముక్కుల కాకులే నయం!" అన్నాడు కమలాకరం.

"మెల్లగా అంటున్నారా ఆ మాట! వీధిలో తల చూపించలేకపోతున్నానంటే నమ్మండి. బాబ్బాబూ! మీకు పుణ్యముంటుంది. రెండు మాసాలు సెలవు పెట్టేయండి! మనం వూరికి వెళ్ళిపోదాం" అంది పద్మావతి.

సమయానికంత మంచి సలహా యిచ్చినందుకు భార్యను కృతజ్ఞతాప్లావితమయిన చూపులతో అభిషేకించి, మౌనంగానే అభినందించుకున్నాడు కమలాకరం!

కాలచక్ర పరిభ్రమణంలో రెండు నెలలంటే ఎంత? చూస్తూ చూస్తూ వుండగానే ఆరేడు వారాలు యిట్టే దొర్లిపోయాయి. కమలాకరం మళ్ళీ ఉద్యోగ బాధ్యతల్ని స్వీకరించడానికి ఇంక రెండుమూడు రోజులకంటే వ్యవధి లేదు.

"అదేమిటి పద్మా! నీ వాలకం చూస్తుంటే నువ్విప్పుడు నాతో బయల్దేరే వుద్దేశంతో వున్నట్టు లేవే!" అన్నాడు కమలాకరం.

పద్మావతి కాసేపు గుణిసి "నే నా యింట్లో కాపురం చేయలేనండీ" అంది.

"అయ్యయ్యో, అదేం మాట పద్మా! ఆ ఇంట్లో అత్తమామల ఆరడి, ఆడబిడ్డల పోరు వున్నట్లు మాట్లాడుతావేమిటి! ఇంకా ఆ వీధిలో కాపురం చేయలేనని చెప్పు, ఒప్పుకుంటాను."

"అదేనండీ అదే! నేనిలా చెప్పబోయి అలా చెప్పేశాను."

"ఇంతకూ ఇప్పుడేం చేయాలో అది మాత్రం చెప్పవు!"

"ఇంకేం చేయగలమండీ! యిల్లు మార్చేయాలి"

"రైటో! సలహా చెబితే నువ్వే చెప్పాలి పద్మా; నేనూ ఆలోచిస్తున్నాను..."

"తరువాత తీరిగ్గా పొగడవచ్చుగానీ, మీరు క్రొత్తగా చూడబోతున్న యిల్లు నాళంవారి వీధికి ఒక మైలు దరిదాపులో వుండగూడదు."

"అలాగే, అలాగే" కృతనిశ్చయంతో అన్నాడు కమలాకరం.

నగరారణ్యాల్లో అద్దె కొంపకోసం వేటాడే విద్యలో ఓనమాలైనా రానివ్యక్తి కమలాకరం. కానీ ఆ విద్యలో ఘటికుడైన ఓ మిత్రుని తోడ్పాటువల్ల కమలాకరానికి పట్టణంనుంచీ విసిరివేయబడినట్టున్న ఓ మారుమూల పేటలో ప్రాకారకుడ్యమూ, చిన్న పూలతోట, వంటగది, బాత్‌రూమూగాక మూడుగదులూ, ఓ హాలు వరండాలతో చిన్న బంగళాలా వున్న యిల్లొకటి కుదిరింది.

కార్డు ముక్క చేరగానే, ఫోర్డు కంపెనీవారి కారులా పరతెంచి వచ్చిన పద్మావతి ఆ యింటిని చూసి మురిసిపోయింది.

"ఎంత బాగుందండీ! చాలా బాగుంది. చేద బావి గూడా యింట్లోనే! కొళాయి గిళాయి అంటూ వీధిలో బడిగాపులు పడవలసిన అవసరమే లేదు. నేను పది గంటలకల్లా వంట ముగించేస్తాను. మీరు భోజనం చేసి ఆఫీసుకు వెళ్ళండి. నేను తలుపు గడియవేసుకుని ఏవైనా పుస్తకాలు చదువుకుంటాను. లేదా లేసులు అల్లుకుంటాను. అదీకాదంటే కాసేపు నిద్రపోతాను. మీరు అయిదుగంటలకల్లా యింటికొచ్చేస్తారు. కాఫీ తీసుకున్న తర్వాత మనం ఊరిబయటగా షికారెళ్దాము. రాత్రి భోజనమైన తర్వాత, వెన్నెల రాత్రయితే హాయిగా ఆకాశంలోకి చూస్తూ కూర్చోడానికి, ఎలాగూ డాబా వుండనే వున్నది. ఈ యింట్లో మనం తిన్నా, తినకపోయినా అడిగేవాళ్లు లేరు..."

"నీకూ నీవారు లేరు, నాకూ నావారు లేరు... ఛల్ మోహనరంగ! అని పాటను సవరించుకోడం లెస్స" అన్నాడు కమలాకరం నవ్వుతూ.

పద్మావతి వరండాలో నిలబడి ఆ వీధివైపు చూసింది. ఇది నాళంవారి వీధిలా లేదు. ఇండ్లు అక్కడొకటీ, యిక్కడొకటీ చెల్లాచెదరుగా వున్నాయి. కానీ ఈ ఎదురింట్లో ఒక సుందరమ్మక్క, ప్రక్క యింట్లో ఒక పార్వతమ్మ పిన్ని, ఆ పెంకుటింట్లో ఒక సుహాసిని వుండరనుకోడానికి వీల్లేదు. ఈ అమ్మలక్కలు మొదట మొదట ఎంతో ఆప్యాయతగా స్నేహానికి రాదీస్తారు. ముక్కు నొచ్చినా ముఖం వాసినా పరామర్శల వర్షం కురిపించి, ఆత్మీయతను ఒలకబోస్తారు. దినాలు గడిచినకొద్దీ వీళ్ళ అసలు బండారం బయట పడుతుంది. బాబూ! వీళ్ళకొక నమస్కారం. ఇందాకా జరిగిన శాస్తి చాలు!

"ఏమిటి పద్మా! చాలా తీవ్రంగా ఆలోచిస్తున్నావు?" అన్నాడు కమలాకరం.

"అబ్బే ఏముంది? వీళ్ళ కందరికీ మనం బోనులో పడనున్న కొత్త జంతువులకు మల్లే కనిపిస్తున్నామేమో! అప్పుడే కిటికీలు తెరచుకుని మనల్ని చూడ్డానికి సిద్ధమయ్యారు. అమ్మో! వీళ్ళ ఆటలు నా దగ్గరేం సాగవు! మీరు లోపలికి వచ్చేయండి" అంటూ పద్మావతి బిరబిరా లోపలికి వెళ్ళిపోయింది.

కమలాకరం తెల్లబోయి "అదేమిటి పద్మా! వీళ్ళపైన కక్ష గట్టినట్లు మాట్లాడేస్తున్నావు?" అన్నాడు.

నా బాధ మీకేం తెలుసునన్నట్లు పద్మావతి భర్త వైపు అదోమాదిరిగా చూసింది.

పోనీలే, నాకెందుకు లెమ్మనుకున్నాడు కమలాకరం.

కానీ పద్మావతి చిత్త ప్రవృత్తిలో వస్తున్న ఈ చిత్రమైన మార్పుయొక్క విశ్వరూపాన్ని గమనించినకొద్దీ కమలాకరం మాటిమాటికీ విస్తుపోవలసి వచ్చింది.

"ఇంతకు మునుపు ఎక్కడుండే వారమ్మాయ్?" అని ఎదురింటావిడ ప్రశ్నిస్తే, పద్మావతి "అదేమిటండీ! అలా అడుగుతున్నారు. మనుషులన్న తర్వాత ఊళ్ళో వుండక అడివిలో వుంటారా" అని సమాధానమిచ్చింది.

"మీవారి ఉద్యోగమేమిటండీ?" అని ఎవరో అడిగితే "ఉదరపోషణకే ఉద్యోగమైతే ఏమిటండీ! ఏదో ఒకటి" అంటూ పుల్లవిరిచినట్లు బదులు చెప్పింది.

"ఏమిటమ్మోవ్! కాస్త తలుపు తెరవగూడదూ? ఎంతసేపూ నాలుగు గోడలమధ్య ఖైదీలా కూర్చుంటావెందుకూ?" అంటూ గడపదాకా వచ్చిన వాళ్ళని "ఒంట్లో ఏమీ బాగుండడం లేదండీ! డాక్టరుగారు విశేషంగా మాట్లాడగూడదన్నారు" అని చల్లగా సాగనంపింది.

"నిష్కారణంగా వీళ్ళతో విరోధం కొని తెచ్చుకుంటున్నామేమో పద్మా!" ఓరోజు కమలాకరం బాధగా అన్నాడు.

"వీళ్ళతో స్నేహంగా వుంటే మనకు ఒరిగేదేమిటి, లేకుంటే తరిగేదేమిటి? మనం ఈ యింటికి కాపురమొచ్చి ఒక నెలరోజులవుతాయి గదా! వీళ్ళకు మనం యింతకు మునుపు ఎక్కడుండే వాళ్ళమో తెలియదు. మీరు చేస్తున్న ఉద్యోగమేమిటో తెలియదు. అసలు నాపేరేమిటో తెలియదంటే నమ్మండి తెలుసుకోవాలన్న కుతూహలం వున్నప్పటికీ నన్ను ప్రశ్నించడానికి వీళ్ళకు గుండెల్లేవు. నేను పెడసరంగా తప్ప మరొక విధంగా బదులు చెప్పనన్న సంగతి వీళ్లకు బాగా తెలిసిపోయింది. నా కిప్పుడెంతో హాయిగా వుంది" అంటూ పద్మావతి విజయగర్వంతో నవ్వింది.

కానీ జీవితం ఎల్లకాలమూ హాయిగానే గడచిపోదు.

ఓరోజు ఉదయం పదిగంటలకే ఆఫీసుకు వెళ్ళిన కమలాకరం పన్నెండుకల్లా యింటికి తిరిగి వచ్చేశాడు.

"ఏమిటండీ! ఏమి జరిగింది?" అంటూ పద్మావతి కంగారు పడిపోయింది.

"మరేం భయపడకు పద్మా! శుభవార్త చెప్పిపోదామని రెక్కలు గట్టుకుని యిలా రివ్వున వచ్చేశాను. మనకు ప్రమోషన్ వచ్చేసింది. ఆఫీసరుగారు స్వయంగా పిలిచి ఆర్డరు చేతికిచ్చారు" అంటూ కాగితాన్ని జేబులోనుంచి పైకి తీసి గాలిలో రెపరెపలాడించాడు కమలాకరం.

"నిజంగా?" కళ్ళు ఆకర్ణాంత విశాలాలైపోతుండగా ఆశ్చర్యంతో ప్రశ్నించింది పద్మావతి.

"నిజం, నిజం, నువ్వు తీరిగ్గా ఆశ్చర్యపడుతూ కూచో, నేను అయిదు అయిదున్నరకల్లా వచ్చేస్తాను" అంటూ కమలాకరం సైకిలుపైన తుర్రున వెళ్ళిపోయాడు.

పద్మావతి నిలువుటద్దం ముందు నిల్చుని తన సౌందర్యానికి తనే మురిసిపోయింది. ఆ తరువాత పెళ్ళయిన కొత్తలో జంటగా తీయించుకున్న ఫోటోను గుండెల కదుముకుని ఏదో మధురగీతిక పాడుకుంది. కుర్చీలో కూర్చుంది. ఈజీచేర్‌లో పడుకుంది. ఉండి వుండీ యిల్లు నలుమూలలా కలియతిరిగింది...

పది పదిహేను నిమిషాలిలా అవస్థపడిన తర్వాత - పట్టరాని ఆనందాన్ని, ఏనుగెక్కినంత సంబరాన్ని యిలా నాలుగు గోడల మధ్య కుదించి వుంచడం ఆమెకు దుస్తరంగా తోచింది - పద్మావతి ధనుర్ముక్తమైన బాణంలా రివ్వున వీధిలోకి వచ్చేసింది.

ఎదురింటావిడ సంచి చేతబట్టుకుని మెట్లు దిగి వీధిలో అడుగుపెడుతోంది.

"ఏమండీ పిన్నిగారూ! బజారుకు వెళ్తున్నారేమిటి?" అంటూ ఆప్యాయంగా పలకరించింది పద్మావతి.

"ఏం బజార్లోలే తల్లీ! మా బ్రతుకే బజారులా వుంది" అంటూ ఎదురింటావిడ ముఖం త్రిప్పుకుని విసవిస నడిచిపోయింది.

చింతనీళ్ళు చిలకరించినట్టుగా పద్మావతి ముఖం ముకుళించుకుపోయింది. కొండంత ఉత్సాహం నేలమట్టానికి అణగారిపోగా ఆమె గిరుక్కున వెనుతిరిగింది. అయ్యో, తను చేసింది చాలా ఘోరమైన పొరబాటు, తన యిష్టాయిష్టాలకు అనుగుణ్యంగా ఒకప్పుడు తనతో ప్రసక్తి కలిగించుకుని, మిగిలినప్పుడు దూరంగా వైదొలిగి వుండడానికి లోకులు తన చేతి కీలుబొమ్మలు గారు. వాళ్లు మైత్రి నెరపుతారు. కలహిస్తారు. అసూయపడతారు. గౌరవిస్తారు. పదిమందిలో తనూ ఒక్కతెగా మెలగదలచుకున్నంతవరకూ స్నేహమో, విరోధమో, అసూయో, గౌరవమో ఎప్పుడేది ఎదురైనా అప్పుడు దాన్ని స్వీకరించడానికి సిద్ధంగా వుండక తప్పదు. అలా కాదనీ తను లోకుల్ని తృణీకరిస్తే, వాళ్లు తన వ్యక్తిత్వాన్ని గుర్తించడానికే నిరాకరిస్తారు.

"అవును ఇప్పుడు నాకు విధింపబడిన శిక్ష యిదే!" అనుకున్నది పద్మావతి.

ప్రమోషను వచ్చిన పది రోజులకే కమలాకరం రేడియో కొన్నాడు. కంతుల మేరకు డబ్బు చెల్లించడానికి ఒప్పందమై మోటార్‌సైకిల్‌గూడా కొనుక్కున్నాడు. ఐతే రేడియోగానీ, మోటారుసైకిలుగానీ సంతృప్తినీ, సంతోషాన్నీ యింటి లోపలికి వెంట బెట్టుకురాలేకపోయాయి - సంతోషమూ, సంతృప్తీ డబ్బిస్తే బజార్లో దొరికే వస్తువులు గావు.

కమలాకరానికి ప్రమోషను వచ్చినమాట నిజమే! కానీ ఆ ప్రమోషను మూలంగా లభ్యం గావలసిన ఆనందం మాత్రం ఆకాశ కుసుమంలా అంతంత దూరంలోనే వుండిపోయింది. దీన్నే మరొక విధంగా చెప్పుకోవచ్చు - వ్రతం నెరవేరింది కానీ ఫలం మాత్రం దక్కలేదు.

***

అద్దె యింటికోసం మళ్లీ నాళంవారి వీధిలోనే అన్వేషణ ప్రారంభించిన కమలాకరం "ఇప్పుడున్న ఇంటికేమండి?" అని ప్రశ్నించిన పరిచితులందరికీ "అబ్బే, అది దయ్యాల కొంపండీ! రాత్రుల్లో గంగాళాలు దొర్లుతాయి. డాబాపైన రాళ్ళు పడతాయి. పెట్టిన వస్తువు పెట్టినచోట వుండదు" అంటూ దీనంగా ప్రత్యుత్తరమిచ్చాడు.

❖ ఆంధ్రపత్రిక - జూన్, 1958 ❖

# అక్కయ్య అంతరంగం

"తక్షణం బయల్దేరి రావలెను. వివరాలు నేరులో."– వచ్చింది జాబే. తంతిగాదు. కానీ వచ్చిన జాబు తంతిలా వచ్చిన మాటమాత్రం వాస్తవం. నిజానికి అక్కయ్య ధోరణే అంత! తీరా ఉద్యోగానికి సెలవు పెట్టి, ఇంటిదగ్గర భద్రంగా వుండవలసిందని హెచ్చరికలు పలికి ఏ బస్సులోనో, రైల్లోనో వెళ్ళి జాబుకు జవాబు పలికితే ఆమె నింపాదిగా "వన భోజనానికి వెళ్తున్నాము. నువ్వుకూడా వుంటే సరదాగా వుంటుందనుకున్నాను" అని చెప్పినా చెప్పగలదు.

అవును మరి! గెజిటడ్ ఆఫీసరుగారి అర్ధాంగికి జీవితం వనవిహారంలా సుఖకరంగా తోచడంలో అబ్బురమేమీ లేదు. కానీ ఈ లోకంలో మిట్టపల్లాల దొంకదారుల్లాంటి బ్రతుకుబాటలు సైతం లేకపోలేదన్న విషయాన్ని ఆమె ఎందుకు గుర్తించదో నా కవగతం కాదు, బడిపంతులిగా నాకు యిబ్బందులుండకపోవు. కాజువల్ లీవు పూర్తి కావచ్చి వుండొచ్చు. ఇన్స్పెక్షన్ దరిదాపుల్లో వుండొచ్చు. పరీక్ష పేపర్లు దిద్దవలసి రావచ్చు. వీటి సంగతలా వుండగా యింట్లో శ్రీమతికో, బిడ్డలకో ఆరోగ్యం తిన్నగా లేకపోవచ్చు. కానీ అక్కయ్య అభిప్రాయం ప్రకారం యివన్నీ కుంటిసాకులు, ఆమె ముందర నా సంజాయిషీ మహాబధిర శంఖారావం!

అక్కయ్యతో వచ్చిన చిక్కల్లా యిదే! ఆమె లోకాన్ని రెండు వైపులనుంచీ చూడదు. ఒకవైపునుంచే చూస్తుంది. చూచినప్పుడు తనకు కనిపించిన దృశ్యమే సత్యమని భావిస్తుంది.

ఇక బావగారి సంగతి సరేసరి! గంజాయి మత్తులో బావాజీ ఒకటిగాదు, ఆయనొకటిగాదు. గుడ్డిలో మెల్లగా యించుమించు స్తబ్ధంగా పరిణమించిన ఆయన బుర్రలో వుద్యోగానికి సంబంధించిన విషయాలు మాత్రం లీలగా కదిలిపోతుంటాయి. ఆయన పదునువానకు పదరడు. పదిరితే, అయిదు నిమిషాలపాటు మన మనిషి కాడు. మెరుపులు, వురుములు, పిడుగులూ, జడివాన, ఝంఝామారుతమూ, వెరసి టీ కప్పులో తుపాను! ఐదు నిముషాల తర్వాత మళ్ళీ మామూలే – నిశ్చల నిర్వికార నిరంజన స్వరూపం!

ఆ కుటుంబంలోని వ్యక్తులు ముగ్గురు. అక్కయ్యా, బావగారూ పోనూ మూడో వాడు గోపీ. వాడు కుల ముద్ధరించటానికి తనొక్కడే చాలుననీ, తన వెనుక తమ్ముళ్ళూ చెల్లెళ్ళూ అనవసరమని దేవుడి దగ్గర వరం కోరి వచ్చాడు. బాగా సంపాదించి పెట్టే తండ్రీ, ఆ సంపాదనను తనకోసమే పొదుపు చేసిపెట్టే తల్లీ, పుస్తకాలు చదివి పరీక్షలో కృతార్థుడు కావడానికి కావలసిన తెలివితేటలు – యివన్నీ ఆ వరానికి అనుబంధంగా వాడడిగి తెచ్చుకున్న చిన్న వరాలు! ఏ విధంగా చూసినా గోపీది కారులో షికారులాంటి జీవితం. కానైతే తారురోడ్డుపైన కారులో షికారు బయల్దేరిన వాడికి రోడ్డుకిరువైపులా వున్న దృశ్యాలు తప్పితే మిగిలిన ప్రపంచం కనిపించదు. గోపీలో ఈ లోపం కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది. వాడు అయిదునుంచీ పదిహేనేళ్ళదాకా కాన్వెంటులో చదువుకున్నాడు.

ఆపైన హాస్టల్లో వుండి కాలేజీలో చదువుకుంటున్నాడు. అయిదడుగులా ఎనిమిదంగుళాల బక్కపలచటి మనిషి. బాగా భోజనం చేసినప్పుడుగూడా నూరు పౌన్లకు మించడు. కానీ ఈ వయసుకే వాడు చదువుకున్న వాటినన్నింటనీ ఒకచోట రాశిపోస్తే ఓ వాగను పుస్తకాలు వుంటాయి. విపరీతంగా పుస్తకాలు చదవగూడదన్నది గాదు నా అభిప్రాయం. లోకజ్ఞానం లేని గోపీని కేవలం పుస్తక పరిజ్ఞానం ఎక్కడికి తీసుకెళ్ళి వదిలి పెడుతుందన్నదే నా అనుమానం!

"సాయంకాలం వూరికి వెళ్తున్నాను జానకీ! రెండు మూడు రోజుల్లో తిరిగొచ్చేస్తాను..." అంటూ మెల్లగా ఉపక్రమించాను.

"వెళ్ళండి, వెళ్ళండి, మీ అక్కయ్య జాబు వ్రాయడమూనూ, మీరు వెళ్ళక పోవడమూనా!" అంది జానకి.

"పోనీ, నువ్వూ వస్తావా జానకీ! అందరమూ కలిసి వెళ్ళొచ్చేద్దాం" అన్నాను.

"ఎందుకూ! నన్ను రమ్మని వ్రాయలేదుగా!"

"వ్రాయకపోతే వెళ్ళగూడదన్న షరతేముంది జానకీ!"

"అప్పటికి వ్రాయకపోయినా వెళ్ళొచ్చునన్న షరతొకటి వున్నట్టు! ఏమండోయ్, ఉన్నంతలో మా బెట్టు మాకూ వుంటుందని మీ అక్కయ్యగారితో మనవి చెయ్యండి. రమ్మనకపోతే వెళ్ళము. పొమ్మనేదాకా వుండము. మర్యాదిస్తే పుచ్చుకుంటాం. లేకపోతే మీకూ మాకూ పొత్తుకుదరదంటాం."

"టాంటాం. అమ్మ యిలా గంటోందని నువ్వు అత్తయ్యదగ్గర టాంటాం చేసేయాలి నాన్నా..." అంది శారద.

"వేయనీ, వేస్తే మనకేమైనా భయమా శారదా!"

"ఎందుకోగానీ, అత్తయ్యపైన నీకు కసిగా వున్నట్టుందే అమ్మా..." ఆలోచిస్తు అంది శారద.

"అవునే శారదా! ఎలుక తనవైపుకే త్రవ్వుకోవడమంటే ఏమిటి? ఇదే!"

"నిజమే జానకీ! నిజమాడితే నిష్ఠూరమంటే ఏమిటి? ఇదే!"

రాబోతున్న నవ్వును బలవంతంగా ఆపుకుంటూ ముఖం మరోవైపుకు త్రిప్పుకున్నాను. శారద తలవంచుకుని హోంవర్కు చేసుకోసాగింది. జానకి మాత్రం ముఖం చిన్న బుచ్చుకుని చరచరా గదిలోపలికి వెళ్ళిపోయింది.

***

రాత్రి తొమ్మిది గంటలకు రైలు దిగేసరికి మందహాసాలంకృతమైన ముఖార విందంతో ప్లాటుఫారంపైన్నే ప్రత్యక్షమయ్యాడు గోపీ.

"బాగున్నావట్రా గోపీ!" అంటూ పరామర్శించాను.

"ఇంతకంటే బాగా వుండాలనే నా ప్రయత్నం మామయ్యా? కాఫీ మానేశాను, ఓవల్టిన్ను పుచ్చుకుంటున్నాను. భోజనానంతరం పళ్ళు తినడం తప్పనిసరి! కానీ ఎంత చేసినా యిలాగే వున్నాను. బరువులో తేడా లేదు. పొడుగుమాత్రం ఒకటి రెండంగుళాలు పెరిగాను..." అన్నాడు గోపీ.

"నీ ఆరోగ్యానికి నీ చదువే ప్రతిబంధకంరా గోపీ! నన్నడిగితే నువ్వు రెండేళ్ళపాటు చదువు మానేయడం మంచిది" అన్నాను.

"మెల్లగా చెబుతున్నావా మామయ్యా ఆ మాట! నేను బుద్ధి తెలిసినప్పటినుంచీ చదువుతూనే వున్నాను. ఇంకా ఎన్నాళ్ళు చదవాలో తెలియడం లేదు. ఆ మాటకొస్తే పుస్తకం చేతిలో లేకుండా అయిదునిమిషాలు వూరికే కూర్చోడం నాచేతగాదు..." అన్నాడు గోపీ బుక్‌స్టాల్లో కొనుక్కున్న కొత్త పుస్తకాన్ని పాంటు జేబులో దాచేయడానికి ప్రయత్నిస్తూ.

"నువ్వు 'పొత్తమునగాక ప్రకృతిలో పుటలువిప్పి' 'చదవడం నేర్చుకోవాలిరా గోపీ! అందాకా ఈ పుస్తకాల బెడద నిన్ను వదలిపెట్టదు" అన్నాను.

గోపీ రిక్షాను పిలిచాడు. ఎక్కి కూర్చోగానే రిక్షా కదిలింది. కదిలిన రిక్షాతోపాటు గోపీ వాగ్ఝరి గూడా ముందుకురికింది. ఓ కాలేజి లెక్చరరు కోటు జేబులో పోసుకొచ్చి బఠాణీలు తినే వైనమూ, ఒకానొక ప్రొఫెసరు నల్లబల్లదగ్గర నిలబడి వ్రాయడానికి చాక్‌పీసుకు బదులుగా సిగరెట్టు పైకి తీసుకున్న విచిత్రోదంతమూ, లేబరేటరీలో సంఘటించిన ప్రేలుడుకు అదిరిపడి ఓ అమ్మాయి అబ్బాయిని కౌగిలించుకొన్న ప్రణయ సన్నివేశము - యిత్యాది వృత్తాంతాలను గురించి చెప్పుకపోతున్నాడు గోపీ.

ఇల్లు చేరువకు వస్తోంది.

"నిల్చున్న పాళంగా నన్నిలా రమ్మని జాబు వ్రాయడంలో మీ అమ్మగారి ఆంతర్యమేమిటో నీకు తెలియదా గోపీ?" అన్నాను.

"అబ్బే, నాకేం తెలుసు మామయ్యా! సస్పెన్సు మెయిన్‌టెయిన్ చేయడంలో అమ్మకు అమ్మే సాటి..." అన్నాడు గోపీ.

రిక్షా యింటి ముంగిట తోటలో ఆగింది. అక్కా, బావా దేవియుం దేవరలులాగా గృహ ప్రాంగణంలోనే ఎదురయ్యారు.

"కులాసాయేనా చలపతీ!" బావగారు పలకరింపుతో కలిపి చిరునవ్వు చిలకరించారు.

వేడినీళ్ళ స్నానమూ, వేడి వేడిగా భోజనమూ ముగిసిన తర్వాత అక్కయ్య నన్ను వరండాలోకి తీసుకెళ్ళింది. కాసేపు పిచ్చాపాటీ మాట్లాడుకున్న తర్వాత "నువ్వు వేణుమాధవరావుగారిని ఎరుగుదువా" అంటూ హఠాత్తుగా అసలు విషయంలోకి వచ్చేసింది.

"ఇంజనీరు వేణుమాధవరావుగారినేనా అక్కయ్యా! తెలియకేం! ఆయనకూ మనకూ ఏదో దూరపు బంధుత్వంగూడా వుండాలికదూ..." అన్నాను.

"దూరపు బంధుత్వమేమిటి? రాకపోకలు మానేశాం గనుక దగ్గర బంధువులు గూడా దూరపు వాళ్ళుగా కనిపిస్తున్నారు. ఆయన, స్వయానా మీ బావగారి పెదతండ్రికి అల్లుడు, ఇటుమన తాతగారూ, మాధవరావుగారి నాన్నగారూ పెత్తల్లీ, పినతల్లి బిడ్డలు. ఇప్పుడు చెప్పొచ్చిందేమిటంటే ఆ వేణుమాధవరావుగారి రెండో కూతురికి ఎల్లుండి తెల్లవారు జామున పెళ్ళి. నువ్వు వెళ్ళి రావాలి..."

"ఇది మరీ బాగుందక్కయ్యా! కనీసం ఆ పెళ్ళి సంగతైనా నాకు తెలియదు. ఆ పిలువని పేరంటానికి వెళ్ళడానికేనా నాకీ తంతిలాంటి పిలుపు..." అంటూ తెల్లబోయాను.

"నువ్వు నీ పనికోసం వెళ్తున్నావు. ఆ పెళ్ళికోసం కాదు..."

"అంటే?"

ఆ వేణుమాధవరావుగారికి యింకా ఒక పెళ్ళికావలసిన కుమార్తె వుంది..."

"ఉండొచ్చు. ఉంటుందికూడా..."

"మధ్యలో అడ్డు తగలొద్దు చలపతీ! తీరా చెప్పేదంతా విను, సదరు వేణుమాధవ రావుగారి తమ్ముడు భుజంగరావుగారింట్లో గిరిజ, వనజ అని యిద్దరు పెళ్ళి కావలసిన అమ్మాయిలున్నారు..."

"హరేరాం! ఇవేనా అక్కయ్యా నువ్వు నేరులో చెప్పదలచుకున్న వివరాలు?"

"ఇంకా వున్నాయి! ఆ భుజంగరావుగారి తోడల్లుడొకాయన వున్నాడు, ఆదిశేషయ్య గారని! ఆ ఆదిశేషయ్యగారికిగూడా పెళ్ళికి సిద్ధంగా వున్న కూతుళ్ళొకరిద్దరున్నారు. కానీ వాళ్ళందరూ ఆ విధంగా వారి వారి తల్లిదండ్రులకు కూతుళ్ళై వుండడంకాదు విశేషం. అందరూ ఈ పెళ్ళికొక చోట చేరబోతున్నారు చూచావూ, అదే విశేషం!"

"ఈ విశేషాన్ని మరికొంచెం విశ్లేషించి చెప్పలేవా అక్కయ్యా!"

"వెళ్తున్న వాడివి నువ్వక్కడ కాస్త మెలకువగా వుండి ఆ అయిదారుగురు అమ్మాయిల్లోనూ మన గోపీకి నచ్చే పిల్ల ఎవరో కనిపెట్టాలి..."

"కానీ గోపీ ఎక్కడుంటాడక్కయ్యా?"

"ఎక్కడుంటాడు! వాడూ నీతోబాటే పెళ్ళికొస్తున్నాడు..."

"ఐతే ఇదంతా పెళ్ళిచూపుల తతంగమన్నమాట!"

"ఒక విధంగా పెళ్ళి చూపులేననుకో! కానీ ఇందులో సౌకర్యాలు చాలా వున్నాయి. ఒక్కొక్క వూరికివెళ్ళి ఒక్కొక్క అమ్మాయినే చూడ్డానికి మొదలెడితే ఈ మూడు నాలుగూళ్లూ తిరిగి రావడానికి ఎంతలేదన్నా పదిరోజుల విరామం కావలసొస్తుంది. తీరా వెళ్ళి చూచిన తర్వాత ఆ చూచిన అమ్మాయి నచ్చలేదని చెప్పవలసి వస్తే ఎదుటివాళ్ళకు ఆశాభంగం కలుగుతుంది. ఎందుకొచ్చిన బెడద! మొదట పిల్ల మనకు నచ్చితే ఆ తరువాత ఆ పెళ్ళిచూపుల ఆనవాయితీ గూడా జరిగిందంటే జరిగిందనుకుని, పెళ్ళికి ముహూర్తం పెట్టుకోవచ్చు..."

"ఐతే గోపీ పెళ్ళి సమీప భవిష్యత్తులోనే వుందంటావా అక్కయ్యా?"

"అవున్రా తమ్ముడూ! అవును. పిల్లలు నోరు తెరచి అడగరు. కానీ వాళ్ళపట్ల మన బాధ్యతల్ని సక్రమంగా, సకాలంలో నిర్వర్తించవలసిన కర్తవ్యం మనపైన వుంది..." అంది గంభీరంగా అక్కయ్య.

తాంబూలం నములుతూ మేడపైకి వెళ్లాను. గోపీ వాలుకుర్చీలో పడుకుని ఒకటి రెండు గంటలకు మునుపు తను స్టేషనులో కొనుక్కున్న "మోహం" నవలలో అయిదో ప్రకరణం చదువుతున్నాడు.

"నీకు మీ అమ్మ పెళ్ళి చేయబోతోందిరా గోపీ" అన్నాను, వాడిని హఠాత్తుగా వుక్కిరి బిక్కిరి చేయాలనుకుంటూ!

"అలాగా మామయ్యా! ఇలాటిదేదో జరగొచ్చునని నేనూ అనుమానిస్తూనే వున్నాను..." అన్నాడు ముభావంగా గోపీ.

"ఐతే నీ పెళ్ళిని గురించి నీ యిష్టాయిష్టాల ప్రసక్తి ఏమీ లేదన్నమాట!"

"ఇష్టం లేకపోయినా తప్పించుకోడానికి వీల్లేని బంధాల్లో పెళ్ళి ఒకటి కద మామయ్యా నీకు తెలియందేముంది?" అంటూ గోపీ నా ముంగాళ్లకే బంధం వేసేశాడు!

***

పెళ్ళి అన్న పేరుతో కొట్టి కోలాహలం చేసేస్తున్నారు వేణుమాధవరావుగారు. వీధి పొడుగునా పందిరి వేయించారు. గుంజ గుంజకూ మెర్క్యురీ దీపం పెట్టించారు. పువ్వులతో పల్లకీ జోడించారు. దక్షిణాదినుంచీ బ్యాండుమేళం రప్పించారు.

"ఇదేమిటి మామయ్యా! ఇక్కడ మాయాబజారుకోసం సెట్టువేశారేమిటి?" అంటూ విస్తుపోయాడు గోపీ.

పచ్చని కొబ్బరి మట్టల సువాసన నాఘ్రాణిస్తూ పందిరి క్రిందనుంచీ, పెళ్లి విడిదిలోకి వెళ్ళేసరికి చేమంతి పువ్వుల పరిమళం ఎదురై వచ్చి బరాబరులు పలికింది. కన్నెపడుచులు కొందరు జడలల్లుకుంటున్నారు. ముత్తయిదువులు కొందరు కంబాల చాటున నిల్చుని తమ తమ మగవాళ్ళకోసం నిరీక్షిస్తున్నారు. తల్లుల కొంగుల్ని పట్టి లాగుతూ పసిపిల్లలు కొందరు తమకేదో కావాలని గోలపెడుతున్నారు.

"మనం డాబాపైకి వెళ్దామా మామయ్యా!" అన్నాడు గోపీ.

డాబాపైనగూడా అలజడి తక్కువగా లేదు. కానైతే సందడిలో అక్కడికి యిక్కడికీ వైవిధ్యం మాత్రం కనిపించింది. ఓ వైపున పేకాట రసవత్తరంగా సాగిపోతోంది. మరో వైపున సిసింద్రీల్లాంటి కుర్రాళ్లు కొందరు బొగ్గుతో పట్టెగీసి 'చెడుగుడు' మొదలెట్టేశారు. ఇంకోవైపున భారీ ఎత్తున రాజకీయాలపైన చర్చలు కొనసాగుతున్నాయి. ఇంత గలభా చాలదన్నట్లు నల్లగా, కుదిమట్టంగా వున్న ఓ నడివ్రాయపు పెద్దమనిషి ఏకాంత ప్రదేశంలో ప్రకృతి సౌందర్యాన్ని చూచి పులకించిపోయి అప్రయత్నంగా గొంతు విప్పి పాడుకుంటున్న గాయకుడిలా పిట్టగోడకు చేరగిలపడి తారాస్థాయిలో రాగాలాపన సాగించేస్తున్నాడు.

"చూచావా మామయ్యా! ఇంతమందిలోనూ మనకు సొసైటీ అంటూ ఒకటి లేకపోయింది" అన్నాడు గోపీ.

'మనకు' అని నన్నుగూడా కలుపుకోకు గోపీ. నువ్వు కుర్చీలోనైతేగానీ కూర్చోలేవు. తెలిసినవాడొకడు వచ్చి తెలియనివాడిని పరిచయం చేసిపెట్టేదాకా, అతడితో మాటలు కలుపుకోలేవు. పోనీ, మాట్లాడకుండా ఒకచోట పడుకోగలవంటేనా, అందుకైనా నీకు ప్రత్యేకంగా ఓ గది కావాలి. పైగా ఒక పడక కావాలి. నీకు నీ హాస్టలుగదిలోనూ, స్వంత యింటిలోనూవున్న సదుపాయాలన్నీ ఈ పెళ్ళి విడిదిలో ఎలా సమకూరగలవు చెప్పు..." అంటూ మా వాడిని సముదాయించడానికి పూనుకున్నాను.

"ఐతే నేను సొసైటీకి అనర్హుడినంటావా మామయ్యా?" దిగులు పడిపోతూ అడిగాడు గోపీ.

చెప్పగూడదుగానీ పిల్లిని చంకనపెట్టుకుని పెళ్ళికి వెళ్ళినట్టయింది నా పని! పెళ్ళిళ్ళలో వేళకు సరిగ్గా భోజనాలు వడ్డించడం అరుదు. ఎనిమిదిన్నరకు పైగా తొమ్మిదిన్నరకులోగా గోపీ చేతిగడియారాన్ని వందసార్లయినా చూచివుంటాడు. ఆ తరవాతనైతే వాడు ఆకలో ఆకలి అంటూ నోరే విడిచేశాడు. ఎలాగైతేనేం, పదికొట్టగానే

భోజనాలకు పిలిచారు. అందాకా అన్నమో రామచంద్రా అంటూ బిట్టువాపోయిన గోపీ ఒక మైసూరు పాకులో సగం మాత్రం తిని, నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని రెండు లోటాల మంచినీళ్ళు త్రాగి అంతటితో ఆకు మడతపెట్టి బంతిలో ఆదరాబాదరాగా ఖాద్య పదార్థాలను మటుమాయం చేస్తున్న వాళ్లకేసి ఆశ్చర్యంగా చూడసాగాడు. భోజనం ముగిసింది గనుక కాసేపు నిశ్చింతగా వుండవచ్చుననుకున్నానుగానీ, ఆ ఆశగూడా అడియాసే అయింది. చేయి కడుక్కోగానే తనకొక ఖాళీజాగా చూపించమన్నాడు గోపీ, పడకలేకపోయినా పరవాలేదులెమ్మన్నాడు. ఓ ముసలాయనను బ్రతిమాలుకుని, కూర్చున్నచోటునుంచీ ఆయనను లేపి ఓ చిన్న అరుగు ఖాళీ చేయించాను. నిద్రచోటెరుగదు కావాలి! పడుకున్న అయిదు నిమిషాలకే గోపి నిద్రాపరవశుడై పోయాడు.

ఆ అమూల్యావకాశాన్ని వృధా పోనివ్వకుండా నేను పెళ్లివారిలో కలిసిపోయాను. పీటలపైన వధూవరులకు నలుగులు జరుగుతుండగా, కాబోయే పెళ్ళికూతుళ్ళెవరో ఆరాతీశాను. వాళ్ళ వాళ్ళ విద్యా యోగ్యత లెలాటివో వాకబు చేశాను. మొదట తల్లితండ్రుల గుణగణాలెలాంటివో కూపీతీసి, పందిరి క్రింద తిరుగుతున్న అమ్మాయిల హావభావాలను బట్టి వాళ్ళ గుణగణాలను ఎంతవరకూ పుణికిపుచ్చుకున్నారో వూహించడానికి ప్రయత్నించాను. గంట రెండు కావస్తోంది. వధూవరులు స్నానాలకు లేచారు. బంధువులందరూ ఒక నిద్రపోయి లేవడానికి వీలుగా ఎక్కడివాళ్ళక్కడే మేను వాల్చేశారు.

తెల్లవారుజామున మేళం మ్రోగగానే గోపీలేచి కూర్చున్నాడు. పెరట్లోకి తీసుకెళ్ళి ముఖం కడిగించి, వంట బ్రాహ్మణ్ణి మాలీసు చేసి ఒక కప్పు కాఫీ పుట్టించి మా వాడిని మళ్ళీ మామూలు మనిషిగా చేయగలిగాను. పందిరిలోకి వచ్చేసరికి పురోహితుడు మంత్రాలు చదువుతున్నాడు.

"కాస్త దగ్గరగా కూర్చుని పెళ్ళంతా సాంగోపాంగంగా చూడాలి మామయ్యా" అంటూ తన వుబలాటాన్ని వెలిబుచ్చాడు గోపీ.

"దానికేం గోపీ! అందరికంటే ముందుగా పెళ్ళిపీటపైన్నే కూర్చోవచ్చు. కానీ అందుకు మొట్టమొదట గంతకుతగిన బొంతను ఎన్నుకోవాలి. అదిగో, పెళ్ళికూతురికి కుడివైపున పావడాపైన ఓణీ వేసుకుని నిల్చుంది చూడు, ఆమెగారే సంధ్య, వేణు మాధవరావుగారి మూడోకూతురు..." అన్నాను.

"అలాగా మామయ్యా! ఆవిడేనా సంధ్య? వేణుమాధవరావుగారి మూడో కూతురు!" చేజారిపోయిన పెన్నిధి హఠాత్తుగా చేతికి దొరికినంత సంభ్రమాన్ని ప్రకటించాడు గోపీ!

"అదేమిటి గోపీ! నువ్వీ సంధ్య అన్న అమ్మాయిని గురించి యింతకుమునుపే విన్నావేమిటి?"

"అబ్బే, అదికాదు మామయ్యా! నువ్వీ అమ్మాయిని గురించి యింతగొప్పగా చెబుతుంటే నేనామాత్రం వుత్సాహమైనా కనబరచకపోతే ఏం బాగుంటుంది?" అన్నాడు నెమ్మదిగా గోపీ.

నాకో సందేహం కలిగింది. వీడుగానీ నన్ను ఏడిపించాలనుకోవడంలేదుగదా! దీన్నేమనుకోవాలి? అభినయమా, లేక అమాయకత్వమా?

వాడి ధోరణి సంగతలావుంచి నాపాటుకు నేను చెప్పుకపోసాగాను. "అమ్మాయి స్కూలు ఫైనలు పాసై పియుసి చదువుతోంది. చక్కగా పాడుతుంది. నిక్కచ్చిగా మాట్లాడేస్తుంది. ఇంకో ముఖ్య విషయం రా గోపీ! విశ్వసనీయ వర్గాలద్వారా తెలిసింది. ఈ అమ్మాయిల రన్నింగ్ రేసులో వాళ్ళ కాలేజికంతా ఫస్టుగా వచ్చి ఓ వెండి కప్పు సంపాదించిందట!"

ఉన్నట్టుండి ఆలోచనలో పడిపోయినట్టు కనిపించాడు గోపి. ఒకటి రెండుసార్లు కదిపిన తర్వాత భావ పారవశ్యంలోనుంచీ తేరుకున్నట్టు "మరేంలేదు మామయ్యా! ఓ వర్ణన జ్ఞప్తికి వచ్చింది. చీకటిలాంటి కృష్ణుడు సంధ్యా సుందరిలాంటి రాధను వెన్నంటి తిరుగుతుంటాడట! ఎంత వేగంగా పరుగెత్తినా రాధ చివరకు కృష్ణుడికి దొరికిపోక తప్పదట! ఆ తరువాతేముంది? వెన్నెల్లాంటి వాళ్ళ ప్రణయం లోకమంతటా వ్యాపిస్తుందట! మరి యిక్కడేమో, ఈ సంధ్యకూడా కాలికొద్దీ పరుగెత్తగలదని చెబుతున్నావు. ఈమెను కట్టుకున్న మానవుడు ఆ వేగాన్ని అందుకోలేకపోతే ఏం కావాలి?"

గడ్డు ప్రశ్నేమరి! ఎలాగైనా మావాడి తెలివితేటలు గొప్పవి. అవి సందేహాలను సృష్టిస్తాయి. సమస్యలను పరిష్కరించవు!

"పోనీ, యింకొక అమ్మాయిని చూపించలేవా మామయ్యా!" అన్నాడు గోపీ దాదాపుగా నన్ను బుజ్జగిస్తున్న వాలకంతో.

"ఎందుకు చూపించలేను! అదిగో, ఆ ముసలావిడకు దగ్గరగా కూర్చుంది చూడు, తెల్లటి చీర, నిడుపాటి జడ, దీపంలాంటి బొట్టు – ఆ అమ్మాయి పేరు గిరిజ. భుజంగరావు గారి పెద్ద కూతురు...?

"మోకాళ్ళకు ముఖం ఆనించుకుని చెంపకు చేరడేసిగావున్న కళ్ళతో వధూవరులను చూస్తున్న అమ్మాయేనా మామయ్యా?"

"ఆమెలోగూడా ఏదైనా వంక కనిపెట్టాలనుకుంటున్నా వేమిట్రా గోపీ!" అంటూ అనుమానంగా వాడివైపు చూచాను.

"వంక కోసంగాదు మామయ్యా! భుజంగరావుగారి అమ్మాయని చెప్పావు కాబట్టి సరిపోయిందిగానీ, లేకుంటే నేనామెను చలువరాతితో చెక్కిన శిల్పమనుకునేవాణ్ణి! ముఖ్యంగా ఆ కళ్ళు మామయ్యా! 'కాటుక కళ్ళలోన ఆలోచనలేమిటే హరిణలోచని' అన్న భావానికి రూపకల్పనగా లేదూ?"

"ఉందో లేదో చెప్పలేనుగానీ, నేను చెప్పగలిగిన విషయమొకటేరా గోపీ! భుజంగరావుగారికి ముగ్గురు కూతుళ్ళు. కొడుకులు లేరు. లక్ష రూపాయల ఆస్తి లక్షణంగా వున్న అమ్మాయి. ఆ తరువాత నీ యిష్టం..."

గోపీ కాసేపు మౌనంగావుండిపోయాడు. కానీ ఆ మౌనాన్ని అర్ధాంగీకార మనుకోడానికిగూడా వీల్లేకపోయింది. ఎందుకంటే వాడి చూపులిప్పుడు చలువరాతి శిల్పంలాంటి అమ్మాయిపైన లేవు. అవిప్పుడు జరీ అంచు వచ్చిన నీలి రంగు చీరకట్టుకుని నడుముకు బంగారు వడ్డాణం బిగించి, జడపొడవునా పువ్వులు పెట్టుకుని విలాసంగా గుంజను ఆనుకుని నిల్చున్న ఓ అమ్మాయి చుట్టూ తారట్లాడుతున్నాయి.

# వైరాగ్యంతో సరాగం

ఆషాఢమాసంలో ప్రథమ దివసంలాంటి రోజు. నీలాంబరాన కాలాంబుదా లలముకుంటున్నాయి. ఉదయం పదిగంటలు కావస్తున్నా వాన వాసనతో మిళితమై హేమంత కాలపు శీతలపవనం కిటికీలగుండా లోపలికి వీస్తోంది. నేను గదిలో ప్రవేశించేసరికి మాధవయ్య మామ కిటికీ దగ్గరగా నిల్చుని మదపుటేనుగుల్లా కదులుతున్న మబ్బులకేసి చూస్తున్నాడు.

"మబ్బుల్లో యేముంది గానీ యిలా వచ్చి కుర్చీలో కూర్చో మామయ్యా! పెద్దవాళ్ళ దగ్గరికి వస్తూ రిక్తహస్తాలతో రాకూడదని నీకోసం ఓ కానుక కొని తీసుకొచ్చాను" అన్నాను.

గది మధ్యకు వచ్చి వాలుకుర్చీలో చేరగిలబడుతూ "ఏం తీసుకొచ్చావురా అబ్బీ!" అన్నాడు మాధవయ్య మామ.

"ఏం తెచ్చానో చెప్పుకో చూద్దాం" అన్నాను.

మాధవయ్య మామ వరుసగా నాలుగైదు వస్తువుల పేర్లు చెప్పాడు. గురిపెట్టి కొట్టలేని వేటగాడి బాణంలా ఆయన ఊహ ప్రతిసారీ తప్పిపోయింది. "నువ్వు చెప్పుకోలేవులే మామయ్యా!" అంటూ జేబులోనుంచీ పొగచుట్టలు పైకి తీశాను.

"పొగచుట్టలా!" అన్నాడు మాధవయ్య మామ. అంటూ ఆయన ఉలికిపడ్డాడు. "నేను పొగచుట్ట కాల్చాలనుకుంటున్నానని నీకెలా తెలిసింది రామం?" విస్మయంతో ప్రశ్నించాడు.

"ఓయబ్బో. ఆ మాత్రం తెలుసుకోడానికిగూడా గొప్ప తెలివితేటలు కావాలా మామయ్యా! నువ్వు అడపాదడపా బీడీలు కాలుస్తావని నాకు తెలుసు. ఉత్తరధ్రువం వలస వచ్చేసినట్టున్న ఈ వాతావరణంలో నాసిరకం బీడీలేం బాగుంటాయని చుట్టలు కొనుక్కొచ్చాను" అన్నాను.

వెంటనే ఓ చుట్ట ముట్టించి పొగకోసం ముఖం వాచిపోయినవాడిలా నాలుగు గుక్కలు పీల్చి ఒక్కసారిగా పొగనంతా బయటికి వదిలేశాడు మాధవయ్యమామ. నిండుగా, బొద్దుగా, నల్లగా నుదుట పట్టెనామాలతో వెంకటాచలపతిని తలపించే విగ్రహం మాధవయ్య మామది. ధూమమాలికలు ఎక్కడి వక్కడే తెగిపోయి ఒక్కొక్కటీ ఒక నర్తకిలా ఆయన చుట్టూ గాలిలో ఒయ్యారాలు పోతున్నాయి. వినోదకరమైన దృశ్యం! చూస్తూ కూర్చున్నాను.

"చుట్ట కాలుస్తుంటే నాకో కథ జ్ఞాపకం వస్తోందిరా రామం!" నిద్రలోనుంచి మేలుకున్నట్టుగా అన్నాడు మాధవయ్య మామ.

"చెప్పు మామయ్యా!" అంటూ కుర్చీ దగ్గరికి జరుపుకున్నాను.

పొగచుట్ట ఓ అంగుళం మేరకు కాలి కొడిగట్టిపోయింది. నుసిని క్రింద రాల్చేస్తూ ప్రారంభించాడు మాధవయ్య మామ.

"ముప్ఫయియేళ్ళ క్రిందటిమాట. ఓరోజు అర్ధరాత్రివేళ. కటిక చీకటి. పైగుడ్డ విదిలించి భుజాన వేసుకుని వూరు వదిలి వెళ్ళిపోయాను. బ్రతుకంటే భయమైపోయింది నాకు. సంసార బాధలకంటే నరకయాతనలు గూడా నయమనిపించాయి. పెళ్ళాం,

బిడ్డలు శత్రువుల్లా కనిపించారు. ఉన్నవూరు వల్లకాడులా గోచరించింది. ఆ రోజంతా మా యింట పొయ్యిలో పడుకున్న పిల్లి పైకి లేచిందిగాదు. షావుకారు చెంచయ్య నడివీధిలో నిలవేసి నాలుగు రోజుల్లో అప్పు చెల్లించకపోతే కోర్టుకు వెళ్తానన్నాడు. పొలం దగ్గరికి వెళ్తే బావిలో నీళ్ళులేక వేసిన పైరు మాడిపోతోంది. ప్రొద్దుండగా వూళ్ళోకి తిరిగిరావడానికి మనస్కరించక బాగా చీకటిపడిన తర్వాత తిరిగి వచ్చాను. అంగవస్త్రం పరచుకుని అరుగుపైన పడుకున్నాను. మానవుడికి కష్టమో, సుఖమో కాలం గడవకుండా ఉండదు. తెల్లవారుతుంది. తెల్లవారిన తర్వాత ఏం చేయాలి? పొలానికి వెళ్ళి చేయగలిగిందేమీ లేదు. ఊళ్ళో అప్పుపుట్టదు. కట్టుకున్న పెళ్ళాం ఎదుట నేరం చేసినవాడికిమల్లే నిల్చోవాలి. తలవంపులు, నగుబాట్లు, ఈతిబాధలన్నీ ఒక్కుమ్మడిగా పెడబొబ్బలు పెడుతూ నన్ను తరుముతున్నాయి. మన వూరికీ, స్టేషనుకూ పదిమైళ్ళు. రెండు గంటల్లో అంతదూరం ఎలా వెళ్ళానో నాకు తెలియదు. వెళ్ళిన కొంతసేపటికల్లా రైలు వచ్చింది. ఓ పెట్టెలో ఎక్కి కూర్చున్నాను. మరునాటి పగలంతా ఆ ప్రయాణం కొనసాగింది. సాయంత్రానికి టిక్కెట్టు లేదని చెప్పి నన్నొక స్టేషనులో దింపేశారు. కడుపునిండుగా కొళాయిలో నీళ్ళు త్రాగాను. చల్లటి నాపరాళ్ళపైన పడుకున్నాను. నిద్ర ముంచుకొచ్చేసింది. కళ్ళు తెరిచేసరికి స్టేషనులో దీపాలు వెలుగుతున్నాయి. అప్పుడే ఓ పొగబండి స్టేషనులోకి వచ్చి ఆగింది. ఈసారి ఒక చిన్నపెట్టెగాచూచి సీటు క్రింద దూరి ముసుగు బిగదన్నేశాను. నిండుగా ఒక్క పగలూ, ఒక్క రాత్రి ఆ పెట్టెలోనే ఉండిపోయాను. కొత్తగా పెళ్ళిచేసుకున్న ఓ అబ్బాయి, అమ్మాయీ తాము తెచ్చుకున్న అన్నంలో నాకూ కొంచెం పంచిపెట్టారు. రైలు పరుగెడుతోందని మాత్రమే నాకు తెలుసు. ఎక్కడ పరుగిడుతోందో, ఏ వైపుగా పరుగిడుతోందో తెలియదు. ఎలాగూ నా దగ్గర టిక్కెట్టు లేదు గనుక ఎవరైనా దింపేస్తే దిగిపోదామనుకున్నాను. ఎవ్వరూ నా జోలికి వచ్చారుగారు. చివరికొక స్టేషనులో రైలాగింది. ఎంతకూ కదిలే సూచనలు కనిపించలేదు. దిగి పట్టణంలోకి వెళ్ళాను. మన ప్రాంతంగాదు. మన మనుషులుగాదు. మన భాషగాదు. బాగా మునిగిన తర్వాత చలి ఉండదంటారు. అందుచేతనే గావచ్చు నాకప్పుడు దుఃఖం కలుగలేదు. అక్కడ నాకు తెలిసిన ముఖాలు లేవు. ఏ యింటి ముంగిటకైనా వెళ్ళి చేతులుసాచి యాచించవచ్చును. పెడితే తీసుకోవచ్చు. పెట్టకపోతే కించపడకుండా వెళ్ళిపోవచ్చు. నాకు కావలసింది పూటకు పట్టెడన్నం. లోకంలో బిడ్డలనుకన్న తల్లులు లేకపోలేదు. వారం రోజుల్లో అలాంటి బ్రతుక్కు అలవాటు పడిపోయాను. ఆ వారం రోజుల్లో నాకో విషయం తెలిసింది. కాళ్ళూ చేతులూ దృఢంగా వున్న మానవుడు భిక్షానికి బయల్దేరితే లోకం ఈసడించుకుంటుంది. ఆ బ్రతుకుపైన రోత పుట్టింది. బస్సుస్టాండులో నిల్చుంటే మూట లెత్తడం, దించడం, మోయడంలాంటి చిన్న చిన్న గిరాకీలు తగులుతుండేవి. రోజుకొక రూపాయి కళ్ళకు కనిపించేది. అలాగే నాలుగైదు మాసాలు గడిచిపోయాయి. నాకు గడ్డం పెరిగింది. గుడ్డలు మాసి చిరుగులు పడిపోయాయి. తల వెంట్రుకలు బుట్టలా గుబురు కట్టిపోయాయి. అంతలో ఎండాకాలం పోయి వానాకాలం వచ్చింది, అవెక్కడి వానలో బాబూ, ఆ పట్టణంలో కుండలతో దిమ్మరించినట్టుగా జడివానలు కురిశాయి. వీధులు, మైదానాలు,

సైడు కాలువలు అన్నీ ఒక్క రీతిగా జలమయమైపోయాయి. ఓరోజు సాయంత్రం రోడ్డుపైన నడుస్తూ కాలుజారి క్రిందపడిపోయాను. పైకి లేచేసరికి ఒళ్ళంతా బురదతో దొప్పదోగి పోయింది. ఆ రాత్రి పడుకున్నానేగాని తడిబట్టల్తో నిద్ర పట్టిందిగాదు. తెల్లవారేసరికి జ్వరం వచ్చేసింది. నాలుగు రోజులు మూసిన కన్ను తెరవకుండా ఓ సత్రం వసారాలో పడి వుండిపోయాను. ఎవరో పుణ్యాత్ములు కొందరు దయతలచి నన్నో జట్కాలో వేయించి హాస్పిటలుకు చేర్పించారు. మందులూ, మాకులూ యిచ్చారో లేదో నాకు సరిగ్గా తెలియదు. ఇది మొండి ప్రాణం కనుక తేరుకున్నాను. జబ్బు నయమైపోయింది గనుక ఆసుపత్రినుంచీ వెళ్ళిపోవచ్చునన్నారు. ఎక్కడికి వెళ్తాను? నోరు విడిచి నా గోడు చెప్పుకోవాలనిపించింది. ఎవరు వింటారు? నా మాటలు వాళ్ళకు అర్థంకావు. వాళ్లు చెప్పేదేమిటో నాకు తెలియదు. కాళ్ళీడ్చుకుంటూ వీధులవెంట తిరిగాను. రాత్రి ఎనిమిది గంటలై ఉంటుంది. నా కాళ్ళు నన్ను రైల్వేస్టేషనులోకి తీసుకెళ్ళి వదలిపెట్టాయి. ఓ రైలు బయల్దేరడానికి సిద్ధంగా వుంది. ఆలోచించడానికి అవకాశమూ లేదు. ఓపికా లేదు. ఎక్కి కూర్చోగానే బండి కదిలింది.

"ఆ ప్రయాణం సాఫీగా జరగలేదు. మాటి మాటికీ దింపేశారు. మళ్ళీమళ్ళీ ఎక్కి కూర్చున్నాను. మన మనుషులు కనిపించేదాకా, మన మాటలు వినిపించేదాకా, మధ్యలో నేను ఆగదలచుకోలేదు. నాలుగోనాటి ఉదయం, భళ్ళు భళ్ళున తెల్లవారుతోంది. పెట్టెలోనుంచీ ప్లాట్‌ఫారంపైకి దిగాను. అల్లంతదూరంలో గుడిగోపురం కనిపించింది. దూరాన కొండ కనిపించింది. కొండపైకి వెళ్తున్న మెట్లు, మెట్ల చివర అలిపిరి గాలిగోపురం కనిపించాయి! చెవులకు నిండుగా గోవిందనామస్మరణం వినిపించింది. నాకు ప్రాణాలు లేచివచ్చాయి. ఆ ఆనందంలో ఊరంతా చెడ తిరిగేద్దామనుకొన్నాను. కానీ ఉన్నట్టుండి ఓ విషయం తలపుకు వచ్చింది. అన్ని ఊళ్ళలాంటిదిగాదు తిరుపతి. దేశంలో అన్ని మూలలనుంచి జనం అక్కడికి వచ్చిపోతుంటారు. ఆ వచ్చిపోయే వాళ్ళల్లో నాకు తెలిసినవాళ్లెవరైనా కనిపిస్తే? అందుకని ఊరికి దూరంగా వెళ్ళి ఓ చెట్టుక్రింద కూర్చున్నాను. మధ్యాహ్నం కావచ్చింది. కడుపులో కొక్కులు తవ్వుతున్నాయి. భోజనం కావాలి. అప్పుడు తిరుచానూరులో పెళ్ళిళ్ళు జరుగుతున్నాయి. నడవసాగాను. బయల్దేరిన వేళావిశేషం మంచిది. శుభకార్యం పూర్తిచేసుకుని తిరిగి వెళ్ళిపోవడానికి ముందుగా అండాలు ఖాళీచేస్తున్న ఓ పెళ్ళివారి కంటపడ్డాను. వాళ్ళ పాత్రల్లో మిగిలివున్న అన్నమూ, కూరా నారా అంతా ఓ విస్తరిలో వేసి నాకు వడ్డించేశారు. సుష్టుగా భోజనంచేసి ఎంతకాలమైందో మరి, ఒక విస్తరి మినహాగా మిగిలిందంతా మాయం చేసేశాను. పైకి లేచేసరికి పాదాలు గాలిలో తేలిపోతున్నాయి. శరీరంతోబాటు మనసుగూడా మైకంలో జోగుతోంది. బయటికి వచ్చాను. ఆ ఎండ ఎండలాలేదు నాకు, వెన్నెల్లా ఉంది. ఎట్టఎదుట కోనేరు, కోనేటి మెట్లపైన రావిచెట్టు నీడ. ఇంద్రుడి సింహాసనంలో కూర్చున్నా అంత సుఖంగా ఉండనిపించింది.

"ఆ సుఖంలో ఒకటి రెండు గంటలసేపు ఒళ్లు మరచిపోయాను.

"ప్రొద్దు గూట్లో పడింది. చలిగాలి ప్రారంభమైంది. తలకు చుట్టుకోడానికి పై గుడ్డలేదు. కప్పుకోడానికి ఏమీ లేకపోయినా నిద్రపోవడానికి అలవాటుపడ్డాను గనుక

పై గుడ్డ లేకపోవడం నాకొక యిబ్బందిగా తోచలేదు. అప్పుడు నా మనస్సు ఓ వస్తువుపైకి పోయింది. ఈ మనసుంది చూచావా రామం, దీనంత చెడ్డది వేరొకటి లేదు. కడుపు నిండుకూ తిండిలేక అలమటించినంతకాలం కూడే గుండెకాయగా, కడుపే కైలాసంగా రోజులు వెళ్ళబుచ్చాను. పెళ్ళి భోజనం కడుపులో పడిందో లేదో ఈ మనసు తనకింకొకటి తెచ్చి పెట్టమని హఠంపట్టి కూర్చుంది..."

రెండో పొగచుట్ట ముట్టించుకోడానికి మాధవయ్య మామ యిక్కడ కాసేపాగాడు. ఆయన మనసు దేనిపైకి వెళ్ళి ఉంటుందా అన్న నా ఆలోచన ఓ కొలిక్కి రాకమునుపే మళ్ళీ ఆయన కథలోకి వచ్చేశాడు.

"పొగచుట్టరా రామం, పొగచుట్ట! ఆ రోజుల్లో కానీకి రెండు చుట్టలు. కాని, కానీ కావాలి. ఎవరిస్తారు? చుట్టూరా కలయజూచాను. ఓ పెద్దమనిషి కనిపించాడు. అడిగితే చీదరించుకుంటాడేమో! బాబూ, కానీ ధర్మం చేయండి బాబూ అంటూ వెంట తగులకోడానికి నేను బొత్తిగా తెలుగుదేశపు బిచ్చగాణ్ణిలా లేను. అంతలో ఆ పెద్దమనిషి కనుమరుగై పోయాడు. ఇంకొకాయన దగ్గరికి వస్తున్నాడు. లేవబోయి మళ్ళీ మానేశాను. మనసేమో విడవకుండా మారాం చేస్తుంది. పొగచుట్ట! ఒక్కటే ఒక్కటి! కోనేటి నీటిపైనుంచీ విసురుగా వీస్తున్న చల్లటిగాలిలో పెదవులతో బిగబట్టి పొగ లోపలికి పీలుస్తూ అలాగే వదిలిపెడుతూ ఆనందంగా, ఆకాశానికి మూడే బారలన్నంత మహదానందంగా కూర్చోడానికి ఒక పొగచుట్ట!

"ఎవరో పిలుస్తున్నారు. ఎవరిని పిలుస్తున్నారు? వెనుదిరిగి చూచాను. ఎవడో బైరాగి. రావిచెట్టు మొదట కూర్చున్నాడు. బక్కపలచటి మనిషి. నల్లటి గడ్డం. జడలు గట్టిన తల. కావిగుడ్డలు. మోచేతి క్రింద దండం. చెంతనే కమండలం...

"నావైపే చూస్తున్నాడు. 'నిన్నే నాయనా! ఓ చిన్న సాయం చేస్తావా బాబూ?' అడగుతున్నాడు.

'సెలవివ్వండి స్వామీ?' అంటూ దగ్గరకి వెళ్ళాను.

"ఓ బేడ నాణాన్ని దోసిట్లో వేశాడు సన్యాసి.

"ఓ అణాకు పొగచుట్టలు, ఓ అగ్గిపెట్టె తీసుకొస్తావా బాబూ!'' అన్నాడు.

"చిల్లరంగడి ఎంతో దూరంలేదు. అక్కడికి వెళ్ళి నిమిషాల్లో తిరిగి వచ్చాను. అగ్గిపెట్టెతో సహా చుట్టలను ఆయన ముందుంచి తీసుకోండి స్వామీ!' అన్నాను.

"నాకెందుకు బాబూ! నీ కోసమే తెమ్మన్నాను. తీసుకో' అన్నాడు బైరాగి. అనడమే గాదు, ఆయన మెల్లగా నవ్వుతున్నాడు.

"ఆశ్చర్యంతో బిగ్రబిగుసుకుపోయాను. ఆశ్చర్యంలోనుంచి తేరుకోగానే సాష్టాంగంగా ఆయన పాదాలమీదికి వ్రాలిపోయాను. 'మూర్ఖుణ్ణి స్వామీ! అజ్ఞానంలో ఏదో అనుకున్నాను. నాది తప్పు. మన్నించండి.' అన్నాను.

"భుజంపై చేయివేసి ఆయన నన్ను లేపి దగ్గరగా కూర్చోబెట్టుకున్నాడు. ఓ పొగచుట్టను నా పళ్ళమధ్య యిరికించాడు. 'తప్పేముంది నాయనా! ఆ మాటకొస్తే మనసులోని కోరికను చంపుకోవడమే తప్పు! వేమన్న ఏమన్నాడు? 'కామిగాక మోక్షకామిగా'డన్నాడు' అంటూ ఆయన స్వయంగా అగ్గిపుల్ల గీసి నా చుట్టను వెలిగించాడు.

"కూర్చున్న చోటునుంచీ నేను లేవలేదు. జామురాత్రి గావచ్చింది. చెట్టు మొదట కూర్చున్న సన్యాసిలో చలనం లేదు. కాస్త దూరంగా జరిగి అక్కడే పడుకున్నాను. తెల్లవారింది. నిద్రలేవగానే సన్యాసికోసం చూచాను. ఆయన అలాగే కూర్చుని ఉన్నాడు.

"ఆయనకు తిండీ నీళ్ళపైన ధ్యాసే ఉన్నట్టు లేదు. యాత్రీకులెవరైనా పళ్ళో ప్రసాదమో సమర్పించుకునేవారు. ఆయన తీసుకున్నది తీసుకోగా మిగిలింది నాకు దక్కేది. పనీపాటా లేదు. చీకూ చింతా లేదు. కాలమంతా అదే విధంగా గడచిపోతే బాగుండునని అనుకున్నాను.

"ఓ రోజు ఆయన కళ్ళు దెరచి నావైపు చూస్తుండగా 'నా మనసులోని విషయం మీకెలా తెలిసింది స్వామీ?' అని అడిగాను.

"ఆయన చిత్రంగా సమాధానం చెప్పాడు – 'నువ్వెప్పుడైనా ఎక్స్‌రే ఫొటోను గురించి విన్నావా, నాయనా! ఆ ఫొటోలో శరీరం లోపలి భాగాలుగూడా స్పష్టంగా తెలిసిపోతాయి. అలాగే ఎదుటివారి మనసునుగూడా ఫొటో తీసినట్టుగా తెలుసుకోగల వెసులుబాటు లేకపోలేదు. కానీ అందుకు సాధన అవసరం!'

"ఆ సాధన ఏమిటో, దాన్నేవిధంగా చేయాలో, ఎంతకాలం చేయాలో నాకు తెలిసిందిగాదు. వివరంగా అడిగి తెలుసుకోవాలని మాత్రం అనుకున్నాను. కానీ ఆ తరువాత నేనెంతోకాలం ఆయనతో కలిసి ఉండడానికి వీల్లేకపోయింది..."

"ఏమైంది మామయ్యా? ఆయన ఏమయ్యాడు?" ఆతురతగా ప్రశ్నించాను.

మాధవయ్య మామ చెప్పసాగాడు: "ఓ రోజు రాత్రి, ఏడెనిమిది గంటలప్పుడు ఆయన తటాలున లేచి నిల్చుని చకచకా నడవసాగాడు. మారుమాటాడకుండా నేనూ ఆయన్ను వెంబడించాను. ఊరి బయటకు వచ్చాము. ఆయన ఒకచోట ఆగి వెనుదిరిగి చూస్తూ 'ఇక నువ్వు నీ దారంట వెళ్ళిపోవచ్చు.' అన్నాడు.

"నేను బెంబేలు పడిపోయాను. 'అదేమిటి స్వామీ! మీరే దిక్కని నమ్ముకున్నాను. మీతోనే ఉంటాను. మీ పాదసేవ చేసుకుంటాను' అని ప్రాధేయపడ్డాను.

"ఆయన జాలిగా నవ్వాడు. 'చూడు నాయనా! సంసారంనుంచి పారిపోయి వచ్చినవాడు సన్యాసి కాలేడు. భార్యపట్ల, బిడ్డలపట్ల, బంధుమిత్రులపట్ల తన కర్తవ్యాన్ని పూర్తిగా నెరవేర్చినవాడు మాత్రమే సన్యాసానికి అర్హుడు. వెలుగు చీకట్ల పడుగుపేకే జీవితం. వెన్నెల కొన్నాళ్ళు, చీకటి కొన్నాళ్ళు. నేను చెబుతున్నానుగా! నువ్వు స్వగ్రామానికి తిరిగి వెళ్ళు. అనుకోని విధంగా నీ కష్టాలన్నీ గట్టెక్కిపోతాయి..." అన్నాడు.

'వద్దు స్వామీ వద్దు! రొంపిలోనుంచీ బయటపడ్డాను. మళ్ళీ అక్కడకు వెళ్ళలేను. నన్ను మీ వెనువెంటనే వుండనివ్వండి' అని వే విధాలుగా చెప్పి చూచాను.

"కానీ ఆయన వినిపించుకోలేదు. 'ఓయి పిచ్చివాడా! నువ్వు విరాగివి కాదు. భయస్తుడివి. భయస్తుడెన్నడూ విరాగి కాలేడు. ఏనాడైతే నీకు నిజంగా వైరాగ్యం కలుగుతుందో ఆనాడు నా అంతట నేనుగా నిన్ను వెదుక్కుంటూ వస్తాను' అన్నాడు.

"ఇక నేను చెప్పగలిగిందేముంది రామం! ఏమీ చెప్పలేక చేతులు జోడించాను. ఆయన నన్నక్కడే వదిలిపెట్టి వడివడిగా నడిచి చీకట్లో కలిసి మాయమైపోయాడు. గుండె

రాయిచేసుకుని నేను మన వూరికి రాదలచుకున్నాను. చక్కా స్టేషనుకు నడిచాను. సరే, రైలుగూడా రానే వచ్చింది. ఎక్కి కూర్చున్నాను. మరునాటి మధ్యాహ్నానికల్లా మన ఊళ్ళో ఉన్నాను..."

స్వగ్రామానికి మరలివచ్చిన తరువాత తన జీవితంలో ప్రారంభమైన శుభ పరిణామాన్ని గురించి చెబుతున్నాడు మాధవయ్య మామ. ఆయన చెప్పకపోయినా ఆ వివరాలు నాకు తెలుసు. తిరిగి వచ్చిన కొత్తలో తన వాటాకు వచ్చిన తాతలకాలంనాటి పెంకుటింటి పెరట్లో అరటి పిలకలు పాతడంకోసం భూమిని త్రవ్వుతుండగా ఆయనకు అంతో యింతో బంగారం దొరికినట్లు చెప్పుకున్నారు. ఎలాగైతేనేం, కలిమి రాదలచుకుంది- నారికేళంలోకి సలిలంలా వచ్చేసింది. మాధవయ్యమామ అప్పులు తీర్చేశాడు. మేడలు కట్టాడు. పొలాలు కొన్నాడు. కొడుకుల్ని చదివించాడు. కూతుళ్ళకు పెళ్ళిళ్ళు చేశాడు. కొడుకులు పట్టణంలో ఉన్నతోద్యోగాలు చేస్తూ వుండగా, కూతుళ్లు లక్షణంగా తమ కాపురాలు చక్కదిద్దుకుంటూ వుండగా స్వగృహంలో దేవీ దేవరలాగా ఆలూ మగలిద్దరూ మాత్రం మిగిలారు.

మాధవయ్య మామ రెండోసారి వెలిగించిన పొగచుట్టకూడా సగానికి పైగా కాలిపోయింది. కానీ నా మనస్సులో మాత్రం పొగమబ్బులాంటి కుశంక ఒకటి మిగిలిపోయింది.

"ఆ సన్యాసి గనుక మళ్ళీ కనిపిస్తే నువ్వాయనతోగూడా వెళ్ళిపోతావా మామయ్యా?" విచారాన్ని అభినయిస్తూ ప్రశ్నించాను.

"అంతటి అదృష్టమా రామం! ఆయనకోసం ఎదురుతెన్నులు చూసీ చూసీ నా కళ్ళే కాయలు గాచిపోయాయి..." అన్నాడు మాధవయ్య మామ.

నాకు మాధవయ్య మామపైన కోపం కలిగిన మాట నిజం! చెప్పిచెప్పీ ఆయన తన కథకొక ముగింపు లేకుండా చేశాడు. పాపం, ఆయనమాత్రం ఏం చేస్తాడు? ఆ సన్యాసి తిరిగి వస్తేగానీ ఈ కథ పూర్తిగాదు. అతడెప్పుడు తిరిగి వస్తాడు? ఇంతకూ వస్తాడా, రాడా? అసలు అతడింకా బ్రతికి ఉన్నాడనుకోడానికి ఆధారమేముంది? ఈ ప్రశ్నావళికి ఏ వెండితెరపైన సమాధానం లభిస్తుంది?

***

ఆరోజు సాయంత్రం ఒంటరిగా షికారు బయలుదేరాను. ఊరు దాటగానే వానజల్లు ప్రారంభమైంది. బాటకు అనతిదూరంలోనే ఓ శివాలయం. లోకేశ్వరుడు మానవమాత్రుల భౌతిక నేత్రాలకు కనిపించకూడదనే గావచ్చు గర్భగుడి ఎప్పుడూ తాళం వేయబడి ఉంటుంది. గర్భగుడికెదురుగా ఓ మంటపం వుంది. పరుగెత్తికెళ్ళి ఆ మంటపంలో నిల్చున్నాను.

నాకంటే ముందుగా అక్కడ మరో వ్యక్తి తలదాచుకుని ఉన్నాడన్న విషయం వెళ్ళి నిల్చున్న కొంతసేపటికిగాని నాకు తెలిసిందిగాదు.

అతడు ఒక బైరాగి. మాధవయ్య మామ కథలో వచ్చిన బైరాగిది నల్లటి గడ్డమైతే, యితనిది తెల్లటి గడ్డం. అదొక్కటి మినహాయిస్తే ఆ వర్ణనకూ, యితనికీ అట్టే తేడా

కనిపించదు. గడ్డం మాటకేమీ, వయసు పైబడినకొద్దీ అది తెల్లబడిపోతుంది. కొంపదీసి అతడే యితడు కాదుగదా! నా వూహాకు నేను నవ్వుకున్నాను.

అంతలో వేరొక ఊహ నా బుర్రలో తళుక్కున మెరిసింది.

“ఏ ఊరండీ?” దగ్గరగా వెళ్ళి పలకరించాను.

“సంసారికైతే ఒక ఊరు. సన్యాసి కేముంది? అన్ని వూళ్ళూ వాడివే!” అన్నాడు బైరాగి. అన్న తరువాత ఒకటి రెండు క్షణాలు తటపటాయించి “ఓ అణాకాసు యిస్తావా నాయనా! వేరుశనక్కాయలైనా కొనుక్కుంటాను” అంటూ పనిలో పనిగా తన స్వకార్యాన్ని చక్కబెట్టుకోడానికి ప్రయత్నించాడు.

పథకాన్ని అమల్లోపెట్టడానికి గూడా అదే సుముహూర్తమనిపించింది – “అణాకాసుకేం భాగ్యంగానీ నేను చెప్పినట్టుగా చేస్తే నువ్వీ ఊళ్ళో ఓ వెలుగు వెలిగిపోవచ్చు...” అంటూ సాభిప్రాయంగా అతడివేపు చూచాను.

“నేనా! ఈ ఊళ్ళో వెలిగిపోవచ్చునా?” సన్యాసి తన చెవులను తానే నమ్మలేకపోయాడు.

“మరేంలేదు. సాధనా విధానం చాలా సులభం. నువ్వు నేర్చుకోవలసినవి మూడంటే మూడే మంత్రాలు. ఈ ఊళ్ళో మాధవయ్యగారని గొప్ప శ్రీమంతుడొకాయన ఉన్నాడు. ఆయనకు నీబోటి సన్యాసులంటే చెప్పరానంత గౌరవం. ఆయనగారి యిల్లెక్కడో చెబుతాను. మారుమాటాడకుండా వెళ్ళి నువ్వా యింటి వసారాలో తిష్ఠ వేసేయాలి. చీకటి పడేలోగా ఆయన నిన్ను పలకరిస్తాడు. పలకరించిన వెంటనే వీలైనంత స్పష్టంగా ‘తిరుచానూరు కోనేటిమెట్లు’ అంటూ మొదటి మంత్రాన్ని ఉచ్చరించాలి. ‘ఏమిటేమిటీ?’ అంటూ ఆయన విస్తుపోతాడు. ‘మరచిపోయావా నాయనా?’ అంటూ అప్పుడు రెండో మంత్రాన్ని ఒప్పజెప్పాలి. ఇక నోట మాటరాక చేష్టలు దక్కి ఆయన విగ్రహంలా నిల్చుండిపోతాడు, అప్పుడు మూడో మంత్రాన్ని అందుకోవాలి. ‘నీకోసమే వచ్చాను నాయనా!’ అన్నదే మూడో మంత్రం. ఈ చివరి మంత్రాన్ని మాత్రం రోజుకొకటి రెండుసార్లు తప్పనిసరిగా జపిస్తూ రావాలి...”

అనుమానంతో నావైపు ఎగాదిగా చూడసాగాడు సన్యాసి.

“ఊరికే ఉబుసుపోకకోసం చేస్తున్న పని. ప్రమాదమేమీ ఉండదు. పైగా ఎంతో కొంత ప్రతిఫలంకూడా ముడుతుంది. అందుకు నేను పూచీ” అంటూ నమ్మకం చెప్పాను.

ఏమైనా కానిమ్మని సాహసకృత్యానికి పూనుకుంటున్నవాడిలా ముగ్గులోకి దిగడానికి ఉద్యుక్తుడయ్యాడు సన్యాసి.

ఎందుకోగాని నాకు అమందానందం కలిగింది. ఎందుకో అని వితర్కించుకున్నాను. మాధవయ్యమామ కథ ఏనాడో ఆగిపోయింది. అదింక ముందుకు సాగి ఓ ముగింపుకు చేరుకునే అవకాశాలు లేనేలేవని అనుకున్నాను. కానీ కాకతాళీయంగా ఈనాడా కథకు కాళ్ళొచ్చేశాయి. ఇదింక ఎలా నడుస్తుందో చూడాలి...

***

మరునాడు తెల్లవారేసరికి మా ఊళ్ళో ఒకటే కోలాహలం – మాధవయ్యగారింటికి ఎవరో మహనీయుడు వచ్చేశాడు. ఆయన అగత అనాగతాలను కళ్ళు మూసుకుని

చెప్పెయ్యగలడు. ఆయన మంత్రించిన విబూదిని ప్రసాదిస్తే తీరని వ్యాధులన్నీ నయమైపోతాయి. ఇంకా రకరకాల చిలువలతో పలవలతో ఆయన ప్రభావాన్ని గురించి ప్రచారం కొనసాగుతోంది.

నామట్టుకు నేను మాత్రం యిప్పుడిప్పుడే మాధవయ్య మామగారింటికి వెళ్ళదలచుకోలేదు. కానీ అక్కడ వర్తమానాలు మాత్రం నా చెవిదాకా వస్తూనే ఉన్నాయి. మాధవయ్య మామ స్వాముల వారికి మేడపైన విడిది ఏర్పాటు చేశాడు. స్వామి స్నానపాన భోజన వగైరాలన్నీ ఆయనకక్కడే జరిగిపోతున్నాయట. స్వాములవారి వాగమృతాన్ని గ్రోలడానికి, ఆయన అనుగ్రహానికి నోచుకుని భవబాధలనుంచి విముక్తి పొందడానికి వెళ్తున్న జనంతో ఆ యిల్లు కిటకిటలాడిపోతోందట!

స్వాములవారి ఆగమనానికి మరింత ప్రాధాన్యం లభించడానికి వాతావరణ పరిస్థితి కూడా అనుకూలించిందనే చెప్పాలి! ఆయన రాబోతున్నాడనగా పట్టుకున్న వాన ముసురా నాలుగు రోజులదాకా అలాగే మొరాయించుకుని ఉండిపోయింది. ఎడతెరిపి లేకుండా పడుతున్న వానజల్లులవల్ల ఎవరి పనులు వాళ్ళు చేసుకోడానికి వీల్లేకపోవడంతో అబాలగోపాలానికి స్వాములవారిని గురించిన చర్చ తప్పితే మరొక ధ్యాస లేకపోయింది. అవి నేను నిరుద్యోగంతో కాలహరణం చేస్తున్న రోజులు. మూడేళ్ళుగా యింటిదగ్గర కూర్చుని ప్రతి సంక్రాంతికీ గోడలకు వెల్లవేసినట్టుగా ఏడాదికొకసారి నామధేయాన్ని 'రెన్యూ' చేయించుకుంటూ ఎంప్లాయిమెంటువారికి కాస్తో కూస్తో పని కల్పిస్తున్న నాకు ఒకనాటి శుభోదయాన బీటలువారిన నేలపైన తొలి ముంగారు వానలు కురిసినట్టుగా, ఉత్తరువు చేతికొచ్చేసింది. భోజనానికి రావచ్చునని ఎలుగెత్తి పిలిచి దభీమని తలుపు వేసుకున్న అన్నదాతకు, ఆ ఉత్తరవు జారీచేసిన అధికారులకు దగ్గరి చుట్టరికం ఉందేమో నాకు తెలియదు. కాగితం చేతికందిన తర్వాత కొన్ని గడియల వ్యవధిలో బయల్దేరితేగానీ నేను యింటర్వ్యూకు హాజరుకాలేను. అదృష్టం బాగుండి యింటర్వ్యూలో ఎన్నిక చేయబడితే వెంటనే ఉద్యోగంలో చేరిపోవలసి ఉంటుంది.

ఈ రోజుల్లో వలచిన వనిత దొరకడంకన్నా కోరిన ఉద్యోగం దొరకడం కష్టం. ఎలాగైతేనేం కోరిన కొండలో వాన కురిసింది. ఉద్యోగంలో చేరిపోయాను.

తరువాత నెల రోజులకుగానీ మా వూరికి తిరిగి రావడం కుదిరింది కాదు. రాగానే మాధవయ్య మామగారింటికి బయల్దేరాను.

సంజెచీకట్లు ముసురుకుంటున్న మునిమాపువేళ. నేరుగా యింటి లోపలికి వెళ్ళిపోబోతూ వసారాలో ఏదో ఆకారం మెదిలినట్టుగా తోచి అటువేపు తిరిగి చూసాను. తుపానులో తడిసి ముప్పందుమైపోయి చేనిగట్టుపైన గడగడా వడకిపోతూ కూర్చున్న గరుడపక్షిలా ఒంటి నిండుకూ దుప్పటి కప్పుకుని లోతుకుపోయిన కళ్ళతో బిక్కుబిక్కుమని చూస్తున్న మానవుడెవరో కాదు – మా మాధవయ్య మామ!

"అదేమిటి మామయ్యా! ఇలాగై పోయావేమిటి?" అంటూ పరామర్శించాను.

"ఎప్పుడొచ్చావురా రామం! ఎందుకోగానీ ఇలాగైపోయాను మరి!" నీరసంగా బదులుచెప్పాడు మాధవయ్య మామ.

తులసమ్మత్త నన్ను దూరంగా తీసుకెళ్ళింది – "ఇదేం విపరీతం నాయనా! సమయానికి నువ్వుగూడా ఊళ్ళో లేకుండా పోయావు. ఇతగాడెవరోగాని పులిమీద పుట్రలా దాపురించాడు. మీ మామయ్య కంటికి కనిపిస్తే చాలు, నీకోసమే వచ్చాననంటాడు. అదేం కర్మమో మరి. పెద్దపులిలాంటి మనిషి అతగాడి దగ్గరీయన పిల్లిలా మారిపోతారు. నిద్రాహారాలు మానేసి నెలనాళ్ళయింది. చూచావుగా, మనిషి చిక్కి సగమైపోయారు. నాకైతే దిక్కులే తోచడం లేదు..."

మెల్లగా మేడపైకి వెళ్ళాను. విశాలమైన హాల్లో చిన్న దీపం వెలుగుతోంది. అగరొత్తుల పరిమళం హాలంతటా సుళ్లు తిరుగుతోంది. బల్లపైన పళ్ళెం నిండుకూ పళ్ళు. వెండి పాత్ర నిండుకూ పాలు. పట్టెమంచంపైన తెల్లటి దూదిపరుపు. తలగడ కానుకుని సుఖాసీనుడై ఉన్నాడు సన్యాసి. ఆనందపారవశ్యంవల్ల కాబోలు, అతనివి అరమోడ్పు కన్నులు. పొడుగాటి గడ్డం గాలికి మెల్లగా కదులుతోంది.

ఎదుటికి వెళ్ళి నిల్చోగానే ఆయన యోగనిద్ర చెడిపోయింది.

"జ్ఞాపకమున్నానా స్వామీ!" అన్నాను.

కట్టను త్రెంచుకున్న ప్రవాహంలా నన్ను పోల్చుకోగానే ఆయన హావభావాలుకూడా హద్దులు దాటిపోయాయి. "నువ్వా నాయనా! ఎన్నాళ్ళకెన్నాళ్ళకు?" అంటూ ఆయన నన్ను దగ్గరికి తీసుకుని ఆలింగనం చేసుకోబోయాడు. "నీ మేలు మరిచిపోను బాబూ?" అంటూ చేతులు జోడించి అంజలి ఘటించబోయాడు. అలాంటి చేయరాని పనులేవీ చేయవద్దని ఆయన్ను బ్రతిమాలుకోవలసి వచ్చింది.

"ఎందరెందరో యిక్కడకు వచ్చారు గానీ నువ్వు మాత్రం కనిపించావుగావు. ఎవరినైనా అడుగుదామనుకుంటే నీ పేరైనా తెలిసిందిగాదు..."

ఆయన్ను వారించి అసలు విషయంలోకి వచ్చేశాను.

"గడచిన గాథను త్రవ్వుకోకండి స్వామీ! జరగవలసిందేమిటో ఆలోచించండి. ఏ వ్యవహారంలోనైనా సరే పట్టువిడుపులు రెండూ ఉండాలి. తెగేదాకా లాగడం మంచిదిగాదు. మొదటికే మోసం రావచ్చు. ఇప్పటికే శృతిమించి రాగాన పడింది. వీలైనంత త్వరగా మనం రంగంనుంచీ నిష్క్రమించడం మంచిది..."

"బాబ్బాబూ! అంతమాట వొద్దు. ఏదో పచ్చని పట్టు దొరికింది. నిర్విచారంగా కాలం గడిచిపోతోంది" అంటూ గింజుకున్నాడు సన్యాసి.

అప్పుడు నేను హితవును, వేదాంతాన్ని సమపాళ్ళతో కలిపి నా వోపినంతలో ఉపదేశానికి పూనుకోవలసి వచ్చింది.

"చూడండి స్వామీ! దేశమంతా మీది. మానవులందరూ మీవారు. మీ సాన్నిధ్యమూ, మీ సాహచర్యమూ ఒక ప్రదేశానికి, ఎవరో కొందరు మానవులకు పరిమితం కారాదు. ఒకానొక ప్రదేశంపట్ల మమకారం, ఒకానొక సుఖంపట్ల లోలుపత్వం – యివన్నీ బంధహేతువులు. మాటవరుసకు చెబుతున్నాగానీ ఈ విషయాలు మీకు తెలియనివి గావు. నోరువిడిచి వీళ్ళు వెళ్ళిపొమ్మని చెప్పలేదుగదా అని తామసించడంగూడా భావ్యం కాదు. ఉదాసీనమే వీడుకోలని పెద్దలు చెప్పనే చెప్పారు. అయినా ఈ మాయాజగత్తులో

సుఖానికీ, సంతృప్తికీ అవధులెక్కడ? ఏనాటి కేది అనుగ్రహింపబడితే దానితోనే సుఖానికీ, సంతృప్తికీ గిరిగీసుకోవడం మీబోటి విరాగుల స్వభావం..."

శ్రద్ధగా ఆలకించాడు బైరాగి. "నిజమే నాయనా! నువ్వు చెప్పినట్టే చేస్తాను. ఈ వూళ్ళో నాకు తెల్లవారదు. మరెక్కడో తెల్లవారుతుంది" అంటూ నాకు అభయమిచ్చాడు.

తెల్లవారింది. పట్టెమంచంపైనే కాదు సరికదా, ఊరి పొలిమేరల్లోపల సన్యాసి జాడలేదు.

మాధవయ్య మామ క్రమక్రమంగా కోలుకోసాగాడు.

❖ ఆంధ్రపత్రిక - 13 సెప్టెంబర్, 1961 ❖



# సబల

వాళ్ల పాపాయి పుట్టిన రోజు వాళ్ళకు పండుగ. తమ పండుగను తలాకొంచెం పంచిపెట్టతలచుకోడం విశాల, రామారావుల మంచితనానికి నిదర్శనం.

పాపాయి పుట్టిన రోజు పండుగను పురస్కరించుకొని వెన్నెల్లో విందు ఏర్పాటు చేశాడు రామారావు.

వెన్నెల భగవంతుడిచ్చేది.

విందు మానవుడు తయారు చేసేది.

మానవుడి ప్రయత్నానికి భగవంతుడి అనుగ్రహంగూడా తోడైతే బ్రతుకు బ్రతుకంతా వెన్నెల్లో విందులాగా పరిణమించగలదనడానికి ప్రత్యక్ష తార్కాణం విశాలా రామారావుల దాంపత్య జీవితం.

ఆరోజు రాత్రి వెన్నెల జరీఅంచునప్పిన పసిమినిగ్గుల పట్టుచీర కట్టుకుని వాహ్యాళికి బయల్దేరిన దొరసానిలా వచ్చింది. విశాల అంతరంగంలా చల్లటిదీ, రామారావు ఆతిథ్యంలా తీయటిదీ అయిన వెన్నెల తోటలో అడుగుపెట్టిన ప్రతి అతిథిని ముమ్మొందుగా పలకరించింది. నవ్వుతూ ఎదురుగా వచ్చి అతిథులను పేరు పేరునా పలకరించి స్వాగత సత్కారాలు నెరపింది విశాల. విందు కేర్పాటుచేస్తూ ఎక్కడా తానై విహరిస్తున్నాడు రామారావు.

సాధారణంగా మంచితనమనేది అదృష్టదేవత చిన్నచూపుకు లోనుగావడం లోకంలో పరిపాటి. ఆ పరిపాటికి మినహాయింపుగా కనిపించే అదృష్టవంతులు విశాలా రామారావు దంపతులు. విశాల హైస్కూల్లో పంతులమ్మ, రామారావు రెవిన్యూ డిపార్టుమెంటులో ఉన్నతోద్యోగి. రకరకాల గందరగోళాలకు ఆటపట్టయిన మహానగరంలో తరంగ సంక్షుభితమైన కడలి నడుమ ఓ చిన్న ప్రశాంతమైన దీవిలాంటిది వాళ్ళ మేడ. ఆ మేడలో అదొక ప్రత్యేక దాంపత్య సామ్రాజ్యం వాళ్ళది. అక్కడ అనునయాలేగాని ఆత్మాధిక్యతా ప్రదర్శనాలు లేవు. మన్ననలేగానీ మండిపడడాలులేవు. అనురాగాలేగానీ అలిగి కూర్చోవడాలు లేవు. 'పాలూ నీరూ' అనీ 'పూవూ తావీ' అనీ ఆ దాంపత్యంలో భార్యాభర్తల స్థానాన్ని వింగడించి చెప్పడం హాస్యాస్పదంగా వుంటుంది. ఎవరు పాలు, ఎవరు నీరు? ఎవరు పూవు, ఎవరు తావి? పాలలో కలిసిన తర్వాత నీరు కంటికి కనిపించదు. పూవు లేకపోతే తావికి ఆస్కారమే లేదు. భార్యాభర్తల్లో ఒకరిని కించపరచి, మరొకరిని మీదికెత్తే యిలాంటి ఉపమానాలు విశాలా రామారావుల దాంపత్యంతో పోల్చుకోడానికి ససేమిరా పనికిరావు. కానీ ఏ మాట కామాటే చెప్పుకోవాలి. ఆలూ మగలన్న తర్వాత వాళ్ళల్లో ఒకరి వ్యక్తిత్వం బలీయం కావడంవల్ల రెండో వ్యక్తిత్వం మొదటి వ్యక్తిని అనుసరించుకుంటూ బ్రతుకుబాట వెంట పయనించడం లోకంలో ఎక్కడబడితే అక్కడ మనకు గోచరించే పరమసత్యం! అలాగైతే విశాల రామారావు దంపతుల్లో బలీయమైన వ్యక్తిత్వం ఎవరిది?

ఒక పట్టాన సమాధానం స్ఫురించని చిక్కుప్రశ్న అదే! సాల్వుకాని క్రాస్‌వర్డ్ పజిల్‌లా నన్ను ఆశ్చర్య పరిచే చిదంబర రహస్యంగూడా అదే!

"అదేమిటండీ మేష్టారూ! ఇక్కడేం చేస్తూ ఉన్నారు మీరు?" – హఠాత్తుగా వూడిపడ్డాడు రామారావు. "ఎంతకూ మీరు కనిపించకపోయేసరికి ఒకవేళ ఫంక్షను సంగతి మరచిపోయారేమోననుకున్నాను..."

"అలాగైతే నా జ్ఞాపకశక్తిపట్ల మీకు బొత్తిగా నమ్మకం లేదన్న మాట!" దెబ్బతిన్నట్టుగా నొచ్చుకున్నాను నేను.

"అబ్బే, అదేం కాదండీ మేష్టారూ! అరవయ్యేళ్ళు వచ్చాయి గదా మీకు! అరులో మరులో అంటారు మరి!"

నాకు అరవయ్యేళ్ళు వచ్చిన మాట నిజమే! కానీ అలాగని ఓ యువకుడి చేతిలో పల్టీ కొట్టడానికి మాత్రం మనస్కరించింది కాదు.

"నా జీవితంలో ప్రొద్దు పడమటికి వ్రాలిపోయిందన్న వాస్తవాన్ని నేనెందుకు కాదంటాను రామం! కానీ వయస్సు పైబడిన కొద్దీ మానవుడికి మళ్ళీ పసితనం వస్తుందంటాను. పసివాళ్ళకు డిటోగా ముసలివాళ్ళలోను జిహ్వాచాపల్యం కాస్త ఎక్కువన్న సంగతి నీకు తెలియంది కాదు. మీరు మీ అమ్మాయికి పుట్టినరోజు పండుగ చేసుకుంటున్నారనుకో! కానీ మమ్మల్ని ఆహ్వానించడం విందు భోజనానికే గదా!"

గొల్లున నవ్వేశాడు రామారావు. "భలేవారండీ మీరు! ఇలాగే మరికొంతసేపు వాదాన్ని కొనసాగిస్తే యిక్కడికి వచ్చిన అతిధులందరూ మా విందు భోజనాల మూలంగానే బ్రతుకుతున్నారని చెప్పినా చెప్పేయగలరు మీరు! రండి, రండి, మనకోసం వాళ్ళందరూ వేచి చూస్తుంటారు..." గుత్తులు గుత్తులుగా విరగబూచిన మాని మల్లెపువ్వుల మధుర సౌరభాల్లోనుంచీ నడిపించుకుని వెళ్ళి నన్ను అతిథుల ఎదుట నిలబెట్టేశాడు రామారావు.

అక్కడ ఆడా మగా అందరూ కలసి నలభై యాభై మందికి తక్కువగా లేరు. అంతస్తుల తారతమ్యాలు, వయోవిభేదాలు విస్మరించి అందరూ ఒక కుటుంబానికి చెందిన వ్యక్తుల్లాగా, సమవయస్కుల్లాగా కలిసి మెలిసి యిష్టాగోష్ఠిగా కాలక్షేపం చేస్తున్న ఆ అతిథులు, వాళ్ళ చుట్టూ నిశ్చలంగా నిల్చుని వున్న పూలమొక్కల్లో పువ్వులతో బాటుగా పూచివున్న రంగు రంగుల విద్యుద్దీపాల వింత సొబగులు, వాళ్ళ గుండెల్లో పండుగను పలికిస్తూ మింటికీ మంటికీ సరిగపోగులు జారవిడిచినట్టున్న పండు వెన్నెల – కన్నులకు విందుగా వున్న ఆ దృశ్యాన్ని చూస్తూ నాలుగైదు క్షణాలపాటు అవశుడినై నిల్చుండిపోయాను.

"నమస్కారమండీ మేష్టారూ!"

కలకంఠి కూజితంలాంటి ఆ మాటలు నాలో మొద్దుబారిపోయిన బాహ్యస్మృతికి గిలిగింతలు పెట్టాయి. అప్పటికిగానీ ఈ పండువ కంతటికీ కారణభూతురాలైన పసిపాపను గురించి నే నించుమించుగా మరిచిపోయానన్న సంగతి నాకు జ్ఞప్తికి రాలేదు. ఏదీ, ఎక్కడుందా అమ్మాయి? చుట్టూరా కలయ పరికించాను. దేవగన్నేరు చెట్టుచాటున ఎత్తయిన పీటమీద ఆణిముత్యంలా పొందికగా కూర్చుని ముద్దుగా చేతులు జోడించి నా వైపు చూస్తోంది పద్మప్రియ.

పద్మప్రియ – అదే ఆ పాపాయి పేరు!

విశాల వేంకటేశ్వరస్వామి భక్తురాలు. అయిదారేళ్ళు అనపత్యురాలుగా వుండిపోయిన తర్వాత లేకలేక వరప్రసాదంలా కలిగిన తనపాపకు ఆమె పద్మావతి అని నామకరణం చేయడంలో విపరీతమేమీ లేదు. అలాగే భక్తికంటే రక్తికే ప్రాధాన్యమిచ్చే రామారావుకు ఆ పేరు అంతగా నచ్చక పోవడంగూడా సహజమే. కొంత మార్పుతో అతడు 'పద్మాప్రియదర్శిని' అన్నాడు.

"ఒద్దొద్దు. పద్మావతి అనడమే బాగుంటుంది" అంది విశాల.

"ఏం – 'పద్మాప్రియదర్శిని' మాత్రం బాగుండదా ఏమిటి?" అంటూ మారాం చేశాడు రామారావు.

అక్కడొకరి మధ్యవర్తిత్వం కావలసి వచ్చింది. ఆ పనికి నేను సాహసించాను. తల్లి పెట్టిన పేరుకూ, తండ్రి సూచించిన నామధేయానికి మధ్య నేను సాధించిన సామరస్యమే – పద్మప్రియ!

"రావలసిన ఆఖరు అతిథిగూడా వచ్చేశారు. ఇక విందు ప్రారంభం కావడానికి చెప్పుకోదగిన అభ్యంతరమేమీ లేనట్టే!" బాకా వూదినట్టుగా విజ్ఞాపనం చేసుకున్నాడు రామారావు.

వడ్డనకోసం సిద్ధంగావున్న వంటమనిషి నిముషాల్లో ఆకులు వేశాడు. చూస్తుండగానే ఫలహారాలు ఆకుల్లోకి వచ్చేశాయి.

"అంతా బాగానే వుంది కానీండి రామారావుగారూ..." అందరూ ఉలికిపడ్డారు. సస్పెన్సు పొడిగించడానికన్నట్టుగా వాక్యాన్ని మధ్యలో త్రుంచేసింది డాక్టరు ధర్మవేణి.

"బాగాలేని దేమిటండీ?" నలుగురైదుగురు అతిధులు ఒక్కుమ్మడిగా ప్రశ్నించారు.

"ఏ మాశ్చర్యం! బాగా లేనిదేమిటో నేను చెబుతేగాని వూహించుకోలేరా మీరు! ఇంటి యిల్లాలేదీ?"

అందరి కళ్ళూ విశాలకోసం వెదికాయి.

"గేటు దగ్గర కనిపించడమే కనిపించడం! ఆ తరువాత నామట్టుకు నాకు కనిపించనేలేదు విశాల. ఏమైనట్టు?" మళ్ళీ ప్రశ్నిస్తూ రామారావువైపు చూచింది ధర్మవేణి.

రామారావు మేడవైపు చూచాడు. మళ్ళీ అతిథులవైపు చూచాడు. కాసేపు నీళ్ళు నమిలి "బహుశా ఏదైనా కావలసి వచ్చి యింటిలోపలికి వెళ్ళి వుంటుంది. ఇప్పుడే వచ్చేస్తుంది" అన్నాడు.

"అదేమిటోగానీ ధర్మవేణిగారూ! ఈరోజు విశాల వాలకమంతా అదోరకంగా వుంది. నవ్వుతూ ఎదురొచ్చిందనుకోండి. కానీ నిజం చెప్పొద్దూ! అది ఆవిడ మామూలు నవ్వుకాదు..." అంటూ హెడ్‌మిస్ట్రస్ శాంతాదేవి సరిక్రొత్త వ్యాఖ్యానంతో ప్రసంగ రంగంలోకి ప్రవేశించింది.

"అబ్బే, ఉత్తపుణ్యానికి అవేం లేనిపోని సందేహాలమ్మా మీకు?" వారించినట్టుగా అడ్డు తగిలింది పెద్ద ముత్తయిదువ. "ఇంట్లో సంబరమాయె! అన్ని ఏర్పాట్లు దగ్గరుండి చూసుకోవాలాయె! సాయంత్రానికల్లా అమ్మాయికి కాస్తా సుస్తీ చేసి వుంటుంది. ఐనా అదేం చేస్తుంది?"

రామారావని తెలుసుకుని ఉపన్యాసకులు, ఆచార్యులు, ఇంకా పురప్రముఖులు స్వయంగా అతణ్ణి వెదుక్కుంటూ వచ్చి అభినందనలు అందజేశారు. స్థానిక వార్తాపత్రికలు అతడి ఫొటోను ప్రచురించి, ఆ ఫొటో క్రింద అతడి సాహసాన్ని వేనోళ్ళ ప్రస్తుతించాయి.

ఐతే ఆ సన్మానాలన్నీ ఒక ఎత్తు: ఏ అమ్మాయి ప్రాణాలనైతే రక్షించాడో, ఆ అమ్మాయి తన జీవితాన్ని అతనికే కైంకర్యంగా వినియోగించడానికి పూనుకోవడం మాత్రమే ఒక ఎత్తు!

అవును. ఆ అమ్మాయే విశాల!

వేణుగోపాలస్వామి సన్నిధిలో నిరాడంబరంగా జరిగిపోయింది వివాహం.

చదువు పూర్తిగాకమునుపే పెళ్ళి. పెళ్ళి కాగానే కొత్తకాపురం. పరీక్షలో కృతార్థత, ఉద్యోగం, అందులో ప్రమోషన్. తరువాత కొన్నాళ్ళకు సంతానప్రాప్తి. దానిమ్మ మొగ్గల్లాంటి బుగ్గలతో యింతింతలేసి చిలిపి కళ్ళతో అందాలుచిందే చిట్టిపాప... ఒక్క మాటలో చెప్పాలంటే రామారావు సంసారనౌక శరత్కాల పూర్ణిమా నిశీథంలో నిండుగా ప్రవహిస్తున్న నదీజలాలపైన చల్లగా జారిపోతున్న పూల తెప్పలా సాగిపోతోంది. కానీ ఎంతటి సౌఖ్యవహమైన పడవ ప్రయాణమైనా ఒక్కొక్కచోట సుడిగుండం, ఒక్కొక్కప్పుడు ఎదురుగాలిలాంటి చిన్నచిన్న ఉపద్రవాలుండకపోవు. సరిగ్గా అలాగే రామారావు సంసారంలో సైతం అప్పుడప్పుడూ ఏవో కొన్ని అవాంతరాలు చెలరేగడం కద్దు! చెప్పకుండా పెట్టకుండా నేరుగా నట్టింటిలోకి వచ్చి కూర్చున్న బంధుసత్తముడిలా ఒకప్పుడు విశాలకు తలనొప్పి వచ్చేస్తుంది. తెల్లవారుజామున నిశాసుందరి పమిట చెరగు విసురులా వచ్చిపోయిన ఒకానొక మంచుసోన తాకిడికి కందిపోయిన తమ్మి పూవులా మరొకప్పుడు ఆమె ముఖం యించుక ముకుళించుకపోతుంది. వేరొకప్పుడు అనారోగ్యపు చిన్నెలేమీ లేకపోయినా ఆమె అదొకమాదిరిగా దిగులుముఖం పెట్టి "ఎందుకోగానీ మనసేమీ బాగుండటం లేదండీ" అనేస్తుంది.

రామారావుకు సంబంధించిన తలపులన్నీ ఒక ముగింపుకు వచ్చేశాయి. ఇక నిద్రపోవడమే తరువాయి! నాకూ నిద్రకూ మధ్య వెన్నెల విరగబడి కాస్తోంది. వెన్నెలంతా మేసి ఏరు నెమరువేసే మాట నిజమౌనో కాదోగానీ, వయసు ఉడిగిన ముదిమి రోజుల్లో గతస్మృతులను నెమరువేసుకోడమొక్కటే మానవుడికి ముఖ్యమైన కాలక్షేపంగా పరిణమిస్తుంది.

తాలూకాఫీసులో టంగుమని గంట మ్రోగింది. ఒక్కటే గంట. కుంభకర్ణుడి మహోదరంలో పడిన చాక్లెట్ ముక్కలా ఆ ఘంటారావం నీరవ నిశ్శబ్దంలో కలిసి మటుమాయమైపోయింది.

మళ్ళీ అయిదు నిముషాలు గడచిపోయాయి. నాకోసం నిద్రాదుర్గ సింహద్వారాలు విచ్చుకుంటూ వున్నాయి. అంతలో బాహ్య జగత్తునుంచీ ఏదో అలికిడి వినరావడంతో అవి తటాలున మూసుకున్నాయి. వినిపించింది తలుపు తెరిచిన సవ్వడి. కళ్ళు తెరచాను. "నిద్ర పట్టలేదా రామం?" అన్న ప్రశ్న నాలుక చివరిదాకా వచ్చి అక్కడే ఆగిపోయింది. బయటకు వచ్చిన వ్యక్తి రామారావుగాదు, విశాల!

"ఏమిటమ్మా విశాలా! శిరోభారానికి శీతలపవనం దివ్యౌషధమనుకున్నావా ఏమిటి? జబ్బుగా వున్నప్పుడు యిలా అర్ధరాత్రి సమయంలో బయటికి రావచ్చునటమ్మా! తప్పు కాదూ! వెళ్ళి పడుకో తల్లీ!" అన్నాను.

"ఏం చేయమంటారు మేష్టరుగారూ! నిద్రపోవాలనే ప్రయత్నించాను. కానీ ప్రయత్నం ఫలించింది గాదు, ఈ రాత్రికిక నిద్రపట్టే సూచనలుగూడా లేవు..." అంది విశాల.

"అదేమిటమ్మా! నీ మాటల ధోరణిని బట్టి చూస్తే నాకేమిటో అనుమానంగా వుంది. నిద్ర పట్టకపోవడానికి అనారోగ్యంగాకుండా మరేదైనా కారణం వుందా ఏమిటి?" ప్రశ్నిస్తూ విశాలవైపు చూస్తున్నాను. వెన్నెల కేసి చూస్తున్న విశాల కళ్ళలో నీళ్ళు గిర్రున తిరుగుతున్నాయి.

వాలుకుర్చీ కానుకుని నిల్చుంది విశాల. ఆ క్షణాన ఆమె మూర్తీభవించిన శోకంలా వుంది.

"చెప్పమ్మా చెప్పు. ఒకరిద్దరితో చెప్పుకుంటేగానీ విచారం తగ్గదు. చింతలకూ వంతలకూ చోటులేని ఆనంద లోకాలే నీ విహారభూములని నేనింతవరకూ అనుకునేవాణ్ణి. ఈరోజిదేమిటో విపరీతంగా వుంది..."

"మీరేకాదండి మేష్టరుగారూ! మావారుగూడా అలాగే అనుకుంటారు. ఈ విశాల జీవితంలో ఆంతరంగికమైన ఆవేదనలు కొన్ని అంతర్లీనంగా దాగివున్నాయన్న విషయం ఎవ్వరికీ తెలియదు..."

రామారావు ఖాళీచేసి వెళ్ళిన కుర్చీలో కూర్చుంది విశాల. మానసికోద్వేగం కాస్తా చల్లబడటంకోసమన్నట్టుగా ఆమె ఒకటి రెండు నిముషాలు మౌనంగా కూర్చుండిపోయిన తర్వాత గాద్గదికమైన కంఠంతో మెల్లగా ఉపక్రమించింది – "ఈరోజు నాకొక దుర్వార్త అందిందండీ మేష్టరుగారూ! మా నాన్నగారు చనిపోయారు..."

"చనిపోయారా! చనిపోతే కన్నకూతురివి నువ్వు చివరిచూపుకోసం వెళ్ళలేక పోయావటమ్మా!" విస్మయంతో ప్రశ్నించాను.

"ఈ మందభాగ్యురాలికి అంతటి అదృష్టంగూడానా మేష్టరుగారూ! నాన్నగారు చనిపోవడం రెండు వారాల క్రిందట! ఆ మాట నాకు చెప్పి పంపాలన్న ధ్యాసగూడా అక్కడెవరికీ లేకపోయింది..."

విచార సమయంలో వివరాలను ఏకరువు పెట్టవలసిందని అడిగేపాటి తెగువ నాకు లేదు, నా తటపటాయింపును యిట్టే కనిపెట్టగలిగింది విశాల.

"తల్లి చనిపోతే తండ్రి దాయాది – అంటారు. నా పట్ల ఆ మాట అక్షరాలా సార్థకమైంది. మా పిన్నమ్మను గయ్యాళిగంప అంటే వాస్తవాన్ని కించపరిచి చెప్పినట్టవు తుంది. ఆమె తలలోంచి ఎగిరిపోయేవాళ్ళు ఆమె పిల్లలు. ఐనా వాళ్ళే నాన్నగారికి ఆత్మీయులుగా కనిపించారు. ఆయన నన్ను శత్రువుగా భావించేవారు. కానీ ఆయనకు నిజం చెప్పవలసి వస్తుందనే అనుకున్నాను. ఏనాటికైనా ఆయన నన్ను వెదుక్కుంటూ

వచ్చి నా యింట కాలు మోపగలరనే అనుకున్నాను. ఆ ఆశగూడా అడియాసే అయిపోయింది..."

మళ్ళీ ఒకటి రెండు నిముషాల నిశ్శబ్దం.

"పిన్నమ్మ పాలిటికి నేను పానకంలో పుడకలా కనిపించేదాన్ని. ఈ పీడ ఎప్పుడెప్పుడు విరగడవుతుందా అని ఆమె కాచుక కూర్చుంది. ఆమె ఉద్దేశానికి అనుగుణ్యంగా ఈడు రాకమునుపే నాకు పెళ్ళయిపోయింది. మా చుట్టాల్లో వెంకటనరసయ్యగారని ఒకాయన వుండేవారు. ఆస్తిపాస్తుల్లోగానీ, దర్జాలోగానీ ఆయనొక పిల్ల జమీందారు లాంటివాడు. నన్ను తన యింటి కోడల్నిగా చేసుకోవడానికి ఆయన ముందుకొచ్చాడు..."

ఇక్కడ కాసేపాగి, నిశ్చలంగా నావైపు చూచింది విశాల – "ఆయనలా ముందుకు రావడానికి కారణమేమిటో చెప్పమంటారా మేష్టరుగారూ! ఈ భూప్రపంచకంలో తన కుమారుడికి పిల్లనివ్వడానికి సాహసించే తల్లిదండ్రులెవరూ వుండరేమోనన్న సందేహమే అందుకు కారణం! ఆ కుమారుడి కప్పటికే ముప్ఫయ్ యేళ్ళు. మొదటి భార్య చనిపోయింది. ఆ వయసుకే అతడిలో వృద్ధాప్యపు లక్షణాలు పొడసూపుతున్నాయి. మనిషి కంకాళంకంటే మెరుగ్గా లేడు. కొని తెచ్చుకున్న జబ్బుల మూలంగా అతడు కృంగి కృశించిపోయాడు. నా అదృష్టమనండి, దురదృష్టమనండి – పెళ్ళయిన తర్వాత ఆరుమాసాలకే అతడు చనిపోయాడు..."

అదొక స్వగతంలా ఆత్మకథా కథనాన్ని కొనసాగిస్తోంది విశాల–

విశాల తండ్రిపేరు నరసింహంగారు. అల్లుడి మరణవార్త చెవిలో పడగానే ఆయన బుర్ర చురుగ్గా పనిచేసింది. వెంకట నరసయ్యగారి ఆస్తిలో ఎంతో కొంత విశాలకు సంక్రమించకపోదు. శారదా చట్టాన్ని భంగపరచడమైతే జరిగింది గానీ, కోర్టు కెక్కించడానికి తగిన వయస్సింకా విశాలకు రాలేదు. అందాకా ఆమెనేం చేయాలన్న ఆలోచనతో ఆయన కొంతకాలం కొట్టుమిట్టాడిపోయాడు. ఆ ఆలోచనకు పర్యవసానంగా అర్ధాంతరంగా ఆగిపోయివుండిన విశాల హైస్కూలు చదువు మళ్ళీ కొనసాగింది. జీవితపు వైకుంఠపాళీలో పాములను తప్పించుకుంటూ విశాల ఒక్కొక్కటిగా నిచ్చెనలను అందుకోడంగూడా అప్పుడే ప్రారంభమైంది. స్కూలు ఫైనల్లో పాఠశాలకంతా ప్రథమ స్థానంలో ఉత్తీర్ణురాలు గావడంతో కాలేజీలో చేరడానికి ఆమెకు స్కాలర్‌షిప్ లభించింది.

"ఇంటిదగ్గర పడుండక ఆడదానికి చదువులెందుకండీ! అంతంత పెద్ద చదువులు చదివాక దాని కళ్లింక నేలవైపు చూస్తాయా?" అంటూ అడ్డుతగిలింది పినతల్లి.

"నేలవైపు చూడకుండా వుండటమే మనకు కావలసింది. ఆ ఆస్తి సంగతి తేలేదాకా మనం దాని యిష్టానికి వ్యతిరేకంగా నడవగూడదు..." అంటూ భార్యకు నచ్చజెప్పుకున్నారు నరసింహంగారు.

వీలైనంతలో సంపాదించడమొక్కటి తప్పితే నరసింహంగారికి మరొకపని చేతగాదు. పొదుపుగా వాడుకుంటే ఆయన సంపాదన ఆ కుటుంబానికి చాలకపోయేటంత తక్కువగూడా కాదు. కానీ ఆ యింటి యిల్లాలి కోరికలు అగ్గిగుండంలోనుంచీ పైకి లేచే

జ్వాలాజిహ్వల్లాంటివి. ఆజ్యంపోసిన కొద్దీ అవి విజృంభించేవేగానీ ఉపశమించేవిగావు. తానూ, తన బిడ్డలు, తన చుట్టాలు మినహాగా మిగిలిన ప్రపంచం ఏమైపోయినా పట్టించుకోని స్వభావం ఆమెది. ఆమె నరసింహంగారిని తన కోరికలు తీర్చే సాధనంగా మాత్రమే చూసింది. ఆమె పెంపకంలో బిడ్డలకుగూడా అలాంటి భావమే ఏర్పడింది. వేళకు వంటగాదు. పిల్లలు బడికి వెళ్ళరు. బద్ధకించినప్పుడల్లా హోటల్లో నుంచీ కారియర్‌తో భోజనం తెప్పించుకుంటారు. పిల్లలకు చదువు చెప్పడానికొక టీచరు యింటికే వస్తాడు. హోటల్ భోజనం ఆరోగ్యానికి సరిపడదు. భయభక్తులు లేకపోవడంవల్ల ప్రయివేట్ మాష్టారిదగ్గర పిల్లలకు చదువురాదు. కలుపు బలిసిపోతున్న పంట పొలంలా అపమార్గాలు విచ్చలవిడిగా చెలరేగుతున్న ఆ సంసారంలో ఏమీ చేయలేని నిస్సహాయకరమైన పరిస్థితుల మధ్య విలవిలలాడిపోసాగారు నరసింహంగారు. ఎవరికోసమైతే తాను అహరహమూ శ్రమిస్తున్నాడో, వాళ్ళ దృష్టిలో పూచికపుల్లకన్నా హీనంగా పరిగణింపబడుతున్న మానవుడెవడైతే వున్నాడో వాడు భగవత్సృష్టిలోని నికృష్ట ప్రాణుల్లో ప్రథమంగా లెక్కింపదగినవాడు. ఆ చీకటి బ్రతుకులో నరసింహంగారి కొక్క ఆశాకిరణం మాత్రమే మిగిలింది. విశాలమూలంగా వో అయిదంకెల పెద్దమొత్తం తన చేతికి వూడిపడుతుందనీ, అంతటితో తన కుటుంబంలో నవజీవనం ప్రారంభమవుతుందనీ ఆయన భావింపసాగారు!

కానీ ఆ మొత్తం ఎంతవరకూ సద్వినియోగం కాగలదని యోచించే వోపిక మాత్రం ఆయనకు బొత్తిగా లేకపోయింది.

సదరు నరసింహంగారికి నగరంలో రామేశంగారని ఓ అడ్వకేటు మిత్రుడు దొరికాడు. చేబట్టిన ప్రతికేసును, తనకొక శాశ్వతభృతిగా మలచుకోదంలో సిద్ధహస్తుడైన రామేశంగారు వెంకట నరసయ్యగారి ఆస్తిలో విశాలకొక పెద్ద వాటా లభించేదాకా తనకు నిద్రపట్టదని తలగడగా వినియోగించుకోదగిన తన న్యాయశాస్త్ర గ్రంథం మీదుగా శపథం చేశారు. దుర్భర పరిస్థితుల్లో తలమునుకలైవున్న క్లయింట్లదగ్గర ఫీజు పుచ్చుకోడం తన పాలసీకి విరుద్ధం కనుక ఈ కేసును తాను ఉచితంగానే నిర్వహించగలనని అభయంగూడా యిచ్చారు.

అంతటితో వూరుకున్నారుగారు రామేశంగారు!

నగరంలో జరిగే సభల్లోనూ, సమావేశాల్లోనూ తరచుగా గంభీరోపన్యాసాలివ్వడం రామేశంగారి వివిధ వ్యాసంగాల్లో ఒక్కటి. ఆ ప్రసంగాల్ని వినడానికి అలవాటుపడిన శ్రోతలు ఆయన ఉపన్యాస ధోరణిలో ఓ అపూర్వమైన విశేషాన్ని గమనించి ఆశ్చర్య చకితులైపోయారు. అగ్గిపెట్టెల కంపెనీ వార్షికోత్సవంలో మాట్లాడమన్నాసరే, ఆడవాళ్ళను గురించి విధిగా ఓ అరగంటసేపు దూషించడం రామేశంగారి అలవాటు. లోకంలోని అన్ని అనర్థాలకూ స్త్రీ విద్యే మూలకారణమనీ, ఆ అనర్థాలనుంచీ బయటపడడానికి ఘోషా పద్ధతి ఒక్కటే తరుణోపాయమనీ ఎలుగెత్తి చెబుతూ వచ్చిన రామేశంగారు ఉన్నట్టుండి ఓ శుభ ముహూర్తాన వితంతు వివాహం ధర్మసమ్మతమేనని ఓ సరిక్రొత్త గ్రామఫోను రికార్డుకు ప్రారంభోత్సవం చేసేశారు. ఆనాటినుంచీ వితంతు వివాహావశ్యకత ఆయన ఉపన్యాసాల్లో ఒక ముఖ్యాంశమైపోయింది.

రామేశంగారి ఈ విచిత్ర ప్రవర్తనకు వెనుక నిక్షిప్తమైవున్న దూరాలోచన చాలా మందికి తెలిసిందిగాదు. ఆయనగారికి బి.ఎల్ పట్టం పుచ్చుకుని కొత్తగా బోర్డు కట్టిన కుమారుడున్నాడు. ఆ జూనియర్ లాయరుకు విశాలను ముడిపెడితే వృత్తి ప్రారంభించిన క్రొత్తలో అంతగా ప్రాక్టీసు రాకపోయినా అతడు సర్దుకోగలడని రామేశంగారు తలపోశారు!

ఆనాటికింకా కాలేజీలో చదువుకుంటూ వుంది విశాల. తన చుట్టూరా క్రమ్ముకుంటున్న విషవాతావరణాన్ని ఆమె సులభంగానే పసిగట్టగలిగింది. అందులోనుంచీ బయటపడకపోతే తన జీవితానికి కాంతిగానీ, తన మనసుకు శాంతిగానీ వుండబోవని గూడా ఆమె గ్రహించింది. ఆదినుంచీ ఆమెను ఆదుకుంటూ వచ్చిన అదృష్టరేఖ యిక్కడగూడా తన ప్రభావాన్ని చూపించింది. ఓరోజు సాయంకాలం హాస్టలుకు తిరిగివచ్చేసరికి గది ఎదుట బెంచీపై కూర్చుని విశాలకోసం వేచి చూస్తున్నారు వెంకట నరసయ్యగారు. ముసలిముప్పులో తనను కోర్టు కీడవడం న్యాయం కాదనీ, ఏదో ఒక రాజీ పద్ధతికి ఒడబడవలసిందనీ ఆయన విశాలను దీనంగా అర్థించారు. వ్యాపార ధోరణి ప్రదర్శించి ఆ వయోవృద్ధుడి మనసుకు నొప్పి కలిగించలేకపోయింది విశాల. చెక్కుమీద తనకు తోచిన సంఖ్యవేసి మడిచి విశాల చేతిలో పెట్టి వెంకట నరసయ్యగారు తిరిగి చూడకుండా వెళ్ళిపోయారు.

విశాల కోర్టులో జరుగుతున్న కేసును ఉపసంహరించుకున్న వార్త నరసింహంగారికి కాస్త ఆలస్యంగా చేరింది. ఆరోజు టపాలోనే ఆయనకు విశాల దగ్గరనుంచీ ఎంతోకొంత పైకంగూడా ముట్టింది. ఐతే ముట్టిన పైకానికీ, విశాల మూలంగా తానాశించిన మొత్తానికీ ఎందునా పొంతన లేకపోవడంతో నరసింహంగారు అగ్గిమీద గుగ్గిలమైపోయారు. విశాల పినతల్లి నిర్విరామంగా కారాలు, మిరియాలూ నూరసాగింది. దూషణ భాషణాలు వర్షించి, వికట తాండవాలు సలిపిన తర్వాత భార్యాభర్తలిద్దరూ కలిసికట్టుగా తమకిక విశాలతో సంబంధ బాంధవ్యాలు లేవని, తమకు తామే తెగతెంపులు చేసుకున్నారు.

నగరంలో రామేశంగారు సైతం అలాంటి ఎదురుదెబ్బే ఒకటి తినక తప్పిందిగాదు. వట్టి మాటల కృతజ్ఞతతో సరిపెట్టకుండా కేసును నడిపించినందుకు ఆయనకు యథోచితమైన ప్రతిఫలం చెల్లించేసింది విశాల. తనపట్ల విశేషమైన ఆదరాన్ని ప్రకటిస్తూ,, మాటిమాటికీ హాస్టలుకు విచ్చేసి తన యోగక్షేమాలు కనుక్కొంటున్న ఆ తండ్రీకొడుకుల సౌజన్యానికి కృతజ్ఞతను వెలిబుచ్చి వాళ్ళావిధంగా తనకోసం తమకు శ్రమకలిగించుకోడం భావ్యం కాదనికూడా విశాల విన్నవించుకుంది.

అంతటితో చిక్కులన్నీ పరిష్కారమైనట్టే కనిపించాయి. కానీ, మానవజీవితంలో చిక్కులనబడేవి ఒక స్థలానికి, ఒక కాలానికీ పరిమితమైనవి గావు. అవి ఎప్పుడంటే అప్పుడు, ఎక్కడ బడితే అక్కడ ప్రత్యక్షమవుతుంటాయి. విశాల జీవితంలో సైతం కొత్త చిక్కులు కొన్ని ఉత్పన్నమయ్యాయి.

అందచందాలకు కొలతబద్దలులేవు. ఎవరి అందం వాళ్ళది. కానీ అందరినీ మైమరపింపుకు గురిచేసే అందచందాలు ఏ ఒక్క వ్యక్తినైనా ఆశ్రయిస్తే ఆ వ్యక్తి రకరకాల యిబ్బందులకు లోనుగావలసి వుంటుంది. ఆయాచితంగా 'అందాలరాణి' బిరుదానికి పాత్రురాలైన విశాల విషయంలో అలాంటి యిబ్బందులే ప్రారంభమయ్యాయి.

ప్రారంభం కావడం అందువల్లనే అయినా అవి పెచ్చు పెరిగిపోవడానికి వేరొక కారణం తోడైంది. అందాకా వట్టి పూవే విశాల! సంపన్నురాలు గావడంతో ఆ పూవుకు తావిగూడా సమకూరినట్టయింది.

భృంగకుమారుల్లాంటి విద్యార్థులు విశాలను కథానాయికగా వరించి తమ ప్రేమాయణాలకు శ్రీకారాలు చుట్టేశారు.

ఒక విద్యార్థి రెప్పలల్లార్చకుండా తదేకదృష్టితో విశాలవైపు చూస్తూ కూర్చునేవాడు. మరొకతను స్వవిరచిత విరహ గీతికలు ఆలపించేవాడు. వేరొక యువకుడు ఏదో ఒక వ్యాజంతో విశాలతో మాట్లాడటానికి ప్రయత్నించేవాడు. తద్విధంగా ఆ ప్రేమ సమాజంలో పది పన్నెండు మంది సభ్యత్వం స్వీకరించారు. పార్టీల్లో వర్గాల్లాగా ఆ సమాజంలో మళ్ళీ రెండు చీలికలు. పైకి బుద్ధిమంతుల్లా కనిపిస్తూ, రోజుకొక్క ప్రేమలేఖ వ్రాసిపడేసే మితవాదులు కొందరైతే, ప్రేమలేఖలతోబాటు ఖయస్‌లా క్రాఫింగ్ చెరుపుకుని, దేవదాసులా దిగులుముఖం పెట్టి, నిరాశతో, నిట్టూర్పులతో అలమటించిపోయే అతివాదులు కొందరు.

జీవితంలో ఎన్నడూ యిలాంటి విపత్కర పరిస్థితిని ఎదుర్కోలేదు విశాల. ఇందరు మగరాయుళ్ళలో ఎవరినో ఒకరిని తన జీవిత నౌకకు కర్ణధారిగా ఎన్నుకుంటేనేగాని వీళ్ళు తనను బ్రతకనిచ్చేటట్టులేదు. కానీ ఎలా ఎన్నుకోడం? శివధనుస్సును విరిచినవాడే నాకు పతి – అంది సీత. మత్స్యయంత్రాన్ని త్రుంచినవాడే నాకు భర్త – అంది ద్రౌపది. ఆ విధంగా తనేం పరీక్ష పెట్టగలదు విశాల?

ఇంతవరకూ తన ఆత్మకథను చెబుతూ వచ్చిన విశాల, "మిగిలిన కథ మీకు తెలిసిందే" అంటూ ముక్తసరిగా ముగించింది.

నేను నిర్ఘాంతపోయాను.

"పొగమంచులో సూర్యబింబంలా వాస్తవం నాకేమంత స్పష్టంగా భాసించడం లేదమ్మా. విశాలా! అలాగైతే నువ్వుగూడా ఆ ప్రేమాకులచిత్తులకందరికీ ఓ పరీక్ష పెట్టదలచుకున్నావన్నమాట! కొంపదీసి నువ్వు తలపెట్టిన పరీక్ష నదిలో పడిపోవడం కాదుగదా!"

విశాల నిరుత్తర. అవనతముఖి. ఆమె వాలకం చెప్పకనే చెబుతోంది – నా వూహ అక్షరాలా సత్యమని!

రాత్రి రెండు గంటల వేళ. పుచ్చపువ్వులాంటి వెన్నెల. వెన్నెల్లో విరిసి నవ్వుతున్న పువ్వులు. మందపవనంతో కలిసి వస్తున్న సుమపరిమళాలు. ఎట్టయెదుట తన జీవిత సహచరుణ్ణి ఎన్నుకోవడంకోసం మరెవ్వరూ కలలోనైనా వూహించడానికి వీల్లేని సాహసానికి పూనుకున్న విశాల! ఆ క్షణాన అనిర్వచనీయమైన అలౌకికానుభూతి ఒకటి నా మానసాకాశమంతటా తెరలు తెరలుగా వ్యాపిస్తోంది.

"వివాహం లాటరీలాంటిదంటారు గదండీ మేష్టరుగారూ! నా పట్ల ఆ సూక్తి నిజం కాలేదని తెలుపుకోడానికి నేను సంతోషిస్తాను. నా సాహసానికి తగిన మూల్యం లభించింది. నీడలా నన్ను వెన్నంటినవాళ్లు, పీడలా ఒక పట్టాన వదలి పెట్టనివాళ్ళు, వంతెనపైన మట్టిబొమ్మల్లా నిలబడి వుండగా – ఎవరి పేరైతే నా కంతవరకూ తెలియదో,

ఎవరి జీవితమైతే నాకు అపరిచితమో అట్టి వ్యక్తి ఒకరు నన్ను రక్షించడంకోసం నదిలో దూకడం జరిగింది. విచిత్రంగా లేదా మేష్టరుగారూ!"

విచిత్రం మాట దేవుడెరుగు! ఒకానొక అమంగళం స్ఫురించడంతో నా ఒళ్లు గగుర్పొడిచింది.

"చూడమ్మా విశాలా! నువ్వింతదూరం నీ కథ చెప్పుకొచ్చాక నేను మందలించడానికి పూనుకుంటానని మాత్రం అనుకోవద్దు. ఎట్టి పరిస్థితిలోనూ ప్రాణాలతో చెలగాటం భావ్యంగాదు. ఎవరో నిన్ను కాపాడడంకోసం నదిలో దుముకుతారన్న నమ్మకం నీకుండవచ్చు. కానీ కీడెంచి మేలెంచడం ఎప్పుడూ మంచిది..."

"ఆంతరంగికమైన ఆవేదనల్లాగానే ప్రతివ్యక్తికీ ఆంతరంగికమైన రహస్యాలుగూడా కొన్ని వుంటాయంటే మీరొప్పుకుంటారా మేష్టరుగారూ!"

"రహస్యమా! ఏమిటమ్మా అది?" నా ఉత్కంఠకు ఎల్లలే లేవు.

"ఎవరితోనూ చెప్పబోవడం లేదని హామీ యివ్వగలరా మేష్టరుగారూ?"

అలాగేనని హామీ యిచ్చాను.

"చివరికి మావారితోనైనా సరే!'

ఈ షరతుకు సైతం అసందిగ్ధంగా అంగీకారం ప్రకటించాను.

"నాకు ఈత బాగా వచ్చు" అంది విశాల.

❖ ఆంధ్రపత్రిక – 29 డిసెంబర్, 1961. ❖



# ప్రజాపతి

ఉద్యోగికి దూరభూమి లేదంటారు. లేదనే అనుకుందాం! కానీ అది అతగాడి అదృష్టమనిగానీ, దురదృష్టమనిగానీ తేల్చి చెప్పాలిగదా! చెప్పరు. అదృష్టంగా పరిణమిస్తే అభినందిస్తారు. దురదృష్టం క్రింద పర్యవసిస్తే అవహేళన చేస్తారు. అదృష్ట దురదృష్టాల మాటకేమిగానీ పాదలేపనంతో అవసరం లేకుండా దేశాలు త్రిప్పి చూపించగలిగింది ఉద్యోగం. ఎటొచ్చీ ప్రవరుడికి లభించిన పాదలేపనానికి, ప్రభుత్వ శాఖల్లో ఉద్యోగానికీ ఒక్కటే తేడా కనిపిస్తుంది. పాదలేపనం నిన్ను నీ యిచ్చ వచ్చిన చోటికి తీసుకెళ్తుంది. ఉద్యోగం దానికి మనస్కరించిన చోటుకు నిన్ను గిరవాటు పెడుతుంది. లోకంలో ఒక వ్యక్తిపైన మరో వ్యక్తికి కోపం వస్తే – ఆ రెండో వ్యక్తి మొదటి వాడికన్నా బలవంతుడైన పక్షంలో 'చూడు నిన్నేం చేస్తానో, ఏడు చెఱువుల నీళ్ళు త్రాగిస్తాను' అనడం రివాజు! ఏడు చెరువుల నీళ్ళేం కర్మమని ఏడూళ్ళ నీళ్ళు త్రాగించేది ఉద్యోగం. నామట్టుకు నేను మాత్రం ఉద్యోగరీత్యా ఏడు జిల్లాల నీళ్లు త్రాగాను. జానెడు పొట్టకోసం ఇంతదేశం తిరగాలా అని విస్తుపోయే అమాయకులెవరైనా ఉంటే, వాళ్ళతో సంజాయిషీ చెప్పుకోవలసి వస్తుంది. బువ్వపెట్టే కన్నతల్లిలాంటిది ఉద్యోగం! పిల్లితల్లి తన కూనలను ఏడిళ్ళు త్రిప్పగా లేనిది, ఉద్యోగం ఏడు జిల్లాలు త్రిప్పడం అబ్బురమా!

సరే, అది త్రిప్పింది. నేను తిరిగాను. అసలు కథ అదిగాదు. ఉద్యోగంలో బదిలీవల్ల ఏమో కొన్ని ఇబ్బందులంటూ ఉండకపోవు. ఎవరి కష్టాలు వారే అనుభవించు కోవలసినవనీ, ఆనందాలు మాత్రం అందరితో కలిసి పంచుకోదగినవనీ చెబుతారు పెద్దలు. ఐనా ఊళ్ళు తిరగడంవల్ల లభించే ఆనందమేముంది? ఆ మాటకొస్తే ఏది ఆనందం? సుష్టుగా భోజనం చేయగలగడమా! హమేషా వినోద వ్యాసంగాల్లో మునిగి తేలడమా! దండిగా డబ్బు గడించడమా! ఇవన్నీ మనిషికి ఆనందాన్ని చేకూర్చేవేగానీ, నన్నడిగితే వీటికి మించిన మహదానందం వేరొకటుంది. ఇలాతలం ఎక్కడికీ ఒక్కటే అయినా కొండలతో, కోనలతో, పండిన పొలాలతో, పచ్చిక మైదానాలతో, ఆనంద వైవిధ్యంతో కన్నులకు పండువ గొలిపే ప్రకృతి సౌందర్యాన్ని తిలకించడంకంటే ఆనందం ఏముంటుంది? ప్రకృతి సంగతలా వుండగా మానవుల వేషభాషల్లో, జీవన విధానంలో, సాంప్రదాయంలో ఎన్నితరహాలు! ముక్కూ మొగమూ, కాళ్ళు చేతులూ లాంటి అంగాలన్నీ ఒక్క మాదిరివే అయినా, మనుషుల్లో ఒక్కొక్క వాలకం ఒక్కొక్క మోస్తరుగదా! సాలార్జంగ్ మ్యూజియంలో ప్రవేశిస్తే, ప్రతి వస్తువులోనూ ఏదో వైచిత్రి మిళితమై ఉండడంచేత దేన్ని చూడాలో, దేన్ని చూడనవసరంలేదో స్ఫురించదు. భగవంతుడి మ్యూజియంలో సజీవంగా నడయాడే నమూనాలకు సైతం పై మాట వర్తించకపోదు. ఒకరిని చూచిన కంట ఒకరిని చూడలేము. ఒకరిని అర్థం చేసుకునే పద్ధతిలో ఒకరిని అర్థం చేసుకోలేము. భౌతికాకృతి కంటికి స్పష్టంగా కనిపిస్తుంది. అంతరంగం ఊహకైనా మనుషులతో పరిచయం కలగడమెంత సులభమో, అర్థం చేసుకోగలగడం అంతకష్టం. ఐనా ఆ ప్రయత్నం, ఆ సాధన మనసుకెంతైనా ఆనందాన్నిస్తుంది.

పదిహేనేళ్ళ ఉద్యోగ జీవితం. ఏ ఊరిలోనూ పట్టుమని రెండేళ్ళుండటం జరిగింది గాదు. క్రొత్త పరిసరాలతోనూ, పరిస్థితులతోనూ సర్దుకోలేక మార్పును అభిలషించినంత కాలం ససేమిరా వీల్లేదని చెప్పేవారు అధికారులు ఉన్న లోటుపాట్లన్నింటికీ తట్టుకుని ఈ ఊరుగూడా నివాసయోగ్యమే ననుకోవడం ఆలస్యం – దూర్వాసుణ్ణి వెన్నంటిన విష్ణుచక్రంలా ట్రాన్సుఫరు ఆర్డరు తరుముకొచ్చేది. దూర ప్రయాణంలో మజిలీలకు మల్లే క్రొత్త క్రొత్త ఊళ్ళను చూడవలసి వచ్చేది. పాత మజిలీలకు సంబంధించిన తలపులు మాత్రం ఒక పట్టాన వదిలి పెట్టేవిగావు. వసంతం వచ్చి ఏ పడుచుపిల్ల వాలుజడలోనైనా మల్లెమొగ్గ కనిపిస్తే కదిరి మల్లెపువ్వుల మధుర పరిమళాలు మనసంతటా నిండిన మధురానుభూతితో ఒడలు పులకరిస్తుంది. భోజనానంతరం తాంబూలం నములు తున్నప్పుడల్లా కడపలో తమలపాకులు జ్ఞప్తికొస్తాయి. వేరొక ఊరు పాములకు ప్రఖ్యాతి. మనుషులు మేదర మంచంపైనేగానీ నేలపైన పడుకోరు. మనుషుల నోటంట పాముల కథలు వింటుంటే, అక్కడ మానవులు పాములతో సహజీవనం నెరపుతున్నారేమోనన్న భ్రమగూడా కలుగుతుంది. ఇంకొక ఊరిలో ఆహార పదార్థాలన్నీ పుష్కలంగా లభిస్తాయి – ఒక్క మంచినీళ్ళు మినహాగా! అరమైలు దూరం వెళ్తేగానీ అరబక్కెట్టు నీళ్ళు దొరకవు. నిత్యసత్య వ్రతుడంటే హరిశ్చంద్రుడు, పితృవాక్య పరిపాలకుడంటే శ్రీరామచంద్రుడు జ్ఞప్తికి వచ్చినట్టుగా ప్రతి ఊరికి సంబంధించి ఓ ముఖ్యమైన స్మృతి మిగిలిన వాటినన్నింటినీ త్రోసిరాజని ముందుకొస్తుంటుంది. ఆ విధంగా శ్రీపురాన్ని గురించి తలచుకోగానే మదిలో మెదిలేది పువ్వులు, తమలపాకులు లాంటి విలాస వస్తువులకుగానీ, పాములు, మంచి నీళ్ళు కటకటల్లాంటి ఈతి బాధలకుగానీ సంబంధించింది గాదు. అది ఓ వ్యక్తికి సంబంధించిన స్మృతి. ఆ వ్యక్తి పేరు విశ్వపతి.

విశ్వపతి రాజకీయవేత్తగాదు. రచయితగాదు. ఉద్యోగికూడా కాదు సరిగదా, ఉద్యోగం చేయగలిగిన లక్షణాలు సైతం అతనిలో కనిపించవు. పోగా బ్రతువుతెరువుకోసం వ్యాపారం, వ్యవసాయం, చేతిపనులులాంటి వృత్తులను చేబట్టినట్టుగూడా తోచదు. కానీ భక్తులు ఏ విధంగా తలచుకుంటే ఆ విధంగా ప్రత్యక్షమయ్యే, భగవంతుడిలా, ఏ విధంగా ఊహించిన వాళ్ళకు ఆ విధంగా కనిపించే విశిష్టత ఏదో అతనిలో ఉంది. రాజకీయ, సాహిత్య, వ్యవసాయాది విషయాల్లో అతనికి పరిచయమేగాక ప్రవేశంగూడా వున్నట్లు కనిపించడమే అందుకు కారణమైతే గావచ్చు. వ్యక్తిత్వానికి మల్లే అతని ఆకారంలోగూడా ఏదో ప్రత్యేకత ఉంది. స్థూలమూగాక, బక్కపలచనా గాక మధ్యరకంగా చక్కని చిక్కని కాయవాటు శరీరం అతనిది. దోరనేరేడు పండులా నలుపు, ఎరుపు కలిసిన దేహచ్ఛాయ. నుదురు పైభాగాన కొంచెంగా తెల్లబడిన శిరోజాలు. ముక్కుక్రింద పై పెదవిమీదికి గుబురుగా వంగిన మీసాలు అతడి స్వరూపానికి అలంకారాలు. పాంటువేసి చొక్కా తొడిగినా, పంచకట్టి జుబ్బా వేసినా మరెలాంటి వేషమైనా ఆ ఆకారంపైన ఎబ్బెట్టుగా కనిపించదు. ఎదురైన ప్రతి మనిషికీ వయసెంతుంటుందన్న జిజ్ఞాసకు పూనుకునే అవసరం – 'వయసు'తో పనిఉన్న ఇన్సూరెన్సు ఏజెంట్లకు మినహాగా మరెవ్వరికీ ఉండదు. కానీ కొందరి నిజమైన వయసు తెలిసినప్పుడు మాత్రం తారున నోరు దెరచి ఆశ్చర్యపడడం

అప్పుడప్పుడూ అరుదుగానైనా జరుగుతుంది. విశ్వపతి విషయంలో నేనలాంటి ఆశ్చర్యానికి లోనయ్యానని మాత్రం ఒప్పుకోక తప్పదు.

ఆర్డరు చేతబట్టుకుని శ్రీపురం వెళ్ళిన క్రొత్తలో జరిగిన సంగతి. కాపురాన్ని ఇంకా పాత మజిలీ నుంచీ క్రొత్త మజిలీకి తెచ్చుకోలేదు. సాయంకాలాల్లో ఉబుసుపోక కోసం ఆ ఊళ్ళో లభ్యమయ్యే వ్యాసంగాలపైన పరిశీలన జరుపుతున్నాను. స్వతహాగా వ్యాపార కేంద్రం గావడంవల్ల, క్రొత్తగా నెలకొల్పబడిన ఫ్యాక్టరీలవల్ల దినదినాభివృద్ధి చెందుతున్న పట్టణం శ్రీపురం. దీపగృహాలుగానీ, చార్మినార్‌లాంటి ఉన్నత గోపురాలుగానీ లేని కొరతను తీరుస్తూ, ఊరి మధ్యగా ఓ గుట్ట కనిపిస్తుంది. సంధ్యా సమయాల్లో ఆ గుట్టనీడ పడేచోట ఓ రాతికట్టడంఉంది. కట్టడం ఎంత పాతదో, దాని తాలూకు నేమ్‌బోర్డుగూడా అంతపాతదే! ఎండకెండి, వానకు తడిసి అక్షరాలు క్షరమై పోవడంచేత, కట్టడాన్ని గురించిన వివరాలు తెలుసుకోడానికి ఆ బోర్డు బొత్తిగా ఉపకరించడంలేదు. ఐనా నాలుగు రోజుల్లో విషయం తనంతటదే తెలిసివచ్చింది. అది ఆ ఊరి క్లబ్బు. ఇంటా బయటా ఆడుకునే క్రీడలన్నింటికీ అక్కడ సదుపాయాలున్నాయి. అనుబంధంగా గ్రంథాలయముంది. క్రీడలన్నా పుస్తకాలన్నా ఆసక్తి లేనివాళ్ళు ఏకాంతంగా కాలం గడపడానికి తోటలో చెట్ల చాటున సిమెంటు బెంచీలున్నాయి. ఆ క్లబ్బుకు వెళ్ళి రావడంవల్ల ఎంతోకొంత రిక్రియేషన్ లభించడ మొక్కటేగాదు, విశ్వపతిని వీలైంత తొందరగా కలుసుకునే అవకాశంగూడా నాకు లభించింది. వీలైనంత తొందరగా అని ఎందుకంటున్నానంటే శ్రీపురంలో నివసిస్తూ విశ్వపతిలాంటి వ్యక్తిని కలుసుకోకుండా ఉండటం, కలుసుకున్న తర్వాత పరిచయం కలగకుండా ఉండటం దాదాపుగా అసంభవం గనుక!

శ్రీపురం నాగరిక సమాజంలో విశ్వపతికున్న స్థానం ఈ పాటికి మీకు చూచాయగా అర్థమయ్యే ఉంటుంది. మరింతగా దాన్ని వివరించడానికిది సందర్భంగాదు. మొదటిసారిగా విశ్వపతి శ్రీపురం క్లబ్బులో కనిపించాడన్నదే ప్రస్తుతాంశం. కనిపించడానికి పదిపదిహేను నిమిషాలముందు నుంచీ నేనతడి పొలకువను గుర్తింపవలసి వచ్చింది. అందుకు కారణం ధారావాహికంగా సాగుతున్న అతడి ప్రసంగం.

"నేనాదినుంచీ చెబుతున్నాను గదండీ! ఆలోచనలు హెచ్చిన కొద్దీ మనిషికి సుఖం తగ్గిపోతోంది. ఎలాగూ – అని అడ్డుతగులుతారేమో! చెబుతున్నానుగా, మొన్ననొక పుస్తకం కావలసి వచ్చి – నాక్కాదు, మా బంధువుల అబ్బాయి ఒకడున్నాడు. భగవంతుడు వాణ్ణి చదువుకోడానికే పుట్టించాడు. మరేమో వాళ్ళ నాన్నను కొడుకు చదువుకోసం సంపాదించడానికే పుట్టించి ఉంటాడు – వాడికోసం కాలేజి లైబ్రరీకి వెళ్ళాను. లైబ్రరియన్ ఎరిగున్న మనిషి. 'రాక రాక వచ్చారండి విశ్వపతిగారూ! రండి లైబ్రరీ చూద్దురుగానీ' అని గదుల్లోకి తీసుకెళ్ళాడు. అవేం పుస్తకాలయ్యా వెంకట్రావూ! ఒక్క గణిత శాస్త్రానికే పన్నెండు బీరువాలా! ఏనుగును తీసుకొచ్చి అగ్గిపెట్టెలో పెట్టమనేవాడు బుద్ధిహీనుడైతే, ఆ బీరువాల్లోని విజ్ఞానాన్నంతా తాటికాయంతలేని తల బుర్రలో పట్టించమనే వాడెందుకు బుద్ధిమంతుడో నాకర్థం కాదు. అందుకనే నేను పుస్తకాలు చదవడం ఎన్నడో మానేశాను. ఇక ఆలోచించడమంటారా? అందుకు పూనుకుంటే అయిదు నిముషాల్లో నాకు

నిద్రొచ్చేస్తుంది. అసలు నేను విపరీతంగా మాట్లాడుతానని లోకంలో ఒక అపప్రథ ఉంది. అందులో కాస్తా నిజం లేకపోలేదనుకోండి. కానీ నేనెందుకలా మాట్లాడుతానో ఎరుగుదురా సుబ్బయ్యగారూ! చెప్పమంటావా తారకం! ఎప్పటికప్పుడు బుద్ధికి తోచినదల్లా మాట్లాడేస్తుంటే ఇక ఆలోచనలకు ఆస్కారమెక్కడ? ఇటీవల ఓ తమాషాగూడా జరిగింది. ఒకానొక బాల్య మిత్రుడితో కలిసి హోటలుకు వెళ్ళాను. మాటల మధ్య ఏవో ప్లేట్లు టేబిలుపై కొస్తున్నాయి. వెళ్ళిపోతున్నాయి. 'ఇప్పటికి మూడు మసాల దోసెలు తిన్నావు. నాలుగో దానికి ఆర్డరిమ్మంటే అందుకు సిద్ధంగా ఉన్నాను.' అంటూ ఆ మిత్రుడు హెచ్చరించుకున్నాడు. ఎలా తినగలిగానంటారు? నాకుక్షిలో అంతగా జఠరాగ్ని ప్రకోపముందంటే అందుకు కారణం ఏమిటి? ఆలోచనలే మానవుణ్ణి కృంగదీసేవి. ఆలోచనలు లేకుండా ఉండటమే ఆరోగ్యానికి పునాది. ఈ సందర్భంలో ఓ పిట్టకథగూడా చెప్పుకోవచ్చు..."

"ఏం, ఏకంగా హరికథ పెట్టుకోగూడదూ?" లైబ్రరీలో ఎవరో గొణుక్కుంటున్నారు.

పత్రికా పఠనం సరిగ్గా కొనసాగక నేనుగూడా తలపైకెత్తి ప్రసంగం వినవచ్చిన వైపుకు చూచాను. సరిగ్గా ఆ సమయానికి నావైపే చూస్తున్నాడు విశ్వపతి. నా చూపులో ఎలాంటి భావం ప్రతిబింబించిందో నాకు తెలియదు. పత్రికా పఠనానికి అంతరాయం కలిగి ఉండవచ్చునుగాక, అంతమాత్రాన ఓ పెద్దమనిషి ప్రవర్తనపట్ల వైముఖ్యత ప్రకటించడం భావ్యం కాదేమో! అతని సంగతి నాకేమి పట్టనట్టుగా తలదించుకుని మెల్లగా వెలుపలికి వచ్చేశాను.

చీకటి పడబోతోంది. ఆటలాడి అలసిపోయిన క్రీడాకారులు క్రష్షులు తెప్పించుకుని త్రాగుతున్నారు. వరండాలో పేకాట జోరుగా సాగుతోంది. రేడియోలో వస్తున్న లలిత సంగీతం మరికొంతసేపు ఉండి పొమ్మని బ్రతిమాలుతున్నట్టుగా శ్రావ్యంగా వినిపిస్తోంది. ఆ సందడిలో పిలుపు వినిపించింది–

"ఏమండోయ్ మేష్టరుగారూ! నమస్కారాలు. కొత్త ముఖం కనిపిస్తే పలకరించడం అలవాటు. మూడో వ్యక్తి ఒకడు పరిచయం చేసి పెట్టేదాకా నోటికి తాళం వేసుకుని కూర్చోడం నాచేతగాదు. నేనిలా చొరవగా వ్యవహరించడం కొందరికి రుచించకపోవచ్చు..."

"అబ్బే, రుచించక పోవడానికిందులో..."

"తెలుసు. మీది సరళ స్వభావమని చూడగానే గ్రహించాను. ముఖాన్ని చూస్తే మనస్తత్వం తెలిసిపోదుటండీ! అన్నట్టు నేను మీ ముఖం వైపు చూడ్డానికిది ప్రథమ పర్యాయం కాదు. ఇదివరకే నాలుగైదుసార్లు చూచాను..."

"మీరా? నన్నా!"

"తలవంచుకుని మీ పాటుకు మీరు వెళ్ళిపోతుంటారు గనుక మీరు నన్ను చూచి ఉండరు. మొదటిసారిగా పదిహేను రోజుల క్రితం పాత చావడి దగ్గర కనిపించారు. ఉదయం పదిగంటలప్పుడు చేతిలో ఏవో ఆఫీసు ఫైళ్ళతో గాంధీరోడ్డు వైపు వెళ్తుంటే – ఆ రోడ్డు పైన ఉన్నదొకటే ఆఫీసు గదండీ – ఆ ఆఫీసుకొక క్రొత్త ఉద్యోగి వచ్చినట్టున్నారని గ్రహించాను..."

లేనిపోని ఆలోచనలతో బుర్రను పాడుచేసుకోగూడదన్నది విశ్వపతి తనపైన తానే విధించుకున్న కఠిన నియమం. కానీ అదే విశ్వపతి పట్టణంలో ప్రవేశించిన ఒకానొక ఉద్యోగిని గురించి ఇంతగా ఆలోచించి అతణ్ణి గురించి అప్పుడే కొన్ని నిర్ణయాలకు రాగలగడం చాలా ఆశ్చర్యకరమైన విషయం?

"ఆ తర్వాత మళ్ళీ నాలుగైదుసార్లు చూచాను మిమ్మల్ని! బహుశా పోయిన శుక్రవారం రాత్రనుకుంటాను, మీరు రంగన్న బంకులో కిళ్ళీ కొనుక్కుని వసంతవిహార్ మెట్లెక్కుతుంటే చూచాను. బస చేయడానికి చక్కటి గదులున్న హోటల్ అదొక్కటే! క్రొత్తగా ఈ ఊరికి వచ్చారు. బంధువులుండరు. తెలిసిన వాళ్ళుగూడా లేరేమో! హోటల్లో మకాం పెట్టక మరేం చేస్తారు పాపం?"

ఉద్యోగులపట్ల విశ్వపతిలాంటి పెద్దమనిషి ఈ మాత్రం శ్రద్ధ వహిస్తున్నందుకు అభినందించవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఆసక్తిగూడా లేకపోలేదు. కానీ అవకాశం మాత్రం లభించింది గాదు.

"వసంత విహార్ కవతల నాలుగో వీధిలోనే మా ఇల్లు. మాట్లాడుకుంటూ వెళ్దాంగానీ వస్తారా రంగనాథంగారూ!"

"మీకు నా పేరుగూడా తెలుసన్నమాట!" విస్తుపోతూ అడిగాను.

"మీ ఆఫీసులో నాకు తెలియని వాళ్ళెవరు? ఓ బంట్రోతు మూలంగా తెలిసింది – 'ఎవరో రంగనాథం గారటండీ బాబయ్యా! హిందూపురంనుంచీ వచ్చారట. తానేమిటో, తన పనేమిటో అంతేగానీ మరొక ధ్యాసలేదాయనకు! ఇచ్చకాలతో, నక్క వినయాలతో ప్రాపకం కోసం దగ్గరకు వెళ్ళబోయిన వాళ్ళను ఆయన ఎక్కడికక్కడే దులిపి పారేశారు. ఎత్తులు సాగకపోతే ముంచుకొచ్చేదీ ఉక్రోషమే గదండీ! పాపం, బుజ్జినాన్నలందరూ లోలోపలే కుతకుతలాడిపోతున్నారు...' అన్నాడు. అందుకు నేనన్నాను గదా 'మరే మనుకున్నావురా అబ్బీ! మానేజరుగిరీ అంటే మాటలా! దానంతటి కీలకమైన ఉద్యోగం అదే! పాకీవాడి దగ్గరినుంచీ కమిషనరుదాకా, కౌన్సిలర్ల దగ్గరనుంచీ కంట్రాక్టర్లదాకా అందరికీ మేనేజరుగారి తోడ్పాటు అవసరమే! అలాంటి ఉద్యోగి కాస్త సుభావంగా ఉండటమే మంచిది' అన్నాను. ఒప్పుకుంటారా రంగనాథంగారూ!"

అభిప్రాయ భేదాలకు ఆస్కారం లేని మంచి మాటేలే చెబుతున్నాడు విశ్వపతి. ఒప్పుకోక చేసేదేముంది!

ఉన్నట్టుండి అతడు విషయాంతరంలోకి దాటుకున్నాడు. "చూడండి రంగనాథం గారూ! మీరెప్పుడైనా చారిత్రక ప్రదేశాలకు వెళ్ళారో లేదో తెలియదు. హంపీ, అజంతా, ఎల్లోరాల్లాంటి కళాక్షేత్రాల్లో యాత్రీకులకొక 'మార్గదర్శి' తారసిల్లుతుంటాడు. చెట్టు, గుట్ట, పుట్ట – దేన్ని గురించైనా సరే అతడు విస్మయం కలిగించే కథలు చెప్పగలడు. సరిగా అలాగే క్రొత్త ఊరికి వెళ్ళినప్పుడు, ఆ ఊరి బాగోగుల్ని తెలియజెప్పడానికి ఓ వ్యక్తి అవసరం. అభ్యంతరం లేకపోతే మీరు నన్ను మీ శ్రేయోభిలాషిగా భావించవచ్చు..."

"ఎంత మాటెంతమాట! అభ్యంతర మెందుకు?"

అప్పటికి తనేమో నా ప్రతిపాదనను బలపరచినట్లు "అలాగన్నారు, బాగుంది" అన్నాడు విశ్వపతి. కార్యక్రమంలో తరువాతి అంశంలోకి వచ్చినట్టుగా అతడు శ్రీపురాన్ని

గురించి చెప్పసాగాడు. అప్పిచ్చువాడు – వైద్యుడు అన్న పద్యం ఉదహరింపబడిన తర్వాత మొదటి పాయింటు మీద వివరణ కొనసాగుతోంది – ఫ్యాక్టరీల మూలంగా పట్టణంలో కార్మికుల జనాభా హెచ్చిన తరువాత ఇప్పుడిక్కడ వడ్డీ వ్యాపారానికి మూడు పూవులారుకాయలుగా ఉంది. కిటుకులన్నీ తెలిసిన ఆసాముల పాలిటికి వడ్డీ వ్యాపారం బంగారు గ్రుడ్లు పెట్టే బాతులాంటిది. ప్రోనోటుపైన అప్పుదొరికే పద్ధతి ఏనాడో రద్దయిపోయింది. రెండు వందల రూపాయలు కిమ్మత్తు చేసే నగపైన వంద రూపాయల అప్పు లభిస్తే, అందుకు అవసరాన్ని బట్టి అయిదునుంచీ పదిదాకా వడ్డీ రేటు అమల్లో ఉంది. ఎంతటి ఉద్యోగస్తుడికైనా ఒక్కొక్కప్పుడు అనుకోని అవాంతరాలవల్ల నెలజీతం చాలకపోవచ్చు. తప్పనిసరి పరిస్థితుల్లో అప్పు కావలసి రావచ్చు. కానీ ఒకసారి అప్పుల ఊబిలో దిగబడిపోతే మళ్ళీ పైకి లేవగలగడం అసాధ్యం. అందువల్ల అంగళ్ళలో అకౌంటుపైన సరుకులు దొరికే వెసులుబాటుండడం చాలా మంచిది.

అందాకా చెబుతూ వచ్చి "అదిగోనండీ రంగనాథంగారూ! అదే మా బట్టలకొట్టు" అన్నాడు విశ్వపతి. వెంటనే సంజాయిషీగూడా ప్రారంభించాడు – "స్వప్రయోజనం మనసులో ఉంచుకుని నేనిలా మాట్లాడుతున్నానని మీరనుకోవచ్చు. కానీ నేనంతటి వెర్రివాణ్ణి మాత్రం గాను. మీలాంటి ఉద్యోగి కావాలనుకుంటే, ఇతర పూచీలు, పేచీలు లేకుండా అకౌంటు పెట్టుకునే దుకాణాలు వెయ్యి ఉన్నాయి. ఆ వెయ్యింటిలో మాదొకటని మాత్రం మీరు భావిస్తే చాలు."

మేము నిల్చున్న పేవ్‌మెంటు కెదురుగా రోడ్డు కటువైపున ఉన్న బట్టల కొట్టులో విద్యుద్దీపాలు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. వ్యాపారం ముమ్మరంగా సాగుతోంది. నగ్న సౌందర్యాన్ని ప్రస్ఫుటం చేస్తున్న పాముకుబుసంలాంటి తెలివలువల వల్లెవాటులో నిండుసైజు రబ్బరు బొమ్మలు అద్దాల బీరువాల్లోనుంచీ చిరునవ్వులు వెదజల్లుతున్నాయి. కానీ చూడగానే నన్నాకర్షించింది ఆ రబ్బరు బొమ్మల సోయగం మాత్రం కాదు. దుకాణంలో ప్రొప్రయిటరు స్థానంలో కూర్చుని ఓ యువకుడు హావ భావాలతో, హస్త చాలనాలతో వ్యాపారంపైన అజమాయిషీ జరుపుతున్నాడు. ఆకారంలో అన్నదమ్ములకు కొన్ని పోలికలుండటం సహజమే! కానీ ఆ యువకుడు ముమ్మూర్తులా విశ్వపతిని పోలి ఉన్నాడు. క్రాపింగులోనూ, మీసకట్టులోనూ ఉన్న కించిత్తు విభేదాన్ని విస్మరిస్తే అతడు విశ్వపతికి నిలువుటద్దంలో కనిపించే ప్రతిబింబమేననుకోవచ్చు.

"ఏమిటో పరిశీలనగా చూస్తున్నారు" అన్నాడు విశ్వపతి.

"మరేంలేదు. మీ తమ్ముడు అచ్చంగా మీలాగే ఉన్నాడు" అన్నాను.

"ఓహో, అదా?" విశ్వపతి పెద్దపెట్టున నవ్వసాగాడు. "మీరుగూడా పొరబడక తప్పలేదన్నమాట! తమ్ముడు కాదండోయ్ రంగనాథమ్‌గారూ? వాడే మా పెద్దబ్బాయి – అంటే జ్యేష్ఠ పుత్రుడన్నమాట!"

నేను నివ్వెరపడిపోయిన మాట వాస్తవం! ఎంతలేదన్నా దుకాణంలో ఉన్న ఆ యువకుడికి ముప్ఫై యేళ్ళకు తక్కువుండదు. ఆ ముప్ఫైకి మరో ఇరవై కలుపుకుంటే విశ్వపతి అయిదు పదులు దాటినవాడు. కానీ కాలం అతడి ఆకృతిపైన తన ముద్రల్ని

వేయడం ఏనాడో మానుకున్నట్టుంది. ఏ పది పదిహేనేళ్ళకు మునుపో వయసు ఆగిపోయి, అప్పటినుంచీ నిరంతర యౌవన సౌభాగ్యం చేత అనుగ్రహింపబడినట్టున్నాడు విశ్వపతి.

"కాసేపు కొట్టులో కూచుందామంటారా రంగనాధంగారూ! హాయిగా కూచోవచ్చు. కానీ ఏ మాత్రం తామసించినా మీకే ఇబ్బంది..."

'ఇబ్బందా? నాకు!"

"కాదా మరి! మా ఊరి హోటళ్ళలో ఎనిమిదిన్నరకల్లా భోజనాలు ఖాళీ అయిపోవడం మామూలు..."

"నిజమే! నా అవసరాలను గురించి నాకంటే మీకే బాగా తెలిసినట్టుంది" అన్నాను నవ్వుతూ.

కొంతదూరం వరకూ మా ఇద్దరి మధ్య మౌనమే ఆవహించింది. గడచిపోయిన ఒకటి ఒకటిన్నర గంటల వ్యవధిలో విశ్వపతిని గురించి కొన్ని వివరాలు తెలిశాయి. ముఖ్యంగా అతడు నాతో సమవయస్కుడన్న నా అభిప్రాయం పొల్లయిపోయింది. రెండో విషయం – నేననుకున్నట్టుగా అతడు మధ్యతరగతి కుటుంబీకుడుగాడు. బజారు వీథిలో దర్జాగా సాగుతున్న జవుళి వ్యాపారం సమాజంలో అతడి స్థాయిని చెప్పకనే చెబుతోంది. మీదు మిక్కిలి ఎదుటివాడి ఔదార్యమూ, సౌజన్యమూ నా పాలిటికి అతడి స్వప్రయోజనంలా కనిపించింది. సారాంశమేమిటంటే మనుషులపైన నిర్ణయాలు తీసుకునే విద్యలో నాకు ఓనమాలైనా రావని విశదమైంది!

విలంబనం జరగకుండా ఎవరికి సమర్పించుకోవలసిన కాంప్లిమెంట్లు వారికి సమర్పించుకోవడం మంచిది! ఆ పనే చేశాను.

"మీకు మీ అంతటి కుమారుడున్నాడు. ఆపదలో ఆదుకున్న పుణ్యంలా సకాలంలో కలిగిన సంతానంవల్ల తల్లిదండ్రులకు వృద్ధాప్యంలో సుఖసంతోషాలు లభిస్తాయి. ఆ విధంగా మీరు చాలా అదృష్టవంతులు..."

"అలాగైతే పనిలో పనిగా మరొక విషయం చెప్పాలి మీకు! నా అంతటి వాణ్ణి చూచారుగదూ! నన్ను మించిన కుమారుడుగూడా ఉన్నాడు. వీడు సత్యమైతే వాడు సుందరం! కోరమీసాలవాడు, నిక్కిన భుజాలవాడు, మూరెడు వెడల్పు ఛాతీవాడు, మెలితిరిగిన కండలతో వస్తాదులాంటి వాడు ఈ ఊళ్లో మీకెక్కడైనా కనిపిస్తే వాడే సుందరమని మీరనుకోవచ్చు. మిట్టబజారులో బియ్యం మండీ వాడిది. నెలకింత బియ్యం కావలసి ఉంటుందని మీరు మండీలో ఒక మాటు చెబుతే చాలు, నిర్ణయించిన తేదీన బియ్యం మీ ఇంటిలో ఉంటుంది..."

విశ్వపతి సహాయానికెలా కృతజ్ఞత చెప్పుకోవాలో తోచడంలేదు.

గమ్యస్థానం ఎదుటకు వచ్చేసరికి విశ్వపతి హోటలు నివాసం మానవుడికేమంత సుఖప్రదంగాదన్న విషయంపైన మాట్లాడుతున్నాడు – హోటలు భోజనం నాలుకకు ఇంపితం గాదు. అక్కడి గదులు నల్లులకు నాట్యమందిరాలు. వీలైనంత తొందరగా కాపురాన్ని తెచ్చుకోవడం మంచిది. అసలు వీలు కావడానికేముంది? ఇల్లు కుదిరితే చాలు. ఆ డిపార్టుమెంటు మూడో వాడిది. వాడిపేరు చంద్రం. పట్టణంలో ఎక్కడెక్కడ ఇళ్లు ఖాళీగా ఉన్నాయో వాడికి క్షుణ్ణంగా తెలుసు.

"మిమ్మల్ని కలుసుకోమని వాడితో చెబుతాను. మరింక నాకు సెలవిప్పిస్తారా రంగనాథంగారూ! గుడ్‌నైట్..."

జడివాన వెలిసినట్టుగా విశ్వపతి మాయమైపోయాక గూడా చాలాసేపటివరకూ అతడి మాటలే చెవుల్లో మారుమ్రోగుతూ ఉండిపోయాయి. అతణ్ణి గురించిన తలపులు తుమ్మెదల ఝుంకారంలా తలచుట్టూ ముసురుకోసాగాయి. ఓ గంటసేపు పరిచయం కలిగిన వ్యక్తిని గురించి తానొక కథ వ్రాయగలనని ధీమాగా చెప్పుకున్నాడు సోమర్సెట్ మాహం! ఊహించి ఓ కథనల్లడం దానంతటది దుస్సాధ్యమైన విషయమేమీ కాదు. కానీ అల్లిన కథ వాస్తవానికెంత దగ్గరగా ఉంటే అంతగా రచయిత తన ప్రయత్నంలో సఫలీకృతుడైనట్టు భావించవచ్చు. అలాగైతే దొరికిన ఆధారాలతో నేను విశ్వపతి జీవితగాథ నెందుకు సంగ్రహంగా ఊహించుకోగూడదు? – సామాన్య కుటుంబంలో పుట్టి ఉంటాడు విశ్వపతి. స్వప్రయోజకత్వంతో ఆస్తిపాస్తులు గడించాడు. కొడుకుల్ని బాగా చదివించాడు. కుర్చీకి ఒడలు దత్తం చేసే పరాధీనపు బ్రతుకంటే విశ్వపతికి రుచించదు. అందుకనే కుమారుల్ని స్వేచ్ఛకు ఆస్కారమున్న వాణిజ్యంలో దింపాడు. మగవాడు జీవితంలో విజయాన్ని సాధించాడంటే, ఆ విజయానికి వెనుక అతడి అర్ధాంగి యొక్క విశిష్టమైన పాత్ర ఉండి తీరుతుంది. అనుకూల దాంపత్యం విశ్వపతికి భగవంతుడిచ్చిన వరం. ఇంగితాన్ని గుర్తించి వర్తించే అర్ధాంగి గీచిన గీటు దాటని కుమారులు. వడ్డించిన విస్తరిలాంటి జీవితం. మానవుడి కింతకంటే కావలిసిందేముంది?

ఆలోచనలనుండి విడివడిన తరువాత ఎప్పుడు నిద్రపట్టిందో తెలియదు. ఇంకా తెల్లవారక మునుపే తలుపు పైన ఎవరో బాదుతున్నట్టుగా సవ్వడి వినిపించి నిద్రలేచాను. ఆగంతకుడొక ఇరువదేళ్ళ యువకుడు. తలుపు తెరిచేసరికి ముకుళిత హస్తుడై సిద్ధంగా ఉన్నాడు–

"నమస్కారమండీ! రంగనాథంగారంటే మీరే కదూ?"

అవునన్నాను.

"నాన్నగారు చెప్పారు, మీకో ఇల్లు కావలసి ఉందని! నా ఎరుకలో రెండు మూడిళ్ళున్నాయి. జండామాను వీధిలో ఉన్నదైతే మీ ఆఫీసుకు చాలా దగ్గర. కానీ అది అచ్చంగా ఇల్లుగాదు. ఒక పెద్ద హాలు. పిట్టగోడలతో దాన్ని మూడు గదులుగా విభజించారు. భోజనాలకు ఒకటి. రెండోది స్టోరు రూము. మూడోదానిలో పడుకోవచ్చు. ఆ ఇల్లు మీకు నచ్చకపోతే కోనేటి గట్టున వినాయకుడి గుడిప్రక్కన ఓ ఇల్లుంది. ఇల్లు చాలా పెద్దది. అందులో నాలుగు వాటాలున్నాయి. మిగిలిన వాటాల వాళ్ళతో సర్దుకోగలిగితే అక్కడ కావలసిన సదుపాయాలన్నీ ఉన్నాయి..."

"ఇంతకంటే మంచి ఇళ్ళు దొరకవా అబ్బాయ్?" ప్రశ్నించాను.

"వేడుక కొద్దీ వెలకదండీ మరి! అద్దెకాస్తా ఎక్కువగా చెల్లించుకుంటే సరి. సినిమాలో సెట్టింగులలాంటి ఇళ్ళున్నాయి. రెండు గదులు, ఓ హాలు, ముందర వసారా, వెనుక బాత్‌రూము, వంటగది, పెరడు, చేదబావి..."

"బాబ్బాబూ, మరిన్ని వివరాలెందుకు! అలాంటి ఇల్లు కుదిర్చి పెడితే చాలు. అద్దె కాస్తా ఎక్కువైనా పరవాలేదు.."

"ఏమంత ఎక్కువగాదు. యాభై రూపాయలకు అయిదో పదో ఎక్కువగావచ్చు. మాదాగుడి దగ్గర నిలబడి మంగతాయారమ్మ గారని అడిగితే ఎవరైనా చెబుతారు. ఆవిడే ఇంటావిడ! స్వయంగా వచ్చి ఇల్లంతా చూపెడుతుంది. బుగ్గలు పుణికి 'బంగారు నాన్నవుగదూ! నీ కోసమే ఈ ఇల్లు కట్టించాననిగూడా చెబుతుంది..."

"చాలా థేంక్స్ అబ్బాయ్! ఇల్లు కుదిరేదీ, కుదరక పోయేదీ వేరే మాట! కానీ తోడివారిపైన ఇంతగా అక్కర, మక్కువ చూపించే వాళ్ళు మాత్రం ఎక్కడో అరుదుగా గానీ కనిపించరు..."

"మన్నించండి మేష్టారూగారూ! ఇందులో పెద్దగా పరోపకారమని చెప్పదగిందేమీ లేదు. అంతా బిజినెస్సు! మీకోసం ఈ కబురు తెచ్చానేమో, అద్దె సెటిల్ చేస్తానేమో మంగతాయారమ్మ దగ్గర చెవులు పిండి నా కమీషన్ నేను వసూలు చేసుకుంటానేమో, జరిగేదంతే! అవతల నాకు చాలా పనుంది. మళ్ళీ రేపుదయాన్నే మీకు కనిపించడం..."

ఆ అబ్బాయి ఎంత హుటాహుటిగానైతే వచ్చాడో అంత హఠాత్తుగానే అంతర్ధానమై పోయాడు. పనిగట్టుకుని నాకోసం ఇంత దూరం వచ్చినవాడికి ఓ కప్పు కాఫీ ఇచ్చి పంపడం న్యాయమన్న సదుద్దేశం భావంలోనే జీర్ణంగాక తప్పింది గాదు. ఒకవైపు ఇంకా తెల్లవారకమునుపే తనకేవో తొందరపనులున్నట్టు చెబుతున్నాడతను! పట్టణమంతా చెడదిరిగి ఎక్కడెక్కడ ఏయే ఇళ్ళు ఖాళీగా ఉన్నాయో తెలుసుకోడమే కాదుగదా అతని బిజినెస్సు!

పరధ్యానంగా రోడ్డు వైపు కిటీకి తెరిచాను. సందేహాల కన్నింటికీ సమాధానం చటుక్కున స్ఫురించింది.

వెనుక సీటుపైన ఇనుప దబ్బల చట్రంలో పాలడబ్బాలున్న సైకిలుపైన కూర్చుని నగర వీథిలో శరవేగంతో పయనించిపోతున్నాడు చంద్రం, విశ్వపతిగారి మూడో అబ్బాయి!

రోజులు గడచి పోతున్నాయి. మంగతాయారమ్మగారింట మేము కాపురం పెట్టిగూడా నెలరోజులు దాటింది. క్లబ్బుకు వెళ్ళొస్తున్నప్పుడల్లా బట్టల కొట్టులో విశ్వపతిగారి పెద్దబ్బాయి సత్యం కనిపిస్తున్నాడు. బియ్యంకోసం నేను మిట్టబజారుకు వెళ్ళకపోయినా, విశ్వపతి వర్ణించి చెప్పిన రూపరేఖా విలాసాలతో వస్తాదులాంటి సుందరంగూడా అప్పుడప్పుడూ వీథుల్లో తారసిల్లుతున్నాడు. ఇక చంద్రం సంగతి సరేసరి! ప్రతిరోజు ఉదయమూ ప్రప్రథమంగా అతని దర్శనం తప్పనిసరి! మునుపటికెప్పుడో లోకాన్ని నిద్రలేపే సత్కార్యాన్ని కోళ్ళు, పక్షులు, మందమారుతాలు నిర్వర్తించేవని వినికిడి! ఇప్పుడు పట్టణాల్లో సదరు కార్యాన్ని నిర్వర్తించేవి సైరన్లు, పాల సైకిళ్ళు!

గడచిపోయిన అధ్యాయంలో ఒకచోట కనిపించి తనను విస్మయ చకితం చేసిన పాత్రయొక్క పునరాగమనంకోసం కుతూహలంతో వేచి ఉండడం పాఠకుడి స్వభావం. ఎంతకూ ఆ పాత్ర కథలోకి రాకపోతే పాఠకుడికి కొంత నిరుత్సాహం తప్పదు. విశ్వపతి విషయంలో నాకలాంటి ఆశాభంగం వాటిల్లిన మాట నిజం! వాతావరణంలో పుట్టి, వాతావరణంలో కరిగిపోయే ఇంద్రధనస్సులా అతడారోజు క్లబ్బు దగ్గర కనిపించడమే కనిపించడం, హోటలు దగ్గర విడిపోవడమే విడిపోవడం!

వాకబు చేసి అతడి ఆచూకీ తెలుసుకోవాలన్న ఉద్దేశం కలగకపోలేదు. చంద్రాన్ని అడిగితే చెప్పకపోదుగదూ! కానీ అతడు తొలికోడికి తోడల్లుడు! నిద్రాసుఖం బాగా తెలిసిన పెద్దమనిషి ఒకాయన తెల్లవారుజామున కలకంఠి కూసినా సరే, తనకు దాన్ని మెత్తగా మందలించాలన్న బుద్ధి కలుగుతుందన్నాడు. ఆ వేళప్పుడు పడకను వదిలిపెట్టి, లేచి వీథిలోకి వెళ్లేపాటి ఓపిక ఎవరికుంటుంది?

ఉగాదికి బట్టలు కావలసి వచ్చి బజారుకు వెళ్ళాను. ప్రత్యేకించి నేను విశ్వపతిగారికొట్టునే అభిమానించవలసిన అవసరమేమీ లేదు. కానీ అతడే చెప్పినట్టుగా ఉన్న వెయ్యి దుకాణాల్లోనూ వాళ్ళదిగూడాఒకటి. ఎందుకు వెళ్ళగూడదు? వెళ్ళాను. నేనెవరినో తెలియకపోయినా, ఒక క్రొత్త ఖాతాదారును తన ప్రభావం క్రిందికి తెచ్చుకోదలచే వ్యాపారస్తుడుగా తన పాత్రను చక్కగా నిర్వహించాడు సత్యం! తెలిసిన తరువాత మరింత గౌరవాన్ని ప్రకటిస్తూ చల్లగా డ్రింక్స్ తెప్పించాడు. 'మొదట బట్టల ఎన్నిక. వెల సంగతి తరువాతి మాట' అన్నది అ అంగడి 'మాటో' యేమో నాకు తెలియదు. బట్టలన్నీ ఎన్నికై పార్సెల్ తయారవుతుండగా అతడు బిల్లుపైన అంకెల గారడీ ప్రారంభించాడు. 'ఇతరులకైతే ఇదీ రేటు. కానీ మీకీ వెలకే ఇస్తున్నాను' అంటూ ప్రతి బట్టపైన రెమిషన్ చూపించాడు. బిల్లు క్రింద షరాలాగా చిట్టచివర కొన్ని మాటలు గూడా చెప్పుకున్నాడు – "డబ్బు ఇప్పుడే ఇవ్వాలన్న నియమమేమీ లేదు. ఎప్పుడు వీలైతే అప్పుడే ఇవ్వవచ్చు. మీబోటి వాళ్ళ దగ్గర నిక్కచ్చిగా వ్యవహరించడం మా వ్యాపార లక్షణం గాదు."

ఊరికి క్రొత్తవాణ్ణి గనుక ఇప్పుడిప్పుడే అకౌంట్లు పెట్టించుకోదలచలేదని క్షమాపణ చెప్పుకున్నాను. బిల్లు చెల్లిస్తూ "నాన్నగారితో నాకొకసారి పరిచయం కలిగింది. రెండు మాసాల క్రిందటి మాట! ఆ తరువాత ఆయన్ను కలుసుకునే అవకాశం లభించింది కాదు" అన్నాను.

"అలాగా!'' అన్నాడు సత్యం. కొంతసేపు మౌనం వహించి, తరువాత కొనసాగించాడు – "ఆయన వెయ్యిళ్ళ పూజారి. ఈరోజు ఇక్కడుంటే రేపెక్కడుంటాడో చెప్పలేము. ఈ దేశం చాలా పెద్దది. ఎక్కడో ఒకచోట తేర్లు తిరణాలలు, ఇంకా రకరకాల వినోదాలు జరుగుతుంటాయి. అక్కడల్లా ఆయన హాజరు!"

ప్రయోజకులైన బిడ్డలున్న తండ్రికి ఆ మాత్రం దేశం తిరిగే వెసులుబాటుండడం న్యాయమే! విశ్వపతి అడిగి వచ్చిన అదృష్టంలో ఇదీ ఒక చిన్న విభాగమేమో!

ఉగాది పండుగ వచ్చి వెళ్ళింది. అనుదిన వ్యాసంగాల అలజడిలో పాత జ్ఞాపకాలను మననం చేసుకోడానికి వ్యవధి చాలడం లేదు. విశ్వపతిని గురించి తలపెట్టడం దాదాపుగా మానుకున్నాననే చెప్పవచ్చు. ఒకప్పుడు లైబ్రరీలన్నీ గాలించినా దొరకని పుస్తకం, కాలక్రమాన ఒక సందర్భంలో యాదృచ్ఛికంగా చేతికొచ్చినట్లుగా ఓరోజు సాయంకాలం నాలుగు రోడ్ల కూడలిలో ఎదురయ్యాడు విశ్వపతి.

"నమస్కారమండీ రంగనాథంగారూ! ఊరినుంచీ నిన్ననే వచ్చాను. రావడం నెల్లూరునుంచే ననుకోండి. అంతకుమునుపు సేలం వెళ్ళాను. అక్కడినుంచీ కోయంబత్తూరు. ఆ రెండు ఊర్లల్లోనే మాకు జవిళి కొనుగోలు. చేనేతచీరలకు, మంచి

గిరాకీ ఉందంటే నారాయణవనం వెళ్ళాను. ఎంతసేపూ కోకల సంగతే అయితే, ఇక నూకల సంగతేమిటని ఇంతలో మా సుందరం దగ్గరినుంచి తాఖీదు! సరే, ఛలో నెల్లూరనుకున్నాను. బియ్యం దొరికింది. రైల్వే వాళ్ళు వాగన్లు లేవన్నారు. లేని వాగన్లు పుట్టించడానికి విజయవాడదాకా వెళ్ళి రావలసి వచ్చింది..."

పిల్ల కాలువ గాదు, జీవనదిలాంటిది విశ్వపతి వాక్ప్రవాహం. అందులో పడి ఎంత దూరం కొట్టుకపోవలసి ఉంటుందో తెలియదు. కానీ అతడి వాగ్ధోరి మరీ అంత విశృంఖలంగా ముందు కురకడానికి వీల్లేకుండా ముగ్గురు పిల్లలతణ్ణి వెన్నంటి ఉన్నారు. ఇద్దరు మగపిల్లలు. ఓ అమ్మాయి.

"ఏమిటో చూస్తున్నారు. వీళ్లెవరనేనా రంగనాథంగారూ! ఇది మా ఎలిమెంటరీ స్కూలు బలగం! వీడు చలపతి. అయిదోక్లాసు. వీడు గోపీకృష్ణ మూడో తరగతి. ఇదేమో సరళ. లెఖ్ఖలు నేర్చుకుంటోంది. హమేషా ఊళ్ళు తిరుగుతుంటానా, వీళ్ళకు నేను కనిపించడమే అబ్బురం! బెల్‌కాగానే బయటి కొచ్చారేమో, రోడ్డుపైన నేను ప్రత్యక్షమయ్యాను. ఇక చూచుకోండి తమాషా! చాక్‌లెట్లు కావాలని ఒకరు. రబ్బరు బంతి కావాలని ఒకరు. రిబ్బను కొనిపెట్టమని ఒకరు..."

కోరికల్ని వెల్లడించడంలో మాత్రమే గాదు, వాటిని సాధించడంలోగూడా ఆ పసిపిల్లలు నిష్ణాతులుగానే కనిపిస్తున్నారు. తనకు చాక్లెట్లు కొనివ్వకపోతే బిగ్గరగా ఏడ్చేయగలనని అల్టిమేటమ్ జారీ చేశాడు గోపీ. చేతులతో నాన్నగారి కాళ్ళను పెనవేసుకుని అడుగు ముందుకు వెయ్యకుండా అడ్డు తగులుతోంది సరళ. రెండాకులెక్కువ మేసినవాడే రెండో అబ్బాయి. నాన్నగారి జేబులో చేయివేసి చిల్లరడబ్బులు గుంజుకోడానికి వాడు శాయశక్తులా ప్రయత్నిస్తున్నాడు.

"ఉండండి రంగనాథంగారూ! ఓ నిమిషం. ఇప్పుడే వస్తాను" అంటూ అంగడివైపు వెళ్ళబోతున్నాడు. విశ్వపతి.

అప్పుడొక విచిత్రం జరిగింది.

ఉన్నట్టుండి చలపతి ఎందుకో ఉలికిపడ్డాడు. వాడి కళ్ళల్లో భయం తెరలు తెరలుగా కదలాడింది. "అన్నయ్యరా! గోపీ! అన్నయ్య" అంటూ వాడుపరుగు లంకించుకున్నాడు, వాడి వెనువెంట గోపీ, వాడి అడుగుజాడల్లో సరళ.

వెనుదిరిగి రోడ్డువైపు చూచాను. ద్విచక్ర శకటారూఢుడై ఎక్కడికో వెళ్తున్నాడు సత్యం.

"చూచారా రంగనాథంగారూ! ఇదీ వరస. అన్నగారంటే గుండెల్లో జ్వరం వీళ్ళకు. చీటికీ మాటికీ వీపు చదును చేస్తుంటే భయపడక ఏం చేస్తారు పాపం! అన్నట్టు మనం కలిసి చాలా రోజులైంది. వెళ్ళి క్లబ్బులో కూర్చుంటే కాసేపు మాట్లాడుకోవచ్చు..."

నాకూ పిచ్చాపాటీ మాట్లాడుకోవాలనే ఉంది. కానీ ఇంటిదగ్గర తొందర పనులుండిపోయాయి. బంధువుల ఆగమనం. గుడికి వెళ్ళాలన్న నిర్ణీత కార్యక్రమం. సమయానికి ఇల్లు చేరుకోకపోతే శ్రీమతిగారి ధాంధూములు. సహేతుకంగా సంజాయిషీ చెప్పుకున్నాను.

"అలాగైతే మీరొక పని చెయ్యండి. ఈరోజు శుక్రవారం. ఆదివారం రాత్రికి మీరు మా ఇంటికొచ్చి నా ఆతిథ్యం స్వీకరించాలి. ఎప్పుడో జరగవలసిందిది. ఈమధ్య నేను ఊళ్లో లేకపోవడంవల్ల ఇంత ఆలస్యం జరిగింది. మరచిపోతారా రంగనాథంగారూ!"

"మరచిపోవడానికి నాకంతకంటే గొప్ప కార్యాలేమున్నాయి? ఈ రోజుల్లో డబ్బిచ్చినా దొరకనిది ఆదరం. మీ ఆదరాన్ని, సహాయాన్ని నేనెలా మరచిపోగలను! మీరు చంద్రంతో ఒక మాట చెప్పారట! అతడేగనుక పూనుకోకుంటే అంత సులభంగా అలాంటి నివాసయోగ్యమైన ఇల్లు మాకు దొరికేదిగాదు. అంతేగాదు. ఇదివరకూ మేము తెల్లనివన్నీ పాలేననుకున్న వాళ్ళం. ఇప్పుడు చంద్రం మూలంగా అప్పటమైన పాలంటే ఏమిటో తెలుసుకోగలిగాము. మీ కుమారుడి సంగతి మీకు తెలిసి ఉండదనుకోను గానీ, చంద్రం చాలా చురుకైన అబ్బాయి..."

"కాదామరి?" అందుకున్నాడు విశ్వపతి.

"ఇంటింటికీ తిరిగి పాలమ్ముకోడం అదొక హీనమైన పనిగా కొందరు భావిస్తారు. అది మా అంతస్థుకు తగిన పనిగాదని బంధువులు కొందరు మూతులు ముడుచుకున్నారు గూడా. కానీ కాయకష్టంపైన నాకెంతో గౌరవం ఉంది. చంద్రాన్ని పిలిచి 'ఇది నీ వృత్తి' అన్నాను. అన్నాను గనుకనే ఈనాడు వాడు అన్నగార్లపైన ఆధారపడకుండా తనూ ఒక మనిషయ్యాడు. అశ్రమంగా నెలకు రెండు వందల రూపాయలు సంపాదిస్తున్నాడు."

చీలిపోవలసిన చోటు వచ్చింది. "మరైతే నేను వెళ్ళొస్తానండీ విశ్వపతిగారూ!" అంటూ సెలవు తీసుకోడానికి ఉద్యుక్తుడినయ్యాను.

"మరైతే బంధువులెవరో వచ్చారన్నారు గదూ! వెళ్ళండి. అన్నట్టు మా ఇల్లెక్కడో ఎరుగుదురా రంగనాథంగారూ! గుండూరావువీధి. డోర్ నంబరు నలభై నాలుగు..."

ఆదివారం రానేవచ్చింది. అతిథికీ దేవుడికీ సమాన ఫాయిదా ఇచ్చే దేశమే అయినా, ఆ అతిథిగూడా కొన్ని ప్రాథమిక నియమాలు పాటించడం లెస్స. అందుకనే మరింత ఆలస్యం చేయకుండా రాత్రి ఎనిమిది గంటలకల్లా గుండూరావు వీధిలో నలభై నాలుగో నెంబరు ఇంటి ముంగిట హాజరయ్యాను. నాలుగైదుసార్లు ఎలుగెత్తి పిలిచిన తరువాత "ఎవరూ, ఎవరూ" అంటూ విశ్వపతి వెలుపలికి వచ్చాడు. "మీరేనా రంగనాథంగారూ! వచ్చేశారన్నమాట! చాలా సంతోషం! మాట నిలబెట్టుకోడం మంచివాళ్ళ పద్ధతి" అంటూ కతిపయ ద్వారాలు దాటించి లోపలికి తీసుకెళ్ళాడు. చిన్న హాలులాంటి పెద్ద గదిలో కూర్చోబెట్టాడు. పదిహేనేళ్ళ కుర్రవాడొకడు, వాడికంటే ఒకటి రెండేళ్ళు చిన్నదైన అమ్మాయి ఒకతె ఆ గదిలో చదువుకుంటున్నారు. పైకప్పు నుంచీ వ్రేలాడుతున్న ఊయల్లో చంటిపాప నిద్రపోతోంది. చీర చెరగు రెపరెపవల్ల నైతేనేమి, గాజుల గలగలలువల్ల నైతేనేమి ఆ ఇంటి గృహిణిగూడా చుట్టు ప్రక్కల ఎక్కడో నడయాడుతున్న జాడలు స్ఫురిస్తున్నాయి. కానీ ఒకానొక అతిథి సత్తముడి రాకకోసం అక్కడెవరూ నిరీక్షిస్తున్న సూచనలు లేవు. అవాంఛనీయమైన సంఘటనను దేన్నో మూకీభావంతోనే ఎదుర్కొంటున్నట్టుగా వాళ్ళెవరి పనుల్లో వాళ్ళున్నారు. గదిలో నెలకొన్న స్తబ్ధతను చీల్చి చెండాడడానికి వీలైనంతలో విశ్వపతి ఏవో కొన్ని యత్నాలు చేస్తున్నాడు.

"ఈ గోడ గడియారముంది చూచారూ, ఇది కొని నలభై యేళ్ళయింది. అప్పుడు నాకు పన్నెండేళ్ళు. నాన్నగారికీ చింతపర్తి పాళేగారికి చెప్పరానంత స్నేహం. ఒకసారి పాళేగారికి గవర్నరు దగ్గరనుంచీ పిలుపొచ్చింది. ఆయనకు ఇంగ్లీషు రాదు. దుబాసీగా ఉండటానికని నాన్నగారిని వెంటబెట్టుకున్నారు. అక్కడ మోర్ మార్కెట్టులో ఈ గడియారాన్ని కొనడం జరిగింది. కొన్న వెల పదిహేను రూపాయలు. ఈ డిజైన్లు అవీ చూచి ఇది మ్యూజియంలో ఉంచదగినదని ఇటీవల నూట యాభై రూపాయలదాకా అడిగారు..."

ఇంతలో చంటిబిడ్డ ప్రక్కకు దొర్లడంతో ఊయల కదిలింది. కదిలిన ఊయలతో బాటుగా విశ్వపతి ప్రసంగం గూడా మలుపుతిరిగింది.

"– అది అచ్చి వచ్చిన ఊయల. తొలిచూలు బిడ్డ పుట్టినప్పుడు దీన్ని మాతామహులు కొనిచ్చారు. పుట్టిన బిడ్డను అందులో పడుకోబెడితేచాలు, మందులూ మాకులూ బొత్తిగా అనవసరం! బాలారిష్టాలు, గ్రహబాధలు దరిదాపులకైనా రావు..."

"పాలుగూడా పట్టనవసరంలేదా నాన్నా?" చదువుకుంటున్న కుర్రాడు తల పైకెత్తి అమాయకంగా ప్రశ్నించాడు.

అవకాశం కోసం ఎదురు చూస్తున్న వాడిలా విశ్వపతి విరగబడి నవ్వసాగాడు. "చూచారా రంగనాథంగారూ! కొన్ని విషయాల్లో ఎంతో అమాయకుడు వీడు కానీ చదువులో మాత్రం అమోఘమైన తెలివితేటలు. క్లాసుకంతా తానే ఫస్టు. మరైతే మా శారద సంగతంటారా, చదువుమాటకేంగానీ ఆ పిల్లకు సంగీతమే అరోప్రాణం. కొత్త రికార్డు వెలువడిందనుకోండి – వినడమూ, నేర్చుకోడమూ ఒక్కటేసారి..."

వంటగదిలోనుంచీ బిందెలు చెంబులు పరస్పరం పలకరించుకున్నట్టుగా చప్పుడు వినిపించింది. హఠాత్తుగా ఏదో విషయం జ్ఞప్తికి వచ్చినట్టు విశ్వపతి లేచి లోపలికి వెళ్ళిపోయాడు.

అయిదు నిమిషాలు నిశ్శబ్దంగా దొర్లిపోయాయి. క్లాసుకంతానే ఫస్టయిన హైస్కూలు విద్యార్థి చదువుకోడం ముగించి పుస్తకాలు సర్దుకుంటున్నాడు. పరిసరాలలో కాస్తా సంచలనం లేవదీసే బాధ్యత ఒక్క గృహస్థుడిదేనని ఎందుకనుకోవాలి? అతిథి మాత్రం ఆ పని ఎందుకు చేయగూడదన్న ఉద్దేశంతో "ఇదిగో అబ్బాయ్! మంచి పాట విని చాలా రోజులైంది. మీ చెల్లెల్ని ఒక పాట పాడమనరాదూ" అన్నాను.

"పాడతావా శారదా!" అబ్బాయి దీనంగా అడిగాడు చెల్లెల్ని.

ఆ అమ్మాయైతే ఏడుపు మొగమే పెట్టేసింది. "నాకు పాడటం చేతగాదండీ మేష్టారూ! మా నాన్నగారికలా చెప్పుకోడం ఓ సరదా! అన్నయ్యగూడా క్లాసుకి ఫస్టేమీ గాదు–"

ఈసారి దిగులు పడిపోవలసిన వంతు నాకే వచ్చింది. ఉన్నది లేనట్టుగా, లేనిది ఉన్నట్టుగా జీవితాన్ని అదొక మయసభలాగా రచించుకోడానికి మానవుడు పడుతున్న అవస్థల్ని తలచుకుంటే ఎవరికైనా దిగులే కలుగుతుంది. అబద్ధానికి మారువేషం వేసి నిజంగా తోపింపజేసే ప్రయత్నం అగడ్తపైన పుల్లలతో పందిరివేసి నిజంగా దానిపైన నిల్చోడంలాంటిది. పుల్లల పందిరి ఏ క్షణాన్నయినా విరిగిపోక తప్పదు. మరుక్షణాన ఏమవుతుంది?

అరగంటసేపట్లో తిరిగి వచ్చాడు విశ్వపతి. ఒంటరిగా కాదు. విలంబనం జరిగినందుకు ఓ కారణాన్నిగూడా వెంటబెట్టుకొచ్చాడు – "మన్నించండి రంగనాథంగారూ! రాత్రి భోజనానికి ముందుగా స్నానం చేయడం నా అలవాటు. ఆ పనిలో ఉండిపోయాను. అదీగాక మా ఇంట్లో భోజనాలకు ఒక నిర్ణీత సమయమంటూ లేదు. పసివాళ్లు ఏడు గంటలకల్లా అన్నాలు తిని ఎనిమిదింటికే నిద్రపోతారు. పెద్దవాళ్ళు ఏ తొమ్మిదికో పదికోగానీ ఇంటికి రారు. పాపం, ఈ వేళ మీ భోజనానికి ఆలస్యమైందేమో...!"

మరేం ఫరవాలేదు లెమ్మని విశ్వపతిని వెంబడించాను. భోజనాగారంలో కనిపించిన దృశ్యం నాకించుక ఆశ్చర్యాన్నే కలిగించింది. పెద్దపెద్ద హోటళ్లలో ఎవరి కాఫీ వాళ్లు కలుపుకోడం మన ఎరుకలోని విషయమే! కానీ ఆడవాళ్ళున్న లోగిళ్లలో – ఆ ఉన్నవాళ్ళు ఘోషా స్త్రీలయితే తప్పా – ఎవరి భోజనం వాళ్లు వడ్డించుకోడం అపూర్వమైన అనుభవం! పీటల కెదురుగా విస్తర్లలో వడ్డించి ఉన్న సిద్ధాన్నం మాకోసం ఎదురుచూస్తోంది. గిన్నెల్లోకూరా చారూ పచ్చళ్లూ మజ్జిగలాంటి సాధకాలు, కూజాలో మంచినీళ్ల అన్నీ చేతి కందుబాటులో సిద్ధంగా వున్నాయి.

"ఇదీ నా భోజనాల ఏర్పాటు. ఆడవాళ్లు మాటిమాటికీ వడ్డనలో జోక్యం పెట్టుకోడం నాకు సరిపడదు..."

మౌనంగా భోజనం చేయడానికి ఉపక్రమించాను. విశ్వపతి చెబుతున్నాడు – "ఇలా చేయడవల్ల మొగమాటాలకు ఆస్కారం ఉండదు. వద్దు వద్దన్నా ఆకు నిండుగా వడ్డించటం, మాటవరసకు వద్దు లెమ్మని చెబితే చెప్పిందే చాలుననుకుని గిరుక్కున వెనుదిరిగి వెళ్లిపోవడంలాంటి అవకతవకలుగూడా జరగవు. ఏమంటారు. రంగనాథం గారూ!"

"ఎంతటి చిన్న విషయాన్ని గురించైనా మీరు సున్నితంగా ఆలోచిస్తారు" అన్నాను.

నా ఆమోదముద్ర విశ్వపతికి అమందానందం కలిగించింది. ఆ ఆనందంలో అతడు గుమ్మంవైపు చూస్తూ, ఆ ప్రాంతాల్లో ఉందో లేదో నాకంతు దేలని అదృశ్యవ్యక్తిని నిర్దేశించి, "ఇదిగో, నిన్నే పిలవడం! ఒకసారి ఇలావచ్చి వెళ్లరాదూ!" అన్నాడు.

స్తంభించివున్న గాలి కదిలినట్టుగా ద్వారం దగ్గిరనుంచి యించుక అలికిడి వినిపించింది.

"చెప్పాను గదూ! వీరే రంగనాథంగారు. చూడ్డానికిలా నిరాడంబరంగా కనిపిస్తారంతే గానీ కారెక్కి తిరగ్గలిగిన హోదా ఆయనది! నెలకు అయిదు వందల రూపాయల జీతం..."

దిగ్భ్రమతో తల పైకెత్తి విశ్వపతివైపు చూచాను. ఆలోగా ద్వారం దగ్గర మసలుతున్న ఆకృతిగూడా అంతర్ధానమైంది. ఒకటి రెండు క్షణాలవరకూ నన్నలాగే ఆశ్చర్యపడనిచ్చాడు విశ్వపతి. ఆ తరువాత వింటి దబ్బులా నా చెవి దగ్గరకు వంగి "మీకు తెలియదులెండి రంగనాథంగారూ! ఆడవాళ్ల దృష్టిలో డబ్బును బట్టే మగవాడికి విలువ!" అన్నాడు.

గౌరవమూ, ఘనత లభించడమే అరుదు! లభించిన వాటిని విడనాడుకోడం అవివేకం! అయిదు వందల రూపాయల జీతగాడికి మల్లే మాటలు తగ్గించేశాను.

విజృంభించి వాతావరణంలోకి చెదరి పోకుండా నవ్వుల్ని పెదవుల కత్తెరతో ఎక్కడికక్కడ కత్తిరించి పారేశాను.

భోజనానంతరం నన్ను సాగనంపడంకోసం వీధి చివరిదాకా వచ్చాడు విశ్వపతి. చీకట్లు చిందులాడుతున్న మారుమూలగా ఎన్నికచేసి అక్కడ నన్ను నిల్చోబెట్టాడు. నిల్చోబెట్టి "మిష్టర్ రంగనాథంగారూ! అన్యథా భావించకపోతే మీ మూలంగా ఓ సహాయం కావాలి" అన్నాడు.

"చెప్పండి" అన్నాను.

అప్పుడు ప్రశ్నోత్తరాల రూపంతో విశ్వపతి నాకుపదేశించిన ఉపకారోపనిషత్తు యొక్క వైనాన్ని సంగ్రహంగా యిలా పేర్కొనవచ్చు:

పెద్దలేమన్నారు? ఈ శరీరం పరుల కుపకారం చేయడానికే నన్నారు. అలాగని ఏదో సహాయాన్ని అర్థించి ఉద్యోగుల్ని యిబ్బందుల్లో పెట్టడం భావ్యమా? కానేకాదు. మరైతే యిప్పుడలా ఎందుకడగ వలసి వచ్చింది? ఈ సహాయం తనకోసం కాదు గనక! ఎవరి కోసమైతే ఈ సహాయం కావలసి ఉన్నదో ఆ వ్యక్తి ఎటువంటి వాడు? తనకు ప్రాణస్నేహితుడు. (మొదటి క్వాలిఫికేషన్) చాలా మంచి వాడు (రెండోది) సదరు సహాయం యొక్క స్వరూపమెట్టిది? ఆ ప్రాణ స్నేహితుడొక యిల్లు కట్టదలచుకుని అందుకొక ప్లాను తయారుచేసి మునిసిపాలిటీకి పంపుకున్నాడు. మంచిది. పద్ధతి అదేగదా! కానీ మునిసిపాలిటీ వాళ్లు ఆ ప్లానును అంగీకరించారు కాదు. ఎందువల్ల? ఆ ప్లాను ప్రకారం యిల్లు కడితే యిల్లు మునిసిపాలిటీకి చెందిన ఖాళీ జాగాలో కొంత భాగాన్ని ఆక్రమించవచ్చునని అనుమానం కలగటం వల్ల! ఇందులో న్యాయవిరుద్ధమైనదేమీ కనిపించదే! కనిపించదుగానీ తు.చ తప్పకుండా సర్వకాల సర్వావస్థలా న్యాయాన్నే అనుసరించడమనేది ఎంతటి వారికైనా సాధ్యం కాదు. ఐతే యిప్పుడేం చేయాలని అభ్యర్థన? మరేం లేదు. మానేజరు హోదాలో ఒకమాట చెబుతే ఓవరుసీరు ఒప్పుకోక తప్పదు. ఆ పని తామే స్వయంగా చేసుకోవచ్చుగదా! చేసుకోవచ్చుగానీ ఆ ఓవరుసీరు అదొక రకం మనిషి. అంటే? – కాస్త చేయి సాచే రకమన్న మాట!

"సరేనండీ విశ్వపతిగారూ! మాట్లాడి చెబుతాను" అంటూ వీడ్కోలు పుచ్చుకున్నాను.

***

ఓవరుసీరు రామరత్నం ప్రవర్తన యెలాంటిదో నాకు సరిగ్గా తెలియదుగానీ మాటలు మాత్రం చాలా కచ్చితం. పిలిచి కుర్చీ యిచ్చి కూచోమన్నాను. కూర్చున్న తరువాత "రామరత్నంగారూ! ఓ చిన్న యిన్ఫర్మేషన్ కావాలి. చెబుతారా? అన్నాను.

"మీకు తెలీనిదా సార్! అడగండి" అన్నాడు రామరత్నం.

"నీలకంఠయ్య అన్న ఆసామి తాను కట్టుకోదలచుకున్న యింటికోసం మనకో ప్లాను పంపుకున్నాడు. కానీ అదెందుకో అప్రూవు కాలేదు..."

"ఎలాగౌతుంది? సాక్షాత్తు మునిసిపల్ ఛైర్మన్‌గారే పంపుకున్నా అది అప్రూవుగాదు. ప్రయివేటు ఆసామి ఒకడు మునిసిపాలిటీవారు చిల్డ్రన్స్ పార్కుకోసం అట్టిపెట్టిన జాగాలోకి వచ్చేట్టుగా యిల్లు కట్టుకుంటానంటే ఎవడొప్పుకుంటాడు?"

"ఈ విషయాన్ని గురించి పునరాలోచన చేయడానికి వీలుండదా రామరత్నం?"

"మన్నించండి సార్! మీరు సూటిగా చెప్పవచ్చు. కానీ డొంకతిరుగుడుగా చెబుతున్నారు. లోకంలో ఉన్న తెలివితేటలన్నీ తమ సొత్తేననీ ఎదుటివాళ్లందరూ తెలివితక్కువదద్దమ్మలనీ కొందరి భావం. మీ ద్వారా ఈ పని సానుకూలం చేసుకోదలచిన వాళ్లు నాపైన ఎలాంటి అభాండాలు మోపి ఉంటారో నే నూహించలేకపోను. మాటవరుసకు మీరు వాళ్ల మాటల్నే విశ్వసించారనుకుందాం. నిజమేనయ్యా, నేను లంచగొండిని! అలాగైతే ఆ పార్టీ నేరుగా నా దగ్గరకే వచ్చి నాకివ్వవలసిన లంచమేదో నాకిచ్చి తమ పబ్బం గడుపుకోవచ్చు గదా! అలా చేశారుకారు. ఎందువల్ల? ఇక్కడెవరూ అలాంటి ముదనష్టపు డబ్బులకోసం ఆశించేవాళ్లు లేకపోబట్టి! ఐనా యిప్పుడు జరుగుతున్న దేమిటి? నేను లంచగొండినన్న దుష్ప్రచారం. ఆ నీలకంఠయ్య యివ్వదలచుకున్న లంచాన్ని మధ్యలో తామే కాజేయడం ఒకటి. మన దగ్గర ఉచితంగా పనిచేయించుకోడం రెండు. మన ఉపకారానికి ప్రత్యుపకారంగా మనమే లంచగొండ్లమని ప్రచారం చేయడం మూడు. ఈ కపటనాటకం నటులకు దప్పితే ప్రేక్షకులకు అర్థం కాదని వీళ్ల ధీమా! నా దగ్గరికొస్తే నేను ముఖం వాచేటట్లుగా చీవాట్లు పెడతానని వాళ్లకు తెలుసు. అందుకనే యీ అడ్డుదారి. మిమ్మల్నీ, నన్నూగూడా అడుసులో త్రొక్కించడానికే ఈ ప్రయత్నం. వీళ్ల కనుకూలంగా ఉంటే నుయ్యి ప్రతికూలంగా ఉంటే గొయ్యి. ఎంత జాగ్రత్తగా ఉన్నా ముప్పును తప్పించుకోడం దుస్తరం. ఇది రెండేళ్ళ అనుభవంతో నేను నేర్చుకున్న గుణపాఠం మీకు సైతం ఉపకరించకపోదు..."

ఓ వైపు విశ్వపతి. మరోవైపు రామరత్నం. ఎవర్ని విశ్వసించాలో తెలియక అరగంటసేపు మౌనంగా కూర్చున్నాను. బహుశా యిలాంటి చిక్కు సమస్య ఎదురు గావడంవల్ల నేమో, ఓ కవివరుడు 'ఏది సత్యం, ఏదసత్యం, ఓ మహాత్మా ఓ మహర్షీ' అంటూ వాపోయాడు. గాజుబుడ్డీలో పోసివుంచిన ద్రవంలా మనిషిలో అంతర్గతమై ఉన్న అతడి స్వభావం కంటికి కనిపిస్తే ఎంతో బాగుండిపోవును. చిన్ననాడు పాఠశాలలో చూచిన వినోద ప్రదర్శనంలో మాంత్రికుడొక తమాషా చేసి చూపెట్టాడు. పెద్ద పెట్టెలాంటి పార్సెలు ఒకటి పైకి తీసి దీనిలో ఏముందో చెప్పుకోమన్నాడు. పలువురు పలు రకాలుగా ఊహించారు. ప్రదర్శకుడు పార్సెలును విడగొట్టసాగాడు. అందులో, సైజులో అంతకంటే చిన్నదైన పార్సెలు ఒకటి కనిపించింది. మళ్లీ ఆపరేషన్ చేసి చూస్తే దాని గర్భంలో వేరొకటి. ఇలా వరుసగా పది పన్నెండు ఆవరణల్ని ఛేదించుకుంటూ వెళ్లిన తరువాత దీర్ఘచతురస్రాకారపు పొడుముడబ్బీలాంటి చిన్న అట్టపెట్టె ఒకటి దృగ్గోచరమైంది. "దీనిలో ఏమున్నదీ యిప్పుడైనా చెప్పుకోగలరా?" అన్నాడు ప్రదర్శకుడు. ఒకరు చేతి గడియారమన్నారు. మరొకరు ఉంగరమన్నారు. ఇంకొకరు "తేలు అన్నారు.

అరగంటసేపాలోచించిన తరువాత మానవ స్వభావాన్ని గురించిన నిజం అంత సులభంగా అవగతమయ్యేది కాదన్న నిర్ణయానికి మాత్రమే రాగలిగాను.

ఎంతగా తప్పించుకుని తిరగాలన్నా అదొక విధిగా వారానికొకటి రెండుసార్లు దర్శనమిచ్చి నీలకంఠయ్యగారి విషయం ఏం చేశారని అడుగుతున్నాడు విశ్వపతి.

సమస్యనెటూ తేల్చకుండా కాలయాపన చేయడానికి ఉద్యోగుల ప్రపంచంలో ఉపాయం లేకపోలేదు. చూస్తాం, చేస్తాం, ఆలోచిస్తాం అన్న జవాబుతో వీలైనంతకాలం, బహుశా నేనా ఊరినుంచి ట్రాన్స్‌ఫరు అయ్యేదాకా నీలకంఠయ్యగారి కట్టడాన్ని కాగితంపైన ప్లానుగా మాత్రమే మిగిలించి ఉంచాలన్నది నా పథకం! ఆ తరువాత అతడు ఊరు ఊరంతా ఆక్రమించుకున్నా నాకు నష్టమయ్యేదేమీ లేదు. నష్టపడే వాళ్లు ఎవరి సంగతి వారు చూసుకోగలరు - ప్రస్తుతం నేను నా సంగతి చూసుకుంటున్నట్టు!

మూడు మాసాలపాటు వరుసగా ప్రతిరోజూ వెళ్లానేమో క్లబ్బంటే ముఖం మొత్తింది. శ్రీపురంలో క్రొత్త విహార స్థలాలకోసం అన్వేషింపసాగాను. ఊరికి దూరంగా ఉండడంవల్ల క్లబ్బుకన్నా ఆరోగ్యకరమైనదీ, మనుషులెందరున్నా ఒకరి సంగతి ఒకరు పట్టించు కోకపోవడంవల్ల క్లబ్బుకన్నా అనువైనదీ అయిన స్టేషను ప్లాటుఫారం నన్ను బాగా ఆకర్షించింది. ఏడు ఏడున్నర గంటల ప్రాంతానికి ఉత్తరదిశగా వెళ్లేరైలు స్టేషనులో ఆగుతుంది. అప్పుడు ప్లాటుఫారం మేలుకుంటుంది. స్టేషను పెళ్ళివారిల్లులా కలకల లాడుతుంది. ఆ సంబరాన్ని తిలకిస్తూ ఓరోజు గృహోన్ముఖుడి నౌతుండగా బుకింగు ఆఫీసు కిటికీ దగ్గర నిల్చున్న జనస్తోమంనుంచీ బయటపడి ఆదరాబాదరాగా ప్లాట్ ఫారంవైపు పరుగెడుతున్న విశ్వపతి కనిపించాడు.

"బండి కింకా టైముంది! ఎందాకా ప్రయాణం?" అని అడిగాను.

"మిరపకాయల సీజను గదండీ! గుంటూరులో మణుగు ధర యిరవై. ఆరు మాసాలు స్టాకు చేస్తే అదే మణుగు నలభై పలుకుతుంది. గుంటూరుకేనని టికెట్టు కొనుక్కోడం. వెళ్లిన తరువాత అవసరాన్నిబట్టి ప్రోగ్రాము మారిపోవచ్చు..."

రైలు కదిలేటంత వరకూ స్టేషనులోనే ఉన్నాను. ఆ తరువాత రోడ్డుపైకి వచ్చి నగరానికి అభిముఖంగా నడవసాగాను. ఒకటి రెండు ఫర్లాంగుల దూరం వెళ్లానో లేదో, విడిచిపెట్టిన రామబాణంలా రివ్వున వస్తున్న సైకిలొకటి ఎదురైంది. "రైలు వెళ్లిపోయిందా సార్?"- అది చంద్రం గొంతుక. ఆతురత, తడబాటు సమపాళంగా కలిసిఉన్న ప్రశ్న.

"వెళ్ళిపోయిందే! నాన్నగారిని రైలెక్కించి వచ్చాను గూడా నయ్యా చంద్రం!"

పది బార్ల దూరం ముందుకు వెళ్లిపోయిన చంద్రం అక్కడ తటాలున క్రిందికి దిగేశాడు. సైకిల్ను వెనుకకు త్రిప్పుకుంటూ "ఏమన్నాడు? ఎక్కడికి వెళ్తున్నానన్నాడు?" అని ప్రశ్నించాడు.

"గుంటూరులో మిరపకాయ లమ్ముతున్నారన్నాడు..."

"తీసుకొచ్చి ఇంత కారం ముద్ద తలమీద రుద్ది, ముంత మిరప్పొడి మా కళ్లల్లో చల్లితే తన విద్యుక్త ధర్మాలన్నీ తీరిపోయినట్టేననీగూడా చెప్పి ఉంటాడు..."

"అదేమిటయ్యా చంద్రం! ఏం మాట్లాడుతున్నావు నువ్వు?"

"కడుపు చించుకుంటే కాళ్లమీద పడుతుందని తెలుసుసార్! కానీ ఎంతకాలమని రహస్యాన్ని దాచి ఉంచుకోగలం! తండ్రి సంపాదించి పెట్టిపోయిన ఆస్థిని ఈయన హారతి కర్పూరంలాగే వెలిగించాడు. పదివేల రూపాయల పెట్టుబడితో మామగారు వ్యాపారం పెట్టిస్తే రెండేండ్లలో అప్పులు తేల్చాడు. మా అన్నదమ్ముళ్లలో పెద్దవాళ్లు ముగ్గురికీ అక్షరం

ముక్క అబ్బిందంటే అది మా మేనమామగారి చలువ. పెద్దన్నయ్యకాయన సైకిలు కొనిచ్చి, రెండు వందల రూపాయలు చేతికిచ్చి, 'పాల వ్యాపారం చేసుకో నాయనా! లాభిస్తుంది' అన్నాడు. పాలల్లోనుంచీ చిల్లరకొట్టులోకి, అందులోనుంచీ బట్టలకొట్టులోకి భగవంతుడు దారి జూపాడు. మరైతే మీ నాన్నగారేం చేస్తుంటారని మీరడగవచ్చు! ఇదిగో, ఇలాగే ఊళ్లు తిరుగుతుంటాడు. అందుకు డబ్బు కావాలిగదా! ఆ డబ్బు మా అమ్మ పెట్టెలో ఉన్నా, మా అన్నయ్య జేబులో ఉన్నా తెలివిగా సంగ్రహిస్తాడు. అంతెందుకు? ఈ నాటికీనా డేమైంది? బట్టల కొట్టుకు ఓ ఆసామి మూడు వందల రూపాయలు అప్పుంటే ఎంతో చమత్కారంగా ఆయన దగ్గర డబ్బును వసూలు చేశాడు. డబ్బు చేతి కొచ్చిందేమో, ఇంటికైనా రాకుండా మనిషి స్టేషనువైపు దూసుకున్నాడు. తీరా అప్పు చెల్లించేశాక ఎందుకనుమానం కలిగిందో ఏమిటో, ఆ ఆసామీ మీ నాన్నగారొచ్చి అడిగితే డబ్బిచ్చేశానని చీటీ వ్రాసి అన్నయ్యకు పంపించాడు. ఆ చీటీ చేరడమేమిటి, నేను సైకిలెక్కడమేమిటి రెండూ ఒక్కసారే జరిగాయి. కానీ ఏం లాభం? ఇంటికి వెళ్లిచూసి, బస్టాండంతా గాలించి ఇలా స్టేషనువైపు మళ్ళేసరికి ఆలస్యమైపోయింది. రైలు వెళ్లిపోయింది" వేడిగా నిట్టూర్చాడు చంద్రం.

***

శ్రీపురంలో నేను ఉద్యోగం చేసినకాలం చాలా తక్కువ. ఆ పదినెలల్లో దేశ యాత్రలకు వెళ్లిపోకుండా విశ్వపతి ఇంటి పట్టునే గడపినకాలం మరింత తక్కువ. పరిచయమైంది లగాయితు విశ్వపతిని గురించి నేననుకున్న విషయాలు, విన్న సంగతులు కలిగిన అనుభవాలు వరుసగా మనవి చేసుకోడం జరిగింది. ఎటొచ్చీ చెప్పకుండా మిగిలిపోయిన సంఘటన ఒక్కటే! కథకు ఉపకరించదేమోనన్న ధర్మ సందేహంతో, ఒక ఉదంతాన్ని కథలోకి రానివ్వకుండా తనలోతానే గుప్తపరచుకునే హక్కు రచయితకున్నదని నేను భావించలేను. తెలిసిన నిజాన్ని దాచుకోడంవల్లగూడా అనృత దోషం సిద్ధించే మాట నిజమైనప్పుడు, కథకు ఉపకరించదని ఓ వాస్తవికోదంతాన్ని చెప్పకపోవడం సైతం దోషంగాక పోదు.

గుంటూరుకి మిరపకాయలకని చెప్పి వెళ్లిన విశ్వపతి మూడుమాసాల తర్వాత తిరిగివచ్చాడు. తన అలవాటు ప్రకారం ఓ రోజు రోడ్డుపైనే ఎదురయ్యాడు "నమస్కారమండీ రంగనాథంగారూ! ఊరినుంచీ మొన్ననే వచ్చాను. రావడం గుంటూరునుంచే ననుకోండి. కానీ అంతకుమునుపు..." అంటూ మామూలు పాఠం ఒప్పగించాడు. నీలకంఠయ్యగారి ఇంటి ప్లాను విషయం ఎక్కడవేసిన గొంగడి అక్కడేనన్న సామెతకొక ఉదాహరణగా తయారైనందుకు విచారం వెల్లడించి, ఆ పని ఏనాటికైనా నామూలంగా నెరవేరి తీరుతుందన్న ఆశాభావం ప్రకటించాడు.

ఆపాటికి శ్రీపురంలో నా పని ముంతపొగలో ఊపిరి త్రిప్పుకోలేని చందంగా ఉంది. ట్రాన్స్‌ఫరుకోసం తీవ్రంగా ప్రయత్నిస్తున్నాను.

క్రొత్తగా విడుదలైన సినిమా ఒకటి పట్టణంలో ప్రదర్శింపబడుతుంటే, తీరిక చేసుకుని మొదటి ఆటకే వెళ్లాను. ఆకాశం మేఘావృతంగా ఉన్నప్పటికీ, క్రిందగాలి

అదకపోవడంవల్ల థియేటర్‌లో ప్రాణాలు గిలగిలలాడిపోయాయి. ఒకటి రెండుసార్లు విద్యుత్ప్రసారం ఆగిపోవడంవల్ల సక్రమంగా ప్రదర్శనాన్ని తిలకించే ప్రాప్తంగూడా లేకపోయింది. దూరంగా ఎక్కడో తుఫాను పట్టి ఉంటుందన్నారు అనుభవజ్ఞులు. అన్ని అంతరాయాలూ గడచి, ఆట ఆఖరయేసరికి గంట పదిన్నర దాటింది. బయట సన్నగా తుంపర చినుకులు జారుతున్నాయి. వాన ఉధృతంగా వచ్చేలోగా ఇల్లు చేరుకోవచ్చునన్న ఊహతో వడివడిగా నడవసాగాను. కానీ అంతకంటే వేగంగా వచ్చి ఓ వానమబ్బు పట్టణాన్ని ముట్టడించింది. గాలి చేస్తున్న ఆర్భాటం తగ్గి, అది తగ్గినంత మేరకు వాన హెచ్చింది. చూస్తుండగానే కుంభవర్షం ప్రారంభమైంది.

అప్పుడిక ఆశ్రయంకోసం చుట్టూరా కలయజూచాను. దగ్గర్లో ఉన్న ఇళ్లల్లో మచ్చుకొకదానికైనా వసారా కనిపించిందిగాదు.

దిక్కులు దోచని ఆ పరిస్థితిలోనే పిలుపు వినిపించింది.

"ఏమండోయ్ రంగనాథంగారూ! అయ్యో పాపం, తడిసి ముద్దయిపోయారు ఇదిగో, ఇక్కడున్నానండీ, ఇక్కడ..."

పిలుస్తున్న వ్యక్తి విశ్వపతి. అప్పుడుగానీ నేను విశ్వపతి ఇంటి ముంగిటకు వచ్చినట్టు గ్రహింపలేకపోయాను. గొంతెత్తి పిలుస్తున్నాడు గనుక, సురక్షితమైన ఆశ్రయం లభించినట్టేనని ఆలోచించిన నాకు అక్కడి పరిస్థితి వేరొక విధంగా ప్రత్యక్షమైంది. ఈగ జొరబడడానికైనా వీలులేకుండా వీధి తలుపు, కిటికీలు బంధింపబడి ఉన్నాయి. ఇంటికీ, వీథికీ మధ్య సన్నపాటి అరుగుపైన రెండడుగుల వెడల్పుతో క్రిందికి వంచిన మంగళూరు పెంకుల వసారా మూలంగా వర్షంనుంచీ రక్షణ లభించే అవకాశం బొత్తిగా కనిపించడం లేదు. అలాంటి తలచాటును నమ్ముకున్నందుకు ప్రతిఫలంగా విశ్వపతిగూడా నాలాగే తడిసి ముద్దైపోయి ఉండటమే అందుకు ప్రబలమైన సాక్ష్యం. చుట్టజుట్టి తలుపు కానించి ఉన్న అతడి పరుపు మరునాటి ఎండకు తేమ తీసుకుంటేగానీ వినియోగపడే స్థితిలో లేదు–

రన్నింగ్ కామెంట్రీ సూత్రం నిరాటంకంగా సాగిపోతోంది.

"భగవంతుడెంత కరుణామయుడండీ రంగనాథంగారూ! చంద్ర నిప్పుల్లాంటి మండుటెండల్ని చెరిగిపోశాడా, ఇదిగో ఇప్పుడిలా చల్లగా వాన కురిపిస్తున్నాడు. గుంటూరు మండుటెండల్లో కాగిపోయి వచ్చానేమో, నాకిప్పుడు పన్నీటి కొళాయి క్రింద నిల్చున్నంత హాయిగా వుంది. ఐనా వానంటే ఎందుకిలా భయపడి చస్తారండీ మనుషులు? తడిస్తే మొలవబోరుకదా! నగానట్రా, డబ్బూదస్కంలాంటివి పదిలంగా ఉండటానికని ఇళ్లు కట్టుకున్నారుపో, కట్టుకుంటే మాత్రం నాలుగు గోడల మధ్య ఖైదీల్లా పడిఉండవలసిన దురవస్థ మనకేమొచ్చింది? అందుకనే నేనింట్లో పడుకుని రెండేళ్లయింది. జడివాన గానివ్వండి, చలిగాలి కానివ్వండి రాత్రుల్లో ఈ పంచను వదలిపెట్టడంలేదు..."

వాన జోరు కాస్త తగ్గింది. ఒకరకమైన వర్షంనుంచీ తప్పించుకోగోరి, మరోరకం వర్షంలోకి వచ్చిపడినందుకు నన్ను నేనే నిందించుకున్నాను. సరిగ్గా ఆ సమయానికి పంచ పైకెగగట్టి గొడుగు చేతబట్టుకుని వర్షాన్ని సైతం లెక్కపెట్టని ధీమాతో నిటారుగా

నడచివస్తున్న మునిసిపల్ కౌన్సిలర్ శ్రీనివాసులు అల్లంత దూరంలో కనిపించారు.

"వెళ్లిపోకండి శ్రీనివాసులుగారూ! గొడుగు క్రింద నాకు కాస్త చోటుచేస్తే మీకు పుణ్యముంటుంది" అన్నాను.

"గొడుక్కేం భాగ్యం? ప్రక్క వీధిలోనే మా ఇల్లు. అవసరమైతే గొడుగు తీసుకెళ్ళి రేపు పంపుదురుగానీ రండి రండి..." అన్నాడు శ్రీనివాసులు.

విశ్వపతితో వెళ్లొస్తానని చెప్పి గొడుగు క్రిందికి చేరుకున్నాను.

"ఏమంటున్నాడు విశ్వపతి?" పది బారల దూరం వెళ్లాక అడిగాడు శ్రీనివాసులు.

"మరేంలేదు. వాన కురిసినా, గాలి వీచినా తానింట్లో పడుకోడట! అదొక వ్రతంలా వీధి పంచలోనే పడుకుంటాడట!"

"అలాగా!" బిగ్గరగా నవ్వసాగాడు శ్రీనివాసులు.

"ఏమండీ! ఎందుకు నవ్వుతున్నారు?" కుతూహలంతో అడిగాను.

"ఎందుకంటే రంగనాథంగారూ! మునుపటి కెవరో మహానుభావుడట ఆడగాలి సోకని ప్రపంచంలోనైతే తాను ఆజన్మాంతం బ్రహ్మచర్య వ్రతాన్ని పాటించగలనన్నాడట! విశ్వపతి వాదం అంతకంటే సహేతుకంగా లేదు. నిగ్రహంతో కోరికల్ని అదుపులో పెట్టుకోడం శ్రేష్ఠమైన పద్ధతి. అలా కాకుండా గాలికిపోయిన పేలపిండి కృష్ణార్పణ మనుకోడం ఇంకో పద్ధతి. ఇంట్లో పడుకోడానికి బొత్తిగా వీల్లేకపోతే, పాపం విశ్వపతి మాత్రం ఏం చేస్తాడు?"

"వీల్లేదా! ఎందుకని? ఏమిటండీ ఈ చిదంబర రహస్యం?" విస్మయంతో ప్రశ్నించాను.

"రంగనాథంగారూ! కొన్ని విషయాలకు విపులంగా వ్యాఖ్యానాలు అనవసరం! ముక్తసరిగా లఘుటీకలే చాలు! ఈనాడు ప్రపంచాన్నంతా ఎదుర్కొంటున్న సజీవమైన సమస్య జనాభా పెరుగుదల. దాన్ని నిరోధించడానికి పెద్దలు సూచించిన పద్ధతి – అదే ఆత్మ నిగ్రహం, ఇప్పుడెవరికీ నచ్చదు, అబ్బదు గూడా! శస్త్రవైద్యమే శరణ్యమని ప్రభుత్వాలు హితోపదేశం చేస్తున్నాయి. అది మధ్యేమార్గం. విశ్వపతి విషయంలో అమలు జరుగుతున్నదే మూడో పద్ధతి"... ముగించాడు శ్రీనివాసులు.

❖ భారతి – జులై, 1964. ❖

# దివ్యౌషధం

"ఏమోయ్ కుర్రడాక్టరూ! నీకోసమే చూస్తున్నా! ఇదిగో శ్రీదేవీ! అబ్బాయి వచ్చాడు గాని, నాలుగు మల్‌గోవా మామిడిపళ్ళు పట్టుకురా."

"నాకొక్కటైతే చాలు! మిగిలిన మూడూ మీకా మేష్టారూ?" వినయం ఉట్టి పడుతుండగా ప్రశ్నించాడు డాక్టరు రమణమూర్తి.

"ఒక్కసారిగా మూడు మామిడిపళ్ళు తినడం చాలా ప్రమాదకరమని వైద్యశాస్త్రం చెబుతుందా ఏమిటి మూర్తీ?" మరింత అమాయకంగా ప్రశ్నించారు నారాయణరావుగారు.

"గురు శిష్యుల మధ్య రగడ రాజుకుంటోందన్నమాట!" నవ్వుతూ హాల్లోకి వచ్చింది శ్రీదేవమ్మ.

"చూడు మిస్టర్ మూర్తీ! నువ్వు మీ పెద్దమ్మ మాటలకు పెద్దగా పరిగణన ఇవ్వగూడదు. మాటిమాటికీ నా ఒజ్జరికాన్ని జ్ఞప్తికి తేవడం ఆమె కలవాటు. హైస్కూల్లో, అదీ యస్సెస్సెల్సీ క్లాసులో నీకు నాలుగు ఇంగ్లీషు ముక్కలు నేర్పానేమో, ఆ మేరకే మన గురు శిష్య సంబంధం! వైద్యశాస్త్ర విజ్ఞానం నువ్వు కళాశాలలో సంపాదించుకున్నది. ఆ శాస్త్రానికి సంబంధించినంతవరకూ నువ్వు డాక్టరువి. నేనొక మానవుణ్ణి. ఇక్కడ మానవుడనగా ఏ క్షణాన్నయినా డాక్టరుగారి ప్రాబల్యానికి లోనై అతడి నిగ్రహానుగ్రహాల్లో దేనికో ఒకదానికి గురి కావలసివున్న ఒకానొక సజీవప్రాణి అని నిర్వచనం! మామిడిపళ్ళేగాదు, నువ్వు మంచినీళ్ళు త్రాగడం ఆరోగ్యకరం కాదని చెప్పు, మరుక్షణంనుంచీ నేను మంచినీటిని ముట్టుకుంటే ఒట్టు..."

"నీకు పుణ్యముంటుందిగాని దాహమైనప్పుడల్లా ఓ టంబ్లర్ పాయసం త్రాగమని చెప్పవయ్యా మూర్తీ! మీ మేష్టరుగారికి పాయసమంటే చాలా యిష్టం..." మళ్ళీ కలుగజేసుకుంది శ్రీదేవమ్మ.

"ప్చ్, ప్చ్. నువ్వు లాభం లేదు శ్రీదేవీ! ఇలా యింటిగుట్టు డాక్టర్లకు చెప్పుకోవచ్చా! రేపు నాకు ముక్కే నొచ్చిందనుకో. ముఖమే వాచిందనుకో, డాక్టరేమంటాడు? 'నేను చెబుతున్నాను మేష్టారూ! మీరు తీపి వస్తువులు తినడం బాగా తగ్గించేయాలి' అనడూ! చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకోడం బుద్ధిమంతుల లక్షణమేనా చెప్పు..."

పంతులుగారు శిష్యుణ్ణి ఎగతాళి పట్టించడం మామూలే! కాని ఆవేళ పరిహాసం కాస్త శ్రుతి మీరిందేమో! శిష్యుడి ముఖం చిన్నబోయింది. ప్రాక్టీసు క్రొత్తదే అయినా 'క్రొత్త వింత, పాత రోత' అన్న లోక సంప్రదాయం రీత్యా నైతేనేమి, ఉత్సాహంతో, ఓదార్పుతో శ్రద్ధగా కర్తవ్యాన్ని నిర్వహించడంవల్లనైతేనేమి, డాక్టరు మూర్తికి చేతినిండుకూ పని తగులుతోంది. నిర్ణీత సమయాల్లో ఆసుపత్రిలో పనిచేసి, ఆసుపత్రికి రాలేని రోగులకోసం తెరిపి దొరికినప్పుడల్లా పట్టణాన్నొక చుట్టు వేసుకుని వచ్చి అనుదిన వ్యాసంగాల ఒత్తిడిలో అసురుసురైపోయిన తర్వాత మూర్తికి కాసేపు ఉల్లాసంగా కాలం గడపాలనిపిస్తుంది. అరగంటసేపు ఈ పురాణ దంపతుల సమక్షంలో కూర్చుని ఆ తరువాత వెళ్ళి పడుకుంటే హాయిగా నిద్రకూడా వచ్చేస్తుంది. అలాగైతే తన ఉబలాటంకొద్దీ ఇలా

రావడమే తన పొరబాటా! తరచుగా వస్తున్నాడుగదా అని తననిలా లోకువచేసి పారేస్తారా మేష్టరుగారు...!

పెదముఖం పెట్టుకుని గోడవైపు చూస్తూ కూర్చున్నాడు మూర్తి. అయిదు నిమిషాలవరకూ హాల్లో నిశ్శబ్దమే ఆవరించింది.

మళ్ళీ రావుగారే ప్రారంభించారు– "పరధ్యానంగా కూర్చున్నావేం శ్రీదేవీ! ముక్కలు కోసి పెట్టు. మనకిద్దరికీ చెరొక పండు; మూర్తికేమో రెండు. ఎందుకంటే భోజనానంతరం పళ్ళు తినడం మంచిది. ఆ మాట ఆరో తరగతి సైన్సు పాఠంలో ఉంది..."

విసురుగా అడ్డు తగిలాడు మూర్తి!– "వద్దులేండి పెద్దమ్మగారూ! కొంతసేపు కబుర్లు వినిపోవచ్చుననే నేనిలా రావడం..."

"అబ్బాయికి కోపం రానే వచ్చింది. రాకేం చేస్తుంది? ఏనాడో మీ దగ్గర చదువుకున్నాడన్న చొరవతో మీరెంత మాటలంటే అంత మాటలనడం ఏం సబబు?" నిలదీసి ప్రశ్నించింది శ్రీదేవమ్మ.

"సబబుకాదని నీకే అనిపిస్తే నాకిక క్షమాపణ చెప్పుకోక తప్పుతుందా శ్రీదేవీ! శిష్యులకు గురువులు క్షమాపణలు చెప్పుకోవలసి వస్తున్న సుదినాలే యివి? చెప్పండి. మీరిద్దరూ కలిసి ఏ శిక్ష విధించినా సరే, శిరసావహించడానికి సిద్ధంగా ఉన్నాను..."

"అలాగన్నారు గనుక బాగుంది. అవునా మూర్తీ! శిక్షగా మరొకటీ మరొకటీ ఎందుకూ! ఈ నాలుగుపళ్ళూ ఆయన్నే తినేయమంటే సరిపోదూ!"

"ఎలాగైనా డాక్టరు మనవాడేనని నీ ధీమా! చూడు శ్రీదేవీ! ఎక్కడ బావా అన్నా వంగతోట దగ్గర మాత్రం బావా అనగూడదు..."

ఎంతగా పెదవులకు తాళం వేసుకుని కూర్చున్నా హఠాత్తుగా పెల్లుబికిన చిరునవ్వుల వరదకు ఆనకట్ట వేయలేకపోయాడు మూర్తి. "బాగుందిలేండి మేష్టరుగారూ! అప్పటికి నేను మీకు మందులిచ్చీయిచ్చీ అలసిపోతున్నట్టు! ప్రాక్టీసు ప్రారంభించి దాదాపుగా ఏడాది కావస్తోంది నేను. ఇంతవరకు నా ఆసుపత్రి ముఖమైనా చూడనివాళ్ళు మీరొక్కరే!"

"మూర్తీ, మూర్తీ!" బ్రతిమాలుతున్నట్టుగా అన్నారు రావుగారు. "ఎంత చెడినా నీకు నేను గురువునే అనుకున్నాను. ఆ విధంగా నిన్న నా శ్రేయోభిలాషి క్రిందనే జమ కట్టాను..."

పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వసాగాడు మూర్తి. "చూచారా పెద్దమ్మగారూ! మేష్టరుగారి ధోరణే యింత! బెంచీ ఎక్కించడం, బెత్తంతో బాదడంలాంటి కఠిన శిక్షణ మాకు రివాజే! కానీ అంతలోనే దగ్గరికి పిలిచి ఒక మాట అని, నాలుగు నవ్వులు నవ్వించి, "వెళ్ళరా బాబూ" అని బుజ్జగించి పంపేసేవారు. అందువల్లనే మేష్టరుగారంటే భయమూ, భక్తీగూడా ఉండేవి..."

"ఆ భయభక్తుల్ని భూతం తినిపోయిందిలేవోయ్ మూర్తీ! భూతమంటే భూతకాలమని భావం! ఇప్పుడామాటెందుకుగానీ, నువ్వు పళ్ళు తిను..."

పళ్ళు తింటూ ఆలోచనలో పడ్డాడు మూర్తి – రోగాలు మనిషికి కాక మ్రానికొస్తాయా అన్నది లోకోక్తి. అనగా మనిషికీ రోగాలకూ ఏదో గాఢమైన అనుబంధమే ఉందన్నమాట!

ఆహ్వానం పంపకపోవచ్చు. మనకు బొత్తిగా యిష్టమూ లేకపోవచ్చు. ఐనా మన అభిప్రాయంతో ప్రసక్తి పెట్టుకోకుండా తమంతట తామే ఠీవిగా వచ్చి, ఇంట మకాంపెట్టి, తిన్నంతకాలం సుష్టుగా తిని, చిట్టచివర బస్సు ఛార్జీలకు సైతం డబ్బు గుంజుకు వెళ్ళే బంధువుల లాంటివి జబ్బులు. వాటి బారికి గురికాని మానవుడుండడు. తనకి సరిగ్గా తెలియదుగాని మేష్టరుగారికైనా ఎప్పుడో ఒకప్పుడు జ్వరం, జలుబు, తలనొప్పిలాంటి మామూలు రకం జబ్బులైనా వచ్చి ఉండకపోవు.

"ఏమిటో ఆలోచిస్తున్నట్టున్నావు మూర్తీ!" నింపాదిగా అడిగారు రావుగారు.

"అలాగైతే మీరెప్పుడూ జబ్బుముఖమే చూడలేదా మేష్టారూ?" అన్న ప్రశ్న నాలుక చివరిదాకా వచ్చి అక్కడే ఆగిపోయింది. ఆ తొట్రుబాటులో తన ప్రశ్నకొక మారువేషం తగిలించాడు మూర్తి. "మరేం లేదండీ మేష్టారూ? మనిషికి జబ్బులెందుకొస్తాయా అని?"

"ఏమిటోనబ్బా! నేనెన్నడూ ఆ అంశం పైన ఆలోచనలు పెట్టుకోలేదు. అలాంటి జిజ్ఞాసకు పూనుకోడానికి తీరికుండాలి గదా! నాకు లేనిదే అది! క్రమశిక్షణ, సిలబస్సు, పరీక్షలు – ఈ బడిగోడల పరిమిత పరిధిలోనే ముప్పై యేళ్ళ సర్వీసు గడిచిపోయింది. ఇంకో అయిదేళ్ళు యిలాగే పనిచేసి రిటయిరైతే, ఆ తరువాత కొన్ని ముఖ్య విషయాలను గురించి తీరిగ్గా ఆలోచిస్తూ కూర్చోవాలన్న సదుద్దేశం మాత్రం లేకపోలేదు. ఐనా యిప్పటికిప్పుడు జబ్బులెందుకొస్తాయన్న ప్రశ్నకు గాకపోయినా, అవి ఎవరికోసం వస్తున్నాయో చెప్పగలను. కాని ఎందుకులే బాబూ, చెబుతే మళ్ళీ నీకు కోపం రావచ్చు..."

"ఫరవాలేదు చెప్పండి మేష్టారుగారూ..." ప్రాధేయపడ్డాడు మూర్తి.

"జబ్బులెందుకొస్తున్నాయన్న విషయముంది చూచావూ, అదొక మహా రహస్యం! ఆ రహస్యం కాస్తా తెలిసిపోతే వెనువెంటనే దానికి నివారణోపాయాలుగూడా తయారౌతాయి. ఆ తరువాత పరిణామాలను గురించి నేను వేరే చెప్పాలా మూర్తీ! బయట తగిలించుకున్న బోర్డులను వూడబెరికి డాక్టర్లు తమ తమ వైద్యాలయాలను మూసుకోవలసిందే గదా!"

మేయబోయి మెడ తగిలించుకున్న చందంగా యిరుకున పడిపోయాడు మూర్తి. కాని అంతలోనే తెప్పరిల్లి "అయితే డాక్టర్లుండడం అనారోగ్య నివారణకేగాని ఆరోగ్య పరిరక్షణకు కాదని మీ అభిప్రాయం" అన్నాడు.

"బాబ్బాబూ! మీకు పుణ్యముంటుంది. ఈ జబ్బుల గొడవ కాస్తా కట్టిపెట్టి మరేదైనా లోకాభిరామాయణంలోకి దిగగూడదూ!" మంచినీళ్ళకోసం లోపలికి వెళ్తూ అంది శ్రీదేవమ్మ.

మొదటి ఆటనుంచి తిరిగి వెళ్తున్న సినిమా ప్రేక్షకులతో బాటుగా యిల్లు చేరుకున్నాడు మూర్తి. పడుకున్నాడేగాని నిద్ర పట్టిందిగాదు. ఈరోజు మేష్టరుగారిద్వారా అవగతమైన విషయం తనకు క్రొత్తదేమీగాదు. డాక్టర్ల తోడ్పాటు తమకెంతగా అవసరమైనా లోకుల కెందుకో వాళ్ళపట్ల సదభిప్రాయం ఉన్నట్లు తోచదు. చిన్ననాడు తను హైస్కూల్లో చదువుకునే రోజుల్లో 'డాక్టరా, లాయరా, ఎవరు గొప్ప' అన్న విషయంపైన ప్రసంగాలు జరిగేవి. లోకంలో టీచర్లు, గుమాస్తాలు, దర్జీలు, ఇన్సూరెన్స్ ఏజంట్లు మొదలైన వృత్తిదారులెందరో ఉండగా, డాక్టర్లకు, లాయర్లకు మాత్రం లంకెగలిపి వారిలో ఎవరు

గొప్ప, ఎవరు తక్కువ అన్న మీమాంసకు పూనుకోవలసిన అవసరమేమిటో తనకర్థమయ్యేది గాదు. బహుశా యిది కారణమైతే గావచ్చు – ఈ రెండు వృత్తులూ ప్రధానంగా మానవుడి బలహీనత పైన ఆధారపడి కొనసాగేవి. న్యాయాన్ని ధిక్కరించడానికి కారణం మానసిక దౌర్బల్యమైతే, జబ్బులకు గురికావడానికి హేతువు శారీరక బలహీనత. కాని తమతో ఎదుటివాడికి ఏర్పడిన అవసరంలోనుంచి ఎంతగా వీలైతే అంతగా డబ్బు పుట్టించాలన్న కక్కుర్తి పైన పేర్కొన్న రెండు వ్యక్తులకే పరిమితమైనదేమీగాదు. క్లాసులో ఊకదంపుడు మాటలే చెబుతూ వచ్చి, పరీక్షలకు ముందుగా తమ దగ్గర ట్యూషన్లు చెప్పించుకోకపోతే గడచి గట్టెక్కడం అసాధ్యమని హెచ్చరికలు పలికే ఉపాధ్యాయులెంతమంది లేరు? పడవలసిన మామూలు జేబులో పడితేగాని ఫైలును టేబులు దాటనివ్వని గుమాస్తాలెంతమంది లేరు? జీవితానికి సంబంధించిన ప్రతి రంగంలోనూ నిస్వార్థంగా పని చేయడానికి ఎంతటి అవకాశమైతే ఉందో, దగాచేసి మూటలు ముల్లెలు కట్టుకోడానికైనా అంతే అవకాశం ఉంది. మరైతే ప్రత్యేకించి లాయరీ, డాక్టరీలను మాత్రం తప్పుపట్టడం ఏం న్యాయం?

ఈ అన్యాయానికి తోడు తమకు జబ్బులు రాకపోతే డాక్టర్లు బ్రతకలేరన్న వితండవాదం ఒకటి! అప్పటికి డాక్టర్లు నిక్షేపంగా బ్రతుకు గడిచిపోవాలన్న ఉదారబుద్ధి గలిగినవారై స్వప్రయత్నంలో జబ్బులు కొనితెచ్చుకున్నట్టు. తనకోడీ, తన కుంపటీ లేకపోతే లోకానికి తెల్లవారదనుకున్న ముసలమ్మలా తమకు జబ్బులు రాకపోతే డాక్టర్లకు బ్రతుకు లేదని భావిస్తున్నట్టున్నారు లోకులు! అబ్బే, యిదేం బాగుండటం లేదు!

మరునాటి ఉదయం కొంత ఆలస్యంగా నిద్ర లేచాడు మూర్తి. అరగంట ఆలస్యం అయిందేమో, ఆసుపత్రికి వెళ్ళేసరికి వెయిటింగు రూం నిండుకూ కిక్కిరిసి ఉన్నారు రోగులు. వేళకింత తిండీ నీళ్ళూ తీసుకుంటున్నట్టుగా ప్రతిరోజూ యిన్ని మందునీళ్ళు లోపలికి పుచ్చుకుంటూ జబ్బుకు అలవాటుపడిపోయిన పాత రోగులు కొందరు డాక్టరు గారిని సందర్శించారు. వాలకాన్ని బట్టి చూస్తే మానవుడు ఆరోగ్యంగా, ఆనందంగా బ్రతకవచ్చునన్న స్పృహే వారికున్నట్టు లేదు. హిమాలయాలపైన గడియకొక రకంగా వాతావరణం మారుతుందని చెబుతారు. ఆ విధంగా ఒకప్పుడు బాగా తగ్గినట్టు కనిపించి, మరొకప్పుడు విపరీతంగా విజృంభించినట్టుగా తోచే రోగ ప్రభావం క్రింద రంగులు మార్చుకుంటూ సహజసౌందర్యాన్ని కోల్పోయిన వాళ్ళ ముఖాలకేసి చూస్తూ డాక్టరు మూర్తి నిర్విణ్ణుడైపోయాడు. వీళ్ళ నిస్సహాయ పరిస్థితిని మాటల్లో వర్ణించి చెప్పడం కష్టం. లేదంటే ఒక పోలిక చెప్పవచ్చు. బలవంతుడు, దుర్మార్గుడు అయిన శాత్రవుడికి, వాడు శత్రువన్న సంగతి తెలుసుకోకుండా స్వంత యింటిని అద్దెకిచ్చి, వాడా యింటినిక ఖాళీ చేయడం కుదరదని భీష్మించుకుని కూర్చుంటే ఏం చేయడానికీ పాలుపోక పంచలో బిక్కుబిక్కుమంటూ కూర్చున్న యింటి యజమానిలా వీళ్ళు తెల్లబోయి ఉన్నారు. పాలుపోయిన ఈ చవిటిపర్రలో ఉద్యానవనాలు తలలెత్తకపోతే మానె! పచ్చికైనా మొలవదా అన్నదే వీళ్ళ ఆశ! స్వరాజ్యం ఒకరు వేరొకరికి ప్రసాదించే భిక్షం కాదనీ, అది ఎవరికి వారే సంపాదించుకోవలసిన జన్మహక్కనీ అన్నాడట మహాత్ముడు. ఆరోగ్యానికి

సంబంధించినంత వరకూ అలాంటి ఆత్మవిశ్వాసం వీళ్ళల్లో ఏనాడో నశించి పోయినట్టుంది...

వైద్యశాస్త్రం అనారోగ్యానికి బోలెడన్ని కారణాలను ఏకరువు పెడుతుంది. నివారణోపాయాలుగూడా చెబుతుంది. విచిత్ర మేమిటంటే వైద్యశాస్త్ర విజ్ఞానం పెరిగినకొద్దీ క్రొత్తగా కొన్ని జబ్బులూ పుట్టుకొస్తున్నాయి. వాటికి చిత్రవిచిత్రమైన చికిత్సా విధానాలూ అన్వేషింపబడుతున్నాయి. కాని ఆరోగ్యవంతుడి కిదంతా కాబట్టడంలేదు. అతడు తన జీవితాన్నొక మధురగీతంలా ఆలపించుకుంటూనే ఉన్నాడు.

అలాగని ఆరోగ్యవంతుడైన మానవుడు ఆరోగ్య శాస్త్రాన్ని క్షుణ్ణంగా చదివి దాని సలహాను, హెచ్చరికలను విధిగా పాటిస్తున్నాడనడానికి దాఖలాలు లేవు.

డాక్టర్లు రోగ నిదానం చేయగలరు. ఔషధాలు నిర్ణయించగలరు. పథ్యం చెప్పగలరు! అంతకుమించిన గారడీపనితనంతో జబ్బులను మటుమాయం చేయలేరు. కాని ఈ వాస్తవాన్ని రోగులు గుర్తించరు. ఒక చిన్న మాత్రగానో, ఒకటి, రెండు ఔన్సుల ద్రవంగానో, కొన్ని గ్రాముల సూదిమందుగానో సర్వరోగ నివారణిగా ఒక దివ్యౌషధాన్ని వైద్యశాస్త్రం కనిపెట్టగలిగితే బాగుండునన్నదే వాళ్ళ కోరిక. శాస్త్రం అందులో కృతకృత్యత నందుకోగలిగే సూచనలు కనుచూపుమేరలో కనిపించవు. ఎటొచ్చీ ఉపాయాంతర మొక్కటే కనిపిస్తుంది. దుఃఖాల కన్నింటికీ కోరికలే కారణం గనుక, తీర్చుకోడానికి ప్రయత్నించడంకన్నా వాటిని సమూలంగా తుడిచిపెట్టడమే మంచిదని తత్వజ్ఞులు చెబుతారు. ఆ విధంగా ఆలోచిస్తే జబ్బులకు నివారణోపాయాలు కనిపెట్టడంకన్నా, ఆరోగ్యానికి మూలకారణం కనిపెట్టడమే సులభమేమో!

ఉదయం పది గంటలకు ఆసుపత్రిలో పని ముగిసిన తర్వాత పట్టణంపైన మొదటి రౌండు బయలుదేరాడు మూర్తి. వెళ్ళవలసిన నాలుగైదు చోట్లకూ వెళ్ళి యింటికి తిరిగివస్తూ గడియారం చూసుకున్నాడు. గంట పదకొండు. భోజనానికి యింకా కొంత వ్యవధి లేకపోలేదు. దారిలోనే తగులుతుంది మేష్టరుగారి యిల్లు. పెద్దమ్మకు అచ్చంగా జబ్బులాంటిదేదీ లేకపోయినా దానికి సంబంధించిన అనుమానాలు దండిగా ఉన్నాయి. వాటిని గురించామె చెప్పడానికైనా, తాను వినడానికైనా మేష్టరుగారి సాన్నిధ్యంలో బొత్తిగా వీలుండదు. పనిలో పనిగా ఆమెనుగూడా పలకరించుకుని వెళ్ళిపోతే అదనంగా యింకొక పనిగూడా ముగిసినట్టవుతుంది.

“ఏం చేస్తున్నారు పెద్దమ్మగారూ! దారిన వెళ్తూ యిలా వచ్చాను. పది రోజులప్పుడు నేనిచ్చిపోయిన మందు ఎలా పనిచేసిందో చెప్పారుగారు” అంటూ కుర్చీలో కూర్చున్నాడు మూర్తి.

“అయ్యో, మతిమరుపా! చెప్పాను కానా మూర్తీ? పది రోజులకని చెప్పావుగదూ! మందు తియ్యగా ఉందేమో, మూడు రోజులకే బాటిలు ఖాళీ అయిపోయింది. చెబితే నువ్వేమనుకుంటావోనని గమ్మున వుండిపోయాను...”

పెద్దమ్మలో యింకా పసితనం మాసిపోనందుకు లోలోపలే నవ్వుకున్నాడు మూర్తి.

“ఐనా నీ అక్కరకొద్దీ నువ్వేదో మంది లిస్తున్నావుగాని, పుచ్చుకుంటున్నానని తెలిస్తే నీ మేష్టరుగారు మండిపడతాడు. నీరసంగా ఉంది అంటాననుకో – వెళ్ళి భోజనం

చేయమంటారు. చెమటలు పోస్తున్నాయంటాననుకో – స్నానం చేయమంటారు. నిద్ర లేదంటాననుకో – కాసేపేదైనా చదువుకోమంటారు. అంతేగాని దీనికేదైనా మందో మాకో చూడాలన్న ధ్యాసే ఉండదాయనకు..."

"మితిమీరిన నీరసం, మాటిమాటికి చెమటలు పట్టడం, రాత్రిళ్ళు నిద్రలేకపోవటం యివన్నీ అనారోగ్య లక్షణాలు. ఈ చిన్నెలు పొడచూపినప్పుడు జాగ్రత్త వహించడం మంచిది. ఆరోగ్యంపట్ల నిర్లక్ష్యం పనికిరాదు" అన్నాడు మూర్తి.

"ఒక్కసారా, రెండుసార్లా మూర్తీ! లక్షసార్లు చెప్పి ఉంటాను. చెబితే వినే రకమా! వద్దు వద్దని చెబుతున్నా సరే, తమ ధోరణే తమది! ఉదయం అయిదు గంటలకే నిద్రలేస్తారు. పండు చలిగా ఉన్నా, జడివానలా మంచు కురుస్తున్నా బయటికి వెళ్ళి భళ్ళుమని తెల్లవారాక యింటికి తిరిగొస్తారు. ఎనిమిది గంటలకు ఓ గ్లాసుడు పాలు త్రాగితే, మళ్ళీ పన్నెండుకు పైనే భోజనం. సాయంకాలం టిఫినుచేసి పెడతానంటే, ససేమిరా వద్దంటారు. ఎందుకని నిలదీసి అడిగితే ఏడుఏడున్నరకల్లా ఏకంగా భోజనమే చేయవచ్చును గదా, మళ్ళీ మధ్యలో టిఫిను దేనికని ఎదురు రెట్టిస్తారు..."

"ఆ రెండు పూటలైనా ఆయన తృప్తిగా తింటున్నారా అన్నదే నా సందేహం!" ఆరోగ్యానికి మూలకారణాలను ఆరాతీసే ప్రయత్నంలో ఉన్నాడు మూర్తి.

"అయ్యో రాతా! ఆ మాటెందుకులే మూర్తీ! ఇది బాగుంది. ఇది బాగా లేదు అన్నమాటే లేదు. చేసిపెట్టిందల్లా శుభ్రంగా తినేయడమే! అదేమిటని అడిగితే ఆకలికి రుచేం తెలుస్తుందని ఒకటే నవ్వు..."

ఆరోగ్యాన్ని కొలవడానికి ఉపకరించే బెరామీటర్లు రెండు. మొదటిది ఆహారం. రెండోది నిద్ర. బాగా ఆకలివేస్తే, సుఖంగా నిద్రపడితే – ఆ పరిస్థితిలో ఆరోగ్యం ధోకా లేకుండా ఉందన్న మాటే! జఠరాగ్ని ప్రకోపం జాజ్జ్వల్యమానంగా ఉన్నట్టయితే ఆరోగ్యం సగం మేరకే నిక్షేపంగా ఉందనే చెప్పవచ్చు. మిగిలిన సగం సంగతి?

"తొమ్మిదిన్నర అయీ కాకమునుపే నేను వెళ్ళిపోతుంటానా పెద్దమ్మగారూ! ఆ తరువాతగూడా చాలాసేపు చదువుతూ కూర్చుంటారా మేష్టరుగారు? అర్ధరాత్రి దాటందే పడుకోరా." ప్రశ్నించాడు మూర్తి.

"బాగా చెప్పావులే మూర్తీ! గంట పది కొట్టడమే ఆలస్యం. మేష్టరుగారి విషయంలో పడుకోవడం వేరు, నిద్రపట్టడం వేరు కావు. పడుకోవడమంటే నిద్రపట్టిందన్నమాటే!"

ఏవో వివరాలైతే తెలిశాయిగాని అసలు విషయం మాత్రం దొరికింది గాదు.

డాక్టరుగారి సైకిల్ మళ్ళీ పురవీధుల వెంట బయల్దేరింది. మార్గమధ్యంలో శంకరశాస్త్రిగారు ఎదురయ్యారు. బిగ్గరగా కేకబెట్టి ఆయన మూర్తిని సైకిలునుంచి క్రిందికి దింపించారు.

"అదేమిటోయ్ మూర్తీ! చిన్ననాటి గురువుని! డాక్టర్లకు చిరకాల మిత్రుణ్ణి! నిరంతర వైద్యశాస్త్ర ప్రయోగాలకు ఎడతెగని ముడివస్తువుని! నన్ను పలకరించకుండా వెళ్ళిపోవడం న్యాయమా?" నిలదీసి అడిగారాయన.

"అబ్బే! నేను మీవైపు చూడ్డం తటస్థించలేదండీ మేష్టరుగారూ! సెలవులో ఉన్నారేమిటి?"

"ఆ మాటెందుకులే మూర్తీ! కాజువల్ లీవులు, ప్రివిలేజిలీవులు జూనుకే అయిపోయాయి. సిక్‌లీవుగూడా గడువు మీరిందని లాస్ ఆఫ్ పే చేస్తామంటున్నారు. సింహాద్రి డాక్టరుకు రెస్టు రెస్టనడం పరిపాటి. రెస్టువల్ల నాకు కలిగే నష్టం సంగతి ఆయన ఆలోచించడు. అప్పటికీ హెడ్మాస్టరుగారు మంచివారు గనుక నా ఆటలు సాగుతున్నాయి..."

"అన్నట్టు హెడ్మాస్టరుగారి కెప్పుడూ ఇలాంటి సెలవుల్ని వాడుకునే అవసరం తగలదా మేష్టరుగారూ?" కుతూహలంతో అడిగాడు మూర్తి.

"ఆయనా! ఆయనకు సెలవులెందుకు? ఆదివారంనాడు తప్పనిసరిగా బడి మూసేయవలసి ఉంటుందనే ఆయనకు విచారం! ఇంచుమించుగా నేనూ ఆయనతో బాటుగానే సర్వీసులో చేరానా మూర్తీ! ఆనాటినుంచీ చూస్తున్నాను. ఒళ్ళు నలతగా ఉందన్న కారణంతో ఓ అరరోజు సెలవుపెట్టిన పాపానపోయాడు కాదు మహానుభావుడు! ఏ అమ్మగన్న బిడ్డో, ఏ అమృతరసాయనం సేవించాడో, దినదినప్రవర్ధమానమైన ఆయన ఆరోగ్యభాగ్యానికి వెనుకనున్న కిటుకేమిటో..."

అర్ధోక్తిలో ఆగిపోయారు శాస్త్రిగారు. మూర్తికిగూడా ఆ క్షణాన అనివార్యంగా ఓ సందేహం కలిగినమాట నిజం! హెడ్మాస్టరుగారన్న పేరుతో వ్యవహరించబడుతున్న ఈ వ్యక్తి నిజంగా ఓ మనిషేనా, కాకపోతే నియమబద్ధంగా పనిచేస్తున్న ఒక యంత్రమా అని! మనిషైతే ఒకప్పుడు గాకపోయినా ఒకప్పుడు రోగాలకు రొస్టులకు లోనుగావడం సహజం! మరలు విరిగిపోవడంవలన, బిస చెడిపోవడంవల్ల ఒక్కొక్కప్పుడు యంత్రమైనా దారితప్పడం కద్దు! మేష్టరుగారు రెంటికీ చెడిన రేవడిలా ఉన్నారు!

అన్వేషణకు ఫలితం ఒక అసందిగ్ధమైన నిర్ణయానికి చేరుకోలేకపోయాడు మూర్తి. భాగ్యలక్ష్మికి మల్లే ఆరోగ్యలక్ష్మికూడా అకారణంగానే కొందరిని అనుగ్రహిస్తుందేమో! మరి కొంతమంది ఎంతగా వేడుకొన్నా దగ్గరికి రాక దవుదవ్వులనే ఉండిపోతుందేమో...

***

విజ్ఞానం అంతులేనిది. తృష్ణ అంతకన్నా అంతులేనిది. ఆ రెండూ కలిస్తే ఒకరు చెప్పేదేముంది? జ్ఞానతృష్ణ పూర్తిగా ఉపశమించడానికి కొన్ని ఆయుష్కాలాలైనా చాలకపోవచ్చు.

నాలుగేళ్ళ శాస్త్రాధ్యయనంతోనూ, ఒకటి రెండేళ్ళ అనుభవంతోనూ మూర్తికి సంతృప్తి కలిగింది కాదు. శస్త్రచికిత్సపైన క్రొత్తగా కనుగొన్న విశేషాలను అభ్యసించే నిమిత్తం ఉత్తరదేశం వెళ్ళి రెండేళ్ళ ఒప్పందంపైన అక్కడొక మిషనరీల ఆసుపత్రిలో అతడు ఉద్యోగానికి కుదిరాడు. నిపుణులైన వైద్యులు, కొంగ్రొత్త చికిత్సా విధానాలు, ఆధునికమైన ఉపకరణాలు, అన్నింటినీ మించి వైద్య శాస్త్రంలో ఏ ప్రయోగం చేయాలన్నా అందుకనువుగా లభ్యమయ్యే జబ్బులు, అంతా బాగానే ఉందిగాని ఎందుకో తన హృదయంలో అశాంతి చోటు చేసుకుంటున్నట్టు తోచింది మూర్తికి! బహుశా వూరు విడిచి దూర ప్రాంతానికి తరలి రావడమే అందుకు కారణం గావచ్చు. ఐనా ఈ ప్రవాస జీవితం ఎంతకాలం! ఇలా చూస్తుండగానే రెండేళ్ళు గడచిపోవూ? కార్యసాధకుడు కష్టాన్నిగానీ సుఖాన్నిగానీ లెక్కకు రానీయడని భర్తృహరి చెప్పనే చెప్పాడుకదా!

రెండేళ్ళ శిక్షణ కాలంలో ఆరుమాసాలు గడిచిన తరువాత ఓరోజు రాత్రి మలిజాము వేళ వాలుకుర్చీలో కూర్చుని ఆనాటి టపాలో వచ్చిన దినపత్రిక చదువుకుంటున్నాడు మూర్తి. పతాక శీర్షికలో నదీజలాల తగాదాను పరికించి, రెండో పేజీలో క్రీడా విశేషాలను గమనించి, మూడో పేజీలోనికి వచ్చేసరికి తనకోసం కాచుకుని ఉన్న మహత్తరమైన వార్త ఒకటి మూర్తికక్కడ దృగ్గోచరమైంది. రెండు కాలములమేరకు విస్తరించిన ఆ వార్త కనుబంధంగా ఓ ఛాయాచిత్రంకూడా ప్రచురింపబడింది. రాష్ట్రపతి దగ్గరనుంచి ఓ ఉపాధ్యాయుడు బహుమానం అందుకుంటున్న దృశ్యం. జాతీయ గౌరవానికి పాత్రుడైన ఆ ఉపాధ్యాయుణ్ణి మొదటి చూపులోనే పోల్చుకోగలిగాడు మూర్తి. వెంటనే వార్తను సాకల్యంగా చదివేశాడు. విద్యాబోధనకు జీవితాన్ని అంకితం చేసి ఆ రంగంలో దేశానికి గొప్ప సేవచేసిన ఆచార్యులను జాతీయ స్థాయిలో గౌరవించడం ఇటీవలి సాంప్రదాయం. ఈ ఏడు ఆ విధంగా గౌరవింపబడిన నలువది మంది ఉపాధ్యాయుల్లో నారాయణరావు గారొకరు. వార్త క్రింద సంగ్రహంగా జీవిత విశేషాలను పొందుపరచడం గూడా జరిగింది. ఒకే పాఠశాలలో ముప్పై ఏళ్ళ సర్వీసు. బడిని గుడిగా దిద్దితీర్చిన కార్యదీక్ష. ఎన్ని ఒత్తిళ్ళు వచ్చినా నీతిపథంనుంచీ తప్పి నడవని అసిధారావ్రతం. ఇంకా సంఘసేవ కార్యక్రమాలు...

ఐదు నిముషాలవరకూ కళ్ళు మూసుకుని నిశ్చలంగా కూర్చున్నాడు మూర్తి. అంతసేపూ అతడొక రకమైన తన్మయత్వాన్నే భజించాడు... న్యూఢిల్లీ నగరం. రాష్ట్రపతి భవనం. సభాసీనులైన పెద్దల సమక్షాన సన్మానం. పోగా చిరకాలంనుంచి తనను వెంటాడుతూ వచ్చిన ఓ ధర్మసందేహంనుంచి విముక్తి పొందినట్లుగా మనసు తేలిక పడిందిగూడా! ఇది మానవ సామ్రాజ్యంపైన యాంత్రిక నాగరికత పెత్తనం చలాయిస్తున్న కాలం. నిజమైన పనితనంతో గాకుండా పోజులుపెట్టి దాబులుకొట్టి పబ్బం గడుపుక పోవడానికి వీలున్న రోజులు. జీవితకాలంలోనూ, జీవశక్తిలోనూ ఎక్కువ భాగాన్ని ఒక సంస్థకు, లేదా ఒక సత్కార్యానికి ధారబోసిన వ్యక్తులకు పరిగణన లభించదేమోనన్నదే తన సందేహం! ఆ సందేహం వట్టి సందేహమేననీ, సిద్ధాంతంకాదనీ తేలిపోయింది.

అప్పటికప్పుడు తన ఆనందాన్ని ఉత్తరంలో యిమిడ్చిన తర్వాతగాని మూర్తికి నిద్ర పట్టిందిగాదు. తోటలో పువ్వులు పూస్తే వాటిలో భగవంతుడి కైంకర్యంలో చరితార్థత పొందేవి కొన్ని. భామినుల కేశపాశాలకు అలంకారంగా చెన్నుమీరేవి కొన్ని. పరిమళ ద్రవ్యాల తయారీకి ఉపకరించేవి కొన్ని. ఆకులు రాలని, పూలు వాడని సంసదారామం లాంటిది విద్యాలయం. విద్యార్థులు పువ్వులు, ఉపాధ్యాయుడే తోటమాలి. అబ్బో! ఎందరు శిష్యులు మేష్టరుగారికి! విదేశాల్లో ఉన్నతోద్యోగులుగా కొందరు. మంచుకొండ శిఖరాల్లో మాతృదేశ రక్షణార్థమై దీక్షాకంకణులై కొందరు. దారిద్ర్య నిర్మూలనంకోసం నదీజలాలకు ఆనకట్టలు కట్టే బృహత్కార్యాల్లో నిమగ్నులై కొందరు. ఇంకా తనలాంటి డాక్టర్లు, కార్మికులు, గుమస్తాలు – వేల సంఖ్యలో ఉన్న శిష్యులకింతకంటే శుభ వర్తమానం మరేముంటుంది? వందలకొలది అభినందన లేఖల్లో తనదీ ఒకటి–

మరునాటినుంచి మరింత శ్రద్ధగా దినపత్రికను గమనింపసాగాడు మూర్తి. ఏ వార్తలకోసమైతే తానెదురు చూచాడో అవి ఒకరోజు గాకపోతే మరొకరోజు, విపులంగా గాకపోతే టూకీగానైనా కనిపించేవి. ముఖ్యంగా చెప్పుకోదగినది పురపాలక సంఘంవారు మేష్టరుగారికి చేసిన పౌరసన్మానం. అంతకుమునుపు ఆయన రాజధానినుంచి తిరిగివచ్చిన సందర్భంలో జరిగిన ఊరేగింపుకూడా గణనీయమైనదే! దారి పొడుగునా మేళతాళాలతో, పుష్పవర్షంతో, విద్యార్థుల కోలాహలంతో సాయంకాలం ఆరుగంటలప్పుడు స్టేషను దగ్గర ప్రారంభమైన ఊరేగింపు మేష్టరుగారిల్లు చేరుకునేసరికి రాత్రి పది గంటలు కావచ్చింది. మరునాడు పాత విద్యార్థుల సంఘంవారు పట్టు శాలువాలు కప్పి, రజత శారదా విగ్రహాన్ని బహూకరించారు. సమావేశానికి అధ్యక్షత వహించిన జిల్లా కలెక్టరుగారు మేష్టరుగారికి ఆ గౌరవం లభించడంలో ఉన్న ఔచిత్యాన్ని గురించి నాలుగు మాటలు చెప్పారు– "మానవుడికి ఘనత నాపాదించే హంగులు చాలా వున్నాయి. మొదటిది డబ్బు. లాటరీలో లక్షరూపాయలు రావచ్చు. అవినీతే ప్రాతిపదికగా అంత మొత్తం గడించవచ్చు. అలాకాకుండా న్యాయానికి సేగిలేని పద్ధతిలో లక్ష రూపాయలు గడించడంలో విశిష్టత ఉందని చెబితే అందుకభ్యంతరం చెప్పేవాళ్లుండరు. మేష్టరుగారికి కీర్తి లాటరీలో వచ్చిన ప్రైజుగాదు. కనుకట్టుతో, మంత్రతంత్రాలతో సంపాదించిందిగాదు. వెనుక ముప్పదేళ్ళ నిర్విరామ కృషి ఉండనే ఉంది."

మూర్తి మరికొంత దూరం ఆలోచించాడు – నిజమే! సేవ, త్యాగం, ఉపకార పారీణత మొదలైన సద్గుణాలవల్ల జేబులు నిండవు. కీర్తి మాత్రమే లభిస్తుంది. అదికూడా లభించకపోతే ఇక లోకంలో సదుద్యమాలకు తావే ఉండదేమో!

మూడు మాసాలవరకు పత్రికలో అడపాదడపా సన్మాన వార్తలు చూస్తూ వచ్చాడు మూర్తి. బడిలోని పిల్లలందరూ కలిసి ఒకసారి, ఉపాధ్యాయులందరూ ఒకసారి మేష్టరుగారిని సన్మానించారు. జిల్లాలోని పేరెన్నికగన్న పాఠశాలలు ఆయన్ను పిలిపించుకుని విందులిచ్చి వేనోళ్ళ ప్రశంసలు కురిపించి తమవంతు తాము చెల్లించుకున్నాయి. ఎటొచ్చీ మూర్తికొక్కటే కొరత. ఆ ఆనందంలో తను పాలు పంచుకోడానికి వీల్లేకపోయింది. ఉత్సాహ సంబరంలో ఉండిపోయారేమో, మేష్టరుగారు తన జాబుకు బదులుగూడా వ్రాశారు కారు.

అక్కడ తన జాబుకు జవాబు రానందుకు మూర్తి కించపడడము, యిక్కడ రావుగారు అతని జాబుకు బదులు వ్రాయడము రెండూ బహుశా ఒక్క సమయాన్నే జరిగి ఉండవచ్చు. మూడోనాటి సాయంకాలం టపాలో మూర్తి ప్రత్యుత్తరం అందుకున్నాడు. ఒకటికి రెండుసార్లు చదివాడు. చదువుతూ అది మేష్టరుగారు తనకు వ్రాసిన ఉత్తరం కాదేమో ననుకున్నాడు. కాకపోతే మేష్టరుగారికి అనారోగ్యమా! అందులోనూ తీవ్రమైన అనారోగ్యం! పాఠశాలకు రెండు నెలలు సెలవు పెట్టవలసిన అనారోగ్యం! ఇలా జరగవచ్చునని తను కలలోనైనా అనుకోలేదు...

విచ్చిపోయిన దుర్గంలోనికి శత్రువులు చొచ్చుకుని వచ్చినట్టుగా మేష్టరుగారి ప్రశాంత జీవనంలోకి అనారోగ్యం ఎలా ప్రవేశించినట్టు? ఎలా ప్రవేశించిందో గాని

ఉత్తరంలో ముప్పాతికా మువ్వీసంవంతు దాని వర్ణనతోనే సరిపోయింది. ఎంతోకాలం సాధన చేస్తేగాని భక్తుడికి భగవంతుడిపైన ఏకాగ్రత కుదరదు. రోగి సంగతలా కాదు. రోగి ధ్యాసంతా రోగంపైకి మళ్ళడానికి ఎంతటి స్వల్ప కాలమైనా చాలు...

మూడో పర్యాయం ఉత్తరం చదువుకున్నాడు మూర్తి.

“తన సంతోషమే స్వర్గము, తన దుఃఖమే నరకమన్న ఆర్యోక్తిని ఎరుగుదువా మూర్తీ! ఆ మాటల్లో ఎంతో నిజం ఉంది. నువ్వు కాన్సరంటావు. టి.బి అంటావు. అదంటావు, ఇదంటావు. కాని అవన్నీ నా జబ్బు ముందు దిగదుడుపుకైనా పనికిరావని నేననుకుంటాను. డాక్టర్లతో సంప్రదించడం మూడు మాసాల క్రిందటే ప్రారంభమైంది. ఆ ప్రారంభం ఏ దుర్ముహూర్తాన జరిగిందోగాని నాటినుంచీ నేటి వరకూ ఈ వ్యాధి రోజుకొక విచిత్ర వినూత్న పరిణామంతో నన్ను వేధించుకతింటోంది. కొంతసేపు కుర్చీలో కూర్చుంటే వెన్నెముకలోపలి భాగాన సూదులతో పొడిచినట్లుగా బాధగా ఉంటుంది. అరమైలు దూరం నడిస్తేసరి బడలికవల్ల ఎక్కడ బడితే అక్కడ కూలబడి పోదామనిపిస్తుంది. ఒక్కొక్కప్పుడు ఎందుకో హఠాత్తుగా తలనొప్పి తరుముకొచ్చేస్తుంది. రైలు రానున్నందుకు గుర్తుగా రెక్కమాను వంగడంలేదా మూర్తీ! ఆ మాదిరిగా నొప్పి రావడానికి ముందుగా పట్టుకారుతో బిగనొక్కినట్టుగా తల ఇనుపగుండులా స్తబ్ధమై పోతుంది. ఇవి మాత్రమేగాదు. ఈ అవలక్షణాలన్నింటికీ తలమానికమైనది వేరొకటుంది. నా ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో మునుపెన్నడూ నాకు ప్రమేయం ఉండేది గాదు. ఇప్పుడలాకాదు. ఎడమవైపు శ్వాస బరువెక్కినట్టు తోస్తుంది. ఒకప్పుడు ప్రయత్న పూర్వకంగాగానీ వూపిరాడదు...

ఉత్తరం పూర్తిగాక మునుపే మూర్తి ఆలోచనలన్నీ ఒక్కసారిగా వైద్యశాస్త్ర వీథుల వెంట పరవళ్లు ద్రొక్కసాగాయి. ఈ అనారోగ్య లక్షణాలకు హేతువైన జబ్బులు నాలుగైదున్నాయి. సామాన్యులైన వైద్యులు ఆ నాలుగైదింటినీ ఒక్కటే పేరుతో వ్యవహరిస్తారు. శాస్త్ర సాంప్రదాయరీత్యా ఆంగ్లంలో దానిపేరు పల్నాడు చేంతాటితో పోటీ పడదగినంత పెద్దది. తెలుగులో ముక్తసరిగా నరాల నిస్సత్తువ అని పేర్కొనవచ్చు.

మళ్ళీ ఉత్తరంలో పడ్డాడు మూర్తి.

“మీ పెద్దమ్మదొకటే గోల! నేను తగు జాగ్రత్త వహించడం లేదని! ఆమె ఉద్దేశంలో జాగ్రత్త అంటే ఏమిటో నాకర్థం గాదు. లోకంలో ఎన్నో వైద్యశాలలున్నాయి. తీరు తెన్నులనుబట్టి చూస్తే అవి రోగాలకు నిలయాలనుకోడానికి మనసొప్పదు. అక్కడ రోగ దేవతకు జరిగే పరిచర్య గూడా ఎంతో ఖరీదుతో కూడుకున్నది. పోగా నిష్కర్షగా ఇంతకాలంలో జబ్బు నయమైపోతుందన్న పూచీ ఏమీ ఉండదు. ఈ పరిస్థితిలో రోజుకు పాతిక రూపాయల చొప్పున వెచ్చిస్తూ ఆసుపత్రుల్లో ఉండగల స్తోమతు నాకు లేదు. లేదని చెబుతే మీ పెద్దమ్మ ఒప్పుకోదు. చెవిలో ఇల్లు గట్టుకుని సరిపోరుతుంది. రోగమే ఒక బాధ కాగా నా పాలిట కిదొక అదనపు బాధగా పరిణమించింది. డాక్టరు సింహాద్రిగారుండనే ఉన్నారు. ఆయుర్వేద వైద్యులు అప్పల నరసయ్యగారు వారానికొకటి రెండుసార్లు వచ్చి చూచిపోతున్నారు. ఇక్కడి గవర్నమెంటు ఆసుపత్రికి కనకాచలమని క్రొత్త డాక్టరు వచ్చాడు. నా యీ జబ్బు నయం చేయాలన్న శ్రద్ధ, పట్టుదలా పై ముగ్గురిలోనూ ఒకటే

సమాన నిష్పత్తిలో ఉందని నా నమ్మకం; కాని, మీ పెద్దమ్మ అలా అనుకోదు. ఆమె నమ్మకం ఇరుగింటివాళ్ళు, పొరుగింటివాళ్ళు, బంధువులు, మిత్రులు మొదలైన శ్రేయోభిలాషుల సలహా మేరకు దేశంలో ఎందరెందరు ఘనవైద్యులైతే ఉన్నారో, వాళ్ళందరిపైకీ శాఖాచంక్రమణం చేస్తుంది. అలాంటి అసంఖ్యాకులైన వైద్యుల్లో నువ్వొ ఒక్కడివి. ఆమె దృష్టిలో నీకొక్క అదనపు క్వాలిఫికేషనుకూడా ఉంది – నువ్వు నా శిష్యుడవని!"

ఉత్తరాన్ని టేబిలుపైకి విసిరాడు మూర్తి. చివాలున పైకి లేచాడు. పెద్దమ్మ కంగారు పడడంవల్ల నైతేనేమి పరామర్శించే డాక్టర్ల సంఖ్య హెచ్చుడంవల్లనైతేనేమి, మేష్టరుగారికి యిదేదో తీవ్రమైన జబ్బన్న అనుమానం కలిగినట్టుంది! ఒకవేళ ఇది తీవ్రమైన జబ్బే ననుకుందాం. దివ్యౌషధాలున్నాయిగదా! ముసలి డాక్టర్లకు పాతవాటి పైనేగానీ కొత్త మందులపైన విశ్వాసముండదు. ఒక ఆయుర్వేద వైద్యుడి దృష్టిలో ఆయుర్వేదమే వైద్యం. వాళ్ళు క్రొత్త క్రొత్త వైద్య గ్రంథాలను చదువరు. క్రొత్త మందులను ఉపయోగించి వాటి ఫలితాలను గమనించరు. కాకపోతే ఒకరికి ముగ్గురు డాక్టర్లు చికిత్స చేసినా మేష్టరుగారి జబ్బు నయం కాలేదంటే అర్థమేమిటి? వాళ్లు దగ్గరుండీ చేయలేని పనిని యింత దూరంనుంచీ పట్టుమని పదిరోజుల్లో చేసి చూపడం తన చేతనౌను.

మరునాడు మూర్తి దగ్గరనుంచి రావుగారికొక మందుల పార్సెలు వెళ్ళింది. ఔషధ సేవనం జరుగుతోందనీ, గుణం కనిపిస్తూనే ఉందనీ మేష్టరుగారు బదులుకూడా వ్రాశారు.

ఆ జాబును పదిమంది డాక్టర్లకు చూపించాడు మూర్తి. వాళ్ళు పదిమందీ పదిరకాల సూచనలు చేయగా వాటినన్నిటినీ తాను మథించగా, అప్పుడు స్ఫురించిన క్రొత్త మందులను జతచేసి మేష్టరుగారికి మళ్ళీ ఒక మందుల పార్సెలు రవాణా చేశాడు.

నెల రోజులు గడిచిపోయాయి.

రావుగారి దగ్గరనుంచీ మూడో ఉత్తరంకూడా వచ్చింది. జబ్బు నయం కావస్తోందని! తనకేవిధంగా కృతజ్ఞత తెల్పుకోవాలో తోచడంలేదట!

***

శిక్షణాకాలం పూర్తయి స్వస్థలానికి మరలివచ్చిన మూర్తి వారం రోజులు హాయిగా విశ్రాంతి తీసుకున్న తరువాత మళ్ళీ బోర్డు తగిలించి డిస్పెన్సరీ తెరిచాడు. ఆలోగా పట్టణంలో తాను కలుసుకోదగిన పెద్దలనందరినీ కలుసుకున్నాడు. ఆ వారం రోజుల్లో అతడు ఒకరోజు రోజంతా మేష్టరుగారి యింటిదగ్గరే గడపవలసి వచ్చింది. పుట్టింటికి వచ్చిన ఆడుపడుచుకు జరిగినట్టుగా మూర్తికక్కడ రాజోపచారాలు జరిగాయి. "ఏం చెప్పమంటావు మూర్తీ! గడచిన అయిదారు నెలలుగా మేము మనుషులమే కామనుకో! అంతగా బెంబేలు పడిపోయాము. చివరికెలాగైతేనేం, కొండలా వచ్చిన ఆపద మంచులా కరిగిపోయింది. అంతా భగవంతుడి కృప" అంది శ్రీదేవమ్మ.

మూర్తి మనస్సు చివుక్కుమన్న మాట నిజం! ఎంతోకొంత మానవ ప్రయత్నం స్పష్టంగా కళ్ళకు కనిపిస్తుండగా అంతా భగవంతుడి కృపే ననుకోడం ఏం సబబు? ఆ మాటకొస్తే దృగ్గోచరమయ్యేదొక్క మానవ ప్రయత్నమేగదా! భగవంతుని కృప అన్నదొకటి

ఉందో లేదో ఎవ్వడెరుగును? లేదంటే ఇందులోని అంతరార్థాన్ని ఈ విధంగా విడమరిచి చెప్పుకోవచ్చు- అవసరానికి కెంతగా ఆదుకున్నా డాక్టర్లు మానవమాత్రులు మాత్రం గాకపోరు. ఆరోగ్యం చెడిన రోజుల్లో వైద్యుడే నారాయణుడుగా కనిపిస్తే కనిపించవచ్చు. కాని, ఆ తరువాత డాక్టరుతో అవసరముండదు. రానూ వచ్చి, పోనూ పోయిన జబ్బు మళ్ళీ రాకుండా ఉండాలనుకోడం మానవ స్వభావం. ఈ కోరిక నెరవేరడానికి డాక్టరు తోడ్పాటుకన్నా భగవంతుడి కృపే అవసరమేమో!

ఆ విధంగా ఎదుటివారి ధోరణికి తనకు తోచిన వ్యాఖ్యానం చెప్పుకున్నాడు మూర్తి. కానైతే యిందులో తన ఊహకు మించిన నిజాలు ఉండగలవన్న ఊహ అతడికి లీలగానైనా స్ఫురించిందిగాదు. పదిరోజుల తర్వాత డాక్టరు సింహాద్రిగారితో మాట్లాడు తుండగా విషయం బయటపడింది.

"రెండేళ్ళుగా నువ్వు ఊళ్ళో లేకపోయావా మూర్తీ! నువ్వుంటే నాకు కాస్త రిలీఫ్ ఉండేది. ఎందుకులే, నా అవస్థ ఆ దేవుడికే ఎరుక! తిండి తినడానికైనా తీరికుండేదిగాదు. ప్రతిరోజూ పది పదిహేను చోట్లకు వెళ్ళవలసి వచ్చేది. మిగిలినవన్నీ ఒక ఎత్తయితే హెడ్మాష్టరుగారి కేసు ఒక ఎత్తు. వచ్చిన చిక్కు ఆయనతోగాదు. ఆయన భార్యకు ధైర్యం చెప్పేసరికి తలప్రాణం తోక కొచ్చినంత పనయ్యేది. ఎలాగైతేనేం, ఆ జబ్బును నయం చేసేశాను – ఊపిరి త్రిప్పుకోగలిగాను..."

"మీరు నయం చేశారా?" అప్రయత్నంగా ప్రశ్నించాడు మూర్తి.

"మరి? ఈ మధ్య నువ్వు అప్పల నరసయ్యను కలిశావా ఏమిటి మూర్తీ! అదేదో సింధూరమట! దాంతో ఆ రోగం నయమై పోయిందని అతగాడు గొప్పలు చెప్పు కుంటున్నాడట! నాతో చాలామంది చెప్పారు..."

"అబ్బే, అప్పల నరసయ్యగాదు..."

"మరైతే డాక్టరు కనకాచలమై ఉంటాడు. ఏమైనా అతడి నిజాయితీ మాత్రం మెచ్చుకోదగ్గది. చాటునా మాటునా గాకుండా నా ముఖాన్నే చెప్పేశాడు – హెడ్మాస్టరుగారికి జబ్బు నయం చేసిన ఘనత తనకే దక్కాలని! ఆ మాటమీద మాకు జటాబొటీ జరగడంగూడా జరిగింది..."

అంతపనికి సిద్ధంగా లేడు మూర్తి. పైగా సత్యాన్ని తేల్చుకోడానికి ద్వంద్వయుద్ధమే సజావైన పద్ధతన్న సూత్రంపట్ల అతడికి నమ్మకంగూడా లేదు. అతడు మెల్లగా పైకి లేచి నేరుగా కథారంగానికే దారి తీశాడు.

వెళ్ళిన సమయానికి రావుగారింట్లో లేరు.

"కూర్చో మూర్తీ! ఆరోగ్యం కుదిరిందిగా, అయ్యగారింట్లో లేరు. షికారుకు వెళ్ళినట్టున్నారు. వచ్చేస్తారు కూర్చో" అంది శ్రీదేవమ్మ.

పది నిమిషాలసేపు ఆ మాటా యీ మాటా మాట్లాడి అసలు విషయంలోకి వచ్చేశాడు మూర్తి.

అంతా విన్నాక పెద్దమ్మగూడా అయోమయమైన అభిప్రాయాన్నే వెలిబుచ్చింది. నిజానికి తమకుగూడా అంతుబట్టని రహస్యం అదేనట! వాడడానికైతే అందరి మందులూ

వాడడం జరిగిందట! వాటిలో ఎవరి మందువల్ల ఆరోగ్యం కుదిరిందోగాని, అది తమ పాలిటకొక ధర్మసందేహమైపోయిందట!

అప్పుడిక తాను పంపిన మందుల ప్రాశస్త్యాన్ని గురించి ఉగ్గడించక తప్పిందిగాదు మూర్తికి!

"ఉండుండు మూర్తీ! మనలో మనకు సందేహాలెందుకు? అలమారా తెరిచి చూస్తే సరిపోదూ!"

తలుపులు తెరిచింది శ్రీదేవమ్మ. అలమారా చిన్నసైజు మందులంగడిలా ఉంది. అరల నిండుకూ రకరకాల మందుల సీసాలు, అట్టపెట్టెలు, ప్లాస్టిక్ డబ్బీలు చెల్లాచెదురుగా పడి ఉన్నాయి. కొన్ని సీసాలకు వేసిన సీలు వేసినట్టే ఉంది. మిగిలిన వాటిలో ఒకటి రెండు ఔన్సుల మేరకు ఖాళీ అయివున్న సీసాల సంఖ్యే హెచ్చు. సూది మందులు కొన్ని ఆలనా పాలనా లేకుండా ఒకదానిపైన ఒకటి పడి ఉన్నాయి. అన్నింటిలోనూ తాను పంపిన ఔషధాల ఆచూకీకోసం తీవ్రంగా పరిశీలించి చూడసాగాడు మూర్తి. క్రింది అరలో పార్సెలు కనిపించింది. అది తను రెండోసారి పంపిన పార్సెలు! మందపు కాగితాల దిగ్బంధనంతో, బిగదీసికట్టిన నూలు దారాలతో, ఆఖరుకు లక్క సీళ్ళతో సహా అది తనెలాగైతే పంపాడో అలాగే సురక్షితంగా ఉంది!

మూర్తి నిర్విణ్ణుడైపోయాడు. మేష్టరుగారు జబ్బునుంచి కోలుకున్నారు. ఆ కోలుకోడానికి హేతుభూతుడైన వైద్యుడెవరో ఆయనకు తెలిసి ఉండకపోదు. మరైతే ఈయన వరసగా డాక్టర్ల నందరినీ మభ్యపెట్టి ఇలా కపట నాటకం ఆడవలసిన అవసరం ఏమై ఉంటుంది?

శ్రీదేవమ్మ ఏమిటో మాట్లాడుతోంది. ఆ మాటలేవీ మూర్తి బుర్రకెక్కడంలేదు. మేష్టరుగారు చడీచప్పుడూ లేకుండా ఎప్పుడో వచ్చారు. వచ్చి మూర్తి కెదురుగా కుర్చీలో కూర్చున్నారు.

"వచ్చేశారా! ఆలస్యంగాకుండా సమయానికే వచ్చారు. ఎందుకంటారా! మూర్తికొక టెంకాయ దొరికింది. దాన్ని పగలగొట్టాలంటే ఇందాకటి వరకూ రాయే కనిపించింది గాదు..."

"ఇప్పుడు కనిపించిందన్నమాట!"... రావుగారు తెరచిఉన్న అలమారా వైపు చూశారు. కొశ్చన్‌మార్కులా ఉన్న మూర్తి ముఖంలోకి చూచారు. అంతకుమునుపు ద్వారంలో అడుగుపెట్టినప్పటినుంచి హాల్లోకి వచ్చేదాకా ధారాపాతంగా వినవచ్చిన శ్రీదేవమ్మ ప్రసంగంనుంచి ఆయన అసలు విషయం గ్రహించే ఉన్నారు.

"చూడు మిస్టర్ మూర్తీ! ఈ ప్రపంచం ఎలా సృష్టింపబడిందన్న ప్రశ్నను నువ్వు జీవితంలో వందసార్లయినా విని ఉంటావు. అన్నిసార్లు దాన్ని గురించి ఆలోచించిగూడా ఉంటావు. పైకి చూడ్డానికి అది చాలా మామూలు ప్రశ్న. కాని ఒక పట్టాన సమాధానం స్ఫురించని చిక్కుప్రశ్నకూడా అదే!"

"కావచ్చు."

"అలాగే నువ్వు రెండేళ్ళకు మునుపు నన్నో ప్రశ్న అడిగావు..."

"........."

"నీకు జ్ఞాపకం ఉండకపోవచ్చు. ఏమైనా అది నీలాంటి డాక్టరు డాక్టరీ విద్యతో ఏ మాత్రమూ పరిచయంలేని నాబోటి సాధారణ వ్యక్తిపైన ప్రయోగించవలసిన ప్రశ్న మాత్రం కాదు..."

"........"

"పోనీ, నేనే చెబుతాను. మనుషులకు జబ్బు లెందుకొస్తాయన్నది నీ ప్రశ్న. అవునా మూర్తీ?"

"అవును. దానికి సమాధానం ఎప్పుడైనా తీరిగ్గా ఆలోచించి చెబుతామన్నారు."

"ఆలోచించాను. ఈ మధ్య కొంతకాలం తీరిగ్గా అంపశయ్యపైన ఉండిపోయాను గదూ! ఒకానొక గొప్ప ప్రశ్నకు సమాధానం తెలుసుకోగలిగాను గనుక ఆ కాలం సద్వినియోగమైనట్టే!"

"చెప్పండి."

"నాకూ చెప్పాలనే ఉంది. లేనిపోని మాటలతో, శ్రోతలను అట్టే విసిగించడం మంచి పద్ధతి కాదు. కానీ నీ ప్రశ్నకు సమాధానం చెప్పేముందు నీకో చిన్న కథ చెప్పడం బాగుంటుందేమోనని..."

"కథకేం భాగ్యం మేష్టారూ? భేషుగ్గా చెప్పండి. అవసరమైతే ఒక ఉపోద్ఘాతాన్నికూడా జోడించి మరీ చెప్పండి."

"మనిషికి జబ్బులెందుకొస్తాయన్నది నీ ప్రశ్న! మనిషికి జబ్బులేగాదు. ఇంకా చాలా వస్తున్నాయి. సుఖాలు, కష్టాలు, ఆనందాలు, ఆందోళనలు మొదలైనవి. చిన్న చిన్న పరీక్షలతో డాక్టర్లు రోగ నిదానం చేయగలరు. మనిషి దిగులుగా ఉన్నాడా, లేక ఆనందంగా ఉన్నాడా అని తెలుసుకోడానికి ఆ మాత్రం పరీక్షలుకూడా అక్కర్లేదు..."

"ఎందుకూ! వాలకాన్నొకసారి ఎగాదిగా చూస్తే తెలిసిపోదూ..."

'మనిషి ఆనందంగా ఉన్నాడనుకో! ముఖం విప్పారి కలకలలాడుతుంది. కళ్ళల్లో కాంతి చిప్పిల్లుతుంది. శరీరం దూదిపింజలా తేలికై ఆకాశవీధుల్లో సంచరిస్తున్నంత హాయిగా ఉంటుంది. మనిషి దిగులుగా ఉన్నాడనుకో? ముఖాన మసిపూసినట్టుంటుంది. శరీరాన్ని లాక్కెళ్ళడం ఓ కొండను కదిలించినంత శ్రమగా ఉంటుంది. మిన్నులు విరిగి తలపైన పడిపోగా శరీరం భూమిలోకి క్రుంగిపోతున్నట్టుంటుంది. మరైతే ఈ శరీరమన్న వెండితెరపైకి యిలా నిరంతరంగా రంగుల్ని ప్రసరిస్తున్న ప్రొజెక్టరు ఏదో చెప్పగలవా మూర్తీ!

"చెప్పలేకేం మేష్టారూ! దాన్నే 'మనసు' అనవచ్చు."

"వెండితెర ఒక్కటే! ఉన్న రంగులుకూడా కొన్ని మాత్రమే! ఆ రంగుల అన్యోన్య సమ్మేళనంవల్ల ఒకప్పుడు తెరపైని దృశ్యం ఆనందకరంగా ఉంటుంది. మరొకప్పుడు భయంకరంగా ఉంటుంది. సారాంశమేమిటో చెప్పనా మూర్తీ! మనసులో ఉదయిస్తున్న ప్రతి భావవీచికా శరీరంపైన తన ప్రభావాన్ని ప్రసరిస్తోంది..."

"అర్థమైంది."

"ఒక కథ చెబుతాను" అన్నారు రావుగారు.

"యుగాల క్రిందటి కథ. ఒక అరణ్యంలో ముగ్గురు రాక్షసులుండేవారు. మహా బలవంతులు. ఎందరెందరో ఒక్కుమ్మడిగా ప్రయత్నించి చూచారు. వాళ్ళని గెలవడం సాధ్యం కాలేదు. చివరకు పరాజితులందరూ కలిసి ఓ మహర్షిని ప్రార్థించారు – అసురుల విజయానికి వెనుకనున్న రహస్యమేమిటో చెప్పవలసిందని!

"మహర్షి వివరించాడు: పోరాడుతున్నప్పుడు తాము పోరాడుతున్నామన్న ధ్యాసగాని, పోరాటం ముగిసిన తర్వాత తాము విజయం సాధించడం జరిగిందన్న స్పృహగాని ఆ రాక్షసులకుండటంలేదు. వాళ్ళు తమను తాము విస్మరించి యుద్ధం చేస్తారు. ఆపైన తమ విజయాన్ని గురించే తలపెట్టరు గనుక – విజయోత్సాహంవల్ల వాళ్ళు ఉబ్బి తబ్బిబ్బులయ్యే అవకాశమే లేదు. అదే వాళ్ళ విజయానికి వెనుక ఉన్న రహస్యం..."

"ఐతే వాళ్ళని ఓడించడానికి ఉపాయమే లేదా స్వామీ!"– పరాజితులు దీనంగా ప్రశ్నించారు.

"లేకేమి!" అన్నాడు మహర్షి – "తాము బలవంతులమన్న స్పృహ వాళ్ళకు కలగాలి. తాము విజేతలన్న గర్వం వాళ్ళల్లో ఉద్భవించాలి. యుద్ధం చేసిందీ, విజయాన్నీ సాధించిందీ ఈ శరీరమేనన్న స్పృహ వాళ్ళకెప్పుడైతే కలుగుతుందో, ఆ క్షణాన్నే వాళ్ళ శరీరాలు వాళ్ళ పాలిటికి బందిఖానా లౌతున్నాయి. నేను చేస్తున్నాననే ధ్యాస, నేను గొప్పవాడినన్న గర్వం – యివి మానవుణ్ణి శరీరమన్న చెరసాలలో నిర్బంధించి వేస్తున్నాయి. ఆ భావాల ఒత్తిడివల్లనే శరీరం నజ్జు గుజ్జయిపోతోంది. ఆపైన వాళ్ళను జయించడం ఎంత పని?"

రావుగారు ముగించారు – "యిలాగే జరిగింది. రాక్షసులు ఓడిపోయారు..."

కొంతసేపు మౌనంగా ఉండి మళ్ళీ ఆయనే కొనసాగించారు. "తాను చేస్తున్నానన్న స్పృహకి అతీతమైన కర్తవ్య నిర్వహణవల్ల మానవుడు వజ్రకాయుడవుతాడు. అజేయుడవుతాడు. అందుకు విరుద్ధంగా స్వార్థాన్ని గురించిన చింత, కీర్తికి సంబంధించిన ఆకాంక్ష అతణ్ణి దుర్బలుణ్నిగా చేస్తున్నాయి. వాటివల్ల మనిషి క్రుంగిపోతున్నాడు. నీ ప్రశ్నకు సదుత్తరం లభించినట్టేనా మూర్తీ!"

"జబ్బెలా నయమైందో చెప్పారు కారు..."

"జబ్బొకరు నయం చేసేదిగాదు. ఆరోగ్యం ఎక్కడైతే ఉండాలో అక్కడ ఉండనే ఉంది. జీవితం సాగరమైతే, శరీరమే పడవ. సముద్రజలాలకు పడవను తేల్చివేసే శక్తి కద్దు. కాని ఎంతవరకు? పడవకు బొరియలు ఏర్పడనంతవరకు! దిగులుతో క్రుంగిపోవడం, ఆందోళనతో అలమటించడం, ఆరాటంతో కుమిలి పోవడం, స్వార్థ చింతలతో తనను తాను సంకుచితపరచుకోడం, కీర్తికి మురిసిపోవడంలాంటి అలతలతో, కలతలతో శరీర నౌక వికలం కాకుండా చూసుకుంటే చాలు. సునాయాసంగా జీవిత సాగరాన్ని తరించవచ్చు."

ఆలోచిస్తూ కూర్చున్నాడు మూర్తి.

❖ భారతి – డిసెంబర్, 1964. ❖

# అంగరక్షకుడు

వస్తుందేమో, వస్తుందేమోనని భయపడిన శ్రీముఖం రానేవచ్చింది. వచ్చిన శ్రీముఖం సీతాపతిని రామన్నపేటకు వెళ్ళమని ఆదేశించింది.

చెంపకు చపేటం తగిలినట్టుగా తృళ్ళిపడ్డాడు సీతాపతి. అమ్మో, రామన్నపేట! పేటగాదు, అది తనబోటి వారికి పద్మవ్యూహం. లోపలికి వెళ్ళచ్చు. కానీ భద్రంగా తిరిగిరావటం కష్టం!

సీతాపతికి స్వానుభవాలు లేనిమాట నిజమే! కాని కన్నవీ, విన్నవీ చాలా ఉన్నాయి.

నిరు డీలాంటప్పుడు రామ్మూర్తి రామన్నపేటకు వెళ్ళొచ్చాడు. ఎలా వచ్చాడు? అతడి దుస్తులన్నీ వెనుక భాగంలో నల్లటి, ఎర్రటి సిరా ముద్రలతో ఖరాబైపోయాయి. మధ్యాహ్న విశ్రాంతి సమయంలో ఓ తరగతి గదిలో పడుకుని కునుకుదీస్తుండగా, గోడకు తగిలించిన చొక్కాలోనుంచి ఎవరో పర్సును కాజేశారు. బస్సు ఛార్జీలకు ఎవరి దగ్గరో చేబదులు పుట్టించుకుని, వాడిపోయిన ముఖంతో తిరిగి వచ్చిన రామ్మూర్తి బస్టాండులో సీతాపతి కనిపించగానే కాళీజేబు చూపించి, ఓ కప్పు కాఫీ పోయించమని ప్రాధేయపడ్డాడు.

అప్పటికి రామూర్తి విషయమే కాస్త నయం! నరసింహానికైతే చావుదప్పి కన్ను లొట్టబోయినంతపనైంది. రాయి రాయి కరిగే అర్ధరాత్రి వేళ ఎవరో తలుపు తడుతుండగా విని మేల్కొన్నాడు నరసింహం. ఆతిథ్యమిచ్చిన గృహస్థుడు తెరచిన కిటికీగుండా బయటికి చూచి వచ్చి "ఎవరో వస్తాదుల్లా వున్నారయ్యా నరసింహం! వాళ్ళ మీసాలూ, వాళ్లూ చూడ్డానికే భయంకరంగా ఉన్నారు" అన్నాడు. ఏం చేస్తాడు నరసింహం! పెరటి తలుపు తెరుచుకుని పొలాలకడ్డంపడి నాలుగైదు మైళ్ళు పరుగెత్తి, తెల్లవారిన తరువాత ఓ బస్సును పట్టుకుని చచ్చి సేయంగల విన్నపాలతో యిల్లు చేరుకున్నాడు.

చెప్పుకోగూడదు గానీ, నీలకంఠానికి మెత్త మెత్తగా దేహశుద్ధే జరిగిందట. ఎప్పుడు ఎలా తిరిగివచ్చాడో ఎవ్వరికీ తెలియదు. వారం రోజులు సెలవు వ్రాసి పడేయడం మాత్రం అందరికీ తెలుసు! ఆ లోపల నొప్పులు తగ్గిపోవచ్చునని అభిజ్ఞ వర్గాల్లోనుంచీ గుసగుసలు వినిపించాయి.

అలాంటి రామన్నపేటకే తాను వెళ్ళబోతున్నది!

సీతాపతికి తిండి సయించడంలేదు. నిద్రపట్టడంలేదు! రోడ్డుపైన మిత్రులెవరైనా తారసిల్లితే మాట్లాడ్డానికి మనస్కరించదు. వాళ్ళంతట వాళ్ళే పలకరించినా బదులు చెప్పడానికి మాటలు స్ఫురించవు!

కానీ అంధకారంలో ఓ ఆశాకిరణం మాత్రం కనిపిస్తోంది సీతాపతికి! ఆ కిరణం వెంట బయల్దేరి, అది ఉద్భవించిన చోటుకు వెళ్తే అక్కడ కనిపించే వ్యక్తిపేరు అనంతమూర్తి. అతడు రామన్నపేట నివాసి. స్థానికోన్నత పాఠశాలలో ఉపాధ్యాయుడు. సీతాపతికి బాల్య మిత్రుడు. ఉక్కుపిండంలాంటి మనిషి! గిట్టలతో భూమిని గోరాడుతూ తలవంచుకుని పైకొచ్చే పోట్ల ఎద్దును కొమ్ములు పట్టుకుని నిలవేయగల బాహుబలం అతడి సొత్తు.

గ్రహాలు చాలక పాఠాలు చెప్పుకొనే వృత్తిలో ప్రవేశించాడు గానీ, సైన్యంలో చేరివుంటే ఈపాటికొక దళపతి కావలసినవాడు అనంతమూర్తి!

సీతాపతి తన రాకను గురించి అనంతమూర్తికొక జాబు వ్రాద్దామనుకొన్నాడు. కానీ ఆలోచించగా జాబు వ్రాయకపోవడమే మంచిదనిపించింది. అనంతమూర్తి ఎంతటి సాహసమూర్తో, అంతటి బద్ధకస్థుడు ఇదేమిటీ బాదరబందీ అనుకుని అతడు తనకు రక్షణ ఏర్పాట్లు చేయడానికి వెనుకాడినా వెనుకాడవచ్చు. చెప్పకుండా, పెట్టకుండా తుఫానులా వెళ్ళి పడితే వూఁ ఆఁ అనడానికి వీల్లేకుండా అతడు తన అవస్థ ఏదో తాను పడక తప్పదు!

కానీ ఆశ్చర్యమేమిటంటే సీతాపతి గమ్యస్థానం చేరుకునేసరికి అనంతమూర్తి అతడి రాకకోసం ఎదురుచూస్తున్నట్టే కనబడ్డాడు. "వచ్చేశావా సీతాపతీ! నేనూ అనుకుంటూనే ఉన్నాను. లిస్టులో నీపేరు కనిపించింది. నువ్వు బాల్య స్నేహితాన్ని విస్మరించేవాడివి కాదని నాకు తెలుసు! మన యింటికొక అతిథి రాబోతున్నాడని మా ఆవిడతో చెప్పానుగూడా! ఇదిగో ప్రభావతీ! మా సీతాపతి వచ్చేశాడు. అయిదు నిముషాల్లో కాఫీ తయారు కావాలి..."

తనకిలాంటి ఘనస్వాగతం లభ్యం కాగలదని కలలోనైనా అనుకోలేదు సీతాపతి. మిత్రుడి ఆదరణలో అతడు ఉక్కిరిబిక్కిరి అయిపోయిన మాట నిజం! కానీ ఆ స్వాగతం తాలూకు సంబరంలో అతడికి తనని చుట్టుముట్టి ఉన్న పరిస్థితులను మరిచిపోయేపాటి మైమరపు కలిగిందని చెప్పడానికి మాత్రం వీల్లేదు! అవకాశం దొరకగానే అతడు మెల్లగా ప్రారంభించాడు-

"ఎలాగో వచ్చేశాను అనంతమూర్తీ! వచ్చి నీ గొడుగు నీడలో పడిపోయాను. ఇక్కడి కెలాగైతే వచ్చానో, అలాగే నన్నిల్లు చేర్చే భారం నీది!"

ఓశ్. అదెంత పని - అన్నట్టు శిరఃకంపనం చేస్తూ "నేనదంతా ఆలోచించాను లేవోయ్ సీతాపతి! నీకు మరేం భయం లేదు. నీ అదృష్టంకొద్దీ నాకీసారి సూపర్‌విజన్ వర్కు లేకుండా పోయింది. పరీక్షలు పూర్తయ్యేసరికి నేను గేటు దగ్గరుంటాను. నువ్వు బయటికి రాగానే మనమిద్దరమూ కలిసి చక్కా యింటి కొచ్చేస్తాము. అంతే, ఆ తరువాత మరునాటి ఉదయం తొమ్మిదిన్నర గంటలకే నువ్వు లోకానికి కనిపించడం! అప్పుడైనా ఒంటరిగా కాదు. స్కూలు కాంపౌండుదాకా నేను నీడలా నిన్ను వెన్నంటి ఉంటాను. నువ్వు లోపలికి వెళ్తావు. మళ్ళీ నువ్వు బయటికొచ్చేసరికల్లా నేను గేటు దగ్గర హాజరు!" అన్నాడు అనంతమూర్తి.

విస్మయ చకితుడైపోయాడు సీతాపతి. తన పూర్వజన్మ సుకృతమంతా ఒక్కుమ్మడిగా లేచివచ్చి అనంతమూర్తి రసనాగ్రాన నిలిచి అతడి నోట ఆ మాటలు పలికిస్తున్నట్టుగా తోచిందతనికి! ఆ ఆనందంలో సీతాపతికా యింటి యిల్లాలు అన్నపూర్ణలా కనిపించింది. ఆమె తీసుకొచ్చిన కాఫీకషాయం అమృతంలా రుచించింది.

కాఫీ సేవించిన తర్వాత స్నానాల గదిలోకి గొంపోబడ్డాడు సీతాపతి. అక్కడ ఒక అండా నిండుకూ కాగుతున్న వేడినీళ్ళు. అప్పుడే బజారునుంచి వచ్చినట్టున్న కొత్త సబ్బుబిళ్ళ,

ఇంకా చాకలి మడతలు చెరగని తెల్లటి టవలు అతనికా యింట్లో జరగబోతున్న ఆతిధ్య మర్యాదల స్థాయిని తమ తమ మూగ గొంతుకలతో తెలివిడి చేస్తున్నాయి. స్నానం చేస్తూ ఆలోచనలోపడ్డాడు సీతాపతి. పెట్టిన దినములలో నట్టడవుల్లోనైనా కామితార్థాలు లభ్యం కావడమంటే ఇదే కావచ్చు. కాకపోతే అనంతమూర్తి తనతో ఒకటి, రెండు నిమిషాలు మాట్లాడి, వీధివైపు గదిని బసగా చూపించి, హోటల్లో భోజనం చేసి వచ్చి ఆ గదిలో పడుకోమని చెప్పిఉండినా తానాశ్చర్యపడి ఉండేవాడు కాదు. అనంతమూర్తితో తనకు గాఢమైన స్నేహానుబంధాలేవీ లేవు. స్నేహమనడంకన్నా కొన్నాళ్ళపాటు రెండు కుటుంబాలు ఒక వీధిలో ఉన్నందువలన కలిగిన పరిచయమని చెప్పుకోడమే సమంజసం! ఆ కారణాన్ని పురస్కరించుకొని అనంతమూర్తి తన రాకను గురించి ముందుగానే ఊహించి, అపాయాలు దరిజేరడానికి వీల్లేకుండా తనకోసం కట్టుదిట్టమైన బందోబస్తు విధానాన్ని రూపొందించి ఉన్నాడంటే ఇదంతా తానింటిదగ్గర బయల్దేరిన వేళావిశేషం కాక మరేమవుతుంది?

స్నానంచేసి సీతాపతి ఈవలి కొచ్చేసరికి బాగా చీకటి పడిపోయింది. ఇల్లంతటా దీపాలు వెలుగుతున్నాయి. అనంతమూర్తి హాల్లో వాలు కుర్చీలో మేనువాల్చి, కుర్చీకి అల్లంతదూరాన చాపపైన కూర్చున్న అమ్మాయికి ఇంగ్లీషు పాఠం బోధిస్తున్నాడు.

"అప్పుడే స్నానమైపోయిందా సీతాపతీ! రా! కూర్చో. రాక రాక యింతకాలానికి వచ్చావు. నీతో కాసేపు ఇష్టాగోష్ఠి జరపాలనే ఉంది. కానీ ఏం చేయమంటావు చెప్పు! ఈ అమ్మాయి రేపు పరీక్షకు కూర్చోబోతోంది" అన్నాడు అనంతమూర్తి.

"అలాగైతే నేను గదిలో కూర్చుని చదువుకుంటానులే బావా!" అంటూ ఆ అమ్మాయి పుస్తకాలు సర్దుకోసాగింది.

"వద్దొద్దు. కూర్చో హేమా! మా మాటలకేమి! రేపెప్పుడైనా తీరిగ్గా మాట్లాడు కోగలము. ఆ మాటకొస్తే ఈ పరీక్షలుగూడా రేపటికొచ్చి రేపటికే ముగిసిపోయేవి కావనుకో! కాలచక్రం తిరుగుతున్నంతకాలం ఇవి మార్చిలోనూ, అక్టోబరులోనూ అలాగే మళ్ళీ మళ్ళీ వస్తుంటాయి. కానీ గ్రహపాటు పొరపాటుగా మారి, అలవాటుగా పరిణమించకుండా ముందుగానే జాగ్రత్తపడడం మంచిది..."

మంచుదెబ్బ తిన్న తమ్మిపువ్వులా ఆ అమ్మాయి ముఖం ముడుచుకుపోయింది. చిన్నబోయిన ముఖం సీతాపతి కంట బడుతుందేమోనన్న కించపాటుతోనే గావచ్చు, ఆమె అవతలివైపుకు తిరిగి కూర్చుంది.

"చూచావా సీతాపతీ! ఇదీ వరస! పరీక్షలు రేపు గదా! ఈరోజు పుస్తకం చేతికి తీసుకుంటే 'సబార్డినేట్ క్లాసంటే ఏమిటి బావా? అదెలా ఉంటుం'దని ప్రశ్నిస్తుందీ విద్యార్థిని. ఇంక నేనా సబార్డినేట్ క్లాసును తీసుకొచ్చి దాని రంగు, రుచీ, వాసనా యిలాంటివని ఎలా విశదపరచగలను చెప్పు! ఆ కాడికి రెండు, మూడు రోజులనుంచీ ఎక్స్‌పెక్టెడ్ కొశ్చన్స్ డిక్టేట్ చేసి, వాటికి జవాబులు వ్రాయిస్తున్నాను. అవేం జవాబులు సీతాపతీ! నామ రూప గుణరహితుడైన భగవంతుడికి మల్లే ఆ వాక్యాల్లో కర్త, కర్మ, క్రియలు లేవు. ఎండమావిలో నీటికి మల్లే ఆ పదాల సముదాయానికి అర్థం లేదు.

పటిష్ఠమైన ప్రభుత్వానికి నోచుకోని దేశంలో చెలరేగే అరాచకాలకు మల్లే ఆ కాగితాల్లో ఎక్కడబడితే అక్కడ కాపిటల్ లెటర్సే! ఎక్కడ చూసినా కామాలే! ఎక్కడ చూసినా ఫుల్‌స్టాపులే! మనవాళ్లు కవుల్ని నిరంకుశులంటారు. కవులు నిరంకుశులైతే వాళ్ళ పాపాన వాళ్ళే పోతారు కానీ, ఈ విద్యార్థుల సంగతి అలాకాదు. వీళ్లు మన దుంప తెంచేస్తారు..."

ఆ విధంగా తన ప్రసంగాన్ని ఎంతసేపైనా కొనసాగించేవాడే అనంతమూర్తి. ఈ విమర్శ యిలాగే మరికొంతసేపు కొనసాగితే ఇప్పటికే కళ్ళనీళ్ళ పర్యంతమైపోయివున్న ఆ ముద్దరాలు బావురుమని ఏడ్చేస్తుందేమోననిగూడా భయపడ్డాడు సీతాపతి. కానీ అంతటి ప్రమాదం వాటిల్లేలోపుగా, అనంతమూర్తి భార్య యిక్కడ స్వయంగా కలుగజేసుకుంది.

"చాల్లెండి మీరు మరీనూ! అప్పటికి చదువుకున్న చదువంతా తల్లి కడుపులోనే నేర్చుకొచ్చినట్టు మాట్లాడగలరు మీరు! ఇలా హడలగొట్టేస్తే అదింక పరీక్షలేం వ్రాస్తుంది? భోజనంచేసి హాయిగా పడుకుని నిద్రపోదువుగానీ, నువ్వు లేచిరా హేమా!... పరీక్షైతే అవుతుంది. కాకపోతే కాదు. ఆ కాబోయే మొగుడు సర్టిఫికెట్టు చూచే పెళ్ళి చేసుకుంటాడేమిటి? దానికేమండీ, బంగారంలాంటి పిల్ల!..."

"ఎటొచ్చీ చెడిపోయినవాళ్ళం మేమేనంటావా ప్రభావతీ!" విసుగుపోతున్నట్టుగా అడిగాడు అనంతమూర్తి. బదులు చెప్పకుండా ఆవిడ వంటగదిలోకి వెళ్ళిపోవడంతో అతడు మళ్ళీ సీతాపతివైపు తిరిగాడు. "ఎందుకులే సీతాపతీ! వోవైపున విద్యాస్థాయి ఇలా దిగజారిపోతోందా, మరోవైపున శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపాయాలు తెగబలిసిపోతున్నాయి. అప్పటికీ పై అధికారులు ఈ పరీక్షల తతంగంలో చిల్లరమల్లర వ్యవహారాలు జరుగకుండా ఎప్పటికప్పుడు తగు జాగ్రత్తలు తీసుకుంటున్నారనుకో! కానీ వాళ్ళు మాత్రం ఏం చేయగలరు చెప్పు! నువ్వు కాపీలు జరగకుండా చూసుకోగలవు. విద్యార్థులు పరస్పరం సంప్రదింపులకు దిగకుండా చూసుకోగలవు. కానీ బుర్ర గోక్కుంటే సమాధానం 'ఎ' అనీ, ఒళ్ళు విరుచుకుంటే ప్రత్యుత్తరం 'బి' అనీ, చూపుడు వ్రేలిని భ్రుకుటిపైన నిలిపి ఆలోచన నభినయిస్తే జవాబు 'సి' అనీ, పెళ్ళికూతురికి మల్లే తల బాగా క్రిందికి వంచేస్తే ఆన్సరు 'డి' అనీ సుస్థిరంగా ఏర్పడిపోయిన సంకేతాలను నువ్వేం చేయగలవు?"

"వాళ్ళ తిప్పలేవో వాళ్ళు పడి, వాళ్ళ పరీక్షలేవో వాళ్ళు పాసౌతూంటే మధ్యన మీకు దిగులెందుకండీ! మీ సొమ్మేం పోయిందని? నేనేమో యిక్కడ ఆకులు వేసేశాను. భోజనాలు చేసి వెళ్దురుగానీ లేచి రండి!" వంటగదిలోనుంచీ పిలుపు వచ్చింది.

భోజనం చేస్తుండగా సీతాపతికి కొత్త విషయాలు కొన్ని తెలిశాయి. తన ఆంగ్లభాషా పరిజ్ఞానంతో అనంతమూర్తిని ఆశ్చర్యాంబుధిలో మునకలు వేయిస్తున్న ఆ అమ్మాయి స్వయానా అతడి మరదలట! వాళ్ళ నాన్నగారికి యిద్దరే కుమార్తెలట! ఆయనగారికి ఏడెనిమిదెకరాల మాగాణి ఉందనీ, పదివేల రూపాయల రొఖ్ఖం వడ్డీ వ్యాపారంలో చేతులు మారుతోందనీ మరి మరీ నొక్కి చెప్పాడు అనంతమూర్తి.

సీతాపతి కారోజు రాత్రి సరిగ్గా నిద్రపట్టింది కాదు. రకరకాల కల్లోలాలకు నిలయమై ఉన్న విద్యారంగానికి సంబంధించిన తలపులు మనసులో మెదిలినప్పుడు నిద్రపట్టక

పోవడం సహజమే! ఈనాడు విద్య ఐహికాముష్మిక సుఖాలకు సాధనంగా భావింప బడడంలేదు. ఏవో మార్పులు సాధించాలని కలలుగంటున్న విద్యావేత్తల్ని మినహాయిస్తే, మిగిలిన వాళ్ళకెవరికీ ఈ విద్యను గురించిన గొడవ కాబట్టడంలేదు. ఇప్పుడు పాసు కావలసినవి పరీక్షలు, అందుకవసరమైనవి మార్కులు. ఆ మార్కులకోసం అసంఖ్యాకమైన అడ్డుదోవలు. తప్పంతా విద్యార్థులదని కొందరు, ఉపాధ్యాయులదని కొందరు, వాళ్ళదీ కాదు, వీళ్లదీకాదు, విద్యా విధానందని కొందరు!... ఎడతెగని ఆలోచనలతో సీతాపతి తల దిమ్మెక్కిపోయింది. భోజనకాలం మధ్యమధ్యలో హరినామస్మరణలా అతడి ఆలోచనలు అప్పుడప్పుడూ అనంతమూర్తి మరదలిపైకి వెళ్ళకపోలేదు. దీనిల్లు బంగారంగానూ, ఈ విద్యా వ్యవస్థ ఆ అమ్మాయిని సైతం పీడిస్తోంది. ఆమెకు బొత్తిగా ఇంగ్లీషు రాదంటాడు అనంతమూర్తి. ఎందుకు రాదు! ముద్దార నేర్పిస్తే ముదితలు నేర్చుకోలేని విద్యే లేదన్నారు పెద్దలు! అలా నేర్పించడానికి చేతగాకపోతే వూరుకోవాలిగానీ, కఠినంగా వ్యవహరించడమేం సబబు!

ఆ మరునాటి ఉదయం విద్యార్థులకు ఆందోళనకరంగానూ, వాళ్ళ పైన తనిఖీ చేయడానికంటూ నియమింపబడిన ఉపాధ్యాయులకు భీతావహంగానూ, మిగిలిన ప్రపంచానికి మామూలుగానూ తెల్లవారింది. రాత్రంతా నిద్రలేక జపాకుసుమాల్లా మండిపోతున్న కళ్ళతో, గోడపైన వ్రేలాడుతున్న మహాత్ముడి పటాన్ని చూస్తూ లేచి కూర్చున్నాడు సీతాపతి. ఈరోజే పరీక్ష! పాతికేళ్ళ జీవితంలో తనేనాడూ యిలాంటి పరీక్షకు లోనుగాలేదు. ఏనాడూ యింతగా తొట్రుబాటు పడలేదు. తనవల్ల ఏం తప్పిదం జరిగిందని తనకీ భయం! ఈ ప్రపంచం భయస్థుడిది గాదు. పిరికివాడిదిగాదు. అంతకూ యింతకూ బెంబేలు పడిపోయి దడదడలాడే గుండెతో దినదినగండం నూరేళ్ళాయుస్సుగా బ్రతికే పిరికివాడి నిరర్థక జీవితంవల్ల లోకానికి ఒరిగేదేమీలేదు. వాడు వాడికే బరువు. వాడు భూమికే బరువు. ఆరడుగుల బక్కపలచటి మనిషి మహాత్ముడు. ఆత్మ విశ్వాసంలో మేరు పర్వతం ఆయన ఎదుట తీసికట్టు! నా జీవితమంటే ఏమిటి, సత్యంతో నేను చేసిన సాధనలేగదా నంటాడు మహాత్ముడు. వెయ్యి కష్టనష్టాలెదురైనా మానవుడు సత్యపథంనుంచీ అడుగు మరల్చగూడదు. కర్తవ్యాన్ని విస్మరించగూడదు.

గూనివాడి వెన్నెముకను సైతం నిట్టనిలువుగా చేసి నిలబెట్టగల మహత్తర శక్తి ఆత్మవిశ్వాసపూరితమైన దృఢ నిర్ణయంలో ఉంది. దృఢ నిశ్చయానికి వచ్చిన సీతాపతి జంకుగొంకులు లేకుండా తన బాధ్యతను నిర్వర్తించడానికే పూనుకున్నాడు.

పాఠశాల ఆవరణలోని కోలాహలాన్ని చీల్చుకొంటూ తొమ్మిదీ నలభై అయిదుకల్లా మొదటి గంట మ్రోగింది. ఆఫీసు రూము దగ్గర తలవంచుకున్న సీతాపతి తనకోసం నిర్దేశింపబడిన గది లోపలికి వెళ్లిన తర్వాత తలపైకెత్తాడు. దాదాపు నలభైమంది విద్యార్థులు కొరకొర చూపులతో అతణ్ణి నఖశిఖ పర్యంతమూ పరీక్షిస్తున్నారు. సీతాపతి ప్రతి విద్యార్థినీ పరకాయించి చూచాడు. ముఖాన్ని ప్రసన్నంగా ఉంచుకుని, చిరునవ్వును పెదవులపైకి తెచ్చుకుని వీలైనంత సౌమ్య కంఠంతో “సోదరులారా! పరీక్షల్లో మీకందరికీ విజయం చేకూరాలని హృదయపూర్వకంగా వాంఛిస్తున్నాను...” అన్నాడు.

ఈ ఎత్తుగడ కర్థమేమిటో తెలియక విద్యార్థులు తెల్లబోయారు. తమ విజయానికి ఈయన సల్పబోతున్న దోహదక్రియలేవో తెలుసుకోవాలన్న కుతూహలంతో వాళ్ళు సీతాపతికేసి అనిమిష నయనాలతో చూడసాగారు.

"కానీ నేను మీకొక్కమాట మాత్రం చెప్పదలచుకుంటున్నాను.."

కుర్రవాళ్ళల్లో కదలికలేదు. వాళ్లు తమ ఉచ్ఛ్వాస నిశ్వాసాల్ని సైతం బిగపట్టేసినట్టున్నారు.

"ఈనాడు మీరు విద్యార్థులు, మీరే భావి పౌరులు. ఈ దశలోనే మీలో నియమాతిక్రమణకు బీజారోపణ జరిగితే దేశం బాగుపడదు. మానవుడి శీలానికి జవాన్నీ, జీవాన్నీ ప్రసాదించేవి నీతి నియమాలు. అవి లేనినాడు మనిషి దేనితో సమానమో నేను ప్రత్యేకించి చెప్పవలసిన అవసరం లేదు. అవి మీలో పుష్కలంగా వున్నాయనే నేను భావిస్తున్నా..."

టంగు టంగున రెండో గంట మ్రోగింది.

"అదిగో గంటగూడా మ్రోగింది. నా మాట పొల్లుగాదన్నమాట!" అంటూ చమత్కరించుకున్నాడు సీతాపతి.

ఈ నీతి బోధలుగానీ, ఛలోక్తులుగానీ విద్యార్థులకు లేశమాత్రమైనా రుచించినట్లు లేదు. ఈ సరికొత్త మానవాకారం ఎక్కడినుంచి దిగుమతి కాబడిందన్న స్వగతాలతో వాళ్ళు సీతాపతికేసి బిక్క చూపులు చూస్తున్నారు.

వరుసగా ఒక్కొక్క విద్యార్థినీ సమీపించాడు సీతాపతి. అక్షయ తూణీరాల్లా పైకుబికియున్న జేబుల్లోనుంచీ కాగితాలను బయటకు లాగేశాడు. దస్తుల్లోనుంచీ పుస్తకాలు వెలుపలికి తీసేశాడు. వాటిని వసారాలో పదిలపరచి, ప్రత్యుత్తరాలు వ్రాయడంకోసం యివ్వవలసిన తెల్ల కాగితాలను విద్యార్థులకందరికీ పంచిపెట్టేశాడు.

"ఇంతేనా మాస్టారూ! ఇంక మీరు చెప్పవలసిందేమీ లేదా?" వో విద్యార్థి మిక్కిలి వినయంగా ప్రశ్నించాడు.

సీతాపతి మళ్ళీ గొంతు సవరించుకున్నాడు. "మూడో గంట మ్రోగగానే మీ చేతికి కొశ్చన్ పేపర్లొస్తాయి. మీ దగ్గర కలాలున్నాయి. ఎట్టయెదుట కాగితాలున్నాయి. ఆలోచించి బదులు వ్రాయడానికి మూడు గంటల వ్యవధికూడా ఉంది. ఆలోచించడం మా పనిగాదనీ, ఆలోచించినా లాభం లేదనీ ఉపాయాంతరాలు అవలంబిస్తే బయటికి సాగనంపడానికి నేనెలాగూ ఇక్కడ ఉండనే ఉన్నాను.."

ఈ మాట అంటూ సీతాపతి టేబులువైపు తిరిగాడో లేదో వెనుక నుంచీ ఓ విసురు బాణంలా దూసుకొచ్చింది. "మీరు బొత్తిగా ఎలిమెంటరీ స్కూలు టీచరుకుమల్లే ప్రవర్తిస్తున్నారండీ మేష్టరుగారూ!"

ఐతే ఈ విసురును సరకు చేయదలచుకోలేదు సీతాపతి. అతడావైపుకు తిరిగైనా చూడకుండా "ఎలిమెంటరీ స్కూలు టీచరు చేతిలో ఓ పేము బెత్తం ఉంటుందన్న విషయం మనం మరచిపోకూడదు" అన్నాడు.

"అబ్బబ్బ! ఎవరోగాని అగ్గిరాముడిలా ఉన్నాడురా బాబూ!"

ఈ నిశితోక్తి సైతం సీతాపతి గాంభీర్యానికి స్వస్తి చెప్పలేకపోయింది. "నిజాన్ని ఇంత త్వరగా గ్రహించినందుకు చాల సంతోషం. పనిలో పనిగా ఈ అగ్గిమీద గుగ్గిలం వేయడంవల్ల లాభం లేదని కూడా గ్రహిస్తే మరింత సంతోషం" అంటూ అతడు తుదిసారిగా హెచ్చరించి కటకటాల కీవల గస్తీ తిరుగుతున్న పహరా సిపాయికీ మల్లే గదిలో పచార్లు ప్రారంభించేశాడు.

సీతాపతి వాడి చూచిన ఈ క్రొంగ్రొత్త వైద్య ప్రక్రియ విద్యార్థుల జబ్బుపైన అమోఘంగా పనిచేసిందనే చెప్పాలి! ఎందుకంటే ఆ మూడు గంటల ఇంగ్లీషు పరీక్ష ఆశించినంతకంటే ప్రశాంతంగా పరిపూర్తి అయిపోయింది.

చివరి గంట మ్రోగిన తర్వాత కాగితాలను తీసుకెళ్ళి అధికారులకు అప్పగించి జేబుగుడ్డతో ముఖం తుడుచుకుంటూ బయటికి వచ్చిన సీతాపతికి "అభినందనలు సీతాపతీ! ఎక్కడ చూచినా నిన్ను గురించే చెప్పుకుంటున్నారు..." అంటూ వరండాలోనే ఎదురయ్యాడు అనంతమూర్తి.

"అప్పుడే మన కీర్తి దిశదిశలకూ విస్తరిల్లిందన్నమాట!" అంటూ సీతాపతి విజయగర్వంతో నవ్వేశాడు.

ఐతే కలకాలంనుంచీ ఉన్న జబ్బు ఒక్క రోజుతో, ఒక్క చిట్కాతో అంతరించేదిగాదు. కర్ఫ్యూ అమల్లో ఉన్న ప్రాంతంలో చెదరువాటుగా జరిగే సంఘటనల్లాగా, సీతాపతి విజయగర్వాన్ని సవాలు చేస్తూ చిన్న చిన్న కల్లోలాలు కొన్ని చెలరేగుతూ వచ్చాయి. ఓ విద్యార్థి మాటకు మాట రెట్టించి 'చూడు నీ గతి ఏమవుతుందో' అన్నంతగా విజృంభించాడు. మరొక విద్యార్థి తన తండ్రి హోదా ఏమిటో సూచించి, తన జోలికి రావడం కొరివితో తల గోక్కోవడమేనని హెచ్చరించాడు. ఇంటికి వెళ్ళి చొక్కా తీయగా, వెనుక భాగాన సిరా డాగులు కనిపించి పరిహసించేవి. జాగ్రత్తగా మసులుకోకపోతే కష్టనష్టాలు తప్పకపోవచ్చునని తోడి సూపర్వయిజర్లు పిరికిమందు నూరిపోసేవారు. ఎదురీతకు పూనుకోనేగూడదు! పూనుకున్న తర్వాత అది అడుగడుగునా దృఢ సంకల్పాన్ని బీటలు కొట్టడానికే ప్రయత్నిస్తుంది. ఇంతలో మొండి తెగువ. అంతలో అధైర్యం. ఈ వెలుగు చీకట్ల మధ్య తారట్లాడుతున్నాడు సీతాపతి. చూసినా చూడనట్టు వూరుకుని, పబ్బం గడిచిందంటే గడిచిందనుకొని తిరిగి వెళ్ళిపోక తనకీ లేనిపోని పట్టింపులు అనవసరమేమోననిగూడా అతడు తలపోసి చూశాడు. కానీ తీరా గదిలోకి వెళ్ళిన తర్వాత కళ్ళ ఎదుట జరుగుతున్న తప్పుకు ఒప్పుదల ప్రకటించలేకపోయాడు సీతాపతి. ప్రతిఘటించి, అది జరగకుండా చూసేదాకా అతడి నరనరాల్లో రక్తం జివ్వుజివ్వున పరుగులు వారేది. పరీక్ష ముగిసి గదిలోనుంచి బయటపడినప్పుడల్లా గండం గడిచి గట్టెక్కినట్టే ఉంది అతడి పరిస్థితి – ఇంక భయం లేదు. ఇక్కడెక్కడో అనంతమూర్తి తనకోసం వేచి ఉంటాడు. కిష్కింధా రాజ్యంలో సుగ్రీవుడికి ఋష్యమూక పర్వతం ఎలాంటిదో, ఈ రామన్నపేటలో అనంతమూర్తి ఆశ్రమం తనకలాంటిది!

మూడు రోజులిలాగే గడచిపోయాయి. అసిధారావ్రతం నిరాటంకంగా పూర్తి కాబోతున్నందుకు సీతాపతి మనసులో ఓవైపున సంతోష వీచికలు పొరాడుతున్నాయి.

మిగిలిఉన్న ఒక్కరోజుగూడా ప్రశాంతంగా గడిచిపోతే తనీ విషమ పరీక్షలో కృతార్థుడైనట్టే! రామన్నపేటకొక నమస్కారం పెట్టి బ్రతుకు జీవుడా అనుకుంటూ ఆరుగంటల బస్సులోనే వచ్చినదారి పట్టవచ్చు...

కానీ విధి విధానంలోని వైచిత్ర్యమంతా మానవుడు అనుకున్నట్టుగా జరగక పోవడంలోనే వుంది. గతాన్ని వర్తమానాన్ని చూసే రెండు కళ్ళు మాత్రం ఉన్నాయి మానవుడికి! భవిష్యత్తులోకి చూడగల మూడో కన్ను అతడికి ప్రసాదింపబడలేదు. అందువల్ల కాలం కడుపులో దాగివుండి, హఠాత్తుగా తన దారి కడ్డం రాగల క్లిష్ట సమస్యలను గురించి అతడు ముందుగానే ఊహించలేడు.

రాత్రి భోజనాలైన తర్వాత అనంతమూర్తి సీతాపతిని డాబామీదికి తీసుకెళ్ళాడు. పుచ్చపువ్వులాంటి వెన్నెల్లో మిత్రులిద్దరూ తాంబూలం సేవిస్తూ చాపపైన కూర్చున్నారు. ఏదో లోకాభిరామాయణంతో కాలహరణం జరిగిపోతుండగా ఉన్నట్టుండి అనంతమూర్తి ముఖ్యమైన విషయంలోకి వచ్చేశాడు–

"చూడు సీతాపతీ! బెండకాయగానీ, బ్రహ్మచారిగానీ ముదిరి పోకూడదని చెబుతారు. సాధారణంగా నూటికి తొంభై తొమ్మిదిచోట్ల ముదిరి పోనివ్వరు. నీకు పాతికేళ్ళొచ్చాయి. నీ పెళ్ళి విషయంలో మీ నాన్నగారెందుకు ముభావంగా ఉండి పోతున్నారో నాకు తెలియదు. బహుశా మంచి సంబంధం కుదరకపోవడంవల్లే గావచ్చు. నా ఎరుకలో ఓ సంబంధం ఉంది. చల్లకు వచ్చి ముంత దాచుకోవడమెందుకు! అమ్మాయిని నువ్వు చూస్తూనే ఉన్నావు. వాళ్ళక్కయ్య చెప్పినట్టు హేమ రూపంలోనేగాదు, గుణంలోకూడా బంగారంలాంటిపిల్ల. నీ కిష్టమైతే మా మామగారిని ఒప్పించే భారం నాది!"

కర్ణ కఠోరమైన వివిధారావాల మధ్యనుంచి శ్రావ్యమైన సంగీతం ప్రారంభమైనప్పుడు కలిగే అనుభవం ఎలాంటిది? సీతాపతి అలాంటి అనుభూతికి లోనయ్యాడు. పది పదిహేను రోజులుగా ఈ పరీక్షల గొడవల్లో పడి మిగిలిన ప్రాపంచిక విషయాలను విస్మరించాడు గానీ, లేకుంటే యిది ఈపాటి కెప్పుడో తన మదిలో మెదిలి ఉండవలసిన వూహ! జీవిత గ్రంథంలో ఎంతో రసవత్తరమైన ప్రకరణం వివాహం! అందులోనూ హేమలాంటి అందమైన అమ్మాయితో! అంతకంటే కావలసిందేముంది?

"ఫరవాలేదు సీతాపతీ! నింపాదిగా ఆలోచించుకోవచ్చు నువ్వు. తొందరేమీ లేదు" అన్నాడు అనంతమూర్తి.

తీయటి తలపుల్లో తేలిపోతూ సీతాపతి క్రిందికి దిగివచ్చాడు. ఫ్లాస్కు తీసుకుని నడవగదిలోకి వెళ్తున్న ప్రభావతి అతనికి హాల్లో ఎదురైంది. "ఈ వేళప్పుడు ఫ్లాస్కుతో యేం పని పడిందండీ?" అంటూ పలుకరించాడు సీతాపతి.

నవ్వును చీర చెరగులో దాచుకుంటూ ఉపక్రమించింది ప్రభావతి. "అంతా మీ బడిపంతుల మహిమే! పది పదిహేనుమంది పంతుళ్ళు ఒకటిగా చేరి ఓ పెద్ద పగలరాతి గుండంత చదువును పైకెత్తి విద్యార్థి తలపైన మోపేస్తారు. 'చదివితే చదువుకో. లేకుంటే మానుకో. నువ్వేమైతే నాకేం కావాలి. పరీక్షల్లో మాత్రం బోలెడన్ని మార్కులు రావాలి' అంటారు. విద్యార్థులేం చేస్తారు పాపం! కుర్ర సన్యాసులు అయినా టీ నీళ్ళన్నీ త్రాగి,

రాత్రంతా జాగరణచేసి ఆరోగ్యాలు పాడు చేసుకుంటారు. కానీ పాపాలు వూరికే పోవు సుమండీ! అందుకు గాకపోతే బడిపంతుళ్ళకు యింటినిండా ఆడపిల్లలు పుట్టడం మరెందుకు?"

అప్పుడే మెట్లు దిగుతున్న అనంతమూర్తి "ఐతే మీ నాన్నగారు బడిపంతులు కారే!" అంటూ సంశయం వెలిబుచ్చాడు.

"కాకపోవడంవల్లనే ఆయనకు ముచ్చటగా మేము ఇద్దరం మాత్రమే పుట్టాము..."

"పోనీ లెండి మంచిపని చేశారు!"

భార్యాభర్తల్ని వాళ్ల వాగ్వాదానికి వాళ్ళని వదిలిపెట్టి సీతాపతి ఆ వ్యవధిలో నడవ గదిలోకి చూచాడు. అమ్మ దొంగా! చదువుతున్నట్టు నటిస్తూ హేమ తనవేపు ఓరచూపులు సంధిస్తోంది.

సీతాపతి పెదవులపైన లీలగా ఓ చిరునవ్వు మెరిసింది.

ఆనందలాస్యం సలుపుతున్నట్టు కనురెప్పలు సంచలించిపోతుండగా హేమ సిగ్గుపడిపోయింది.

సింగారానికి నిగ్గులు సంతరించిపెట్టే సిగ్గులో హేమ మరింత అందంగా ఉంటుంది – అనుకుంటూ తనకోసం ప్రత్యేకించబడిన గదిలో ప్రవేశించాడు సీతాపతి.

అతడి వెనువెంటనే లోపలికి వచ్చేశాడు అనంతమూర్తి. "ఓ చిన్న విషయం చెప్పడానికి మరిచిపోయాను సీతాపతీ!" దగ్గరగా వచ్చి అదొక రహస్యంగా చెబుతున్నాడు అనంతమూర్తి. "మరేం లేదు! ఇంతవరకూ జరిగిన పరీక్షలన్నీ బాగా వ్రాశానని చెబుతోంది హేమ. వ్రాసే ఉంటుంది. ఎందుకంటే ఆరోజు నేనేదో మాట వరుసకన్నానుగానీ ఇంగ్లీషులోనైనా ఆమెకు పాసు మార్కులు రాకపోవు. పేజీలకు పేజీలే కంఠస్థం చేయడం ఆమెకు ఉగ్గుపాలతో వచ్చిన విద్య. ఎటొచ్చీ సోషల్ స్టడీస్ ఒక్కటే ఆమెను పట్టి చూచే సబ్జక్టు! రేపు ఉదయం సోషల్ స్టడీస్ పరీక్ష గదా! అందులో నీ సాయం కాస్తా అవసరం!!"

"నేను చేయగల సాయమేముంది అనంతమూర్తీ?" నివ్వెరపడిపోతూ అడిగాడు.

"ఆ సందేహం నీ కనవసరం! హేమ కూర్చునే గదిలో నిన్ను వేయించే పూచీ నాది" అంటూ తుర్రున బయటికి జారుకున్నాడు అనంతమూర్తి.

ఎవరి అండదండలవల్లనైతే గడచిన రెండు మూడు రోజులనుంచీ వూబిలో దిగిపోకుండా తనను తాను రక్షించుకోగలిగాడో ఆ అనంతమూర్తి మూలంగానే తనొక ధర్మసంకటంలో తగులుకోవలసి వస్తుందని సీతాపతి ఎలా వూహించగలడు? కవాటాలు బిగించి ముంతపొగబెట్టినా సీతాపతి కింతటి బాధ కలిగేది కాదు. ఈ అనంతమూర్తి ఎంతకైనా తగును! ఇతగాడు తానింటిదగ్గర బయల్దేరక మునుపే తనను అతిథిగా బుక్ చేసేశాడు. నెరపుతున్న ఆతిథ్య మర్యాదలకు వెనుక ఓ గొప్ప ప్రయోజనాన్ని పదిల పరిచాడు. ఇంతచేసీ తనదంతా నిష్కామకర్మలాగా పోజులు పెట్టాడు. అంబుల పొదిలోనుంచీ ఎప్పుడెప్పుడు ఏయే అస్త్రం పైకి తీయాలన్న రహస్యం ఇతనికి తెలిసినట్టు మరొకరికి తెలియదేమో!

ఎలాగైతేనేం మధుర స్వప్నాలతో తెల్లవారవలసిన రాత్రిని కలత నిద్రతోనూ, పీడకలలతోనూ నింపి పుణ్యం కట్టుకున్నాడు అనంతమూర్తి. స్నానపానాలైన తర్వాత మామూలు ప్రకారం మిత్రుణ్ణి తీసుకెళ్ళి పాఠశాల ఆవరణలో దిగబెట్టాడు. ఇంటిదగ్గర గానీ, త్రోవలోగానీ సోషల్‌స్టడీస్ పరీక్షకు తాను చేయవలసిన తోడ్పాటును గురించిన ప్రసక్తి పొడసూపకపోయేసరికి అనంతమూర్తి ఆ విషయం మరిచిపోయి ఉండవచ్చునని సీతాపతి సంబరపడిపోయాడు. కానీ గదిలో అడుగుపెట్టగానే ఆ సంబరం పటాపంచలై పోయింది. అన్నాడా, అన్నంతపనీ చేయగలిగినవాడీ అనంతమూర్తి! చేతివేళ్ళు వంచుకుని, పగడాల్లాంటి ఎర్రటి గోళ్ళలో ప్రతిబింబాలు చూసుకుంటూ, ఓ మారుమూల దస్కులో ఆసీనురాలై ఉంది హేమ!

ఇప్పటికింకా పోలేదుగానీ అనంతమూర్తి పథకం ప్రకారం హేమ కాపీ కొట్టడానికి ప్రారంభిస్తే తనకు మతిపోవచ్చుననుకున్నాడు సీతాపతి.

పరీక్ష ప్రారంభమైంది.

సీతాపతి గుండె – వేగం హెచ్చించి కొలిమితిత్తిలా రొప్పుతోంది.

అరగంట గడిచింది.

హేమను ఓ కంట కనిపెడుతూనే ఉన్నాడు సీతాపతి.

ఎప్పుడు పరిచిందోగానీ, హేమ దస్కుపైన చేతిగుడ్డను పరిచింది. దానిపైన కుట్టిన పువ్వుల్ని పిందెల్నీ అప్పుడప్పుడూ అలవోకగా పరిశీలించి చూస్తోంది.

సీతాపతికి మతిపోయింది.

హేమ దారి చూపించింది, ఈ దారివెంట మరికొందరు నడిచినా నడవగలరు. గలరేమిటి! హేమ కూర్చున్న దస్కుకు నేరుగా ఎడమవైపు వరుసలో కూర్చున్న ఓ సాయిబుల కుర్రాడు బాహాటంగానే కాపీ సాగించేస్తున్నాడు.

ఉల్లిపొరలాంటి సిల్కు లాల్చీ క్రింద మెలిదిరిగిన కండరాలతో మిసమిసలాడిపోతున్న ఆ సాయిబుల కుర్రాడు తడిపాటి గోడను కుమ్మే ప్రాయపు కోడెదూడలా ఉన్నాడు. చిన్న చిన్న నొక్కులతో నిగనిగలాడుతున్న క్రాపింగు వాడిది. సన్నగా చురకత్తుల్లా మొనదేలిన మీసాలు వాడివి. వాడి వాలకంలో సీతాపతి అన్న వ్యక్తి ఒక్కడు అక్కడ కుర్రాళ్ళపైన అజమాయిషీ చేస్తున్నాడన్న స్పృహే ఉన్నట్టు లేదు. మాటిమాటికి ఆన్సర్ పేపర్లలో దాచుకున్న కాగితాన్ని చూసుకుంటూ అతడు శరవేగంతో కాపీ చేసేస్తున్నాడు...

ఆలోచిస్తూ కాలం గడపడానికి అది సమయం కాదని సీతాపతికి తెలుసు. ఇప్పుడు తనేదో ఒక పరిష్కారమార్గాన్ని అవలంబించాలి. ఆ అవలంబించడంగూడా నిమిషాల్లో జరిగిపోవాలి. నాలుగు క్షణాలపాటు ఒకచోట నిశ్చలంగా నిల్చున్నాడు సీతాపతి – జీవితం ఒక ప్రశ్నాపత్రం. ఇందులో ఏ ప్రశ్నకైనా ఛాయిస్ ఉందిగానీ, నీతికి సంబంధించిన ప్రశ్నకు లేదు. ఈ ప్రశ్న కింతదూరం సదుత్తరం వ్రాసుకుంటూ వచ్చి, ఈ క్షణాన ఎర్ర సిరాతో దీనిని చివరకంటా కొట్టివేయడం తన చేతనయ్యే పని కాదు...

అడుగు ముందుకే వేశాడు సీతాపతి.

"ఈ డిజైను చాలా బాగుంది! వేసింది నువ్వేనా అమ్మాయ్?"

"ఆ...ఆ...అవునండీ! న్నే... నేనే వేశాను." హేమ కంగారుపడిపోయింది. ఆమె కళ్ళల్లో భయం తెరలు తెరలుగా కదిలిపోతోంది.

సీతాపతి చేతిగుడ్డతోబాటు దాని క్రింది కాగితాన్నిగూడా చేతిలోకి తీసుకున్నాడు. కాగితాన్ని పాంటు జేబులో పడేసి, సాయిబుల కుర్రవాడివైపు తిరిగాడు.

"అబ్బాయ్! నువ్వు కాస్తా లేచి నిలబడగలవా బాబూ!"

ఆ విద్యార్థి ముఖాన కత్తివేటుకు నెత్తురుచుక్క లేదు.

వాడి గుప్త నిక్షేపాన్ని సైతం సీతాపతి తన పాంటు జేబులోకి లాగేశాడు. ముఖభంగిమలో పట్టుదలను వ్యక్తం చేస్తూ, చూపులతో హెచ్చరికలు పలుకుతూ అతడు మళ్ళీ గదిలో గస్తీ ప్రారంభించేశాడు.

***

పరీక్ష ముగిసిన తరువాత సీతాపతి అనంతమూర్తికోసం పాఠశాల నలుమూలలా కలయవెదికాడు. ఏదో పని ఉన్నవాడిలా గేటు దగ్గరికొచ్చి నిల్చున్నాడు. అరగంట సేపు వేచి చూశాడుగానీ, అనంతమూర్తి పొలకువ మాత్రం కానరావడంలేదు. హతాశుడైపోయి, తిరిగి వెళ్ళి ఆఫీసు రూములో ఎదుట బెంచీపైన కూర్చున్నాడు. మనస్సు సరిగాలేక ఉదయం టిఫినుగూడా సరిగ్గా చేయలేదేమో, సీతాపతి కడుపులో కొక్కులు త్రవ్వుతున్నాయి. నిస్సహాయకరమైన ఆ దురవస్థలో సీతాపతి కళ్ళల్లోనుంచీ దుఃఖం తొంగిచూచింది. స్కూలు జవానుచేత అరడజను అరటిపళ్ళు తెప్పించుకుని, ఇన్ని మంచినీళ్ళతో సహా వాటిని ఉపాహారంగా స్వీకరించి అతడు మధ్యాహ్న భోజనం ముగించాడు. రెండుకు ప్రారంభమైన చివరి పరీక్ష నాలుగు గంటలకే ఆఖరైపోయింది. ఆ చివర క్షణాన అనంతమూర్తికోసం అన్వేషణ కొనసాగిస్తున్న సీతాపతి చూపుల్ని టెస్టుట్యూబులో పెట్టి పరీక్ష చేస్తే, వాటిలో సగానికిపైగా ఉన్మాద ఛాయలు పొడగట్టేవి. అనంతమూర్తి తనపై యిలాంటి దారుణమైన ప్రతీకారాన్ని తీసుకోగలడనుకోలేదు సీతాపతి! మానవుల్లో ఇంతగా స్వార్థపరత్వం దాగివుందని అతడు భావించి ఎరుగడు. అమ్మో, ఎంత తీయగా మాట్లాడాడు అనంతమూర్తి! ఆపద్బాంధవుడి పాత్రకు శక్తివంచన లేకుండా న్యాయం చేకూర్చాడు. కానీ అంతలో మేకప్ చెదిరిపోగా అసలు బండారం బయటపడిపోయింది. అతడి చేతిలో తనొక ఉపకరణంగా మెలగగలడని ఆశింపగలిగినంతవరకూ అతడు తనకు రక్షణ నిచ్చాడు. ఆ ఆశ అడియాస అయిన మరుక్షణంనుంచీ తనను శిక్షకు గురి చేసేశాడు. ఓయీ అనంతమూర్తీ! నువ్వు స్నేహితుడివి గాదు. గోముఖ వ్యాఘ్రానివి నువ్వు!

తోడి మానవులపట్ల విశ్వాసాల్ని సీతాపతి మొదలంట తెగగోసేశాడు. భగవంతుడి దయను అంతిమ శరణ్యంగా స్వీకరించాడు. తెగువతో రోడ్డుపైకి వచ్చేశాడు. సందు గొందుల్లోపడి పది నిమిషాల్లో అనంతవ1ూర్తి యిల్లు చేరుకున్నాడు.

ఇంటిలోపల ఏ మూలనుంచిగానీ అలికిడి వినరావడంలేదు.

గదిలో వంకీకి తగిలించిన చేతి సంచీ తీసుకుని హాల్లోకి వచ్చాడు సీతాపతి.

"అదేమిటండీ మేష్టారూ! కాఫీ అయినా తీసుకోకుండా వెళ్ళిపోతారా?" కాళ్ళకు చుట్టుకున్న తీగలా అడ్డుతగిలింది హేమ. ఆమె తలపైకెత్తి సీతాపతి ముఖంలోకి

చూడటంలేదు. నిరాదరణకు పాత్రురాలైన ముగ్ధనాయికలా చిన్నబోయిన వదనంతో నేలవైపు చూస్తోంది.

"చూడు హేమా! మానవుడన్న తరువాత ఓ నియమానికి అంటిపెట్టుకోక తప్పదు. నాలోని దౌర్బల్యం అదే! కఠినంగా ప్రవర్తించి నీ మనసుకు నొప్పి కలిగించాను. నిజం చెప్పు హేమా! నీకు నాపైన కోపంగా ఉంది కదూ!"

హేమ కళ్ళల్లో కన్నీళ్లు గిర్రున తిరుగుతున్నాయి. "మీ పైన కోపగించుకోడానికి నేనెవర్ని మేష్టారూ?" హేమ కంఠం గూడా గాద్గదికమైపోతోంది.

సీతాపతి హృదయం ద్రవించిపోయింది. ఇంతగా ఆ లేత మనసును వ్యాకులపరచిన తర్వాత తనపైన కోపగించుకునే హక్కును హేమకు ప్రసాదించకపోవడం అన్యాయమని గూడా అనిపించింది.

"సెలవిప్పిస్తే వెళ్లొస్తాను హేమా!" అన్నాడు సీతాపతి.

"వెళ్ళి రండి మేష్టారూ!" అంది హేమ. అంతటితో ఆగిపోకుండా వీధి గుమ్మందాకా వెన్నంటి వచ్చింది. "ఓ అయిదు నిమిషాలు ఆగలేరా మేష్టారూ! అక్కయ్య కొళాయి దగ్గరికి వెళ్ళింది. వచ్చాక చెప్పి వెళ్ళగూడదూ?"

"పరవాలేదులే హేమా! రాగానే, వెళ్ళిపోయానని చెప్పు..."

సీతాపతి నడవడంలేదు. పరతెంచి పోతున్నాడు. వీధుల్లో విద్యార్థుల కలకలం, సందు మొగలోనుంచీ 'అగ్గిరాముడూ!' అన్న కేక, సిమెంటు రోడ్డుపైన బూట్ల టక టకలు - యిన్నింటికీ తోడు సీతాపతి మనసులో గూడు కట్టుకొన్న భయం. అన్నీ ఒకటిగా కలిసి అతణ్ణి ముందుకు తరుముతున్నాయి.

ఈ గగ్గోలుతో కలిసి ఉన్నట్టుండి ఓ పిలుపుగూడా వినిపించింది-

"మేష్టారు! ఆగండి మేష్టారూ!"

సీతాపతి వెనుతిరిగి చూచాడు. పిలుస్తున్న వ్యక్తి మరొకడూ, మరొకడూ కాదు. సాక్షాత్తుగా ఆ చురకత్తి మీసాల సాయిబుల కుర్రవాడు!

సీతాపతి ఒళ్ళంతటా ముచ్చెమటలు పోసేశాయి. గుండె ఆగిపోయినంత పనైంది. అతనీసారి పరుగే లంకించుకున్నాడు.

వెంబడిస్తున్న సాయిబుల కుర్రాడేమయ్యాడో సీతాపతికి తెలియదు. అయిదు నిమిషాలు గడిచీ గడవకముందే అతడు బస్సుస్టాండులో ఉన్నాడు. సమయానికి ఓ బస్సు కదలడానికి సిద్ధంగా ఉంది. కాయాన్ని ఖాళీగా ఉన్న ఫ్రంటు సీటులోకి చేరవేసి సీతాపతి చుట్టూరా కలయజూడసాగాడు.

ఒకటి రెండు నిమిషాలు నిరపాయంగా గడిచిపోయాయి. మూడో క్షణాన రోడ్డుపైనుంచి బస్సు స్టాండులోకి వస్తున్న జన సమూహంలో సీతాపతి కంటికి మళ్ళీ అపాయం దృగ్గోచరమైంది. అవే చురకత్తి మీసాలు! అదే నొక్కుల క్రాపింగు! వాడే వీడు! వచ్చేస్తున్నాడు...

సీతాపతి చేతలుడిగి శిలా విగ్రహమై పోయాడు.

ఇచ్చవచ్చినంత సేపు సీతాపతితో దాగుడుమూతలాడుతున్న అపాయం చిట్టచివరకు అతని ఎదుటకు రానేవచ్చింది. వచ్చిన అపాయం పల్లెత్తి పలకరిస్తోంది-

"నమస్కారమండి మేష్టారూ!"

సీతాపతి మనోవీధిలో నాధూరాం గాడ్సే ప్రత్యక్షమవుతున్నాడు.

"తోడుగా ఉండి మిమ్మల్ని బస్సు ఎక్కించమన్నారు..."

"య్యె... య్యెవరు?'

"అనంతం మేష్టరుగారు..."

సీతాపతి తన చెవుల్ని తానే నమ్మలేకపోయాడు.

"ఈ చీటీగూడా ఇమ్మన్నారు..."

సీతాపతి చీటీ అందుకున్నాడు.

"ప్రియమైన సీతాపతీ!

"వూళ్ళో మా నాన్నగారికి జబ్బుగా ఉందని మనిషి వచ్చాడు. నీతో చెప్పి వెళ్దామని స్కూలుకు వస్తూండగా మధ్యలో ఈ కుర్రాడు కనిపించాడు. పహిల్వానులాంటి ఈ కుర్రాడిని నీకు కాపుదలగా నియమిస్తున్నాను. వూరికి వెళ్ళగానే జాబు వ్రాస్తావుగదూ..."

"ఉదయం ఏదో చిన్న పొరబాటు జరిగిపోయింది మేష్టారూ..." కుర్రాడు మళ్ళీ ప్రారంభించాడు.

ఒక్కపెట్టున సీటుపైన నిటారుగా కూర్చోగలిగాడు సీతాపతి. "ఇదిగో అబ్బాయ్! పొరపాట్లు మానవులకు సహజం. నువ్వు నిర్భయంగా ఇంటికి వెళ్ళిపోవచ్చు. నేనెప్పుడో కాగితాన్ని చించి గాలికి వదిలేశాను..."

బస్సు కదిలింది.

కదిలిన బస్సుతోపాటు సీతాపతి ఆలోచనలు గూడా కదిలాయి. తొందరపడి అనంతమూర్తి అంతర్థానాన్ని అపార్థం చేసుకున్నందుకు సీతాపతి కించపడిపోయాడు. పడిపోతూ తన పర్సనల్ రిజిష్టరులో యిదివరకే నమోదు చేసుకున్న అంశాలపైన ఎర్రగీటు వేసి, అప్పటికప్పుడే కొత్త వివరాలను గుర్తించి ఉంచుకున్నాడు. అనంతమూర్తి అమృత హృదయుడు. అతడి ఇల్లాలు ఉత్తమ గృహిణి. హేమ తన హృదయంలో ప్రేమదీపాలు వెలిగించిన లేమ! చివరకు చురకత్తి మీసాల సాయిబుల కుర్రవాడుగూడా వినయ విధేయతలు గలిగిన బుద్ధిమంతుడు. ఏమిటో అనుకున్నాడు గానీ రామన్నపేట చాలా మంచివూరు...

రామన్నపేటను వెనక్కు నెట్టుకుంటూ బస్సు ముందుకు పరుగిడుతోంది.

❖ ఆంధ్రపత్రిక – డిసెంబర్, 1968. ❖

# కృతజ్ఞుణ్ణి!

**నా** స్థానమేమిటో నాకు తెలిపిన వాడు శివానందం. అతనికి నేను కృతజ్ఞుణ్ణి. కథ మొదటినుంచీ చెబుతాను.

సరిగ్గా జ్ఞాపకం లేదు. 1962లో ననుకుంటాను. అప్పుడు నేను ఉద్యోగం చేస్తూ వుండిన పట్టణంలో నాకు శివానందంతో పరిచయం కలిగింది. ఆ పరిచయం ఎలాంటి పరిస్థితుల్లో కలిగిందో చెబుతే ఈ కథలోని ముఖ్యపాత్రల్ని పరిచయం చేసినట్టవుతుంది.

ఆ పట్టణం చాలా పెద్దది. అది పెద్దది గావడంవల్ల సాయంకాల మయ్యేసరికి కాళ్ళు సలుపులెత్తడం తప్పితే నాబోటి వాళ్ళ కొరిగేదేమిలేదు. నగర గర్భంలోకి చొచ్చుకొని వెళ్ళినకొద్దీ పెరిగేవీ, నగరం శివార్లను వెదుక్కుంటూ వెళ్ళినకొద్దీ తరిగేవి అద్దె రేట్లు. లోకంలో ఎన్నో వూళ్ళుండగా నేను చేయవలసి వచ్చిన ఉద్యోగం నన్నా నగరంలోకి విసిరింది. ఆ నగరంలో ఎన్నో యిళ్లుండగా నా ఆర్థిక స్థోమత నన్నొక గూటిలోకి ప్రవేశపెట్టింది. పగటి వేళల్లో పని చేయవలసిన కార్యాలయంనుంచీ, రాత్రుల్లో తలదాచుకునే ఆ గూటికి ఎంత లేదన్నా రెండున్నర మైళ్లకు తక్కువుండేదికాదు. సందుగొందుల అడ్డుదారుల్ని అన్వేషించి, వీలయినంత మేరకు ఆ దూరాన్ని తగ్గించు కోవాలన్నది అప్పటి విశ్వప్రయత్నం. ఈ అన్వేషణలో ఒకనాటి సాయంకాలం దట్టంగా నారుపోసినట్టున్న యిళ్ళ వరుసల మధ్య నడుస్తుండగా ఒక నాలుగు వీధుల కూడలిలో ఎలక్ట్రిక్ స్థంభానికి వ్రేలాడుతున్న అట్టముక్కపైన ఒక ప్రకటన, కాదంటే ఒక విజ్ఞాపన కానవచ్చింది.

## 'సంజీవనీ సిద్ధ వైద్యశాల'

(పడమటి వీధిగుండా నడిచివచ్చి, రావిచెట్టు దగ్గర మలుపు తిరిగితే ఎడమవైపున ఏడో ఇల్లు)

"తప్పక దయచేయండి!"

ఎక్కడికైతే వెళ్ళవలసిన ఆగత్యం కలగకుండా చూసుకోడం మంచిదో, అక్కడికి తప్పకుండా రమ్మని ఆహ్వానం! ఇంకా నయం, శ్మశానం దగ్గర సుస్వాగతమన్న బోర్డు కట్టారుగాదు. 'రోగ పీడితులకు మనవి' అంటూ ఒక హెడ్డింగు తగిలించివుంటే ఆ ప్రకటన మరీ అంత అసంగతంగా వుండి వుండేది కాదేమో! అయినా దాని జోలి మన కెందుకొచ్చినట్టని నా పాటుకు నేను ముందుకు సాగి పోబోతుండగా, సదరు ప్రకటన క్రింద పెన్సిలుతో గిలికి పెట్టిన వ్రాత ఒకటి చూపుల్ని ఆకట్టుకుని నన్నక్కడే నిలబెట్టింది.

లుప్త భాగాన్ని పూరించి, కావ్యానికి నిండుదనం చేకూర్చినట్లుగా ఎవరో కొంటె కోణంగి కుర్రవాడు "తప్పక దయచేయండి" అన్నమాట క్రింద "ఒకసారి వచ్చినవారు తిరిగి వెళ్ళలేరు" అన్న వాక్యాన్ని జతకలిపి, ప్రకటనను పరిపూర్తి గావించాడు!

ఇసుకలోనుంచి నూనెను తీయడం సాధ్యంకాదేమోగానీ, ఎలాంటి తీవ్ర విషయంలో నుంచయినా సరే హాస్యాన్ని పిండడం సాధ్యమే. పత్రికల్లో వస్తున్న కార్టూన్లని గమనిస్తే

ఈ విషయం మరింత బాగా తెలిసొస్తుంది. కానీ నాకెందుకో నవ్వు రావలసింది పోయి చివుక్కున చిన్న కోపమే వచ్చింది. "అయ్యా, బాబూ! నేనిక్కడొక డిస్పెన్సరీ తెరిచి పెట్టుకుని కూర్చున్నాను. మీరొస్తే మందులిచ్చి పంపడానికని కాపెట్టుకుని వున్నాను. తప్పక దయచేయండి" అని ప్రాధేయపడడం ఆ డాక్టరుగారి తప్పు. జబ్బుకు గురైనవారు డాక్టరుగారి దగ్గరకు తప్పితే మరెక్కడికి వెళ్తాడు? అలా వెళ్ళకపోతే వాడి కర్మ కొద్దికీ వాడే పోతాడు!

మళ్ళీ రెండు మూడు నెలలదాకా నేనావైపుకు వెళ్ళినట్టుగానీ, ఆ బోర్డును గురించిన అతీగతీ పట్టించుకున్నట్టుగానీ గుర్తులేదు. నా చిన్న జీవితావకాశానికి సరిపడ్డ సమస్యలన్నీ నాకుండడంవల్ల, వాటికి పరిష్కారమార్గాలను గురించి ఆలోచించడంతోనే నాకు సరిపోతూ వుండి వుంటుంది. నేనిచ్చుకోదగినంత అద్దెకొక చిన్నవాటా దొరికితే, పల్లెనుంచీ భార్యాబిడ్డల్ని తెచ్చుకోవాలన్నది అప్పటి నా పగటికలల్లో పెద్దది. స్వయంపాకానికి అలవాటుపడి రెండు పూటలా చేయి కాల్చుకుంటున్నా పట్టణంలో నా ఖర్చు వందకు తగ్గడంలేదు. నా జీతంలో మిగిలిన వందా యాభై రూపాయలు పల్లెలో నన్ను నమ్ముకున్న వాళ్ళు 'అబ్బే పస్తులేమే' అని చెప్పుకోడానికి మాత్రమే సరిపోతున్నాయి. చిక్కంతా నాది పై సంపాదనకు వెసులుబాటులేని ఉద్యోగం కావడం దగ్గరే వచ్చింది. ఈ చిక్కుముడి మరింత జటిలమైపోతూ వచ్చింది. నోటికి తాళాలు బిగించి, తినుబండారాల రాసుల మధ్య నిల్చోబెట్టినట్టుగా, నగర వైభవమంతా నన్ను అపహాస్యం చేయడానికే ఉద్దేశింప బడినట్టు తోస్తూ వచ్చింది. ఈ జనారణ్యంలో నేను ఒంటరిగాణ్ణి... ఇలాంటి ఆలోచనలతో, వాటి మూలంగా కలిగిన చిరాకుతో తలమునకలైపోయి, ఒకనాటి సాయంకాలం సంజచీకటి వేళ నేను నిజంగానే దారి తప్పిపోయాను. దాదాపు ఒక అరగంట సేపటినుంచీ వీధులవెంట పరిభ్రమిస్తున్నా గమ్యస్థానం చేరువకు వచ్చిన జాడలు లేవు. జగత్తును మాయామేయమంటారు. ఇక్కడికి బదిలీ అయివచ్చి అయిదారు నెలలు గావస్తున్నా నా పాలిటికీ నగరం మాయాబజారుగానే వుండిపోయింది. ఎక్కడికో బయల్దేరడం; మరెక్కడికో వెళ్ళి ఆగిపోవడం!

వాకబు చేసి తెలుసుకుందామని అటూ ఇటూ చూస్తున్నానేమో, సరిగ్గా అప్పుడే ఆ పిలుపు వినిపించింది.

"అయ్యా! డిస్పెన్సరీ యిదేనండీ! డాక్టర్ శివానందాన్ని నేనే! రండి రండి!"

తిరిగి చూచాను. నేమ్‌బోర్డు వ్రేలాడుతున్న పెంకుటింటి గుమ్మంలో అతడు కనిపించాడు. పుల్లలతో ఒక బొమ్మను తయారుచేసి, వదులొదులుగా దుస్తులు తొడిగినట్టున్న ఆకారం, ఆ దుస్తులు తీసేస్తే పిల్లలకు 'అస్థిపంజరం' పాఠం చెప్పడానికి మంచి బోధనోపకరణంగా పనికి వచ్చేటట్టున్నాడు. కాళ్ళనూ, చేతుల్నీ డొక్కలోకి గ్రుచ్చి ఆ తలనుగూడా క్రిందికి అదిమిపెడితే ఆక్షేపణ లేకుండా అతణ్ణి ఒక చేతి సంచిలోకి ఇమడించవచ్చు.

ఆ మాటల్ని విని, ఆ ఆకారాన్నిగూడా చూచిన తర్వాత, అబ్బే, మీకోసం కాదని చెప్పే ధైర్యం నాకు లేకపోయింది.

"ఇదివరకెప్పుడూ యిక్కడి కొచ్చిన వారిలా లేదు. ఎలా వస్తారులెండి! నేనూ యిక్కడికొచ్చి మూడు మాసాలే అయింది. భద్రం. భద్రం తలకాస్తా క్రిందికి వంచుకరావాలి. పొట్టిద్వారబంధాలేమిటో ఖర్మ! ఉండండుండండి. ఇక్కడొక గుంత. ఇంట్లో గుంతేమిటను కుంటారు. పెరట్లోని మురికినీరు యిలా ఇంటి క్రిందినుంచే బయటికి వెళ్తుంది. మేమొచ్చిన కొత్తలో కాలవకేదో అడ్డుపడినట్టు తోస్తే తోడి చూడాల్సి వచ్చింది. మళ్ళీ సాపు చేయించే తీరికలేకపోయింది ఇంటి ఖామందుకు! అసలన్నింటికీ మించిన యిబ్బంది ఇంట్లో కరెంటు దీపాలు లేకపోవడం! ఇంతకు మునుపు అద్దెకుండిన వాళ్ళెవరో కరెంటు చార్జీ చెల్లించకపోతే డిస్ కనెక్షనొచ్చింది..."

ఆ పాటికి మేము సాక్షాత్తుగా డిస్పెన్సరీ దగ్గరికే వచ్చేశాము. పదిహేనడుగుల చచ్చవకంగా వున్న ఆ పెంకుటింటి హాల్లో సొరుగులులేని ఓ పొడుగాటి బల్లమీద జాజి చెక్కలతో చేసిన చిన్న బీరువా ఒకటి కనిపించింది. చిన్నవీ, పెద్దవీ అయిన రకరకాల సీసాలందులో వున్నాయి. అన్నట్టు వెల్తురూ, గాలీ లోపలికి వచ్చే సదుపాయం లేక పోవడాన్ని శివానందం యిబ్బందుల జాబితాలో చేర్చి వుండవలసింది. హాల్లో అడుగు పెట్టేసరికి పాదాలు జిల్లుమన్నాయిగూడా! చెమ్మ వాసనతో మిళితమైన బొగ్గుపులుసు గాలికి దీపం పొగ ఒకటి తోడైంది. ఇన్ని హంగులలోనూ దాన్ని భూగర్భ గృహానికి వేసిన సెట్టింగుతో పోలిస్తే, ఆ బుడ్డి దీపాన్ని అల్లాద్దీన్ అద్భుతదీపమనుకోడానికి సందేహము వుండనక్కర్లేదు.

"కూర్చోండి. పర్వాలేదు, మీరు కూర్చోండి నేనిక్కడ కూర్చుంటాను" అంటూ నాకు అక్కడున్న ఏకైక – కాళ్ళు కదలుతున్న పాత కుర్చీని చూపించి, శివానందం బెంచీమీద కూర్చున్నాడు.

ఆ విధంగా డాక్టరున్నూ, పేషంటున్నూ తమ తమ స్థానాలను మార్చుకున్నట్టయింది.

"చెప్పండి, ఏమిటి మీకు జబ్బు?" సూటిగా పాత్రపోషణకు ఉపక్రమించాడు శివానందం.

నా పని యిరకాటంలో పడింది. నోరుజారి నేను గనుక అబ్బే, నాకేం జబ్బని అన్నానంటే శివానందంలో మిగిలివున్న కొద్దిపాటి జీవనోత్సాహం స్విచాఫ్ చేసిన దీపంలా గుప్పున ఆరిపోయేటట్టుంది. రిహార్సల్ లేకుండా రంగంపైకి ప్రవేశించినప్పటికీ, తీరా వచ్చిన తర్వాత నా పాత్రకు నేను న్యాయం చేయడమే సబబనిపించింది. స్వలాభంకోసం నాటకమాడడమైతే తప్పు. ఇతరుల ఆనందంకోసం నాటకమాడడంలో తప్పులేదు. అది పరోపకారం క్రిందనే జమ.

"పరిపూర్ణమైన ఆరోగ్యం ఎవరికుంటుంది లెండి! ఎంతటివాడికైనా ఏవో కొన్ని చిల్లరమల్లర జబ్బులుండకుండా పోవు" అంటూ సాఫీగానే ప్రారంభించాను.

నన్ను పేషంటు క్రింద జమకట్టుకోడానికి శివానందానికి ఆపాటి ఆలంబనమే సరిపోయింది. రెట్టించిన ఉత్సాహంతో అతడు పుంజుకున్నాడు.

"అబ్బే, మీరలా అనుకోగూడదు. మా బాబాయిగారి తోడల్లుడొకాయన యిలాగే 'వెన్నెముకలో ఏమిటో కలుక్కుమంటూ వుంది' అంటుండేవాడు. రెండేళ్ళు గడిచేసరికి

అది బోన్ టి.బి. అని తేలింది. మూడు నెలలు రాయవేలూరు ఆస్పత్రిలో వున్నారు. మూడువేలు ఖర్చయింది. ఇంతజేసీ మళ్ళీ మామూలు మనిషి కాలేదంటే ఏమని చెప్పాలి? అందుకని గోటబోయే పనికి గొడ్డలి కావలసి వచ్చేదాకా వూరుకోవడం పెద్ద పొరబాటంటాను. ఎందుకూ, దారుణమైన పొరబాటేననాలిదాన్ని! ఆ మాటకొస్తే జబ్బెప్పుడూ, 'ఇదిగో నే నున్నాను, లేను' అన్నట్టుగానే వస్తుంది. ఒక తల నొప్పి, నరాల సలుపు, నిస్సత్తువ, నిద్ర పట్టకపోవడం, ఆకలి మందగించడం, యిలా సవాలక్ష చిన్నెలుంటాయి దానికి..."

మరికొంతసేపు నేను గుంజాటన పడితే నాకు చెప్పుకోరాని జబ్బేదో వున్నట్టు అనుమాన పడిపోయేటట్టున్నాడు శివానందం. ఆ ప్రమాదాన్ని నివారించుకోడంకోసం, అతడిందాకా ఉటంకిస్తూ వచ్చిన పట్టికలోనుంచీ ఓ నిరపాయకరమైన జబ్బునే ఎన్నుకుని "మరేం లేదు. సాయంకాలమయ్యేసరికి కాస్త నిస్సత్తువగా వుంటుంది. ఒళ్ళు బెండులా తేలిపోతుంది. వంట చేసుకుని తినకపోతేమానె. అలాగే పడుకోవాలనిపిస్తుంది" అన్నాను.

శివానందం కళ్లు కుంభాకార కటకాల్లా వుబ్బిపోయాయి. "చూచారా, చూచారా" అంటూ అతడు పైకి లేచాడు. "నేను చెబుతున్నానుగా! ఇవన్నీ నికరంగా జ్వరలక్షణాలే! ఉండండి, మీరే చూద్దురు గానీ..."

శివానందం పరీక్ష పూర్తి గావించారు. అతడికోసం నేను చేయించుకున్న పరీక్షకు, ఫలితంగా నా శరీరారోగ్యం పట్ల నాకు అపనమ్మకం కలగలేదని చెప్పడానికి సంతోషిస్తున్నాను. ఎటొచ్చీ పుక్కిటి కథలోని రాజకుమారుడు తొడలోనుంచీ సంజీవి పుల్లను తీసినట్టుగా, అతడొక పాతతోలుతిత్తిలోనుంచీ తీసిన ధర్మామీటరునే నేను సందేహించాను. చర్మ చక్షువులకు బొత్తిగా గీతలుగానీ, అంకెలుగానీ కానరాకుండా వున్న ఆ సాధనంద్వారా అతడు నా టెంపరేచర్ తొంబై తొమ్మిది దాటినట్టుగా నిర్ణయించాడు.

పేషంటు దొరకడమైంది. జబ్బు ఋజువైంది. చికిత్సకు ఉపక్రమించడమే తరువాయి. వేడినీళ్ళకోసమని అతడొక కేక పెట్టడంతో శ్రీమతి శివానందం రంగంపైకి వచ్చేసింది. హంగామాకది నిజమైన ప్రారంభం.

కప్పువైపు చూస్తూ నేను తలను వెనక్కు వంచుకున్నాను. చేదుగా వగరుగా వున్న ఒక పొడిని అంగిల్లో పడేటట్లుగా శివానందం నా నోట్లో వేశాడు. ఆ ఔషధం వెలుపలికి రాకుండా శ్రీమతి శివానందం రెండు గుక్కల నీళ్ళు పోసింది. ఔషధ సేవనం జరిగిన తరువాత ఓ కప్పు కాఫీ గనుక తీసుకుంటే గుప్పుగుప్పున చెమటపట్టి పోవచ్చునని భార్యాభర్తలు కూడబలుక్కున్నారు. వాళ్ళకెందరు బిడ్డలున్నారో ఏమిటోగానీ వాళ్ళల్లో హోటలుకువెళ్ళి కాఫీ తీసుకరాగలిగిన వాడొకడున్నట్టు తెలిసింది. వాడికోసం మొదట సిసింద్రీలాంటి ఒక ఆడపిల్లను తరిమి, అదెంతకూ తిరిగి రాకపోయేసరికి దానికోసం ఓ కుర్రకుంకను పంపి, ఆ యిద్దరి అతీగతీ తెలుసుకోమని ఓ ఈడొచ్చిన పిల్లకు పురమాయించి, యిలా ఒకరిపైన ఒకరిని ఉరికించడం జరిగింది. కాఫీ చేతికి రావడానికి పట్టిన అరగంట వ్యవధిలో చిరాకు కలగకుండా పేషంటును ఉల్లాసంగా వుంచవలసిన బాధ్యతను శ్రీమతి శివానందం స్వీకరించింది.

శివానందం తండ్రిపేరు శ్రీకంఠరంగారు. వాళ్ళ స్వగ్రామం ఎక్కడో కన్నడ ప్రాంతానికి సమీపం. శ్రీకంఠరంగారు గొప్ప రాజవైద్యుడు మాత్రమేగాదు, భూత వైద్యుడుగూడా! ఆయన నిల్చోమంటే నిల్చునేది, కూచోమంటే కూర్చునేది – ఏవీ? భూతాలు! ఎటొచ్చీ ఆయన కొడుకులు మాత్రం ఆ మాత్రం అదుపులో వుండకపోయారు. తిక్క మళ్ళి ఆయన తన ఆస్తిలో వీళ్ళకేమీ మిగలకుండా చేశాడు. అన్నదమ్ముళ్ళలో అదొక ప్రత్యేక తరహా మనిషి శివానందం. తండ్రిమాట వినకపోవడంలో మిగిలిన వాళ్ళకు డిటోనే అయినప్పటికీ, ఆయన ఎంతగా చెడదిట్టినా ఇతడు కిమ్మనకుండా ఊరుకునేవాడు. బాగుపడితే వీడు బాగుపడాలనీ లేదా చెడిపోతే కాసుకుకొరగాకుండా చెడిపోతాడనీ ఆ తండ్రి ఈ కుమారుణ్ణి దీవిస్తూ వచ్చారు. శ్రీకంఠరంగారు చనిపోయి పదిహేనేళ్ళు కావస్తున్నాయి. చెడిపోవడానికీ, బాగుపడడానికీ మధ్య శివానందం జీవితంలో నిర్విరామమైన పోరాటం జరుగుతూనే వుంది.

ఫలిత మేమౌతుందో తేలటంలేదని శ్రీమతి శివానందం చెప్పలేదు. నేనే అనుకున్నాను.

వెళ్ళొస్తానంటూ సెలవు తీసుకోబోయాను. అప్పుడేనా అంటూ వారించాడు శివానందం. ఎక్కడుంటారు, ఏం చేస్తుంటారు అంటూ ప్రారంభించి నన్ను గురించిన విషయాలన్నీ కూపీ లాగేశాడు. నా పట్ల శివానందం అంతటి ధ్యాసను ప్రకటించడాన్ని బట్టి చూస్తే పట్టణంలో నా ఉనికికి, లోకంలో నా మనుగడకు సార్థకృత లభించినట్టు తోచింది. పత్రికా విలేఖరి ప్రశ్నలకు సినిమా యాక్టరులా బదులు చెప్పడం ఎంతటి మధురానుభవమో తెలుసొచ్చింది.

ఆ వేళప్పుడు నేనిక నా గదికి వెళ్ళి వంట చేసుకోవలసి వుండడాన్ని శివానందం దంపతులు అనుమతించలేకపోయారు. అక్కడే భోజనంచేసి వెళ్ళవలసిందిగా పట్టుబట్టి కూర్చున్నారు. మొగమాటపడిపోతూ అరకొరగానే తినిలేచాను. 'ఈ పిడికెడు మెతుకుల భాగ్యానికేనా మీరు యింటికివెళ్ళి వంట చేసుకోవాలనడం' అంటూ శ్రీమతి శివానందం ఎద్దేవా చేసిందిగూడా!

ఐతే ఒకటి. శివానందం దంపతుల ఔదార్యం గానీ, సౌజన్యంగానీ నాకెందుకో వాళ్ళపట్ల అయిష్టతనే కలిగించాయి. ఆరోగ్యాన్ని గురించి లేనిపోని అనుమానాలు పెంచుకుని, అందుకోసమని కొంత డబ్బు వెచ్చించే పరిస్థితిలో నేను లేను. ఆ డిస్పెన్సరీ ఎక్కడుందో తెలిసిపోయింది గనుక దాని ఛాయలకైనా వెళ్లకుండా నా జాగ్రత్తలో నేనుండిపోదామనుకున్నాను. కానీ యింత జాగ్రత్త తీసుకున్నా నేను శివానందం బారినుంచి తప్పించుకోగలిగిందల్లా రెండు రోజులు మాత్రమే! మూడోనాటి ఉదయం నిద్రలేచేసరికి అతడు వరండాలో తచ్చాడుతూ కనిపించాడు.

"అయ్యా, బాబూ! నీ మందు నా పాలిటికి వైకుంఠయాత్ర కాలేదు" అని బిగ్గరగా అరిచి చెప్పాలనిపించింది.

"పేషంటుకెలావుందో కనిపెట్టి వుండడం డాక్టరుగా నా కర్తవ్యం గదండీ!" అని సంజాయిషీ చెప్పుకుంటూ లోపలికి వచ్చేశాడు శివానందం. కూచోమని నేను మర్యాద

చేయకపోయినా ట్రంకుపెట్టెపైన కూర్చున్నాడు. రెండు రోజులుగా నేను కనిపించక పోవడంవల్ల తనకు మనసు మనసులో లేకపోయిందన్నాడు. 'ఎలాగూ మీ రింటికొచ్చే దారికి దగ్గర్లోనే వున్నాను గదండీ! పలకరించి రావడానికి మరచిపోవ'ద్దంటూ ప్రాధేయపడి, అలాగేనని మాట తీసుకున్నాడు. అతడు వెళ్ళిపోయిన తర్వాత చాలాసేపటి వరకూ నేను స్థాణువులా అలాగే కూర్చుండిపోయాను. అద్దంలో ముఖం కనిపించినట్టుగా, శివానందం ప్రవర్తనలోనుంచీ అతణ్ణి గురించిన రహస్యం ఒకటి నాకు స్పష్టంగా తెలిసిపోయింది. శివానందం పేషంట్లను కాపాడే డాక్టరులా కనిపించడంలేదు. పేషంట్లచేత కాపాడబడవలసిన డాక్టరులా కానవస్తున్నాడు.

కేవలం మానవత్వపు విలువల పరిరక్షణ దృష్ట్యా నేను శివానందంతో సాన్నిహిత్యాన్ని పెంపొందించుకోవలసి వచ్చింది. తరచుగా అతణ్ణి కలుసుకునేవాణ్ణి. అడపాదడపా ఆ యింటావిడ యిచ్చే ఉపాహారాలు స్వీకరించేవాణ్ణి. గంటల తరబడీ బాతాఖానీ వేస్తూ కూర్చునేవాణ్ణి. బలవంతంగా మ్రింగిస్తే మరేమీ చేయలేకపోయేవాణ్ణిగానీ, జేబులో మిగిలిన మందు పొట్లాల్ని ఎవ్వరూ చూడకుండా వీధిలోకి గిరవాటు పెట్టేవాణ్ణి. ఈ పనులన్నింటికీ వెనక ఒక తీరని అసంతృప్తి నన్ను వెంటాడకుండా విడిచి పెట్టడంలేదు. పేషంటుగా నటిస్తూ ఎంతోకొంత నష్టం కలిగించడం మినహాయిస్తే శివానందానికి చేయగల సహాయం ఏముంది?

జీవితంలో పెద్దగా మార్పంటూ రావాలంటే అందుకు నాందిగా గొప్ప అద్భుతం ఒకటి జరిగితీరాలి. పూర్వకాలపు పుక్కిటికథల్లోనైతే బీజాక్షరాలు, తాయెత్తులు, మంత్రతంత్రాలు, రాజానుగ్రహాలు, కాళికాదేవి కరుణాకటాక్షాలులాంటివి అలాంటి అద్భుతాలకు దోహదం చేసే సాధనాలుగా ఉపకరిస్తుండేవి. ఆధునిక యంత్రయుగంలో సరిగ్గా అదే వెసులుబాట్లు లేకపోయినా అలాంటిది మాత్రం లేకపోలేదు. గుర్రప్పందాల్లో జాక్‌పాట్, లాటరీలో మొదటి ప్రయిజు, పైరాబడికి వీలున్న డిపార్టుమెంటులో కీలక ఉద్యోగం... అబ్బే, లాభం లేదు. దురదృష్టవంతుల విషయంలో యిలాంటివన్నీ గొంతెమ్మ కోరికలుగా మిగిలిపోయే అవకాశాలు మాత్రమే హెచ్చు!

శివానందం భవిష్యత్తు విషయంలో నేనిలా హతాశుడినైపోతున్న సందర్భంలో చిన్న తమాషా ఒకటి జరిగింది. మరేంలేదు. మా ఆఫీసులో సన్యాసిరావని ఓ సీనియర్ గుమాస్తా వుండేవాడు. డబ్బారాయడన్నది అతడికి సహోద్యోగులందరూ ముద్దుగా పెట్టుకున్న పేరు. వాడినకొద్దీ డబ్బా అరిగిపోనూవచ్చు, విరిగిపోనూ వచ్చు. సన్యాసిరావు నోటికలాంటి ప్రమాదం లేదు. అలాంటి సన్యాసిరావు పెళ్ళానికి ఉన్నట్టుండి కడుపునొప్పి వచ్చేసింది. తన భార్య కడుపునొప్పిని జగత్ప్రళయంలా అభివర్ణిస్తూ అతడు ఆఫీసునంతా గగ్గోలు పెట్టడం ప్రారంభించాడు. ఎక్కడలేని సానుభూతినంతా ముఖానికి రంగరించుకుని ఎవడికివాడు నాలుగు ఉపశమన వాక్యాలు చెప్పకపోతే, అవాకులూ చవాకులూ కల్పించి వాడి దుంప తెంచకుండా వదిలిపెట్టడు సన్యాసిరావు. నావంతు వచ్చేసరికి నాకు శివానందాన్ని గురించి జ్ఞప్తికి వచ్చింది. "చూడండి సన్యాసిరావుగారూ! ఈ వూళ్లో సంజీవనీ వైద్యశాల అంటూ ఒకటుందని మీకు తెలుసునా?" అన్నాను. "ఎక్కడ? ఎక్కడుందది? చెప్పండి" అన్నాడు సన్యాసిరావు.

ఇంతే సంగతులు! పై సంఘటన జరిగిన తర్వాత పదిహేను రోజులకొకనాడు ఆఫీసులో ప్రవేశించబోతుండగా పరుగెత్తుకుంటూ ఎదుర్కొలు వచ్చి నన్ను గాఢాలింగనం చేసుకున్నాడు సన్యాసిరావు. "బాబ్బాబూ! నీవల్ల నా కొంప నిలబడింది. బారెడు పొడుగు డిగ్రీలు తగిలించుకున్న డాక్టర్లనెందరినో చూచాను. వాళ్ళు వ్రాసి యిచ్చిన మందులన్నీ కొనివుంటే ఈపాటికి నా యిల్లు గుల్లై వుండేది. అయిదు రూపాయలతో అయిదు పూటల మందుతో యిప్పుడు నా భార్య లేచి గుండ్రాయిలా తిరుగుతోంది. అంతా శివానందం చేతి చలువ..."

సన్యాసిరావెంత వదరుబోతయినా అతడి మాటపైన గురి కలిగినవాళ్ళు కొందరు లేకపోలేదు. చూస్తూ చూస్తూ వుండగానే వాళ్ళ ప్రసంగం నడుమ డాక్టరు శివానందం పేరు తరచుగా నలిగిపోసాగింది.

శివానందం గురించి యిలా ప్రచారం ప్రారంభమైన క్రొత్తలోనే నాకా వూరినుంచీ ట్రాన్స్ఫర్ వచ్చింది. పేపరు వెయిటులేని కాగితానికి మల్లే నాకెప్పుడు ట్రాన్స్ఫరు వచ్చినా దూర ప్రాంతానికి కొట్టుకుపోవడమే రివాజు. బదిలీ అయిన కొన్నాళ్ళకు ప్రమోషనుగూడా వచ్చి సంపాదనలో కొంత మెరుగుదల పొడచూపడంతో భార్యాబిడ్డల్ని తీసుకొచ్చి నా దగ్గరే పెట్టుకోడానికే వీలయింది. కానీ కాలక్రమాన పిల్లల వయసుతోబాటుగా, జీవితావసరాల కయ్యే ఖర్చుగూడా పెరుగుతూ రావడంతో నా ఆర్థిక స్థోమత మళ్ళీ యథాస్థితికి దిగజారక తప్పలేదు. చాలని జీతంతో జీవితాన్ని సర్దుబాటు చేసుకోడం నాకెప్పుడూ అలవాటే! కానీ పులిమీద పుట్రగా నా వయసు నాలుగో పది దాటిన తర్వాత, ఆకలి మందగించి ఏమి తిన్నా అరగని జబ్బొకటి దాపురించింది. మొండికెత్తినట్టుగా అయిదారు నెలల వరకు వూరకుండి పోయానేమో. బరువులో ముప్ఫై పౌన్లదాకా తగ్గిపోయాను. అప్పుడిక డాక్టర్ల దగ్గరకు పరుగిడితే వాళ్ళొక్కొక్కరూ వందల కొలదిగా ట్యాబు మాత్రలు మ్రింగించి, ఒళ్ళంతా సూదుల్తో పొడిచి, 'అయ్యో! ఈ జబ్బెప్పుడు నయమౌతుం'దని అడిగితే 'హిహిహి' అంటూ వెకిలి నవ్వుల్నే ప్రసాదించారు. నా బుద్ధి గతంలోకి మళ్ళింది. అవును. శివానందం దగ్గరకి వెళ్ళడమొకటే యిప్పుడు గత్యంతరం. వెళ్ళి "బాబూ! ఇప్పుడు నిజంగానే నాకు జబ్బొచ్చిపడింది. మందివ్వు" అని అడగాలి...

వెళ్ళాను.

బస్టాండులో దిగి వెళ్ళవలసిన చోటు చెప్పేసరికి "రండి, రండి" అంటూ రిక్షాలు చుట్టూరా మూగిపోయాయి. గడచిన పది పన్నెండేళ్ళలోనూ పట్టణంలో వచ్చిన మార్పుల్ని గమనిస్తూ పరధ్యానంగా వుండిపోయిన వాణ్ణి 'అయ్యగారూ! వచ్చేశాం. దిగండి' అన్న రిక్షావాడి మాటవిని, ఉలిక్కిపడ్డట్టుగా క్రిందికి దిగేశాను.

పెద్ద ప్రాకార కుడ్యం చుట్టూ పూలతోట. మధ్యగా అందమైన కట్టడం. కిటికీలకు గాజు తలుపులు ద్వారబంధాలకు తెరలు. వరండాలో గాడ్రెజ్ కుర్చీలు. వెయిటింగు రూములో కుషన్ సోఫాలు. హంగులన్నీ అత్యుత్తమంగా అమరి వున్నాయన్న సంతృప్తితో

ముందుకువెళ్తూ లోపలి గుమ్మంపైన పెయింటుతో అచ్చుగుద్దినట్టుగా వ్రాయబడివున్న హెచ్చరికవైపు చూచి, అక్కడే ఆగిపోయాను.

"అనుమతి లేనిదే లోనికి వెళ్ళరాదు."

మంచిదే! ఎవరి అనుమతి తీసుకోవాలి?

ఎట్టయెదుట వున్న ఓ చిన్న గదిలో కూర్చుని ఒక గుమాస్తా చీటీలు వ్రాసి యిస్తున్నాడు.

"అయ్యా! అనుమతిపత్రం" అన్నాను.

"కన్సల్టింగు ఫీజు అయిదు రూపాయలు" అన్నాడు.

వ్యవహారాలన్నీ ఒక పద్ధతిలో జరిగిపోతున్నచోట మెహర్బానీలకు తావుండ గూడదన్న పరిజ్ఞానం నాకు లేకపోలేదు. డబ్బు చెల్లించి, చీటీ చేతికి తీసుకుని, వెళ్ళి వెయిటింగు రూములో కూర్చున్నాను.

నా ఆకు బయటపడేసరికి ఒక ఝాముసేపు పట్టింది. బెంచి కోర్టులో దవాలా బంట్రోతులా ఒక జవాను "నంబరు ఎనభై ఆరండీ! ఎనభైఆరు" అని పిలవడం ప్రారంభించాడు.

ఆ పిలుపును వెన్నంటినట్టుగా లోపలికి దూసుకుని వెళ్ళాను.

సందేహంలేదు. ఆకారంలో ఎంతగా మార్పువచ్చినా అతడు శివానందమే! కుట్టించుకున్న దుస్తులిప్పుడు బుద్ధిగా అతడి శరీరాన్ని అంటిపెట్టుకుని వున్నాయి. తలపైన ముందుభాగం వెంట్రుకలన్నీ రాలిపోయి బోర్లించిన రాగి చెంబులా కానవస్తున్నప్పటికీ నెత్తురు పుంజుకున్న అతడి ముఖం ఫలపుష్ప ప్రదర్శనానికి వచ్చిన నిండైన టొమాటో పండులావుంది. నాటికీ, నేటికీ బాహ్య వేషంలో కొట్టవచ్చినట్టుగా కనిపిస్తున్న తేడా అతడి కళ్ళద్దాలు. ఆ సులోచనాలను సర్దుకుంటూ ఒకటి రెండు క్షణాలపాటు అతడు నావైపు ఎగాదిగా చూచాడు.

"మీరు... మీరు... అవునవును. రామ్మూర్తిగారు కదూ! చాలాకాలమైంది చూచి. అయ్యోపాపం, బాగా దస్సిపోయినట్టున్నారే! కూచోండి. సంగతేమిటో చూద్దాం..."

ముక్తసరిగా రోగ లక్షణాలు తెల్సుకున్నాక టెస్టింగురూములోకి తీసుకెళ్ళి రకరకాల పరీక్షలు జరిపి "రేపటి ఉదయం పదిగంటలకు రండి. ఏం చేయాలో చెబుతాను." అన్నాడు.

ఆ రోజు రాత్రి హోటల్లో భోజనం చేశాను. పదేళ్ళ క్రితం నేను పనిచేసిన ఆఫీసు దగ్గరకి వెళ్ళి కాపలా మనిషిని మంచి చేసుకుని అక్కడనే వసారాలోనే పడుకున్నాను.

మరునాటి ఉదయం పదిగంటలకు మళ్ళీ కన్సల్టింగ్ ఫీజు చెల్లించుకోవలసిన అవసరం లేకుండానే లోపలికి వెళ్లడానికి అనుమతి లభించింది.

నా కోసమే వేచి చూస్తున్నట్టుగా "వచ్చేశారా, కూచోండి" అన్నాడు శివానందం.

కూర్చున్నాను.

"మిస్టర్ రామమూర్తిగారూ! వచ్చిన కష్టాన్ని ధైర్యంగా ఎదుర్కోడంలోనే మానవుడి సత్తా బయటపడేది. మరేం కంగారుపడకుండా వినాలి మీరు. మీ కొచ్చిన జబ్బును

"అల్స"రంటారు. దీనంతటి పీడాకరమైన జబ్బు యిదే. పురాణాల్లో అదేదో రాక్షసి వుండేదట. ఎంత నైవేద్య మిచ్చినా దానికి ఆకలి తీరేది కాదట. అలాంటిదే యిదిన్నీ. తొందరపడి లాభంలేదు. చాలా నిదానంగానే ఫలితాన్ని ఎదురు చూచే వీలు..."

పెదవి కదపబోయాను. మాట తడపడింది. కళ్ళల్లో కన్నీళ్ళుగూడా క్రమ్ముకున్నట్టు తోచి ముఖం క్రిందకి దించుకున్నాను.

"చూచారా! మీరలా మనసు వదిలిపెట్టగూడదు. ఎలాగైనా మీకు మేలు జరగాలన్నది నా ఉద్దేశం. అభ్యంతరం లేకపోతే మీకు నేను సాయం చేస్తాను..."

"చెప్పండి. సందేహించకండి" అన్నాను.

లెటర్ ప్యాడ్ పైకి తీసి పరపరా నాలుగు ముక్కలు వ్రాశాడు శివానందం. ఆ కాగితాన్ని చించి కవరులో పెట్టి అడ్రసుగూడా వ్రాసి ముగించాడు.

"గవర్నమెంటు ఆసుపత్రిలో కె.సి.నాయరని ఓ డాక్టరున్నాడు. నాకు స్నేహితుడే! దీన్ని తీసుకెళ్ళి ఆయన దగ్గరివ్వాలి. మారు మాటలేకుండా ఇన్‌పేషంటుగా అడ్మిట్ అయిపోగలరు. బెడ్డూ, బ్రెడ్డూ, పాలు, పళ్ళూ, మందులూ, ఇంజక్షన్లూ అన్నీ ఫ్రీ..."

***

నా స్థానమేమిటో నాకు తెలిపినవాడు శివానందం. అతడికి నేను కృతజ్ఞుణ్ణి. కథ పూర్తయిపోయింది.

❖ అనామిక – 1970 ❖

# అనామకుడు

'ఏమండోయ్ రంగనాథంగారూ! బహుకాలదర్శనం. బావున్నారా?'

'అయ్యా నరహరీ! ఎప్పుడొచ్చావు బాబూ! ఇందాకా నిన్ను గురించే అనుకున్నాం. అన్నట్టు నువ్వొక్కడివేనా వచ్చింది?'

'ఒరేయ్ గోపీ! ఇదేనా రావడం? టిఫిన్లింకా పెడుతూనే వున్నారు. వెళ్ళు... వెళ్ళు...'

'రాధాపతీ! మెల్లగా దిగరా నాన్నా! అసలీ మధ్య ఒళ్ళు చేసినట్టున్నావు. నీళ్ల పంపుల దగ్గర జాగ్రత్త! కాలుజారి ఎవరిపైనయినా పడ్డావో ప్రమాదం...'

పలకరింపులతో పరామర్శలతో పందిరి క్రింద సందడిగా వుంది. హారన్లు మ్రోగించుకుంటూ కార్లు, గంటలు వాయించుకుంటూ రిక్షాలు, గుర్రపుడెక్కల చప్పుళ్ళతో జట్కాలు, ప్రతి నిమిషమూ ఏదో ఒక వాహనం వచ్చి పందిరి ఎదుట విడిసిపోతోంది. ఎవరొచ్చింది, ఎవరొచ్చింది అన్నట్టుగా చూపులన్నీ కొద్ది క్షణాలపాటు ఒక్కుమ్మడిగా ఆ వచ్చి నిలిచిన వాహనంవైపు ప్రసరిస్తున్నాయి. కొత్తగా కొన్న పాతకారులోంచి దిగి మునిసిపల్ కౌన్సిలరు మేఘనాధంగారు యింతకుమునుపే లోపలికి వెళ్ళారు. ఆ కారుకు అల్లంతదూరంలో ఆగివున్న స్కూటరు ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరు శ్రీధరమూర్తిగారిది. అదిగో, ఆ చెట్టు క్రింద పదిమంది మిత్రులతో పరివేష్టితుడై తీవ్రంగా ఏదో చర్చలో నిమగ్నుడైవున్న వ్యక్తి భూపతి. అతడు థియేటర్ యజమాని. వీళ్లుకాదు పరకాయించిచూస్తే యింకా యిలాంటి వాళ్లెందరో అక్కడున్నారు. ఉండడంలో ఆశ్చర్యమేమీలేదు. జగన్నాథంగారు ఏకైకపుత్రికకు పెళ్లి చేస్తున్నారు. ఆయన స్వహస్తంతో టౌనులో పంచి పెట్టిన ఆహ్వానపత్రాలే అయిదువందలదాకా వుంటాయి. అంతకు రెండింతల పత్రికలు పోస్టులో వెళ్లాయి. జగన్నాథంగారికి భూములున్నాయి. భారీ వ్యాపారాల్లో వాటాలున్నాయి. ఆఫీసుల్లో పలుకుబడివుంది. ప్రముఖులతో పరిచయంవుంది. జగన్నాథంగారి కిన్ని హంగులుండడంవల్ల అది ఆ ప్రాంతంలో చాలామందికి పిలవకపోయినా వెళ్లవలసిన పేరంటమైపోయింది. ఇక పిలుపందుకున్న బంధుమిత్రులు తండాలు తండాలుగా తరలిరావడంలో ఆశ్చర్యమేముంది?

పెళ్లికుమార్తె ప్రసూన యింకా కాలేజీలో చదువుకుంటూవుంది. పెళ్లయిన తరువాత ఆమె చదువుకోడానికి పెళ్ళికుమారుడు అభ్యంతరమేమీ చెప్పలేదు. ఆ మాటకొస్తే ఆమె జీవితాంతందాకా చదువుకుంటూ వుండిపోయినా తనకేమీ అసౌకర్యం వుండదన్నాడు. ఏప్రిల్లో యంఎస్సీ పరీక్షలు వ్రాసి మే నెల్లో పెళ్లి చేసుకుంటున్న సీతాపతికి మాత్రం చదువులపట్ల ధ్యాస వెనుకముఖం పట్టిందనే చెప్పాలి. ఏ సిద్ధినైతే లక్ష్యంగా పెట్టుకుని తానింతకాలం విద్యాసాధన చేశాడో అది ఈ పెళ్ళిద్వారా సగానికిపైగా సిద్ధించినట్లయింది. ఇప్పుడిక ఉద్యోగం చేసి తీరాలన్న నిర్బంధం లేదు. 'కానీ చూద్దాం' అనుకుంటున్నాడు సీతాపతి. నచ్చిన ఉద్యోగమంటూ దొరికితే కొంతకాలంపాటు చేసి చూడొచ్చు. మనస్కరించకపోతే చిరుగులుపడ్డ చేతిగుడ్డను గిరవాటు పెట్టినట్లుగా రాజీనామా వ్రాసి పడెయ్యనూ వచ్చు.

పెళ్లికి ప్రసూన స్నేహితురాళ్లు చాలామంది వచ్చారు. ఆ కాలేజీలో లెక్చరర్లుగూడా విచ్చేశారు. అందువల్ల ఆధునిక నాగరిక ప్రపంచంలో ఆడవాళ్ల ఆహార్యపు తీరుతెన్నుల్లో వచ్చిన వింత వింత సొబగులన్నింటినీ ఒక్కసారిగా సంతకు తోలుకొచ్చినట్టుగా ఆ వివాహ దృశ్యానికెక్కడలేని కాంతి వచ్చేసింది. ఈ విషయంలో వరుడైనా నిస్సహాయంగా లేడు. అతడి బలగంగూడా దండిగానే వచ్చింది. నవ్వులు, కేరింతలు, వాగ్యుద్ధాలు, సిగరెట్ల పొగలు ఎక్కడైతే దట్టంగా వ్యాపించి వున్నాయో అక్కడల్లా కాలేజీ కుర్రాళ్ళు గుమికూడి వున్నారని ఆవైపు చూడకపోయినా తెలిసిపోతోంది.

ఏమైనా పెళ్లికి వచ్చిన జనంలో మరింత వైవిధ్యం కన్పించడానికి తోడ్పడింది మాత్రం జగన్నాథంగారి బంధువర్గమే! నలుగురన్నదమ్ముళ్లాయనకు. వాళ్లుగూడా నేల నాలుగు చెరగులా నాటిన నాలుగు జయస్తంభాలలాంటి వాళ్లు. ఒకతను మిలటరీ కార్యాలయంలో ఉన్నతోద్యోగి. తమ్ముడేమో ఐ.ఎ.ఎఫ్.లో వుండి నెలనెలా రెండువేల రూపాయలు పుచ్చుకుంటున్నాడు. అన్నగారు బాంబేలో హోటలు నడుపుతూ అక్కడే స్థిరపడ్డారు. పోగా జగన్నాథంగారి భార్యకు అన్నదమ్ముడైతే ఒక్కడేగానీ అక్కచెల్లెళ్లు అయిదుగురు. ఒకావిడ ఇంజనీరును పెళ్లాడి అతడితో బాటుగా అమెరికావెళ్లి రెండేళ్ళుండి యిటీవలే తిరిగొచ్చింది. ఇంకొకావిడ డాక్టరు. ఆమె మొగుడూ డాక్టరే! మిగిలిన వాళ్లల్లో యిద్దరికి లెక్చరర్లకూ పెళ్లాలయ్యే యోగం పట్టింది. కడగొట్టు చెల్లెలి మొగుడు మాత్రం ఏకంగా శాసనసభలోనే సభ్యుడు. ఇప్పుడు పేర్కొన్న బంధువుల్లో చాలామందికి పెళ్ళిళ్లయిన కొడుకులూ, కూతుళ్లూ వున్నారు. ఆ రెండోతరంవాళ్లకు మళ్లీ బిడ్డలున్నారు. జగన్నాథంగారి కెలాగూ ఐశ్వర్యానికి తగ్గ నిష్పత్తిలో సంతానం కలగలేదు. భగవంతుడి కామాత్రం వితరణ లేకపోయింది. అందుకు బంధువులేం చేయగలరు పాపం! వాళ్లూ ఎంతోకాలంనుంచీ వేచివున్నారు. లేకలేక యిన్నాళ్లకు జగన్నాథంగారి యింట్లో ఒక శుభకార్యం ఒనగూడింది. దీన్ని కాస్తా జారవిడిస్తే మళ్లీ పాతికేళ్లదాకా యిలాంటి అవకాశం యింకొకటి లభించకపోవచ్చు. అందువల్ల వాళ్లు సకుటుంబంగా మరికొందరైతే మిత్రసమేతంగా, యింకా కొందరు పరివారసహితంగా పెళ్లికి తరలి వచ్చేశారు.

కామాక్షీ కల్యాణ మహల్ సినిమాథియేటరు గాదు. లేకుంటే ఈపాటికెప్పుడో హౌస్‌ఫుల్ అన్న బోర్డు తగిలించివుండవలసింది!

హాల్లో పెళ్లి మండపం ఎదుట వేసిన అయిదు వందల కుర్చీలు భర్తీ అయిపోయాయి. ఇంకా చాలామంది ఎక్కడివాళ్లక్కడే నిలబడిపోయివున్నారు. ముహూర్త సమయానికి అట్టే వ్యవధిగూడా లేదు. ఇంకొక అయిదువందల కుర్చీలకోసం మనుషులు పరుగెడుతున్నారు.

ముఖంపైన క్రమ్ముకుంటున్న చిరుచెమటను అంగవస్త్రంతో తుడుచుకుంటూ జగన్నాథంగారు ఆదరాబాదరాగా పాకశాలవైపు పరుగుతీశారు.

ట్రిచీనుంచి వచ్చిన వంట బ్రాహ్మల జట్టుకు నాయకుడు నటేశయ్యరు కుర్చీలో సుఖోపవిష్టుడై, నోటినిండుకూ తాంబూలం పట్టించి దానికి మద్దతుగా అప్పటికప్పుడే గంపెడు తంగభస్మం దట్టిస్తున్నాడు.

"అయ్యరుగారూ! అంచనా తారుమారైపోయేటట్టుంది. ముహూర్తం కాగానే కొందరు తాంబూలాలు పుచ్చుకుని వెళ్లి పోవచ్చుననుకోండి! కానీ నిలిచిపోయేవాళ్ల పర్సంటేజ్ ఎక్కువగా ఉంటుంది. మీరిప్పుడు చేస్తున్నది వెయ్యిమందికోసం. అవసరమైతే యింకొక అయిదువందల మందికిగూడా..."

"అదేయప్పా! మీరూరుకొండిసార్! ఇక్కడ అడుపులమీద అండాలు మండుతుదా వుండును. అక్కడ అన్నాలు తినడందా ఆలస్యం, యిక్కడ అన్నాలు దిగుతూదా వుండును. మీకు కవలెందుకు సార్! పొండి, పొండి. మీ వేలె మీరు సూసుకొండి..."

అయ్యరుగారి అభయ ప్రదానంతో ప్రాణాలు తెరిపిన పడ్డట్టయింది జగన్నాథం గారికి!

సరిగ్గా ఆ క్షణంలోనే వెనుకవైపునుంచీ ఓ చేయి జగన్నాథంగారి భుజంపైన పడింది.

కంగారుపడిపోతూ ఆయన వెనుదిరిగి చూచేసరికి హనుమంతప్ప కనిపించాడు.

"ఏమిటండీ అన్నగారూ! ఏం జరిగింది"

"ఇప్పటికేమీ జరగలేదులే! రా, చెబుతాను..."

స్తంభం చాటుకు లాక్కెళ్లాడు హనుమంతప్ప.

"చూడవోయ్ జగన్నాథం! నీకూ యాభై యేళ్లు వచ్చేశాయనుకో! కానీ అదేమంత పెద్ద వయసుగాదు. సభలూ, సమావేశాలూ, బిజినెస్సులూ వగైరా నువ్వు బోలెడన్ని జరిపించి వున్నావు. ఐనా పెళ్లి సంగతి వేరు. అందులోనూ కామాక్షీ కల్యాణ మహల్లో పెళ్లి జరగడమాయె! ఇదసలే మాయామహలు. ఏమూల ఏం జరుగుతున్నదీ మనం తెలుసుకోలేం. పోగా యిక్కడ మామూలుగా జరిగిపోయే తెరమరుగు వ్యవహారం ఒకటుంది..."

"అలాగా! అదేమిటో మీరే చెప్పాలి. పెద్దలు మీరుండడం అందుకే గదా!"

తన పెద్దరికం తనకు దక్కినందుకు హనుమంతప్ప ముఖంలో సంతృప్తి తాండవించింది.

"పెళ్ళికి చాలామంది వచ్చారు. అవునా జగన్నాథం?"

ఇందులో అభిప్రాయ భేదానికి తావెక్కడిదన్నట్టు జగన్నాథంగారు తలపంకించారు.

"వస్తారు, వస్తారు. ఎందుకురారు! గరిట చేతబట్టుకుని విశ్వమోహిని అమృతం వడ్డిస్తున్నానహో అనే సరికి దేవతలంతటి వాళ్లు బారులు తీర్చి కూర్చోలేదా? ఐతే ఒకటి. ఆ అయ్యలు కూచోవలసిందే! ఆయమ్మ వడ్డించనూ వలసిందే! కానీ రాహు కేతువుల మాటేమిటి? ముఖం చాటు చేసుకుని, చేతుల్నిమాత్రం పొడుగ్గా చాచుకుని బంతిలో బైటాయించిన రాహుకేతువుల్ని మాత్రం ఏ బుద్ధిమంతుడూ కనిపెట్టలేదే!"

"అవు న్నిజమేనండీ అన్నగారూ! ఎందుకైనా మంచిది. మనం ఓ కంట కనిపెట్టి వుందాం లెండి!"

"అదీ, ఆ హుషారు చాలా అవసరం! దారంట వెళ్లే దానయ్యలు చాలామంది వున్నారయ్యా లోకంలో. పైగా యిక్కడి సత్రాల్లో అరుగులపైన పస్తులుమాడే బైరాగులు

బోలెడుమంది! వచ్చిన చిక్కెక్కడుందంటే, వీళ్లు చూడ్డానికి బైరాగుల్లా వుండరు. మామూలు మనుషుల్లా వుంటారు. ఇలాంటి పెళ్లిళ్లు జరిగాయంటే వాళ్లకు పండగ! ఒక మాదిరి వుతికిన బట్టలు తొడుక్కుంటారు. ముఖం శుభ్రంగా గీక్కుంటారు. చడీచప్పుడూ లేకుండా పెళ్ళివిడిదిలోకి వచ్చేస్తారు. పెళ్లివాళ్లతో కలిసిపోతారు. సర్కారెరువూ, చక్కెరా కలిసినట్టే! నోట్లో వేసుకుంటేగానీ రుచి తెలియదు..."

"అవునవును. మీరు చెప్పేశారుగా! ఇక మన జాగ్రత్తలో మనముందాంలెండి!"

"ఎందుకు చెబుతున్నానంటే జగన్నాథం, నిరుడిలాంటప్పుడు బెంగుళూరులో నా తోడల్లుడికూతురు పెళ్లి జరిగింది. మనోరంజనీ కళ్యాణమందిరం అని నువ్వూ వినేవుంటావు. జరిగితే ఏమైంది? పెళ్లికుమార్తె సూట్‌కేసు కనిపించలేదంతే! కొత్త చీరలు, నగలు అంతా కలిసి యిరవైవేల రూపాయల సరుకు! తెల్లారేసరికి క్లోస్..."

అసలీ హనుమంతప్ప ధూమకేతువులాంటివాడని జగన్నాథంగారికి తెలుసు! తోకచుక్క కనిపిస్తే దేశాని కరిష్టమట! తరతరాల విశ్వాసంకదా అని వూరుకోకుండా శాస్త్రజ్ఞులు దీన్ని మూఢ విశ్వాసంక్రింద జమకట్టారనుకోండి! కానీ ఎటొచ్చీ పులికంటే గిలే హెచ్చు! జరగబోయే ప్రమాదంకన్నా (బహుశా అది జరగకనే పోవచ్చు) హనుమంతప్ప చేసే ప్రమాదసూచనవల్లనే ఒళ్లు జలదరిస్తుంది.

హనుమంతప్పను తప్పించుకుని జగన్నాథంగారు మళ్లీ పెళ్లి జరుగుతున్న హాల్లోకి వచ్చేశారు.

పూలపల్లకీలా అలంకరించిన మండపంలో పురోహితుడు ముహూర్త ధారణప్పుడు కావలసిన వస్తు సామాగ్రిని ఓమూలగా పేర్చి పెట్టుకుంటున్నాడు.

పెళ్లి ఏర్పాట్లపైన తాము నియమించిన వలంటీర్లు కొందరు అప్పుడే తీసుకొచ్చి వేసిన కుర్చీలలోకి అతిథుల్ని సర్దుతున్నారు.

'గంట తొమ్మిది కావస్తోందండీ శాస్త్రిగారూ! టంచనుగా పదికొట్టేసరికల్లా సూత్రధారణ జరిగిపోవాలి'– ఒక పెళ్లి పెద్ద హెచ్చరిక చేస్తున్నాడు.

కానీ అతిథిసత్తముల కెవరికీ ఆ ఆదుర్దా వున్నట్టు లేదు. సూత్రధారణ జరిగేదీ జరగకపొయ్యేదీ, మంగళవాద్యాలు మ్రోగేదీ మ్రోగకపోయేదీ, పురోహితుడి మంత్రాలు వినిపించేదీ వినిపించకపోయేదీ, ఈ గొడవేదీ వాళ్లకు కాబట్టలేదు. వేళకు సరిగ్గా తమ అవసరాలు తీరిపోతుండే పక్షంలో వాళ్ళు ఎంత కాలమైనా యిక్కడుండి కులాసా కాలక్షేపంచేసి వెళ్లే ధోరణిలో వున్నారు. జగన్నాథంగారికి కాస్తా చిరాకు పుట్టుకొచ్చినమాట నిజం! కుర్చీలు చూపించినా వీళ్లు కూచోరు. అందుకిదే సందర్భమైనట్టు సినిమాలపైన, రాజకీయాలపైన ఏకధాటీగా ప్రసంగాలు కొనసాగిస్తారు. బహిరంగ సభలలోనైనా డిసిప్లిన్ మెయింటెయిన్ చెయ్యవచ్చునేమోగానీ, పెళ్లిళ్లలో అది సాధ్యమయ్యేటట్టులేదు...

అప్పుడొక చిన్న సంఘటన జగన్నాథంగారి కంటబడింది. ఎవడో ఒక అపరిచిత వ్యక్తి ఖాళీకుర్చీ ఒకటి వెదికిపట్టి, అందులో కూచోబోతుండగా ఎవరో దాన్ని వెనక్కు లాగేశారు. జాగరూకుడుగా వుండబట్టి సరిపోయిందిగాని లేకుంటే అతడు దబేలున నేలపైన పడిపోయి వుండవలసిందే! నిలవరించుకుని అతడు తిరిగి చూసేసరికి ఒళ్లంతా

పాంటుగా, కోటుగావున్న ఒక పెద్ద మనిషి ఆ కుర్చీలో ఆసీనుడై వున్నాడు. సంఘటన చిన్నదే అయినా ఆ స్థాయిలో అక్కడొక చిన్న రగడ జరిగి వుండవలసింది. కానీ ఆ వ్యక్తి పెదవి కదలకుండా తనపాటుకు తాను దూరంగా వెళ్లిపోయి కిటికీ దగ్గర నిల్చుండిపోయాడు.

జగన్నాథంగారికి ఆ అపరిచితవ్యక్తిపట్ల యించుక సానుభూతి కలుగకపోలేదు. కానీ హనుమంతప్ప చేసివున్న హెచ్చరిక మూలంగా ఆ సానుభూతి కొద్ది క్షణాల్లో అనుమానంగా మారిపోయింది. తాను కూర్చునేదాకా వచ్చిన కుర్చీని దురాక్రమణ చేసిన వ్యక్తిపైన కించన్మాత్రంగానైనా కోపం రాలేదంటే యితడీ పెళ్లివేడుక పాలిటికి రాహువు లాంటివాడే అయివుండాలి. ఇందులో పాల్గొనడానికి ఏమాత్రం చొరవగలిగి వుండినా అతడు ఆత్మాభిమానాన్ని చంపుకుని దూరంగా వెళ్లిపోవడం జరగదు. ఐనా యిప్పటికి మించిపోయిందేమీ లేదు. గణితశాస్త్రంలో తెలియని రాసిన 'ఎక్స్' అనుకోవడం పరిపాటి. ఆ లెక్కన యితణ్ణి తాత్కాలికంగా ఎక్స్ అనుకోవచ్చు. పెళ్లి ముగిసేలోగా ఈ ఎక్స్ ఎవడయిందీ ఆరా తీయాలి...

తొమ్మిదిన్నరకు మంగళవాద్యాలు మ్రోగసాగాయి. రేపు పరీక్షలనగా బుద్ధిగా చదువుకోడానికి కూర్చునే కుర్రాళ్ళకు మల్లే బంధుమిత్రులందరూ హాల్లో తావుచేసుకుని కూచున్నారు. సకాలంలో సూత్రధారణగూడా జరిగిపోయింది. ఆ అవకాశంకోసమే వేచివున్నట్టుగా యువకులిద్దరు తటాలున లేచి నిల్చున్నారు. వాళ్ల చేతుల్లో రంగురంగుల కాగితాలున్నాయి. పంచరత్నాలు వ్రాసి తెచ్చిన యువకవి వోవైపున పెద్ద గొంతుకతో వాటిని చదువుతుండగా మరోవైపున ఈ యువకుడు కాగితాలను పంచిపెట్టసాగాడు. ఆ మాత్రం సంఘటనకే సభలో ఓ మూలనుంచీ పెద్దగా కలకలం ప్రారంభమైంది. ఊరుకోం దూరుకోండని చేతితోనే సంజ్ఞచేస్తే జగన్నాథంగారు సందడి చెలరేగుతున్న చోటికి దగ్గరగా వచ్చేశారు. అప్పుడొకచోట నేలపైన దండిగా మూగి వున్న పాదరక్షల నడుమ రెండోసారి మళ్ళీ ఎక్స్ ఆయనకు కానవచ్చాడు. కనిపించడంకన్నా అత డే స్థితిలో కనిపించాడన్నదే యిక్కడ ముఖ్యం. ఆశీర్వాద పద్యాల కాగితంకోసం అతడు చేతిని చాచాడు. యువకుడొక కాగితం ఆ చేతిలోపెట్టి, తీరా పెట్టిన తర్వాత తల పైకెత్తి ఆ ముఖంలోకి చూచాడు. పద్యాలు చదవగలిగిన పరిజ్ఞానం ఆ ముఖంలో కనిపించలేదేమో, అతడు వెంటనే ఆ కాగితాన్ని కాస్తా లాక్కోబోయాడు. అవతలివ్యక్తిగూడా వీలయినంత గట్టిగానే పట్టుకున్నాడేమో, యువకుడు వూడలాగుకోజూడడంలో అది సర్రున ఏటవాలుగా చిరిగిపోయింది. సగం ముక్క మాత్రమే చేతిలో మిగిలింది. ఆ ముక్కవైపు బిక్కుబిక్కుమంటూ చూస్తున్న ఎక్సే జగన్నాథంగారికి కనిపించింది!

'అయ్యోపాపం' అనుకున్నారు జగన్నాథంగారు. ఎంతగా దండగతిండికోసం వచ్చినవాడైనా అతడికిలాంటి పరాభవంమాత్రం జరగగూడదు!

ఆ తిండి తింటున్నప్పుడు అతడి వాలకాన్ని గమనించే అవకాశం సైతం జగన్నాథంగారికి లభించకపోలేదు. ఒక్కొక్కసారి నాలుగువందలమందికి చొప్పున మూడుసార్లు వడ్డించిన తర్వాత రద్దీ తగ్గింది. నాలుగోసారికి డైనింగుహాల్లో సగం కుర్చీలు

ఖాళీగా వుండిపోయాయి. 'నాకూ నాలుగు మెతుకులు వడ్డించండి' అంటూ ఓ కుర్చీలో శరీరం చేరవేసిన జగన్నాథంగారికి నేరుగా అటువైపునవున్న వరుసలో ఓ కుర్చీలో కూర్చుని ఏ పదార్థాన్నిగానీ ఆవురావురని తినేయకుండా చేతివ్రేళ్లతో అన్నాన్ని కెలుకుతూన్న ఎక్స్ కనిపించాడు.

ఒకటికి రెండు అనుమానాలు బిగ్గరగా పట్టేసుకున్నాయి జగన్నాథంగారిని! తిండి బొత్తిగా సయించడంలేదంటే యితడు రెండోసారిఅయినా మళ్లీ తిండికోసం సిద్ధపడి వచ్చివుండాలి. లేదా తిండికంటే మించిన గొప్ప ప్రయోజనం దేనికోసమో ఈ పెళ్లివిడిదిలో పొంచివున్నవాడైనా కావాలి...

నిజం నిజం! జాగ్రత్త చాలా అవసరం. నిజాన్ని నిలకడమీదనే గ్రహించాలి.

అతిథులకు వట్టినోటివిందు మాత్రమే కాకుండా కొంత కనులవిందు, వీనుల విందుగూడా కలిగేటట్లు జగన్నాథంగారు వివాహ కార్యక్రమాన్ని రూపొందించారు. ఆనాటి రాత్రి ఎనిమిదేళ్ల అమ్మాయి ఒకతె చేసిన భరతనాట్యాన్ని వీక్షించడంకోసం పురప్రముఖులు చాలామంది విచ్చేశారు. ఆ తరువాత ఒక చిన్న పాట కచ్చేరిగూడా ముగిసేసరికి గంట పది కావచ్చింది. మధ్యాహ్నం తిన్న ముహూర్త భోజనాలు అప్పుడే ఎలా అరిగిపోయాయో గానీ, అతిథులు మళ్లీ భోజనాలకు తయారు! నిర్వాహకుడికొక్కడికి తప్పితే మిగిలిన వాళ్ళకందరికీ పెళ్ళిళ్లు హాయిగా వుంటాయి కాబోలుననుకున్నారు జగన్నాథంగారు. అందరినీ భోజనాలకు వెళ్లమన్నారు. భోజనంచేసి వచ్చినవాళ్లను తాంబూలం వేసుకోమన్నారు. తాంబూల చర్వణం చేస్తున్నవాళ్లను వెళ్లి యిష్టమైన చోట పడుకోమన్నారు. ఆ వేళప్పుడు అన్నమేం దిగుతుందని కొద్దిగా ఉపాహారం మాత్రం తీసుకున్నారు.

గంట పన్నెండు!

గదిలోకి వెళ్లి పడుకోవడమొక్కటేగాని జగన్నాథంగారికి నిద్రపట్టనేలేదు. కానీ యిప్పుడాయనకు ఎంతో ఆనందంగా వున్నమాట వాస్తవం. భుజాలపైన్నుంచీ కొండంత బరువును క్రిందికి దించి వేసుకున్నట్టుంది. పెళ్లి అనేది వ్యక్తిగత విషయం. పెళ్లి జరగడంలో తప్పితే పెళ్లికొడుకును ఎన్నుకోడంలో తన బాధ్యతేమీ లేదు. నెలరోజులకు మునుపు సీతాపతి ఎవరో తనకు తెలియదు. ప్రసూన కతడితో రెండేళ్ల సుదీర్ఘ పరిచయం వుందట! ఒకరినొకరు అర్థం చేసుకున్న తర్వాత తీసుకున్న నిర్ణయమే! కుర్రాడు బాగున్నాడు. బాగా చదువుకున్నాడు. బస్. తనకంతే కావలసింది.

అలాగని తానీ విషయంలో యిల్లాలి అభిప్రాయాన్ని లెక్కకు తీసుకోకపోలేదు. నిజానికి ఈ సంబంధాన్ని ప్రతిపాదించింది ఆవిడే! బలపరచడం మాత్రమే తన వంతయిపోయింది. ఈడూజోడూ ఎంతో బాగుందట! అబ్బాయి, అమ్మాయి జంటగా ముందు నడచి వెళ్తున్నప్పుడు వెనకనుంచి చూడ్డానికి వెయ్యి కళ్లు కావలసి వస్తాయట! ఆడవాళ్ల దృష్టిలో అల్లుడనిపించుకోదగ్గ మానవుడికి యింతకుమించిన అర్హత అక్కర్లేదేమో!

ఒక ఆడబిడ్డకు వివాహ సంబంధం కుదర్చాలంటే మునుపు ఏడుజతల జోళ్లరిగిపోయేవట!

కాలేజీ లెక్కువై అబ్బాయిలు అమ్మాయిలు పరస్పరం ప్రేమించుకోడమంటూ ఒకటి ప్రారంభమైన తర్వాత యిప్పుడా బెడద చాలావరకు తగ్గిపోయినట్టే వుంది...

జగన్నాథంగారి పెదవులపైన లీలగా ఒక లేవగపు మెరిసింది.

గంట నాలుగు కొట్టేటప్పటికి జగన్నాథంగారికో విషయం జ్ఞప్తికి వచ్చింది. సింహద్వారం దగ్గర బోలుగాణ్ణి కాపుండమని చెప్పినట్టే గుర్తు. ఉన్నాడో లేదో? ఒకవేళ పనిచేసిన అలతలో ఒళ్లుమరిచి నిద్రపోతుంటే వుండిమాత్రం ఏం లాభం?

ఈ వూహ బుర్రలో మెదలగానే జగన్నాథంగారు లేచి చక్కా హాల్లోకి వచ్చేశారు. హాలుకు చుట్టూరావున్న గదుల్లో దేనిలోనూ దీపాలు వెలగడం లేదు. అందరూ నిద్రపోతున్నారన్నమాట! హాల్లో గూడా ఒక్కటే దీపం వెలుగుతోంది. నేలపైన పరిచిన బ్లాంకెట్లపైన పనిమనుషులు కొందరు అడ్డదిడ్డంగా పడుకుని నిండుగా ముసుగు పెట్టుకుని నిద్రపోతున్నారు.

పూలు వాడిపోయినా వాటి సువాసనలింకా గుమ్ముగుమ్ముగా గుబాళిస్తున్న ఆ హాల్లో కాసేపు కూచుందామనిపించింది జగన్నాథంగారికి!

గోడకానించి పెట్టివున్న కుర్చీని తీసుకొచ్చి ఆయన తనకు నచ్చినచోట వేసుకున్నారు.

కూర్చున్న కొద్దిసేపటి కాయనకు పెళ్లిమండపంవల్ల ఏర్పడివున్న నీడలో ఒక బెంచీ వేయబడివున్నట్టు తోచింది. దానిపైన ఒక మనిషి పడుకున్న పొలకువగూడా గోచరించింది.

కప్పుకున్న బట్ట చిన్నది. అందువల్ల ఒళ్లు ముడుచుకోక తప్పలేదు. మోచెయ్యే తలగడగా ఉపకరించింది. ఏ విధంగా చూసినా అది నిద్రపట్టడానికి అనువైన సుఖశయ్య కానేకాదు.

కామాక్షీ కళ్యాణ మహల్లో నలభై రెండు గదులున్నాయి. పరుపులు, తలగడలు ఎన్నున్నాయో లెక్కేలేదు. ఏ మాత్రం ప్రయత్నించి వుండినా ఈ మానవుడికొక పరుపు దొరికివుండేదే!

కానీ పెద్దలన్నట్టు దేనికైనా అడిగివచ్చి వుండాలిగదా!

ఇంతవరకూ తెలిసిందిగాదు. ఇక్కడ దోమల వీరవిహారంగూడా ఎక్కువగానే వున్నట్టుంది.

ఉండివుండీ ఒకదోమ అంటబొడవడంతో దురవస్థలాంటి అతడి నిద్రావస్థ మాటిమాటికీ చెదిరిపోతోంది.

అసలతడు నిద్రపోతున్నాడా అన్నదే సందేహం!

"ఏమండీ! నిద్రపట్టడంలేదా?" జగన్నాథంగారు అప్రయత్నంగానే ప్రశ్నించేశారు.

"పరవాలేదు. ఒక్క రాత్రేగదా! ఎలాగో గడిచిపోతుంది..." మొత్తానికి నిద్రమాత్రం రాదన్న నిర్ణయానికి వచ్చిన వాడిలా అతడు లేచి కూచున్నాడు. లేచి కూర్చోగానే జగన్నాథంగారు అతణ్ణి పోల్చుకున్నారు.

ఇప్పుడిక ఏదైనా మాట్లాడకపోతే బాగుండదు. మాట్లాడ్డానికి యింకొక సబ్జక్టు ఎన్నుకోడమెందుకని ఆయన ఏకంగా కూపీలాగడానికి ఉపక్రమించారు.

"ఏ వూరండీ మీది?"

ప్రాసిక్యూటరు ప్రశ్నకు జవాబు చెప్పడానికి బొత్తిగా యిష్టం లేకపోయినా, చెప్పక తప్పించుకోలేని ముద్దాయిలా అతడు ముక్తసరిగా "కొత్రపాడు" అన్నాడు.

"కొత్రపాడా! ఎప్పుడూ వినలేదే! ఏ జిల్లాలో వుంటుందండీ అది?"

అతడు జిల్లా పేరు చెప్పాడు. ఆంధ్రప్రదేశంలోని అన్ని జిల్లాలపేర్లూ జగన్నాథం గారికి తెలిసినవే! అందునా అతడిప్పుడు చెప్పినపేరు మరింత సుపరిచితం. పెళ్లికొడుకు సీతాపతి ఆ జిల్లావాడే!

ఐతే ఇతడు మగపెళ్లివారి తరపున మనిషై వుండాలి...

ఇప్పుడిక టాపిక్ మార్చవలసిన అగత్యం ఎదురైంది జగన్నాథంగారికి!

"మీకీయేడు వానలెంత మాత్రం?"

"వానలవల్ల ఒరిగేదేమీ లేనప్పుడు అవి పడడము, పడకపోవడము రెండు ఒకటే గదండీ?"

"అంటే? మీకు వ్యవసాయం లేదా ఏమిటి?"

"ఒకప్పుడుండేది..."

"ఇప్పుడు?"

"భూమిలో చాలాభాగం అమ్ముడైపోయింది. మిగిలింది తొండలు గుడ్లుపెట్టే మెట్టనేల. అది వున్నా లేనట్టే!"

"కావచ్చు. పల్లెటూళ్ళల్లో ఎందరో రైతులు ఎన్నో కారణాలవల్ల చితికిపోతుంటారు."

'రోడ్ అండర్ రిపేర్' అన్న బోర్డును చూచి మలుపు తిరిగిన కారులా జగన్నాథంగారి ప్రశ్న ఈసారి మళ్లీ విషయాంతరంలోకి వచ్చేసింది.

"బిడ్డలున్నారు గదండీ?"

"మొత్తం అయిదుగురు. ఇద్దరాడబిడ్డలకు పెళ్ళిళ్ళు చేశాను. మగబిడ్డల్లో యిప్పుడిద్దరు మాత్రమే వున్నారు..."

"అయ్యో పాపం!"

"అబ్బే, అలాంటిదేమీలేదు. ఒకడు లెక్కకు రాకుండా పోయాడని మాత్రమే చెప్పాలి..."

"భలే గమ్మత్తుగా మాట్లాడుతారండీ మీరు! బ్లాక్‌మనీలా కొన్నకొడుకు లెక్కకు రాకుండాపోవడమేమిటి?"

"అదంతేలెండి! వాడికొక్కడికి మాత్రమే చదువు పట్టుబడుతూ వచ్చింది. చనిపోతూ తల్లిగూడా వాడెందాకా చదువుకుంటాడో అందాకా చదివించమనే కోరింది. చదువుల సంగతి మీరెరుగుదురు. ఓ కుర్రాణ్ణి చదివించడమంటే ఏనుగుకు మేత అందించినట్టే! ఏడాదికొకక కయ్య అమ్మి వాడి చదువుపైన పెట్టవలసి వచ్చింది..."

"పోనీలెండి! కుర్రాడు చదువుకున్నాడుగదా ఏదైనా ఉద్యోగం దొరికితే వాడు మిమ్మల్ని సాకకపోడు..."

ఎక్స్ నవ్వాడు– "ఈ దేశంలో మహారాజులు బీదవాళ్లని సాకుతున్నారు. నౌకర్లని సాకుతున్నారు. కడకు బిచ్చగాళ్లనిగూడా సాకేస్తున్నారు. ఒక కొడుకు తండ్రిని సాకడంలో

విద్దూరం లేదు. కానీ తండ్రులందరికీ అలాంటి అదురుష్టం పడుతుందంటారా? నాకూ అరవయ్యేళ్లు వచ్చేశాయి. ఇప్పటిదాకా ఒకరి మోచేతి గంజికోసం కక్కుర్తి పడలేదు. మిగిలిన కొద్ది రోజులుగూడా యిలాగే గడిచిపోతాయి..."

"అయ్యో పాపం! మీ మనసుకేదో పెద్ద గాయమే తగిలినట్టుంది..."

అతడు పైకిలేచి బెంచీని జగన్నాథంగారికి దగ్గరగా జరుపుకున్నాడు. జేబులోనుంచీ బాగా నలిగిపోయిన కాగితం ఒకటితీసి ఆయనచేత పెట్టాడు.

"ఏమిటండీ యిది?"

"ఇది వాడి పెళ్లి పత్రిక, పెళ్లి అయిదురోజుల్లో వుందనంగా నాకందింది..."

"నా కెందుకు చూపిస్తున్నారో..."

"దాన్ని చదువుకునేటంతవరకూ చదువుకున్న వాణ్నిగాను. పైగా యింగ్లీషులో వుందాయె! ఎన్నిసార్లో తీసి చూసుకున్నాను. ఎందరికో చూపించాను. ఎందరికి చూపించినా ఎన్నిసార్లు చదివించుకున్నా ఈ పెళ్లికొడుకు నా కొడుకే ననుకోడానికి యిందులో ఎక్కడా దాఖలా లేదు..."

తెల్లబోతూ జగన్నాథంగారు ఆ ముసలివాడి ముఖంలోకి చూచారు. ఇదేమిటో అంతులేల్చుకోవలసిన వ్యవహారంలాగే తోచిందాయనకు. "ఉండండుండండి. కళ్లజోడు పెట్టుకుని దీనివైనమేమిటో తెలుసుకుంటాను..." అన్నారు.

ఇంతలో నటేశయ్యరు దగ్గరినుంచీ పిలుపొచ్చింది. ఫస్ట్‌రౌండు కాఫీ సిద్ధమై పోయిందట! మొదటికప్పు జగన్నాథంగారికేనంటే ఆయనకోసం ఎవరో పరుగెత్తుకొచ్చారు.

ముఖం కడుక్కుని కాఫీ సేవించాక ఆయనకు గుప్పిట్లో ఓ కాగితం నలిగిపోతున్న విషయం జ్ఞప్తికి వచ్చింది.

కళ్లజోడును అక్కడికే తెప్పించుకుని పొట్లంలా మడిగిపోయివున్న కాగితాన్ని విప్పి ఆయన కంటికెదురుగా పట్టుకున్నారు.

వరుడిపేరు కంటబడేసరికి త్రుళ్ళిపడ్డారు జగన్నాథంగారు. కన్యాదాతపేరు కనిపించేసరికి బుర్రగిర్రున తిరగసాగింది. వధువుపేరు దగ్గరికొచ్చేసరికి సందేహానికి తావులేకుండా విషయం రూఢిగా తెలిసిపోయింది.

సదరు ఆహ్వానపత్రికను స్థూలంగా యిలా తెనుగులోకి అనువదించవచ్చు...

'ఫలానా తేదీన ఫలానాచోట జగన్నాథంగారి అమ్మాయి ప్రసూనతో జరుగనున్న నా వివాహానికి విచ్చేయ గోరుతున్నాను. ఇట్లు సీతాపతి, ఎం.ఎస్సీ.'

ఒక వూరికి వెళ్లదలచుకుంటే దాని ఉనికి ఎక్కడో తెలుసుకోడం ముఖ్యం. ఉత్తరం సజావుగా చేరాలంటే చిరునామా సరిగ్గా వ్రాయడం ముఖ్యం. ఉనికి తెలియని వూళ్లకు మల్లే, చిరునామా లేని జాబులకు మల్లే కొందరు మనుషులుగూడా ఆకాశంనుంచి ఊడిపడడం సంభవమా?

అయోనిజుడైన పక్షంలో తప్పితే వరుడిలా వ్యవహరించడంలో అర్థం లేదు.

దిగాలుపడిపోయి జగన్నాథంగారు చాలాసేపటివరకూ అక్కడే కూర్చుండిపోయారు.

ఆయన మళ్లీ లేచి హాల్లోకి వచ్చేసరికి బెంచీ ఖాళీగా వుంది.

చేవమాని మొద్దుల్లాంటి యిద్దరు మనుషులెవరో ఆపాటికేవచ్చి పెళ్లి మంటపానికి వ్రేలాడుతున్న పూలదండల నన్నింటినీ తెంపి గంపల్లోకి ప్రోగుచేస్తున్నారు.

"పెళ్లయ్యీ కాకమునుపే ఏమిటిది?' జగన్నాథంగారు కోపాతిరేకంతో గద్దించారు–

జగన్నాథంగారి కోపాన్ని లెక్కపెట్టకుండా వాళ్లు తమ పనేదో తాము సాఫీగా చేసుకపోసాగారు. లేదంటే ఆ యిద్దరిలో ఒక్కడుమాత్రం సహేతుకంగా సమాధానంచెప్పి ఆయన కోపాన్ని చల్లార్చడానికొక ప్రయత్నం మాత్రం చేశాడు–

"మరో పెళ్లివారు రాబోతున్నారండీ బాబుగారు! ఆలోగా ఈ పని జరిగిపోవాలి..."

రెండోవాడందుకున్నాడు. "వీటికిక్కడ కాంట్రాక్టుదారులం మేమేనయ్యా! పూల ఎరువు బలే సత్తువలెండి! ఏ పైరుకు వేసినా పంట యిబ్బడి ముబ్బడే!"

❖ భారతి – ఫిబ్రవరి 1971. ❖

# బంగారుపొయ్యి

ఉద్యోగిని తరచుగా ఎదుర్కొనే సమస్య పెండింగ్ ఫైలు. ఏ ముహూర్తానో ఏ కాగితం చేతికందుతుంది. దానిపైన సముచితమైన చర్య తీసుకోవలసిందని ఆఫీసరు హెచ్చరిస్తారు. ఆ సముచితమైన చర్య ఏమిటో ఉద్యోగికి బోధపడదు. ఒకవేళ బోధపడిందనుకోండి! ఆ చర్యను అమల్లో పెట్టడానికి వీల్లేని పరిస్థితులు దాపురిస్తాయి. కొన్ని కొన్ని సందర్భాల్లో ఒక్కొక్క ఫైలు నెలల తరబడి సంవత్సరాల తరబడీ గూడా పెండింగులో వుండిపోతుంది.

అడ్వొకేటు సత్యారావు కథ నా పాలిటికలా ఒక పెండింగు ఫైలుగా వుండిపోయింది. మధ్యమధ్యలో ఎన్నో రిమైండర్లు. వచ్చిన చిక్కేమిటంటే దీన్ని క్లోజ్ చెయ్యడానికి నా ఊహాగానాలేవీ పనికిరావు. పనిగట్టుకుని కొంత శ్రమకు లోనుగావాలి. మొదట సత్యారావు స్టేట్‌మెంటులోని నిజానిజాలను పరిశీలించాలి. పరిశీలించాలంటే అతడితో నాకు కాస్తా సాన్నిహిత్యం వుండడం అవసరం. నాకూ, సత్యారావుకూ మధ్య లేని సంబంధం అదే! సత్యారావు నాకు పరిచితుడుగాడు. కనీసం మా వూరివాడైనా కాడు. అరవై మైళ్ళు బస్సులో ప్రయాణం చేసిన తర్వాత మాత్రమే నేనతణ్ణి దర్శించగలగడం సాధ్యమౌతుంది.

ఇంతకూ సత్యారావన్న మాటేమిటో తమకు మనవి చెయ్యాలి. దాదాపు వెయ్యి మంది శ్రోతల్ని ఉద్దేశించి ప్రసంగిస్తూ సత్యారావు ఆ మాటన్నాడు. నాటికీ నేటికీ నా మట్టుకు నేను మాత్రం అదెంతో సాహసంతో కూడుకున్నమాటగానే భావిస్తున్నాను. అడ్వొకేటుగదా! వృత్తిధర్మానికి అనుగుణ్యమైన వాక్చాతుర్యంతో అతడు వీలయినంత సహజంగా, అవసరమైనంత వినయ పూర్వకంగా తన స్టేట్‌మెంటును బయట పెట్టాడనిగూడా ఒప్పుకుంటాను.

అయ్యలారా! అన్యథా భావించకపోతే నేనొకమాట చెప్పాలి. దయచేసి అతిశయోక్తి అనుకోకండి! ఆత్మస్తుతిగా భావించకండి. మాది అన్యోన్య దాంపత్యమనీ, మేము ఆదర్శ దంపతులమనీ మమ్మల్ని తెలిసినవాళ్ళందరూ అనుకుంటారు. అదే నా విశ్వాసంగూడా!" అన్నాడు సత్యారావు.

నిజం చెప్పొద్దూ! 'ఓరి పిట్టపిడుగా!' అనుకున్నాను.

ఎందుకంటారా! నాకు అన్యోన్య దాంపత్యంపైన ఏమంత నమ్మకంలేదు. ఇంటింటికీ ఒక జంటను చూస్తున్నాం. దేవుడు దయదలిస్తే ఒకే యింట్లో రెండుమూడు జంటలుగూడా! మచ్చుకు మనకు బాగా ఎరుకలోవున్న పదిపన్నెండు కాపురాల్ని పరిశీలించినా సరే. అన్యోన్య దాంపత్యమనేది వట్టి నేతి బీరకాయ చందమని తేలిపోతుంది. భార్యాభర్తల్లో ఒకరు తోడేలయితే, యింకొకరు మేకపిల్లలావుండే ఉదంతాలనేకం! కొన్నిచోట్ల ఆలుమగల్లో ఒకరు నిప్పయితే యింకొకరు ఉప్పు. పైకి చూడ్డానికి కొన్ని కాపురాల్లో సామరస్యం నెలకొని వున్నట్టే తోస్తుంది. కానీ లోపల్లోపల ఎన్నో లొసుగులుంటాయి. పుక్కిటి కథలో రేచుక్క పగటిచుక్కలకు మల్లే కొందరు భార్యాభర్తలకు బ్రతుకంతా ఎత్తుకు పైఎత్తు వేయడంతోనే సరిపోతుంది. పతినే దైవంగా భావించే పతివ్రతల చిత్తశుద్ధిపట్ల

నాకు నమ్మకం చాలా తక్కువ. ఎంతటి తప్పుచేసినా మన్నించగలిగినవాడే దేవుడు. మామూలు మనిషికి అంతటి ఔదార్యము, ఔన్నత్యము వుంటాయనుకోడం భ్రమ. మగవాణ్ణి అలా ఉబ్బించడానికి వెనుక భార్యకు స్వప్రయోజనాలను నెరవేర్చుకునే ఆకాంక్ష వుంటుందని నా అనుమానం. పోతే భర్త తిట్టినా, కొట్టినా మారు మాటాడకుండా వూరుకునే ఆడవాళ్ళని ఎందుకు గౌరవించాలో నాకు బోధపడదు. జీవచ్ఛవాలకు వాళ్ళకూ తేడా ఏమిటో తెలుసుకోవాలనిపిస్తుంది. ఇందులో మనవాళ్ళు నెల తక్కువగా పుట్టిందేమీ లేదు. వాళ్ళల్లో పతివ్రతలున్నట్టే, వీళ్ళల్లోనూ భార్యా విధేయులుంటారు. ఇంకొక మెట్టు పైకి వెళ్ళి భార్యల్ని ఆరాధించే వాళ్ళ మాటేమిటంటారు? తన భార్యను తానొక దేవతగా చూచుకుంటాననే వ్యక్తిని నేను స్వయంగా ఎరుగుదును. మొదటితరగతి ఆడఖైదీకి మగ కాపలాదారుకన్నా అతడి వ్యవహారం ఏమంత మెరుగ్గా లేదు.

ఇలా అన్ని యిళ్ళల్లోనూ మట్టిపొయ్యే వున్నట్టు ఋజువవుతుంటే తన యింట్లో బంగారుపొయ్యి వుందన్నాడు సత్యారావు!

అసలీ బంగారుపొయ్యి ప్రస్తావన ఏ సందర్భంలో వచ్చిందో చెప్పాలి. రెండేళ్ళ క్రిందటి సంగతి. ఏదోపనిమీద జిల్లా ముఖ్య పట్టణానికి వెళ్ళాను. వెళ్ళినపని మరునాటికి వాయిదా పడింది. వెళ్ళినరోజు సాయంకాలం ఏం చేయడానికి పాలుపోక షికారుగా రాజవీధిగుండా నడచిపోతున్నాను. ఒకచోట కిటకిటలాడిపోతున్న జనసమూహం నాకు అడ్డొచ్చింది. ఐతే వాళ్ళు నాకెదురుగా రావడంలేదు. రోడ్డు కడ్డంగా ఎక్కడికక్కడే ఒక తటాకంలా నిలబడిపోయి వున్నారు. జనాన్ని చూచేసరికి కాలక్షేపానికి అనువుగా అక్కడేదైనా విశేషం జరుగుతూ వుండొచ్చుననే అనుకున్నాను. దగ్గరికి వెళ్ళాక తెలిసింది. పురమందిరంలో జరుగుతున్నది సన్మానసభ. హాలు నిండిపోయి, వసారా నిండిపోయి, సోపాన పంక్తుల దగ్గరినుంచీ రోడ్డు అంచులదాకా శ్రోతలు విస్తరించి వున్నారు. సన్మానసభకు యింతమంది రావడం అపూర్వమే! ఒక్కటే ఎక్సెప్షన్- సినిమాతారలకు జరిగే సన్మానం. సినీతారల తర్వాత అంతటి గ్లామర్ మంత్రుల కుండడం చూస్తున్నాం. ఇక్కడ సన్మానితుడు మంత్రికాడు సరిగదా, మంత్రులచుట్టూ తిరిగేవాడైనా కాడు. సినీనటుడు కాకపోతే మానే, సినిమా రచయితైనా కాదు. ప్రఖ్యాత ప్రజాకవి దయానిధిగారికి సన్మానమని నల్లబల్లపైన ప్రకటన కనిపించేసరికి తెల్లబోయాను.

దయానిధిగారితో నాకు వ్యక్తిగత పరిచయం లేకపోయినా ఆయన వ్యక్తిత్వం గురించి కొన్ని వివరాలు తెలుసు. ఏవో నాలుగైదు రకాల ఉద్యోగాలుచేసి, పై అధికారులతో అభిప్రాయభేదం రావడంవల్ల ఆయన అన్నింటికీ ఉద్వాసన చెప్పేశాడు. ఎన్నికల ప్రచారానికి పనికొచ్చే రచనలు చేయడానికి నిరాకరించి పెద్దలతో విరోధం కొని తెచ్చుకున్నాడు. దేశంలో పత్రికలంటూ కొన్ని వున్నాయి గనుక ఆయన రచనలు వెలుగులోకి వచ్చే అవకాశం కలిగింది. 'ఇదిగో తీసుకోవయ్యా! ఈ పదికాసులు నీ ఖర్చుకు వాడుకో!' అని చెప్పలేని శ్రీరామచంద్రుణ్ణి నమ్ముకున్న పోతన్నగారి తర్వాత అంతటి పిచ్చివాడెవడంటే దయానిధిగారేనని చెప్పాలి. అన్నట్టు ఈయన చేస్తున్నదిగూడా వ్యవసాయమే! రెండెకరాల మడిపైన వచ్చే గింజలు తిండికి సరిపోయేటట్టున్నాయి. ఆ పొలం మధ్యనే చిన్న డాబా

ఒకటి వేసుకున్నాడట! అందులో సగం మేరకు లైబ్రరీయేనట! ఆ లైబ్రరీయే ఈయన సామ్రాజ్యం. సామ్రాజ్యాధీశుడికోసం సామంత ప్రభువులు రావడం పరిపాటి. ఈ సారస్వత సామ్రాజ్యాధిపత్యంకోసం పాఠక మహాశయుల్లో ఒకరు గాకపోతే ఒకరు మునగాలపాడుకు వెళ్తుంటారట! వెళ్ళినవారికల్లా గోంగూర పచ్చడితో, ఆవకాయతో, గేదె పెరుగుతో కమ్మటి భోజనం. ఆపైన సాహిత్య సమారాధనం. కమ్మటి భోజనం సుఖమా? దయానిధిగారి సన్నిధిలో సాహిత్యోపాసన సుఖమా? ఏమో, త్యాగయ్యగారిలాంటి పాఠకుణ్ణి అడగాలి.

జనంలో చొచ్చుకుంటూ పురమందిరం ఎదుటకు వెళ్ళి నిల్చునేసరికి మైకులో నుంచీ ఎవరిదో ప్రసంగం వినిపిస్తోంది. –'దయానిధిగారిని గురించి ఎందరో పెద్దలు యిదివరకే ప్రసంగించి వున్నారు. మనం విన్నాం. కొత్తగా చెప్పడానికి నాకు మిగిలిందేమీ లేదు. దయానిధిగారి కవిత్వమన్న సూర్యుణ్ణి చూపించడానికి నేను దివ్వటీ తెచ్చుకోలేదు. కానీ ఆయనపట్ల నాదొక బాధ్యత వుంది. అదేమిటంటే, కృతజ్ఞత చెల్లించడం! మేలు చేసిన వాళ్ళకు కృతజ్ఞత చెప్పడం సాంప్రదాయం. ఈ విషయంలో నేను చాలా ఆలస్యం చేశాను. అయినా సరైన సమయంలో, సరైన సందర్భంలో ఈమాట చెప్పుకోగలుగు తున్నందుకు నాకు చాలా సంతోషంగా వుంది. వృత్తిరీత్యా నేను అడ్వొకేటుని! కానీ లాయరని అనిపించుకోడంకన్నా కవిననిపించుకోవాలన్న కోరిక నాలో ప్రబలంగా వుండేది. అప్పట్లో దయానిధిగారు నన్నెంతో ప్రోత్సహించారు. వారికి చదివి వినిపించి, వారి సూచన మేరకు సవరింపబడిన తర్వాత నా కవిత శంఖంలోపోసిన తీర్థంలా ఆస్వాదనీయంగా వుంటూ వచ్చింది. కానీ నేనాయనకు కృతజ్ఞత చెప్పదలచుకున్నది యిందుకుగాదు. ఆయన నాకు చేసిన మహోపకారం యింకొకటుంది. అదేమిటంటే...'

మాట్లాడుతున్న వ్యక్తి ఏ కారణంవల్లనో కొద్ది క్షణాలు విరామం యిచ్చాడు.

ఆ విరామంలో వక్తని గురించి వాకబు చేశాను. పేరు సత్యారావని, వూరు పలమనేరనీ తెలియవచ్చింది.

'ఏమిటంటే...' – సత్యారావు ప్రసంగం కొనసాగిస్తున్నాడు – 'పెళ్ళిళ్లు స్వర్గంలో చేయబడతాయంటూ ఒక సామెత వుంది. అదెంతవరకూ నిజమో నాకు తెలియదు. నా పెళ్ళి మాత్రం తిరుచానూరు సత్రంలో జరిగింది. పెళ్ళయ్యాక యింటికి తిరిగి వచ్చాము. పోస్ట్‌మెన్ ఓ కవరు తీసుకొచ్చి యిచ్చాడు. దయానిధిగారి దస్తూరీ నాకు బాగా గుర్తే. కవరువిప్పి చూద్దునుగదా, అందులో ఓ కవరింగు లెటరుతో బాటుగా యింకొక చిన్నకవరు కనిపించింది. గబగబా ఉత్తరం చదువుకున్నాను. 'ప్రియమైన సత్యారావూ! నీ పెళ్ళికి నేను రాలేకపోయాను. అన్యథా భావించవద్దు. నా శుభాకాంక్షలు మీ కెప్పుడూ వుంటాయి. ఈ శుభసమయంలో మీకెన్ని అమూల్యమైన కానుకలైనా యివ్వాలనే వుంది. ఉండి ఏం లాభం? ఇందులోని చిన్న కవరును నువ్విప్పుడే విప్పవద్దు. తొలినాటి రేయి మీ భార్యాభర్తలిద్దరూ దీన్ని విప్పి చదువుకోవలసింది. నేను మీకివ్వగలిగిందల్లా ఒక చిన్న సలహా...' అంటూ చిట్టచివర సంతకంతో ఉత్తరం పూర్తయింది. మేష్టరుగారి మాట శిరోధార్యం. ఆయన చెప్పినట్టే తొలినాటిరేయి ఆ కవరు విప్పి చదువుకున్నాం. అందులోని సలహామేరకు నడచుకోవాలని ప్రతిజ్ఞ తీసుకున్నాం. అయ్యలారా! అన్యథా భావించకపోతే

నేనొక మాట చెప్పాలి. దయచేసి అతిశయోక్తి అనుకోకండి. ఆత్మస్తుతిగా భావించకండి. మాది అన్యోన్యదాంపత్యమనీ, మేము ఆదర్శదంపతులమనీ మమ్మల్ని తెలిసినవాళ్ళందరూ అనుకుంటారు. అదే నా విశ్వాసంగూడా!'

సన్మానసభ యింకా జరుగుతుండగానే నేను ముందుకు సాగిపోయాను. నిజానికి సత్యారావు మాటలు అప్పటికప్పుడు నాపైన చూపిన ప్రభావం తక్కువే! కానీ మననం చేసినకొద్దీ మహిమ హెచ్చిన మంత్రంలా కాలక్రమాన అదొక తీరని జిజ్ఞాసగా పరిణమించింది. దయానిధిగారు సత్యారావుగారికిచ్చిన సలహా ఏమైవుంటుంది? ఆనందప్రదమైన సాంసారిక జీవనానికి నికరమైన దారిచూపే పక్షంలో దాన్ని గుప్తంగా వుంచుకోడం అన్యాయం. గోపురంపైన కూర్చుని రామానుజుడు వేదార్థాలు వల్లించినట్లుగా ఈ రహస్యాన్ని బాకాలుపెట్టి దశదిశలకూ ప్రచారం చేయవలసిన అవసరం ఎంతయినా వుంది. అవకాశం దొరికితే ఈ సత్కార్య నిర్వహణను నేనొక మహద్భాగ్యంగా భావిస్తాను.

కానీ ఆ రహస్యాన్ని తెలుసుకోడం ఎలా?

ఆ ప్రశ్న సమాధానం స్ఫురించకుండానే రెండేళ్ళు దొర్లిపోయాయి. మొన్నటికీ మొన్న వేరే పనిమీద పలమనేరు వెళ్ళవలసి వచ్చింది. పనిలో పనిగా సంసారాల్లో శాంతినీ, కాంతినీ వెలయింపచేసే ఆ గోసాయి చిట్కానుగూడా తెలుసుకురావాలన్న దృఢ నిర్ణయంతోనే బయలుదేరాను.

నేనా వూరికి వెళ్ళినరోజు శనివారం. మరునాటి ఉదయం సత్యారావు ఇంటిని వెదుక్కుంటూ బయల్దేరాను. అది తాలూకా కేంద్రం. అక్కడున్న పన్నెండు మంది లాయర్లలోనూ సత్యారావు కాస్త లెక్కకొచ్చిన వాడిలాగానే కనిపించాడు. ఎంత చిన్న పసిపిల్లవాడైనా సత్యారావు యింటికి సరైన రెక్కమానుగానే వ్యవహరించాడు. కాంపౌండువాల్ దాటుకోగానే చిన్న పూలతోట. పూలతోట మధ్యగా సిమెంటుబాట. ఆ బాట వసారా దగ్గర ఆగిపోతుంది. వసారా గుమ్మం హాల్లోకి తెరుచుకుంటుంది. హాల్లోనుంచీ వంటగదిలోకి, బాత్‌రూములోకి, పెరట్లోకి గుమ్మాలున్నాయి. పొందికగా, ముచ్చటైన యిల్లే కట్టుకున్నాడు సత్యారావు. వసారాలో నిలబడి మనిషి పొలకువను సూచించడంకోసం గొంతు సవరించుకోగానే 'ఎవరూ, ఎవరూ' అంటూ ఓ మనిషి బయటికి వచ్చాడు. 'అడ్వొకేటుగారున్నారా?' అన్నాను. వెయిటింగురూము తలుపుతెరుస్తూ అతడు 'వస్తారు కూచోండి' అన్నాడు.

అసలింతకూ సత్యారావును సంధించడానికి సిద్ధపడిన తర్వాత అందుకొక కారణం తయారుచేసుకోవాలిగదా! దారిపొడుగునా అదే ఆలోచనలో వున్నాను. ఆ కారణం నా ప్రయోజనం నెరవేరడానికి ఉపకరించడం ముఖ్యం. కథకుణ్ణి గాకుంటే, క్లయింటుగానే నేను సత్యారావును కదపగలనేమో! అందుకని నేనొక కట్టుకథను అల్లి పెట్టుకున్నాను. మా ఆవిడకు, నాకూ బొత్తిగా పొసగడంలేదు. నేను ఎడ్డెమంటే తాను తెడ్డెమంటుంది. నా రాబడికి మించిన దుబారా ఖర్చులు తెచ్చి పెడుతుంది. కాదు, కూడదని హద్దుల్లో పెట్టదలచుకుంటే, పుట్టింటికి వెళ్ళి నెలల తరబడి తిష్ట వేస్తుంది. ఈ జబ్బును నయం చేసేమందు ఏ షాపులో దొరుకుతుంది? విడాకులొక్కటే శరణ్యమనిపించడంతో నాకు న్యాయశాస్త్రంతో పని తగిలింది. కీలెరిగి వాతపెట్టేవాడెగదా

నాకిప్పుడు వకీలుగారి సలహా...

పత్రికలు తిరగవేస్తూ వెయిటింగు రూములో కూచున్నాను. ఆ గది తలుపులు కూడా హాల్లోకి తెరచుకుని వుండడంవల్ల గృహాంతర్భాగంలో కూచున్నట్టే వుంది. ఇందాక నన్ను పలకరించిన వ్యక్తి బాత్‌రూములో పిల్లలకు స్నానం చేయిస్తున్నాడు. వంటింట్లో పొయ్యిమీదవున్న పెనం దోసెల తయారీలో నిర్విరామంగా పనిచేస్తూ వుంది.

'ఎంతగా పిల్లలకు నీళ్లు పోస్తే మటుకు చెంబులు, తప్పేలాలు అలా గొంత చించుకోవాలా?' ఆ గొంతు యజమానురాలిది.

'ఏదీ, నువ్వు చుంయ్, చుంయ్ మనకుండా దోసెలు కాల్చు చూద్దాం!'

'హవ్వ, హవ్వ' అంటూ నోరు నొక్కుకోవాల్సిన పరిస్థితి! ఇంటి నౌఖరు యిల్లాలితో మాట్లాడవలసిన తీరేనా యిది?

అంతఃపుర విద్రోహానికి బాగా అలవాటుపడినట్టున్న నౌఖరు మహాశయుడు స్నానాలు పూర్తయ్యాక బిడ్డలకు బట్టలు తొడిగాడు. 'వీళ్లకు టిఫిన్లు పెట్టొచ్చు' అంటూ వాళ్లని వంటగదిలోకి సాగనంపాడు. మళ్లీ బాత్‌రూములోకి వెళ్లి 'బాయిలర్ మరిగిపోతోంది, ఏకంగా యిద్దరికీ సరిపోవచ్చు' అన్నాడు.

'ఇంకా నయం! ఇద్దరమూ కలిసే స్నానం చేద్దామన్నావుకాదు...'

ఇంక నాకక్కడ కూర్చోవాలనిపించలేదు. అలనాటి సమావేశంలో సత్యారావు స్టేట్‌మెంటుకు, యిక్కడ యింట్లో సాగుతున్న తతంగానికి పొటావేసి చూసుకుంటే నాకు నవ్వొచ్చింది. ఇంటి యిల్లాలు నౌఖరుతో సరాగాలు పోతున్న విధానాన్నిబట్టి చూస్తే గృహస్వామి యిప్పుడిప్పుడే తిరిగివచ్చే జాడలు కానరావడంలేదు. అవతల వూళ్లో నాకింకా కొంతపని మిగిలివుండిపోయింది. సత్యారావును కలుసుకోవలసిన అవసరం వున్నదీ, లేనిదీ తేలిగ్గా నిర్ణయించుకోవాలి. ఆనాటి మధ్యాహ్నం భోజనమైన తర్వాత హోటల్ గదిలో పడుకుని వుండగా నా ఆలోచన మళ్లీ పెండింగు ఫైలు మీదికి వెళ్ళింది. కొత్తగా తెలిసిన వర్తమానంతో సత్యారావు కథను పూర్తి చేయడానికున్న అవకాశాలను గురించి నాలో విచికిత్స బయల్దేరింది. దయానిధిగారి లోకజ్ఞతను అవహేళన చేసినట్టవుతుంది గనుక అప్పుడీ కథతో ఆయన సత్యారావు దంపతులకిచ్చిన సలహాను చొప్పించడం అనవసరేమేమో! ఈ సత్యారావు అనే వ్యక్తి అమాయికుడైనా కావాలి. లేదా భార్య ప్రవర్తనను కప్పిపెట్టదలచుకునే గడుసువాడైనా కావాలి. ఈ రెండింటిలో ఏ వూహ నిజమనేది ఒకసారి సత్యారావుతో మాట్లాడితేగాని బోధపడదు.

ఏది ఏమైనా సాయంకాలం ఆరు గంటల బస్సులో నేను తిరుగుప్రయాణం చెయ్యవలసి వుండడం తప్పనిసరి! ఆలోగా సత్యారావుతో ఒకసారి మాట్లాడగలిగితే, పెండింగు ఫైలును ఏదో ఒక విధంగా క్లోస్ చేసే చొరవ నాకు లభించవచ్చు.

అందుకని మళ్లీ ఒకసారి సత్యారావుతో భేటీ కావడంకోసం ప్రయత్నించాను. ఈసారి సత్యారావు యింటికి వెళ్లేసరికి గంట మూడున్నర, ఆఫీసు రూంలో టైప్ రైటింగు యంత్రం టకటకలు వినిపిస్తున్నాయి. ఓ అడుగు లోపలికి వేశానో లేదో అత్యద్భుతంగా సింగారమైవున్న లేడీ టైపిస్టు ఎర్రటి మెడను ముందుకుసాచి 'ఎవరండీ?' అని ప్రశ్నించింది. 'అడ్వొకేటుగారున్నారా?' అని ప్రశ్నించాను. 'నిద్రపోతున్నారు. వచ్చేస్తారుగానీ కాసేపు వెయిటింగు రూములో కూచోండి' అంది టైపిస్టు.

ఉదయంలాగే సాయంకాలంగూడా పత్రికలే శరణ్యంగా పదిపదిహేను నిమిషాల వరకూ గదిలో కూచున్నాను.

వెయిటింగు రూముకులాగే, ఆఫీసుగదికిగూడా హాల్లోనుంచీ ప్రత్యేకద్వారం వుండివుండాలి. ఆ తలుపులు తెరచుకునే సవ్వడి వినిపించింది. పాదరక్షల చప్పుడుగూడా వినవచ్చింది.

'అప్పుడే అయిపోయిందా నిద్ర?' – లేడీ టైపిస్టు పరామర్శ.

'ఏదీ, నిద్రపోనిస్తే గదూ! నా చిన్నతనంలో మా అమ్మమ్మ ఒకావిడ యిలాగే తలంటుతుండేది! పాపం, శ్రమపడ్డావుగానీ, కాఫీ తీసుకో!'

హద్దిరభన్నా! అయ్యగారికి లేడీ టైపిస్టుతో పరాచికాలన్నమాట! హచ్చా! బాగుంది, బాగుంది, నా కథ రసకందాయంలో పడినట్టే తోచింది.

'ఎలావుంది కాఫీ?' ఈసారి పరామర్శించేవంతు అడ్వొకేటుగారిది.

'అయ్యగారి హస్తవాసిని గురించి కొత్తగా చెప్పేది ఏముంది? షరామామూలే! నా చిన్నప్పుడు మా నానమ్మ చేస్తుండిన పానకంలా వుంది.'

'ఆడపిల్లలు పుడతారట! అబద్ధమాడొద్దు...'

'సరాగాల మోతాదు తగ్గించాలి. అవతల వెయిటింగురూములో క్లైయింటున్నాడు.'

'హాలిడేలోగూడా క్లైయింట్లొస్తున్నారా? ఉదయం ఒకాయన లుంగీ కట్టుకుని, అర చొక్కా వేసుకుని నేను కనిపించేసరికి, నన్ను అసలు సిసలు పనిమనిషనుకున్నాడు. నువ్వు ప్లేట్లో టిఫిను పెట్టేశానని చెప్పావుగదూ, అప్పుడు నేను రోడ్డుపైకీ వెళ్ళి కాస్త ఆలస్యంగా వచ్చిందందుకే! ఎవరోగాని, ఎలా వచ్చాడో అలాగే మాయమైపోయాడు పాపం!'

చిట్టచివరి మాట వినవచ్చేసరికి నేను మళ్ళీ రోడ్డుపైనవున్నాను!

***

మీరే ఒట్టు పెట్టుకోమంటే ఆ ఒట్టు పెట్టుకుంటాను. దయానిధిగారు సత్యారావు కిచ్చిన సలహా ఏమిటో నాకీనాటికీ తెలియదు. కానీ దొరికిన క్లూలద్వారా నేనొక కంక్లూషన్‌కు రాగలిగాను. సత్యారావు తాను కోర్టులో లాయరుగా రాణించడం ఎంత ముఖ్యమనుకుంటున్నాడో తన యింట్లో తన పనులు తాను చేసుకుపోవడంగూడా అంతే ముఖ్యమనుకుంటున్నాడు. అతడి భార్య దోసెలు కాల్చడంలాగే, టైప్‌చెయ్యడంగూడా గృహకృత్యాల నిర్వహణలో ఒక భాగంగానే భావిస్తోంది. హెచ్చు తగ్గుల ప్రసక్తి లేదు. భరించేవాళ్ళులేరు. భరింపబడే వాళ్ళూలేరు. ఒక ఆడది, మగవాడు ఉత్తమ స్నేహితులుగా జీవితాంతం సహజీవనం చేయడానికి సిద్ధపడడమేనంటూ అన్యోన్య దాంపత్యానికొక కొత్త నిర్వచనం యిచ్చుకోవాలనిపిస్తుంది. బహుశా ఈ నిర్వచనానికి మూలభూతమైన సత్యమేదో దయానిధిగారిచ్చిన సలహాలో వుండి వుండొచ్చు.

❖ ఆంధ్రపత్రిక – జూన్, 1973 ❖

# అంతరాలు-ఆంతర్యాలు

ప్రశ్న : మంచులో స్నానమాడిన మల్లెపువ్వులా శుభ్రంగా వున్నారు. కట్టపైన కవటాకులా తాకితే కందిపోయేటంత సుకుమారంగా వున్నారు. షోకేసులో నాజూగ్గా నిలుచున్న రబ్బరు రమణిలా దర్శనీయంగా వున్నారు. ఎవరమ్మా మీరు?

జవాబు :ఎంత అమానుషం! నన్నే ఎరుగరా మీరు? నేనండీ, అనితా చంద్రరేఖని!

ప్ర : అనితా చంద్రరేఖ! ఎంత బాగుందండీ మీ పేరు!

జ : నాకు సంబంధించిన ప్రతి విషయమూ బాగుండాలన్నదే నా అభిప్రాయం!

ప్ర : బాగా సెలవిచ్చారు. ఇంతటి అందాలరాశిని భార్యగా పొందగలిగిన అదృష్టవంతు డెవరో తెలుసుకోవచ్చా?

జ : దానికేం భాగ్యం! మొగుడిపేరు చెబితే ముత్యాలు రాలిపోతాయని అనుకునే దాన్నేమీ కానులెండి! ట్రేడ్ సెంటర్ ఎరుగుదురా? దాని సోల్ ప్రొప్రయిటరు వీరాస్వామిగారే మా వారు. స్వయానా నా భర్తగారు.

ప్ర : అంత లావుపాటి ఆసామికి అర్ధాంగి అయిన వారెలా వుండాలో మీరలాగే వున్నారు.

జ : అర్థమైందిలెండి! నల్లగా, పొట్టిగా, లావుగా, పెద్దసైజు ఇనప్పెట్టెలా వుంటారనే గదండీ మీ ఎత్తిపొడుపు! ఉంటే ఉన్నారు. నాకొచ్చి చచ్చిన చిక్కదిగాదు. మనిషి ఎలా వున్నా, మనసులో కాస్తా మెత్తందనముంటే బ్రతికిపోదును. అంతా మోటు సరసం. తినుబండారం దొరకడమే ఆలస్యం, ఆవురావురని తినెయ్యడమే పని! మెల్లమెల్లగా కాస్తా కాస్తా చవిచూస్తూ ఆనందాన్ని నింపాదిగా అనుభవిద్దామని వుండదు. కక్కుర్తి బ్రతుకనుకోండి!

ప్ర : సారీ మేడమ్! మీ బాధ మా అంతరంగానికి విశదమైంది. మీరు కోరుకున్నంత సానుభూతి ఇచ్చుకోవాలని కూడా వుంది. మరైతే ప్రసంగాన్ని ప్రక్కదారులు పట్టకుండా ప్రస్తుతాంశానికి మాత్రమే పరిమితం చెయ్యాలని ఉద్దేశం...

జ : అడగండి దేన్ని గురించైనా సరే!

ప్ర : మీకు పెళ్ళయి ఎన్నేళ్ళయింది?

జ : ఇది తొమ్మిదో యేడు.

ప్ర : బిడ్డలు?

జ : నలుగురు. టూ ప్లస్ టూ!

ప్ర : ఆశ్చర్యం! మీరు నలుగురు బిడ్డల తల్లిగా కనిపించడంలేదే!

జ : నిజంగా! మరెలా కనిపిస్తున్నానండీ?

ప్ర : అప్పుడేనా, నిరుడిలాంటప్పుడేగదండీ పెళ్ళయిందీ; ఎందరో ఎక్కడ – ఇద్దరే బిడ్డలు; తొందరేమొచ్చింది, యింకా నాలుగేళ్ళు బిడ్డలు లేకపోయినా ఫరవాలేదు – ఈ జవాబుల్లో ఏదయినా మీ ప్రశ్నకు సరిపోయేటట్టే వున్నారు.

జ : అమ్మయ్య! ఈ మాట వినగలిగినందుకు నాకెంత రిలీఫ్‌గా వుందో చెప్పలేను. ఆఫ్టాల్ నలుగురు బిడ్డలేగదా అంటూంటారాయన! ఇంక నలుగురైనా తనకేమీ బరువని

పించదట. ఈ స్టేట్‌మెంటులో నిజం లేదని చెప్పలేను. కనడమేగానీ పాలిచ్చి పెంచే బాదర్బందీ మనదికాదు. ఆయాలు వాళ్ళ పాట్లేవో వాళ్ళు పడతారు. ప్రసవానికి ముందూ వెనుకా ఒకటి రెండు వారాలు మాత్రం ఇంటిపట్టునే వుండిపోవలసి వచ్చేది. ఐతే ఒకటి బాబూ! ఆ నెల రోజుల్లో నాకు యమయాతనంటే ఏమిటో తెలిసొచ్చేది...

ప్ర : కానుపు కష్టంగా వుండేదనుకుంటాను మీకు?

జ : మెల్లగా చెబుతున్నారా ఆ మాట? చచ్చి మళ్ళీ ఒక పుట్టకెత్తినట్టయ్యేది. ఈ కానుపనేది కాస్తా సుళువుగా జరిగే ఏర్పాటేదైనా వుంటే చూడండని డాక్టర్లతో మొరపెట్టుకునేదాన్ని. వాళ్ళు ఒళ్ళువంచి పనిచేయాలన్నారు. ఎంత సుతారంగావుంటే అంతగా కానుపు కష్టమౌతుందట!

ప్ర : పోనీ ఏదైనా పని చేయలేకపోయారా?

జ : మంచిమాటే అన్నారు. నేనీక్షణంలో చేయాలనుకున్న పనిని మా యింట్లో ఎవరో – అరగంట క్రితమే చేసిపెట్టివుంటారు. నువ్వు పనిచేసినంత పుణ్యం తల్లీ, మెట్లుదిగి కిందికి రావద్దు – అంటుంది అత్తగారు. గంటకొకసారి ఫోన్‌చేసి మావారు నేను టానిక్కులు పుచ్చుకుంటున్నదీ లేనిదీ, రెస్ట్ తీసుకుంటున్నదీ లేనిదీ తెలుసుకుంటూ వుంటారు. ప్రసవం దగ్గరికొస్తున్న కొద్దీ నాకు వాళ్ళపైన తెరలు తెరలుగా కోపం ముంచుకొస్తుండేది – నీ వాళ్ళెవరూ నా ప్రసవ బాధ పంచుకోరు గదా అని! ఇప్పుడైనా అందరి మాటా కాదని, నా అంతట నేను చొరవ తీసుకుని ఒక నిర్ణయానికి వచ్చాను గనుక సరిపోయింది. లేకుంటేనా? నలభై యాభై యేళ్ళొచ్చేదాకా ఒక బిడ్డలు కనే యంత్రంగా వుండిపోయేదాన్ని.

ప్ర : ఐతే నియంత్రణవైపు మొగ్గు జూపడానికి మీ ఆర్థిక పరిస్థితులుగానీ కుటుంబ స్థితిగతులుగానీ కారణం కాదంటారు. కేవలం వ్యక్తిగతమైన జాగ్రత్త మాత్రమే యిందుకు...

జ : చెప్పాను గదండీ! బాలింతగా వున్నప్పుడు అద్దంలో ముఖం చూసుకోలేకపోయేదాన్ని. బుగ్గలు లొత్తలుపడినట్టుండేవి. కళ్లు లోపలికి పోయేవి. పెదవులు పాలిపోయేవి. ముసలితనం వచ్చి ముంగిట్లో కూచున్నట్లుగా తోచేది, ఆ వూహలో ఒళ్ళు కంపరమెత్తిపోయేదనుకోండి!

ప్ర : మీ దృష్టిలో నియంత్రణ మనగా వయసు కడ్డంగా కట్టుకున్న సేతువు. అవునా మేడమ్?

జ : పర్‌ఫెక్ట్లీ. ఎంత సూటిగా చెప్పేశారండి!

ప్ర : ఇంకొక్కమాట మాత్రం అడగాలి. జనాభా పెరుగుదల ఎంతటి తీవ్రమైన విషయమో మీకు తెలుసు. దీన్ని అరికట్టడానికి ప్రభుత్వం ఎంతగా పూనిక వహిస్తున్నదీ తెలుసు. కానీ వూరికే ప్రచారం చేస్తే చాలదు. జనంలో దీనిపట్ల ఆసక్తి కలిగించడానికని ప్రత్యేకంగా కొన్ని సదుపాయాలుకూడా చేస్తున్నారు. ఆసుపత్రిలో గడిపిన వారం పది రోజుల్లో మీరీ సదుపాయాల తీరు తెన్నుల్ని గురించి కొంతవరకూ గమనించే వుండాలి...

జ : భలేవారే! అప్పటికీ సదుపాయాలకు ముఖం వాచి మేమే హాస్పిటల్‌కొచ్చినట్టు. అదేం లేదండోయ్! మేం దర్జాగా స్పెషల్ వార్డే ఎన్నుకున్నాం. రోజుకు రెండుసార్లొచ్చి మావారు డాక్టర్లతో మాట్లాడి వెళ్తుండేవారు. పథ్యానికి తగ్గట్టుగా ఇంటిదగ్గరనుంచి కారియర్‌లో భోజనమొస్తుంది. నేను తినగా మిగిలింది వాళ్ళకూ, వీళ్ళకూ ఇచ్చేసే దాన్ని. ఆసుపత్రివాళ్ళు వాళ్ళ మామూలు ప్రకారం రొట్టె, పాలు, యిచ్చేవారనుకోండి. అదైనా పరులపాలే! ఇంకొక తమాషా విన్నారో లేదో! పరిమిత కుటుంబం బొమ్మలొత్తిన పసుపురంగు చీరలు తలా ఒకటి పంచిపెడుతున్నారట! ఓ లావుపాటి మిడ్‌వైఫ్ అంగవస్త్రంలా దాన్ని భుజాన వేసుకుని "తీసుకుంటారా అమ్మగారూ!" అంటూ లోపలికొచ్చింది. చేతిలోకి తీసుకుని కిటికీలోనుంచి గిరవాటు పెట్టేదాన్నే! అంతలో కారియర్ తీసుకొచ్చిన మా పనిమనిషి దాన్ని కాస్తా పట్టుకెళ్ళిపోయింది. పోగా డిశ్చార్జి కావడానికి ముందుగా యిద్దరు నర్సులు యాభయి రూపాయలు పుచ్చుకున్నందుకు గుర్తుగా సంతకం పడేయమంటూ వచ్చారు. సంతకం మాత్రం పెట్టాను. పాపం, వాళ్లు చేసిన సేవకు నాకింకా వందో, రెండు వందలో వాళ్ళకే యివ్వాలని వుంది...

ప్ర : మంచిది మేడమ్! చాలా థేంక్స్! ఎంతో ఓపిగ్గా నా ప్రశ్నలకన్నింటికీ సమాధానాలిచ్చారు...

జ : ఫరవాలేదండీ! ఇందువల్ల మీకేమైనా ఒరిగితే అదే పదివేలు! సెలవిప్పిస్తే వెళ్ళొస్తాను, నమస్తే!

ప్ర : నమస్తే. నమస్తే.

***

ప్ర : నీళ్ళందక వాడిపోయిన తోటకూర కాడలా నీరసంగా వున్నారు. కరువువల్ల డొక్కలెండిన గంగిగోవులా వున్నారు. గత కాలపు వైభవానికి చిహ్నంగా మిగిలిన శిథిలమందిరంలా బోసిగా వున్నారు. ఎవరమ్మా మీరు?

జ : సినిమాల్లోను, పుస్తకాల్లోను యిలాంటి మాటలు విన్నట్టు జ్ఞాపకం. మరిక్కడేదో ఇంటర్వ్యూ జరుగుతుందని నాతో చెప్పడం!

ప్ర : మన్నించాలి. ఏ ఇంటర్వ్యూ అయినా పరిచయంతోనే ప్రారంభమవుతుంది. మీ పేరేమిటన్నారు?

జ : దయచేసి నన్ను 'మీరు' అనకండి. వయసులో మీకంటే చిన్నదాన్ని. అంతస్తులోనైనా అంతే! ఒకానొక ఎన్జీవో పెళ్ళాన్ని 'మీరు' అనడం తుమ్మి చెట్టును పట్టుకొని మహావృక్షమన్నట్టుంది. అన్నట్టు నా పేరేమిటని అడిగారు. మా అమ్మా, నాన్నా చాలా పెద్ద పేరే పెట్టారు నాకు! సత్యసుందరి గిరిజా కళ్యాణి అని! మా వారు ముచ్చటగా "సత్యా" అని పిలుస్తుండేవారు. ముగ్గురు బిడ్డలు పుట్టేటంత వరకూ!

ప్ర : ఆ పైన?

జ : ఆపైన పెళ్ళాన్ని ముచ్చటగా పిలవడంవల్ల కలిగే ప్రమాదమేమిటో ఆయనకు బోధపడింది. ముద్దుగా పిలిస్తే మూడ్ బాగున్నట్టు భావించి ఏ చీరో, చెంబో, తప్పేలాయో తెచ్చి పెట్టమంటానేమోనని ఒక తీరని భయం ఆయన్ని పట్టుకుంది...

ప్ర : కోరిక చెల్లిస్తే పోయేదిగా...

జ : చెల్లించకూడదనేం కాదు. అందని చేంతాడుతో నీళ్ళు చేదడం సాధ్యం కాదుగా! కాపురానికొస్తూ నేను తెచ్చిన మూడువేల రూపాయల కట్నం అయిదారేళ్ళల్లో కొంచెం కొంచెంగా కరిగిపోయింది. జీతం రాళ్లు ఒక్కటే మిగిలిన ఆధారం. చిల్లరకొట్టు, పాలు, పెరుగు, బట్టలంగడి, ఇంటద్దె వీటికన్నిటికీపోనూ రెండో తేదీ సాయంకాలానికి ఒక పదో, పదిహేనో మిగిలేవి. ఈ మాత్రం డబ్బుతో నెలంతా ఎక్కడ గడుస్తుంది? ఉన్న పరిస్థితి ఆయనకెంతగా తెలుసో, నాకూ అంతగా తెలుసు. తప్పనిసరిగా ఏదైనా కావలిస్తే నేను దొంగలా అడిగేదాన్ని! ఆయన దోషిలా నిలబడేవారు.

ప్ర : అప్పటికి మీ చేతిలో ఏమీ లేనట్టే మాట్లాడేస్తున్నారు. తలచుకొనివుంటే అప్పట్లోనే మీరు కుటుంబాన్ని పరిమితం చేసుకుని ఉండొచ్చు. బిడ్డలెందరో మీరు చెప్పలేదనుకోండి? నేనొక రకంగా ఊహించుకున్నాను ఆరేడుగురుండొచ్చునని...

జ : సరిగ్గానే ఊహించారు. చివరి ముగ్గురు కోరుకుంటే పుట్టినవాళ్లు కారు. వద్దు వద్దంటే కలిగినవాళ్లు. ఏమిటోలెండి! మన బ్రతుక్కు మనం ఈ నలుగురు బిడ్డల్ని సాకి సంతరిస్తే చాలదా, ఇక మీదట సంసార సుఖమే వద్దనుకునే వాళ్ళం. ఏం గిరిజమ్మొదినా! నెలతప్పినట్టుంది! అంటూ పొరిగింటావిడ పలకరిస్తే తల కొట్టేసి నట్టుండేది! తెలిసి తెలియకుండానే దరిద్రాన్ని పెంచుకుంటూ ఇంతదూరం వచ్చేశాం. ఇప్పుడిక్కడ నిల్చుని వెనుక్కు చూసుకుంటే బాధగానే వుంది.

ప్ర : గిరిజా కల్యాణిగారూ! మీ బాధను నేను కెలుకుతున్నాననుకోవద్దు. ఆచరణ సాధ్యంగా సలహా ఏదైనా సూచించాలనీ వుద్దేశం. మాటల్ని బట్టి చూస్తే మీరు చదువుకున్న వారిలా కనిపిస్తున్నారు...

జ : ఆ మాటెందుకు లెండీ! చదువుకోకున్నా బాగుండిపోయేది. ఫిష్టుఫారంలో తప్పిపోయానేమో, మా నాన్నగారు బడి మాన్పించేశారు. ఎక్కువగా చదివిస్తే కట్నం రేటు పెరుగుతుందాయె! చదువు తక్కువైతే గంతకు తగ్గదిగా చూసి ఒక బొంతను ఎన్నికచేసేయ్యొచ్చు. ఎవళ్ళ చిక్కును వాళ్ళు పరిష్కరించుకోవాలి గదండీ! నాన్నగారిని తప్పుపట్టి ఏం లాభం? నా ఖర్మ బాగుండి ఆ పరీక్షలో కాస్తా గట్టెక్కివుంటే ఎస్సెసెల్సీ దాకా బండి లాగేసి వుండేదాన్ని. ఆ చదువుకేదైనా ఉద్యోగం ఆశించడానికైనా వీలుండేది. ఇప్పుడేమయిందంటారు? నా చదువువల్ల కాపురానికి ఒరిగిందేమీ లేకపోయింది, యింకా నాలుగైదు రూపాయల నెలసరి ఖర్చు తప్పితే!

ప్ర : ఎందుకనీ?

జ : అవేనండి వారపత్రికలు. నా కందుబాటులో వున్న సరదా వారపత్రికలు చదువుకోడమే! పది కథలు చదువుకోవచ్చు. పదిరకాల మనుషుల్ని గురించి తెలుసుకోవచ్చు. మనకన్నా నికృష్టంగా బ్రతికేవాళ్ళుకూడా వున్నారని తెలిస్తే ప్రాణాలకు హాయిగా వుంటుంది. వారపత్రికలైనా వున్నవన్నీ కొనుక్కోడం సాధ్యమా? నేను కొన్ని, మా పొరుగింటావిడ కొన్ని కొనుక్కుని మార్చి మార్చి చదువుకుంటాం.

ప్ర : మరైతే రాబడి పెంపొందించుకోడానికి మార్గాంతరాలేవైనా చూచుకోలేకపోయారా? మీ భర్త పార్ట్‌టైమ్ వర్కులాంటి దేదైనా చూచుకోవచ్చుగా?

జ : చూచుకోకపోతే సాగేటట్టుగా వుండటంలేదు సంసారం! ఆ మధ్య సినిమాలో టికెట్లిచ్చారు. ఇంటికొచ్చేసరికి ఒంటి గంట పన్నెండయ్యేది. ఆరోగ్యం చెడింది. నెల రోజులు సిక్‌లీవులో వున్నారు. ఇటీవలొక ఆరునెలలనుంచీ ఏదో మండీలో లెక్క రాస్తున్నారు. అందుమూలంగా ఓ యాభై రూపాయలు గిడుతున్నాయి. మా వేన్నీళ్ళకిప్పుడు అవేనండీ చన్నీళ్ళు...

ప్ర : ఆలస్యంగానైనా కుటుంబ నియంత్రణ ఆవశ్యకతని గుర్తించారంటే యిందుకు కారణం ఆర్థిక పరిస్థితులేనన్నమాట!

జ : బాబూ, ఆరోగ్య పరిస్థితులని చెప్పి యింకొక కారణంకూడా కలుపుకోండి. మగమహారాజులు ఎలాగైనా అదృష్టవంతులు. మావారి సంగతే తీసుకోండి! ఉదయం ఏడింటికి మార్కెట్టుకని బయల్దేరి మధ్యలో రీడింగు రూము గూడా దర్శించుకుని తొమ్మిది గంటలకు తిరిగొస్తారు. అప్పుడిక తొందర తొందరగా స్నానమూ, భోజనమూ కానిచ్చి ఆఫీసుకు బయల్దేరితే యిక రాత్రి పది గంటలకే తిరిగి రావడం. ఈ పదిపదిహేను గంటల పర్యంతం ఆయన తనకో యిల్లుందనీ, ఆ యింట్లో తనపైన ఆధారపడి భార్యాబిడ్డలన్న పేరుతో కొన్ని జీవులున్నాయని మరిచిపోగలరు. ఆడదానికిలా జరుగుతుందా? ఉదయం ఆరింటికే లేవాలి. టిఫిన్లు సిద్ధం చేసి ఎనిమిదికల్లా చిన్న పిల్లల్ని స్కూలుకి సాగించాలి. పది గంటలకు ముందుగానే భోజనం కావాలి. ఆపైన బట్టలు పిండి ఆరవేసేసరికి చిన్న బడి వదిలేస్తారు. వాళ్ళన్నాలు తిని లేచేసరికి పెద్ద పిల్లలు హాజరు. వాళ్ళు మళ్ళీ బడికి వెళ్ళాక ఉదయం వుతికి ఆరవేసిన బట్టల్ని యిస్త్రీ చెయ్యాలి. మరునాటి ఉదయం టిఫినుకి ఏ పిండో, రవ్వో సిద్ధం చేసుకోవాలి. ఇన్ని సమస్యల్లోనూ మధ్య మధ్య చంటిబిడ్డ అతీగతీ పట్టించుకోవాలి. సాయంత్రం కాగానే మళ్ళీ భోజనాల ప్రయత్నం! ఎందుకులెండి! రాత్రుళ్లు పడుకునే సరికి నజ్జు గుజ్జుగా పాదాలతో తొక్కి గోతంలోకి కుక్కేసిన చింతపండులా తయారై వుంటుంది ఒళ్లు... నిండా మునిగాక యిక మనల్ని చలి బాధ ఏం చేస్తుంది లెమ్మంటారాయన. ఇంకొక బిడ్డ పుట్టినా అదనంగా కొంప మునిగిపోయేదేమిలేదంటారు. ఎటొచ్చి తల ప్రాణం తోకకొచ్చింది నాకే! నిభాయించు కోలేక వంటింటిని పెద్దమ్మాయికి వప్పజెప్పి ఇలా పరుగెత్తుకొచ్చేశాను.

ప్ర : గిరిజా కల్యాణిగారూ! ఇంకొక్క ప్రశ్న మాత్రం. ఇక్కడ ఆసుపత్రి వాళ్ళు చేసిన ఏర్పాట్లల్లో మీకేమైనా లోపాలు కనిపించి వుంటే చెప్పొచ్చు.

జ : బాబ్బాబూ అదొకటా! ఏం లేదు ఏర్పాట్లన్నీ చాలా బాగున్నాయి. ఇంకొక పదిహేను రోజులపాటు యిక్కడే వుండిపోయినా బాగుండి పోవునన్నంత బాగున్నాయి.

ప్ర : మంచిది, మామూలుగా ఆపరేషన్ చేయించుకునేవాళ్ళకిచ్చే యాభై రూపాయలు...

జ : ఇదిగో. తీసుకున్నాన్లెండి! మా వారు రిక్షా తీసుకొచ్చి నాకోసం సిద్ధంగా వున్నారు. పదిరోజులుగా పిల్లలు దిగులుపడిపోయారట! వెళ్ళగానే ఓ పది రూపాయలు చేతికిచ్చి కట్టగట్టుకున్నట్టుగా అందర్నీ సినిమా కెళ్ళిరమ్మంటే, ఒక్కసారిగా యింటికి పది పండగలొచ్చినట్టు సంబరపడిపోతారు.

ప్ర : మంచిదమ్మా! ఎంతో ఓపిగ్గా సమాధానాలిచ్చారు. వెళ్ళిరండి. నమస్కారం.
జ : నమస్కారమండీ! సెలవు!

***

ప్ర : నడిరోడ్డులో దుమ్ముగొట్టుకపోయిన శిల్పంలా మడ్డిగా వున్నావు. కాలీ కాలని ఈతమొద్దులా వికృతంగా వున్నావు. నల్లరాళ్ళ మధ్య చీకిరి బాకిరిగా నిల్చున్న బొంతజముడు చెట్లల్లే బీభత్సంగా వున్నావు. ఎవరివమ్మా నువ్వు?
జ : అదేంటండీ బాబుగోరూ! అంతంత లేసి పేద్దమాట్లు నాకే మరదమౌతాయని! అమ్మీ. నువ్వెవురివి! ఎవురి తాలూకు మడిసివి? ఎక్కడుంటావని అడిగితే పోలా.
ప్ర : అదేనమ్మా నా మాటల తాత్పర్యం? నువ్వెవరివి? ఎవరి దానివి?
జ : అద్గో, వూరవతల ఎల్లంకిపాడు శివారుల్లో రచ్చదావున జానా బెత్తెడు గుడిసొంటుంది. అందులోనేనమ్మ నేనుండటం! నిరుటి సంకురేతిరి పండగెల్లిన నా గ్రోజులకా గుడిసెలో కొచ్చాం. అంతకుమున్పు సాలాసోట్లలో వున్నాంలెండి! ఇనగలేరు, ఉప్పు గుండాలపాడు, మా సముద్రం, ముత్తాలరేవు.
ప్ర : చాల్లే, నీ యజమానుడేం చేస్తుంటాడు?
జ : ఓ యబ్బో. యజమాను డన్సెప్పి మాలావు కితాబే తగిలిస్తుండరు. కట్టుకున్న ఆడది కాయలాపడితే దోసెడు గంజినీల్లయినా పొయ్యనోడు ఆడేం బరత గోరండి బాబుగోరు! ఆడికంటే సెట్టునయం, నీడయినా యిస్తది. ఏరు నయం, నీల్లయినా తాగమంటది.
ప్ర : పాపం, దగా చేసినట్టున్నాడు...
జ : ఏం చేసినా ఆడికే సెల్లుద్దిలెండి బాబుగోరు! సిగ్గూ, లజ్జా ఎక్కడున్నాయండీ ఆడికి? కాయలా పడ్డానే అనుకోండి, కడుపొచ్చిందే అనుకోండి! కంటికి కన్పించకుండా పోతాడు పున్నేత్ముడు. కిందా మీదాపడి లేచి, ఒంట్లోకి మల్లీ కాస్తంత బలుపొచ్చిందంటే, కల్లల్లోకి మల్లీ కాస్త ఎలుగొచ్చిందంటే, యిదుగో నేనున్నానంటూ తయారౌతాడు ఆడిజిమ్మడ! ఒదలడు గదండీ పల్లేరు కంపలాగా! సచ్చినట్టు కాపురం సెయ్యాల్సిందే! సేత్తే ఏమైందని అడగరే? నా సామిరంగా, వూరూకొక బిడ్డ! ఇనగలేరులో పుట్టిన యీదులపాలు. ఉప్పుగుండాలపాడులో పుట్టిన బిడ్డ ఆ వూరోల్లపాలు. మా సముద్రం బిడ్డయితేనండీ బాబుగోరూ, మానిక్కెంలా వుండేవోడు. పై గడ్డ నుంచీ ఆ ల్లెవుల్లో ఏపారాలకనొచ్చి, బిడ్డ ముద్దుగున్నాడన్సెప్పి తీసుకెల్లి పోయినరు. బంగారం లాంటి బిడ్డను యిరివైకో, పాతిక్కో పాలుపడి ఇచ్చేసినడు ముదనష్టపోడు. ఎందరయితేనేమి ఎర్రిమొగమా! సాకేవాడు పరమాత్ముడున్నాడు అంటూ మల్లీ ఎకిలి నవ్వులు నవ్వుతడు...
ప్ర : ఇంతవరకూ లెక్క తగిలినవాళ్ళు ముగ్గురే! మొత్తం ఎందరు బిడ్డలో చెప్పావు కావు...
జ : శానామందిలెండి బాబుగోరూ! పట్నం కట్టెల అడితిలో పెద్దోడున్నాడు. రెండోది ఆడపిల్ల. మేం నంజంపేటలో ఉండగా పుట్టింది. వయసొచ్చేతల్కి దానికి రెక్కలొచ్చి నయి. ఆ మద్దెన గెంజి కరువొచ్చినప్పుడు మేం సింతగ్రావురు దెగర రోడ్డుపని జేత్తుండేవోల్లం. అప్పట్లో అది అయినాపురం నుంచొచ్చిన వూదొత్తుల సిన్నోడి మీన

మనసుపడి సెప్పకుండా ఎల్లిపోయింది. ఈయాల్టికి దానిక్కూడా యిద్దరో, ముగ్గురో బిడ్డలుండాల...

ప్ర : ఇదిగో అమ్మీ! అడిగిన ప్రశ్న మాత్రం వదిలిపెట్టి మిగిలిన వివరాలన్నీ ఏకరువు పెడుతున్నావు...

జ : అదేంటండి బాబుగోరూ! తీగె కదపతావున్నారాయె! డొంకంతా కదలకుండా వుంటదా? పోన్లెండి మాటకి మాట మాత్తరం సెప్పమన్నా చెప్పగల్ను...

ప్ర : చెప్పుమరి! ఇందాకా అడిగిన ప్రశ్న అలాగే వుండిపోయింది...

జ : ఏమడిగారబ్బా! వరసాగ్గా బిడ్డల కత సెబుతుండనే?...

ప్ర : ఏం చెబుతున్నావోలే! ఒక్క మాటలో మొత్తం ఎందరో చెప్పేయకూడదూ! పోనీ. ఓ పది మంది వుంటారని వ్రాసుకోనా?

జ : పోయింది పొట్టు, మిగిలింది గెట్టనుకున్నా అంతకు తక్కువేముండదు లెండి బాబుగోరు! రాసుకోండి.

ప్ర : రక్షించావు! మరైతే ఆపరేషన్ చేయించుకోవాలన్న మంచిబుద్ధి ఇంతకాలాని కొచ్చిందటమ్మా నీకు, జరగవలసిన అపకారమంతా జరిగిపోయాక!

జ : ఏదోలేండి బాబుగారు! రాన్రాను రెక్కల్లో సత్తవ తగ్గిపోతుండె! ఓ రోజు పన్లోకెల్తే రెండ్రోజులింటిదగ్గిర వుండిపోవాలనిపిత్తది, పన్లో కెల్లకపోతే మాలాంటోల్లకి కాపరం జరిగేదుందా? సేత్తే కుండకాలె, సెయ్యకపోతే కడుపుకాలే! ఇక్కడేదో మారాజులు పదిరోజులదాకా కడుపునిండ అన్నంపెట్టి, కట్టుకోదానికొక సీరకూడా యిచ్చి, ఎల్లేటప్పట్కి యాభై రూపాయలు సేతిలోపెట్టి పంపిస్తుందరని తెల్సిందా, ఏమయితే అయిందని చక్కా యిక్కడి కొచ్చేసినను. ఆసుపత్తిరి, ఆసుపత్తిరి అనుకోడమేగానీ యిక్కడెంతో బాగుండది. మంచాలు, జానెడెత్తు పరుపులు, పైకి సూత్తే పంకాలు, బలున తెల్లారకముస్నేకాపీలు, నాలుగు బారల పొద్దెక్కె తల్కి టిప్పిన్లు, పొద్దు తిరక్కముస్నే అన్నాలు! సత్తెప్పెమాణకంగా యిడిసి పెట్టెల్లతానికి మనసొప్పడంలా! అయినా ఎల్లిపోక తప్పేది గాదని ఖరాఖండీగా సెబుతూ వుంటే యికనేం జేసేది!

ప్ర : పరవాలేదులే! చేతిలో డబ్బుందిగా నెలరోజులపాటు యింటి దగ్గరే వుండి విశ్రాంతి తీసుకో. పనిలోకి వెళ్ళి ఒళ్ళు పాడు చేసుకునేవు?

జ : డబ్బుంటే పన్లో కెల్తానా! ఆ బుద్ధి నా కెప్పుడూ లేదండి బాబుగోరూ! ఎటొచ్చీ ఒక్కటేనండీ నాకు బయం! ఆ మాయదారి సచ్చినోడొచ్చి నాలుగు తన్నులు తన్ని డబ్బెక్కడ లాక్కుపోతాడోనని! అయినా అంత సులభంగా సేతికి సిక్కనీన్లెండి! రాజయ్య మేస్త్రీలేదూ ఆయన కాడిచ్చి దాపెట్టమంటాను. ఆయనకాడ ఈడిపప్పులుదకవు.

ప్ర : అలాగే చెయ్ మరి! ఇక నాకైతే నిన్నడగవలసిన ప్రశ్నలేవీ లేవు. వెళ్ళి రావచ్చు.

జ : నానేం చెప్పానో. తవరేం రాసుగున్నారో! తప్పులుంటే బిడ్డలాంటిదాన్ననుకుని మన్నన సెయ్యాల! సెలవిప్పిస్తే ఎల్లొత్తాను. దండాలండి బాబుగోరూ.

***

ప్ర : దారి తెలియని బాటసారిలా నిస్సహాయంగా వున్నావు. మంచుదెబ్బ తిన్న పద్మంలా దయనీయంగా ఉన్నావు. విషాదంగా ఉన్నా వినాలనిపించేపాటలా విచిత్రంగా వున్నావు ఎవరివమ్మా నువ్వు?

జ : నా పేరా అండీ! "సుబ్బులూ" అని పిలుస్తారండీ! ఇస్కూలు రిజిష్టర్లలో నేమో "సుబ్బలక్ష్మి" అని వుండేదండీ!

ప్ర : అమ్మాయ్ సుబ్బలక్ష్మి! ఎంతమ్మా నీ వయసు?

జ : ఎంతో ఎక్కడిదండీ! పెళ్ళయ్యేనాటికి పదిహేడో, పజ్జెనిమిదోనని సెబుతుండేది మా అమ్మ. పెళ్ళయ్యాక జరుగుతున్నదిది ఆరోయేడేనండీ!

ప్ర : అలాగా! ఎందరమ్మా నీకు బిడ్డలు?

జ : ఒకే బిడ్డ. ఆడబిడ్డండీ! ఇక్కడే ఆ చెట్ల క్రింద ఆడుకుంటూ వుంది. పిలవమంటారా?

ప్ర : ఎందుకులే ఆడుకోనివ్వు. చూడమ్మా సుబ్బలక్ష్మీ! ఇది నేను నీకు చెప్పవలసిన మాట కాదనుకో! ఐనా చెప్పకుండా వుండలేకపోతున్నాను – నువ్వింకొక అయిదారేళ్ళదాకా ఆగివుండవలసిందని. ఇప్పుడేం మించిపోయిందనమ్మా నువ్వీ ట్యూబెక్టమీకి సిద్ధపడ్డావు?

జ : మించిపోయిందేమీ లేదని మీరనుకుంటారు. ఒక్కొక్కరోజు గడవడమూ ప్రాణాంతకంగానే వుంది నాకు!

ప్ర : అయ్యో పాపం! అంత లేమిడి సంసారమా?

జ : లేమికెక్కడ హద్దులెండి! పోల్చి చూసుకుంటే చాలామంది కంటే నేనే నయమేమో! స్వంతయిల్లో, అద్దె యిల్లో ఎవరం చూడొచ్చారు, నాకో నిలవ నీడుంది. అగ్గిపెట్టెల ఫ్యాక్టరీలో ఉద్యోగముంది. నెలకో వంద రూపాయల జీతమొస్తుంది. ఉన్నంతలో ఇదీ అదృష్టమేననుకోవాలి. అనుకుంటానుకూడా! ఇతరులపైన ఆధారపడి, ఐశ్వర్యంలో మునిగితేలడంకన్నా, ఎవరి కాళ్ళపైన వాళ్ళు నిలబడి లేమిలో బ్రతకాల్సి వచ్చినా మంచిదే.

ప్ర : ఇంతచిన్న వయసుకే ఎంత అనుభవాన్ని పండించుకున్నావమ్మా నువ్వు?

జ : అనుభవాన్ని నేర్పించడానికి అవసరానికి మించిన గురువులున్నారా? నా కవసరమంటూ ఏర్పడి మూడేళ్ళయింది.

ప్ర : అంటే?

జ : బస్సులో డ్రయివరుగా పనిచేస్తుండేవారాయన. హఠాత్తుగా ఓ యాక్సిడెంటులో పోయారు. ఎందరో జనం ఎన్నో కారణాలపైన చనిపోతుంటారు. కొంతకాలంపాటు ఏడ్చి మొత్తుకోడం మామూలే! చచ్చిపోయిన వాళ్ళతో బాటుగా చచ్చిపోలేంగదా! బ్రతకాలి. ఆ పనే చేస్తున్నాను. అయితే ఈ బ్రతకడం అయిన వాళ్ళందరూ ఆశించినట్టుగా మాత్రం కాదు. నా యిష్టమొచ్చినట్టు!

ప్ర : మనిషినంత 'ఫ్రీ'గా వదిలిపెట్టేస్తుందా సంఘం! అందులోనూ ఆడ మనిషిని! అయిన వాళ్ళతో నీకు పెద్ద పేచీయే వచ్చి వుండాలి?

జ : కారు బారు చేశారనుకోండి! వినిపించుకోకపోయేసరికి తోక ముడుచుకున్నారు. అణకువగా ఒక ఆడది దొరికితే ఎవరికైనా చాకిరీ చేయించుకోవాలనే వుంటుంది.

అత్తగారింటివైపు వాళ్ళయితే ఒంటరిగా ఓ ఆడమనిషి పట్నంలో వుండి పోవడమా అంటూ నోళ్లు నొక్కేసుకున్నారు. ఇప్పుడు నా బ్రతుకు నేను బ్రతుకుతున్నానా! అరిగిపోయిన కాలి చెప్పులా వాడుకోవాల్సిన దానికి యింత యోగమా అనుకుంటూ ఒకటే కడుపుమంట!

ప్ర : ఏ కట్టెకున్న నిప్పు ఆ కట్టెనే కాలుస్తుందట! నీకొచ్చిన నష్టమేమీ లేదులేవమ్మా సుబ్బలక్ష్మీ! మరి... మీ యిళ్ళల్లో మారు మనువులు లేవా?

జ : లావుమీద ఒంపు తెలియదని మా వాళ్ళలోనూ డబ్బులున్న వాళ్లు మారు మనువులు చేసుకుంటున్నారు. దిక్కూ దరిలేని నాలాంటి వాళ్ళేం చేసినా, చేయకపోయినా తప్పేననిపిస్తుంది. అయినా నన్ను నమ్ముకున్న బిడ్డ ఒకతె వుండగా నన్ను మనువాడ్డానికి ఒప్పుకునే వాళ్ళుంటారా? ఆడారే అనుకోండి. ఆ కాపురం కుదురుగ్గా సాగుతుందని నమ్మకం వుండొద్దూ?

ప్ర : మరైతే యిలాగే వుండిపోదలచుకున్నావన్న మాట!

జ : మరేం చెయ్యను! ఉండిపోవాలనే వుద్దేశం, కానీ వుండనిస్తారా? వయసులో వున్న ఆడదానిపైన కన్నేసే వాళ్ళు ఎక్కడా వుంటారు. అలాగని వాళ్ళను తప్పుబట్టను లెండి! నేనైనా ఉప్పు పులుసూ కారమూ తింటున్న మనిషినే! ఈ మనసుకెప్పుడు పడుతుందో తెగులు? ఎలా చెప్పగలం!

ప్ర : అమ్మాయ్ ఆగాగు! ఇలాంటి కారణాలు బాహాటంగా బయటపెట్టడానికి వీలుండదేమో! బహుశా నీ కేసును ఈ కాగితాల్లోనుంచి పరిహరించవలసి వుంటుంది. నా తంటాలేవో నేను పడతాన్లే... నువ్వెళ్ళిరా...

జ : వెళ్ళిరానా అండీ, నమస్కారం!

❖ ఆంధ్రజ్యోతి వారపత్రిక – 28 జూన్, 1974. ❖

# కామదహనం

ప్రతి మానవుడి బీరువాలోనూ ఒక అస్తిపంజరం దాగివుంటుందట! వినడమేగాని నేనెప్పుడూ కళ్ళతో చూడలేదు. పుస్తకాలు, బట్టలు, నగలు మరేదైనా విలువైన వస్తువు బీరువాల్లో వుండడం నేనెరుగుదును. ఐనా బీరువాదాకా వెళ్ళడం ఎందుకు! అస్తిపంజరం మానవుడి శరీరంలో వుంటుందని నాకు నికరంగా తెలుసు.

కానీ మనిషితో వ్యవహరిస్తున్నప్పుడు ఆ వ్యక్తి శరీరంలో ఒక అస్తిపంజరం వుందన్న భావం మనలో లేశమాత్రంగానైనా వుండదు. చెవుల్ని శ్రీకారాలంటాం. కళ్ళు కమలాలంటాం. నాసికను నువ్వు పువ్వంటాం. పెదవులు దొండపండంటాం. కంఠం శంఖమంటాం. కాని అస్తిపంజరం జోలికి వెళ్ళము. నేను బల్లగుద్ది చెప్పగలను? ఏ ఎక్స్‌రే ద్వారానయినా ప్రియురాలి అస్తిపంజరాన్ని ఫొటోతీసి చూపిస్తే, అసహ్యించుకోకుండా వుండగలిగే ప్రేమికుడుండడు!

రహస్యాలు అస్తిపంజరాలలాంటివేమోనని నా అనుమానం.

వికృతమైన అస్తిపంజరాన్ని స్నిగ్ధసుందరమైన శరీరంలో దాచుకున్నట్టుగా, ప్రతి మానవుడు తన నాగరిక ప్రవర్తనకు, సభ్యతాయుతమైన సంస్కారానికి వెనుక కొన్ని వ్యక్తిగత రహస్యాలు దాచుకుని వుంటాడనా నా ఊహ (కాకపోతే అపోహ).

రహస్యాలు పెద్దవీకావచ్చు, చిన్నవీ కావచ్చు. లోకంలో ఖూనీలు జరుగుతున్నాయి. దొంగతనాలు దోపిడీలు జరుగుతున్నాయి. చట్టవిరుద్ధమైన వెయ్యి దురాగతాల్లో శిక్షాస్మృతికి దొరికే వెన్ని? తప్పించుకునేవెన్ని? ఇలా తప్పించుకున్న దుర్భయాలన్నీ స్వంత బీరువాలాంటి మనసులోపలి మూలగదిలో రహస్యాలుగా నిక్షిప్తమై వుండిపోతున్నాయి. అగ్నిసాక్షిగా పెళ్లాడిన ధర్మపత్ని సైతం ఆ మూలగదిలోనికి తొంగిచూడ్డానికి వీలులేని కేసులున్నాయి. పోనీ పెద్ద రహస్యాల సంగతి వదిలేద్దాం. కొన్ని చిన్న రహస్యాలుంటాయి. ఇవి బహిర్గతం కావడం అంత అపాయకరమేమీకాదు. కాని యిదొక ప్రతిష్ఠకు సంబంధించిన వ్యవహారంలాగా యిలాంటి రహస్యాలను పదిలపరచుకోవడం రివాజు. ఒక పెద్ద మనిషి వున్నాడు. అతడు గుట్టు చప్పుడుగాకుండా మట్టిబెడ్డలు మ్రింగేస్తుంటాడు. ఆ పని చేయకుండా ఉండనూలేడు. తనలా చేస్తున్న విషయం లోకానికి తెలిస్తే ఆ నామోషీతనాన్ని భరించనూలేడు. మట్టిబెడ్డలు ఖాద్య పదార్థాల కోవకు చెందినవి కావు. వాటిని మెసపడం లోకుల దృష్టిలో అపహాస్య కారణం. అందువల్ల యిదొక రహస్య క్రియగా నిర్వహింపబడడం సబబే! కానీ ఉత్తపుణ్యానికి కొందరు బుద్ధిమంతులు చాలా మామూలు విషయాలకుకూడా రహస్యపు బురఖాలు తగిలించేస్తుంటారు. ఒక సిగరెట్లు కాల్చడమే తీసుకుందాం. సంఘంలో ఫ్రమ్ టాప్ టు బాటం– ఈ పని చాలామంది చేస్తున్నదే! కాని ఒక్కొక్క వ్యక్తి సిగరెట్లతోనూ అగ్గిపెట్టెతోనూ పురబాహ్య ప్రదేశానికి చిత్తగించి, అక్కడ వరుసగా పది సిగరెట్లు మసిచేసి దారిలో రెండు కిళ్లీలు సేవించి యింటికి తిరిగివస్తూ ఈ ధూమ సేవా వినోదాన్ని దొంగనోట్లు అచ్చువేసేటంత రహస్యంగా కొనసాగిస్తుంటాడు. మరికొందరికి యింగ్లీషు సినిమాలకు వెళ్లడంకూడా రహస్యమే. అంతెందుకూ. ఇలస్ట్రేటెడ్ వీక్లీలో "చందమామ" నుంచుకుని రహస్యంగా చదువుకునే పయోధికుల్ని నేనెరుగుదును.

కానీ మా చలపతి జీవితంలో రహస్యాలు దాగివుండవచ్చునని నేనెన్నడూ అనుకోలేదు. చలపతి నాకు బంధువుకాదు, మిత్రుడు. బాగా కలిగిన కుటుంబం. స్వస్థలంలోనే మంచి ఉద్యోగం. వయస్సులో, నాకన్నా ఏడెనిమిదేళ్లు చిన్నవాడు. మా కిద్దరికీ లంకె కలిపిన విచిత్ర వస్తువు సాహిత్యం. నేను మంచి పుస్తకాల చిరునామాలు మాత్రమే సేకరించేవాణ్ణి! వాటిని కొనగలిగే అర్థబలమూ, ఆసక్తీ రెండూ వున్నాయి చలపతికి. చదివిన పుస్తకం పైన అభిప్రాయాలు చెప్పుకోడానికొక శ్రోత కావాలి. నాలాంటి వాళ్ళు కనిపిస్తే చలపతికి జన్మజన్మాల బంధువులే కనిపించినట్లు: కావలిస్తే ఆఫీసుకు సెలవుచీటీ అయినా పంపి తాను సాహిత్య ప్రసంగాల్లో మునిగి పోవడానికి తయారు. చలపతి ఊహలో సాహిత్య గోష్ఠి ఒక్కటే సత్కార్యం.

పాపం, అలాంటి చలపతికి ఒక్కొక్కప్పుడు సెలవు చీటీ పంపినా సెలవు దొరికేది కాదు. వీల్లేదు, పలానా అర్జంటు పనుంది, తప్పకుండా ఆఫీసుకు హాజరు కావలసిందే నంటూ జవాను కబురు తెచ్చేవాడు. అలాంటి పరిస్థితిలో చూచి తీరవలసిందే చలపతి ముఖం. నెల జీతానికి పాలుమారి, ఒడలని కుర్చీకమ్ముకునే దురవస్థ శత్రువుకైనా వద్దుబాబూ అన్నదే ఆ ముఖ భంగిమకు వ్యాఖ్యానం. కానీ ఉద్యోగం పురుష లక్షణంగాదా! వదలుకుంటే మళ్ళీ దొరికేది గనుకనా! అందువల్ల భుక్తిమీద వలపు, బ్రాహ్మంబుతో పొత్తు అన్నట్లుగా యిటు సాహిత్యమూ, అటు ఉద్యోగమూ రెండూ వదలకుండా పట్టేసుకున్నాయి చలపతిని. నువ్వు గదిలో కూచుని హాయిగా చదువుకుంటూ వుండు గోపాలం. నేనా ఆఫీసు ఫైళ్ళ అరణ్యంలోనుంచీ అయిదింటికే వచ్చేస్తానులే..." అంటూ వెళ్ళిపోయేవాడు.

చలపతి ఆంతరంగికాగారంలో ఏకాంతంగా గడిపే అవకాశం నాకా విధంగా లభించింది.

"కాదంబరి కావాలన్నావుగదూ. ఆ పెట్టెలో వుంది తీసుకో. మొన్న తెప్పించిన పుస్తకాలు ఆ అలమారాల్లో వున్నాయి చూడు..." వ్యవధి లేకపోవడంవల్ల పుస్తకాల ఆచూకీ మాత్రం చెప్పి ఆదరాబాదరా వెళ్ళిపోతుండేవాడు చలపతి.

ఆ గదిలో పెట్టెలున్నాయి. అలమారాలున్నాయి. వాటి నిండుకూ పుస్తకాలే వున్నాయి. ఆ పుస్తకాలకూ, నాకూ తలుపులు, తాళాలూ అడ్డుగా లేవు. అందువల్ల కావడానికది చిన్నగదే అయినా నాకొక సామ్రాజ్యంలా వుండేది.

కానీ, ఎంతటి సామ్రాజ్యంలోనైనా జన జీవనానికి ఉపయుక్తంగాని ఎడారులు, శుష్క పర్వతాలు కొన్ని వుండకపోవు. సరిగ్గా నా పాలిటి కలాంటిదే ఒక బీరువా ఆ గదిలో వుంది. అది చలపతి స్వంత బీరువా. విధిగా దానికొక తాళం వ్రేలాడుతుంటుంది. తాళంతీసి బీరువాలోంచి చలపతి దుస్తులు తీసుకోడం నేనొకటి రెండుసార్లు చూచాను. పుస్తకాలు గాకపోయిన తర్వాత అందులో ఎలాంటి నిధి నిక్షేపాలున్నా ఆ సంగతి నా కనవసరం, ఆ బీరువా నాకెందుకూ కొరగాని ఒక వస్తు విశేషం.

కానీ ఉన్నట్లుండి ఒకనాడు నేనా బీరువాను గురించిన ఊహను మార్చుకోవలసి వచ్చింది. ఆఫీసుకు వెళ్లే తొందరలో చలపతి దానికి చిలుకువేసి తాళం తగిలించడం

మరిచిపోయాడు. పైన ఫాన్‌కూడా ఆన్ చేశానేమో, బీరువా తలుపులు మెల్లగా ఒకటి రెండంగుళాల మేరకు తెరుచుకున్నాయి. ఎలాంటి రహస్య ప్రదేశంలో దాచిపెట్టినా పుస్తకాలను పసిగట్టే అతీంద్రియ శక్తి ఒకటి నాకుందని నాకో నమ్మకం వుంది. ఆ విశ్వాసాన్ని వమ్ముచేసిన ఘనత మా చలపతికొక్కడికే దక్కింది. తలుపు తెరచి చూద్దును సరిగదా, బీరువాలో ఒక అరనిండుకు నన్ను వెక్కిరిస్తున్నట్లుగా పుస్తకాలే కనిపించాయి. వార, పక్ష, మాస పత్రికలు పుస్తకాలన్న వర్గీకరణం క్రిందికి వస్తాయోరావో నాకు తెలియదు. ఆ పుస్తకాల్లో ముప్పాతికా మువ్వీసంవంతు పత్రికలే. ఓ పత్రికను పైకి తీశాను. ముఖచిత్రంకేసి చూచాను. ఎవతో పాపం లేజవ్వని! నేను జాలిపడడం ఆవిడ సరైన తిండిలేక చిక్కిపోయి వుందని కాదు, ఆ యాస్పెట్‌లో ఆమె సర్వాంగసుందరంగా వుంది. నూటికి నూరు మార్కులు నిలబెట్టి వసూలుచేయగల అంగసౌష్టవం ఆమెది! కాని తిండి తర్వాత మనిషికి బట్ట ప్రధానం గదా! ముఖ చిత్ర సుందరి ఒంటిపైన మూరెడు బట్టయినా లేకపోవడమే విధి వైపరీత్యం! పెంచి, పెద్దచేసిన కన్న బిడ్డను దిసమొలగా వీధులవెంట పడదానికి సమ్మతించే తండ్రి లోకంలో ఉంటాడా! ఉన్నాడు. ఈ ముఖచిత్ర సుందరిని సృష్టించిన చిత్రకారుడు చేసిన పని అది! కన్నుదోయికి అన్యకాంతలడ్డమైతే మాతృభావం చేసి మరలడం ఎవరికో మానవోత్తములకే సాధ్యమనుకుందాం. కానీ ఎంత మానవమాత్రులకైనా దిశమొలగా ఒక ఆడదిగాని, లేదా మగవాడుగానీ ఎదురైతే కళ్ళు మూసుకోవాలనే అనిపిస్తుంది. కాని నేనొకటి రెండు నిముషాలు అనిమిష నేత్రాలతో ఆ బొమ్మవైపు చూచాను. అంతసేపలా చూడగలిగానంటే అందుకు కారణం నా చుట్టుపట్ల ఎవ్వరూ లేకపోవడం! హఠాత్తుగా నాకో సత్యం తెలిసింది. పదిమందితో కలిసి వున్నప్పుడు చేయలేని పనులు కొన్నింటిని మనం ఏకాంతంలో చేయగలమన్నమాట! ఆ ముఖచిత్రం లోని జవ్వనికూడా ఎక్కడో ఏ బాత్‌రూంలోనో, పడకగదిలోనో యిలా వుండివుంటుంది. అందుకని ఆమెను పట్టి తెచ్చి యిలా ముఖపత్రం పైకెక్కించి బజారుపాలు చేయడం ఏం న్యాయం? ఐనా ఈ ముఖచిత్రం మీమాంసలోనే కొట్టుమిట్టాడుతూ కూచుంటే ఈ పత్రికను ఆద్యంతంగా చదివి చూడడమెప్పుడు?

గబగబా పుటలు తిరగవేశాను. ఆ పత్రికలో కథలకన్నా బొమ్మలే ఎక్కువ. పేజీకొక బొమ్మ. ప్రతి బొమ్మలోనూ ఒక కొమ్మ. ఆ కొమ్మకొక పురుషవృషభుడు అంటిపెట్టుకుని వుండడం తప్పనిసరి. ఏ దేశ చరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం అంటాడు అభ్యుదయ కవి. ఇందులో ఏ బొమ్మను ఏ కొమ్మను చూచినా కళ్ళకు కొట్టవచ్చినట్లుగా కనిపించేది బట్టల కొరత భయానక స్వరూపమే! మానవులు దిగంబరంగా సంచరించడం పదివేల సంవత్సరాల క్రిందటిమాట. ఇప్పుడలా అంత ధైర్యంగా దిగంబరులుగా తిరిగేవాళ్ళు లేకపోయినా, ఆ వాంఛ మాత్రం ఏ కొందరిలోనో వున్నట్టే వుంది - ఈ బొమ్మల తీరుతెన్నుల్నిబట్టి చూస్తే! ఈ హావభావ విలాసాలు, ఈ ఆలింగ చుంబనాదులు ఈ శృంగార క్రీడలు లోకంలో లేనివికావు. కాని పట్టెమంచం పడక గదిలోనే వుండాలి. స్త్రీ పురుషులు లోపలికి వెళ్ళగానే తలుపులు మూసి వేయబడాలి. ఎవరి శృంగార జగత్తువారిదిగా ఆ రహఃకేళీ రహస్యాలు వాళ్ళకు, వాళ్ల పడక గోడలకే పరిమితం కావాలి.

అలా కాకుండా పట్టె మంచాన్ని తీసుకొచ్చి యిలా పబ్లిగ్గా నాలుగు రోడ్ల కూడలిలో వేసుకుంటారా ఎవరైనా! అందునా నాగరికత అత్యున్నత శిఖరాలను అందుకుంటున్నట్లుగా భావింపబడుతున్న ఆధునిక సమాజంలో జరగవలసిన పనేనా యిది?

ఎందుకైనా మంచిదని నేనా పత్రికలోని కథల్నికూడా చదవదలచుకున్నాను. శ్రద్ధగా ఐదారు కథల్ని చదివి ముగించిన తర్వాతనే ఊపిరి త్రిప్పుకున్నాను. ఈ రచనల్లో లేనిదీ, వున్నదీ కూడా ఒక్కటే! లేనిది వైవిధ్యం, ఉన్నది సంభోగ శృంగారం. నదులన్నీ సముద్రానికభిముఖంగా పరుగెత్తినట్లుగా ఈ కథలోని సంఘటనలకన్నింటికీ చరమలక్ష్యం సంభోగ శృంగారం. ఇందులోనూ ఒక తమాషా. ఈ కథలనుబట్టి చూస్తే భార్యభర్తల మధ్య శృంగారం తన విశ్వరూపాన్ని ధరించే వీలేలేదు. విటీవిటుల మధ్యన అది సాధ్యం. ఈ విటీవిటులలో కూడా ఎంత వయో తారతమ్యముంటే అంత మంచిది. సహజ పరిణామాలకన్నా ఆకస్మిక, యాదృచ్ఛిక సంఘటనలకే ప్రాధాన్యం. భార్యాభర్తలు పడకగదిలోనే కలుసుకుంటే అది వట్టి చచ్చుకథ. స్త్రీ పురుషులు (ఇంతకుమునుపు ముఖమెరుగని వాళ్లయితే ప్రశస్తం) ఏ సినిమా థియేటరులోనో, రైల్వే స్టేషనులోనో కలుసుకుంటే ఆ కథ అక్కడితో రసకందాయంలో పడినట్లు. ఈ కథలోని మగవాడి నిఘంటువులో కులాంగన, సౌశీల్యం, పాతివ్రత్యంలాంటి పదాలు మచ్చుకైనా కనిపింపవు. (అతగాడు సాధారణంగా ఒంటరిగా ఓ గదిలో వుంటాడు. చుట్టుపట్ల గాలాలు వేస్తాడు) లోకం లోకమంతా వేశ్యావాటికగానే భావిస్తాడు. అందుకు తగ్గవాళ్లే ఆడమనుషులుకూడా! వాళ్లు శరీరాన్ని గుడి అనుకోరు. సత్రమనుకుంటారు. ఊర్వశిలా వావి వరుసల్ని లెక్కపెట్టరు. శూర్పణఖలా పరాయి మగవాణ్ణి ప్రథమ వీక్షణంలోనే కామిస్తారు. వరూధినిలా ఆ యింపే పరబ్రహ్మమనీ, అంతకంటే కావలిసిందేమీ లేదనీ అనేస్తారు. కానీ పైన పేర్కొన్న పురాణాంగనలకు తమ ప్రయత్నంలో కృతకృత్యత లభించినట్లు మనం వినలేదు. కానీ యిక్కడి ఊర్వశులకు, వరూధినులకు, శూర్పణఖలకు ఆ లోటు లేనేలేదు. అలాంటి మగవాళ్లు, ఇలాంటి ఆడవాళ్లే యిక్కడ హీరో హీరోయిన్లు.

బస్సుల్లోను రైళ్ళలోను కొందరు యువకులు ఇతరుల కంటపడకుండా జాగ్రత్తపడుతూ ఎంతో దీక్షగా పుస్తక పఠనంలో నిమగ్నులై కనిపించడం నాకప్పుడు జ్ఞప్తికి వచ్చింది. బస్సుల్లోకి రైళ్ళల్లోకి రాగలిగినవి యిండ్లలోకి దారిచేసుకోకపోతాయా? చదివినా అర్థంగాకపోవడానికి అవేమైనా ప్రబంధాలా? అక్షరం తెలిసిన ప్రతి వ్యక్తికీ యిది అందుబాటులో వున్న సాహిత్యమే!

తరచుగా యిలాంటి అవకాశాలు లభించవు గనుక పనిలో పనిగా మరికొన్ని పత్రికలు చూచిగానీ నేను బీరువా మూసివేసే వుద్దేశంలో లేను. పానకంలో పుడకలా ఓ పత్రిక తిరగవేస్తుండగా అందులో ఒక ఉత్తరం కనిపించింది. కవరుపైన టైప్ చేయబడి వున్న చిరునామా చూడగానే ఏదో అనుమానం కలిగింది. అప్రయత్నంగానే కవరులోనుంచి కాగితం తీశాను. అది ఆ పత్రికవాళ్లు చలపతికి వ్రాసిన ఉత్తరం – "మీరు కోరినట్టు మీరచనలనన్నింటినీ "కామవర్ధన్" అన్న మారుపేరుతోనే ప్రచురించగలము. పోయిన నెల ప్రచురింపబడిన మీ కథ, "జవ్వని నవ్వింది" చాలా బాగుందని మా కార్యాలయానికి

వందలకొలది జాబులు వచ్చాయి. మా అభినందనలు స్వీకరించండి" – ఇలా పూర్తయింది ఉత్తరం. నా ఆలోచనకు మాత్రం ఆనకట్టపడినట్లే అయింది.

"బాల్యక్రీడలు కొన్నినాళ్ళు. భామా కుచాలింగనో పరిరభ్యన్నతి కొన్నినాళ్ళు" అన్నారు. చలపతికి బాల్య క్రీడల వయస్సు దాటిపోయింది.

"మారుడు మనవాడుకాడు, ఆతడు
తన మామతో జతచేరినాడు"

అన్న విరహ వర్ణనలోని చందమామ కాలానికి చిహ్నం; ఈ న్యాయాన్ని బట్టి ఇది చలపతిలో కాముడు పుట్టి ప్రవర్ధమానం కావడానికి తగిన అదనే కానీ అమాయకుడిలా కనిపించే చలపతిలో కాముడింత భయానకంగా పుట్టాడా? ఇంత బీభత్సంగా వర్ధిల్లుతున్నాడా? కామం పొగరుబట్టిన గుర్రం. మంచి పగ్గం బిగించి అదుపులో పెట్టుకోకపోతే ఈ గుర్రం రథాన్ని ఏ గోతిలోనైనా తోసివేస్తుంది. పగ్గం తగిలించటంలో విలంబనం జరిగినకొద్దీ ప్రమాదమే!

పైకి తీసిన పత్రికలన్నింటినీ బీరువాలో భద్రపరిచి తలుపులు మూసేశాను.

పుస్తకంపైన నిలవడానికి బుద్ధి మొరాయించింది. గదిలో పచార్లు ప్రారంభించాను. మనసు పరిపరి విధాల పరుగిడుతోంది. శనిగ్రహం పట్టుకుంటే ఏడేళ్ళు వదలదట. ఇదివరకు చూసిన బొమ్మలు, కథలో వచ్చిన పాత్రలు, దృశ్యాలు ఎంతగా వద్దనుకున్నా మళ్ళీ మళ్ళీ మనసులోకి వస్తున్నాయి. అమ్మో, అందులో ఏదో మాదకద్రవ్యం వున్నట్లే వుంది. ఈ విషానికి విరుగుడేమో తెలియడంలేదు. కాసేపు వెలుపలికి వెళ్ళి వద్దామనుకున్నాను. హాల్లో వేంకటరామయ్యగారు కనిపించారు.

"రావయ్యా శేఖరం! ఐనా ఆ పుస్తకాల్లో ఏముందిగానీ కాసేపు పిచ్చాపాటి మాట్లాడుకుందాం కూర్చో. నా కిన్నేళొచ్చాయిగదా, పట్టుమని ఒక పుస్తకం చదివి ఎరగను. న్యూస్ పేపరు మాత్రం ఎడిటర్ అండ్ ప్రింటర్‌దాకా చదివేస్తుంటాను. తీరిగ్గా వున్నప్పుడల్లా పడుకొని నిద్రపోవడమే నాపని. అంతగా నిద్రపట్టలేదనుకో, మాట్లాడుతూ కూర్చుంటాను. మాట్లాడ్డానికి మనుషులే వుండాలన్న పట్టింపులేదు. కుక్క, పిల్లి, ఎలుక ఏది కనిపిస్తే దానితో మాట్లాడేస్తుంటాను. ఈ పుస్తకాలు చదివే దుర్గుణం ఎలాగో మా చలపతికి ఒంటబట్టింది..."

దొరికిన అవకాశాన్ని జారవిడువకుండా "మరయితే తొందరగా పెళ్ళి చేసేస్తే దుర్గణం తగ్గుముఖం పట్టవచ్చును గదండీ!" అన్నాను.

"అయ్యో రాత! వాడికా ధ్యాస ఎక్కడిది నాయనా!" వంటగదిలోనుంచీ హాల్లోకి వస్తూ అందుకుంది శాంతమ్మ. "పెళ్ళి మాట ఎత్తితే చాలు తుర్రున పారిపోతాడు. మొన్నటికి మొన్న మా మాలతి పదిరోజులుండి పోయింది గదూ? మాలతంటే మా అన్నయ్య కూతురు. వీడికి దాన్నే చేసుకోబోతున్నాములే! అది పెరట్లోవుంటే వీడు వీథిలో! అది వీథిలో వుంటే వీడు పెరట్లో!..."

ఆడగాలి తాకిడికి అంతగా చెదిరిపోయే చలపతిలో బూతుకథలు వ్రాసే "కామవర్ధన్" దాగి వుండడం విచిత్రమే!

***

మారుపేరుతో చలపతి శృంగార సాహిత్యం సృష్టిస్తున్నాడని లోకానికి తెలియదు. తన ఊహాలోకపు యిష్టభోగ విహారాలను ప్రచ్ఛన్నంగా ఒక అజ్ఞాత పాఠకుడు గమనిస్తున్నాడని చలపతికి తెలియదు. తనలోకి కామవర్ధనుడు యథేచ్ఛాప్రణయలీలల్లో తేలిపోవడంలో పరమానందం పొందుతుండగా నిజజీవితంలో చలపతి ఆ ఆనందానుభవాన్ని చూరగొనడానికి వీలుగా ఒక సంఘటన జరిగింది.

ముసుగులో గుద్దులాట లెందుకు – ఆ సంఘటన పేరే పెళ్ళి!

పెళ్ళికోసం చలపతి రెండు మాసాలు సెలవు పెట్టాడు.

చలపతికి నలుగురు అక్కచెల్లెళ్ళున్నారు. మాలతీ దంపతులు తమ హనీమూన్ కాలంలో ఒక్కొక్క ఆడపడుచు యింట్లో ఒక్కొక్క వారం గడపవలసి వచ్చింది. మిగిలిన పది పదిహేను రోజుల్లోనూ వాళ్లు శ్రీరంగం, శివసముద్రం, బెంగుళూరు, బృందావన్‌లాంటి రమణీయ ప్రదేశాలు సందర్శిస్తూ ముచ్చటగా చక్కర్లు కొట్టివచ్చారు.

హనీమూన్ ఆనందంగా గడిచినట్లు తాను మళ్ళీ ఉద్యోగంలో జాయినైనట్లుగా వ్రాశాడు చలపతి.

పత్రికలో ఒకటి రెండు మాసాలుగా కామవర్ధన్ కథ లేనందుకు ఒక పాఠకుడు విచారాన్ని వెలిబుచ్చుతూ వ్రాసిన ఉత్తరాన్ని "లేఖావళి" శీర్షికలో చూచాను. కామవర్ధన్ సెలవులో వున్నాడని ఆ పాఠకుడికి తెలియదు. నేనైనా అతడు కాస్త లాంగ్ లీవు పెట్టివుంటాడని మాత్రమే అనుకున్నాను.

ఆ పాఠకుడూ, నేనూ కూడా పొరబడ్డామని తెలుసుకోడానికి కొంతకాలం పట్టింది. నిజం నిలకడమీదనే గదా తెలిసేది!

చలపతికి పెళ్ళి జరిగి ఒక ఏడాది గడచిన తర్వాత నేనొక పర్యాయం ఆ వూరు వెళ్ళాను. ఆలోగా నాలుగైదుసార్లు వెళ్ళి రాకపోలేదు. కానీ ఆ వెళ్ళడం సంగతి వేరు! అప్పట్లో నేను నిక్కి నీలిగీ హాల్లోకి మాత్రం వెళ్ళగలిగాను. స్వాగతం, సత్కారం, విందూ, విశ్రాంతి అన్నీ హాల్లోనే స్వీకరించాను. మిత్రుడి అంతరంగికాగారం భార్యాభర్తల శయనాగారంలా మారిపోవడమే యిందుకు కారణం. కానీ ఏడాది గడిచేసరికి పరిస్థితుల్లో కాస్త మార్పు వచ్చిందనే చెప్పాలి. కానుపుకోసం చలపతి భార్య పుట్టింటికి వెళ్ళిపోయిందట.

"హాల్లో కూర్చుంటే నిన్ను నేను చదువుకోనిస్తానా శేఖరం! వద్దు బాబూ! నువ్వు గదిలోనే కూర్చో" అన్నారు వెంకటరామయ్యగారు.

ప్రస్తుత విశేషం! చలపతి జంకుగొంకులు లేకుండా బీరువా తెరిచేస్తున్నాడు. బెరుకు బెరుకుగానే నేనా బీరువా అరలన్నీ పరకాయించి చూచాను. ఆడవాళ్ళ బట్టలు, స్నో సీసాలు, పౌడరు డబ్బాలు మొదలైన వస్తువులు కొన్ని కొత్తగా చోటు చేసుకున్న మాట నిజమేగాని ఆ బీరువాలో యిప్పుడు మచ్చుకొక అచ్చు కాగితమైనా కానరావడం లేదు!

సాయంకాలపు చల్లటి గాలికోసం ఊరిబయటకు షికారువెళ్ళి అక్కడొక చెరువుగట్టున కూర్చున్నాము. చలపతిని ఆశ్చర్యంలో ముంచి లేవనెత్తడానికి అదే తగిన

సమయమనిపించింది. "చూడు చలపతీ ఒక మాట అడుగుతాను. తటపటాయించకుండా జవాబు చెబుతావు గదూ" అన్నాను.

"ఏమిటో అడుగు..." మరింత నింపాదిగానే అన్నాడు చలపతి.

"మరేం లేదు "కామవర్ధన్" అంటూ ఓ రచయిత వుండేవాడు. ఒక ఏడాదినుంచీ అయిపులేకుండా మాయమయ్యాడు. అతడి ఆచూకీ నీకు తెలిసివుండాలి..."

ఒక క్షణంపాటు నా ముఖంలోకి తీక్షణంగా చూచి ఆ తరువాత విరగబడి నవ్వసాగాడు చలపతి. "ఆచూకీ తెలియకపోతే పోలీసులకు రిపోర్టివ్వలేకపోయావా రాజశేఖరం! ఎలా తెలిసింది బాబూ నీకు కామవర్ధన్‌ని గురించి? వాడికి దేవిడీమన్నా అయిందిలే. ఇక తిరిగిరాడు..."

నాకొక విషయం తెలిసింది. రహస్యం తెలిసిందిగదా అని చలపతిని లోకువ పరచడానికి వీల్లేదు. కొండంత ఆశ్చర్యాన్ని దిగమ్రింగి, తిరగబడినవాడితో మరింత సున్నితంగానే వ్యవహరించాలి. అందుకని అప్పటికప్పుడు ఒక అబద్ధాన్ని ఆసరాగా తీసుకున్నాను.

"అబ్బే, యిందులో పెద్ద ఇన్‌వెస్టిగేష నేముందోయ్ చలపతీ! కాళ్ళూ చేతులూ ముక్కూ మొగములాంటి అవయవాలన్నీ ఒక్కటే అయినా వాటి కలయికవల్ల ఏర్పడే ఆకృతుల్లో అనంతమైన వైవిధ్యం కనిపించడంలేదా. లోకంలో లక్షమంది రచయితలున్నారు. కానీ ఎవరి శైలి వాడిది. నా దగ్గర నువ్వు వ్రాసిన ఉత్తరాలు డజన్లకొద్దీ వున్నాయి. కాటావేసి చూసుకున్నానేమో, చప్పున గుర్తుపట్టేశాను..."

చలపతి ముఖం విప్పారింది– "అసలేం జరిగిందంటే శేఖరం – వద్దులే! ఇదేమైనా రామాయణమా ఆదినుంచీ చెప్పడానికి సంగ్రహంగానే ముగిస్తాను. అందుబాటులోకి రాని అనుభవం మనిషిని తహతహలాడిస్తుంది. వివశుణ్ణి జేసి వెర్రెక్కిస్తుంది. అందుబాటులోకి వచ్చిన తరువాత అదెంతటి ఆసామాన్యమైన అనుభవమైనా చప్పున చల్లారిపోయి వూరుకుంటుంది. అందుబాటులో లేని అనుభవానికి సంబంధించిన ఊహలోనుంచీ పుట్టినవాడు కామవర్ధన్! అనుభవం అందుబాటులోకి రాగానే వాడు తారున మరణించాడు! పూర్ ఫెలో! పుబ్బలో పుట్టి మఖలో పోయాడు పాపం. పోతేపోయాడేగానీ వాడు పోవడముందే శేఖరం, అదొక విషాదగాథ! పెళ్ళయిన కొత్తలో మేము బంధువుల వూళ్లన్నిటికీ వెళ్ళామని వ్రాశానుగదూ! ఆ తరువాత సుప్రసిద్ధ టూరింగ్ కేంద్రాలు కొన్నింటికి వెళ్ళాము. వెళ్ళిన ప్రతిచోట ఒక గది తీసుకుని బస చేశాము. రెండు మాసాల సెలవు రెండు క్షణాల్లా గడచిపోయింది. త్రిప్పటవల్ల ఒళ్ళు దస్సిపోయిన మాట వాస్తవం! మా ఊరికి తిరిగి వచ్చాము. ఎంతగా బద్ధకంగా వున్నా ఆఫీసుకు వెళ్ళక తప్పదు. ఆరోజే డ్యూటీలో జాయిను కావాలి మరి! సాయంకాలం ఆరు గంటలకుగానీ యింటికి తిరిగి రాలేకపోయాను. ఇంట్లో అడుగుపెట్టేసరికి కమురువాసన సోకింది. "ఏమిటమ్మా! కాగితాలు కాలుతున్నట్టున్నా యెందుకూ?" అని మా అమ్మ నడిగాను. "అదేం శోద్యమోరా బాబూ! కాయితాలైతే బాయిలర్ బాగా కాగుతుందట! తట్టెడు కాగితాలతో ఈ పని మొదలెట్టింది అమ్మాయి." "అదేం పని మాలతీ. బొగ్గులు

లేవా ఏమిటి!" అంటూ స్నానాల గదివైపు వెళ్ళాను. మాలతి మాట్లాడలేదు. తట్టలో ఒక పట్టెడు కాగితాలు మాత్రం మిగిలివున్నాయి. చరచరా నా గదిలోకి వెళ్ళి బీరువా తెరిచాను. మాలతిపైన నాకా క్షణాన కోపం వచ్చిన మాట నిజం. కానీ కోపాన్ని వెలిగ్రక్కడానికది తగిన సమయం కాదు. నా వెనువెంటనే లోపలికి వచ్చిన మాలతి అదే బీరువాలోనుంచీ టవల్ తీసుకుంటూ "నీళ్ళు బాగా కాగాయి స్నానం చేద్దురుగానీ రండి' అంటూ ఉపచార వాక్యం పలికింది. నీళ్ళు కాగటంకాదు మసలుతున్నాయి. చన్నీళ్ళు తోడుకునేసరికి పెద్ద చెవుల అండా నిండిపోయింది. ఒళ్ళలసిపోయేలా స్నానం చేశాను. మాలతి తన చేతిమీదుగా వంటచేసి పెట్టడానికదే తొలిరోజు. వంట దివ్యంగా కుదిరింది. సుష్టుగా భోజనం చేశాను. మంచంపై మేను వాల్చడమొక్కటే నాకు తెలుసు. కళ్ళు తెరిచేసరికి భళ్ళున తెల్లవారింది. ఎప్పుడు లేచిందోగానీ మాలతి. ఆపాటికి ముఖం కదుక్కునివచ్చి నిలువుటద్దం ఎదుట తిలకం దిద్దుకుంటోంది. హఠాత్తుగా నా నోటివెంట ఒక ప్రశ్న వెలువడింది. "రాత్రి నేను నిద్రలేచానుగానా మాలతీ" అన్నాను. మాలతి, బదులు చెప్పలేదు. మునిపంటితో పెదవిని నొక్కిపట్టటంద్వారా ఉబికివస్తున్న నవ్వాపుకుంటూ ఆమె "కాఫీ చల్లారిపోతోంది. తొందరగా ముఖం కదుక్కోండి" అంటూ తుర్రున బయటికి జారిపోయింది."

చెప్పడం ముగించి జరిగిన దానితో తనకేమీ సంబంధం లేనట్టు నిశ్శబ్దంగా కూర్చున్నాడు చలపతి. ఎవరు ముందుగా నవ్వుతారోనని పందెం వేసుకున్నట్టుగా వుంది పరిస్థితి. చివరకు నేను ఓడిపోయాను.

❖ 'వాణి', - సెప్టెంబర్, 1975. ❖

# ఎక్కవలసిన రైలు

పట్టపురాణి పురిటి నొప్పులవేళ శుభవార్తకోసం వేచి చూస్తున్న రాజుగారిలా శ్రీకంఠంగారు వరండాలో చెడ తిరిగేస్తున్నారు.

ముఖంలో చిరాకు, పెదవుల బిగింపులో పట్టుదల, అరమోడ్పు కళ్ళలో ఆందోళన-శ్రీకంఠంగారి తీరు చిత్రంగా వుంది.

అల్లంతదూరాన నేను కనిపించగానే ఆయన ముఖంలో ఆశాకిరణంలాంటిదేదో తళుక్కున మెరిసింది.

"నాయనా శేఖరం! వేయేళ్ళాయుస్సు నీకు! రా, కూర్చో" అంటూ బెంచీ చూపించారు శ్రీకంఠంగారు. కూర్చోగానే చరచరా దగ్గరికివచ్చి ఏదో రహస్యం చెబుతున్నట్టుగా "చూడు శేఖరం! నీ స్నేహితుడి ఆంతర్యమేమిటో బుర్రబించుకున్నా బోధపడకుండా వుంది నాకు! వరుసగా నాలుగైదు సంబంధాలను గురించి వివరించి, ఫోటోలుగూడా చూపెడితే వీడు పులకక, పలకక గుండ్రాయిలా కూర్చుంటే నేనేమనుకోవాలి చెప్పు! అసలింతకూ వీడికి పెళ్ళి చేసుకునే వుద్దేశం వుందా లేదా శేఖరం?" అంటూ సూటిగా ప్రశ్నించారు.

"అబ్బే. పెళ్లెందుకు చేసుకోడండీ! లేదంటే ప్రస్తుతానికి వ్యక్తిగతమైన అభ్యంతరాలేవైనా వుంటే వుండవచ్చు..." అంటూ నాకు తోచినంతలో ఓ కుంటి సంజాయిషీ తయారుచేశాను.

"వ్యక్తిగతమైన అభ్యంతరాలా! బాబ్బాబూ, నీకు పుణ్యం ఉంటుంది. వాడేమో పెట్టె, పరుపూ సర్దుకుంటున్నాడు. అదిగో జట్కా గూడా వచ్చేస్తోంది! ఎలాగూ నువ్వూ సమయానికి వచ్చావు..."

"స్టేషనుదాకా వెళ్ళి సాగనంపడానికే వచ్చాను. వాడి అభిప్రాయమేమిటో నిష్కర్షగా అడిగి తెలుసుకుంటాను..." అంటూ శ్రీకంఠంగారికి అభయమిచ్చాను.

అంతలో బూట్ల సవ్వడి వినిపించింది.

నీటుగా ముస్తాబై వెలుపలికి వచ్చిన కుమారుడివైపు చూడనట్టే చూస్తున్నారు. శ్రీకంఠంగారు. ఇప్పుడాయనవి అనిమిషనయనాలు. ఇప్పుడాయనది ప్రసన్నవదనం.

చేమంతి పువ్వుల ప్రోవులా పసిమి నిగ్గులతో మెరుస్తున్న ఆ కుర్రవాడు, పార్కులోని పూలమొక్కలా బొద్దుగా ముద్దుగావున్న ఆ పడుచువాడు ప్రయోజకుడై, పది రూకలార్జించడంతోబాటుగా గుణగణాల మూలంగా పదిమందిలో పేరెన్నికగన్న ఆ యువకుడు కన్నతండ్రి కన్నులకు విందుగా కాసేపు వరండాలో నిల్చున్నాడు.

జట్కా సాయిబు పెట్టె పరుపూ బండిలోకి చేరవేసి, "ఎక్కి కూచోండి బాబయ్యా" అన్నాడు.

"వెళ్లొస్తాను నాన్నా!" అన్నాడు కుమారుడు.

"వెళ్ళిరారా సాత్యకీ! వెళ్ళగానే జాబు రాస్తావుగదూ! అన్నట్టు రాబోయేది చలికాలం! వేడి నీళ్ళు త్రాగటం మంచిది. నువ్వేమిటో, నీ పనేమిటో అంతేగాని, వాళ్ళతో వీళ్ళతో చేరి వృథా కాలక్షేపాలు పెట్టుకోవద్దు..."

"అలాగే నాన్నా!" మెట్లు దిగసాగాడు సాత్యకి.

"రేపొకసారి కనిపిస్తావా శేఖరం" అంటూ హెచ్చరించారు శ్రీకంఠంగారు.

"తప్పకుండా కనిపిస్తానండి" అన్నాను.

జట్కాబండి కదిలింది.

కదిలిన జట్కా గేటు దాటుకుని తారురోడ్డుపై పరుగిడుతోంది.

"అది కాదురా సాత్యకీ! ఆరుమాసాలకొకసారి యింటికి వచ్చి వెళ్ళేవాడివి - అలా వచ్చినప్పుడైనా ముసలాయన మనసుకింత సంతృప్తిని చేకూర్చి వెళ్ళగూడదా?" నొచ్చుకున్నట్టుగా ప్రశ్నించాను.

"ఇప్పుడు నేనేమైనా ఎబ్బెట్టుగా ప్రవర్తించానా శేఖరం?" విస్మయంతో అడిగాడు సాత్యకి.

"లేకపోతే ఈ ముసుగులో గుద్దులాటలెందుకురా సాత్యకి? ఆ వివాహమన్న విషయంపట్ల నీ అభిప్రాయమేమిటో నిక్కచ్చిగా తేల్చి చెప్పగూడదూ" అన్నాను.

సాత్యకి ముఖం వెలవెలబోయింది. పెదవులు కొంచెం వణికాయిగూడా! ఒకటి రెండు క్షణాలు అలాగే నావైపు కొరకొర చూచి, "అలాగైతే నేనిలా సుఖంగా వున్నందుకు నీకుగూడా మనసొప్పడం లేదన్న మాట!" అన్నాడు సాత్యకి.

ఈసారి తెల్లబోవలసిన వంతు నాకే వచ్చింది.

"నాన్నగారి మాటకేంగానీ, నువ్వయినా నన్నర్థం చేసుకోలేవా శేఖరం? నా కింకా పాతికేళ్ళు నిండలేదు. జీవితంలో మొట్టమొదటి అయిదేళ్ళు బాల్యం. ఆపైన పూర్తిగా ఒకటిన్నర దశాబ్దం చదువు. రెండేళ్ళు నిరుద్యోగం. ఉద్యోగంలో చేరి రెండేళ్ళు కాలేదు. మొదటితేదీనాటి సాయంకాలానికి నూట యిరవై అయిదు రూపాయలు చేతిలోకొస్తే మొదటివారం ముగిసేసరికి నా జేబు ఖాళీ అయిపోతుంది. తన కాళ్ళపైన తాను నిలబడవచ్చునన్న నమ్మకమైనా లేనివాడికి పెళ్ళెందుకు శేఖరం? తాను దూరడానికే సందులేకపోతే యిక మెడకొక డోలుగూడానా! వద్దు బాబూ వద్దు. నాకిప్పుడెంతో హాయిగా వుంది. పెళ్లి అన్న ఆ పొరబాటు కాస్తా జరిగిపోయిన తర్వాత యింకా యింత హాయిగా, యింత నిశ్చింతగా గడిచిపోవడానికి వీలుంటుందా శేఖరం? ఉండదు. ఉండనే ఉండదు. ఎన్ని అవసరాలు, ఎన్ని అభ్యర్థనలు. ఎంత అలజడి! అమ్మో, ఆ దురవస్థను తలచుకుంటేనే నాకు భయంగా వుంటుంది. నువ్వు నూరు చెప్పు, వెయ్యి చెప్పు – ఉద్యోగంలో ఒకటి రెండు ప్రమోషన్లు లభించి, ఈ ఓటి జీవితానికి గట్టి పునాదులేర్పడే దాకా నేను పెళ్ళిమాట తలపెట్టను..."

ఇదివరకెప్పుడో ఒక పెళ్ళాంతో కాపురంచేసినంత అనుభవజ్ఞానంతో సాత్యకి వెల్లడించిన అభిప్రాయాన్ని విన్నమీదట నేనించుమించుగా స్తబ్ధుడినైపోయాను. అంతటి వివేకవంతుడితో వాగ్వాదానికి పూనుకుని వాడి వాదాన్ని పూర్వపక్షం చేయడం సులభసాధ్యం కాదని నాకు తెలుసు. ఎదుటివాడు మరీ అంతటి మందమతి అయితే తప్ప – ఇంతకంటె విశదీకరించవలసిన అవసరం లేదన్నట్టుగా పరుపుచుట్టపైకి వ్రాలిపోయి, కాళ్ళు చాపుకుని సాత్యకి జట్కాలోనే 'అనంతశయనం' సవరించేశాడు.

ఇంతకూ సాత్యకి త్వరగా పెళ్లి చేసుకున్నందువల్ల నాకు కలగబోయే ప్రయోజనం గానీ, వాడి పెళ్ళి విషయంలో ఆలస్యం జరిగితే నాకు వాటిల్లే నష్టంగానీ ఏమీలేదు. నాకు కావలసిందల్లా వాడి అభిప్రాయం - అదీ శ్రీకంఠంగారితో విన్నవించుకోటానికీ! వాడి అభిప్రాయమెలాగూ తెలిసిపోయింది గనుక, అంతటితో ఆ ప్రసక్తిని కట్టిపెట్టడమే సమంజసమనుకున్నాను.

ఉన్నట్టుండి జట్కాబండి ఆగిపోవడంతో ఆలోచనల గొలుసుకట్టు పుటుక్కున తెగిపోయి ఎట్టఎదుట రైల్వేస్టేషను ప్రత్యక్షమైంది. సామాన్లను ప్లాట్‌ఫారంపైకి చేరవేసి జట్కా సాయిబు సెలవు తీసుకున్నాడు. రైలు స్టేషనులోకి రావలసిన నిర్ణీత సమయానికింక పదినిమిషాలకన్నా వ్యవధిలేదు. సాధారణంగా ఆ వేళలప్పుడు స్టేషను పెళ్లివారిల్లులా సందడికి నిలయమై వుండడం మామూలు. ఇప్పుడైనా జనస్తోమత తక్కువగా లేదుగానీ, ఆ వున్న జనంలో ప్రయాణోత్సాహంగానీ, యాత్రానందంగానీ లీలగానైనా కనిపించడం లేదు. రైల్వే ప్రయాణం చేయడంకన్నా రైలుకోసం వేచి చూడడమే ఆనందకరమన్నట్టుగా వాళ్లెక్కడివాళ్లక్కడ ప్లాట్‌ఫారంపైనే బిచాణా సర్దుకున్నారు. దుప్పట్లు కప్పుకున్నారు!

వాకబు చేయగా తెలిసింది - ఏడు గంటల రైలు తొమ్మిది పదిహేనుకుగానీ స్టేషనుకు రాబోవడం లేదనీ!

సాత్యకి దిగాలుపడిపోయాడు. “చూచావా శేఖరం! నేనెప్పుడు బయల్దేరినా యింతే!” అంటూ బుంగముఖం పెట్టేశాడు.

“ఓపినంత జీవితం ముందరుండగా ఈమాత్రం ఆలస్యానికి తట్టుకోలేకపోతే ఎలాగురా సాత్యకీ! ఐనా రెండుగంటలంటే ఎంత - ఈ చివరినుండి ఆ చివరిదాకా ప్లాట్‌ఫారంపైన నాలుగుసార్లు పచార్లు చేసేసరికి రెండు గంటలు రెండు నిముషాల్లా గడిచిపోవూ!”

-చిత్రమైన మనిషి సాత్యకి. తనను సాగనంపడానికి వచ్చిన నేరానికి రెండు గంటలసేపు స్టేషనులో పడిగాపులు పడబోతున్నందుకు నాపైన యించుక సానుభూతి ప్రకటించాలన్న స్పృహగూడా వాడికి లేకపోయింది. మీదుమిక్కిలి రైలు రావడంలో వాటిల్లిన విలంబనానికి నేనే పూచీదారునైనట్టు వాడికి నేను క్షమాపణలాంటి సంజాయిషీ చెప్పుకోవలసి వచ్చింది!

చలికాలపు రోజులు. ఎత్తయిన పడమటికొండచాటున ఆరుగంటలకే సూర్యు డస్తమించిన కొద్ది నిమిషాలకే చీకట్లు చిమ్మనగ్రోవితో చిమ్మినట్లు లోకాన్ని క్రమ్ముకున్నాయి. ఏడుగంటలకల్లా రోదసీకుహరం అంధకార బంధురమైపోయింది. ప్లాట్‌ఫారం పొడుగునా విద్యుద్దీపాలు వెలుగుతున్నమాట నిజమే! కానీ దీపకాంతుల కడ్డంగా చెట్లు కొన్ని దట్టమైన నీడలు పరచుకుని నిమ్మళంగా నిలిచివున్నాయి. చెట్లు లేనిచోట అటూ యిటూ తిరుగుతున్న మానవాకారాలు వెలుగును చీల్చి చిందరవందర చేస్తున్నాయి. అడివిలాంటి అంధకారంలో, కోయవాళ్ళు వేసుకున్న నెగళ్ళలా భాసిస్తున్న వెలుగుల కడ్డంగాపడి యిదివరకు నేను సూచించినట్టుగా మేమిద్దరమూ ప్లాట్‌ఫారంపైన పచార్లు ప్రారంభించేశాము. ఆఫీసులో అధికారిగారి ముఖభంగిమనుబట్టి అతడి యింట్లో అమ్మగారి ధోరణిని ఊహింపనేర్చిన

తన సహోద్యోగి బుద్ధిచాతుర్యం దగ్గరినుంచీ మొదలుపెట్టి రకరకాలైన తన ఉద్యోగానుభవాలను గురించి ఏకరువు పెడుతున్నాడు సాత్యకి.

ఉన్నట్టుండి సాత్యకి వాక్ప్రవాహం ఆగిపోయింది. "ఎవరో పిలుస్తున్నట్టున్నారు" అంటూ అతడు ఆగిపోయాడు.

"ఎవరిని?" అంటూ వెనుదిరిగి చూచాను.

"నిన్నేనోయ్ శేఖరం!" కానుగచెట్టు క్రిందినుంచీ పిలుపు వినిపించింది.

నీడలో ఆకృతి సరిగ్గా కనిపించడంలేదు. ఐనా ఆ గొంతుక నాకు బాగా గుర్తు. పిలుస్తున్న వ్యక్తి ఉమాపతిగారు.

"ఎందాకా బయల్దేరావు శేఖరం! రా. వచ్చి కూర్చో. రైలు రావడంలో ఆలస్యం జరిగినందుకు కాదుకానీ, యిక్కడొక పలుకు తోడులేక పోయినందుకు నాకు చాలా యిబ్బందిగా వుంది. ఇంతసేపటికి నువ్వు కనిపించావు. అన్నట్టు నిన్ను నీడలా అంటిపెట్టుకునివున్న అబ్బాయి ఎవరు శేఖరం?"

"అదేమిటండీ మేష్టరుగారూ! మీ శిష్యుణ్ణే గుర్తుపట్టలేరా మీరు! ఈ మధ్య వీడు కాస్త కొనలుసాచి ననలు తొడిగిన మాట వాస్తవమే! కానీ పోల్చుకోడానికి వీల్లేనంతగా వీడిలో మార్పొచ్చిందంటే నేను నమ్మలేను..." అన్నాను.

ఉమాపతిగారు ఒకటి రెండు క్షణాల్లో సాత్యకిని గుర్తుపట్టేశారు- "ఓహో! శ్రీకంఠంగారి అబ్బాయిగదూ! ఎంతవాడి వయ్యావురా సాత్యకీ! నిండుచెరువులో నీళ్ళే లేవన్నట్టుగా వీడిలో మార్పు లేదంటావేమిటి శేఖరం? దస్కులో కూర్చుంటే తలపైకి కనిపించేదిగాదు. క్లాసుకేగాదు, స్కూలుకంతా పొట్టివాడు సాత్యకి. పొట్టివాడికి పుట్టెడు బుద్ధులంటారు గనుక "ఒరే పుట్టెడు బుద్ధులూ!" అని నేను సాత్యకిని ముద్దుగా పిలిచేవాణ్ణి. నిన్నగాక మొన్ననే జరిగినట్టున్నా, అది పదేళ్ళనాటి మాట! అన్నట్టు యిప్పుడెక్కడున్నాడు? ఏం చేస్తున్నాడు? ఏం కథ!" అంటూ ఒక్కుమ్మడిగా పాత శిష్యుణ్ణి పరామర్శించేశారు ఉమాపతిగారు.

"వాడికేమండీ! అదృష్టవంతుడు. లక్షణమైన ప్రభుత్వోద్యోగం. సత్రంలో కాదుగానీ హోటల్లో భోజనం, మఠంలోకాదుగానీ గదిలో ఒంటరిగా నివాసం. వాడి సంపాదన వాడికి సరిపోతే చాలుననుకునే తల్లిదండ్రులు. ఇన్ని సదుపాయాలకు తోడుగా – 'చుట్టాలు, శత్రువులు, స్నేహితులు, ఋణస్తులు. కనుక మానవ సమాజంతో సన్నిహిత సంబంధాలు అనవసరమేగాక అపాయకరంగూడా' ననుకునే మనస్తత్వం మీ శిష్యునిది. ఇక ప్రపంచంలో వీడి జీవయాత్రకు ఢోకా ఏముంటుందండీ మేష్టరుగారూ!"

"అలాగా! అయితే సాత్యకి ప్రయోజకుడై పోయాడన్నమాట!" అంటూ నిండుగా నవ్వేశారు ఉమాపతిగారు. నవ్వుతూ "ఇంతటి బుద్ధిమంతుణ్ణి జామాతగా స్వీకరించడానికి ఆడపిల్లలను గన్న తల్లిదండ్రులు పోటీలకుపైన పోటీలుగా యింకా రంగంలోకి దిగలేదా శేఖరం?" అని ప్రశ్నించారు.

ఈ ప్రశ్నతో కథ మళ్ళీ ఎక్కడైతే బయల్దేరిందో అక్కడికే వచ్చి చేరింది!

"నా పెళ్ళిని గురించి నాకులేని తొందర లోకానికెందుకండీ మేష్టరుగారూ!" ఇంచుక విసురుగానే ప్రశ్నించాడు సాత్యకి.

"ఎందుకంటావా సాత్యా! చెబుతాను విను –" అంటూ నింపాదిగా ప్రారంభించారు ఉమాపతిగారు, "మానవుడు సంఘజీవి. వివాహం ఒక సాంఘిక నియమం. ప్రతి మానవుడూ ఎప్పుడో ఒకప్పుడు తప్పనిసరిగా శిరసావహింపవలసిన సాంఘిక నియమం వివాహం. ఆ వివాహమన్న సాంఘిక నియమం ఓ రైలులాంటిదనుకో సాత్యకీ! ఒకప్పుడు నీ అంతట నువ్వుగా ఆ రైలును వదిలేస్తే మరొకప్పుడది నువ్వందుకోవాలన్నా అందకుండా స్టేషను దాటిపోతుంది. ఆ విధంగా రైలుదప్పిన ప్రయాణీకులు సంఘంలో బోసికొయ్యల్లా మిగిలిపోయి జీవితంలో తీరిగ్గా విచారిస్తూ కూర్చోవలసి వస్తుంది..."

తమలపాకుతో ఆడబోయిన సరసానికి తలుపు చెక్కతో పరిహారం లభించినట్టయి సాత్యకి నిర్ఘాంతపోయాడు.

మా ముగ్గురి నడుమ ఒక నిమిషం నిశ్శబ్దంగా గడచిపోయింది.

"చూడండీ మేష్టరుగారూ! మీరు వివాహానికి సంబంధించిన మీ సిద్ధాంతాన్ని వీలైనంత సంగ్రహంగా చెప్పేశారు. మరికొంత వ్యాఖ్యానం అవసరమేమోనని నా అనుమానం..." అంటూ సాభిప్రాయంగా ఉమాపతిగారివైపు చూచాను.

కానుగచెట్టు మొదలుకి చేరగిలబడి కూర్చున్న ఉమాపతిగారు కాస్తా ముందుకు జరిగి నిటారుగా కూర్చుంటూ "వ్యాఖ్యాన మెందుకుగానీ, ఓ కథ చెబుతాను వింటావా శేఖరం!" అన్నారు.

"అంతకంటేనా మేష్టరుగారూ! కథలంటే నాకు చాలా యిష్టం!" అన్నాను.

"కథలంటే నాకు అయిష్టం! మీరు మీ సిద్ధాంతాన్ని బలపరచుకోడానికి ఓ కథను కల్పించి చెబుతే నేనొప్పుకోను..." అన్నాడు సాత్యకి.

"కల్పితమైతే ఒప్పుకోవు. కానీ నిజమైతే ఒప్పుకోక ఏం చేస్తావు సాత్యకి! ఐనా యిప్పటికిప్పుడు ఓ కథను కల్పించి చెప్పడానికి నేనేమీ కథకుణ్ణి కాదుకదా! కాదని నీకు తెలుసు. ఇప్పుడు నేను నీకు చెప్పదలచుకున్నది మా చలపతి గురించి. మా ఆవిడకు పినతండ్రి కుమారుడు గనుక వాడు నాకు వేలు విడిచిన బావమరిది. నేను వాడిని గురించిన వర్తమానాలను విని అయిదేళ్లయింది. గడచిన అయిదేళ్లలో వాడేం చేశాడో, ఎక్కడున్నాడో నాకు తెలియదు. హఠాత్తుగా ఈరోజు ఉదయం వాడి దగ్గరినుంచీ నాకొక ఉత్తరం వచ్చింది. తానీ రైల్లో అనంతపురం వెళ్తున్నాననీ, స్టేషనుకువచ్చి తనను కలుసుకోవలసిందనీ ఉత్తరంలో వాడు మరీ మరీ ప్రాధేయపడుతూ వ్రాశాడు. ఉత్తరం జేబులో వుంది. మనిషి రైల్లో రానున్నాడు. నా కథ నిజమని నమ్మడానికి ఈ రెండు ఋజువులు చాలవా సాత్యకీ!"

నిస్సహాయకరమైన పరిస్థితిలో పడినవాడిలా సాత్యకి నిరుత్తరుడై కూర్చున్నాడు. ఉమాపతిగారు చెప్పసాగారు.

"ముప్పయి రెండేళ్ళవాడు చలపతి. వాడి ప్రస్తుత నివాసం బెంగుళూరు. అయిదారేళ్ళనుంచీ మా బంధులోకానికి సంబంధించినంతవరకూ అజ్ఞాతంగా వుండి పోయిన చలపతి అంతకుమునుపు మా కుటుంబానికెంతో సన్నిహితుడు. అంగిట బెల్లమూ, ఆత్మలో విషమూ వుంచుకున్నట్టు తోచిన ప్రతి వ్యక్తినీ శత్రువుగా పరిగణించి, నచ్చని

మాటను వెంటనే ఖండించి, ఎట్టి క్లిష్ట పరిస్థితిలోనైనా ఆదర్శాల కంటిపెట్టుకుని లేని చిక్కుల్ని జీవితంలోకి కొని తెచ్చుకుంటూ మొండిగా బ్రతకడానికి అలవాటుపడిన దురదృష్టవంతుడు చలపతి. కుటుంబానికి వాడు జ్యేష్ఠుడు. గతంనుంచీ గుణపాఠాలు నేర్చుకోక, భవిష్యత్తును గురించి తలపెట్టక వర్తమానంలో కాళ్ళు చాపుకుని గోళ్ళు గిల్లుకుంటూ కూర్చునే బద్ధకస్తులైన తల్లిదండ్రుల నిర్వాకంలో ఆ కుటుంబం ఏనాడో చితికిపోయింది. మిగిలిన స్థిరాస్తి ఓ తాటాకులపాక. మిగిలిన చరాస్తి దోసపాదులాంటి సంతానం. వాళ్లదొక కుగ్రామం. ఆ ఊరికి రెండు మైళ్ళదూరంలోగానీ, ప్రాథమిక పాఠశాల లేదు. ఏడుమైళ్ళ దూరంలోగానీ హైస్కూలులేదు. అటువంటి కుటుంబంలోపుట్టి, అలాంటి పరిస్థితుల మధ్య పెరుగుతూ చలపతి స్కూల్ ఫైనల్‌దాకా చదువుకోగలిగాడంటే అందుకు అతడి పట్టుదల ఒక్కటి తప్పితే మరొక్క దోహదం కనిపించదు. బండరాళ్ళ మధ్య నెరియలో రావిచెట్టు పుట్టి పెరగడంలేదా శేఖరం! ఆ రావిచెట్టు లాంటివాడు చలపతి. ప్రతిరోజూ ఏడుమైళ్ళ దూరం నడిచి అతడు హైస్కూల్లో చదువుకున్నాడు. పరీక్షలో వచ్చిన మార్కులే అతనికి ట్రెయినింగ్ స్కూల్లో సీటును సంపాదించి పెట్టాయి. పద్దెనిమిది రూపాయల నెలసరి స్టయిఫండుతో అతడి జీవితంలో రెండేళ్ళు యిట్టే దొర్లిపోయాయి.

మరుసటి సంవత్సరం అతడు ఉపాధ్యాయుడుగా కొత్త జీవితం ప్రారంభించాడు.

ఏ పాఠశాలలోనైతే చలపతి ఉపాధ్యాయుడిగా చేరాడో ఆ పాఠశాల మేనేజరు పేరు శంకరయ్యగారు. ఊరికి దూరంగా ఉన్నతమైన ప్రహరీగోడల నడుమ బడికోసం పాకలు వేయించుకుని, నివాసంకోసం ఓ పెంకుటిల్లు నిర్మించుకుని అదొక చిన్న రాజ్యంగా, ఆ రాజ్యానికి తానే నిర్మకుట చక్రవర్తిగా జీవించేస్తున్న శంకరయ్యగారు చలపతిని దగ్గరికి చేరదీసి అతనికి తన రాజ్యంలో ఉచిత పౌరసత్వం ప్రసాదించారు. భోజనం, నిద్ర, ఉద్యోగం, విశ్రాంతి సర్వేసమస్తం అక్కడే జరిగిపోగలవు. గనుక చలపతికింక మిగిలిన ప్రపంచాన్ని గురించిన ప్రసక్తి బొత్తిగా అనవసరమన్నారు.

ఎంతటి చిన్న పనిచేసినా, అందుకొక పెద్ద ప్రయోజనాన్ని ఆశించే దూరాలోచనా పరులు శంకరయ్యగారు. స్వప్రయోజనంకోసం ఆయన చేసినన్ని అవకతవకలు ఈ యిలాతలంపైన మరెవ్వరూ చేసి వుండరు. తోడిమానవుల మనోదౌర్బల్యం పట్ల ఆయనకు నమ్మకం ఎక్కువ. వ్రేలెత్తి తప్పును చూపెట్టగలిగే వరకూ ఆయన మనుషుల్ని దగ్గరకు తీసి తలపై కెక్కించుకునేవాడు. తప్పు కనిపించిన తర్వాత నానాహింసలతో వాళ్ళను ముప్పుతిప్పలు పెట్టేవాడు. ఆ హింసాకాండకు తట్టుకోలేక పారిపోయిన వాళ్ళు పారిపోగా మిగిలిన వాళ్ళు ఆయన దయాదాక్షిణ్యాలపైన ఆధారపడి కుక్కిన పేనుల్లా పడివుండేవారు.

అలాంటి కుక్కిన పేనుల్లో ఒకమ్మాయి పేరు సావిత్రి.

సదరు సావిత్రిని చలపతికి కట్టబెట్టదలచుకున్నారు శంకరయ్యగారు.

ఆయన తన ఉద్దేశాన్ని వీలైనంత స్పష్టంగా చలపతితో చెప్పేశారు. అంతటితో ఊరుకోకుండా తామలా ఉద్దేశించడానికి కారణాలనుగూడా విశదీకరించారు – స్వజనంతోనూ, స్వకుటుంబంతోనూ సంబంధాలు త్రెంచుకుని తన బ్రతుకుదెరువు తానే చూసుకున్న సమర్థురాలు సావిత్రి. ఆమెను వివాహమాడినవాడికి బంధువుల బెడద

వుండదు. ఇహలోకంలో సుఖజీవనోపాధికి ముఖ్యంగా కావలసినది డబ్బు. సావిత్రి హైయ్యరుగ్రేడు పంతులమ్మ. ఆమెను పెళ్ళాడినట్టయితే ప్రతినెలా ఓ చెక్కును బ్యాంకులో మార్చుకున్నట్టుగా ఆవిడ జీతంరాళ్ళను జేబులో వేసుకోవచ్చు...

ఈ ప్రతిపాదన బయల్దేరిన నాటినుంచీ శంకరయ్యగారి కుటుంబంలో చలపతి స్థానం విచిత్రంగా మారిపోయింది. అందాకా ఒక ఉద్యోగిగా లేదా ఆశ్రితుడుగా భావింపబడుతూ వచ్చిన చలపతి ఒక పెట్టున బంధుసత్తముడైపోయాడు. సావిత్రిని అక్కయ్యా అని పిలవడానికి అలవాటుపడిన కుర్రవాడు చలపతిని బావా అని వ్యవహరింపసాగాడు. స్వయంగా సావిత్రి వాలకంలో సైతం అదొక రకమైన హావభావాలు విజృంభించాయి. ఒక్కమాటలో చెప్పాలంటే చలపతిని చుట్టుముట్టి వున్న వాతావరణంలో నుంచీ వలపు పొలపు దెలిపే మారుతాలు వుండి వుండి రివ్వురివ్వున వీయసాగాయి.

కథ అలాంటి రసవత్తరఘట్టంలో వుండగా ఒకనాడు చలపతి నన్ను కలుసుకుని తన కర్తవ్యాన్ని గురించి సలహా అడిగాడు–"

పొట్లం విప్పి వక్కపొడి నోట్లో వేసుకుంటూ, "ఆ పరిస్థితిలో నువ్వయితే ఏమని సలహా యిచ్చేవాడివి సాత్యకీ?" అన్నాడు ఉమాపతిగారు.

"నేనా! ఏమని సలహా యిచ్చేవాడినంటారా! ఎవరికైనా సరే, ఎప్పుడైనా సరే – నా సలహా ఒక్కటే! వివాహమంటే ఏమిటి? అది వూరకే వున్న ప్రాణానికి మానవుడు తెచ్చిపెట్టుకునే ఉపద్రవం." కుండబద్దలు కొట్టినట్టుగా అన్నాడు సాత్యకి.

"కానీ జిహ్వకొక రుచి, పుర్రెకొక బుద్ధి కదటయ్యా సాత్యకీ! మీదు మిక్కిలి చలపతికి శ్రేయోభిలాషిని నేను! పుట్టినదాదిగా చలపతిని కష్టాలే వరించాయి. మోస్తున్నకొద్దీ ఆదర్శాల బరువు పెరిగేదే కానీ, తరిగేదికాదు. ఆదర్శాలు, సహనాలు, త్యాగాలు యిత్యాదుల మూలంగా సుఖపడిన మానవుడు మన ఎరుకలో లేడు. తనకు మాలిన ధర్మం ఎవరి విషయంలోనైనా మొదలు చెడ్డ బేరమే! వివాహమన్నది మానవుడు తప్పనిసరిగా అందుకోవలసిన రైలు. అందుకోసమని ఎవరో ఒకరు తమ స్వంత ఖర్చులతో టికెట్టు కొనిపెట్టి సర్వసౌకర్య సముపేతమైన సెకండు క్లాసు పెట్టెలో ప్రయాణానికి వెరవు కల్పిస్తే? 'ఈ రైలు నాకొద్దు, నేనిప్పుడు బయల్దేరను' అనడం ఏం న్యాయం. న్యాయాన్యాయాల మాట దేవుడెరుగు! అలా నిరాకరించడం నిస్సందేహంగా మూర్ఖత్వమని మాత్రం అనిపించుకుంటుంది.

"విన్నావా సాత్యకీ! ఇదీ నా సలహా! ఈ సలహాను సావధానంగా విన్నాడు చలపతి."

"విని ఏమన్నాడు?" సాత్యకి కుతూహలంతో ప్రశ్నించాడు.

"ఏమన్నాడు! తాను బట్టిన కుందేటికి మూడే కాళ్ళన్నాడు – 'ఐతే నువ్వు చెప్పేదేమిటి బావా! నన్ను శంకరయ్యగారు విసిరిన వలలో తగులుకోమంటావా నువ్వు! బహుశా శంకరయ్యగారి మాటలో నిక్షిప్తమైన గూఢార్థం అవగతమై వుండదు నీకు! ఆయన ఏమన్నాడు? సావిత్రి అనే ఆ అమ్మాయికి స్వకుటుంబంతో సంబంధాలు లేవన్నాడు. ఆమెను పెళ్ళాడిన వాడికి బంధువుల బెడద వుండదన్నాడు. అంటే ఏమన్నమాట! ఆ పెళ్ళి సంబంధానికి ఒప్పుకున్నట్టయితే నేను నా వాళ్ళతో తెగతెంపులు చేసుకోడానికి

సిద్ధంగా వుండాలన్నమాట! పోగా శంకరయ్యగారి మాటల్లో మనం జాగ్రత్తగా గమనించవలసిన అంశం మరొకటి వుంది. ఆయన అమ్మాయి అందచందాలను గురించి చెప్పాడు కాదు. గుణగణాలను గురించి చెప్పాడు కాదు. లేదంటే ఆమె సంపాదనా పరురాలని మాత్రం ఆయన నొక్కి చెప్పాడు. ఆ సంపాదన ఆమెను పెళ్ళాడిన వాడికి దక్కుతుందన్నాడు. డబ్బు ఎవరికైనా అవసరమే! అలాగని నేను దానికోసం కక్కుర్తిపడలేను. ప్రతి అడుగుజాడ ఒక ఆత్మీయతాముద్రగా అర్ధాంగి జీవితోద్యానంలోనికి వసంతలక్ష్మిలా నడిచి రావాలని చెబుతారు. జీవితం స్వగృహంలాంటిదైతే పెళ్ళికాగానే మగవాడు అందులో సగం వాటాను ఖాళీచేసి, అర్ధాంగికి యిచ్చుకోవలసి వుంటుంది. కేవలం డబ్బు కోసమని నేను నా జీవితంలో సగం వాటాను ఖాళీచేసి అద్దె కిచ్చుకోలేను. అమ్ముడుపోలేను. నీ సలహాకొక నమస్కారం!' అని తిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు చలపతి..."

శ్రోతలమైన మేము కథను జీర్ణించుకోడానికి వీలుగా కాసేపు మౌనం వహించారు ఉమాపతిగారు.

"తరువాత ఏమైంది?" అని ఈసారి నేను ప్రశ్నించాను.

"నిజం చెప్పాలిగదా శేఖరం! నాకు చలపతిపట్ల పట్టరానంత కోపం వచ్చింది. అతడు శంకరయ్యగారి సలహాను తోసిరాజన్నాడు. ఆ పరిసరాలు, పరిస్థితులు తనకు సరిపడటంలేదన్న సాకుతో ఉద్యోగానికి సైతం రాజీనామా యిచ్చాడు. మళ్ళీ తిరిగివెళ్ళి గచ్చపొదల పొదరిల్లులాంటి స్వకుటుంబంలో తగులుకున్నాడు. స్వగ్రామానికి దగ్గర్లో కొత్తగా ఏర్పాటైన ఒకానొక హైస్కూల్లో అతనికి ఉద్యోగం దొరికింది. తల్లిదండ్రులను సుఖపెట్టడంలోనుంచీ, తమ్ముళ్లను చదివించడంలోకి వ్యాపించి, చెల్లెళ్ళకు పెళ్ళి చేయడందాకా విజృంభించి ఊపిరి త్రిప్పుకోడానికి వీల్లేకుండా ఆదర్శాల నాగపాశాలు అతణ్ణి పెనవేసుకున్నాయి. ఆమనీషాలవదుర్విదగ్ధుడి జీవితానికిక సుఖకాంతులు లేవనుకోడంకన్నా అప్పుడు చలపతిని గురించి మరొక ఊహ నాకు తట్టనే లేదు...

అంతలో ఒక వార్త కర్ణాకర్ణిగా వినవచ్చి నాకు దిగ్భ్రాంతిని కలిగించింది.

ఓపినంత బాదరబందీని తలపైన వేసుకుని అంతటితో వూరుకున్నాడుగాదు చలపతి. అతడి ఆదర్శశీలానికి గిలిగింతలు పెట్టే సంఘటనలు అక్కడ మళ్ళీ ప్రారంభమయ్యాయి. వెనుకా ముందూ చూడకుండా అతడొక ఘనకార్యం చేయడానికి తలపడ్డాడు. పేదవాడికోపం పెదవికి చేటైనప్పుడు పేదవాడి ఆదర్శం మాత్రం అతడి ముందరికాళ్ళకు బంధం కాదా సాత్యకీ! బంధమే! సంఘం మన చెప్పుచేతల్లోనిదిగాదు. సాంప్రదాయం ఈనాటిది గాదు. ఎవడిష్టం వచ్చినట్టు వాడు ప్రవర్తిస్తే అవి చూస్తూ వూరుకోవు. సంఘం చలపతిపైకి కత్తులు దూసింది. సాంప్రదాయం అతడిపైన నిప్పులు చల్లింది. పాఠశాల నిర్వాహకవర్గం అతడిపైన ఆంక్షలు విధించింది. అతడు నమ్మిన సత్యానికి అతడి కళ్ళఎదుటనే శృంగభంగం జరిగింది. తలపైన పిడుగులుపడినట్టయి అధోలోకాలకి కృంగిపోయాడు చలపతి. అతడి మనసు చెడిపోయింది. ఇంచుమించుగా అతడు పిచ్చివాడైపోయాడు..."

"ఇంతకూ చలపతి చేయబూనుకున్న ఘనకార్యం ఏమిటండీ మేష్టరుగారూ!" సాత్యకి ప్రశ్నలో ఉత్కంఠ ధ్వనించింది.

"ఏముంది! ఏది చేయగూడదో అదే చేశాడు చలపతి. అతడొక అమ్మాయిని ప్రేమించనే ప్రేమించాడు..."

"ప్రేమిస్తేనేం! అది తప్పా?" సాత్యకి ముఖంలో ఆశ్చర్యం!

"తప్పా, తప్పున్నరా! ఒళ్లెరుగని శివమా సాత్యకీ! ప్రేమ గుడ్డిది అన్నారు కవులు! అంటే మాత్రం? కావ్యాలలోని సత్యాలు గవర్నమెంటు వారి ఉత్తర్వులా సాత్యకీ? కులాంతర వివాహానికి ఎవడొప్పుకుంటాడు? ఆ అమ్మాయి పేరు అమృత. చలపతి పనిచేస్తున్న హైస్కూల్లో చివర తరగతిలోవున్న విద్యార్థిని. వలచింది, వలపించుకున్నది. అదంతా పాలపొంగులాంటి భావోద్విగ్నత. ఒక అందమైన భ్రమ. ఒక తీయనైన కల. సహజమే మరి! ప్రేమికులకు వాళ్ల మధ్యనున్న అగాధం ఓ చిన్న పిల్లకాలవలా కనిపిస్తుంది. ఆ పరస్పర విలోకనాలు, ఆ ఊహాగానాలు, ఆ ప్రేమలేఖలు అవే వాళ్ళకు నిజమైన ప్రపంచమై, నిజమైన ప్రపంచం వాళ్ల పాలిటికి అబద్ధమైపోతుంది. కానీ ఎంతకాలమైనా కలగంటూ కూర్చోడం సంభవమా సాత్యకీ? ఆ ప్రణయ వ్యవహారాన్ని లోకం పసిగట్టింది. అనతికాలంలోనే ఆ అమ్మాయి చదువుకు స్వస్తి చెప్పబడింది. పట్టుపట్టుమని పదినాళ్ళల్లోనే ఆ శుభకార్యం కాస్తా జరిగిపోయి ఆమె అత్తగారింటికి వెళ్ళిపోయింది."

వేడిగా నిట్టూర్చాడు సాత్యకి.

"ఇంచుమించుగా చలపతి ఉన్మత్తుడైపోయాడని చెప్పానా సాత్యకీ? మాసిన దుస్తులు, పెరిగిన గడ్డం, చింపిరితల. ఆరునెలల దేశ సంచారం. ఆ సంచారానికి చివర ఓ నెలరోజులపాటు అతడు మా యింట్లోనే వుండిపోయాడు. క్రమక్రమంగా మామూలు మనిషయ్యాడు. మళ్ళీ ఒకచోట అతనికి ఉద్యోగం దొరికింది. తన జీవితంలో యిక ప్రేమకు చోటు లేదనేవాడు. కానీ వివాహమన్నది మానవుడి ముఖ్యావసరాల్లో ఒకటి. ఆప్తులందరూ పనిగట్టుకుని చలపతికి నచ్చచెప్పి పెళ్ళికి ఒప్పించి చివరికొక సంబంధాన్ని కూడా నిశ్చయం చేసేశారు..."

పరధ్యానంలో పడిపోయినట్టుగా ఉమాపతిగారు మళ్లీ మౌనం సాధింపసాగారు.

"చెప్పండి మేష్టరుగారూ!" బ్రతిమాలుకున్నట్టుగా అడిగాడు సాత్యకి!

"ఆ మూడో అమ్మాయి పేరు జలజ. పెళ్ళికిక వారం రోజుల వ్యవధి వుందనగా ఆ జలజ దగ్గరినుంచీ చలపతికొక జాబు చేరింది. జాబులో ఆమె తన హృదయం యిదివరకే ఒకరికి అర్పితమై పోయిందని సూచించి, ఆ అదృష్టవంతుడి నామధేయాన్ని గూడా పేర్కొని, అతని తోడితే తనకు లోకమనీ, అలా జరగకపోతే ఆత్మహత్యే శరణ్యమని ఉల్లేఖించింది. తీరా పెళ్ళినాటికి చలపతి పత్తాలేడు. అతడు వంకీకి తగిలించి వెళ్ళిన చొక్కాను తీసి చూస్తే జేబులో ఒక జాబు మాత్రం ప్రత్యక్షమైంది. జలజ అనే ఆ అమ్మాయి ఎవరినైతే వరించిందో... అతడినే వరించడానికి వీలుగా తానీ విధంగా పరారీ కావలసి వచ్చిందన్నదే ఆ జాబులోని సారాంశం..."

రైలు అవుటయినందుకు సూచనగా టంగు టంగుమని గంట మ్రోగింది.

జేబులోనుంచీ పచ్చటి కాగితం పైకి తీశారు ఉమాపతిగారు. "భట్టి విక్రమాదిత్యుల కథల్లో చీరలు, రవికలూ గూడా కథలు చెప్పడంలేదా సాత్యకీ! అలాగే చలపతి యింటినుంచీ

పరారీ చిత్తగించిన తర్వాత యిటీవలి అయిదేళ్ళల్లో జరిగిన కథను మనకీ ఉత్తరమే చెబుతుంది–" మళ్ళీ జుబ్బా జేబులు తడువుకుంటూ, "కానైతే నేను నా కళ్ళద్దాలను యింటిదగ్గరే మరచిపోయి వచ్చినట్టున్నాను" అన్నారు ఉమాపతిగారు.

"మీ కళ్ళకు బదులు నా కళ్ళుండీ మేష్టరుగారూ! గుడ్డివెలుగులోనైనా నేను గుండుసూదిని కనిపెట్టగలను" అంటూ ఉత్తరం చేతికి తీసుకుని గడగడా చదువుకు పోసాగాడు సాత్యకి.

"ప్రియమైన బావగారికి–

ఈ దస్తూరీ ఎవరిదో గుర్తుందా బావా నీకు! ఉండకపోతే నేను ఆశ్చర్యపడను. చలపతి అన్న పేరుతో ఒక బావమరిది వుండేవాడు నీకు! వాడినే నేను!

మనిషిలోనూ మనసులోనూ వచ్చిన మార్పుల మూలంగా నువ్వీనాడు నీ చలపతిని గుర్తించలేవు. ఎదుటబడి నోరు విడిచి నేను చలపతినని చెప్పినా నమ్మలేవు.

ఇంటినుంచీ పారిపోయినందుకు అయిదేళ్లుగా అజ్ఞాతవాసంలో గడిపినందుకు ఈ జాబులో క్షమాపణలుగానీ, సంజాయిషీలుగాని లేవు. వాటికోసం యిందులో అన్వేషించవద్దు!

ఇన్నేళ్ళ తర్వాత నేనొక మహత్తరమైన సత్యం తెలుసుకోగలిగాను.

–జీవితం అర్థం లేనిది!

అదొక వర్డ్ బిల్డింగ్ బాక్స్‌లాంటిదనుకో బావా! అక్షరాలతో పదాలు కూర్చి ఆ పదాలతో ఒళ్ళు పులకరించే పద్యం అల్లి నడిమింటికి కట్టిన ఊహారజ్జువులకు ఆనంద డోలను బిగించి దిగంతాలదాకా ఉల్లాసంగా ఊగేయాలన్నదే మానవుడి ప్రయత్నం.

పద్యం ప్రారంభమవుతుంది.

మధ్యలో 'మోదము' అన్న పదం కావలసి వస్తుందనుకో బావా! ఎంత వెదికినా 'మో' కనిపించదు. దానికి బదులు 'ఖే' కనిపిస్తుంది.

ఖేదమే దక్కుతుంది.

ఐనా మానవుడు ఆశాజీవి.

'ఖేదము' అన్న పదం వచ్చినప్పటికీ పద్యంలోని భావం మారకుండా వుండాలన్నదే అతడి ఆశ.

అందుకోసం పద్యాన్ని మళ్ళీ ఆదినుంచీ మార్చవలసి వస్తుంది.

పదాలను కూర్చి, పేర్చి, మార్చి లభించిన అక్షరాలతో ఉద్దేశించిన భావాన్ని ప్రకటించలేక ఖిన్నుడైపోతున్న మానవుడి ఆవేదనకు మారుపేరే జీవితం!

అందుకే చెబుతున్నాను – అర్థం లేనిది జీవితం.

జీవితానికే అర్థం కనిపించకపోగా యిక ఆదర్శాలకు నేనేమని అర్థం చెప్పగలను? మజ్జిగకే దోవలేకపోతే యిక పెరుగుకు చీటీగూడానా బావా!

ఈ జ్ఞానోదయం నాకు నిర్హేతుకంగా కలిగింది కాదు.

ఇందుకు కారణం చెబుతున్నాను–

నేనొక అమ్మాయిని పెళ్ళాడడానికి నిరాకరించాను. వేరొక అమ్మాయిని వలచి పొందలేకపోయాను. ఇంకొక అమ్మాయి వలపుకు అడ్డుగా నిలబడలేక యిలా పారిపోయి వచ్చేశాను.

సావిత్రి - అమృత - జలజ - ఆ ముగ్గురు యువతులు ఈనాడు వివాహితలు.

సావిత్రి తెంపరితనానికి కాణాచి అని నేననుకున్నాను. ఆమె విషయంలో నా ఊహ తారుమారైపోయింది. ఆమె ఈనాడు భర్తకు బహిఃప్రాణంగా వుంది. ఆమె నరకం పొలిమేరలకైనా ఆనందంగా నడిచి వెళ్తుంది.

అమృత ముగ్గురు బిడ్డల తల్లి! ఆమెకీనాడు తన సంసారానికి మించిన స్వర్గమేలేదు. కాలగర్భంలో కలిసిపోయిన ఒకానొక భగ్న ప్రేమికుడి విషాదగాథ ఆమె పాలిటి కొక పీడకల!

పై రెండింటికన్నా మహదాశ్చర్యకరమైన విషయం మరొకటి వుంది. అదే జలజ సంగతి. ముచ్చటపడి చేసుకున్న మగనితో ఆమె మూడు నెలలు మాత్రమే కాపురం చేసింది. నాటినుంచీ నేటివరకూ పుట్టింటిలోనే వుంది.

ఇవన్నీ ఈ మధ్య నేను ఆరాతీసి తెలుసుకున్న వివరాలు.

నా కొక టనిపిస్తుంది. ఇసుకదిబ్బలాంటి ఆదర్శాలపైన నిల్చుంటారు మానవులు. కాల ప్రవాహపు ఉరవడిలో యిసుకమేటలు కరిగి విరిగిపోతాయి. కాలుజారి, నీటకూలి మానవులు ప్రవాహంలో కొట్టుకుపోతారు.

అనుభవాల గుణపాఠాలు నాకొక గొప్ప నీతిని ఉపదేశించాయి - ప్రవాహానికి ఎదురీది లాభం లేదు.

అందుకనే నేనూ అందరిలాగా ఓ యింటివాణ్ణి కాదలచుకున్నాను.

అందచందాలు, విద్యావివేకాలు, గుణగణాలు - వీటిల్లో దేనిపట్లా పట్టింపులేదు నాకు! ఓ కన్నెపిల్ల అయితే చాలు. పుస్తె కట్టడానికి నేను సిద్ధం.

ఇందులో స్నేహితుడొకడు నాకు తోడ్పడ్డాడు. అనంతపురంలో అతనికి బంధువులున్నారు. ఆ బంధువులింట ఓ అమ్మాయి ఉంది. నాకైతే పిల్లను చూచుకోవాలని లేదు. కానీ వాళ్ళు మాత్రం తమ కుమార్తె పెళ్ళి విషయంలో లాటరీ వేయదలచుకోలేదల్లే ఉంది. అబ్బాయిని చూచిన తర్వాతగానీ మాట యివ్వలేమన్నారు.

బుధవారం నాటి సాయంకాలం బండిలో అనంతపురం వెళ్తున్నాను.

ఎంత చెడినా నేను నీకు బావమరిదిని! నీ అంతటివాడివి నువ్వుండగా పెళ్ళి చూపులకోసం ఒంటరిగా వెళ్ళవలసిన దురవస్థ నాకు పట్టదన్న నమ్మకంతో నాతోబాటుగా మా బావగారు గూడా రాబోతున్నారని అవతలి వాళ్లకు జాబు వ్రాశాను.

నా వేడికోలు మన్నించగలవని ఆశిస్తున్నాను.

ప్రస్తుతానికివే విశేషాలు. మిగిలిన సంగతులు సముఖంలో చెప్పుకోగలను.

చలపతి."

సాత్యకి ఉత్తరం చదివి ముగించేసరికి చుట్టూరా కోలాహలం ప్రారంభమైంది. అంతలో యింజను దీపాల వెలుగు వెల్లువలు ప్లాట్‌ఫారం పైకి పరతెంచి వచ్చేశాయి. రొప్పుకుంటూ, రోజుకుంటూ వచ్చి రైలు స్టేషనులో ఆగింది.

రైల్లో చలపతిగూడా రానే వచ్చాడు.

ఆరడుగుల బక్కపలచటివాడు చలపతి షేర్వానీకి మల్లే కాలికి చుట్టుకున్న పంచకట్టు, అజాను పర్యంతంగా తొడుక్కున్న సన్నటి చొక్కా - యివి అతడి పొడుగరితనాన్ని ద్విగుణీకృతంచేసి చూపెడుతున్నాయి. తెల్లబడి పోతున్న తల వెంట్రుకల క్రింద

నల్లబడిపోయిన అతడి కోలముఖంకేసి చూస్తుంటే అతడు మనుషుల్లో మనిషిలా కలిసి నివసిస్తున్నట్టులేదు. మండుటెండల్లో మాడుతూ, చలిగాలుల్లో వణుకుతూ కొంతకాలం ఎడారి యిసుక పర్రల్లో నివసించి, యిప్పుడిప్పుడే జనపదాల్లోకి తిరిగివచ్చిన మనిషిలా ఉన్నాడు. ఆ వాలకంలో చూపరులకు ఇట్టే ఆకర్షించేవి అతడి కళ్ళు. మిణుగురు పురుగుల్లాంటి ఆ చిన్న కళ్లు పెద్ద చీకటింటి దిగుళ్లలోని ఆముదపు దీపాల్లా వెలుగుతున్నాయి.

మామూలు కుశల ప్రశ్నలతో పరామర్శ పూర్తికాగానే మెల్లగా ప్రారంభించారు ఉమాపతిగారు. "చూడు చలపతీ! నా ఉద్యోగ మెలాటిదో నీకు తెలుసు. ఈరోజు ఉదయం నీ జాబు నాకు చేరింది. మూడు మాసాల క్రితమే నా కాజువల్ లీవుకు ఆయువు మూడింది. ఇప్పుడెంతగా గింజుకున్నా సరే నాకొక రోజు తీరుబడి దొరకదు..."

''ఇంతకూ నువ్వనేదేమిటి బావా! నువ్వు నాతో అనంతపురం రావడంలేదన్నమాట?" విస్మయంతో ప్రశ్నించాడు చలపతి.

"రాలేనందుకు విచారంగానే వుంది చలపతీ! అయినా నేను క్షంతవ్యుణ్ణి. అనంతపురం వెళ్లడానికి నీకిదే ప్రథమమేమో! అర్ధరాత్రి సమయంలో స్టేషనులో దిగి యెకాయెకిని గమ్యస్థానం చేరుకోడం గూడా కష్టమే?..."

"శిష్య పరమాణువుని - నేనా ఊళ్లో ఉండగా మీకా దిగులెందుకండీ మేష్టరుగారూ! స్టేషనులో దిగినప్పటినుంచి చలపతిగారు నా కతిథిగా ఉంటారు..." అన్నాడు సాత్యకి.

"ఏమిటేమిటి! నువ్వుద్యోగం చేస్తున్నది అనంతపురంలోనా సాత్యకీ! - ఇంకేం, నువ్వు నిక్షేపంలా వెళ్లిరావచ్చు చలపతీ! అక్కడ నీ అవసరాలన్నీ సాత్యకి చక్కగా గమనిస్తాడు. క్షేమంగా వెళ్లి లాభంగా తిరిగి రా" అన్నారు ఉమాపతిగారు.

తరువాత పది నిముషాలకు చలపతిని, సాత్యకిని ఎక్కించుకుని రైలు మళ్ళీ మునుపటిలా రభస చేసుకుంటూ చీకటిలోకి దూసుకుపోయింది.

***

వేసవి సెలవుల్లో బంధువుల ఊళ్ళన్నీ దర్శించి యింటికి తిరిగి వచ్చేసరికి కిటికీగుండా గదిలో పడివున్న పెళ్లిపత్రిక ఒకటి కనిపించింది. విప్పి చూడగానే పెద్దక్షరాలలో వరుడి పేరు దృగ్గోచరమైంది. ఒకటి రెండు క్షణాలపాటు నా కళ్ళను నేనే నమ్మలేకపోయాను. మరెవరోకాదు - సాత్యకికే పెళ్ళి!

ఈ విచిత్రం ఎలా సంఘటించింది? ఎంతసేపాలోచించినా జవాబు స్ఫురించింది కాదు. ఏదైనా 'క్లూ' దొరకవచ్చునని మళ్లీ ఒకసారి పత్రికను పరకాయించి చూచాను. వధువు పేరు నిర్మల. వివాహం అనంతపురంలో కన్యాదాత స్వగృహంలో జరుగుతుంది.

ఎలాగైనా అదృష్టవంతుడు సాత్యకి. తంతే వెళ్ళి గారెలబుట్టలో పడినట్టు వాడికి ఉద్యోగం చేస్తున్న ఊళ్ళోనే అత్తగారిల్లు దొరికింది. వివాహానంతరం హోటలు భోజనానికి స్వస్తిచెప్పి వాడు హాయిగా అత్తగారింటిలోనే మకాం పెట్టవచ్చు...

ఆరోజు సాయంత్రం హఠాత్తుగా బజారులో ఎదురయ్యాడు ఉమాపతిగారు. తొందరగా ఎక్కడికో వెళ్తుండగా నా చేతిని ఒడిసి పట్టుకుని వెనక్కు లాగుతూ "డామిట్? కథ అడ్డం తిరిగింది" అన్నారు.

"ఏమిటండీ మేష్టరుగారూ! ఎవరి కథ?" అన్నాను.

"మరెవరి కథ? మా చలపతిగాడి కథే! వాడిలో చింత చచ్చినా పులుపు చావలేదయ్యా శేఖరం!" ఆయన జాలిగా అన్నారు.

తెల్లబోయి ఆయనవైపు చూడడం తప్పితే నేను మరేమీ మాట్లాడలేకపోయాను.

"ఇంతదూరం ఒంటరిగా వచ్చినవాడు ఆ పెళ్ళిచూపులకుగూడా ఒంటరిగానే వెళ్లగూడదా శేఖరం? ఊఁహు, సాత్యకిని వెంటబెట్టుకుని వెళ్లాడు. వెళ్లగా ఏమైంది? వాళ్ళు సాత్యకినే వరుడనుకున్నారు. చలపతిని అబ్బాయికి తోడుగా వచ్చిన బంధువనుకున్నారు. సాత్యకి మొగమాటమూ చలపతి అభిమానమూ ఆ అపోహ నలాగే పెరిగిపోనిచ్చాయి. తీరా వీడ్కోలు సమయంలో సాత్యకి సంబోధనద్వారా చలపతి ఎవరో సాత్యకి ఎవరో తెలిపోయింది. తెలిపోగానే అవతలివాళ్ల ముఖాలు వెలవెలపోయాయి. కిక్కురుమనకుండా బెంగుళూరుకు వెళ్లిపోయాడు చలపతి. వెళ్లగానే - తగుదునమ్మా అని పెళ్లిచూపులకోసం వెళ్లినందుకు సిగ్గుపడుతున్నాను బావా! ముదిరిన బెండకాయ కూరకు పనికిరాదని తెలిపోయింది - అంటూ నాకొక ఉత్తరం వ్రాసి పారేశాడు..."

"అలాగైతే యిప్పుడు సాత్యకికి కుదిరిన సంబంధం-"

అర్థోక్తిలో ఆగిపోయిన నా వాక్యాన్ని ఉమాపతిగారే పూర్తిచేశారు. "అక్షరాలా అదే సంబంధం! ఐనా సాత్యకి తన పట్టుదలను సడలించుకోడంలో మాత్రం అబ్బురమేముంది శేఖరం! మొన్న శ్రీకంఠంగారు కనపడి చెప్పారు - అమ్మాయి ఆణిముత్యంలా ఉందట! చిదిమి దీపం పెట్టుకోవచ్చునట!... కానీ నా కొకందుకు విచారంగా ఉంది శేఖరం! చలపతికి ఈ చిట్టచివరి రైలుగూడా తప్పిపోయింది..." బరువుగా నిట్టూర్పు నిగుడించారు ఉమాపతిగారు.

నిజమే! ఎప్పటికప్పుడు ఎక్కడికక్కడ ఆదర్శాల లగేజీ వదిలించుకోగలిగినవాడికి మాత్రమే రైలందుతుంది. అలా వదిలించుకోలేక ఓపినంత లగేజీని తలపైన వేసుకుని అ బరువుతో కృంగిపోయే వాళ్లకు వాళ్లెప్పుడు లేచినా రాళ్ళవంక దగ్గరే తెల్లవారుతుంది. అలాంటి వాళ్ళ విషయంలో వాళ్లెక్కదలచుకున్న రైలు పూర్తిగా ఒక జీవితకాలం లేటైపోయినా అందులో ఆశ్చర్యపడవలసింది ఏముంటుంది?

❖ 'వాణి' - సెప్టెంబర్, 1975 ❖

# మసి మరక

ఆకాశం నిర్మలంగా ఉంది.

వాతావరణం ప్రశాంతంగా ఉంది. ఉదయం తొమ్మిదిగంటల వేళ. ఆ వేళప్పుడు తుపానురావచ్చునని ఊహించడం కష్టమే! నిజం. వచ్చింది తుపానే! ఎలా వచ్చింది? ఓ మనిషి రూపంలో వచ్చింది.

మాసిపోయిన నాలుగు మూళ్ళ పంచె, గోనెపట్టలా వున్న నీలిరంగు అరచొక్కా, పొట్టి వెంట్రుకల గుండ్రటి తల. కోపంతో కందగడ్డలా జేవురించిన ముఖం. అతడి పేరు కోదండం.

సెకండ్ బెల్ మ్రోగి ప్రార్థన జరిగిన తర్వాత పిల్లల హాజరు గుర్తించి పాఠం చెప్పడంకోసం అప్పుడే పుస్తకం చేతికి తీసుకుంటున్నాను. బోను తలుపు తీయగానే పైకి దూకే తోడేలులా వచ్చిపడ్డాడు కోదండం. కాగిననూనెలో వేగి వుబ్బుతున్న మినపగారెలా మనిషి మనిషంతా కంపించిపోతున్నాడేమో. మాటలుకూడా తడబడుతున్నాయి. "హేమండీ. హెడ్డమేష్టరుఘూరూ! సెప్పండి. ఊళ్లో వుండమంటారా లేకుంటే నెత్తిన బట్టేసుకుని మా బిడ్డ పాపల్తో మమ్మల్ని ఊళ్ళోనుంచి వెళ్ళిపొమ్మంటారా? మీ కిష్టం లేకపోతే సెప్పేసెయ్యండి..."

ప్రతిరోజూ దినపత్రికలు చూచేవాణ్ణి. దొంగనోట్లు, బ్యాంకు దోపిడీలు, అమ్మాయిల్ని తీసుకెళ్ళి అమ్మెయ్యడాలు. రైలు ప్రమాదాలు, నరబలులు మొదలైన వాటిని గురించి పుష్కలంగా వినివున్నాను. కాని యిష్టమైనవాళ్ళని వూళ్ళో ఉండమని, మిగిలినవాళ్ళని వెళ్ళిపొమ్మనే హక్కు టీచర్లకుందని మాత్రం వినలేదు.

"అసలేం జరిగిందో వున్నదున్నట్టుగా చెప్పవయ్యా బాబూ?" అన్నాను. నా ఎట్ట యెదుట బెంచీలపైన కూర్చున్న కుర్రకుంకలు అత్యంత 'సస్పెన్సు' ఘట్టాన్ని చూస్తూ, వూపిరి బిగబట్టుకున్న ప్రేక్షకుల్లా, బొమ్మలకు మల్లే తయారైపోయి, కోదండంవైపు రిచ్చపడిపోయి చూస్తున్నారు.

"వద్దొద్దు, ఈ నిప్పులమీద నీళ్ళు చల్లే మాటలొద్దండీ మేష్టారూ! మా బిడ్డలీ మాత్రంగానైనా బ్రతికుండడం మీకిష్టం లేదు. అదే మీ ఉద్దేశం! అవునంతేనని సెప్పండి, నేను నోరు మూసుకుని వెళ్ళిపోతాను..."

ఇదేం నవ్వుటాలగా తుడిచిపెట్టుకపోయే వ్యవహారంలా కనిపించడంలేదు. ఆదమరిచి కూచుంటే నా గొంతుకకే ఉచ్చులా బిగుసుకుపోయేటట్టుంది. అందుకని వీలయినంతగా అప్రమత్తుడినై పోతూ "చూడు కోదండం! పొరబాటు చేయడమనేది మానవ సహజం, కాని జరిగిన పొరబాటేమిటో తెలిస్తే, అందుకు కారకులైన వాళ్ళని మందలించే అవకాశముంటుంది. అలాంటిదికమీదట జరగకుండా చూచే వీలుంటుంది" అన్నాను.

"చెయ్యి విరిగితే అతికిస్తారటయ్యా మీరు!" గద్దించాడు కోదండం.

నిస్సందేహంగా యిది శల్య వైద్యుల్లపని. టీచర్ల తరంగాదు.

"ఏది, ఎక్కడ వాడు?" అంటూ ఒక్క విసురుతో బయటికి వెళ్ళిన కోదండం, అక్కడ గోడచాటున ఎక్కడో నక్కి నిల్చున్న ఓ తొమ్మిదేళ్ళ కుర్రాణ్ణి లోపలికి లాక్కొచ్చాడు. చిన్న నిక్కరు పైన, గుండీల్లేని పొట్టి చొక్కా ఒకటి వేసుకుని, చింపిరితలతో, జిడ్డోడుతున్న ముఖంతో వుడుబోతు కాయలా కనిపిస్తున్న ఆ కుర్రాడు వాడి తల్లితండ్రుల సంతానంలో చిట్టచివరివాడు. మొదటివాడేమో – యిదిగో నామీద పిట పిడుగులా విరుచుకపడిపోతున్న కోదండం!

ఉడుబోతుకాయ కుర్రాడు – వాడిపేరు చక్రి – ఒక చెయ్యి పైకెత్తి పట్టుకున్నాడు. ఆ చేతిలో చక్రాయుధం లేదు. అంతకంటే భయంకరంగా రెండు వ్రేళ్ళూ కలిపి కట్టిన బాండేజీ ఒకటి కానవస్తోంది.

"ఏమిటిది? ఏమైంది?" అన్నాను కంగారుగా.

"ఏముంది? వ్రేళ్ళు సగందాకా తెగిపోయాయంతే! ఇంకా నయం! తలకాయ బొందపడి వుండాల్సింది, చేతికడ్డంగా పెట్టుకున్నాడేమో, వ్రేళ్ళు మాత్రమే తెగాయి. వద్దుబాబూ ఎందుకొచ్చిన చదువులు! ఊపిరుంటే ఉప్పమ్ముకుంటాం. ఎందుకైనా మంచిదని మీతో ఒక మాట చెప్పిపోదామని వచ్చాను."

గిరుక్కున వెనుదిరిగి ద్వారం దాకా వెళ్ళినవాడు అక్కడ ఆగి మళ్ళీ నావైపు చూస్తూ అన్నాడు. కోదండం – "అయితే ఒకటి. ఈరోజు మాకయింది. రేపొద్దున యింకొకరికవుతుంది. ఇంతపని జరిగాక యిక వూరుకునేదిన్నీ లేదు. దీని అంతేమిటో తేల్చుకోకుండా వదిలిపెట్టేదిన్నీ లేదు. ఇప్పటికింతే నేను చెప్పడం."

"అల్టిమేటం జారీ చేసిన మరుక్షణంలో కోదండం అక్కడ లేడు!'

తుపాను వస్తుంది. వెళ్తుంది. కానీ దాని తాలూకు బీభత్సమైన పరిణామం మట్టుకూ అంత తొందరగా మాసిపోయేదికాదు. కోదండం వచ్చి వెళ్ళాడు సరే! ఇక మీదట అతడేం చేయబోతున్నాడన్న ప్రశ్న గురిపెట్టిన బాణంలా నన్ను భయపెడుతోంది. ఉద్యోగరీత్యా ఈ వూరికి బదిలీ అయినప్పటినుంచి నేను కోదండాన్ని ఎరుగుదును. ఒకసారి నేను నోరుజారి "ఏమిటోయ్ కోదండం! ఈ మధ్య కనిపించడం లేదే?" అన్నాను. "ఏమిటండీ మేష్టారూ! అప్పటికీ వూళ్ళో బ్రతకలేక నేనెక్కడికైనా పారిపోయి వుంటాననుకున్నారా?" అంటూ కస్సుమన్నాడు కోదండం. నాలుగేళ్ళ క్రితం జనాభా వివరాలు నమోదు చేయడంకోసం ఊళ్ళో యిల్లిల్లూ తిరగాల్సి వచ్చింది. సమయానికి కోదండం యింట్లో వున్నాడు. "వ్రాసుకోండి సార్! మేమున్నది పదకొండు మందిమి" అన్నాడు. తీరా వ్రాసి లెక్కపెట్టుకుంటే పదిమంది లెక్క మాత్రమే పూర్తయ్యాయి. మిగిలిన వ్యక్తి ఏమైనట్టు? "బాబూ, ఒకర్ని వదలి పెట్టేశావు" అన్నాను. లెక్క వచ్చిన మనుషులకు ఆదరువు ఏర్పాటు చెయ్యండి సార్, చాలు!" అంటూ విసుక్కున్నాడు. అన్నింటికన్నా చిత్రం. ఊళ్ళో ఏ యింట్లో శుభకార్యం జరుగుతున్నా వెళ్ళేది లేదని తన కుటుంబానికొక ఆనవాయితీ ఏర్పరిచాడు కోదండం. అక్కడ మంగళవాయిద్యాలు మ్రోగుతున్నంతసేపూ, ఇక్కడ ఈ యింట్లో తలుపులు బిడాయించే వుంటాయి.

అంతవరకూ ద్వారబంధాని కటువైపున తచ్చాడుతూ వుండిపోయిన ప్యూను సిద్ధలింగం, జంకుతూనే లోపలికివచ్చి "అయ్యగారూ! సారధి మేష్టార్ని పిలవమంటారా?" అన్నాడు.

"వద్దు" అన్నాను. ఆ మాట కాస్తా బిగ్గరగా అన్నానేమో సిద్ధలింగం ఉలిక్కిపడ్డాడు. బొట్టూ, కాటుకా పెట్టి పిలిచేదాకా వచ్చి సంజాయిషీ చెప్పుకోవడం తన ప్రతిష్ఠకు భంగకరమనుకుంటున్నాడేమో కుర్రపంతులు! అసలీ 'సారధి' అనే అతను ఉండేలు దెబ్బ తినని పిల్లకాకిలా ఇక్కడికి వచ్చి పడ్డాడు. వయసుకు మించిన హుందాతనం ఒకటి ఈ మనిషిలో! ఇందుకు కారణం బహుశా అతడు సంపాదించుకున్న డిగ్రీలో వుండొచ్చునని నా ఊహ. కాలేజీలో లెక్చరరు కావడానికి అవసరమైనంత చదువు చదువుకున్నప్పటికి ఉద్యోగావకాశాలకు ఏర్పడిన కక్కుర్తినిబట్టి, కన్సొలేషన్ ప్రయిజు బాపతుగా – స్టయిఫండరీ స్కీము క్రింద అతడీ బడికి పోస్టు చేయబడ్డాడు. తానేమిటో, తన పనేమిటో ఎప్పుడూ ఏ యితర లోకాల్లోనో సంచరిస్తూ వున్నట్టుంటుంది అతడి వాలకం. కానీ యితడిలో యింతలావు తలబిరుసుతనం వుంటుందని మాత్రం అనుకోలేదు. ఫరవాలేదు. పొగరుమోతు గుర్రానికి చింతబరికెల పూజ చేయడమెలాగో నాకు తెలుసు. ఇప్పుడంతకన్నా కోదండం కోపాన్ని తగ్గించడం ముఖ్యం. అందుకని "నువ్వెళ్ళి కోదండం ఏం చేస్తున్నాడో చూడవోయ్ సిద్ధలింగం! నచ్చజెప్పి యిక్కడికి తీసుకురావడానికి ప్రయత్నించు" అన్నాను.

తలనొప్పి తగ్గడానికని ఓ కుర్రాణ్ణి పంపి యింటి దగ్గరినుంచి కాఫీ తెప్పించుకున్నాను. గ్లాసు ఖాళీచేసేసరికి సిద్ధలింగం తెచ్చిన వర్తమానం నా తలనొప్పిని ద్విగుణీకృతం చేసింది.

"కోదండం కనిపించడం లేదండీ అయ్యగారూ! ఇంట్లో అడిగాను. బడినుంచి వెళ్ళగానే సీతాపురానికి బస్సెక్కాడట! వాళ్ళమ్మ చెప్పింది..."

సీతాపురమా? ఏదో స్వంత పనిమీద వెళ్ళి వుంటాడు లెమ్మనుకున్నాను. కానీ ఆ సంతృప్తికూడా క్షణంలో సగంసేపు మాత్రమే!

"మరింక మనూరికి పోలీసుస్టేషనుండడం సీతాపురంలోనే గదండీ!"

నా గుండెలు జల్లుమన్నాయి. బడిలో అలజడిని గురించి పోలీసుస్టేషనులో ఫిర్యాదు–

నా బుర్ర గిర్రున తిరిగిపోసాగింది. కాగితంపైన అక్షరాలన్నీ నల్లగా అలుక్కుపోయి నట్టున్నాయి. పాఠం చెప్పాలనిపించడంలేదు. కానీ నా కాళ్ళు నన్ను అప్రయత్నంగా కోదండం యింటికే తీసుకెళ్లాయి. వీధి గుమ్మం దాటుకుని, నడవంతా నడిచి, హాల్లోకి అడుగుపెడుతూ, అమ్మా అని పిలిచాను. ప్రత్యుత్తరం వినిపించలేదుగాని భాగ్యమ్మ కనిపించింది. కోపిష్ఠి చిత్రకారుడు కసి తీర్చుకోడంకోసం గీచిన ఆడ బొమ్మలా భాగ్యమ్మ వంటింటి గుమ్మంలో నిలచి వుంది.

కొలిమిలో కాలి చల్లబడిన ఇనుములా కాయవాటు శరీరం భాగ్యమ్మది. మొగుడు పోయిన తర్వాత తల దువ్వుకోలేదేమో, తల మాయలమరాఠీ వేషగాడు వేసుకునే టోపాలా తయారైంది. కళ్ళు చింతనిప్పుల్లా మండుతున్నాయి. నిజం చెప్పొద్దు బుద్ధిమాలి

ఆకలిగొనివున్న ఆడపులి దగ్గరికి వచ్చేశానేమోనన్న అనుమానంతో ఓ అడుగు వెనక్కే వేశాను.

"ఏమండీ పంతులుగారూ?" ఉరిమినట్టుగా ప్రారంభించింది. భాగ్యమ్మ. "గవర్నమెంటు డబ్బులిస్తోందిగదా అని మీరు ముప్పూటలా మెక్కి కూచుంటే మాకు ఆక్షేపణ లేదు. కండలు బలిసి కొవ్వెక్కి కళ్ళు కానరాక తల్లక్రిందులుగా నడిచినా మాకు పొయ్యేదేమీ లేదు బాబూ. మాలాంటి నోరులేని వాళ్ళ ఉసురు పోసుకోడం న్యాయమేనా మీకు? రాత్రంతా బిడ్డ కంటిపైన రెప్పవేసి వుంటే ఒట్టు, ఒళ్లు కాలిన పెనంలా పెట్లిపోయింది. ఒకటే కలవరింతలు. ఇంటిల్లుపాదికీ శివరాత్రి జాగరమే. ఎందుకండీ' మేము ఎవరబ్బ సొత్తుకు వచ్చామండీ? మిమ్మల్ని నిలదీసి అడిగే వాళ్ళెవరూ లేరా? మీ అంతట మీరే దొరలైపోయారా? మీకు పట్టపగ్గాల్లేవా? ఒసే, అమ్మీ తాయారూ, ఇక్కడిలా పంతుళ్ళు పసిపిల్లల్ని కొట్టుక తింటున్నారని మీ అన్నయ్య అదెవరికో అర్జీ పెట్టాలన్నాడే బి.డి.వో.నా – డి.ఇ.ఓ.నా, ఎవరే అతను?'

"డి.ఇ.ఓ." తడిక ఆవలినుంచీ సవరించి చెప్పింది కూతురు.

"అవునా? ఆ మహానుభావుడికి మా మొర ఎలా వినిపించదో చూస్తాం. వచ్చే వాళ్ళెవరో రాని, చెప్పేవాళ్ళేం చెప్పుకుంటారో చెప్పుకోని, ఇప్పుడాడంగులతో మీకేం మాటలండీ మాష్టారూ, అమ్మీ తాయారూ, అయ్యగారెళ్ళిపోగానే తలుపేసుకోవే?" "వడిసెల రాయిలా భాగ్యమ్మ పెరట్లోకి వెళ్ళిపోయింది.

బిక్కచచ్చిపోయి నేను జీవచ్ఛవంలా బయటికి వచ్చేశాను.

జడుసుకుంటే జ్వరం వస్తుందంటారు. భాగ్యమ్మతో భేటీ అయి యింటికి వెళ్ళిన తర్వాత నాకు నిజంగానే జ్వరం వచ్చినట్టు అనిపించింది. భోజనంచేసి పడుకున్నానేమో, లేవడానికి బుద్ధి పుట్టింది కాదు. బడికి వెళ్లకుండా మంచంపైన పడివుండిపోయాను.

ఈరోజుగాకపోయినా రేపో, మరునాడో ఉన్నతాధికారులు బడిపైకి వచ్చి దూకడం ఖాయం. ఎంక్వయిరీలు, ఛార్జిషీటు, ఎక్స్‌ప్లనేషన్లు, సస్పెన్షన్లూ లేదా పూష్టింగులు ఇలాంటి తతంగమంతా ఆపైన తప్పనిసరి! తెలిసో, తెలియకో సారథి వూబిలో కాలుపెట్టేశాడు. గొంతుకబంటిదాకా కూరుకుపోయాడు. చూస్తూ వూరుకుంటే బుడుంగున అందులో మునిగిపోతాడు. అబ్బే. అలా జరగడానికి వీల్లేదు. ఎలాగైనా అతడికొక అవకాశం యిచ్చి చూడడమే సబబు...

ఈ నిర్ణయానికి రావడానికి కూడా నా స్వార్థమే కారణమని తెలిస్తే ఎవరైనా విస్తుపోతారు. ఆపదలో నేను గనుక యింకొకరిని ఆదుకుంటే – నాకాపద వచ్చినప్పుడు ఇంకొకళ్ళు (వీరిలో దేవుడుకూడా వున్నాడు) నన్ను ఆదుకుంటారన్నది నా నిశ్చితాభిప్రాయం.

చేసిన పనికి బెంబేలు పడిపోతూ సారథి తన గదిలో ఖిన్నుడై కూర్చుని వుంటాడని నేనాశించాను. అలాంటిదేమీ లేకపోయేసరికి నాకు కొంత ఆశ్చర్యమో, ఆశాభంగమే కలగక తప్పిందికాదు. బ్రహ్మచారి కొంపగదా, నానా కంగాళీగా వుంటుందనుకుంటే, ఆ యిల్లెంతో నీటుగా వుంది. చెత్తలేదు. మురికిలేదు. బూజులేదు. లేనివి లేకపోగా ఉండవలసినవన్నీ ఎక్కడివక్కడ పదిలంగా వున్నాయి. అలమరా నిండుకూ పుస్తకాలు,

ఓ మూలగా ఆయిల్ స్టవ్వు, చెక్క బీరువాలో వంటచేసుకోడానికి కావలసిన పాత్రలు, వస్తువులు. హాలుకు మధ్యగా గోడవార ఓ టేబిలు, కుర్చీ. చదువుకోడానికి వీలుగా టేబులు పైకి వ్రేలాడుతున్న దీపం. బుద్ధిగా కుర్చీలో కూర్చుని తానేదో పుస్తకమే చదువుకుంటున్నాడు.

"రండి మేష్టరుగారూ! మీరా! నేనింకా ఎవరో అనుకున్నాను రండి. కూచోండి" అంటూ లేచి, కుర్చీని నాకిచ్చేస్తూ, తాను వెళ్ళి ఎదురుగా ట్రంకు పెట్టెపైన కూర్చున్నాడు.

అంతలోనే ఏదో జ్ఞప్తికి వచ్చినట్టు-

"రాకరాక నా విడిదికొచ్చేశారు. పాలు కొంచెం మిగిలి వుంది. కాఫీచేసి ఇమ్మంటారా?" అన్నాడు.

రోము నగరం కాలిపోతుంటే ఫిడేలు వాయిస్తూ కూర్చున్న నీరోలా సారథి చెక్కుచెదరకుండా వుండడం చూడ్డానికి విచిత్రంగానే వుంది. ఇతడు గుండెలు తీసిన బంటా? లేక వట్టి అమాయకుడా!

"పోనీ, పాలే తీసుకోండి" అంటూ పైకి లేవబోయాడు సారథి.

నాకొక వైపున ఒళ్ళు మండిపోతూవుంది. "వద్దులేవోయ్ సారథీ! నువ్వు కూచో, నాకిప్పుడు నీ సత్కారాలేమి అవసరంలేదు. సూటిగా నేను చెప్పవలసిందేదో చెప్పనివ్వు. ముందుగా నువ్వొక లీవు అప్లికేషన్ వ్రాసి నా చేతికివ్వు. అయిదు రోజులకు పెడితే అటూ యిటూ శని, ఆదివారాలు కలసి నువ్వు ఏడెనిమిది రోజులదాకా సెలవు 'అవైల్' చేసుకోవచ్చు..."

"సెలవా! నాకా! అబ్బే, అనవసరంగా సెలవు పెట్టడమెందుకండీ?"

ముసుగులో గుద్దులాటకు పూర్తిగా స్వస్తిచెప్పి - "ఎందుకంటే, తెల్లవారేటప్పటికి యిక్కడుండడం నీకు శ్రేయస్కరం కాదుగనుక!" అంటూ తేల్చి చెప్పేశాను.

"ఎందుకండీ మేష్టరుగారూ! మీరెందుకలా అనుకుంటున్నారు?" విస్తుపోతూ ప్రశ్నిస్తున్నాడు సారథి.

"అబ్బాయి సారథీ! మనమెక్కడున్నా మన్న విషయం నీకైతే తెలియకపోవచ్చు. ఇది ప్రపంచం. ఇక్కడ నువ్వు చేసేపని ఇతరులచేత గమనించబడడంలేదని, అందరి మంచి చెడ్డలు ఎప్పటికప్పుడు బేరీజు వేయబడవనీ, అందుకు ప్రతిఫలం వడ్డీ వారడితోసహా గిట్టుబాటు కాదని నువ్వనుకున్నట్టయితే అది శుద్ధ పొరబాటు. నిన్ననో, మొన్ననో నువ్వొక కుర్రాడ్ని వ్రేళ్ళు తెగిపోయేటట్టుగా కొట్టావు. దానిపైన పోలీసులకు రిపోర్టు వెళ్ళింది. రేపో మాపో విద్యాశాఖ వాళ్ళకు పిటీషన్ అందుతుంది. ఇదేం అల్లాటప్పా వ్యవహారంకాదు. నేను నీకు శ్రేయోభిలాషిని గనుక ముందుగానే హెచ్చరిస్తున్నాను."

ఈ చోక్రా కుర్రాడు సారథి నా అమాయకత్వాన్ని చూసి జాలిపడుతున్నట్టుగా, నడిచేయని చిరునవ్వు దొంతరల్ని వెదజల్లుతున్నాడు.

దయ్యంతో ముఖాముఖిగా ఇంటర్వ్యూ జరుపుతున్నట్టుగా దిగాలుపడిపోయి నేను చేష్టలు మాని విగ్రహంలా కూర్చుండిపోయాను.

అందాకా గోడకు చేరగిలబడి వున్న వాడు సర్దుకుని నిటారుగా కూచుంటూ అడిగాడు సారథి - "మేష్టరుగారూ నేను కొట్టలేదని చెబితే మీరు నమ్మలేరేమో!"

"దాఖలా కనిపిస్తున్నప్పుడు ఏం చెయ్యమంటావయ్యా నన్ను?" నిందించడం మాత్రమే నా వంతయింది.

"దెబ్బను గురించి తరువాత చెబుతాను, మొదట భాగ్యమ్మను గురించి కొంచెం చెప్పాలి..."

తాతకు దగ్గులు నేర్పించాలని చూస్తున్నందుకు నాకు పట్టరానంత కోపం వచ్చింది. భాగ్యమ్మను గురించి నువ్వు నాకు చెప్పడమేమిటోయ్ సారధీ. తల్లి పుట్టినిల్లు మేనమామకు తెలియకపోతే గదా!

"భాగ్యమ్మకొక భర్త వుండేవాడు. భాగ్యమ్మను పెళ్ళాడడం అతడు చేసిన నేరం గంపెడు పిల్లల్ని కనడం భాగ్యమ్మ చేసిన నేరం. ఎలాగైనా లోకంలో బ్రతికి పోవాలన్నది ఆ పిల్లలు చేస్తున్న నేరం. పెద్దబ్బాయి కోదండమున్నాడే, వాడు ప్రతిరోజూ టౌనుకు వెళ్ళి విస్తర్లు అమ్ముకొస్తేగాని ఆ యింట్లో పూటగడవదు. రెండో బిడ్డ తాయారు. ఆ అమ్మాయికి పెళ్ళయివుంటే ఈపాటికి నలుగురు బిడ్డల తల్లై వుండేది. ఇలా చెప్పుకపోతే చాలా పెద్దలిస్టే వుంది. అంతేనా, యింకా ఏమైనా వుందా నువ్వు భాగ్యమ్మను గురించి చెప్పగలిగింది"

"అరటిపండు ఒలిచి చేతిలో పెట్టేసినట్టు మీరింత స్పష్టంగా చెప్పేశాక నాకింక ఏం మిగిలి వుంటుందండీ మేష్టరుగారూ! లేదంటే ఆ ఇంటితో నాకున్న కొద్దిపాటి అనుబంధాన్ని గురించి చెప్పుకోవాలి. ఈ వూరికి వచ్చిన కొత్తలో నేను భాగ్యమ్మ ఇంట్లో వీధివైపు గదిలో వుండేవాణ్ణి. ఆరునెలలు గడవక ముందే నేను వేరే చోటు వెదుక్కోవలసి వచ్చింది. అద్దె విషయంలో పేచీ వచ్చి మాత్రం కాదు. పదో పదిహేనో పాతికో నికరంగా యింతే మొత్తమనీ నిర్ణయం వుంటుంది గనుక, జీతం రాగానే చెల్లించుకోవచ్చు. అలా కాకుండా రెండుగా, మూడుగా, అయిదుగా, పదిగా నెల పొడుగునా ఇచ్చుకోవాలంటే ఎవరికైనా యిబ్బందే! అందులోనూ స్వల్ప జీతగాణ్ణిగదా. అది నా తాహతుకు మించిన వ్యవహారమైపోయింది. నేనక్కడినుంచి వచ్చేశాక, ఆ గదిలో చేరే వాళ్ళు ఎవరూ లేకపోవడాన భాగ్యమ్మకు రావలసిన అద్దె డబ్బులు రాకుండా పోయాయి. తిరిగి యిచ్చుకోవలసిన అవసరం లేకుండా అప్పులు దొరికే అవకాశాలు కూడా లేకుండా పోయాయి. అందుకని భాగ్యమ్మకు నాపైన కోపం వుండడం తప్పుకాదని నేను చెప్పను..."

"ఈ శిక్షను మనసులో పెట్టుకుని యిలా చేసిందని నీ వాదన. పోనీ, అలాగే ననుకుందాం. నీ మట్టుకు నువ్వు చేసిన పనేమిటి? వ్రేళ్ళు తెగిపోయి వుండాల్సిన ఆ దెబ్బను గురించి సంజాయిషీ యిచ్చుకుంటావయ్యా నువ్వు?" వీలయినంత కర్కశంగానే ప్రశ్నించి, అతడిపైకి రూక్షవీక్షణాలు గుప్పిస్తూ కూర్చున్నాను.

"చూడండీ మేష్టరుగారూ ఒక్కొక్కప్పుడు కల్పనకంటే వాస్తవమే చిత్రంగా వుంటుందనుకోవటం బహుశా ఇలాంటి విషయాలను గురించే కావచ్చు. ఆ కుర్రాడు అదే చెక్రిగాడు జానెడు పొడుగు షరాయిపైన పొట్టంతా కనపడే పొట్టి షర్టు తొడుక్కుని మామూలుగా రెండో గంట కొట్టిన తర్వాత బడికొస్తాడు. ఒరే చక్రిగా, రా, నా ప్రక్కన కూచో అని పలకరించే సహ విద్యార్థి వుండడు. మనిషికీ, మనిషికీ తేడా వుండగూడదనీ, విచక్షణ చూపడం నేరమనీ మానవుడు గ్రహించి చాలకాలమైంది. కానీ ఏ కారణం వల్లనో తెల్లటి బట్టపైన దట్టమైన మసి మరకలా క్లాసులో చక్రీగాడొక్కడు మాత్రం ప్రత్యేకంగా

కనిపిస్తాడు. పదిమంది పిల్లలు కలిసి జట్టుగా ఆడుకుంటూ వుంటే దూరంగా నిలబడి బిక్కుబిక్కుమంటూ చూడ్డమే వాడు చేయగలిగింది. కాదని దగ్గరికి వెళ్తే కసిరి కొడతారు. ఒక కుర్రాడు ఏదో తాయిలం తింటుంటాడు. ఇంకొకడు బొమ్మల పుస్తకం చూస్తుంటాడు. మరొకడు గాలిపటం ఎగుర వేస్తుంటాడు. ఏ ఆనందంలోనూ తనకు వాటా లేదని తెలిసేసరికి వాడికి ఏడుపొస్తుంది. కోపమొస్తుంది. కోపాన్ని వెలిబుచ్చే ఉపాయం లేకపోతే, ఏడిస్తే ఓదార్చేవాళ్ళు లేకపోతే వాడి భావావేశాలన్ని ఏమౌతాయి! వాడిపైకె తిరగబడతాయి. ఆ వుక్రోషంలో వాడు తన పొడుగాటి గోళ్ళతో తన శరీరాన్నే గిచ్చుకుంటాడు. తన ముఖాన్నే రక్కుకుంటాడు..."

శారీరకంగానే గాదు, మానసికంగా కూడా చైతన్యం లుప్తమై పోయిన ఆ స్థితిలో నేను సారధి వైపు తెల్లబోయి చూస్తూ వుండిపోయాను.

ఒక నిముషం తర్వాత అతడు పూర్తి చేశాడు.

"చుట్టూరా ఎంతటి నిస్సహాయ పరిస్థితులు క్రమ్ముకుని వున్నా వాడికీ వయసు పెరుగుతోందిగదా! పెరిగే వయసుతో బాటుగా వాడు విధించుకునే హింసలో సైతం మోతాదు హెచ్చుతూ వుండొచ్చునని నా అనుమానం."

ఊరంతా నిద్రపోయిన ఆ నిశిరాతిరి వేళ మా యిద్దరి మధ్య చాలా సేపటివరకు మౌనమే నెలకొని వుండిపోయింది.

***

యధాతథంగా నేను సారథి మాటల్ని నమ్మేశానని చెప్పడానికి వీల్లేదు. కానీ ఎన్ని రోజులు గడిచినా పోలీసులకు రిపోర్టు అందినట్టుగాని, డి.ఇ.ఓ.గారికి పిటీషన్ చేరినట్టుగానీ తెలియకపోవడంతో అతడి వాదంలో నిజం లేకపోలేదనిపించింది. ఇంతలో గాయం మానిపోయి, చక్రిగాడు కూడా బడికి రావడం ప్రారంభించాడు. చేజారిపోయిన క్లూ మళ్ళీ దొరికినట్టై వాణ్ణి నా గదిలోకి పిలిపించాను. బెదురుతూ బెదురుతూ వచ్చాడు. బెత్తం చేతికి తీసుకుని జడిపించే సరికి నిజం బయటపెట్టేశాడు.

మునసబుగారు హైదరాబాదుకు వెళ్ళి, తిరిగివస్తూ ఆరు పేనాలున్న ప్లాస్టిక్కు పెట్టెను తెచ్చారు. అందులో ఒకటి తనకిమ్మన్నాడు చక్రిగాడు. 'పోరా, పో' అన్నాడు మునసబుగారి అబ్బాయి. 'నువ్వేం చెబితే అది చేస్తా'నన్నాడు చక్రిగాడు. 'అయితే చేతిని బండపైన పెట్టి పలకతో బలంగా మోదుకో'మన్నాడు మునసబుగారి అబ్బాయి.

కొత్తపేనా దొరుకుతుందేమోనన్న అడియాసతో అంతపనీ చేశాడు చక్రిగాడు. తత్ఫలితమే ఈ గాయం!

సందర్భానికి అతికిపోయినట్టుంది గదా అని ఆ అబద్ధంద్వారా సారథిని కొంచెం బ్లాక్‌మెయిల్ చేసే ప్రయత్నం మాత్రం జరిగింది. అంతకుమించి భాగ్యమ్మకైనా తన కొడుకుపైన నమ్మకం వున్నట్టు లేదు.

"నేను కొట్టుకున్నానని చెబితే మా అమ్మకొడుతుంది సార్! అందుకని... అందుకని" మళ్ళీ నేనుకూడా కొడతానేమోనని భోరున ఏడవసాగాడు చక్రిగాడు.

❖ ఆంధ్రజ్యోతి వారపత్రిక – నవంబర్, 1975. ❖

# కాలం తెచ్చే మార్పు

మేడ ముంగిట టాక్సీ ఆగింది.

బాలాజీ రోడ్డుపైకి పరుగెత్తుకుంటూ వచ్చి పెట్టె, పరుపూ అందుకున్నాడు. అతడు వాటిని తీసుకెళ్ళి మేడపైన గదిలో పెట్టి గసపోసుకుంటూ క్రిందకి దిగివచ్చేసరికి టాక్సీ వాడికి డబ్బులిచ్చి పంపించివేసిన సుధాకరం అప్పుడే హాల్లో ప్రవేశిస్తున్నాడు.

"చినబాబుగారూ! ఉదయం నుంచీ మీకోసం చూడ్డమే. మీరొస్తున్నారని అయ్యగారు చెప్పార్లెండి! స్నానానికి వేనీళ్లు సిద్ధంగా వున్నాయి. ముందుగా కాఫీ యిమ్మన్నా సరే. ఫ్లాస్కులో పోసే వుంచాను..."

బాలాజీ పరామర్శ సుధాకరం చెవిదాకా వెళ్ళినట్టే లేదు. అతడి అంతరంగంచుట్టూ ఏవో ఆలోచనలు ఝుమ్మంటూ ముసురుకుంటున్నాయి. సోఫాలో సోలిపోతూ అడిగాడు- "బాలాజీ! నాన్నగారింట్లో లేరేమిట్రా?"

"లైబ్రరీకని చెప్పి వెళ్ళారు బాబూ!"

సుధాకరం సిగరెట్టు ముట్టించాడు. పొగ వదులుతూ బాలాజీకేసి చూచాడు. 'కాదురా బాలాజీ అర్జంటుగా టెలిగ్రామిచ్చి నన్ను పిలిపించడంలో నాన్నగారి ఉద్దేశమేమై ఉంటుందిరా?' అని అడగాలనుకున్నాడు. కానీ వాలకాన్ని బట్టి చూస్తే వీడికా టెలిగ్రాం గొడవే తెలిసినట్టు లేదు. అనవసరంగా వీణ్నికూడా కంగారు పెట్టడమెందుకు అనుకున్నాడు.

అయినా సందేహ నివృత్తికోసం యింకోవిధంగా అడగక తప్పలేదు.

"బాలాజీ! ఈ మధ్య నాన్నగారి ఆరోగ్యానికేమీ యిబ్బంది లేదుగదా?"

"అబ్బే, అదేం మాట బాబూ! ఆయనకేమండి, బాగానే వున్నారే! ఉదయం అయిదుగంటలకే లేస్తారా, ససేమిరా చన్నీళ్ళస్నానం మానుకోరు. ఏడుదాకా పూజలో కూచుంటారు. లైబ్రరీకెళ్ళి మంచి మధ్యాన్నానికి తిరిగొస్తారు. భోజనంచేసి పడుకుంటారు. లేచి పేపరు చూస్తారు. సాయంకాలం ఆరయితేచాలు గుడికి బయల్దేరడమే. తొమ్మిదింటికే తిరిగిరావడం!"

"ముందు టిఫిను సంగతి చూడవోయ్ బాలాజీ! ఆకలిగా వుంది. స్నానపానాలన్నీ తర్వాత" అన్నాడు సుధాకరం.

"మీరు కూచోండి చినబాబుగారూ! ఇక్కడున్నట్టుగా నేనిప్పుడే వస్తాను" అంటూ బాలాజీ బయటకు దూసుకున్నాడు.

సుధాకరం పరధ్యానంగానే దినపత్రిక చేతికి తీసుకున్నాడు. యాంత్రికంగానే పేజీలు త్రిప్పసాగాడు. మధ్యలో ఒక పేజి అంతటా అంకెలే కనిపించాయి. కొంచెం ఆగి. "ఓహో బియ్యే పరీక్షా ఫలితాలా" అనుకున్నాడు. ఎక్కువమంది పాసైనట్టున్నారే - అనిపించింది. అయినా ఫస్టుక్లాసులో పాసైనవాళ్ళు కొందరే! అక్కడికొచ్చేసరికి అతడిచూపు లొకచోట కదలకుండా నిలిచిపోయాయి. ఫస్టుక్లాసు వర్గీకరణ క్రింద వేసిన వాటిలో ఒక సంఖ్య క్రింద పేనాతో వేసిన ఒక చిక్కటి గీత కానవస్తుంది. మూడు- సున్న-

అయిదు– తొమ్మిది! ఎంతసేపు చూచినా ఈ అంకెలద్వారా వ్యక్తమయ్యేదేముంది? ఇంతగా నాన్నగారి ఆసక్తికి పాత్రమైన ఈ నెంబరెవరిదై వుంటుందో?

–పదేళ్ళకు మునుపు అమ్మ చనిపోయిందా? అన్నయ్య అమెరికా వెళ్ళి ఏడేళ్ళయిందా, తానుగూడా ఉద్యోగరీత్యా బెంగుళూరు చేరి రెండేళ్ళు కావస్తున్నాయా, ఇక్కడ ఈయనదొక ప్రత్యేక జీవితమైపోయింది. యెందరో స్నేహితులు, యెవరో పరిచితులు. ఏవేవో కార్యకలాపాలు...

ముసలాయన అన్ని పనులూ వదిలిపెట్టి హాయిగా రెస్టు తీసుకోగూడదూ?

సుధాకరం లేచి బీరువా దగ్గరికి వెళ్ళాడు. గాజు తలుపులు తెరచి వరుసగా అమర్చి పెట్టిన పుస్తకాలవైపు చూచాడు. వివేకానంద గ్రంధావళి – ఏడెనిమిది సంపుటాలు. సదరు స్వాములవారి జీవిత చరిత్ర చిరంతనానందస్వామి విరచితం. స్వామీ చిన్మయానంద వ్యాఖ్యానంతో భగవద్గీతలు. గండి రామకృష్ణానందస్వాముల గీతావాణి సంపుటాలు. యోగవాశిష్టం. దశోపనిషత్తులు – ఆ పుస్తకాలవైపు చూస్తుంటే సుధాకరానికి లోలోపలమంటగానే వుంది. నిజం చెప్పాలంటే వేదాంతమంటే తలనొప్పి సుధాకరానికి! 'అదంతా వట్టి థియరీ. ప్రాక్టికల్ లైఫ్‌కు పనికొచ్చేదిగాదు. పనిలేని వాళ్ళ పోసుకోలు కబుర్లు' అనుకుంటాడు. అయినా ఒక పుస్తకం అతణ్ణి ఆకర్షించింది. 'శుష్క వేదాంత'మో భాస్కరం?" మళయాళస్వాముల వారిది. శుష్క వేదాంతమనే చీకటిని పోకార్చే సూర్యకాంతే గదా యిప్పుడు మానవాళికి కావలసింది. అందుకని ఆ పుస్తకాన్ని చేతిలోకి తీసుకున్నాడు.

ఈ కుర్రాడెలా రాశాడో చూద్దామనుకుంటూ ఎర్రపెన్సలుతో కరెక్షనుకు కూర్చున్న ఉపాధ్యాయుడిలా, ఆస్వాముల వారేం రాశారో తేల్చుకోదల్చి పుస్తకాన్ని తిరగేస్తూ సోఫాలో చేరగిలబడ్డాడు.

గోడ గడియారం మూడుసార్లు మ్రోగింది.

టిక్కుటిక్కుమంటున్న పెండ్యులం సవ్వడి ఒకటి తప్పిస్తే, చుట్టూరా చిక్కటి నిశ్శబ్దమే పేరుకుపోయింది!

ఆ నిశ్శబ్దంలో ఉన్నట్టుండి ఓ కదలిక, ఎవరో వసారాలోకి వచ్చినట్టుగా అడుగుల సవ్వడి.

ముందుగా సుధాకరానికి కనిపించిన వ్యక్తి ఓ నడివయసు బక్క పలచటి మనిషి. నాలుగు మూళ్ళ పంచపైన అరచేతుల పొట్టిచొక్కా తొడుక్కున్నాడు. మెడకిరువైపులా వ్రేలాడుతూ మూడు మూళ్ళ తువ్వాలొకటి. ఉండీ లేనట్టున్న కురుచ వెంట్రుకల క్రాఫింగు. చేతిలో చిన్న సంచీ ఒకటి, లోపలి కొస్తూ, వస్తూ సుధాకరం కనిపించగానే ఆగిపోయి "నమస్కారమండీ" అన్నాడు.

"నమస్కార"మంటూ పలకరించడానికి ఉద్యుక్తుడైన సుధాకరం అగంతకుడి వెంటనే హాల్లోకి అడుగుపెట్టిన ఓ అమ్మాయి వైపు చూస్తూ కొద్దిక్షణాలవరకూ మ్రాన్పడి వుండిపోయాడు. బెంగుళూరు పూలతోటల్లో అతడు రకరకాల విరికన్నెలను చూచి వున్నమాట నిజమే! కానీ పొద్దు పొడుపువేళ స్వచ్ఛమైన జలాశయంలో వికసించిన అల్లి తామరపువ్వును చూడగలగడం మాత్రం క్రొత్త అనుభవమే! నక్షత్రాలలాంటి చిన్నచిన్న

పూలు పూచిన నీలిరంగు వాయిల్ చీరపైన ఆమె తెల్లటి జాకెట్ తొడుక్కుంది. నుదుట జ్యోతిలాంటి బొట్టు. చేతులకు మూడేసి సాదా గాజులు. ఆకృతిలో అంతకుమించిన వైభవ విశేషమేమీలేదు. అయినా హాలుకంతా ఒక కొత్తవెలుగు వచ్చేసినట్టుందెందువల్ల? సుధాకరం ఆశ్చర్యచకితుడైపోయాడు.

"అయ్యగారు నిద్రపోతున్నారు - గదండీ"

"అరగంటలో లేచేస్తారు. కూచోండి"

"పరవాలేదు బాబూ! అందాకా వసారాలో వుంటాం..." అవతలి వ్యక్తి కదలబారడం మొదలెట్టేసరికి సుధాకరానికి చిరాకేసింది.

"అయ్యా! ఇక్కడున్న ఈ సోఫాలు, కుర్చీలు మనుషులు కూచోడానికి ఉద్దేశింపబడినవే! కూచోమంటున్నానుగా? కూచోండి..." చివరికొచ్చేసరికి ప్రాధేయ పడినట్టుగా అన్నాడు సుధాకరం.

అతగాడు బిక్కమొగం పెడుతూ అమ్మాయివైపు చూచాడు. "మరేం ప్రమాదం లేదు. కూచోవచ్చు" నన్న భావం ఆమె కళ్ళల్లో ప్రతిఫలించడంతో ఆమెగూడా అదే సోఫాలో యింకొక అంచున కూర్చుంది.

వెనక్కు ఆనుకోకుండా మోకాళ్ళ పైకి వంగి కూర్చున్న ఆగంతకుడు కొద్ది నిమిషాల తర్వాత చొరవ దెచ్చుకుని "చినబాబుగారూ! మీరెప్పుడండీ బెంగుళూరునుంచీ రావడం?" అని అడిగాడు.

"అరరే, మనల్ని గురించి యితడికి తెలిసినట్టే వుంది" అనుకున్నాడు సుధాకరం. అయితే సంభాషణ కొనసాగాలంటే ఎ.ను గురించి బి.కి మాత్రం తెలిసివుంటే చాలదు. బి.ని గురించి ఎ.కి గూడా తెలిసివుండాలిగదా!

"మీరెవరో... యింతకుముందు చూచినట్టు జ్ఞాపకం లేదు..." అన్నాడు సుధాకరం.

తనపైన బహువచనం ప్రయోగించబడుతున్నందుకు అతడు కించపడిపోయాడు. ఆ కించపాటులో కుచించుకపోతూ కొనసాగించాడు– "బాబుగారూ నాపేరు కోటయ్య. ఊరవతల చక్కెర ఫ్యాక్టరీలో చిన్న ఉద్యోగం. ఈ అమ్మాయి నా కూతురు. హైస్కూలు చదువుతో బడి మాన్పించేద్దామనుకున్నాను. అంతకుమించిన వెసులుబాట్లు నాకు లేవు. ఆ మాత్రం చదువుకేదైనా ఉద్యోగం దొరుకుతుందేమోనని ఆశపడ్డాను– అవేంటమ్మాయ్? ట్రూ కాపీ గదూ? వాటిపైన సంతకం కావలసొచ్చి అయ్యగారి దగ్గరికొచ్చాను. ఆయన సర్టిఫికెట్లుకేసి ఎగాదిగా చూశారు. 'ఈ అమ్మాయి నెందుకు చదివించగూడదు?' అని అడిగారు. నేను ఉన్న పరిస్థితి చెప్పుకున్నాను. 'నువ్వొక పని చేస్తావా కోటయ్యా! అమ్మాయిని కాలేజీలో చేర్పించు. హాస్టలులోవుండి చదువుకోనివ్వు. ప్రతినెలా ఆమెకు రెండు వందల రూపాయలు ముట్టేటట్టు చూసే పూచీ నాది!' అన్నారు. ఏ దేవుడు ఆయన నాలికపైన కూచుని ఆ మాట పలికించారో తెలియదు. అన్నమాట అక్షరాలా జరిపించారు– బాబుగారూ! మా అమ్మాయి కూడా చదువుపైన ప్రాణాలు పెట్టి చదువుకుంది. బియ్యే పరీక్ష రాసింది. ఫస్టుక్లాసులో పాసయింది–"

"ఉండండి"... అంటూ కోటయ్యను వారించి అమ్మాయికేసి చూస్తూ అడిగాడు సుధాకరం... "ఏమండీ మీ నంబరు మూడు – సున్న – అయిదు – తొమ్మిది! యామై కరెక్ట్!"

అమ్మాయి బుగ్గలు ఎరుపెక్కాయి.

"అవును మీకెలా తెలుసు?"

'అమ్మో, మాటలుకూడా మధురంగానే వున్నాయే' అనుకున్నాడు సుధాకరం "నాకన్నీ తెలుసు" అంటూ బుకాయించాడు.

"ఏమనుకున్నావమ్మా వరలక్ష్మీ! అడిగి తెలుసుకున్నానుగా! చినబాబుగారదేదో పెద్ద చదువే చదువుకున్నారట! అందులో ఈయనకొచ్చినన్ని మార్కులు ఈ పాయకట్టులో ఎవరికి రాలేదట! ఆయనకు తెలీని విషయాలా?"

కోటయ్య అమాయకత్వాన్ని గమనించి తెల్లబోవడం మాత్రమే సుధాకరం వంతయింది. అయినా ఆ విషయం పైకి తెలియనివ్వకుండా "మీ అమ్మాయిగూడ ఫస్టుక్లాసులోనే పాసయిందిగా! చదివిస్తే ఎమ్మేదాకా చదివేటట్లే వుంది?" అన్నాడు.

"ఎందుకులెండి బాబుగారూ! ఇప్పటికే ఎంతో ఋణపడి వున్నాం. అమ్మాయికేదైనా ఉద్యోగం చూచిపెట్టమని నాన్నగారిని అడగాలనుకుంటున్నాను."

ఉద్యోగమా? ఈ అమ్మాయికి ఉద్యోగమా? అనుకున్నాడు సుధాకరం.

మాటల అలికిడివల్ల మామూలుకన్నా కొంచెం ముందుగానే నిద్రలేచారేమో! నారాయణమూర్తిగారు "ఏమిటోయ్ కోటయ్యా! ఎప్పుడు రావడం?" అని పలకరిస్తూ హాల్లోకి వచ్చేశారు.

కోటయ్య త్రుళ్ళిపడ్డట్టుగా లేచి నిల్చున్నాడు "నమస్కారాలండీ అయ్యగారూ! వచ్చిందింతకుముందే చినబాబుగారు కనిపిస్తే..."

"అవునవును. ఉదయం పదిగంటలకే వచ్చినా మా అబ్బాయినిగూడా నేనిప్పుడే చూస్తున్నాను. ఫోంచేశావట్రా సుధాకరం? అన్నట్టేమమ్మా వరలక్ష్మి."

అప్పటికే లేచి నిల్చున్న వరలక్ష్మి "నమస్కారమండీ" అంటూ చేతులు జోడించింది.

"కూచోమ్మా కూచో. చాలా సంతోషం. నువ్వు మీ అమ్మకూ నాన్నకూ కొండెక్కినంత ఆనందం కలిగించావు. నాకు మాత్రం? చూశావా, నిలబడే వుండిపోయావు. కూచోవాలమ్మా."

సోఫాకానించి పెట్టిన చేతి సంచీలో నుంచీ యాపిల్ పళ్ళు, అరటిపళ్లు పైకి తీసి ఆప్యాయంగా ముందుకు సాచిన నారాయణమూర్తిగారి దోసిళ్ళలో వుంచుతూ వరలక్ష్మి ఆయన పాదాలకు నమస్కరించింది.

"ఉండుండమ్మా! దీవించాలి గదూ? ఆడు బిడ్డలు లేనివాణ్ణి! ఇది కొత్త అనుభవం. ఏమనాలో తోచడంలేదే! ఆయురారోగ్యాలతో, సకల సౌభాగ్యాలతో చిరకాలం వర్ధిల్లాలి... సరేనా అమ్మాయ్?"

నాన్నగారి ముఖంలో గాంభీర్యం తప్పితే మరొక భావాన్ని చూచి ఎరుగని సుధాకరం, ఆయన కళ్ళు చెమ్మగిల్లడం గమనించి విస్తుపోయాడు.

"సరేనయ్యా కోటయ్యా! అమ్మాయి మన మాట నిలబెట్టింది. మరింక ఇప్పుడేం చేయాలన్నదే ప్రశ్న. ఇంకా చదివించొచ్చు లేదా, ఉద్యోగం చూపెట్టొచ్చు. కాదా, పెళ్ళి చెయ్యొచ్చు. ఇందులో తన కేదిష్టమో అమ్మాయి నడిగి తెలుసుకున్నావా?"

"అయ్యగారూ! చిన్నపిల్ల దానికేం తెలుస్తుందండీ! ఏం చేస్తే బాగుంటుందో తమరే సెలవివ్వాలి..."

"రిజల్ట్సు వచ్చింది ఈరోజేగదా! తొందరేముంది? ఆలోచిద్దాంలే."

"అలాగేనండీ అయ్యగారూ! మరైతే సెలవిప్పిస్తారా బాబూ."

సెలవు తీసుకుని ఆ తండ్రీకూతుళ్ళు వెళ్ళిపోయిన తరువాత నారాయణమూర్తిగారు అరమోద్పు కళ్ళతో పైకప్పుకేసి చూస్తూ చాలాసేపటివరకూ అలాగే నిశ్చలంగా సోఫాలో కూర్చుండిపోయారు.

నాలుగున్నరకు కాఫీత్రాగి ఎండ చల్లబడిన తరువాత గుడికి బయల్దేరుతూ నారాయణమూర్తిగారు సుధాకరాన్నిగూడా తనవెంట రమ్మన్నారు.

సుధాకరం ముఖంలో చిరాకు మిక్కిలిగా చిరచిరలాడింది.

ఇటీవలి ఏడెనిమిదేళ్ళ కాలంలో తాను గుడిలోకి వెళ్ళడంకానీ, దేవుడికి దండం పెట్టడంగానీ జరగలేదు. ఈ వ్రతాన్ని జీవితాంతమూ కొనసాగించాలనే వుంది. అయితే నాన్నగారి మాటకు ఎదురాడలేకపోవడం తన బలహీనత. ఈ బలహీనతను అతిక్రమించడానికి ఎన్నిసార్లు ప్రయత్నించినా ఆ ప్రయత్నం ప్రతిసారీ వీగిపోతూనే వుంది.

అబ్బే. యికపైన యిలా జరగకూడదు - అనుకుంటూనే సుధాకరం తండ్రిని వెంబడించాడు.

తీరా గుడిలో అడుగుపెట్టాక తిరుగుబాటు ప్రకోపించింది. "నాన్నగారూ! నేనలా వెళ్ళి కోనేటి మెట్లపైన కూచుంటాను" అన్నాడు.

నారాయణమూర్తిగారు వెనుదిరిగి కుమారుడి ముఖంలోకి తేరిపారజూస్తూ "అలాగే! నువ్వెళ్ళికూచో! ఇక్కడి పనులన్నీ పూర్తికాగానే నేనక్కడికొచ్చేస్తాను" అంటూ ముందుకు సాగబారిపోయారు.

సుధాకరానికి తానేమిటో ఒక అయోమయమైన సొరంగ మార్గం గుండా వెళ్తున్నట్టే వుంది. ఎప్పటికప్పుడు ఈ సొరంగం ఆఖరై పోతుందనీ, వెలుగు కనిపిస్తుందనీ అనుకోవడమే! అందుకు వాయిదా పడుతూనే వుంది.

తనతో ఏదైనా మాట్లాడవలసి వుంటే అదీయన యింట్లోనే మాట్లాడవచ్చుగదా! అందుకు గుడి ఒకటి అవసరమైందా?

రాత్రి ప్రయాణంలో కొనుక్కున్న ఇంగ్లీషు నవల ఒకటి దగ్గరుండబట్టి సరిపోయింది. ఏకాగ్రతను సాధన చేస్తున్న వాడిలా కోనేటి మెట్లపైన కూచుని అందులో సగానికి సగం చదివేశాడు.

తలపైకెత్తి చూసేసరికి నాన్నగారు పై మెట్టుమీద నిలబడి వున్నారు.

"ఆలస్యమైపోయింది గదూ! తప్పిందిగాదు. డ్యూటీ అప్పగించడమంటే మాటలా? నేనీ గుడి ధర్మకర్తృత్వాన్ని వేరే వాళ్ళకు అప్పగింతలు పెట్టేస్తున్నానురా సుధాకరం."

"ఎందుకని? ఇది మీకు చాలా తృప్తినిచ్చే పని గదండీ నాన్నగారూ! ఎందుకొది లేస్తున్నారు" విస్మయంతో ప్రశ్నించాడు సుధాకరం.

"తరువాత చెబుతానులే! మొదట నీ విషయమేమిటో తెలుసుకోవాలి. వైరిచ్చి నిన్నర్జంటుగా పిలిపించడం అందుకే."

దిక్కులు దోచనట్టుగా సుధాకరం తండ్రివైపు బిక్కరించి చూచాడు.

"చెబుతున్నాను సుధాకరం నీకు పాతికేళ్ళొచ్చాయి. అంటే ఏమన్నమాట? నీ జీవితాన్ని గురించి నీ అంతట నువ్వే నిర్ణయాలు తీసుకోదగ్గ వయసు నీకెప్పుడో వచ్చేసిందన్నమాట! బాగుంది. ఒప్పుకుంటాను. కానీ తండ్రినిగా నాకున్నూ కర్తవ్యమంటూ ఒకటుండిపోయిందిగదా! అందుకనే నీ అభిప్రాయమేమిటో తెలుసుకోవాలను కుంటున్నాను."

"దేన్ని గురించి?" భయం భయంగానే అడిగాడు సుధాకరం.

"నీ పెళ్ళిని గురించి."

"......"

"చూడు సుధాకరం ఈ విషయాన్ని గురించి మనం వీలయినంత స్పష్టంగా మాట్లాడుకోవాలి. కాసేపు రక్త సంబంధాన్ని మరిచిపోయి మనమిద్దరమూ సమానహోదా గలిగిన యిద్దరు వేర్వేరు వ్యక్తులమనుకుందాం. జీవితంలో పలుకుదోడుగా, నీకు తోడుగా వుండగలిగిన స్త్రీ వ్యక్తిని ఎన్నుకునే స్వేచ్ఛ నీకుంది. నీ హక్కును నేను గుర్తిస్తున్నాను. ఇప్పుడుచెప్పు. నీ పెళ్ళి గురించి నువ్విదివరకే నిర్ణయమేదైనా తీసుకున్నావా సుధాకరం?"

"అబ్బే. లేదండీ నాన్నగారూ..."

"తండ్రీ కొడుకులు కొందరు స్నేహితుల్లా చనువుగా, చొరవగా వ్యవహరించడం మనం చూస్తున్నాం. మంచిదో, చెడ్డదో మన మధ్య అలాంటి సాన్నిహిత్యం లేకపోయింది. బహుశా నేను చేసిన గెజిటెడ్ ఉద్యోగం నాకూ, నా చుట్టూరా వున్న వాళ్ళకూ మధ్య అంతరాన్ని పెంచి వుండొచ్చు. క్రింది ఉద్యోగస్తుల పైన నిఘా పెట్టడానికి అలవాటు పడినట్టే, నేను నా కుటుంబ సభ్యుల పైన గూడా నిఘా పెట్టి వుంచాను. చెబితే నీకాశ్చర్యంగానే వుండొచ్చు. నువ్వొకసారి మీ కాలేజి మాగజైన్‌లో వర్ణాంతర వివాహాలను గురించి ఒక వ్యాసం వ్రాశావు. ఏదో ఆషామాషీగా గాకుండా వర్ణాంతర వివాహమనేది ఒక గొప్ప ఆదర్శంగానూ, వర్తమాన సమాజానికి చాలా అవసరంగానూ నువ్వు భావించి వుండడం నేను గమనించాను. ఇంకొకసారి గొప్ప సంఘ సంస్కర్త ఒకాయన మీ కాలేజికి వచ్చినప్పుడు స్టూడెంట్సు యూనియన్ తరపున ఆయనకు సత్కారం జరిగింది. ఆ సన్మాన సభలో కొందరు విద్యార్థులు కట్నాలు తీసుకోమనీ, కులాంతర వివాహాలు చేసుకుంటామని ప్రతిజ్ఞ తీసుకున్నారు. దీనికి పేపర్లుగూడా బాగా పబ్లిసిటీ యిచ్చాయి. ఆ వార్తలోగూడా నీ పేరు కనిపించింది."

"... .... ..."

"ఎందుకు చెబుతున్నానంటే సుధాకరం. ఈ లోకంలో ప్రతి సంఘటనా నేను అనుకున్నట్టే జరగాలనీ, ప్రతి వ్యక్తీ నాకు నచ్చినట్టే ప్రవర్తించాలనీ యిప్పుడు

నేననుకోడంలేదు. ఒకవేళ అనుకున్నా అలా జరగదనీ, జరగడానికి వీల్లేదనీ గ్రహించాను. కాలం తనతో బాటు ఎన్నెన్నో మార్పులు తీసుకొస్తుంది. సంస్కృతి అన్ని మార్పుల్నీ తనలో లీనం చేసుకుని నిరంతర జీవనంగా ముందుకు సాగిపోతుంది. అర్థమైందా సుధాకరం?"

అయిందన్నట్టుగా సుధాకరం తల వూపాడు.

"నువ్వు నా ఆదర్శానికి కట్టుబడి వుండదలచుకున్నట్టయితే నీ కద్దు తగలడం నా అభిమతంగాదు. కానీ ఒక ప్రతిపాదన మాత్రం చేస్తాను. ఈ ప్రతిపాదనకైనా నువ్వు తల ఒగ్గి తీరాలన్న నిర్బంధంలేదు. కానీ వర్ణాంతరం చేసుకుంటానన్న నీ సవాలును నే నొప్పుకున్నాను గనుక, నా సవాలుకున్నూ ఒప్పుకోడం నీ ధర్మం. చేతనైతే ఆచరించు. లేదా మానేయ్. అది నీ యిష్టం..."

"చెప్పండి..." దిగులు దిగులుగానే అడిగాడు సుధాకరం.

"మధ్యాహ్నం మన యింటికొచ్చిన అమ్మాయిని చూశావుగదూ!"

"చూచాను."

"ఆమె రూపం గురించి నువ్వు వంకపెట్టవలసినదేమీ లేదనుకుంటాను..."

"లేదు. బాగుంది."

"చదువు సంగతి తెలుసా?"

"బియ్యే పాసైంది"

"గుణం గురించి నేను పూచీ పడుతున్నాను. సరేనా?"

సుధాకరం 'సరే'నని అనలేదు. ముఖ భంగిమద్వారా ఆ భావాన్ని మాత్రం సూచింపగలిగాడు.

"ఇంతకుమించి నువ్వు వాళ్ళ కులం సంగతి అడగొద్దు. ఆస్తీ, అంతస్తూ గురించి తలవొద్దు. అత్తగారింటికి వెళ్తే నువ్వు కూచోడానికి సాదా గాద్రెజ్ కుర్చీ అయినా లేకపోవచ్చు. పడుకోడానికి అరుగు తప్పితే నులకమంచమైనా వుండకపోవచ్చు. వాళ్ళు కుండల్లో వండుకుని, సత్తు లోటాల్లో నీళ్ళు త్రాగే వాళ్ళు కావచ్చు. వాళ్ళ పూరింట పైకప్పు బలంగా గాలీ వీస్తే కొట్టుకుపోయేది కావచ్చు. సహధర్మిణి విషయంలో ఏ మగవాడైనా కోరుకోదగ్గ మూడు ముఖ్య లక్షణాలూ ఈమెలో వుండడం నీకు ముఖ్యం. ఒకటి ఏ యింటికైనా లక్ష్మిగా వుంటుంది. రెండు తెలివితేటలకు కొదువలేదు. మూడు బుద్ధిమంతురాలు... వింటున్నావా సుధాకరం! పరవాలేదు. ఒకటి రెండు రోజులు బాగా ఆలోచించాకనే నీ నిర్ణయాన్ని తేల్చి చెప్పొచ్చు"

కుంభవర్షం కురిసిన తర్వాత ఏర్పడిన ప్రశాంతతలా పది పదిహేను నిమిషాల వరకు ఆ యిద్దరి మధ్య మౌనం నెలకొంది.

ఆపైన వున్నట్టుండి నారాయణమూర్తిగారే ప్రారంభించారు.

"ఏమిట్రా సుధాకరం! నిన్ను నేనేదో గాడిద గత్తరలో యిరికిస్తున్నానని అనుకోవద్దు. నూటికి నూరుపాళ్ళు నీ కిష్టమైతేనే అంగీకరించు. నచ్చకపోతే మానేయ్. ఎటొచ్చీ నువ్వీ ప్రతిపాదన ఒప్పుకుంటే నీకయినా, నా చేతుల మీదుగా పెళ్ళిచేసే అవకాశం చేకూరుతుంది.

లేకపోతే ఆ ప్రాప్తంకూడా లేకుండా పోతుంది. ఎందుకంటే సుధాకరం- నేనింకొక నెలరోజులు మాత్రం దేశంలో వుంటాను."

ఆపైన, ఆపైన - అన్న ప్రశ్న సుధాకరం బుర్రలో మాత్రమే ప్రతిధ్వనించింది. పెదవులు మాత్రం కదలడానికి మొరాయించాయి.

"అవున్రా బాబూ! పాస్‌పోర్టు వచ్చి పదిరోజులైంది. సీటు రిజర్వు చేయించమని ఒక స్నేహితునికి వ్రాశాను. నెలరోజుల్లో నేను అమెరికా వెళ్తున్నాను."

సుధాకరానికి అర్ధమైంది. నాన్నగారు అమెరికన్ అమ్మాయినే కోడలుగా మన్నించగలుగుతున్నారు. ఇక రెండో కోడలుగా వరలక్ష్మి ఆయనకు నచ్చడంలో ఆశ్చర్యమేముంది?

❖ ప్రభవ - నవంబరు, 1978 ❖

# భగవంతుడి వారసులు

"అమ్మా, అమ్మా! ఎదురింటి కెవరో దండిగా మనుషులొచ్చారు. ఎందుకొచ్చారమ్మా వాళ్ళు?" కుతూహలంతో ప్రశ్నించాడు చిట్టిబాబు.

కిటికీలోంచి ఓసారి వెలుపలికి చూచి "పనివాళ్లులేరా చిట్టిబాబూ! ఇంటిని రిపేరు చేయటానికి వచ్చినట్టున్నారు" అంది పార్వతమ్మ.

"ఎందుకమ్మా రిపేర్ చెయ్యడం?"

"ఇల్లు పాడుబడిపోయిందికదరా మరి! గోడలకు కన్నాలు పడ్డాయి. గచ్చు లేచిపోయింది. ప్రహరీ అక్కడక్కడా కూలిపోయింది. పెరడు అడివిలా బలిసిపోయింది. వాళ్ళదంతా బాగుచేసి వెళతారు..."

"ఎందుకమ్మా బాగు చెయ్యడం?"

"ఇప్పుడయితే అందులో ఎవరూ లేరనుకో. ఇకమీదట అలాకాదు. ఎవరో పెద్దాయన ఆ యింట్లో చేరబోతున్నారు..."

"ఎవరమ్మా ఆ పెద్దాయన?"

ఇలా కాదన్నట్టు పార్వతమ్మ కొడుకును పైకెత్తి కిటికీ అంచున నిల్చోబెట్టింది.

"చూడరా బాబూ! పొడుగు చేతుల చొక్కా, లావాటి మీసాలు, తలలో వెంట్రుకలు సగం పైగా నెరసిపోయాయి. ఆయనే ఎదురింటికి రాబోతున్నది..."

"నేనెప్పుడూ ఈయన్ని చూడలేదు. ఎవరమ్మా ఈయన? ఏ వూరు?"

"ఒరే చిట్టిబాబూ! నీ ప్రశ్నలకన్నింటికీ జవాబులు చెప్పడానికి నాకు తీరికలేదు. పోయి మీ నాన్నగారి నడుగు" అంటూ పార్వతమ్మ పెరట్లోకి వెళ్ళిపోయింది.

వసారాలో చాప వేసుకుని కూర్చుని ఆఫీసు కాగితాలు చూసుకుంటున్న చిదానందం పరుగెత్తుకుంటూ వచ్చిన చిట్టిబాబువైపు చూచి "ఏరా చిట్టిబాబూ! ఏం కావాలి?" అన్నాడు.

"మరేమీ ఒద్దులే నాన్నా! అమ్మకు తెలీదట! ఆ లావాటి మీసాలాయన ఎవరు!"

"ఆయన పేరు మధుసూదనరావుగారు. ఆయన పేరు చెప్పినంత మాత్రాన నీకేం తెలుస్తుందిరా చిట్టిబాబూ! 'జిల్లా అధికారి కలెక్టరు' అంటూ చదువుకున్నావు గదా! ఈయన ఆ పనే చేసేవాడు. ఇప్పుడు పెద్ద వాడైపోయాడు గదా! విశ్రాంతి తీసుకుంటున్నాడు. అందుకు ఒక ఇల్లు కొన్నాడు. ఇక పైన ఇక్కడే వుండిపోతాడట! తోడుగా వంటచేసి పెట్టటానికొక వంటవాడుంటాడు. సరేనా?"

చిట్టిబాబు ఆలోచిస్తూ కూర్చున్నాడు. రెండు నిమిషాలలా ఆలోచించేసరికి వాడి బుర్రలో మళ్ళీ ఒక సందేహం బయల్దేరింది.

"వంట చేసిపెట్టటానికి వాళ్ళవాళ్లెవరూ లేరా నాన్నా?"

"భార్య లేదట్రా పాపం, చనిపోయిందట! కొడుకులు, కూతుళ్ళూ వున్నారనుకో! కొడుకులెక్కడో ఉద్యోగాలు చేసుకుంటున్నారు. కూతుళ్లు వాళ్ళ వాళ్ళ అత్తగారిళ్లల్లో వున్నారు. వాళ్లు తమ దగ్గరుంటే తమ దగ్గరుండమని బలవంతం చేస్తున్నారట. ఒకరి దగ్గరుంటే

వేరొకరికి కోపం రాదూ! అందుకే ఆయన ఇక్కడుంటున్నారు. సర్లే, బడికి టైమవుతోంది. వెళ్ళి పుస్తకాలు సర్దుకో."

ఆనాటి సాయంకాలం చిట్టిబాబు బడినుంచీ యింటికి వచ్చేసరికి ఎదురింటి స్వరూపము మారిపోయింది వెల్లవేసిన గోడలు తెల్లగా మెరుస్తున్నాయి. ఇంటిచుట్టూ ఇప్పుడు అడివిగూడా లేదు.

రోజులు గడిచేకొద్దీ ఆ యింటిచుట్టూ తోట పెరగసాగింది. ఇల్లు శుభ్రంగా వుంటుంది. లోపలనుంచి రేడియోగూడా వినవస్తోంది. అక్కడ లేనిదొక్కటే – మనుషుల సందడి.

పాపం! అంతపెద్ద యింట్లో ఆ లావాటి మీసాలాయనకెలా పొద్దుపోతుందో, అనుకునేవాడు చిట్టిబాబు.

***

తొంభై పైసలు పెట్టి చిదానందం చిట్టిబాబుకొక రబ్బరు బంతిని కొని తెచ్చాడు. బంతి చాలా బాగుంది. పెద్దదిగూడా. కర్రతో కొడితే చివాలున పైకెగిరిపోతుంది. ఉదయంనుంచీ అదే ధ్యాసగా బంతితో ఆడుకుంటున్నాడు చిట్టిబాబు. కన్నుమూసి తెరిచేటంతలో ఒక ప్రమాదం జరిగిపోయింది. ఆ మాయబంతి ఒక్కపెట్టున పైకెగిరి ఎదురింటి గుమ్మంలో దూరి గోడకూ తగిలించివున్న గాంధీతాత పటానికి తగిలి హాల్లో దొర్లసాగింది.

భయంతో చిట్టిబాబు గుండె కొట్టుకోసాగింది. మరొక వస్తువేదయినా అయితే, పోతేపోయింది లెమ్మని ఇంటిలోకి తుర్రుమనేవాడే! రబ్బరు బంతిపైన మోజు అలా చేయనివ్వలేదు. ఎలాగయినా బంతిని తెచ్చుకోవాలి. హాల్లో ఎవరయినా వున్నారేమో? మెల్లగా తక్కుతూ తారుతూ బెదురు బెదురుగానే గుమ్మందాకా వెళ్ళి లోపలికి తొంగిచూశాడు చిట్టిబాబు.

"వచ్చావా అబ్బాయ్! బంతికోసమే గదూ?" గంభీరంగా కంఠం వినిపించింది. బొద్దు మీసాలాయన వాలుకుర్చీలో ప్రత్యక్షమయ్యాడు.

"అవున్సార్! అవునండీ..."

"ఇలా లోపలికి వచ్చి ఎదురుగా నిలబడు..."

సింహం దగ్గరికి వెళుతున్న కుందేలు పిల్లలా చిట్టిబాబు నాలుగడుగులు లోపలికి వేశాడు.

"బంతితో ఆడుకోవచ్చు. కానీ దాన్ని ఇతరుల ఇళ్లల్లో పడేటట్టుకొట్టడం తప్పుకదూ?"

"తప్పేనండీ!"

"బంతి పటానికి తగిలింది. అందులోనూ బాపూ పటానికి. పడినచోట మరకగూడా అయింది. క్రిందపడి పగిలిపోయి వుంటే?"

చిట్టిబాబు పటంవైపు చూచాడు. పటంలోని తాతయ్యకు కోపం వచ్చినట్టులేదు. చిట్టిబాబు కళ్ళు క్రిందకి దించాడు. బొద్దు మీసాలాయన తనవైపు సూటిగా చూస్తున్నాడు.

"నేను కావాలని కొట్టలేదండీ! ఎలా వచ్చిందో పటానికి తగిలింది. ఇంకెప్పుడూ యిలా కొట్టనండీ!"

"అబ్బే, కాదులే అబ్బాయ్! తప్పు తప్పే! తప్పు ఒప్పుకోవాలి. శిక్ష అనుభవించాలి. అదీ బుద్ధిమంతుల లక్షణం. ఒప్పుకుంటావా?"

"అలాగేనండీ!"

"అయితే వుండు. ఒక క్షణంలో వస్తాను. తప్పించుకోడానికి ప్రయత్నించావో శిక్ష రెట్టింపవుతుంది..."

మధుసూదనరావుగారు లేచి లోపలకి వెళ్ళారు. చిట్టిబాబుకు అతడు నిల్చున్న నేల కంపించిపోతున్నట్టుగా వుంది. కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి.

ఇంతలో మధుసూదనరావుగారు మళ్లీ హాల్లోకి వచ్చాడు.

యథాస్థానంలో కూర్చుంటూ "అయిదు నిమిషాలాగాలి. తరువాత చెబుతాను. ముందుగా నేనడిగిన ప్రశ్నలకు జవాబులివ్వు. నీ పేరేమిటి?"

"మా అమ్మా నాన్నా చిట్టిబాబంటారండీ! బడిలోనేమో నాపేరు హరికృష్ణ..."

"ఏ తరగతి?"

"నాలుగో తరగతి చదువుతున్నానండీ,"

"మీ నాన్న పేరేమిటి?"

"చిదానందంగారండీ."

"ఆయనేం చేస్తారు?"

"ఆఫీసులో పనండీ."

"పెద్దవాడివయితే నువ్వేం చేస్తావు?"

చిట్టిబాబు ఏం చెప్పాలో తోచక గుటకలు మ్రింగసాగాడు.

ద్వారం దగ్గర అడుగుల చప్పుడయింది. వంటమనిషి సుబ్బయ్య ఒక చేతిలో ప్లేటు, మరో చేతిలో నీళ్ళగ్లాసు తీసుకొచ్చి బల్లపైన పెట్టాడు.

"ఇలా వచ్చి కూర్చో" అన్నాడు మధుసూదనరావుగారు.

చిట్టిబాబు తటపటాయించాడు.

"ఊ", కూర్చో" స్వరం హెచ్చింది.

ఎగిరి కుర్చీలో కూర్చున్నాడు చిట్టిబాబు.

"ఆకు తీసేసెయ్..."

చిట్టి పాదాలకు నేల అందడంలేదు. చేతులకు టేబులుపైన వున్న ప్లేటు అందడం లేదు. మధుసూదనరావుగారు చటుక్కున పైకి లేచి చిట్టిబాబును పైకెత్తి టేబిలుపైన కూర్చోబెట్టారు. చిట్టిబాబు ఆకు తీసేశాడు. ప్లేటులో గారెలు ప్రత్యక్షమయ్యాయి.

"ఊఁ, త్వరగా ముగించు. అన్నీ తినెయ్యాలి. అదే నీకు శిక్ష. ఇకపైన బంతిని యిలా ఇరుగు పొరుగు ఇళ్ళల్లోకి కొట్టగూడదు. ఇంకొకటేమిటంటే, నువ్వు ప్రతిరోజు యిక్కడికి రావాలి. తెలిసిందా చిట్టిబాబూ?"

"తెలిసిందండీ."

"ఏమిటి తెలిసింది?"

"ప్రతిరోజు యిక్కడికి రావాలి."

"ఎందుకు?"

"ఎందుకో మీరు చెప్పలేదండీ!"

మధుసూదనరావుగారు గొల్లున నవ్వేరు.

"ఎందుకంటే మనిద్దరం యికమీదట స్నేహితులం. నేను నీతో కలిసి ఆడుకోలేననుకో! కానీ మంచి కథలు చెబుతాను. ఏమంటావ్?"

"అలాగేనండీ!"

"అన్నీ తినేశావ్‌గదూ? మెల్లగా దిగు. ఇక వెళ్ళు..."

తూనీగలా పరుగెత్తాడు చిట్టిబాబు.

***

"ఒరే చిట్టిబాబూ! అరగంటసేపటినుంచీ కనిపించలేదు. ఎక్కడికెళ్ళావురా?" అడిగింది పార్వతమ్మ.

"నీకు తెలియదులేవే అమ్మా! బొద్దు మీసాలాయన చాలా మంచాయన..." అన్నాడు చిట్టిబాబు.

"ఎందుకెళ్లావురా ఎదురింటికి? ఆయన చెడ్డవారట. భలే స్ట్రిక్టు ఆఫీసరట. తాశీల్దార్లు, రెవిన్యూ ఇన్‌స్పెక్టర్లూ ఆయనంటే హడలిపొయ్యేవారట! మీ నాన్నగారు చెప్పారు..."

"అన్నీ అబద్ధాలే."

"కుర్రకుంకవి నీకేం తెలుసురా ఆయన మంచితనం?"

"ఆయన నాతో నేస్తం కడతానన్నాడు. కథలు చెబుతానన్నాడు. గారెలు తినమన్నాడు..."

"ఏమిట్రా ఇది?' అంటూ ఆశ్చర్యపడి, "ఇంతకూ నువ్వే వెళ్లావా అక్కడికి?" అని ప్రశ్నించింది పార్వతమ్మ.

"లేదమ్మా! నేను కొట్టిన బంతి ఎదురింట్లోకి వెళ్ళి గాంధీ పటానికి తగిలింది. నేనేమో తెచ్చుకుందామని అక్కడికి వెళ్లాను. అప్పుడు లావాటి మీసాలాయన..."

"ఓరి, నీ యిల్లు బంగారంగానూ! నీ ఒళ్ళు హూనం గాలేదట్రా చిట్టిబాబూ? కొట్టవలసిందిపోయి ఆయన నీకు గారెలు పెట్టాడా? నిజమేనట్రా?" విస్తుపోయింది పార్వతమ్మ.

చిట్టిబాబుకు కూడా లోలోపల చిత్రంగానే వుంది.

మరునాటి సాయంకాలం చిట్టిబాబు బడినుంచీ వచ్చేసరికి, తనకోసం ఎదురింటి వంట ఆయన వచ్చి వెళ్ళినట్టు తెలిసింది. "ఒరే, చిట్టిబాబూ! నీకు పిలుపొచ్చింది. బొద్దుమీసాలాయన రమ్మన్నాడట" అంది పార్వతమ్మ.

చిట్టిబాబుకా రోజు యెదురింట్లో కమలాపళ్లు దొరికాయి. గ్లాసునిండుకూ నిమ్మరసం దొరికింది. అయితే వీటికన్నా వాడికి మీసాలాయన చెప్పిన కథే బాగుంది.

ఎవడో సిందుబాదనే నావికుడుంటాడట. అతడు సముద్రంపైన ఎన్నెన్నో దేశాలకు

వెళతాడట! ఒక దేశంలోనయితే గండభేరుండ పక్షి ఒకటి అతన్ని తన్నుకపోయింది! అయినా ఎలాగో తప్పించుకున్నాడట! 'అమ్మో! ఎంత గుండెలుతీసినబంటో" అనుకుంటూ ఆశ్చర్యపోయాడు చిట్టిబాబు.

ఎదురింటాయన మీసాలేకావు ఆయన చెప్పేకథలుకూడా చాలా పెద్దవి. అయితే ఒకటి. పొద్దుపోయి, దీపాలు వెలిగేసరికి ఆయన కథను ఆపేస్తాడు. "వెళ్ళి చదువుకో చిట్టిబాబూ! మిగిలిన కథ రేపు చెబుతాలే" అంటాడు.

అమ్మో, ముసలాయన చిట్టిబాబు కెన్నెన్ని కథలు చెప్పాడని! గలివర్ బ్రాబ్డింగు నాగు దేశం వెళ్ళిన కథ చెప్పాడు. ఆలీబాబా, నలభై దొంగలకథ చెప్పాడు. అన్నిటికన్నా కాబూలీవాలా కథంటే చిట్టిబాబుకు చాలా ఇష్టం. వింటుంటే ఏడుపొస్తుంది. అయినా వినాలనే వుంటుంది.

రోజులు దొర్లిపోతున్నాయి. చిట్టిబాబు యెదురింటి మీసాలాయనతో నేస్తం కట్టి మూడు మాసాలయింది.

ఒకరోజున ఉన్నట్టుండి ఆయనన్నాడు; "చూడు చిట్టిబాబూ! పైవారంనుంచీ మనకు పండగ! యెందుకో తెలుసా? మనకింకా చాలామంది స్నేహితులు రాబోతున్నారు..."

ఎవరు వాళ్ళు? ఎందుకొస్తారు? ఎన్నాళ్ళు వుంటారు? ఇలా చిట్టిబాబు కెన్నెన్నో ప్రశ్నలడగాలనే వుంది. కానీ అంతలోనే దీపం వెలిగింది.

మరునాటినుంచీ వేసవి సెలవులు ప్రారంభమయ్యాయి. చిట్టిబాబు వాళ్ళమ్మమ్మగారి ఊరికివెళ్ళి వారం రోజులుండి వచ్చాడు. వచ్చి చూసేసరికేమయింది? ఎదురింట్లో ఒక పిల్లల పటాలమే దిగేసింది.

జ్యోతి, ప్రసాద్, కిరణ్, కుమారి, చందన, రమ, ఆనంద్, రవి, భాను యిలా చాలాపేర్లు వినిపిస్తున్నాయి.

ఊరినుంచి తిరిగివచ్చిననాటి మధ్యాహ్నం మూడు గంటలప్పుడు చిట్టిబాబు తక్కుతూ తారుతూ వెళ్లి యెదురింటి ప్రహరీ గేటు దగ్గర నిలుచున్నాడు. కాంపౌండు లోపల గున్న మామిడి చెట్టుకింద పిల్లలందరూ ఆడుకుంటున్నారు. ఒకడు బూరా ఊదుతున్నాడు. ఇంకొకడు పిల్లిమొగ్గలు వేస్తున్నాడు. వేరొకడు కొమ్మకు కట్టిన ఉయ్యాలలో ఊగుతున్నాడు. అమ్మాయిలు కొంచెం దూరంలో బొమ్మరిళ్ళు కట్టుకుంటున్నారు.

"ఎవడో తొంగిచూస్తున్నాడు రోయ్" అన్నాడు కిరణ్.

"ముక్కు చూసారా? చిలకముక్కులా లేదూ?" అన్నాడు ఆనంద్.

"వాణ్ణి పట్టుకోవాలి. ముక్కు చితకగొట్టాలి. గోతంలోవేసి మూటకట్టాలి..." అంటూ ప్రారంభించాడు ప్రసాద్.

"పాపం, ఏడవడూ?" అంది చందన.

"ఇష్, ఊరుకో! ఇలాంటి వాళ్ళను లోపలికి రానీకూడదు. ఒరేయ్ ఆనంద్, కిరణ్ అందరూ రండిరా..." పిల్లలందరూ ప్రసాద్ పిలుపందుకుని, కళ్లు పెద్దవిచేసి, పిడికిళ్ళు బిగించి పౌడుకరుచుకుంటూ ముందు కురికారు.

చిట్టిబాబుకు మతిపోయినంత పనయింది. పరుగో పరుగు... పడుతూ లేస్తూ వెళ్లి వాళ్ళ యింట్లో పడ్డాడు.

"ఏమిట్రా చిట్టిబాబూ! ఏమయింది?" అని ప్రశ్నించింది పార్వతమ్మ.

"ఎదురింటి కుర్రాళ్లే అమ్మా! ఊరికేనే నాపై కొస్తోన్నారు..."

"అవును మరి! వాళ్ళందరూ ముసలాయన మనమలూ, మనుమరాళ్ళూ. పెద్దపెద్ద పట్నాలనుంచీ వచ్చారు. కాన్వెంటుల్లో చదువుతారట! కారుల్లోనే తిరుగుతారట! వాళ్ళు నిన్ను తమతో చేరనిస్తారా? వద్దులే బాబూ, నువ్వావేపు వెళ్లనేవద్దు" అంది పార్వతమ్మ.

సరిగ్గా ఆ సమయానికి ఎదురింటి పిల్లలు గున్నమామిడి చెట్టుకింద విజయోత్సాహం జరుపుకుంటున్నారు. ఎవడో శత్రురాజుల గూఢచారి తమ రాజ్యంలోకి జొరబడాలని చూచాడు. తుపాకీ పేల్చేసరికి తిరిగి చూడకుండా పారిపోయాడు. ఇకపైన యెప్పుడయినా తలచూపిస్తే అప్పుడు చెప్పాలి వాడి పని!

***

నాలుగురోజులు దొర్లిపోయాయి ఎదురింటి పిల్లలు ఈ నాలుగు రోజుల్లోనూ శత్రురాజుల గూఢచారిని తమ రాజ్యం దరిదాపులలోకి రాకుండా చేయగలిగారు. తప్పిదారి చిట్టిబాబు యెప్పుడయినా వీధిలో కనిపిస్తే అరచి, గీపెట్టి, ముక్కు కోసేస్తామని భయపెట్టి, బెదిరించి నానా అల్లరీ చేశారు. తలుపులు బిడాయించుకుని ఇంట్లో వుండడమే చిట్టిబాబుకు క్షేమమైపోయింది.

ఒకనాటి మధ్యాహ్నం మధుసూదనరావుగారు హాల్లో ఫాను క్రింద కూర్చుని భోజనం చేస్తూండగా పెద్ద గగ్గోలు ఏదో వినిపించింది. ఆయన కిటికీలోనుంచి వెలుపలికి తొంగి చూచారు. పిల్లలందరూ మామిడి చెట్టెక్కి కొమ్మకొకడు చొప్పున కూర్చున్నారు. ఊరికే కూర్చున్నారా? అప్పటికప్పుడే పాటలుకట్టి బిగ్గరగా పాడేస్తున్నారు. 'చిట్టీ చిట్టీ శ్రీరంగం చిట్టీ పెళ్ళాం తారంగం' అని ఒకరు, 'చిట్టిబాబు, చిట్టిబాబు జానెడంత, చిట్టిబాబు ముక్కేమో బారెడంత' అని ఒకరు, 'చిట్టీ చిట్టీ, సున్నపు బట్టీ' అని ఒకరు...

చెట్టుకింద కూర్చున్న అమ్మాయిలు మగపిల్లల పాటలకు వంతపాడుతున్నారు.

ఎదురింటి గుమ్మం వెనుక నిల్చున్న చిట్టిబాబు దీనంగా వీళ్ళవైపు బిక్కచూపులు చూస్తున్నాడు.

"ఒరేయ్ అబ్బాయిలూ!" ఉరుములు ఉరిమినట్లుగా పిలుపు వినిపించింది.

మగపిల్లలొక పెట్టున క్రిందకు దూకేశారు.

"అందరూ యిలావచ్చి నిల్చోండి."

కిక్కురుమనకుండా పిల్లలందరూ వరండాలోకి వచ్చి వరసగా నిల్చున్నారు.

చేతిని పైకెత్తి దోసిలిలోవున్న పట్టెడు అన్నాన్నీ దూరంగా తోటలో పడేటట్లుగా విసిరాడు మధుసూదనరావుగారు. అన్నపు పెళ్ల క్రిందపడగానే ప్రిదిలి మెతుకులన్నీ చెల్లాచెదరైపోయాయి.

"ఏం చేశానో చూచారుగా! ఇప్పుడేం జరిగేదీ మీరు చెప్పాలి. ఊఁ, చెప్పవోయ్ ప్రసాద్..."

"ఓ కాకి వచ్చి వాలింది తాతయ్యా!"

"వ్రాలి ఏం చేసింది? అన్నం ముట్టుకుందా, లేదా? నువ్వు చెప్పరా ఆనంద్!"

"ముట్టుకోలేదు తాతయ్యా! కావు కావుమంటూ అరుస్తోంది..."

"అదిగో, యింకో కాకిగూడా వచ్చేసింది" అన్నాడు కిరణ్.

"అదయినా అన్నం ముట్టుకోలేదు తాతయ్యా! కావు కావుమనే అరుస్తోంది" అన్నాడు రవి.

"అబ్బో, అబ్బో! యెక్కడున్నాయో యేమిటో, బోలెడన్ని కాకులొచ్చేశాయ్ తాతయ్యా!" అన్నాడు భాను.

"అన్నీ కలిసి యిప్పుడేం చేస్తున్నాయ్?" రావుగారు ప్రశ్నించారు.

"ఇప్పుడన్నీ ఒక్కొక్క మెతుకే యేరుకొని తింటున్నాయి తాతయ్యా!" చందన అంది.

"మంచిది. కాకులకున్నంత మాత్రం బుద్ధి అయినా మనుషులకు లేకపోతే యెలా గమ్మా? చిట్టిబాబును హడలగొట్టచ్చా? వాడయినా మీలాంటి వాడేగదా! వాణ్ణి ఏడిపించడం తప్పుకాదూ?"

పిల్లలు ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. అందరూ ఒకే గొంతుకతో "తప్పేతాతయ్యా!" అన్నారు.

"ఈ తప్పుకు శిక్షేమిటో తెలుసా?"

"గుంజిళ్ళు పెడతాం తాతయ్యా!" అన్నాడు ప్రసాద్.

"ఇంటి చుట్టూ పదిరౌండ్లు పరిగెత్తుకొస్తాం" అన్నాడు ఆనంద్.

"అదేం వద్దు. మీరు చిట్టిబాబుతో స్నేహంగా వుండాలి. మీరీ వూరునుంచి వెళ్లేటంతవరకూ వాణ్ణిగూడా మీతోబాటు మన యింటిలోనే వుండనివ్వాలి..."

***

మరునాటి ఉదయం రావుగారికి గున్నమామిడి చెట్టు నీడలో ఆడుకుంటున్న పిల్లలలో చిట్టిబాబుగూడా కనిపించాడు. ఆయన కళ్ళు ఆనందంతో మెరిశాయి.

❖ జ్యోతి - నవంబర్, 1979. ❖

# పులిపైనస్వారి

ముళ్ళపైన నిల్చోడమంటే ఏమిటో నాకారోజే తెలిసింది. తనదైన సర్వస్వాన్ని ఒక లాటరీలో పెట్టిన తరవాత, కొద్దిగంటల వ్యవధిలో ఫలితాలు రాబోతున్నాయనగా ఆ మానవుడి పరిస్థితి ఎలా వుంటుందో ఊహించుకోగలరు. నా అవస్థ అంతకన్నా మెరుగ్గా లేదని చెప్పగలను. ఎప్పుడెప్పుడు సాయంకాలం అయిదు గంటలవుతుందా అని ప్రాణాలు ఉగ్గబట్టుకొని కూచున్నాను.

నిక్షేపరాయుడు కోదండయ్య. మనిషిలో కించిత్తు ఉద్వేగమైనా కానరావడం లేదు. నీరెత్తిన నిమ్మలా గదిలో గురకపెడుతూ నిద్రపోతున్నాడు.

కోదండయ్య పిట్టలాంటి మనిషి. ఒక రూపాయికి దొరికే జ.ఏతా భోజనమే తనకు చాలునంటాడు. గాలీ వెల్తురూ సరిగ్గా ఆడని అద్దెగదిలో తనకు మాత్రమే సరిపోయే సన్నటి చిరుసిరిచాపపైన పడుకుంటాడు. సినిమా పత్రికలే తలగడగా పెట్టుకుంటాడు. వేసుకున్నవి గాకుండా ఇంకొక రెండు జతల దుస్తులు డొక్కు ట్రంకుపెట్టెలో వుంటాయి. డబ్బెక్కడ పెట్టుకుంటాడో తెలియదు. రోజుకయిదు రూపాయలకన్నా ఎక్కువ ఖర్చుపెట్టడు.

ఇలాంటి కోదండయ్య సినిమా తీస్తాడంటే నమ్మడం ఎవరికైనా కష్టమే! కానీ గాలిమళ్ళి అతడు గోదాలోకి దిగితే తప్పకుండా సినిమా తీయగలడని నమ్మగలిగిన వాడు కనీసం ఒక్కడైనా ఈ మదరాసు మహానగరంలో వున్నాడు. ఆ ఒక్కణ్ణి నేనే!

నేనలా అనుకోడానికి కారణం సినిమా ప్రపంచానికి సంబంధించిన సర్వ రహస్యాలూ నా గుప్పిట్లో వుండడమే! ఈనాడు సినీ సామ్రాజ్యాన్ని నిరాఘాటంగా ఏలుకుంటున్న ప్రొడ్యూసర్లలో చాలామంది యింతకన్నా బికారి వేషాలతోనే రంగంలో అడుగుపెట్టారని నేనెరుగుదును. వేషమని ఎందుకంటున్నానంటే కోదండయ్య నిజమైన బికారి కాదని నాకు తెలుసు.

ఎలా తెలిసిందంటారా, చెప్పవచ్చిందదే!

పైన పేర్కొన్న ప్రకారంగా కోదండయ్య మదరాసులో మకాం పెట్టి ఎంతకాలమైందో నాకు తెలియదు. నాకతడు తారసిల్లి మాత్రం ఒక యేడాది దాటింది. ఈ సంవత్సర కాలంలోనూ ఒకసారి వరుసగా ఒక పదిహేను రోజులపాటు అతడు కనిపించకపోయేసరికి పిచ్చిపట్టినట్టయిపోయి నేను నేరుగా వాళ్ళ వూరిలోనే వ్రాలిపోయాను. అక్కడ నాకు 'ఔరా కోదండయ్యా!' అంటూ ముక్కుమీద వ్రేలేసుకోవలసిన పరిస్థితి ఎదురైంది.

ఆంధ్రా-తమిళనాడు సరిహద్దుల్లో వున్న ఒక కుగ్రామం కోదండయ్య పుట్టకవల్ల పావనమైంది. టి.నగర్, మాంబళం, కోడంబాకంలలో అనామకుడై వుంటూ స్టూడియోల చుట్టూ తిరిగే కోదండయ్య పేరు ఆ ప్రాంతంలో ఆబాల గోపాలానికంతా తెలుసు. అయితే అతడినక్కడ 'కోదండయ్య'గా వ్యవహరించరు. 'అయ్యగారు' అంటూ మర్యాద చెల్లిస్తారు. న్యాయమే! కోదండయ్య పెట్టిపుట్టిన వాళ్ళల్లో జమ. మాగాణీ, మెట్టా, మామిడితోపూ, కొబ్బరితోటా అంతా కలుపుకుంటే అతడు నూరెకరాల స్థితిమంతుడు. చాలనిదానికి తండ్రి, తాతలు రొఖ్ఖమూ, బంగారమూ గూడా బాగానే మిగిల్చి

పోయినట్లున్నారు. అతడి పశువుల దొడ్డే సుమారుపాటి హైస్కూలంత వుంటుంది. పెళ్ళికాని బావమరిది ఒకడు సేద్యనాద్యాలు శ్రద్ధగా చూచుకుంటాడు. లెక్కలు చూసుకుని ఆదాయాన్ని పదిలపరచడంలో అతడికి దొరికిన భార్యగూడా బాగా సమర్థురాలు. ఇన్నింటికి పైగా అతడికి బిడ్డలు లేరు. మహానుభావుడు జీవితంలో ఎంతటి రిస్కయినా తీసుకోవచ్చు. కానీ ఆ ఒక్క సుగుణమే అతడిలో లేనిది.

కోదండయ్య అనుమానాల పుట్ట!

అసలింతకూ సినిమా తీయాలన్న కోరిక అతడిలో వేరూనుకోడమే విచిత్రం!

అతణ్ణి కార్యోన్ముఖుణ్ణి చేయడానికి నేను సల్పిన దోహదక్రియలు అన్నీ యిన్నీ కావు. ఎన్నెన్ని విధాలుగా ధైర్యం నూరిపోసినా అతడి దొకటే జవాబు – 'ఉండవయ్యా పంతులూ ఇంకా కొన్నాళ్ళుపోనీ. అసలే దిక్కుమాలిన ఫీల్డు. దీన్ని బాగా 'స్టడీ' చెయ్యాలిగదా?'

ఈలోగా అతడు నాకు పెట్టిన పరీక్షలకు లెక్కలేదు.

–'ఏమయ్యా పంతులూ! హీరోయిన్ హీరో చనిపోయాడనుకుంటుంది. నిజానికతడు చనిపోలేదు. హఠాత్తుగా వచ్చి ఆమె ఎదుట ప్రత్యక్షమైపోతాడు. హీరోయిన్‌కు నోట మాటరాదు. కొంతసేపటి తర్వాత నోరు మెదుపుతుందనుకో! అప్పుడామె ఒక పాట పాడుతుంది. ఏదీ, ఎలా వుండాలో రాయి చూద్దాం?'

–'నిరుపేద కుర్రాడు ఓ ధనవంతుడి కుమార్తెను ప్రేమించాడు. ఆమెను చూడకుండా వుండలేక గోసాయిలా మారువేషం వేసుకుని ఒకనాటి రాత్రి వేళ పల్లెటూరికి వచ్చేశాడు. ధనవంతుడి యింటికెదురుగావున్న ఓ బైరాగి మఠంలో కూచుని పాడుతున్నాడు. ఆ పాటలోని పిలుపు మేడపైన నిద్రపోతున్న అమ్మాయికి మాత్రమే అర్థం కావాలి. మిగిలిన వాళ్ళకొక తత్వంలా వినిపించాలి. వ్రాయగలవటయ్యా పంతులూ?'

–'ముసలి దంపతులు షష్టిపూర్తి ఉత్సవం చేసుకుంటూ ఒక యుగళగీతం అందుకుంటారయ్యా! చేతనైతే రాసి తీసుకరా."

అష్టావధానంలో ఆశుపద్యాలు చెప్పినట్టుగా కోదండయ్య వ్రాయమన్న పాటలన్నీ వ్రాసి చూపెడుతూ వచ్చాను. అతడు పరిపూర్ణమైన ఆమోదాన్ని ప్రకటించినట్టు జ్ఞాపకం లేదు. ఒకటి రెండు సందర్భాల్లో ఉదారంగా 'పరవాలేదు. ఉండవలసినవాడివే. నేను సినిమా తీయడమంటూ జరిగితే నీచేత పాటలు రాయిస్తా, అంటూ హామీ యిచ్చాడు.

కానీ ఎప్పుడు? మూగవాడు 'అమ్మా' అనేదెప్పుడు? ఎండమావిలో నీళ్ళు వూరేదెప్పుడు? చందమామ చేతుల కందేదెప్పుడు? కోదండయ్య సినిమా తీసేదెప్పుడు?

ఒకవైపున నా ఆర్థిక వనరులు నానాటికీ అడుగంటిపోతున్నాయి. తెల్లటి దుస్తులే ధరించడానికి అలవాటుపడినందువల్ల నాకొక లాభం ఒనగూడింది. పానగల్లు పార్కులో తోటమాలిని మంచి చేసుకుని అక్కడున్న కొళాయి దగ్గర నాకున్న పంచ, చొక్కా ఉతికి ఆరవేసుకుంటాను. కొంతసేపు లుంగీ బనీన్లతోనే కాలక్షేపంచేసి ఆరిన తరువాత ప్రక్కనవున్న లాండ్రీలో ఇస్త్రీ చేయించుకుంటాను. ఈ పద్ధతివల్ల నాకెన్ని దుస్తులున్నాయో, లోకానికి తెలిసే అవకాశం లేదు. తలపైకెత్తుకుని ఠీవిగా అడుగులు వేసుకుంటూ పాండీ బజారు

వెంట నడిచిపోతూవుంటే నన్ను చూచిన వాళ్ళు ఇతగాడికి పేవ్‌మెంట్లు మినహాగా మదరాసు నగరంలో తలదాచుకోడానికొక ఆశ్రయం లేదని భావించలేరు. పదిహేను పైసలుపెట్టి గ్రుక్కెడు టీ నీళ్లు త్రాగి అయిదుపైసల ఖర్చుతో తాంబూలం నములుతూ నేను రోడ్డుపైకొస్తే చూపరులకు పకడ్బందీగా హోటల్లో మెక్కి కిళ్లీగూడా దట్టించిన జల్సారాయణ్ణిలా గోచరిస్తాను. వాస్తవానికి పూట భోజనంతోనే కాలం గడుపుకొస్తున్నానని పసిగట్టడం లోకుల తరంగాదు.

కోదండయ్యకూ నాకూ ఒకటే తేడా. ఇనప్పెట్టెలో డబ్బులు మూలుగుతున్నా అతడు చెన్నపట్నంలో పిసినిగొట్టుగా జీవిస్తున్నాడు. నాకు బొత్తిగా మూలధనమనేది లేకపోయినప్పటికీ విలాస పురుషుణ్ణిగా కనిపించడానికి ప్రయత్నిస్తున్నాను.

మా అమ్మా, నాన్న చిన్నప్పుడే పోయారు. కులదీపకుణ్ణి నేనే వాళ్ళ ఏకైక సంతానం. మా స్వగ్రామం కలమందల. పల్లెలో గోడలకు కిటికీలుగానీ డాబాపైన పిట్టగోడగానీ లేకపోవడంవల్ల పెద్ద సైజు సమాధిలా కానవచ్చే ఒక మిద్దెటిల్లు, ఏటి నీళ్లు ఆధారంగా పండే ఒకటిన్నర ఎకరా మడి చెక్కా నాకు పితృపారంపర్యంగా సంక్రమించాయి. పెళ్ళయిన కొంతకాలానికే భర్తను పోగొట్టుకున్న మా మేనత్త ఒకావిడ మా వూరికొక గంట నడక దూరంలోవున్న దేవరపాడులో నాష్టా అంగడి నడుపుకుంటూ కాలం వెళ్లదీస్తుండేది. ఆమె నన్ను తీసుకెళ్ళి తనదగ్గర పెట్టుకుని, విద్యాబుద్ధులు నేర్పడానికి తన శాయశక్తులా ప్రయత్నించింది. ఆమె ఎంతగా ప్రయత్నించినా ఉద్యోగాలు చేయడానికి అవసరమైనంత చదువులుగానీ, ఏదైనా వృత్తిలో దిగడానిక్కావలసినంత కుదురైన బుద్ధిగానీ నాకు పట్టుబడ్డాయిగావు. అప్పట్లో నాకు మా దేవరపాడు శివార్లలో వున్న చింకిబట్టల పాత సినిమాటెంటు ఒక పుణ్యక్షేత్రంగా అమిరిపోయింది. మా అత్తయ్య సాయం కాలానికల్లా తన నాష్టా అంగడిని టెంటు దగ్గరికి తరలిస్తే, నేనా టెంటులోనే బైఠాయించే వాణ్ణి, ఎంత గొప్ప సినిమా అయినా ఆ వూళ్లో నాలుగు రోజులు మించి ఆడేదిగాదు. ఆ నాలుగు రోజుల్లో నాకా సినిమాలోని పాటలన్నీ కంఠస్థమైపోయేవి. సినిమాలకు సంబంధించి పాటల పుస్తకాలను సేకరించడం ఒక హాబీగా ఏర్పడి, అలాంటి పుస్తక సంచయాన్ని నేనొక జాజికాయ పెట్టె నిండుకు చేర్చి పెట్టగలిగాను. ఆధునిక సినిమా కవులనేగాక యింకా వెనకటి తరానికివెళ్ళి తాపీ, పింగళి, సముద్రాల మొదలైన కవుల పాటలన్నీ నా నాలుక చివర ఆడినట్టే వుండేవి. చాలని దానికి నేను మా వూరి వైపు పల్లెటూళ్ళల్లో జరిగే వీధినాటకాలకు వెళ్లి వేములపల్లి విరాట నాటకం, చుక్కలూరు రామనాటకం, మైపాడు మైరావణ నాటకం మొదలైనవి దర్శించి ఆ పాటల వర్ణమెట్టుల్నిగూడా క్షుణ్ణంగా ఆకళించుకున్నాను. పనిలోపనిగా పల్లెపాటలు, స్త్రీల పాటలు, వేదాంత కీర్తనలు వగైరా గూడా సేకరించి అదంతా ఒక పెన్నిధిగా భద్రపరచుకున్నాను. ఈ అపారమైన పరిజ్ఞానం ఆధారంగా రోజుకొకటి రెండు పాటలు వ్రాసి ముగించడం ఒక వ్రతంగా పెట్టుకున్నాను. చూస్తూ చూస్తూ వుండాగానే నా ఆధీనంలో 'దూమ్సు దే చిట్టా' అంతదైన పాటల సంపుటం ఒకటి తయారైపోయింది. మన దగ్గర కళా నైపుణ్యం వుండి ఏం లాభం? దాన్ని చలామణీ చేసుకోవాలిగదా! అందుకని నేను పనిగట్టుకుని

డైరెక్టర్లకు, మ్యూజిక్ డైరెక్టర్లకు, గాయకులకు, గాయనీమణులకు ఉత్తరాలకు పైన ఉత్తరాలు వ్రాసి చూచాను. మచ్చుకొకటి రెండు పాటలు గూడా జతచేసి పంపుతూ వచ్చాను. ఊఁహూ. ఎన్నాళ్లు వేచి చూచినా రెస్పాన్సు అనేది లేకపోయేసరికి 'నిరాశా కారుమేఘాలు' (సినిమా పాటలో ఉపయోగించదగినమాట) నన్ను అలముకున్నాయి. అనవరత సాధనవల్ల నా మనసును చుట్టుముట్టిన ఏ భావాన్ని అయినా పాటలోకి అనువదించడం రక్తగతమైన స్వభావమైపోయింది గనుక ఆ వేడిలోనే 'ఆశ, నిరాశ, ఎందులకింత ప్రయాస? ఆశకోసమే జనియించి, ఆశను మదిలోపెంచి, ఆశకోసమే జీవించే ఈ మానవ జీవితమే నిరాశ, అంటూ ఒక పాట వ్రాసేసుకున్నాను. (మనవి: ఈ పాట మరే ప్రసిద్ధ సినీ గీతానికైనా ఫక్తు అనుకరణగా వుంటే నన్ను మన్నించాలి. నేను సాగిస్తూ వచ్చిన నిరంతర గేయ రచనా వ్యాసంగంవల్ల ఏది నా పాటో, ఏది యితరుల పాటో తెలుసుకునే విచక్షణాజ్ఞానం బొత్తిగా నశించింది).

సమాధిలాంటి యిల్లన్నాను గదా, దాన్ని కాస్తా అమ్ముకుని నేను మద్రాసు రావడం జరిగింది. వచ్చిన రెండేళ్ళకల్లా ఆపైకం హరించుకపోయింది. గడచిన యేడాదంతా అప్పుడప్పుడూ పల్లెకు వెళ్ళి మా పొలం కౌలుకు చేసే రైతు దగ్గరనుంచీ వందో రెండు వందలో తెచ్చుకుంటున్నాను. పుచ్చుకున్న డబ్బునంతా కలిపి రెండు నెలల క్రితం ప్రోనోటు వ్రాసి యివ్వవలసి వచ్చింది. ఇప్పుడున్న వడ్డీ రేట్లలో యింకొక రెండు మూడేళ్లు యిలాగే గడిస్తే నా మడికయ్యలు నాకు దక్కడం కలలోని మాట.

ఇలాంటి నిస్సహాయ పరిస్థితిలో నిన్నటి మధ్యాహ్నం ఐసువాటర్లు, పళ్ళ రసాలు, బాదాంగీరులులాంటి శీతల పానీయాలుగూడా దాహతాపాన్ని ఉపశమింపజేయడంలో విఫలమై తెల్లబోతున్న మండుటెండల వేళ, కోదండయ్య అమృతగుళికలాంటి ఓ చల్లటి వార్తను నా చెవిలో వేశాడు.

"ఏమయ్యో పంతులూ! ఏమనుకున్నావో మరి! ముహూర్తం దగ్గరికొచ్చేస్తూ వుంది" అంటూ ప్రారంభించాడు కోదండయ్య.

"అవునా? అలాగా? ఏమిటేమిటీ వివరంగా చెప్పండి" అంటూ ముద లంకించుకున్నాను.

"మనం సినిమా తీసేదీ, లేనిదీ రేపు సాయంకాలానికి తెలిసిపోతుంది."

మునుపటి కొకసారి ఫలానాతేదీన, ఫలానీ సమయానికి ప్రళయం వచ్చేస్తుందంటూ ఒక పుకారు దేశమంతటా వ్యాపించింది. ఆ తేదీ, ఆ సమయమూకూడా వచ్చి వెళ్లాయిగానీ ఒక బస్సు ప్రమాదమైనా సంభవించలేదు. మరైతే కోదండయ్య పాలిటికి రేపటి సాయంకాలంలోగా సంభవించబోయే అద్భుత పరిణామం ఏమై వుంటుంది?

"జ్యోతిష్య మార్తాండ, దైవజ్ఞ భూషణ, చిదానందసుధీ – ఆ పేరెప్పుడైనా విన్నావా?" టైంబాంబు ప్రేల్చినట్లుగా అడిగాడు కోదండయ్య.

"లేదే! ఎవరండీ ఆయన? ఆయనతో మీకేం పనొచ్చింది?" అంటూ ఆశ్చర్యం ప్రకటించాను.

"ఉన్నాడులే! సినిమా ప్రపంచంలో అతడి మాటకు తిరుగులేదు. స్టార్టింగుకు ముహూర్తాలు పెట్టే వాడతను. విడుదలకు తేదీలు నిర్ణయించే వాడతడు. ఏ స్టారును

బుక్‌చేస్తే పిక్చరు నూర్రోజులాడుతుందో సూచించే వాడతడు. ఇంత పెద్ద జ్యోతిష్యవేత్తగదా. అయినా అతడి దగ్గర ఒక నీతి వుంది. ప్రశ్నకు పది రూపాయలకంటే ఎక్కువ పుచ్చుకోడు. ఎటొచ్చీ నాలుగు రోజులు ముందుగానే ఫోనుపైన మాట్లాడి ఇంటర్వ్యూ నిర్ణయించుకోవాలి. నేను మొన్ననే మాట్లాడి చూచానులే రేపు సాయంకాలం అయిదుం పావుకు కలుసుకోమన్నాడు..."

కొద్ది క్షణాల తర్వాత పూర్తి చేశాడు. కోదండయ్య. "అతడు రైటో అంటాడనుకో! రథం కదిలినట్టే. మనం రంగంలో దిగేస్తాం."

నా గుండెలో రాయిపడింది.

అతడు రైటో అనకపోతే?

అప్పుడైనా కోదండయ్య కొంపేమీ మునగదు. గది ఖాళీచేసి అతడు చక్కా తన ఊరికి వెళ్ళిపోతాడు. పూచికపుల్లంత ఆసరా అయినా లేకుండా ప్రవాహం పాలైనవాడిలా నేనీ మద్రాసు నగర మహాజీవన వాహినిలో దిక్కులేని వాణ్ణిగా మిగిలిపోతాను.

***

చిదానంద సుధీ నివాసానికి వెళ్ళడానికి కోదండయ్య టాక్సీ ఎంగేజ్ చేసుకోడం వింతల్లో వింత. కారులో వెళ్తేగానీ వీళ్ళు సినిమావాళ్లేనన్న అభిప్రాయం కలగదట!

క్రింది భాగంలో అరవ వాళ్ళెవరో కాపురమున్నారు. మెట్లెక్కి పైకివెళ్తే ఓ వసారాలోకి ప్రవేశిస్తాము. వసారాకానుకుని వెయిటింగు రూముగా ఉపకరించే హాలుంది. హాలు కటువైపున ఒక గది. ఆ గది తలుపులు మూసి వున్నాయి. గుమ్మం దగ్గర ఓ కుర్రవాడు నిలబడి వున్నాడు.

మేము హాల్లో అడుగుపెట్టేసరికి ఆ కుర్రాడు ఎదురొచ్చి 'కూచోండి' అన్నాడు. కోదండయ్య పేరేమిటో అడిగి తెలుసుకున్నాక చేతిలో వున్న పుస్తకాన్ని తెరిచిచూస్తూ "అయిదూ పదిహేనుకు రమ్మన్నారు గదండీ! ఇంకొక పది నిముషాలు లేటు కావచ్చు. ఎట్లాగైనా అయిదున్నరకల్లా లోపలికి పంపించేస్తాను" అంటూ భరోసా యిచ్చేశాడు.

సోఫా ఒకటి దొరికిందే చాలునన్నట్టుగా కోదండయ్య దానిపైన సుఖాసీనుడై పోయాడు.

అది నాకు నింపాదిగా కూర్చోగలిగిన సమయమా? అలాగని ఊరికే ఒకచోట నిలబడిపోవడంగూడా అర్థరహితంగానే కనిపించవచ్చు. అందుకని ఎలాగైనా కాలాన్ని వేగించే ఉద్దేశంతో నాలుగువైపులా హాల్లో గోడలకు తగిలించిన ఛాయాచిత్రాలను చూడదలచుకున్నట్టుగా ముందుకు కదిలాను.

ఫొటోలలోని ఆకారాలు స్పష్టంగా కనిపించేటంత దగ్గరగా వెళ్ళేసరికి నేను త్రుళ్ళిపడకుండ వుండలేకపోయాను.

ఆదమరపుగా ఒక కమ్మిపైన చేయి వేసి కరెంటు షాకు కొట్టేటప్పటికి ఉలిక్కిపడ్డట్టుగా బిత్తరపడిపోయాను. నా నరాల్లో రక్తం శరవేగంగా పరుగులు తియ్యడం మొదలెట్టింది. ఎవరెవరో ప్రముఖులు జ్యోతిష్య శాస్త్రవేత్త సన్నిధిలో కూర్చుని శుభాశుభాలు చెప్పించుకుంటున్న ఆ ఛాయాచిత్రాల్లో నన్నంతగా నిర్ఘాంతపడేటట్టుగా చేసిందేమిటో –

ఎలా చెప్పగలను? నా అనుమానం నిజమవునో కాదో నాకే తోచడంలేదు. ఆ క్షణాల్లో నన్నావహించింది నా కళ్లే నన్ను మోసగిస్తున్నాయేమోనన్న భ్రమ మాత్రమే.

'ఉండదు. ఉండదుండదు. అలా అనుకోడానికి వీల్లే'దని నేనెంతగా సరిపెట్టుకో జూచినప్పటికీ ఆ అభిప్రాయం కొద్దిసేపట్లోనే వీగిపోయింది. చివరికింక 'సందేహంలేదు. అతడే ఇత'డన్న నిర్ణయానికి రావడానికి ఒకటి రెండు నిమిషాలుగూడా పట్టలేదు.

ఇతడెవరో నాకిప్పుడిప్పుడే తెలిసివస్తోంది.. అతణ్ణి గురించి నాకు క్షుణ్ణంగా తెలుసు.

–మనిషి ఎదుటికొస్తే 'కిష్టయ్య' అనే వాళ్ళం. పరోక్షంలోనైతే 'పిచ్చి కిష్టయ్య' అనుకునేవాళ్ళం. చదువుకుంటున్న రోజుల్లోనే దృష్టిదోషం రావడంవల్ల ఇంతింతలావు కళ్ళద్దాలు వేసుకుని మతిమరుపు ప్రొఫెసరులా కనిపించేవాడు. దేవరపాడు హైస్కూల్లో నేను కింది తరగతిలో వుండగా పై తరగతిలో వుండేవాడతను. హైస్కూలు చదువు ముగిసిన తర్వాత నాలుగైదేళ్ళ పర్యంతం అతడు దేవరపాడులో చాలా అరుదుగా కనిపిస్తూ వచ్చి, ఎక్కడో విద్వాన్ కోర్సు చదువుతున్నట్టుగా చెబుతుండేవాడు. అన్నదమ్ముళ్ళతో, అక్కాచెల్లెళ్ళతో వాళ్ళది చాలా పెద్ద కుటుంబం. ఇంటి దగ్గరినుంచీ డబ్బందకపోవడంవల్ల వాళ్ళనీ, వీళ్ళనీ యాచిస్తూ ట్యూషన్లు చెప్పి పదోపాతికో సంపాదించుకుంటూ అతడు విద్వాన్ కోర్సు వెళ్ళదీశాడని వినికిడి. 'విద్వాన్' వల్ల అనర్గళంగా పద్యాలు చదివే విద్య ఒకటి అతడికి అలవడింది. అంతకుమించి ఆ పట్టావల్ల ఉద్యోగం దొరికే అవకాశాలు మాత్రం కనిపించలేదు. డబ్బు పుట్టించే వెరవులు అప్పటికి పూర్తిగా వట్టిపోవడంవల్ల ఎంప్లాయిమెంటు ఆఫీసుకు వెళ్ళడంకోసమైతేనేమి, పరిషత్తు ఆఫీసు చుట్టూ తిరగడం కోసమైతేనేమి కాలినడకపైనే జిల్లా ముఖ్య పట్టణానికి రాకపోకలు మొదలెట్టాడు. ఒళ్ళలిసి పోయేటంతవరకూ నడవడం, మార్గమధ్యంలో ఏదైనా ఒక పల్లెలో ఆగడం, అక్కడివాళ్ళకు పురాణం చదివి వినిపించడం, వాళ్లు భోజనం పెడితే తినడం, అయిదోపదో సంపాదించుకోడం, ఈ పద్ధతిలో అరవై మైళ్ళు ప్రయాణంచేసి జేబులో డబ్బు అయిపోయేటంతవరకూ పట్నంలో వుండి మళ్ళీ మునుపటిలాగే మజిలీలు వేసుకుంటూ ఊరు చేరడం, యిదంతా అతడికొక వ్యాపకమైపోయింది. 'ఏం కిష్టయ్యా! ఏమైంది ఉద్యోగం?' అని ఎవరైనా అడిగితే అతడు ఎడారిలో దారితప్పినవాడిలా బిక్కరించి చూచేవాడు. రానురానూ 'కిష్టయ్య ఉద్యోగ'మనేది ఆ వూళ్ళో నవ్వులాటకు చెప్పుకునే ఒక మాట అయిపోయింది. 'కిష్టయ్య' అనే వ్యక్తి వట్టి పరిహాస భాజనుడైపోతూ వచ్చాడు.

రక్తబంధువుల మధ్యగల అనుబంధాలుగూడా ఆయా కుటుంబాల జరుగుబాటు పైన ఆధారపడి వుంటాయన్న విషయం కిష్టయ్య విషయంలో ఋజువైంది. నిరంతర నిరుద్యోగిగా తయారై కూర్చున్న కిష్టయ్య ఉనికి స్వంత కుటుంబంలోనే కంటకప్రాయంగా పరిణమించింది. ఎక్కడైతే తనకు చోటు లేదో అక్కడనుంచీ దూరంగా వైదొలగి ఎప్పటికప్పుడు కొత్త ఆశ్రమాన్ని కొత్త జీవనాధారాన్ని వెదుక్కోవడానికి అలవాటుపడిన కిష్టయ్య, ఊరు విడిచి దేశంపైన పడ్డాడు. తన యోగ్యతకు తగిన ప్రతిఫలం అందించలేకపోయిన లోకంపైన కసిపూనినట్టుగా ఒక వూళ్లో చేరి, తనకు వైద్యం వచ్చునని బుకాయించాడు. అవకతవక చికిత్స వల్ల అక్కడొక రోగి పరిస్థితి విషమించేసరికి రాత్రికి

రాత్రే ఆ వూరినుంచే పారిపోయాడు. ఒకానొక సుప్రసిద్ధ దినపత్రికకు ప్రత్యేక విలేఖరినని చెప్పుకుంటూ స్థానిక చోటానాయకులను ఇంటర్వ్యూ చేసి వాళ్ళ ఖర్చుపైన కొద్దిరోజులు జల్సాగా దొర్లించాడు. నకిలీ విలేఖరి అన్న రహస్యం బయటపడడంతో లోకుల్ని దగా చేసిన నేరానికి కొంతకాలం పోలీసువాళ్ల కస్టడీలో వున్నాడు. అంతటితో తెలుగుగడ్డపైనే రోతపుట్టి మిలటరీలో చేరి ఏదైనా దూర ప్రాంతం వెళ్ళిపోవాలని తలపోశాడు. ఎత్తు, బరువు, చాతీ లాంటివేవీ చాలక పోవడంవల్ల ఆ ఆశగూడా అడియాసగాక తప్పింది గాదు. కిష్టయ్యను గురించి దేవరపాడు వాస్తవ్యులకు తెలిసిందంతవరకే! గడచిన నాలుగైదేళ్ళలోనూ అతడి ఆచూకీ అగమ్య గోచరమై వుండిపోయింది. తల్లిదండ్రులు కాలధర్మం చెందడంవల్ల అతడు వున్నాడో, వూడినాడో తేల్చుకునే ఆసక్తిగూడా ఎవ్వరికీ లేకపోయింది.

నా తలపోతలకు సడన్‌బ్రేక్ వేస్తూ గదితలుపులు కిర్రుమంటూ తెరచుకున్నాయి. వ్రేలి వ్రేలికీ ఉంగరాలు తొడుక్కున్న ఒక ముసలాయన ప్రసన్నవదనంతో హాలుగుండా నడిచి అవతలికి వెళ్ళిపోయాడు. ఆయన వెళ్ళిపోవడమే తడవుగా వాకిలి కావలి కుర్రాడు మమ్మల్ని గదిలో ప్రవేశపెట్టాడు.

గదిలో ప్రవేశించగానే కోదండయ్య జ్యోతిష్య మార్తాండగారికి ఒక పెద్ద నమస్కారం పారేశాడు. నా చేతులు గూడా అప్రయత్నంగానే పైకిలేచి కలుసుకోడానికొక విఫల ప్రయత్నంచేసి తోటకూరకాడల్లా క్రిందికి వ్రాలిపోయాయి. నమస్కరించడానికి తటపటాయిస్తున్న నా వైఖరిపట్ల అనుమానాన్ని ప్రదర్శిస్తూ సిద్ధాంతి లావుపాటి కళ్ళద్దాలలోనుంచీ నావైపు నివ్వెరపోయి చూచాడు. పట్టుపంచ పైన బనీను తొడుక్కుని, నుదుట పట్టెపట్టెగా విబూది పెట్టుకున్న అతడివైపు నేను అయోమయంగా చూడసాగాను. చూపులకేగనుక మాట్లాడగలిగే శక్తి వుంటే అది వంద విషయాలు మాట్లాడుకోదగ్గ సమయం. ఆ క్షణాన నాకొక కొత్త విషయం స్ఫురించింది. అందాకా నేను నా భవిష్యత్తు ఈ జ్యోతిష్కుడు చెప్పబోయే మాటపైన ఆధారపడి వుంటుందని భావించాను. ఇప్పుడితడు నా మూలంగా తన సంగతి ఎక్కడ బయటపడిపోతుందోనని లోలోపల భయపడి పోతున్నాడు.

ఈలోగా కోదండయ్య తాను తీసుకొచ్చిన ఆకులు వక్కలు పది రూపాయల నోటుతోబాటుగా కలిపి బల్లపైన పెట్టాడు. ఏదో తాకిన కారణంవల్ల తపోభంగమైనందుకు కినిసి క్షణమాత్రపు ప్రయత్నంతో మళ్ళీ మునుపటి స్థితిలోకి వెళ్ళిపోయే తాపసోత్తముడిలా చిదానంద సిద్ధాంతి కుర్చీలో సర్దుకుని కూచుంటూ అర్ధనిమీలిత నేత్రుడై ఒక నిముషంపాటు ధ్యానముద్రలో వుండిపోయాడు. ఆ తరువాత బల్లపైన వున్న వక్కలాకుల్ని ఎంచి కాగితంపైన ఏవో కొన్ని అంకెలు వేసి సామాన్య గణిత సూత్రాలు ఆధారంగా ఆ కాగితమంతా అంకెలతోనే నింపేశాడు. అప్పటికింక ఎదుటి మనిషి సమస్య ఏమిటో తనకు కరతలామలకంలాగా అవగతమైపోయినట్లు తల పంకిస్తూ టక్‌మని ఉపక్రమించేశాడు.

"మీరొక పనికోసం వచ్చారు. అంతే గదండి?"

"అవునండీ! ఆ పని నాకు అచ్చి వస్తుందో రాదో తమరు చెప్పాలి..."

"సందేహం పెట్టుకోవద్దు, మీరు తలపెట్టిన పని దిగ్విజయంగా నెరవేరుతుంది" అని కాసేపాగి "ఈ ఉద్దేశం చాలా కాలంనుంచీ మీ మనసులో వుందనుకుంటాను. అవును గదండీ?" అన్నాడు దైవజ్ఞుడు.

"సందేహం పెట్టుకోవద్దని యిప్పుడు మీరు చెబుతున్నారుకదా యికపైన...

"ఉండండి" – అడ్డు తగులుతూ సిద్ధాంతి కొనసాగించాడు.

"ఈ పని నెరవేరడంలో ఒక మనిషి తోడ్పాటువల్ల మీకు చాలా మేలు చేకూరుతుంది."

"అయ్యా! తమరేదో గూఢంగా సెలవిస్తున్నారు..." విస్మయంతో మెలికలు తిరిగిపోతూ అన్నాడు కోదండయ్య.

"క్లూ యిస్తున్నానుగా ఆ మనిషి పేరులో నాలుగక్షరాలుంటాయి."

మొద్దుబుర్ర కోదండయ్య అర్థం కానట్టుగా పెదవి విరిచి అడ్డంగా తలాడించాడు.

"ఇంకొక వివరణ యిస్తాను – ఆ నాలుగక్షరాల్లోనూ ఒకటి హ".

మొద్దుబుర్రలో మెరుపు మెరిసినట్టయి ఆ వెలుగు కాస్తా కోదండయ్య ముఖంలోకే వచ్చేసింది.

సిద్ధాంతిగారు పచ్చజండా చూపినందుకు ఆనంద పరవశుడైపోతూ కోదండయ్య అతడిదగ్గర సెలవు తీసుకున్నాడు. కోదండయ్య మినహాగా అక్కడున్న వాళ్ళిద్దరిలోనూ ఒకరికి తన పూర్వాశ్రమాలకు సంబంధించిన ఒక పాత మిత్రుడితో మనస్సు విప్పి మాట్లాడే అవకాశం లేకపోయింది. ఇంకొకరికి ఆయాచితంగా లభించిన ఉపకారానికి కృతజ్ఞత చెప్పుకునే వెరపుగూడా లేకపోయింది.

***

కోదండయ్య తీసిన పిక్చరు తెలుగుదేశంలో విడుదలైంది. 'హిట్టు' గాకపోయినా పెద్ద సెంటర్లలో అది మూడు వారాలదాకా ఆడింది. తొలి ప్రయత్నం ఆ మేరకు విజయం సాధించడంగూడా సినిమా ప్రపంచంలో చెప్పుకోదగ్గ విశేషమే! నా మట్టుకు నేను అంతకంటే గొప్పగా చెప్పుకోదగ్గ విశేషమేమిటంటే ఆ పిక్చర్ కోసం నేను వ్రాసిన పాటలు రెండు పదిమంది నోళ్ళల్లోనూ పడ్డాయి. రికార్డులుగూడా బాగా అమ్ముడుబోతున్నట్లు తెలిసింది. మీదు మిక్కిలి ఫీల్డులో 'ఎవరండీ నరహరి? కొత్తగా పాటలు రాస్తున్నాడటగా' అంటూ సినిమా ప్రముఖులు నన్ను గురించి వాకబు చేయడం ప్రారంభమైపోయింది.

ఈ ఆశావహమైన, పరిణామానికి వెనుక ఒక భయం రాబందులా నన్ను వెన్నాడుతూ వుంది. ఉద్యోగం లేని వాళ్ళ పాలిటి ఈ లోకం పులిలాంటిది. ఒక ఉపాయంతో గాకపోతే యింకొక ఉపాయంతో దాన్ని మచ్చిక చేసుకోగలిగే కిష్టయ్యలాంటివాళ్ళు ఆ పులిని గురించి భయపడనక్కర్లేదు. కానీ నాకు తెలిసిన ఉపాయం ఒక్కటే. హేమాహేమీలైన మహామహులెందరో ఈ రంగంలో డింకీలు తింటున్నారు. ఇందులో గనుక విఫలుడినైపోతే పులి నన్ను ఖాయంగా మింగేస్తుంది. భగవంతుడా పులి బారినుంచీ నువ్వే నన్ను రక్షించాలి.

❖ ఆంధ్రభూమి మాసపత్రిక – 1985. ❖

# యక్షప్రశ్న

**మా** వూరి సర్పంచ్ బసవరాయణ్ణి గురించి కిట్టనివాళ్ళు ఎన్ని పోసుగోలు కబుర్లయినా చెప్పుకోవచ్చు. నేను మాత్రం ఆయనలో ఒక గొప్ప సుగుణం వుందని ఘంటాపథంగా చెప్పగలను. రాయిలాగా, రప్పలాగా ఆయన ఒక జడ పదార్థంలా వుండిపోయిన వారు కాదు. దేశాన్ని, కాలాన్ని, పరిస్థితుల్ని గుర్తెరిగి ఎప్పటికప్పుడు తన అభిప్రాయాలను మార్చుకుంటూ వచ్చినవాడు. బసవారాయడి జీవితాన్ని మూడు దశలుగా విభజిస్తే – మొదటిదశలో ఆయన గావించిన ధర్మసంస్థాపనం, రెండో దశలో ఆయన సల్పిన సంఘసేవ, మూడో దశలో ఆయన సాధించిన భావ విప్లవం భావితరాల వాళ్ళు మరీమరీ మననం చేసుకుని ఆనందించదగ్గవి. అంతెందుకు? స్థానిక సామాజిక చరిత్రను ప్రత్యేకంగా వ్రాయనక్కర్లేదు. ఆయన జీవిత గాధను గ్రంథస్థం చేస్తేచాలు.

ఏనాడో ప్రారంభమైనప్పటికీ ఈ కథకు ముగింపు మాత్రం నిన్నమొన్నటిది. ఆదినుంచీ పూస గుచ్చినట్టు చెప్పానంటే, ఇది 'డూమ్స్‌డే చిట్టా'లాంటి ఉద్గంథమై పోయే ప్రమాదం ఉంది. మరైతే ఎక్కడి నుంచి ప్రారంభించడం? నా పాలిటికిది పెద్ద కృత్యాద్యవస్థ అయిపోయింది. దీర్ఘాలోచన తర్వాత ఒక నిర్ణయానికి రాగలిగాను. కథ ఎక్కడినుంచి అయితే అడ్డం తిరుగుతుందో అక్కడినుంచే ప్రారంభించడం, అవసరాన్ని బట్టి వెనక్కి వెళ్ళి, మళ్ళీ ముందుకు రావడం!

మరైతే ఈ కథ అడ్డం తిరిగిందెప్పుడు?

స్ఫురించింది. సమితి హెడ్ క్వార్టర్స్ నుంచి బిడిఓగారు రాసిన చీటీ దగ్గరినుంచే దీన్ని మొదలెట్టవచ్చు.

"నెమళ్లదిన్నె సర్పంచి రాజశ్రీ బసవారాయడుగారికి –

భగవదనుగ్రహం వల్ల నేను డిగ్రీ పుచ్చుకుని, చిన్న గుమాస్తాగా రెవిన్యూ డిపార్టుమెంటులో ప్రవేశించి, వేర్వేరు చోట్ల వేర్వేరు హోదాల్లో పనిచేసి, చివరికి బి.డి.ఓ.గా ప్రమోషను పొంది, ఈ కొత్త పదవిలో మన సమితికే బదిలీ అయివచ్చి, ఇక్కడ ఛార్జీ పుచ్చుకున్న విషయం మీకు తెలిసేవుంటుంది. నా ఈ స్థితికి కారకుడైన మన వూరి దేవుడు శ్రీ ప్రసన్న లక్ష్మీనరసింహస్వామి వారిని వీలయినంత తొందరలో దర్శించి, అభిషేకం, అర్చన వగైరా కైంకర్యాలతో భక్తి ప్రపత్తులు చెల్లించుకోవలసిన అవశ్యకర్తవ్యం నాపైన ఉంది. ఈపనిపైన నేను పై ఆదివారం ఉదయం మన వూరికి వస్తున్నాను. ధర్మకర్తలు గనుక మీకు తెలియజేయడమైంది. ఇట్లు, నగారా గంగాధరం, మండల వికాసాధికారి, పైడిమర్రి పంచాయతీ సమితి.

చదివి ముగించేసరికి చీటీ బసవారాయడి చేతిలో నలిగిపోయింది. కోపం పొగలుగా సెగలుగా మారి స్వేదరంధ్రాలలోనుంచి వెలుపలికి చిమ్మింది. చేతివ్రేళ్లు వంగి పిడికిట్లోకి బిగుసుకుపోయాయి. పై పండ్లు కింద పండ్లతో రాచుకుంటూ గీపెట్టాయి.

ఆకాడికీ ఈకాడికీ వచ్చి అఖరుకేకాడి కొచ్చినావురా గంగా! చద్ది కలిపి పోస్తే నోటి కడ్డంగా దోసిలి పట్టుకుని మా యింటి గడపలో కడుపునింపుకున్నోడురా నీ తాత.

మా మడిలో అడుసు దున్నుతూ తట్టలో వచ్చే సంగతి ముద్దకోసం మిర్రి మిర్రి చూచినోదురా నీ అయ్య! బోడి బీడివో ఉద్యోగం వస్తే మటుకు నీ కండ్లు నెత్తికొచ్చినాయంట్రా?"

శివరాత్రి అని తెలిస్తే, బసవారాయడికి పెందలకడనే నిద్ర ముంచుకొస్తూ ఉండేది.వైకుంఠ ఏకాదశి అయితే సాయంత్రం ఆరున్నరకల్లా నిద్రదేవత వచ్చి కనురెప్పలపైన కూర్చునేది. అలాంటిది గంగాధరం చీటీ అందిన రోజు రాత్రి బసవారాయడు ఆదమరిచి కునుకు దీసివుంటే ఒట్టు. ఇంచుమించు ఒక అర్ధశతాబ్ది పర్యంతంగా గ్రామంలో తాను కావిస్తూ వచ్చిన ధర్మ సంస్థాపనానికి ఉన్నట్టుండి ఒక్క పెట్టున పెద్దగండి పడిపోయింది గదా! ఇక రమ్మంటే మాత్రం నిద్ర ఎలావస్తుంది...

భగవంతుని దశావతార విశేషాలను గురించి చెప్పుకున్నట్టుగా, ధర్మపరిరక్షణ విషయంలో బసవారాయడు పాటిస్తూ వచ్చిన దండనీతిని గురించి జనం ఎన్నో ఆహ్లాదకరమైన కథలు చెప్పుకుంటారు. ఒకసారి నల్లజీవాలు (పందులు) వేరుశనగ చేలల్లోపడి తొక్కి పాడుచేసినందుకు ఆయన జోగల వాళ్ళ గుడిసెలపైన చెత్త లేకుండా పీకి పోగులు పెట్టించాడు. ఇంకొకసారి గొల్లవాళ్ళు కబురు పెట్టగానే పిలుపందుకోలేదన్న కోపంతో, వాళ్ల గొర్రెల మందల్ని అడుసు మళ్ళల్లోకి పరవదోలించి, బురదలో కూరుకుపోయి అవి కదలలేక దీనంగా అక్రోశిస్తుంటే మీసం మెలిద్రిప్పాడు. కూరగాయల పాదులో బుట్టెడు వంకాయలు కోసుకెళ్లిన పాపానికి అదే వంకాయలతో కూర్చిన దండను మెడలోవేసి పాలె సుబ్బయ్యను సంతలో నిలబెట్టాడు. పండి రాలిపోయిన టెంకాయలు రెండిట్ని పట్టుకెళ్లి కొట్టులో అమ్ముకున్న దురాగతానికి ఈడిగ చెన్నయ్యకు యాభై జాటీ దెబ్బలు వడ్డించాడు. మటుమాయమైపోయిన పందెం కోడిపుంజు తాలూకు ఈకలు మేదర చెంగన్న ఎరువుదిబ్బలో కనిపించిన నేరానికి ముఖాన మసిబొట్టు పెట్టి అతణ్ణి ఊరంతా త్రిప్పాడు. ఈ కోవలో అత్యంత ఇంటరెస్టింగ్ ఉదంతం మరొకటుంది. అది తప్పకుండా విని తీరవలసింది. నిద్రాభంగం కలిగినందుకు ఆగ్రహించిన బసవారాయడు తన జాగిలాన్ని ఓ బుడబుక్కలవాడిపైకి ఉసికొలిపేశాడు. ప్రాణాలరచేతబట్టుకుని ఊరుదాటేసరికి, వాడి పంచ చీలికలు వాలికలై వూడిపడిపోయింది. అంతటితో కుక్క వాడి నల్లటికోటుపైకి ఎగబాకింది. కోటు నట్లాగే క్రిందికి దిగవిడిచి బుడబుక్కలవారు కౌపీన మాత్రవేషధారిగా ఓ చెట్టు చిటారుకొమ్మలోకి ఎగబ్రాకిపోయారు.

నల్లులు, బల్లులు, ఈగలు, దోమలు మొదలైన వాటిని క్షుద్రప్రాణులుగా వ్యవహరిస్తాం. మనుషుల్లోనూ అలాంటి వాళ్ళున్నారన్నది బసవారాయడి నిశ్చితాభిప్రాయం. చెప్పులు వసారాలోవుండాలి. చీపురు తలుపు వెనుక వుండాలి. పేడతట్ట పెరట్లో వుండాలి. ఇలా తన ఆశ్రిత, పరివార, పరివేష్టిత జనానికి సంబంధించి బసవారాయడు ఎవరి స్థానాలు వారికి స్పష్టంగా కేటాయించాడు.

ఈ ప్రాతిపదికపైన తన ఊరిదైవం శ్రీ ప్రసన్న లక్ష్మీనరసింహస్వామి వారినిగూడా పూర్తిగా తన అదుపు క్రింద పెట్టుకోడంలో బసవారాయడు కృతకృత్యుడయ్యాడు. ఏడాదికి ఒకసారి పారువేటనాడు మాత్రమే స్వామి వారికి విడుదల. మిగిలిన ఏడాది పొడుగునా గృహనిర్బంధమే. బిగిసిన తాళం వెనుక, మూసిన సింహద్వారం వెనుక భగవంతుడి

అతీగతీ బయటివాళ్ళకెలా తెలుస్తుంది? పడమటివైపు ప్రహరీలోని ద్వారం గుండా రాకపోకలు సల్పుతూ పూజారి స్వామివారికి నిత్యపూజలు చేస్తూ వుంటాడని గ్రామస్థుల్లో ఒక ఊహ మాత్రం కద్దు. అందులోని నిజానిజాలేపాటివో తేల్చుకున్నవాళ్లు లేరు. బసవారాయడి సమిష్టి కుటుంబంలో తానొక వ్యక్తిమాత్రుడై పోయాక, ఇక స్వామి వారితో తమకుగానీ, తమతో ఆయనకుగానీ పనేముంటుందన్న వైరాగ్యభావం ఒకటి స్థానిక ప్రజల్లో పాదుకపోయింది. ఒకవైపున శేషాద్రి వెంకన్న చేతుల సాచి సమస్త జనుల్నీ తన అక్కున చేర్చుకున్నాడు. మరొకవైపున శ్రీశైలం మల్లన్న సర్వజీవులపై సమదృష్టిని ప్రసరిస్తున్నారు. ఇంకొకవైపున భద్రగిరిరామన్న తనసేవకు లౌకికమైన అవరోధాలేమీ లేవని ప్రకటించేశాడు. కానీ నెమళ్లదిన్నె స్వామికి మాత్రం అలాంటి అవకాశం లేకపోయింది. అసలు గ్రామస్తులకే ఆ ప్రాప్తం లేకపోతే, ఇంక వాడల్లో, గూడాల్లో, గ్రామ శివార్లలోని పల్లెల్లో నివసించే జనాన్ని గురించి చెప్పేదేముంది? వాళ్ల పాలిటికి లక్ష్మీనరసింహస్వామి అక్కరకురాని చుట్టంగా, మొక్కుదామన్నా కనిపించని దైవంగా మిగిలిపోయాడు.

అదిగో, సరిగ్గా అలాంటి సందర్భంలోనే నగారా గంగాధరమంటూ ఒకడు పుట్టుకొచ్చేశాడు. అలనాడు సాక్షాత్తుగా భగవంతుడే ఒక భక్తుణ్ణి చెరనుంచి విడిపిస్తే, ఈనాడు భక్తుడే భగవంతుడికీ చెరనుంచి విముక్తి ప్రసాదించాలని చూస్తున్నాడు.

పులిగా మారే అవకాశం వుండే గంగాధరంపైకి దూకి గొంతు కొరికి పచ్చినెత్తురు తాగేసేవాడి. బసవారాయడికీ లేకపోయింది. పైగా పులిమీద పుట్రలాగా మరునాడు తెల్లవారే అతడి అంతరంగంలో కోపానికీ, ఉక్రోషానికీ బదులుగా భయాందోళనలు చోటు చేసుకున్నాయి. గంగాధరాన్ని అడ్డుకోడం సులువే. కానీ తదనంతర పరిణామాలు తన పీకచుట్టూ ఉరిత్రాళ్ళలా బిగుసుకోవని ఏం నమ్మకం? ప్రభుత్వం చర్య తీసుకుంటుందో, లేదో ఆ సంగతి అటుండనీ! గుడికీ, అర్చకుడికీ, భజంత్రీలకు చెందిన మాన్యాలు గత ముప్పైయేళ్లుగా తన హక్కు భుక్తంలో వుండిపోయాయి. అందుకు లెక్కలు చూపించమంటే తాను చిక్కుల్లో పడిపోవడం ఖాయం.

గాఢ నిద్రలోనుంచి హఠాత్తుగా మేలుకున్నట్టుగా బసవారాయడు అప్రమత్తుడై పోయాడు. గుడి తలుపులు తీయించాడు. గోడలకు వెల్లవేయించాడు. పచ్చతోరణాలు కట్టించాడు. కొత్త బట్టలతో, తాజా పూలదండలతో దేవుడికి ముస్తాబు చేయించాడు. అన్ని ఏర్పాట్లు ఇలా నిర్వహించి, జీపు సవ్వడికోసం చెవులప్పగించి కూచున్నాడు. అయితే అతడెదురు చూచిన జీపు వెళ్లివెళ్లి హరిజనవాడలో నిలిచింది. ఊరు ఊరంతా వెంట రాగా? గుడివైపు కదిలింది. జోగలవాళ్లు, వడ్డెరవాళ్లు, యానాదులు, గొల్లలు మొదలైన వాళ్ళందరూ ఉపనదుల్లా వచ్చి సమూహంలో కలిశారు. బసవారాయడి పాలిటి కాదృశ్యం తన కోటల్ని కూల్చివేయడంకోసం జరుగుతున్న దండయాత్రలా అనిపించింది. కొన్నివేల చీమల్లో తగులుకున్న పన్నగంలా అతను చిక్కి బిక్కరించాడు. ఎంతోకాలంనుంచి తన బండిని లాక్కొచ్చిన వాళ్లు, ఇప్పుడందులో నుంచే తనను క్రిందికి తోసేశారు. కాదు కూడదని మునుపటి దాష్టీకం చలాయిస్తే సరేకానిమ్మని తనపైనుంచే చక్రాలను పోనిచ్చేట్టున్నారు.

ఆనాటి సాయంకాలం జరిగిన సభలో గంగాధరం చెప్పిన మాటలు వింటుంటే – బసవారాయడికి ఉన్న మతికూడా పోయింది.

"బసవారాయడుగారంటే ఏమనుకున్నారు? కంచుకాగడా పెట్టి వెదకండి. ఇటువంటి మహానుభావుడు గనుక దొరికితే నేను ముక్కూ చెవులూ కోసుకుంటాను. మట్టిబుర్రలు కాబట్టి ఆయన్ను అర్థం చేసుకోడం మీ తరంగాకపోయింది. అమ్మయినా అడగందే పెట్టదని మీకు తెలియదా? ఆహా, అదికాదా. మీ తలపొగరు గురించి తలచుకుంటే నాకు ఒళ్లు మండుకొస్తోంది. కాకపోతే జానాబెత్తెడు చీకటి గుడిసెల్లో కలుగుల్లో ఎలుకల్లా బ్రతుకు దీస్తున్నారే. అయ్యో, ఇల్లు కట్టుకోడానికి మాక్కొంచెం జాగా ఇప్పించరా అని మీరెప్పుడైనా ఆయన్ను అడిగి చూశారా? మంచినీళ్లకోసం కడవలు తలపైకెత్తుకుని ఏ ఏట్లోకో, వల్లకాట్లోకో అఘోరిస్తారే. ఊరూరికి ఒకటో రెండో బోరింగులు వేయించమని మీరేనాడైనా ఆయనతో మొరపెట్టుకున్నారా? పల్లెపల్లెకూ స్కూలుంటే సరిపోయిందా? పిల్లలు కూచోడానికి నీడవుండొద్దా? తలచుకుంటే పక్కా బిల్డింగులు కట్టించి పారెయ్యడం బసవారాయడిగారికేం లెక్కా, జమా! పదివేల రూపాయల విరాళం విసిరి పారేస్తే గ్రామంలో, హైస్కూలు పెట్టుకోడానికి జిల్లా పరిషత్తువాళ్లు అనుమతిస్తారు గదా? 'అయ్యా బాబూ! విరాళం' అంటూ మీరాయన వెంటబడి మారాం చేసిన పాపానపోయారా? ఒక బస్సు షెల్టరు, ఒక ఆసుపత్రి, ఒక సహకార పరపతి సంఘం – ఇట్లాంటివేమీ మీకు అక్కర్లేదా? ఒక గొప్ప వ్యక్తి అండదండలు పుష్కలంగా వుండికూడా పరమహీనంగా బ్రతుకుతున్న మిమ్మల్ని ఆ భగవంతుడైనా రక్షించగలడని నేననుకోను..."

ఇదీ వరస!

చాలని దానికి తిరిగి వెళ్ళడానికి ముందు కొంచెం అభినందన, పరామర్శతో కలిపి గుప్పించాడు.

"ఈనాటి కార్యక్రమానికి ఏర్పాట్లు చేయడంలో ఎంతో శ్రద్ధ తీసుకున్నారు. చాలా సంతోషం. ఒక్కటే వెలితి. నరసింహంగారు కనిపించకపోవడం!"

పుండుపైన కారం చల్లినట్లుగా బసవారాయడు విలవిలలాడిపోయాడు.

నరసింహమంటే బసవారాయడి కుటుంబానికి కులదీపకుడు. జ్యేష్ఠపుత్రుడన్న మాట! నరసింహమున్నూ గంగాధరమున్నూ సమవయస్కులు. బసవారాయడు కుమారుణ్ణి హైస్కూల్లో చేర్పించిన వారం రోజులకు గంగాధరం అదే తరగతిలో 'అడ్మిట్' అయ్యాడు. సదరు అవమానాన్ని భరించలేక నరసింహం చదువుకు నామం పెట్టి ఇంటికొచ్చేశాడు.

మిగిలిన కొడుకుల విషయంలోనైనా బసవారాయడికి ఒక్కింతలో ఓదార్పు లభించి వుండవచ్చు. ఆ అదృష్టంకూడా లేకపోయింది. డొనేషన్లు కట్టి ఇద్దరు కొడుకుల్ని 'డాక్టరీ' చదివించాడు. లక్ష రూపాయలు వదిలిపోయాయి. ఇద్దరూ పదిలంగా ఇంటి దగ్గరే ఉన్నారు. ఉద్యోగాన్వేషణ కొనసాగుతూ వుంది.

చివరి వాడు 'సాగర్'లో అదేమిటో పనికిమాలిన కోర్సు వెలగబెడుతున్నాడు. దానికైనా అంతదూరం వెళ్తేగాని వాడికి సీటు దొరికిందికాదు.

ఈ కుటుంబిక విషయాలను బసవారాయడు అట్టే పట్టించుకోలేదు. కానీ స్థానిక సమాజంలో అప్పటివరకూ ఎదురులేకుండా ఎగురుతూ వచ్చిన తన బావుటా

భూమార్గంవైపు మొగ్గసాగిన తర్వాత అతడు బాగా క్రుంగిపోయాడు. కాలానికి దేశానికి ఏదో దుర్గతి పట్టినట్టు అతడికి తోచింది. మిన్నులు విరిగి, కొండలు కదలి, భూమి వ్రయ్యలై పోయి ఎన్నో అనర్థాలు తన చుట్టూరా క్రమ్ముకున్నట్టు తోచింది. కాకపోతే దేవాదాయ ధర్మాదాయ శాఖ అనే దిక్కుమాలిన డిపార్టుమెంటుకు ఉన్నట్టుండి ఎక్కడలేని తెలివీ - కాకపోతే తెగులు - పుట్టుకొచ్చేదేనా? బోనులో నిలబెట్టి జైలుకు పంపక పోవడమొక్కటే వాళ్లు తనకు చేసిన మేలు. గుడి తాళం చెవులు అప్పగించడంతోపాటు- కనిపించకపోయిన దేవుడి నగల కిమ్మత్తుతో కలిపి అక్షరప్రాప్తిగా డెబ్భై అయిదువేలు చెల్లించుకోవలసి వచ్చింది. ఈలోగా నామమాత్రపు ఖరీదుకే తన కయ్యలు, జాగాలు లాక్కుని అక్కడ కాలనీలు కట్టేశారు. బొమ్మరిండ్లలాంటి ఇల్లు చిత్రిక పట్టినట్టుండే వీధులు, ఊరా, ఉద్యానవనమా అనిపించేటన్ని చెట్లు. ఆహా, ఏం భోగమొచ్చిందిరా నాయనా? అటువైపు చూచినప్పుడల్లా గుండె గతుక్కుమంటూ వుంటుంది. ఈ కొత్తపల్లెల్లో ఇంటింటికీ ఒకరో ఇద్దరో చదువుకున్నవాళ్ళు. చాలామందికి ఉద్యోగాలుగూడా దొరికిపోయాయి. మడత చెరగని ఇస్త్రీ దుస్తులతో వచ్చి బస్సు దిగి, చెప్పులైనా తీయకుండా టక్కు టక్కున నడచిపోతుంటే, వాళ్లు తన రొమ్ముపైన నడిచినట్టే వుంటోంది. వీళ్ళ సిగదరగా! ఏం పొయ్యేకాలమొచ్చిందయ్యా వీళ్లకు. బస్సులో తాను నిల్చునివున్నా లేచి సీటివ్వరే! కాల్చే సిగరెట్టును దాపెట్టుకోకపోతే పోయిరి! తాను చూసేటట్టు ఉంగరాలుంగరాలుగా పొగ పైకి వదిలేస్తారా? అప్పటికీ తన ముఖంపైకి ఊదకపోవడమేనా తాను చేసుకున్న పుణ్యం! ఇంకేముంది నాయనా! పోయింది.

అంతాపోయింది. ఆ మధ్య వచ్చిన ఎన్నికల్లో పంచాయితీ బోర్డుగూడా రిజర్వేషన్ పేరుతో నీరుగట్టు వెంకటాద్రిపరమైపోయింది. ఇప్పుడిక తానొకటిగాడు. కొమ్మలన్నీ కాలిపోయాక బోసిగా మిగిలిపోయిన నల్లటిమోడు ఒకటిగాడు.

తన అధికారాలు, సదుపాయాలూ అలా క్రమంగా దోపిడీ అవుతూ రావడంతో బసవారాయుడికి అన్నహిత వదుగంటింది. నిద్ర కరువైంది. ప్రతీకారేచ్ఛ బుసలు గొట్టింది. జరిగిన అవమానానికీ, కలిగిన నష్టానికీ పరిహారం సాధించకపోతే, తానిక బ్రతికి వుండడంలో అర్థం లేదనిపించింది.

బడిపంతుల్ని పిలవనంపాడు బసవారాయుడు. "ఏమయ్యా! టీచరూ! నా మనవడికి ఆరో ఏడు వచ్చింది. పేర్రాసుకో" అన్నాడు.

"అట్లాగేనండీ! అందుకోసం మీరొక ఫారం నింపవలసి వుంది" అన్నాడు పంతులు. "ఎక్కడుందది? దీసుకొచ్చినావా?"

"ఇదిగో, ఇక్కడున్నట్టొస్తాను..." పరుగున వెళ్ళి ఫారం పట్టుకొచ్చేశాడు పంతులు.

"చేవ్రాలు పెడతాలేగానీ, ఇవరాలన్నీ నువ్వే రాసుకో" అన్నాడు బసవారాయుడు.

"చెప్పండి" అంటూ ఉపక్రమించాడు పంతులు "అబ్బాయి పేరు?"

"రంగబాబు"

"పుట్టినతేదీ?"

"ఎనభై ఒకటిలో పుట్టినట్టుగా రాసుకో..."

"మతం, కులం..."

"మతం సంగతి నీ ఇష్టం, కులం నేన్చెప్పినట్టురాయి. కొండ ఎరుకల..."

త్రుళ్లిపడ్డాడు బడిపంతులు. "అయ్యయ్యో. అదేం మాట! కొండ ఎరుకల అనేది అసలు సిసలు ఎస్.టి కిందికి..."

"అరె – నేన్చెప్తావుంటే నీకేమయ్యా! రాసుకో, మా తాత కొండ ఎరుకలోడే. మా అయ్య కొండ ఎరుకలోడే. నేను, నా కొడుకులు, మనవళ్లు మేమందరమూ కొండ ఎరుకలోళ్లమే..."

"లేదులెండి! మీరేదో తమాషాకు..."

"ఛత్... నీతో నాకేందయ్యా తమాషా! నేన్చెప్తావుంటినిగదా! మా కులమదే! నువు రాసుకుంటావా, లేదా?"

"సరి సరే! మీరు చెప్పినట్టే..."

రాసుకున్నాడేగానీ ఉపాధ్యాయుడికి మాత్రం మనసు మనసులో లేదు. అడ్మిషను రిజిష్టరులో ఒక తప్పుడు వివరం నమోదు చేసినందుకు అతడు గాబరా పడిపోయాడు. ఈ విషయం తెలిస్తే పై అధికారులు తనను సంజాయిషీ అడగొచ్చు... 'అయ్యా! పేరంట్స్ చెప్పినట్టుగా రాసుకోడమేనండీ నా విధాయకం' అంటూ తాను తప్పించుకోవచ్చునేమో! అయితే ఈ విచికిత్సకంతా అవతల ఒక ధర్మ సందేహం అతణ్ణి పట్టి పీడిస్తూ వుండిపోయింది. గాంధీజీ, అంబేద్కర్, జాషువాలాంటి పెద్దలు గనుక ఇంకా జీవించి వుంటే ఈ తాజాపరిణామానికి సంతోషించేవారా, విచారించేవారా– అని!

పాఠక మహాశయులారా! దయచేసి మీరీ యక్ష ప్రశ్నకు కాస్త సమాధానం చెప్పగలరా?

❖ వార్త – ఆదివారం 15 ఫిబ్రవరి, 1987. ❖

# ఆకస్మిక తనిఖీ

తిరుపతినుంచి సికింద్రాబాద్ వెళ్ళే వెంకటాద్రి ఎక్స్‌ప్రెస్ ఉదయం 9.55 కు కాచిగూడ స్టేషన్లో ఆగింది. కుడిచేత చిన్న సూట్‌కేసు, ఎడమచేత పెద్ద కాన్వాసు సంచీ పట్టుకుని, ఒక సెకండ్ క్లాస్ రిజర్వుడు కంపార్టుమెంటు నుంచీ ప్లాట్‌ఫారం పైకి దిగాడు గోకవరం నాగిరెడ్డి.

అప్పటికే పెట్టె పెట్టె గాలిస్తూ ఆ కొసనుంచి ఈ కొసకు పరుగుతీస్తున్న క్రిక్కిరిసిన జనంలో తండ్రి జాడ గుర్తించలేక అలాగే ముందుకు సాగిపోతున్నాడు.

"ఒరేయ్ సుందరమూర్తీ! ఇక్కడ్రా నాయనా, ఇక్కడ!" అంటూ కేక పెట్టాడు నాగిరెడ్డి.

సుందరమూర్తి కాళ్లకు సడన్ బ్రేకు పడింది. అతడు గిరుక్కున వెను దిరిగి పెద్ద పెద్ద అంగల్లో దగ్గరికి వచ్చి" కనిపించకపోతే – నువ్వింకా రాలేదేమోననుకుని..." అంటూ గస పోసుకోసాగాడు.

"గుడ్డెద్దు చేలో పడ్డట్టు నీ ముక్కుకు నేరుగా నువ్వెళ్లిపోతే ఎట్లారా నాయనా! కొంచెం పక్క చూపులు కూడా వుండాలి గదా!"

తానెంత జాగ్రత్తగా వుండాలనుకున్నా ప్లాట్‌ఫారంపైనే క్లాసు ప్రారంభమై పోయినందుకు కించపడిపోతూ "ఆ సామాన్లిలా ఇవ్వు నాన్నా!" అంటూ చేతులు సాచాడు సుందరమూర్తి.

"సంచీ మోయడం ఇక్కడ ఫేషన్ కాదేమోలే! నువ్వీ పెట్టె పట్టుకో..." అన్నాడు నాగిరెడ్డి.

టి.సి.కి టిక్కెట్లప్పగించి గేటుదాటుకోగానే ముందుకువెళ్తున్న సుందరమూర్తి గబుక్కున ఆగిపోయి "మరి... ఇక్కడేమిటంటే నాన్నా..." అంటూ నీళ్లు నమలసాగాడు.

"చెప్పరా నాయనా! పల్లెటూరోణ్ణి గదా! అన్నీ నువ్వు చెప్పాల, నేను తెలుసుకోవాల చెప్పు..."

నాగిరెడ్డి మామూలుగా మాట్లాడే పద్ధతి అంతే! కానీ తనకేర్పడి వున్న పరిస్థితుల్లో తాను తన గుట్టు రట్టుగాకుండా ఆయన దగ్గర ఎలా మసులుకోవాలో, ఎలా వచ్చిన వాడిని అలాగే హైదరాబాద్‌నుంచి సాగనంపాలో తోచక తనలో తాను కొట్టుమిట్టాడి పోతున్నాడు సుందరమూర్తి. ప్రస్తుత ప్రతిపాదన ఆయనక్కొంచెం కోపం కలిగించేదే అయినప్పటికీ, గత్యంతరం లేక కొనసాగించాడు.

"ఇక్కడెట్లాగంటే నాన్నా! మనం వెళ్లాలనుకున్నప్పుడు రైల్లో చోటుంటుందన్న నమ్మకం లేదు. అందుకని కొద్ది రోజులు ముందుగానే బెర్తు రిజర్వు చేయించుకుంటారు..."

"ఎట్టెట్టా? వచ్చీ రాకముందే ఇక్కడినుంచి వెళ్లిపోయే సంగతి ఆలోచించుకోవాలని చెప్పు. మంచిదిరా అబ్బోడా! వరిపైరు కలుపుకొచ్చింది. పగుల్లో కరెంటుండదు. ఒక దినం ఆదమరిస్తే, మళ్ళీ నాలుగు దినాలు పారగట్టినా నీళ్లు నిలవ్వు. నేనిక్కడుండబోయేది

రేపొక్క దినమే! మొన్నాటికిదే రైల్లోనే తిరుగుప్రయాణం. నువ్వా టిక్కెట్లు సంగతేందో చూడు..."

'హమ్మయ్య! గండం గడిచేటట్టే వుంది' అనుకున్నాడు సుందరమూర్తి. గబగబా బుకింగు కౌంటరువైపు వెళ్ళి, టిక్కెట్లుకొని జేబులో వేసుకొని పావుగంటలో తిరిగొచ్చేశాడు.

మళ్ళీ పదినిమిషాలకల్లా ఆటోరిక్షా హిమాయత్‌నగర్లో పాత ఎం.ఎల్.ఏ క్వార్టర్స్ ప్రక్కగా దూసుకుపోతోంది.

అప్పుడొక పొరబాటు పని చేశాడు సుందరమూర్తి. మరేంలేదు, "నాన్నా అమ్మ బాగుందా?" అనడమే ఆ పొరబాటు.

బ్యాగువైపు చూపిస్తూ అన్నాడు నాగిరెడ్డి – "ఈ సంచీ యింత బరువుగా ఎందుకుందో తెలుసునట్ర సుందరమూర్తీ! అడుగున ఉప్పూ, కారం వేసిన శనగ్గింజలు రెండు శేర్లో, మూడు శేర్లో వుండాయి. ఆపైన మురుకులు, పప్పు బిళ్లలు, ఓంపొడి. మీ అమ్మ ఒక పగులూ, ఒక రాత్రీ ఈ పనిపైనే వుండిపోయింది. అంటే, ఆరోగ్యం బాగున్నట్టే లెక్కగదూ! 'నేనిక్కడ క్షేమం. మీరక్కడ క్షేమమని తలుస్తాను' అని నువ్వు రెండునెల్లకైనా ఒక కార్డు ముక్క రాయకపోతివి. నే రాబట్టి సరిపోయిందిగానీ, లేకుంటే మీ అమ్మ నేలపైన నిలబడేదేనా?"

"హతోస్మి, హతోస్మి" అనుకున్నాడు సుందరమూర్తి.

ఖైరతాబాదులో ఓ సన్నటి వీధిగుండా పరుగెత్తి, ఆటో ఓ యింటిముందు నిలబడింది. ప్రహరీ గుమ్మం దాటి మెట్లెక్కితే డాబాపైన వరుసగా మూడు గదులున్నాయి. ఓ గదిముందు నిల్చుని సుందరమూర్తి చేయి వేశాడో లేదో "లోరోమోటోగే' అన్నట్టుగా రెక్క తలుపులు విచ్చుకున్నాయి. గదిలో ముప్పాతిక భాగం ఆక్రమిస్తున్న రెండింటిలోనూ, ఒక మంచంపైన చదువుతూ చదువుతూ బోర్లించిపెట్టిన పుస్తకాలముందు పద్మాసనస్థుడై కూర్చుని బుద్ధిగా ఏదో రాసుకుంటున్న ఓ యువకుడు తటాలున మంచం దిగి రెండు మంచాల నడుమ జానెడు మాత్రంగా వున్న సందులోనుంచీ తొందరగా ముందుకు రాలేక "రండి, రండి" అంటూ తబ్బిబ్బు పడిపోయాడు.

"నా రూంమేటు నాన్నా! లక్ష్మీపతి. ఈవెనింగ్ కాలేజిలో లెక్చరరుగా పనిచేస్తున్నాడు" అంటూ పరిచయం చేసి పెట్టాడు సుందరమూర్తి.

"ఉండండుండండి! కుర్చీ వేస్తాను" అంటూ గోడ కానించిన మడత కుర్చీ అందుకోబోయాడు లక్ష్మీపతి.

"ఎందుకూ! అసలే ఇరకాటం, చాలన్దానికి కుర్చీ ఒకటి వేసుకుంటే ఇక బయటుండేవాళ్లు బయట, లోపలుండేవాళ్లు లోపల వుండిపోవాల్సిందే! వద్దులే నాయనా! నేనిట్లా మంచంపైన్నే కూచుంటాను..."

"మంచిది. మంచిది. అట్లాగే కూచోండి" అన్నాడు లక్ష్మీపతి. మరిచిపోయిన డైలాగు ఒకటి తటాలున గుర్తుకొచ్చినట్టుగా వెనువెంటనే అందుకున్నాడు – "మీరొస్తున్నట్టు టెలిగ్రాం వచ్చినప్పట్నుంచీ సుందరమూర్తి ఒకటే తహతహపడిపోవడం! దిగాల్సిన చోటగాకుండా ముందుగా మరేదైనా స్టేషన్లో దిగేస్తారేమో – కాచిగూడాలో దిగకుండా

సికింద్రాబాదు వెళ్ళిపోతారేమో – కొంపదీసి ఏ కారణం వల్లనైనా ట్రెయిను మార్గమధ్యంలో నిలిచిపోతే తిండీ తిప్పలూ లేకుండా అవస్థపడిపోతారేమో – ఇలా ఎన్నో సందేహాలు..."

"ఇంతకూ నేను వచ్చి తీరతాననిగూడా అనుకోలేదేమో! నువ్వా సందేహం సంగతి చెప్పలేదే!" ముంగాళ్లకు బంధం తగిలించాడు నాగిరెడ్డి.

లక్ష్మీపతి తెల్లబోయినట్టుగా సుందరమూర్తివైపు చూశాడు. సుందరమూర్తి 'నీ పాత్రను నువ్వు బాగానే పోషిస్తున్నావులే!' అన్నట్టు మిత్రుడివైపు సాభిప్రాయంగా చూచాడు. ఆ హెచ్చరికను మనసులో గట్టిగా నిలుపుకుని లక్ష్మీపతి మళ్లీ తన పాత్రను తాను పోషించడంలో నిమగ్నుడైపోయాడు.

"అయ్యయ్యో, మీరింకా నుంచుంటే ఎలాగండీ! టిఫినుకెట్లాగూ వేళదాటిపోయింది. ఏకంగా భోంచేద్దురుగానీ, లేచివెళ్లి స్నానం చేయండి. అదే బాత్‌రూం. చూడవోయ్ సుందరమూర్తి, అక్కడ సోపూ, టవలు ఉన్నాయో లేదో చూడు. అన్నట్టీరోజు బ్యాంకుకు సెలవు పెట్టావు కదూ?"

పెట్టానన్నట్టుగా సుందరమూర్తి తలపంకించాడు.

"ఎందుకనో?" ప్రశ్నించాడు నాగిరెడ్డి.

"భలేవారే! మీరు హైదరాబాద్ రావడం యిదే మొదటిసారి కదటండీ! ఇక్కడెన్నెన్ని విశేషాలు! అవన్నీ మీకు చూపించొద్దూ?"

మొత్తంపైన ఇదంతా ఇద్దరు వేటగాళ్లు ఒక అడవి మేకని ఉచ్చులవైపు పరవ దోలినంత పనైపోయింది. పబ్లిక్ గార్డెన్స్ దగ్గరినుంచీ మొదలెట్టి, టాంక్‌బండ్, నక్షత్రశాల, బిర్లామందిరం మొదలైనవి చూపెట్టి, దారిలోనే రాత్రి భోజనంగూడా ముగించి, తండ్రీ కొడుకులు గదిలోకి చేరుకునేటప్పటికి పథకంలో మొదటిభాగం విజయవంతంగా నెరవేరినట్టయింది. ఆపాటికి లక్ష్మీపతిగూడా ఈవెనింగ్ కాలేజీనుంచి తిరిగివచ్చి, గదిలో హాజరైపోయి వున్నాడు.

"ఇక్కడున్న రెండు మంచాల్లో ఇద్దరు మాత్రమే పడుకోవచ్చునాన్నా! నువ్వు పడుకో, దగ్గర్లోనే నాకొక స్నేహితుడున్నాడు. నేను వెళ్ళి వాడి రూములో పడుకుంటాను" అన్నాడు సుందరమూర్తి. అన్నాడేగాని, ఆ ప్రతిపాదనపైన తండ్రి అభిప్రాయమేమిటో తెలుసుకునే ఆసక్తి మాత్రం అతడికి లేకపోయింది. చివరి మాటతోబాటు మెట్లు దిగేస్తూ "తెల్లవారే సరికి వచ్చేస్తాలే!" అని అక్కడినుంచే అరచి చెప్పాడు.

మిత్రుడి ప్రవర్తనలోని తొట్రుబాటును లక్ష్మీపతి యిట్టే గ్రహించేశాడు. పరిస్థితిని కాస్తా సర్దుబాటు చేయడం బాగుంటుందనిపించి" ఆ మాట కాస్తా నింపాదిగా చెప్పి వుండొచ్చు గదా!" అన్నాడు.

"మా వాడంతేలే నాయనా!" అందుకున్నాడు నాగిరెడ్డి. "ఎక్కడో చదువుకుంటానని చెప్పి, నేరుగా సినిమాలకు వుడాయించేసే వాడు. ఇది మొదట్నించీ వాడి కలవాటే!"

లక్ష్మీపతి నిర్ఘాంతపడిపోయాడు. తాను వ్యవహరిస్తున్నది ఒక పల్లెటూరి ముసలాయనతోనంటే అతడికిప్పుడు నమ్మకం కలగడంలేదు. ఈయనెక్కడి పల్లెటూరి వాడురా బాబూ, అవులించకముందే ప్రేవులు లెక్కపెట్టేస్తున్నాడు!

మరునాటి ఉదయం ఎనిమిదిన్నరకల్లా టిఫిన్ ప్యాకెట్లతోను, ఫ్లాస్కులో పోయించుకున్న కాఫీతోనూ పితృసేవా పరతంత్రుడిలా పరతెంచి వచ్చేశాడు సుందరమూర్తి. "బ్యాంకులో ఆడిట్ జరుగుతోందినాన్నా! లేకపోతే సెలవుపెట్టేవాణ్ణి! సాలార్‌జంగ్ మ్యూజియం, చార్‌మినార్, గోలకొండ కోట - అవన్నీ నీకు లక్ష్మీపతి చూపిస్తాడు" అంటూ ఎలా వచ్చినవాడు అలాగే మాయమైపోయాడు.

గంట పది దాటింది. పదకొండు కావస్తోంది. కానీ నాగిరెడ్డి మాత్రం ఎంతకూ బయటకు కదిలే సూచనలు కనిపించడం లేదు. "ఏమండీ, వెళ్దామా!" అంటూ కొంచెం భయం భయంగానే ముగ్గులోకి దిగాడు లక్ష్మీపతి.

"ఎక్కడికి నాయనా! గోలకొండ కోటకా!" సాగదీశాడు నాగిరెడ్డి.

"కాదటండీ మరి! హైదరాబాద్ వచ్చిన వాళ్లు ఎట్టి పరిస్థితుల్లోనూ దాన్ని చూడకుండా వెళ్లరు..."

నాగిరెడ్డి పకాలున నవ్వేశాడు- "నాయనా లక్ష్మీపతి! పరీక్షల తర్వాత మార్కుల కాయితం చేతికిస్తే' మార్కులు తక్కువగా వొచ్చినాయని, నా చేవ్రాలు తనే పెట్టేసి, మావాడు దాన్ని తిరిగిచ్చేసే వాడు. వాటి మాటకేంగానీ, నువ్వయినా బుద్ధిమంతుడివై వుంటావని అనుకున్నాను..."

"అరరే, అదేమిటండీ, అలా అంటున్నారు?"

"లేకపోతే కొడుకు కాపురానికి బదులు గోలకొండ కోటను చూపిస్తానంటావా నువ్వు! ఎప్పుడైతే మూడు నెలలుగా వాడి అతీగతీ తెలియకపోయేనో, అప్పుడే అనుకుంటి! నిన్న స్టేషన్లో వాడి ముఖం జూడగానే నా సందేహం బలపడిపోయే! రెండు మంచాలుంటే సరిపోయేనా? ఉండేది ఒక్కరేనని, రూములో అడుగుపెట్టగానే గ్రహిస్తి. ఏదీ, మావాడి పెట్టేదీ? పుస్తకాలేవీ? రెండద్దాలు, రెండు దువ్వెన్లు, రెండు ముఖం కడుక్కునే పనిముట్లు వుండాల్నా? అవిలేవా? ఎందుకులే నాయనా! అయిందయింది. పోయింది పోయింది. ఇంక వాడి కాపురం ముచ్చటగూడా చూసేస్తేచాలు, నా పాటుకు నేనువెళ్ళి పోతాను..."

లక్ష్మీపతి ముఖాన నెత్తురు చుక్కలేకుండాపోయింది. అతడు చేతివేళ్లు నలుముకుంటూ "మంచో చెడో జరిగిపోయింది. కానీ మీరు కోప్పడతారని పాపం, సుందరమూర్తి లోలోపల చాలా భయపడిపోతున్నాడు. మీరు కాస్తా పెద్ద మనసుచేసి..." అంటూ గింజుకోసాగాడు.

"నాయనా, మా పెద్ద మనసు సంగతి నువు చెప్పొద్దు. మేము చిన్న వూళ్లో వుండే వాళ్లం. చిన్న చదువు చదువుకున్న వాళ్లం. చిన్న బతుకు బతికేవాళ్ళం. మనసు మాత్రం మాకు పెద్దదిగా ఎట్లా వుంటుంది? ఉండదు. సర్లే, అయిపోయిన పెండ్లికి మేళాలెందుకు? నువ్వు మా వాడుండే చోటికి నన్ను తీసుకెళ్ళేదుందా, లేదా? ఆ మాట చెప్పు..."

"అలాగలాగే! తప్పక వెళ్దామండీ! కానీ ఇప్పుడుకాదు. ఆ అమ్మాయిగూడా సుందరమూర్తితోబాటు బ్యాంకులో పనిచేస్తోంది. ఇద్దరూ అయిదుగంటల తర్వాత ఇల్లు చేరుకుంటారు. అందాకా మనమెక్కడికైనా తిరిగి, సాయంకాలం అక్కడికి వెళ్ళొచ్చు..."

ఆరింటికి సరిగ్గా చింతలబస్తీలోని ఓ యింటి కాంపౌండులో ప్రవేశించి, అవుట్ హౌసులావున్న ఓ వాటా ముందు నిలబడి కాలింగ్ బెల్ నొక్కాడు లక్ష్మీపతి. రెక్క తలుపుల్లో

ఒక్కటి మాత్రం తెరచుకుంది. పంజాబీ దుస్తుల్లో వున్న ఒక యువతి చేతులు జోడించి "నమస్తే భాయిజీ, ప్లీస్ కమిన్" అంటూ లక్ష్మీపతిని ఆహ్వానించింది.

"నమస్తే సిస్టర్! ఐ థింక్ దట్ సుందర్ ఈజ్ నాట్..." అంటూ అర్థోక్తిలో ఆగిపోయాడు లక్ష్మీపతి.

"యస్, యస్! హి వెంట్ టు యువర్ రెసిడెన్స్ టు మీట్ హిజ్ ఫాదర్" అంది ఆ అమ్మాయి.

"ఎక్స్‌క్యూజ్‌మి సిస్టర్! ప్లీజ్ మీట్ యువర్ ఫాదర్-ఇన్-లా మిస్టర్ నాగిరెడ్డి!" అవుటు పేల్చినట్టుగా అన్నాడు లక్ష్మీపతి.

ద్వారంనుంచి తల ఈవలికి సాచి, నాగిరెడ్డి కనిపించగానే ఆ పడుచు గృహిణి గాలివానలో పూలతీగలా కంపించిపోయింది. చెంపలపైన, ముక్కుపుటాలపైన గుప్పుగుప్పున చెమట బిందువులు పొటమరించాయి. అయినా ఆంతరంగిక చైతన్యం ఒకటి స్తబ్ధమై పోలేదేమో, ఆమె తటాలున మెట్లు దిగివచ్చి "నమస్తే బాబూజీ!" అని పాదాభివందనం చేస్తూ 'ఆయియే, ఆయీయే' అంటూ లోపలికి తీసుకెళ్ళి, 'బైటీయే బైటీయే' అంటూ సోఫాలో కూచోబెట్టింది.

"ఏమమ్మా, తెలుగు రాదా?" అన్నాడు నాగిరెడ్డి.

"కుంచం... కుంచం... వచ్చు"

గదిలోనుంచి మెరుపు జారినట్టుగా లోపలికి వెళ్ళిపోయిన అమ్మాయి అయిదు నిమిషాల్లో తిరిగొచ్చింది. ఇప్పుడామె నిండైన చీర ముస్తాబుతో, పొందికైన జాకెట్టుతో అచ్చమైన తెలుగమ్మాయిలాగే వుంది. రెండు ప్లేట్లనిండా స్వీట్స్, మిక్చర్, యాపిల్ పళ్ళ ముక్కలూ తెచ్చి పెట్టి "మైనే జోర్ దేకర్ చతాయాథా ఆప్‌కో సీధే ఘర్‌లామే. ఉన్‌హోనే మేరే బాత్ నా మానీ. మేరాయకీన్ థాకోయీ అదృశ్యశక్తి ఆప్‌కో యిధర్ ఖీంచ్ లాయేగా. మే సారేయింత జామ్ యిసీలియే మైనే కర్‌లియా" అంది.

నాగిరెడ్డి లక్ష్మీపతివైపు చూశాడు. లక్ష్మీపతి దుబాసీ పనికి పూనుకుంటూ "మిమ్మల్ని నేరుగా యిక్కడికే తీసుకురమ్మని చెప్పిందట! సుందరమూర్తి వొప్పుకోలేదట! అయినా ఏ అదృశ్యశక్తి అయినా మిమ్మల్ని యిక్కడికి తీసుకొస్తుందని ఈమె అనుకుంటూ వుందట! అందుకోసమే ఇవన్నీ తెచ్చి పెట్టానని అంటూ వుంది" అన్నాడు.

ఉపాహారం ముగించిన తర్వాత "సెలవిప్పిస్తే యిక నేను వెళ్లొస్తాను" అన్నాడు లక్ష్మీపతి.

"మంచిది. వెళ్ళిరా నాయనా! మావాడు నీ రూము దగ్గరుంటాడులే! వాడితో చెప్పు. పులి కడుపున పుట్టి వాడు మేకరుపు అరుస్తున్నందుకు నాకు బాధగా వుంది. మేము పడమటి గడ్డవాళ్ళం. మోటుముండా వాళ్ళమని లెక్క. తప్పో, ఒప్పో మాకు రైటనిపించింది చేస్తాం. ఈపని చేసినా, నీకిష్టమైతే ఒప్పుకో. లేకపోతే తప్పుకో- అనేస్తాం. వాడబ్బ ఫాలాక్షుడితో ఎవ్వారమైనా ఇంతే మా కత! పెండ్లి అనేది నీ యిష్ట ప్రకారం నువ్వు చేసుకోవలసింది చేసుకున్నావు. ఇంక దాన్ని బయటపెట్టడానికి భయపడి చస్తావెందుకు? ఛా ఛా, మగపుట్టక పుట్టి ఈ పిరికితనం పనికిరాదని చెప్పు, వాడి కంటే ఈ ఆడబిడ్డ మేలు..."

లక్ష్మీపతి వెళ్ళిపోయాక అలమారాలో ఏవో పాత తెలుగు పత్రికలుంటే పైకి తీసి, దుమ్ము దులిపి, వాటిని చూస్తూ కూర్చున్నాడు నాగిరెడ్డి. వంట గదిలోనుంచీ మసాలా పోపు వాసనలు జమాయిస్తూ గాలిలో కలిసి వస్తున్నాయి. గంట ఎనిమిది కాగానే గృహిణి డైనింగు టేబులుపైన విస్తరి వేసేసింది. "జరా జార్... తోడాజార్ ఖాయీయే" అంటూ కొసరి కొసరి వడ్డించింది. మొదటిది వినయం. రెండోది సర్దుబాటు మనస్తత్వం. మూడోది, చూడ ముచ్చటగా ఇంటిని సర్దిపెట్టుకున్న తీరు. నాలుగోది శాకపాకాల రుచి. అయిదు వడ్డించడంలో ఆప్యాయత. అన్నింటిలోను ఈ పిల్ల పాసుమార్కులు కొట్టేసింది. ఫరవాలేదు, పెళ్ళి అనేది లాటరీయే అయినప్పటికీ ఈ పనికిమాలిన వెధవకు మంచి విలువైన వస్తువే దొరికింది!

భోజనం చేసిన తర్వాత కోడలు తెప్పించిన మిరాయికిళ్లీ నములుతూ హాల్లో తనకోసం వేసిన మంచంపైన దిండుకానుకుని కూర్చున్నారు నాగిరెడ్డి. ఎదురుగా గదిలో టేబులు దగ్గర కూర్చుని ఇంటి ఇల్లాలు ఓ పుస్తకంలో పుటలు అటు ఇటు త్రిప్పుతూ, చిన్న కాగితంలో ఏదో రాసుకుంటూ ఉంది. అలా పదిహేను నిమిషాలు గడిచిన తర్వాత ఆమె హాల్లోకి వచ్చి, మామగారి చూపునానేటట్టుగా నిలబడి "ఇంకొకసారి... మీరు అత్తగారిని... తెండి. ఆ లోపల... నేను... టెలుగూ... నేర్చుకుంటాను" అంది.

"ఇన్ని మాటలెట్లా వొచ్చినాయమ్మా నీకు?" అన్నాడు నాగిరెడ్డి ఆశ్చర్యపడిపోతూ.

కోడలు తన చేతిలోని పుస్తకాన్ని మామగారి చేతిలోపెట్టింది. దానిపేరు 'ముప్పై రోజుల్లో తెలుగు' అనే ఇంగ్లీషు మీడియంద్వారా.

"అట్లనే, అట్లనే! తప్పకుండా పట్టుకొస్తాను. దానికే గాని తలుపు దగ్గర ఏదో చప్పుడవుతూ వున్నట్టుంది. బహుశా వాడే అయివుంటాడు. వెళ్లి చూడు" అన్నాడు నాగిరెడ్డి.

❖ ఆంధ్రజ్యోతి దినపత్రిక - ఆదివారం అనుబంధం, 1989. ❖

# పంజాబ ఆంధ్ర గుజరాత మరాఠా, ద్రావిడ ఉత్కళ వంగ...

పూర్తిపేరు దుర్గావరప్రసాద మల్లికార్జునరావు. సంగ్రహ నామధేయం ప్రసాదరావు. అతనిది విజయవాడ దగ్గర గుడ్లవల్లేరు. వయోజన విద్యా బోధన నిమిత్తం ఒకసారి బందర్‌లో ఏర్పాటైన శిక్షణా శిబిరంలో అతడూ నేనూ నెలరోజులపాటు ఒక గదిలో కలిసి వున్నాము.

ప్రసాదరావు చాలా మంచివాడు. ఉదారుడు, స్నేహపాత్రుడు. అన్ని లక్షణాలూ బాగానే వుండేవి గానీ అతనితో వచ్చిన పేచీ ఒక్కటే! "ఏంటోయ్ వెంకటేశం! మీది చిత్తూరు జిల్లా కదూ! మీరు తెలుగువాళ్ళే కారు పోవోయ్!" అనేవాడు. నేను ముఖం చిన్నబుచ్చుకునే వాణ్ణి. "అదేందయ్యా, ప్రసాదరావూ! ఇల్లా మమ్మల్ని తీసిపారెయ్యడం నీకు తగునా! చిత్తూరునుంచి శ్రీకాకుళందాకా అనంతపురం నుంచి ఆదిలాబాద్‌దాకా మనమంతా ఒకటే గదా!" అంటూ నేను గింజుకునేవాణ్ణి.

"కాదులేవోయ్! నేను చెబుతున్నాగా! అసలైన తెలుగువాళ్లనీ, కొంచెం నకిలీ తెలుగువాళ్లనీ మనలోనూ రెండు రకాలున్నాయి." అనేవాడు ప్రసాదరావు; అప్పటికింక తన మాటే శిలాశాసనమైనట్టు, దానికి తిరుగులేనట్టు!

"అట్లాగైతే మేము నకిలీ వాళ్లమా నాయనా?" అనేవాణ్ణి నేను దీనంగా.

"కాక! 'వాడు పూడ్చినాడు. వీడు దా వచ్చినాడు. కొంచెం ఆ సంగతి చెప్పు మీ!'– ఇదేనటయ్యా తెలుగంటే? అబ్బబ్బ, చెవులు మూసుకోవాలనిపిస్తుందనుకో! పోతే సిగ్గు లేకుండా అరవవాడిలా అడ్డపంచ కట్టుకుంటావటయ్యా నువ్వు! నాకు మల్లే గోచీ పెట్టి, చెంగులు జీరాడేటట్టుగా పంచగట్టి, లాల్చీ తొడిగి, భుజంపైన కండువా వేసుకునే వాణ్ణి ఒక్కణ్ణి– ఒక్కణ్ణి– చూపించగలవటయ్యా మీ జిల్లాలో! ఇడ్లీ, సాంబారూ, మెదువడా తప్పితే పెసరట్టంటే ఏమిటో తెలుసా మీకు? గడ్డ పెరుగుకు, ఆవకాయకు వున్న అనుబంధం ఏమిటో ఎరుగుదురా? కట్టూబొట్టూ, మాటాడే తీరూ, తినే తిండీ – ఇలా ఏ అంశాన్ని బట్టి చూచినా ఆపాదమస్తకం తెలుగువాళ్లం మేము. కావలిస్తే ఈ మాట ఢంకా బజాయించి చెప్పగలను..."

అప్పుడిక నన్ను నేను కాపాడుకోడంకోసం కొంత తర్కబద్ధంగా నా వాదాన్ని మలచుకోవలసి వచ్చేది – "అయ్యా ప్రసాదరావూ! నువ్వు వినదలచుకోకపోతే నేనేమీ చెయ్యలేనుగానీ వినదలచుకున్నట్టయితే నా పరిజ్ఞానం అనుమతించినంతలో కొంచెం వివరణ ఇచ్చుకోగలను. మన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి తమిళ, కన్నడ, మరాఠీ, ఒరియా ప్రాంతాలు సరిహద్దులుగా వున్నాయి. ఈ ద్విభాషా ప్రాంతాల్లో కలగాపులగం కావడం తప్పనిసరి! తెలంగాణా తెలుగువాడి మాటలో ఉర్దూ యాస తప్పదు. కన్నడులు బహుళంగా గుండప్పలు, నంజుండప్పలు గదా! అందువల్ల బెంగుళూరు తెలుగువాళ్లు "ఏండప్పా! రండప్పా! కూచోండప్పా!' అంటారు. యావదాంధ్రంలోను చదువుల తల్లి సరస్వతీదేవి

వున్న ఒకే ఒక ఆలయం ఆదిలాబాదు జిల్లాలో వుంది. అక్కడి ఆంధ్రులు తెలుగు కలిసిన మరాఠీతోను, మరాఠీ కలిసిన తెలుగుతోనూ మాట్లాడుకుంటారు. ఇటు అరకుగాని, ఇచ్ఛాపురంగానీ వెళ్ళి చూడు. అక్కడి మనవాళ్ల భాష తెలుగు ఒరియా కలిసిన మణి ప్రవాళంలా వుంటుంది. ఆ మాటకొస్తే వివిధ సంస్కృతుల సమ్మేళనమే గదటయ్యా నేటి మానవ నాగరికత! నువ్వీనాడు తెలుగుభాష అనుకునేది ఏనాటి ఏయే భాషల మిశ్రమమో చెప్పగలవా? అట్లాగే ఆచారాలూ వ్యవహారాలూ అన్నీ! సంకరంగాని మతం, సంకరంగాని కులం, సంకరంగాని భాష ఈ ఇలాతలంపైన ఉన్నాయంటావా? పోనీలే, ద్విభాషా ప్రాంతంలో నివసించే మేము అసలు తెలుగువాళ్ళమైతే కాకపోవచ్చునుగానీ, మీకు లేని సదుపాయం మాకొకటి వుంది. మాతృభాషతోబాటుగా మాకు మరొక దేశ భాష సునాయాసంగా అబ్బుతుంది. అందువల్ల మాకు విజయవాడ ఎంతో తంజావూరు అంతే! తల్లి కృష్ణమ్మ ఎంతో అన్నై కావేరీ అంతే! విశ్వనాథవారి 'వేయిపడగ'లెంతో, కల్కిరచన 'శివగామియిన్ శపథమూ' అంతే! నా కత్తికి రెండంచులూ పదునయ్యా ప్రసాదరావ్! నా భాగ్యం తక్కువైందేమీ కాదు. నిజానికి నన్ను జూచి అసూయపడాలి నువ్వు!" అంటూ నేనుగూడా రెచ్చగొట్టడానికి ప్రయత్నించే వాణ్ణి.

అయితే నా హేతువాదమంతా వట్టి అరణ్య రోదనంగా మాత్రమే మిగిలిపోయ్యేది. ప్రసాదరావు అడ్డంగా తలాడిస్తూ "మాటలకేం లేవోయ్! మీ కే భాషగానీ సరిగ్గా రాదేమో!" అంటూ తేల్చి పారేసేవాడు.

ఈ వాదం మానడుమ ఒక అనుదిన వ్యవహారమై పోయింది. తన వాదానికి తాను, నా వాదానికి నేను కొత్త కొత్త ఆధారాలు సమకూర్చుకునే వాళ్లం. ఎటొచ్చీ దీనికి ముగింపంటూ వుండదు. గదా! ఎక్కడో ఒకచోట వాగ్వాదానికి 'సశేషం' పెట్టి "సర్లేవోయ్, నువ్వు లేచి షర్టు వేసుకో! మనం అలా వెళ్లొద్దాం" అనేవాడు ప్రసాదరావు.

హాస్టలు గదిలోనుంచి బయటపడి బజార్లల్లో బలాదూరు తిరిగే వాళ్లం. సినిమాకు కానివ్వు, హోటలుకు కానివ్వు ఎక్కడికి వెళ్లినా అతడు నా జేబులో నుంచి మాత్రం పర్సునెత్తనిచ్చేవాడు కాదు. "ఉండవోయ్ వెంకటేశం! నువ్వు మా జిల్లా కొచ్చావు గదా! మా కతిథివన్నమాట! వద్దు. నేను చెబుతున్నాగా! పర్సు జేబులో వుంచుకో! నేను మీ వైపు వచ్చినప్పుడు నువ్వే ఖర్చు పెడుదువుకానిలే!" అనేవాడు.

శిక్షణకాలం ముగియడంతోటే మేము విడిపోయాము. దాదాపు పదిహేను సంవత్సరాలదాకా మా స్నేహం ఉత్తర ప్రత్యుత్తరాలకు మాత్రమే పరిమితమైపోయింది. ప్రసాదరావు దక్షిణాదికి రావడం మాత్రం తటస్థపడనేలేదు. అలాంటిది ఇటీవల కొద్ది రోజుల క్రిందట సినిమా తీస్తున్న ఓ మిత్రుడి ఆహ్వానంపైన మద్రాసు వెళ్లి, పనిలో పనిగా తమిళదేశంలోని యాత్రాస్థలాలు దర్శించి, తిరుగుదారిలో అతడు మా వూరొచ్చి దిగేశాడు.

ఉద్వేగ ప్రవృత్తిలో మాత్రం మార్పులేదు. "ఆహా, ఆహా! ఎంత బాగుందోయ్ మీ వూరు!" అంటూనే ఇంట్లో అడుగుపెట్టాడు. "చుట్టూరా కొండలు, మామిడి తోటలు, ముచ్చటగా ఓ ఏరు, దాని గట్ల వెంబడీ కొబ్బరి చెట్లు..."

ప్రసాదరావు ఆగమనం నేను ఎదురు చూచింది గాదు. అతడు తన వెంట తెచ్చుకున్న లగేజీని తీసి బల్లపైన పెడుతు 'ఎప్పుడు, ఎక్కడ, ఏమిటి, ఎలా'లాంటి కుశల ప్రశ్నల్ని గుప్పించేశాను. అతడింకా బదులు చెబుతుండగానే వంటగదివైపు చూస్తూ "ఇదిగో నాగరత్నం! మా ప్రసాదరావు వచ్చేసినాడు" అంటూ కేకపెట్టాను.

"బాగుండారా అన్నా! ఈయన ఎన్నిసార్లు చెప్పినాడో మిమ్మల్ని గురించి! ఇంత కాలానికి మాపైన దయగలిగింది. ఇదిగోండి, మంచినీళ్లు తీసుకోండి!" అంటూ మా ఆవిడఎదురొచ్చేసింది. "అమ్మా, తల్లీ! ఇంటికి మొదటిసారిగా వచ్చిన వ్యక్తిని 'అన్నా' అని ఆప్యాయంగా పలకరించడం మొదటిసారిగా వింటున్నా!" అంటూ ప్రసాదరావు పరవశించిపోయాడు.

కాఫీ మర్యాదగూడా చెల్లించిన తర్వాత స్నానాలగది చూపించాను.

"ఏందేందో చెప్పినారుగానీ, మనిషి చాలా మంచాయనగా వుండాడు గదండీ!" అంది మా ఆవిడ.

"అవునే, నీకట్లనే అనిపిస్తుంది. ఈ మనిషిని మెప్పించడం సటు పటు మైన పనిగాదు. మన ఆతిథ్యానికి ఎన్ని వంకలు పెడతాడోనని నాకు భయంగా వుంది. నా పరువు నిలబెట్టవలసిన భారం నీదే! ముఖ్యంగా జాగ్రత్త తీసుకోవలసింది వంట దగ్గర."

ఇంట్లో ఏవి వున్నాయో, ఏది లేదో – లేని వాటిని మా ఆవిడ ఎలా తెప్పించుకుందో – అదంతా నాకేమీ తెలియదు. మేమూ ఇష్టాగోష్ఠిలో తలమునకలై వుండగానే "ఏమండీ! మాటల్లో పడితే మీకు ఎంత పొద్దయిందీ జ్ఞాపకముండదు. అన్నగారిని పిల్చుకురండి. విస్తర్లు వేసేసినాను" అంటూ పిలుపు వచ్చింది.

కూచున్నాము.

"ఇదేమిటమ్మా? పప్పుల పొడా! మేం పొడి అనం. 'గుండ' అంటాం. అరరే,చాలా బాగుందే! తరువాత అయిటం ఏమిటి? 'కూర' అని చెప్పి ములగకాడల పులుసు పోశావేమిటమ్మా? మేము తాళింపుల్ని మాత్రమే కూరలంటాం. దివ్యంగా చేశావు గదమ్మా పులుసు! ఏదీ, మరికొంచెం వడ్డించు. ఆహా, రసమంటే ఇలా వుండాలయ్యా వెంకటేశం! పప్పు వేస్తారటమ్మా ఇందులో? దీన్ని 'సరసం' అనొచ్చు. వట్టి మిరియాలూ, జీలకర్రావేసి మా వైపుగూడా చేస్తారులే! దాన్ని నేను 'విరసం' అంటుంటాను. అదెక్కడ? ఇదెక్కడ? ఇది అమృతం గదా! చెల్లెమ్మా, దీన్ని కాస్త గ్లాసులో పోసి ఇస్తావటమ్మా..."

సుష్టుగా భోంచేసి నాలుగింటిదాకా నిద్రపోయాడు ప్రసాదరావు. ఆ తర్వాత కాఫీ సేవించి, 'సైట్ సీయింగు' కంటూ బయల్దేరి ఊరి పరిసరాలపైన పడ్డాడు. ఒక గుట్ట ఎక్కాడు. దానిపైన నిలబడి క్రింద చెరువునీటిలో తన నీడ చూచుకున్నాడు. అక్కడొక బండపైన కూచుని కొబ్బరితోటల కావల పడమటి కొండల వెనుక సూర్యాస్తమయాన్ని తిలకించాడు. 'ఆహా, ఎంత థ్రిల్లింగ్‌గా వుందయ్యా వెంకటేశం! ఈ గుట్టలు, చిట్టడవులు, కోనలు, చెరువులు చూస్తుంటే కొండలరాజు కొలువులా వుంది గదయ్యా! ఇలా నిమ్నోన్నతాలుంటేనేనయ్యా అందం! వట్టి మైదానాలో ఏముంటుంది?" అన్నాడు.

"పోనీలే ప్రసాదరావ్! నీ కెట్లాగూ మా భాషంటే సరిపడదు. మా ప్రాంతమైనా నచ్చింది చాలు. అదే పదివేలు!" అన్నాను.

"అబ్బే, అదేంలేదు లేవోయ్! ఈ మధ్య విస్తృతంగా దేశం తిరిగొచ్చాను గదా! నా అభిప్రాయాలూ మార్చుకున్నా. మహాకవులు వ్యాకరణ విరుద్ధమైన ప్రయోగాలు చేస్తారనుకో! ఏమిటిలా చేశారని మనం అడగ్గాడదట! 'మహాకవుల ప్రయోగమ్ములు యథాతథంబుగా గ్రాహ్యంబులు' అంటాడు శాస్త్రజ్ఞుడు. ప్రజల విషయమున్నూ అంతే! 'పదుగురాడు మాట పాడియై ధరచెల్లు' అంటారు గదా! అవును మరి! ప్రజల భాషను తప్పు పట్టడానికి మనమెవరం? ఇప్పుడా పట్టింపులేవీ లేవు. కొంచెం ఆలోచన, కొంచెం వివేచన వచ్చాక అతిశయం గాలిలో బూరగదూదిలా ఎగిరిపోయిందనుకో!"

మార్పు మానవ స్వభావం. కొందరు బింకానికి పోయి పాత అభిప్రాయాలకే అంటిపెట్టుకున్నట్టు నటిస్తారు. అలా కాకుండా తమ అభిప్రాయాల్లో మార్పు వచ్చినట్టుగా ఒప్పుకోడం ఉత్తమ సంస్కారం లక్షణం. ఆ క్షణాల్లో ప్రసాదరావు వ్యక్తిత్వంపట్ల నాకున్న గౌరవం ఇనుమడించింది.

"ఏమోయ్ వెంకటేశం! అరవం ఒక అక్షరం ముక్క అయినా రాకుండా దక్షిణాది అంతా ఎలా తిరిగొచ్చావని అడగవే నువ్వు!" అంటూ మళ్లీ మొదలెట్టేశాడు ప్రసాదరావు. "అక్కడే వుంది కిటుకు. ఒక టూరిస్టుకు కావలసినంత భాషా పరిచయాన్ని నేను సంగ్రహించేశాను. 'ఇంద బస్సు ఎంగెపోదు?' అంటే 'ఈ బస్సు ఎక్కడికి వెళ్తుంది' అన్నమాట! 'కోయిలుక్కు ఎప్పుడి పోగణుం?' అంటే 'గుడికెలా వెళ్లాలి' అని అర్థం. 'ఇదువిలై ఎన్న? అంటే 'దీని ఖరీదెంత' అని భావం. ఇలాంటి పాడి మాటలతోనే కాట్పాడినుండి కన్యాకుమారి దాకా చక్కర్ కొట్టుకొచ్చేశాను..."

ఆరోజు రాత్రి మంత్రవేదికలాంటి తన సూట్‌కేసు తెరిచి రకరకాల వస్తువులు పైకి తీశాడు ప్రసాదరావు. పూంబుహార్‌లో కొన్న తిరువళ్లువర్ అని చెప్పి ఆ విగ్రహాన్ని నాకిచ్చేశాడు. నాగపట్నంలో కొన్న ముత్యాల గాజుల్ని 'చెల్లెమ్మా! ఇది నీకు' అంటూ మా ఆవిడ చేతుల్లో పెట్టాడు. కంచి పట్టుచీర పైకి తీసి మా ఆవిడచేత బాగుందనిపించాక 'ఇది మీ వదినకోసమమ్మా!' అన్నాడు. అల్లాగే తంజావూరు కదిలే బొమ్మ తన మేనకోడలికనీ, గూడలూరు పనసనార సంచీ తన బాబాయికనీ, కుంభకోణపు నెమలిదీపం తన కుమార్తెకనీ, యిలా ఎన్నెన్నో వస్తువులు చూపిస్తూ వచ్చాడు.

"మరైతే నీకోసం నువ్వేమి కొనుక్కున్నావయ్యా ప్రసాదరావూ?" అని అడిగాను.

"ఇదిగో, ఇది నా కోసం" అంటూ ఓ పుస్తకం తీసి చూపించాడు.

ఆశ్చర్యంతో నేను ఉక్కిరిబిక్కిరైపోయాను.

ఆ పుస్తకం పేరు–

'ముప్పై రోజుల్లో తమిళభాష – తెలుగుద్వారా'.

❖ ఆంధ్రజ్యోతి – నవంబర్, 1993. ❖

# వాఘిరా

"ఏమండీ, నిద్రలేచారా? పళ్ళుతోమి ముఖం కడుక్కున్నారా? పేపరు చూడ్డమయిందా? ఏమండీ, ప్లీజ్. బిడ్డకు తీసివేతలు సరిగ్గా రావడం లేదండీ. హోమ్‌వర్క్‌లో హేమకు కాస్త సాయపడరూ? స్నానానికి నీళ్ళు తోడేశా, వేడినీళ్ళెక్కడైనా అట్లాగే దిమ్మరించుకునేరు! చన్నీళ్ళు కలుపుకోవాలి. టిఫిన్ చేస్తున్నా కదండీ. బాబ్బాబూ – అట్లాగే హేమకుగూడా స్నానం కానియ్యరూ? ఆ పిల్ల యూనిఫామ్ బీరువాలో, కింది సొరుగులో ఉంటుంది చూడండి. గోధుమ రంగు ప్యాంటు ఇస్త్రీచేసి పెట్టాను. దానిపైకి తెల్ల గళ్ళ చొక్కా బాగుంటుంది. రెండూ ఒకచోట పై సొరుగులో ఉన్నాయి తీసుకోండి. ఒక కర్చీఫ్ తీసి జేబులో పెట్టుకోడం మరచిపోవద్దు. హేమకు క్యారియర్ సర్దేశాను. ఎదురింటి మీనా ఇంట్లో ఉందో, అప్పుడే వెళ్ళిపోయిందో చూడరూ? ఏమిటండీ ఆ అమ్మాయి మరీను. హేమకు తోడే ఇవ్వనంటుంది. అది లేకపోతే మనమెవరైనా వెళ్ళి కాన్వెంటులో దిగవిడిచి రావలసిందే."

ఇదండీ వరుస! మా ఇంట్లో ఉదయాలు ఇలా మా వసంతలక్ష్మి సూచనలు, సలహాలు, హెచ్చరికల మేరకే రూపొందుతాయి. ఒకరోజిట్లాగే ఆవిడ అభ్యర్థనపైన వరండాలోకి వెళ్ళి, ఎదురింటి మీనాకోసం చూస్తుండగా మా కింది వాటా పూలతోటలో క్రోటన్ మొక్కల నడుమ చిన్న ఆకారమేదో కదులుతున్నట్లు తోచింది. "ఎవరు, ఎవరక్కడ?" అని పలకరించాను.

"నేనండీ అంకుల్, వాగిరాని! ఏమకోసం వొచ్చా."

ఈలోగా "ఎవరు నాన్నా" అంటూ పరుగెత్తుకొచ్చి, పిట్టగోడపై నుంచీ కిందికి తొంగి చూచింది హేమ. "వాగిరా! వొచ్చేశావా! ఉండొత్తున్నా" అంటూ ఒకచేత పుస్తకాల సంచీ, మరొకచేత మధ్యాహ్నవేళ భోజన భాజనాల సంచీ మోసుకుంటూ మెట్లు దిగిపోయింది.

'వాఘిరా! ఏం పేరో అది! ఎవరో కొత్త పిల్లలా ఉంది' – స్వగతంలా చెప్పుకుంటూ హాల్లోకి వెళ్ళాను.

"అదీ నాలాంటి దిక్కులేని పిల్లేలెండి! ఎందుకు పుట్టిస్తాడో దేవుడు నాలాంటి వాళ్ళని."

'ఏమిట్రా ఈ విడ్డూరం! క్షణంలో సగంసేపు పట్టలేదు – అంతలోనే ఈ ముఖబింబంపైన మబ్బుతెరలలుముకున్నాయేమిటి' అనుకుంటూ ఆశ్చర్యపడిపోయాను.

ఎవరికెదురైనాసరే, విషాదయోగం చాలా పెద్దది. అర్జునుని విషాద యోగాన్ని పటాపంచలు చేయడానికైతే శ్రీకృష్ణునిలాంటి పరమాత్ముడొకడు దొరికిపోయాడు. మా వసంత విషాదం ఓదార్పు కతీతమైందని నేను పెళ్ళయిన కొత్తలోనే గ్రహించాను. వరుసగా ఆడపిల్లలే కలగడంవల్ల భర్తతోపాటు అతనివైపు బంధువులందరూ తన తల్లిని ఈసడించుకోడం, నాలుగో బిడ్డ కలిగినప్పుడు ఆమె ఎదుటికి వెళ్ళి పరామర్శించడానికైనా భర్త నిరాకరించడం, జీవితంపట్ల విరక్తి చెంది, అప్పుడిక పథ్యాలు పాటించక ఆమె

చావును కొనితెచ్చుకోవడం, అదృష్టవశాత్తూ తన తోబుట్టువులందరూ కాలం కడుపులో బుడుంగుమనడం, దురదృష్టంకొద్దీ తానొక్కర్తె మాత్రం బతికిపోవడం, సవతితల్లి దయాదాక్షిణ్యాల పైన ఆధారపడి బతకాల్సిరావడం, ఒకే పావడా ఉతికి, పిండి కట్టుకోవలసిన దుఃస్థితి దాపురించడం, రెండో భార్య మాయలకు వశుడైనప్పుడు తండ్రి తనని చచ్చేదీ బతికేదీ తెలియకుండా చింతబరికెతో కొట్టడం, తననెట్లాగైనా వదిలించుకోవాలన్న ఏకైక సంకల్పంతోనే తండ్రీ, ఆయన ప్రియసతీ తనకు పెళ్ళి తలపెట్టడం, ఆమెనిచ్చి పెళ్ళి చేయడానికి వాళ్ళాశించిన శుద్ధబుద్ధావతార లక్షణాలు నాలో పుష్కలంగా కనిపించడం – ఇలా ఆ ఫ్లాష్ బ్యాక్ దృశ్యాలన్నీ ఆమె మనసులోకి వచ్చేస్తే చాలా ప్రమాదం.

పెళ్ళయిననాటి సాయంకాలం వసంత మేనమామ ఒకాయన నన్ను దూరంగా తీసుకెళ్ళి, "బాబూ, తల్లిని పోగొట్టుకుని, తండ్రి వాత్సల్యానికి దూరమై, మారుతల్లి ఆరళ్ళకు గురై ఈ బిడ్డ పడరాని పాట్లు పడింది. ఇకమీదట సుఖపడితే నీ మూలంగానే సుఖపడాలి" అంటూ కొన్ని అప్పగింత మాటలు నా చెవిలో వేశాడు.

అయితే, జీవితమనే నాణెంలో బొరుసువైపు ఒకటుందని తెలియకుండా కుమారుణ్ణి కాపాడుకోడం శుద్ధోధనుడనే మహారాజుకే సాధ్యం కాలేదు. ఇక నేనెంతటివాణ్ణి? ఒక భర్త భార్యను యాతనలపాలు చేస్తున్నాడని గానీ, ఒక అత్త కోడల్ని రాచి రంపాన పెడుతోందనిగానీ, ఒక పసిబిడ్డ బతుకు సవతితల్లి పెంపకంలో వ్యధామయమై పోతోందనిగానీ తెలిసినప్పుడు వసంత తల్లకిందులైపోతుంది. కనుగుడ్ల కొలనుల్లో కన్నీళ్ళు నిండిపోతాయి. గదిలోకి వెళ్ళి ఏడుస్తూ కూచుంటుంది.

ప్రపంచంలో కొన్ని కొన్ని నదుల్ని 'దుఃఖదాయిని' అంటారట. ఇక్కడిప్పుడు దుఃఖదాయిని ఇందాకా కనిపించిన పిల్ల రూపంలో మా ఇంటి చేరువకు వచ్చేసిందేమోనని నేననుమానించాను. రాకపోతే ఉంగరపు వేలితో కనుకొలకుల్లో ఏర్పడిన చెమ్మదనాన్ని తుడుచుకుంటూ వసంత ఎందుకు గది లోపలికి వెళ్ళిపోతుంది?

'వద్దు బాబూ వద్దు. ఆ పిల్ల ప్రసక్తి తీసుకురానేవద్దు' అని నాలో నేను అనుకున్నాను.

అయితే, నా ప్రయత్నాన్ని కతీతంగా ఆ పిల్ల ప్రసక్తి మా గృహవాతావరణంలోకి చొచ్చుకరావడం అనివార్యమై పోయింది.

ఆరోజు రాత్రి తల్లి కలిపి పెడుతున్న అన్నం తింటూ హేమ చెబుతుండగా విన్నాను–

"అమ్మా, అమ్మా! మధ్యాన్నం వాగిరా అన్నమే తెచ్చుకోలేదు. క్యారియర్ ఖాళీ!"

"అయితే, ఏం చేసింది? పస్తే ఉండిపోయిందా హేమా?" – నాకు కూడా రోగాలూ, రొష్టులూ వచ్చేస్తాయా – అన్నప్పటి సిద్ధార్థుడి ఆక్రోశం ఆ ప్రశ్నలో ధ్వనించింది.

"లేదులే! ఇద్దరమూ నా క్యారియర్ అన్నమే తినేశాము..."

"నా తల్లి! నా బంగారుతల్లి!" అన్న మాటలతోపాటు అమాంతంగా బిగ్గరగా ముద్దులవర్షం కురిపించడం విన్నాను.

ఉన్న అన్నం కాస్తా యాచకులకు పెట్టేసి, ఆ తరువాత ఎవడో వస్తే, 'అన్నము లేదు, కొన్ని మధురాంబువులున్నవి' అన్న రంతిదేవుడిలా, నా భార్యాబిడ్డలు దానవీర

పాత్రల్ని పోషించడం నాకట్టే రుచించడంలేదు. అయినా, అప్పటికి తేలు కుట్టిన దొంగలా ఊరకుండిపోయాను. వసంత వంటగది సర్దుకుంటూ ఉండగా హేమ నా గదిలోకి వచ్చిన మొదటి అవకాశాన్ని పురస్కరించుకుని వీలయినంత మిత్రసమ్మితంగానే ఉపదేశం చేశాను. "చూడమ్మా, హేమా! వీధంట వెళ్ళే దానయ్యలెందరో ఉంటారు. వాళ్ళ జోలి మనకెందుకు? ఆ వాఘిరా పిల్లగూడా అంతేననుకో, 'నువ్వు మా ఇంటికి రావద్దు' అని చెప్పేయ్! దాని సంగతులేవీ మీ అమ్మతోనూ చెప్పొద్దు, ఏం సరేనా."

నా మాటలేవీ తనకర్థం కానట్లు అయోమయంగా చూస్తూ, ఈయనతో మనకెందుకులెమ్మన్నట్లు మౌనంగా ఉండిపోయింది హేమ.

బడివేళ కావస్తోందనగా హేమ తన నేస్తం కోసం వేచిచూడడం, ఆ పిల్ల రాగానే 'ఒచ్చేసిందొచ్చేసిం'దంటూ దూసుకుపోవడం, తల్లీకూతుళ్ళిద్దరూ హమేషా ఆ పిల్లను గురించిన కబుర్లలోనే మునిగితేలడం – ఇదంతా మా ఇంట్లో ఒక మామూలు వ్యవహారమైపోయింది. కథ అంతటితో ఆగిపోతే బాగుండునని నా నిరాసక్తితోనే ఆనకట్ట వేయజూచాను. అయితే, ఒకనాటి ఉదయం తెల్లవారేసరికి నా ఆనకట్ట నామరూపాలు లేకుండా కొట్టుకుపోయింది. అక్కడినుంచి వాఘిరా వృత్తాంతం వర్షాకాలం నాటి వరద గోదావరిలా గట్లను ముంచేస్తూ ముందుకొచ్చేసింది.

కింది వాటావాళ్ళు ఇంటికి తాళం వేసుకుని ఊరికి వెళ్ళిన సమయం. సాయంకాలం బడి వదిలిపెట్టారు. ఆ చోటు, ఆ వేళగూడా ఆడుకోడానికి చాలా అనువైనవిగా తోచిందేమో, పిల్లలిద్దరూ పొద్దుపోయేదాకా కింది పూలతోటలో ఆడుకుంటూ ఉండిపోయారు. ఆడి, ఆడి అలసిపోయిన తర్వాత హేమ గసపోసుకుంటూ పైకి వచ్చేసింది.

మరునాటి ఉదయం సూర్యోదయంతోపాటుగా మెట్లెక్కి వచ్చిన పెరుగమ్మి "అక్కా! అక్కా! మెట్లకు, గోడకు మధ్దెనబడి ఒక పిల్ల ఆదమరచి నిద్రపోతూ ఉంది. ఎవరమ్మా ఆ పిల్ల" అంటూ ఓ వర్తమానం బయటపెట్టింది.

వసంత ముఖం వెలవెలపోయింది. ఆమె పెదవులు వడగాలిలో మృదుపత్రాల్లా చలించిపోయాయి. కోపాతిరేకం వల్ల కాళ్ళు, చేతులూ వణికిపోసాగాయి. ఒక్కో విడతకు రెండేసి మెట్లు చొప్పున దిగి, బిడ్డనట్లాగే పైకెత్తి భుజాలపైన వేసుకుని పైకొచ్చేసింది. నాకోసం ఫ్లాస్కులో పోసి పెట్టిన కాఫీ ఆ పిల్లకు తాపించింది. బ్రెడ్ ముక్కలను జామ్ పూసి తినిపించింది. 'రాత్రిగూడా తిండి లేదండీ పాపం! ఆకలిగా ఉండదూ' అంటూ సాభిప్రాయంగా నావైపు చూచింది.

అప్పుడిక వళ్ళు తోమి, స్నానం చేయించి, హేమ యూనిఫారం దుస్తులే తొడిగి, ఇద్దరికీ తల దువ్వి, పౌడరద్ది, బొట్టు పెట్టి, క్యారియర్లు సర్ది, జుత్తు గట్టిగా ముడివేసుకుని, చీరకొంగు నడుముకు బిగించి బయల్దేరింది.

"ఎక్కడికి వసంతా?" భయం భయంగానే అడిగాను.

"ఎక్కడికని మెల్లగా అడుగుతున్నారా? ఈ పిల్లకు కన్నవాళ్ళుగానీ, పెంచిన వాళ్ళుగానీ లేరా? ఉంటే వాళ్ళు ఏం తింటున్నారు? అన్నం తింటున్నారా? గడ్డి తింటున్నారా? ఒకరోజు రాత్రంతా బిడ్డ ఇంటికి రాకపోతే పట్టించుకోరా? అడగనా

మరి! నా ప్రశ్నకు సమాధానం రాకపోతే పదిమందినీ ఒకేచోట చేర్చి, వాళ్ళచేత అన్యాయం ఒప్పించేదాకా ఊరుకుంటానా?"

బిడ్డలిద్దరూ వెంబడించగా చకచకా వీర సిపాయిలా కిందికి దిగిపోయింది వసంత.

నాలో నేను భయపడిపోతూ ఇంటిపట్టునే ఉండిపోయాను. వసంత పదిగంటలకైనా తిరిగొస్తుందేమోనన్న నా ఆశ అడియాస అయిపోయింది. ఇంటికి తాళం వేసి, తాళం చెవి ఎదురింట్లో ఇచ్చి నేను ఆఫీసుకు వెళ్ళిపోయాను.

సాయంకాలం నేను ఇల్లు చేరేసరికి సమగ్రమైన నివేదికతోసహా వసంత సిద్ధంగా ఉంది.

***

లోకుల్ని మభ్యపెడుతూ జీవించదలచుకున్నవాణ్ణి, జీవితమే మభ్యపెడుతుందని ఆదిమూర్తికి తెలియదు. అతను చిరునామాలేని వ్యక్తిగా హైదరాబాద్‌లో అడుగుపెట్టాడు. కొత్త ఉద్యోగంలో, కొత్త పరిసరాల్లో, కొత్త చిరునామా సంపాదించుకున్నాడు. ఉద్యోగం చిన్నదే అయినా, పైరాబడికి సదుపాయాలుండడం బాగా కలసి వచ్చింది. డబ్బుకు కొదువలేదు. జల్సాగా ఖర్చుపెట్టేవాడు. నిష్పూచీగా, నిష్చేచీగా తిరణాలలో పూలరంగనిలా తిరగాలన్నదే ధ్యేయం. తన అభిరుచులకు తగిన గర్ల్ ఫ్రెండ్‌ని అన్వేషించడమే అప్పట్లో అతని 'హాబీ' అయిపోయింది. బస్‌స్టాపులు, పార్కులు, చెరువుకట్టలు ఆ రోజుల్లో అతడి విహారభూములు. నిక్షేపంకోసం దేశమంతా వెదికినవాడికి, అదికాస్తా పెరట్లోనే దొరికినట్లు, తనూజ అతనికి చేతికందేటంత దూరంలోనే తారసిల్లింది. నాలుగిళ్ళకవతల అపార్టు మెంటులో ఉండేది. స్థిరమైన ప్రభుత్వ నౌకరీ ఆమెకున్న అదనపు క్వాలిఫికేషన్. పరిచయం స్నేహమైంది. ఆమెదగ్గర తనదేదో పెద్ద ఉద్యోగమేనని పోజు పెడుతుండేవాడు ఆదిమూర్తి. ప్రతిరాత్రి డిన్నర్లు, ప్రతి వారాంతంలోనూ పర్యటనలు రివాజైపోయాయి. కాలం గజ్జెల గుర్రంలా పరుగెత్తింది. క్రమక్రమంగా ఒకే కప్పు కిందికి వచ్చేశారు. లోకం భార్యా భర్తలుగానే గుర్తిస్తోంది. పెళ్ళి చేసుకోడమైనా లోకం గుర్తింపుకోసమే గదా! అయినా, వివాహబంధం లేకుండా స్త్రీ, పురుషులు కలిసి జీవించడానికి వీల్లేదా! ఎందుకు వీల్లేదు? వీలవుతుందని నిరూపించడమే వాళ్ళ మహదాశయమై పోయింది. ఒక గొప్ప ప్రయోజనాన్ని ఆశించి, వినూత్న ప్రయోగంలో లీనమైన విజ్ఞాన శాస్త్రజ్ఞుల ఉత్సాహ ఉద్వేగాలు వాళ్ళలో సందడించాయి. ఈలోగా తనూజలో గర్భలక్షణాలు పొడచూపాయి. సహజ పరిణామమే అయినా, ఎవరో తమపైన కుట్ర పన్నినట్టుగా ఉంది. పుట్టిన బిడ్డల్ని పెంచి పోషించడానికి వేరే వ్యవస్థ ఒకటి లేకపోవడం కొన్ని వేల ఏండ్ల మానవ నాగరికతను అపహాస్యం చేయడం లేదా? నాగరిక దేశాల్లో ఏవో ప్రయత్నాలు జరుగుతున్నట్టు వినికిడి. ఏమైనా, ఈ బిడ్డల బాదరబందీకి తరుణోపాయం కనిపెట్టాలి. ఈ ప్రయత్నం తమ దగ్గరినుంచే ఎందుకు ప్రారంభం కాకూడదు? ఇలా తర్కవితర్కాలు పడుతుండగానే అబార్షన్ వ్యవధి దాటిపోయింది.

అలాంటి జీవన్మరణ సమస్యలోనుంచి వాఘిరా బుల్లి బుల్లి కళ్ళు తెరిచి లోకంవైపు చూసింది. బిడ్డ పెంపకంకోసం ఒక ఆయాను నియమించడమైంది. అయితే, ఈ బిడ్డ

తననొక కట్టుగూటానికి కట్టి పడేస్తుందేమోనన్న ఉక్రోషం తనూజలో ఉచ్చులు తెంచుకుంది. ఈ చిరాకులో పాత స్నేహితుడంటేగూడా ముఖం మొత్తింది. కొత్త స్నేహాలకోసం వెంపర్లాడసాగింది. సహోద్యోగిని అయిన ఓ పంజాబీ అమ్మాయితో కలసి తిరుగుతూ, రాత్రి బాగా తామసమైన తర్వాత తిరిగొస్తుండేది. ఆ పంజాబీ అమ్మాయి ఇంట్లో మగవాళ్ళు కొందరు ఉండి ఉండగూడదా? వాళ్ళకోసం వెళ్ళి వస్తోందనుకోడానికి అవకాశాలు లేవా? ఈ అనుమానం ఆదిమూర్తి మనసును వేరుపురుగులా తొలిచి వేయసాగింది. ఆ కసి తీర్చుకోడానికన్నట్టుగా లోకంలో ఎన్నెన్ని వ్యసనాలైతే ఉన్నాయో, వాటి కన్నింటికీ అవధులు కనిపెట్టె ప్రయత్నంలో ముమ్మరంగా జొరబడిపోయాడు. ఆఫీసు డబ్బు గల్లంతు కావడం మొదలైంది. అనుమానితుడు ఆదిమూర్తే అపరాధిగా నిరూపణ కావడంతో ఉద్యోగం ఊడింది. ఇంట్లో ఒక మంచి మాటలేదు. చేత ఒక చిల్లిగవ్వలేదు. ఆదిమూర్తి జీవితంలో అది అమావాస్య చీకటి. తన నిస్సహాయ స్థితి ఏమిటో తనకు తెలిసొచ్చిన కాలం. తనూజను సంస్కరించవచ్చుననిగానీ, ఆమెతో సహజీవనం నెరపవచ్చుననిగానీ ఆశ అడుగంటిపోయిన తర్వాత అతను మానాభిమానాలు చంపుకుని ఒక రాజీ ఒప్పందాన్ని ప్రతిపాదించాడు. దాని మేరకు తనూజ తనకెంతో కొంత పెద్ద మొత్తాన్నే ముట్టజెప్పాలి. అంతటితో తానామె జీవితం దరిదాపుల్లో ఉండకుండా ఎక్కడికైనా వెళ్ళిపోతాడు.

కొద్ది రోజులపాటు తీవ్రంగా ఆలోచించిన మీదట ఒకటి, రెండు సవరణలతో తనూజ ఈ ఒప్పందానికి అంగీకారం ప్రకటించింది.

నెలవారీగా కొంత నికరమైన మొత్తం తాను మనియార్డరుద్వారా ఆదిమూర్తికి పంపిస్తూ వస్తుంది. అయితే, అతను బిడ్డనుగూడా తనతోపాటు తీసుకెళ్ళిపోయి, ఆమె పంపిన డబ్బులోంచే పిల్ల పోషణభారాన్నిగూడా తానే వహించాలి.

ప్రతి నెలా కొంత డబ్బు కళ్ళ జూడవచ్చుననే ఒకే ఒక కారణంపైన ఆదిమూర్తి పదిహేను నెలల పసిపాపను చేతుల్లోకి తీసుకుని స్వస్థలం తిరుపతిలో రైలు దిగాడు.

'తిరుపతి వెస్ట్' స్టేషనుకు పశ్చిమంగా ఉన్న నగరం శివారు పేటల్లో ఆదిమూర్తికి నాలుగైదు బంధు కుటుంబాలున్నాయి. అందులో డబ్బు కక్కుర్తికి బాగా లోబడగల ఓ కుటుంబాన్ని అతను ఎన్నికచేశాడు. ఆ ఇంటి యజమాని పనీపాట్లా లేనివాడు. గోళ్ళు గిల్లుకుంటూ కూచుని, సులభంగా వచ్చే డబ్బులకోసం అర్రులు సాచేవాడు. టిఫిన్లు, తినుబండారాలుచేసి అమ్ముకుంటూ, అతని భార్య ఎట్లాగో ముగ్గురు బిడ్డలున్న కాపురాన్ని నెట్టుకొస్తోంది. నెలకింతని డబ్బు ముట్టజెప్పే షరతుపైన బిడ్డను ఆ ఇంట్లో అప్పగించి, ఆదిమూర్తి ఏడుకొండలవైపు తిరిగాడు. అద్దెకు గదులిచ్చే లాడ్జీ యజమానులకు, మనుషుల్ని కొండపైకి తోలుకెళ్ళే టాక్సీ డ్రయివర్లకు, పైన రకరకాల వస్తువులమ్ముకునే అంగడివాళ్ళకు దళారీగా వ్యవహరిస్తూ, యాత్రికుల్ని జలగలా పీల్చుకు తినడం. వృత్తిగా పెట్టుకున్నాడు. ఆ వృత్తిలో ఆదిమూర్తి ప్రతాపానికి పట్టపగ్గాలు లేకపోయేసరికి పోలీసులు అతణ్ణి పట్టుకుని 'ఇక కొండవైపు తిరిగి చూశావో కటకటాలు తప్ప'వని హెచ్చరించి, మూడు నెలలపాటు వరుసగా ప్రతిరోజూ నంబర్ టూ టవును పోలీసుస్టేషనులో హాజరు వేయించు కోవలసిందిగా హుకూం జారీ చేశారు. ధర్మసత్రాలకు, ఆర్టీసీ బస్ స్టేషనుకు, తిరుపతి

ఈస్టు రైలుస్టేషనుకు తన సంచారాన్ని కుదించుకోవలసి వచ్చినందున, తన చిన్నతనంలో తండ్రి చేస్తూ వచ్చిన హోమియోపతి వైద్యాన్ని గుర్తుకు తెచ్చుకుని, పది పదిహేను తెల్ల మాత్రల సీసాలు ప్లాస్టిక్ సంచిలో వేసుకుని, ఆదిమూర్తి రైలుపట్టాల కిరువైపులా వ్యాపించిన పేదవాడలలోకి వెళ్ళి అపర ధన్వంతరిలా ప్రత్యక్షమైపోయాడు.

***

ఆ గుడిసెల్లో కంటికి నదురైన ఓ ఆడమనిషి కనిపించి, తన చూపులతోనే ఆదిమూర్తి ప్రాణాలకు కొక్కీ తగిలించింది. 'నీకు నీ వారు లేరు, నాకు నా వారు లేరు' అంటూ మౌన భాషలోనే ఒక విహ్వల ప్రణయగీతం ముదలకించుకునేసరికి ఆదిమూర్తి అవశుడై, పరవశుడై అమాంతంగా ఆమె ఆశ్రయంలోకి జారిపోయాడు. ఇల్లలుకుతూ పేరు మరచిపోయిన ఈగలా అంతటితో తన పాలబడిన బిడ్డ ఒకతె ఉందన్న విషయమే అతను మరచిపోయాడు.

తల్లిచేత పరిత్యజించబడి, తండ్రిచేత నిర్లక్ష్యానికి గురైన పసిపిల్ల పెంపకంపట్ల బాధ్యత వహిస్తున్న దూరపు బంధువుకు, నెలకొకసారి ఆదిమూర్తిని వెదికి పట్టుకోవడమే దుర్లభమైపోయింది. అథవాపట్టుకున్నా, అతని దగ్గరనుంచి డబ్బు రాల్చుకోడం మరింత కష్టసాధ్యమైపోయింది. నోరూ వాయీలేక, ఆకలైతే అన్నం కావాలని అడగలేక, 'అయ్యో, ఇది కావాలి' అని కోరుకోలేక, తన ఏడుపును, దిగులును, దిక్కులేనితనాన్ని తనలోనే దిగమింగుకుంటూ ఉన్న పసిదానికి అందాకా ఉండిన నామమాత్రపు ఆదరణకూడా కరవైపోయింది. ఒకింత ఆప్యాయతకోసం, కాస్తంత ఆత్మీయలకోసం, పిసరంత దయాభిక్షకోసం ఆ పిల్ల బంధువుల ఇళ్ళ వెంటబడి తిరుగుతుంటే 'మరెక్కడున్నా సరే! మన ఇంటి దగ్గర ఉండకపోతే చాలు' అన్న తూష్ణీభావం బంధుబలగంలో బలిసిపోయింది.

"అదేనండీ కారణం! ఒక రాత్రి రాత్రంతా ఆ పిల్ల ఇక్కడపడి నిద్రపోతే ఎవరైనా పట్టించుకున్నారా?" అంటూ వసంత కథ చివరికొచ్చేసింది.

"బాగుందిలే వసంతా! శ్రమపడి కథంతా కూపీ లాగేశావు. కానీ, అందుకు మనమిప్పుడు చేయగలిగిందేమైనా ఉందంటావా" అనేశాను నోరుజారి.

"ఏం చేయగలం లెండి! నాకైనా ఒక పని సొంతంగా చేయగల ధీమా ఎక్కడేడ్చింది? నేనుగూడా ఒకరిపైన ఆధారపడి ఉన్నదాన్నే గదా!" కళ్ళు నులుపుకుని, కన్నీళ్ళు తుడిచేసుకుంటూ వసంత లోపలికి వెళ్ళిపోయింది.

బాబూ, ఈ కరెంటు స్విచ్చిని తాకనేగూడదు. పొరబాటున తాకామో, షాక్ కొట్టి తీరుతుంది అనుకుంటూ నా జాగ్రత్తలో నేనుండిపోదలచుకున్నాను.

అయితే, విషాదరసం ఒక అంతర్వాహినిలా మా ఇంటి వాతావరణంలో ప్రవహించడం మాత్రం ఆగలేదు.

"ప్రతిరోజూ వట్టి క్యారియర్‌తోనే వస్తోందటండీ? మధ్యాహ్నానికైనా ఆ సత్తు గిన్నెలో పట్టెడన్నం పెట్టి పంపనా?"

"వంటిమీద ఉన్న దుస్తులు వేసుకుని ఎన్నాళ్ళయిందో ఏమో! మాసి మసిగుడ్డల్లా ఉన్నాయి. ఏమండీ! సలీసు బట్ట ఏదైనా కొని, ఓ జత దుస్తులు కుట్టిపెట్టరూ?"

"జ్వరం వచ్చిందటండీ, పాపం, హేమకెవరో చెప్పారట. తిండె పెట్టలేని వాళ్ళు హాస్పిటలుకు తీసుకెళ్తారా"

వసంత ఏమన్నా సరే, నేను పెదవులు బిగించేశాను. ముఖకవళికలు వ్యక్తం గాకుండా 'మాస్క్' తగిలించేశాను. మందలించలేను. ఊరడించలేను. కిముక్కుమనకుండా ఊరకుండిపోయాను.

***

మండు వేసంగికాలం. తిరుపతి ఎండలవేడి విజయవాడ ధాటిని మీరిపోతోంది. ఓరోజు రాత్రి భోజనాలైన తర్వాత మెట్టెక్కి డాబాపైకి వెళ్ళి చాప వేసుకున్నాము. హేమ నిద్రపోతోంది. నేను వెల్లకిల పడుకుని చందమామ వైపు చూస్తున్నాను. వసంత పక్కనే కూర్చుని తమలపాకుతో కిళ్ళీ కట్టి ఇస్తోంది.

"ఏమండీ... మరి... ఏమిటంటే..." నీళ్ళు నమలసాగింది.

"వింటున్నానుగా! చెప్పు" అన్నాను.

"హైదరాబాదులో రవీంద్రగారని మీకొక స్నేహితుడున్నాడని చెబుతుంటారు గదా. ఎత్తయిన కట్టడం, నాలుగో అంతస్తులో ఆఫీసు. లిఫ్టులోనే వెళ్ళవలసి ఉంటుందని..."

కట్టడాలు, లిఫ్టులు, ఆఫీసులు... ఈ నాందీవాచకం ఏ కొత్త నాటకానికి దారితీస్తుందో తెలియడం లేదు.

"ఆ రవీంద్రగారు తనకోసం గాకుండా లోకంకోసం ఎక్కువగా బతికేరకం అనిగూడా చెబుతుంటారు..."

"అవున్నిజమే. అందుకిప్పుడేమిటట..."

"మీరొకసారి హైదరాబాదు వెళ్ళి రావాలి..."

"ఎందుకూ?"

"నేనెట్లాగో తంటాలుపడి అడ్రసు సంపాదించాను. మీరు రవీంద్రగారిని వెంట బెట్టుకుని వెళ్ళి, తనూజ అనే ఆడమనిషిని కలుసుకోవాలి. ఇక్కడి పరిస్థితులన్నీ మీకు తెలిసినవే. ఇదంతా వివరంగా ఆ పుణ్యాత్మురాలి మనసుకెక్కేటట్లు చెప్పాలి. తాను గనుక అనుమతిస్తే మనం వాఘీరాను పెంచుకుంటామని తెలియజెయ్యాలి..."

అయిదు నిమిషాలపాటు వేచి చూసింది. నేను 'అరీ, గురీ' అనకపోయేసరికి మళ్ళీ కొనసాగించింది. "ఏమండీ! నేను ట్యూబెక్టమీ చేయించుకుంటానండీ! మనకిద్దరు బిడ్డలే చాలుననుకుందాం. సరేనా!"

"ఆ మాత్రం పనికి హైదరాబాదుదాకా ఎందుకు? ఇక్కడ ఆదిమూర్తితోనే తేల్చుకుంటే సరిపోలా..."

"మధ్యలో తాడూ తగాదా లేని ఆదిమూర్తి ఎవడండీ? పెళ్ళిగూడా చేసుకోలా. పాపపైన అతనికి తండ్రి హక్కు ఎక్కడినుంచి వస్తుంది? తనూజ సంగతలా కాదే? తల్లిగా తన హక్కు క్లెయిమ్ చేసుకోవడానికి ఆమె దగ్గర బిడ్డ బర్త్ సర్టిఫికెట్‌కూడా ఉంటుంది..."

నేను విభ్రాంతితో నిర్ఘాంతపడిపోయాను. పట్టరాని కోపాన్ని ఎట్లాగో అదుపులో పెట్టుకున్నాను. 'చూడు వసంతా! ఈ పిల్ల సమస్యనైతే నువ్వెట్లాగో పరిష్కరించగలవు. కానీ, లోకంలో ఇలాంటివాళ్ళు తక్కువగా ఉన్నారా? కన్నవారికి మోయరాని బరువుగా, పెంచేవారి పాదాలకు శృంఖలాలుగా తయారైపోయిన బిడ్డలు అసంఖ్యాకంగా అనాథ శరణాలయాల్లో లేరా? డస్ట్‌బిన్‌లోనుంచి ఏడుస్తూ, జీవించడానికోసం అంగలార్చరా? పేవ్‌మెంట్ల పైన మురికిగొట్టుకుపోయి కనిపించరా? అసలింతకూ సామాజిక సమస్యల్ని వ్యక్తిమాత్రులు తమ దయాదాక్షిణ్యాలతో పరిష్కరించడం సాధ్యమా? ఈ దేశంలో లేమి ఉంది. ఉబలాటం కొద్దీ కాలు జారడాలున్నాయి. బలవంతంగా మానభంగానికి గురికావడంకూడా ఉంది. దిక్కులేని బిడ్డల ఉనికికి ఇవన్నీ కారణాలేననుకునేవాళ్ళం.

చాలని దానికి కొత్త పరిస్థితుల్లో నుంచి కొత్త కారణాలు పుట్టుకొచ్చి పాతవాటికి జతపడుతున్నాయి. నువ్వా, నేనా దాన్ని పరిష్కరించవలసినవాళ్ళం? వద్దు. ఆ తనకుమాలిన ధర్మం జోలికి మనం వెళ్ళనే వద్దు' అంటూ నేను మా ఆవిడ సెంటిమెంట్లను శతఘ్ని పెట్టి తుత్తునియలుగా చేసెయ్యాలని కొద్ది నిమిషాలపాటు తలపోశాను. కానీ, అందువల్ల నెరవేరే ప్రయోజనమేమిటి? తగలరాని చోట తగిలిన దెబ్బవల్ల వసంత జీవితకాలమంతా కోలుకోకపోవచ్చు. నాకు కావలసింది కష్టసుఖాలు పంచుకుంటూ జీవనయాత్రలో తోడుగా ఉండగల సహచారిణి. హేమకు కావలసింది బాహ్య ప్రపంచపు కఠోర పరిస్థితులకడ్డంగా తనకు చలువపందిరిలా ఆవరించుకోగల కన్నతల్లి ప్రేమ. చిన్న బతుకు, చిన్న సంసారం. నేను చాలా సామాన్యుణ్ణి. నా స్వార్థం నాకు ముఖ్యం. ఏ తల్లి కన్నబిడ్డో నాకు తెలియదు. పెళ్ళయిన తర్వాత పుట్టింటి సంగతి తలపెట్టనే లేదు! 'ఏమండీ! నాకిది తెచ్చిపెట్టరూ' అని అడిగిన సందర్భమే లేదు. అవసరాలు కనిపెట్టి నేనే ఏదైనా తీసుకొస్తే 'అబ్బే ఇప్పుడెందుకండీ! ఉన్న ఖర్చులు చాలకనా?' అంటుండేది. వట్టి పిచ్చిది. నా వసంత మనసును నేనేనాటికీ గాయపరచను. లేదంటే ఆ సందర్భంలో గట్టిగా ఒక మాట చెప్పదలచుకున్నాను–

"నీ అభిమతం మేరకే నా ప్రయత్నం నేను మొదలెడతాను వసంతా! అయితే, ఒక షరతు. ఇకమీదట కన్నీటి కుండను నెత్తిపైన పెట్టుకోగూడదు. కలకంఠి కంట కన్నీరొలకడం నాకిష్టం లేదు. ఇందుకు నువ్వు ఒప్పుకోవాలి. ఏమంటావు?"

నా చేతులు రెండింటినీ తన చేతుల్లోకి తీసుకుంటూ అంది వసంత. "ఏమండీ! అంతగా మీరు నాతో చెప్పాలా? అయిదారేళ్ళ కాపురంలో నేనెప్పుడైనా మీ మనసుకు కష్టం కలిగించానా?"

ఎలాగైనా మా వసంత సిద్ధ సంకల్పురాలే! రవీంద్ర రాయబారం ఫలించింది. తనూజ మా ప్రతిపాదనకు అంగీకరించింది. తన సొంత దస్తూరితో, సంతకంతో బిడ్డను మేము పెంచుకోవడానికి అనుమతిని ప్రసాదించింది. ఆదిమూర్తి బిడ్డ జోలికి రాకుండా ఉండడంకోసం అతనికిచ్చే నెలసరి అలవెన్సులుగూడా రద్దుచేసి పారేస్తానని మాట ఇచ్చింది. ఇక చెప్పడానికేముంది? తుమ్మీ తుమ్మకముందే ఊడిపోయే ముక్కుల్లా, అంతంత మాత్రంగా వాఘిరా చుట్టూ అల్లుకుని ఉండిన మానవతా సంబంధాలు పుటుక్కు పుటుక్కున

తెగిపోయాయి. కొబ్బరికాయలోని నీళ్ళు వచ్చినంత అ(శమంగా ఆమె మా కుటుంబంలోకి వచ్చేసింది.

ఒకే రకంగా తల దువ్వి, ఒకే రకంగా దుస్తులు వేసి, ఒకే తరహా క్యారియర్లలో ఒకే విధమైన లంచ్ సర్ది, పాపలిద్దరూ జంటగా మెట్లుదిగి, పూలతోటగుండా నడిచి, వీధిలోకి వెళ్ళి మలుపు తిరిగి స్కూలువైపు నడిచిపోతుంటే, వరండాలో నిలబడి కనిపించినంతవరకూ చూస్తూ ఉండిపోతుంది వసంత.

"ఏమండీ! వెనుకనుంచి చూస్తుంటే కవల పిల్లల్లా లేరూ?"

"నిజమే! ఎటొచ్చీ వాఘిరా కొంచెం చిక్కిపోయినట్లుంటుంది."

"అదే, అదే. నేనొద్దన్నది. స్కూల్లోగూడా పేరు మార్పించేశాను. 'వనజా' అని పిలవండి. లక్షణంగా ఉంటుంది."

"ఒప్పుకున్నాను. అట్లాగట్లాగే."

❖ ఇండియా టుడే – 1996. ❖

# మిస్ ఎమరాల్డా ఫ్రమ్ ఫ్రాన్స్

"ఎక్స్‌క్యూజ్‌మి! మే ఐ సిట్ హియర్?"

("మన్నించండి! నేనిలా కూర్చోవచ్చా?")

కిటికీలోనుంచి అవలికి చూస్తున్న రామదాసు ఉలిక్కిపడ్డట్టుగా తిరిగి చూశాడు. అతడి ఎట్టయెదుట తటిల్లత ఒకటి మెరసినట్టయింది. యాపిల్‌పండు మిసిమిలా ఎరుపూ, తెలుపూ సమపాళంగా కలిసిన దేహచ్ఛాయ. తలుకులీనే కళ్ళు. సన్నగా, పొడుగ్గా, కోలముఖంతో ముచ్చటైన విగ్రహం. గోధుమ రంగు ప్యాంట్‌పైన బనీనులాంటి చొక్కా. చెవుల్ని కప్పేస్తూ మెడ కిందికి జారుతున్న చిరుకెరటాలలాంటి కురులు. భుజానికి తగిలించుకున్న సంచీతో ఆమె ఎవరినో ఇంటర్వ్యూ చేయడంకోసం బయల్దేరిన ఫ్రీలాన్స్ జర్నలిస్టులా ఉంది.

రామదాసులో చలనంలేదు. రెప్పపాటులేని కళ్ళతో అతడామె వైపు నివ్వెరపోయి చూస్తున్నాడు.

ఈలోగా ఆమె రామదాసు పక్కన ఖాళీగా ఉన్న తావులో కూర్చుంది. "ఏమిటో అనుకున్నానుగానీ, మీ ఇండియన్లు గూడా టూరిజంలో బాగా రాటుదేలి పోయినట్టే ఉన్నారు లెండి!"

ఎలాగో చెప్పమంటారా – అన్నట్టు ఆమె సాభిప్రాయంగా అతడివైపు చూసింది. 'నా మాటలు మీకర్థమవుతున్నాయా? మనం ఇంగ్లీషులో ప్రసంగం కొనసాగించవచ్చా' అన్న భావం ఆ అభిప్రాయంలో ధ్వనించింది. 'ఫరవాలేదు. చెప్పమ'న్నట్టుగా తల పంకించాడు రామదాసు.

"నిన్న మధ్యాహ్నం ట్రిచీనుంచి ఇక్కడికొచ్చి బస్‌స్టేషనులో దిగినంత వరకే నా ప్రమేయం! ఆపైన నిర్ణయాలు నా అధీనంలో లేవు. ఆటోవాలా తీసుకొచ్చి ఈ లాడ్జిలో దిగబెట్టాడు. మేనేజరు తాళంచెవితోబాటుగా ఓ కార్డు గూడా నా ముందు పడేసి, 'రామేశ్వరం, కన్యాకుమారి, కుర్తాళం, కొడైకెనాల్... ఎక్కడికి వెళ్ళాలో చెప్పండి. మా టూరిస్టు కార్యక్రమాలు మీ సేవకోసం సిద్ధంగా ఉన్నాయి' అన్నాడు. 'అయ్యో! నేను మీనాక్షి దేవాలయం చూడ్డానికి వచ్చా'నంటూ తప్పుకోజూశాను. 'ఆలయం మాత్రమే గాదు. తిరుమల నాయకుడి మహలుగూడా చూడాల్సిందే! రెండింటినీ మీరు రాత్రి ఎనిమిదింటికల్లా చూసెయ్యొచ్చు. మా టూర్‌లన్నీ ప్రారంభమయ్యేది ఉదయం వేళల్లోనే గదా' అంటూ ముదలంకించుకున్నాడు. ఇటీవల నేను గుళ్ళు చాలా చూసేశాను. అందుకని వైవిధ్యంగా ఉంటుంది లెమ్మనకుని నన్ను కొడైకెనాల్‌కి బుక్ చేయమన్నాను. అంతేనండీ సంగతులు! ఉదయం అయిదు గంటలకల్లా రూంబాయ్ నిద్రలేపేశాడు. వేడి నీళ్ళు రెడీ! కాఫీ రెడీ ! ఆరింటికల్లా తీసుకొచ్చి ఈ వ్యానులోకి తోలేశాడు... అన్నట్టు మీరున్నూ టూరిస్టేనా సార్? ఈ లాడ్జిలోనే దిగారా?"

ఆమె మాట్లాడోతోందేగానీ, ఆ మాటలేవీ రామదాసు చెవిలో పడడం లేదు. జీవితంలో కొన్ని సన్నివేశాలు అనుకోని విధంగా, ఆశ్చర్యకరంగా రూపొందుతూ ఉంటాయి. ఈ అమ్మాయినిక్కడ కలుసుకోడమున్నూ అలాంటిదే!

పదిరోజుల క్రితం రామదాసు మకాం రమణాశ్రమం. మౌనసముద్రాలంకారుడు శ్రీరమణుడు. మౌనధ్యానంద్వారా ఆత్మసాక్షాత్కారం పొందవచ్చునన్నది ఆయన జీవిత సందేశం. రామదాసు ప్రయత్నించి చూశాడుగానీ, ధ్యానం పైన మనసు నిలవలేదు. అవును మరి! పచ్చికాయను తెచ్చి పండేస్తే ఫలమవుతుందా? దేనికైనా పరిపక్వత రావాలి. సాధన దశలో తానింకా ఏంతోదూరం పయనించవలసినట్టే ఉంది – అనుకున్నాడు రామదాసు.

రమణాశ్రమంలో ఉన్న మూడు రోజుల్లో ఒకనాటి సాయంకాలం రమణాచలేశ్వరుడిపైన ధ్యాస మళ్ళింది. స్వామికోసం వెళ్తుండగా, ఇదిగో – ఈ శరచ్చంద్రిక ఎదురైంది. గాలిగోపురం దాటుకుని మొదటి ప్రాకారం లోపలి విశాలమైన ఖాళీ ఆవరణలో కాలుపెట్టేసరికి అతడి పాదాలు స్తంభించిపోయాయి. కళ్ళకు రెప్పపాటు లేకుండా పోయింది. ఇంచుమించుగా ఇరవై ఏళ్ళుండొచ్చు. పచ్చి పసుపుపిండితో చేసిన బొమ్మలాగే ఉంది. ఎటొచ్చీ ఇండియా ఎండలు ఆ దేహకాంతిపైన నీడలు సాచినట్టున్నాయి. క్లిప్పుతో అట్టకు బిగించిన కాగితంపైన అమె పెన్సిలుతో, గాలిగోపురాన్ని స్కెచ్‌గా మలుచుకుంటూ ఉంది. ఉంటే గోపురంపైన, లేకుంటే కాగితంపైన. ఇంతకు తప్పితే ఆమె చూపులు మరొకవైపుకు ప్రసరించడం లేదు. గోపురంలోని భాగాలు, పార్శ్వాలు, శిల్పాలు స్పష్టంగా కనిపించడంకోసం అప్పుడప్పుడూ అటూ ఇటూ కొన్ని అడుగులు వేయడం తప్పితే ఆమెలో చలనం లేదు. గుడికొస్తున్నవాళ్ళు ఆమెను చూడ్డంకోసం జట్లు జట్లుగా ఆగిపోతున్నారు. కానీ, అంతమంది తనవైపు చూస్తున్నారన్న స్పృహ మాత్రం ఆమె దరిదాపులకైనా వచ్చినట్టు లేదు.

వచ్చేవాళ్ళు వస్తుండగా, వెళ్ళేవాళ్ళు వెళ్తుండగా అదేపనిగా ఓ వ్యక్తి మాత్రం ఆమెను కాపెట్టుకుని ఉన్నట్టు రామదాసు గుర్తించాడు. దేశవాళీ యువకుడే. అమ్మాయివైపు, గోపురం వైపు, జనంవైపు, ఆకాశంవైపు చూస్తూ అల్లంతదూరంలో ఉన్న మండపం మెట్లపైన కూర్చున్నాడు. పక్కన్నే ఓ చేతి సంచీ. అందులో తినుబండారాలేవైనా ఉండొచ్చు. ఓ వాటర్ బాటిలు. ఏ పనీ చేయకుండా గంటల తరబడి కూర్చోడంగూడా సులభమైన పనేమిగాదు. అయితే, ఆ యువకుడు ఈ నిష్క్రియాపరత్వాన్ని ఒక యోగంలా అనుష్ఠిస్తున్నట్టున్నాడు. ఏమైనా, దేశంకాని దేశంలో ఈ అమ్మాయికి ఆ మాత్రం ఎస్కార్టు అవసరమే!

ఏది ఎలా జరిగితే మనకెందుకు లెమ్మనుకునే తత్త్వంగాదు రామదాసుది. ఆత్మజిజ్ఞాస అనేది ఆంతరంగిక వ్యాపారం. మానవ జీవితంపట్ల ఆసక్తి కలిగి ఉండడం బాహ్య వ్యాపారం. ఈ ఉభయ వ్యాసంగాల్లోనూ రామదాసుకు ఆసక్తి కద్దు. పైగా, ఇవి పరస్పర విరుద్ధమైన విషయాలని అతడేనాడూ అనుకోలేదు. కంటికి కనిపించేదాన్ని ఆకళించుకోలేనివాడు, కానరాని దాన్ని గురించి ఏ మాత్రం తెలుసుకోగలడన్నది రామదాసు అనుమానం.

అతడు మెల్లగా మండపాన్ని సమీపించి, సోపానాలపైన బైఠాయించాడు. సాఫీగానే ఆ అబ్బాయిని మాటల్లోకి దించగలిగాడు. మౌనవ్రతంతో ముఖం మొత్తి ఉందేమో, ఆ పడుచువాడుగూడా ప్రసంగానికి సుముఖంగానే కనిపించాడు.

బి.ఏ.లో రెండు పేపర్లు పోయాయట. రాసిపూర్తిచేసే ఓపిక లేక ఉద్యోగం కోసం ప్రయత్నిస్తున్నాడట. అక్కడక్కడా తప్పులు దొర్లినా ధారాళంగా ఇంగ్లీషు మాట్లాడ గలుగుతున్నాడు.

ఆ అమ్మాయిది ఫ్రాన్సు దేశమట! ప్రపంచానికంతా ఫేషన్లు నేర్పే దేశమని గదా ఫ్రెంచి సీమకు ప్రసిద్ధి! ఈ నిరాడంబర యువతి నిత్య నూతన విలాస విభ్రమాలవెంట పరుగులు తీసే పరాను గడ్డకు చెందినది కావడం విడ్డూరమే. తామరాకు పైన నీటిబొట్టులా తత్తళించిపోయే చంచల ప్రకృతి ఎక్కడ? పురాతన నాగరికతకు కాణాచి అయిన ఒక దూర దేశంలో శతాబ్దాల కిందట అలుపూ సొలుపూ ఎరుగని మహా శిల్పులు నిర్మించిపోయిన దేవాలయ శిల్పాలను చెక్కుచెదరని ఏకాగ్రతతో అధ్యయనం చేసే నిలకడ ఎక్కడ అనుకున్నాడు రామదాసు). ర్యాంకులో డిగ్రీ పాసయింది. ఓరియంటల్ కల్చరుకు ప్రాణభూతాలైన విషయాల పైన పరిశోధన చేసే పేపర్లు నివేదించే ఒక ప్రాజెక్టుకుగాను ప్రభుత్వం సాంస్కృతిక శాఖ ఆమెకు గ్రాంటు మంజూరు చేసిందట. అక్కడి ప్రొఫెసరుగారొకాయన పాండిచ్చేరిలోని ఒక మిత్రుడికి జాబు రాసి ఇచ్చాడు. ఆ విధంగా ఆమె కొత్త దేశంలో కాలు మోపింది. పాండిచ్చేరిలో ఆమెకు పరిచయమైన దండపాణిగారు గూడా స్థానిక విశ్వవిద్యాలయంలో రిజిస్ట్రారుగా పనిచేసి రిటైరైనవారు. అంతకు మించి ఆయన తనకు గైడ్‌గా వ్యవహరించగల పరిజ్ఞానం కలిగి ఉండడం ఎమరాల్డా అదృష్టం. ఆయన ఇచ్చిన జాబితా మేరకు ఆమె లైబ్రరీల్లో కూచుని పుస్తకాలను పరిశీలించి నోట్సు తీసుకుంది. సమాజంలో వివిధ రంగాలలోని వ్యక్తుల్ని కలుసుకుని, ఇంటర్వ్యూ చేసి అభిప్రాయసేకరణ జరిపింది. పరిశీలనలోని చివరి అంశం దేశాటనం, దేవాలయ సందర్శనం. కుటుంబ సభ్యుల మధ్యగల అన్యోన్యతలు, ఆత్మీయతలు, అభిమానాలు గమనించడానికి, వారి చిత్తసంస్కారాన్ని, సహృదయతని, సౌజన్యాన్ని గణనచేయడానికి వీలుగా ఫీల్డువర్కుమీద ఏ ఊరికి వెళ్ళినా ఆమె ఓ కుటుంబంలో అతిథిగానే ఉండేటట్టు దండపాణిగారు ఏర్పాటు చేయగలిగారు. తిరువణ్ణామలైనుంచి క్షేత్ర సందర్శనం ప్రారంభించవలసిందిగా సలహా ఇస్తూ, ఆయన ఆమెను ఆ పట్టణంలోని ఒక దూరపు బంధువుల ఇంటికి పంపించారుట!

'మా ఇంట్లో తాను పేయింగ్ గెస్టుగానే ఉంటానని చెప్పిందండీ ఈ అమ్మాయి. మా అమ్మా, నాన్నా కోపగించుకున్నారు. 'ఏమమ్మా! ఒక మనిషికింత భోజనం పెట్టడానికి డబ్బు తీసుకుంటామా? ఏ దేశంలో పుట్టావో! ఏ తల్లికి బిడ్డగా పెరిగావో! నువ్వు మా ఇంటి బిడ్డ మాదిరి' అని కచ్చితంగా తేల్చి చెప్పేశారు" అంటూ ముగించాడు ఆ అబ్బాయి.

ఆనాడు తమిళ యువకుడిద్వారా సేకరించిన వివరాలన్నీ ఈనాడు మళ్ళీ ఫ్రెంచి అమ్మాయి కనిపించగానే ఒక్కపెట్టున రామదాసుకు జ్ఞప్తికొచ్చేశాయి. ఆ వివరాలన్నీ బయటపెట్టి తనకు అతీంద్రియ శక్తులున్నాయని బుకాయించడానికి ఇదొక గొప్ప అవకాశం. అలా చేయడంవల్ల తనచుట్టూ ఒక ఇమేజ్‌ను నిర్మించుకోవచ్చు. పాతికేళ్ళ క్రితం అయితే రామదాసు అలాంటి పనికి పూనుకునేవాడే! చిట్కా మహిమల పట్ల, సిద్ధులపట్ల అతనికి ఆసక్తి బాగా సన్నగిలిపోయింది. శాశ్వత సత్యమేదేనా ఉంటే దాన్ని

వెతికి పట్టుకోవాలన్న జిజ్ఞాస ప్రబలింది. ఆశ్రమం నుంచి ఆశ్రమానికి అతడు సంచారం చేస్తున్నాడంటే అందుకే!

అందుకని ఆమె ధోరణిలోనే ఆమె మాట్లాడనివ్వడం మంచిదనుకున్నాడు రామదాసు. "మే ఐ నో యువర్ నేమ్ ప్లీజ్?" (మీ పేరేమిటో తెలుసుకోవచ్చా?) అని బుజ్జగించినట్టుగా ప్రశ్నించాడు.

"ఎందుకు తెలుసుకోగూడదూ? నా పేరు ఎమరాల్డా. ఎమరాల్డా ఫ్రమ్ ఫ్రాన్స్."

"ఎమరాల్డా అంటే చాలు. ఫ్రాన్సు దేశమని చెప్పనక్కర్లేదు. 'ది హంచ్ బాక్ ఆఫ్ నాటర్‌డామ్' - విక్టర్ హ్యూగో నవల జగత్ప్రసిద్ధం. అందులో వస్తుంది ఎమరాల్డా. గొప్ప సౌందర్యవతి. అధిక ప్రసంగమనుకోకపోతే ఒక మాట చెప్పాలి. ఆ పేరు మీకు చాలా సముచితంగా ఉంది..."

"థేంక్స్! థేంక్ యూ వెరి మచ్..." ఎమరాల్డా ముఖం వికసించింది. కొద్ది క్షణాలాగి, మళ్ళీ ఒక మాట చేర్చింది – "కొడైకెనాల్ యాత్రలో మీలాంటి సహయాత్రికుడు దొరకడం నా అదృష్టం."

"రక్షించారు! కొడైకెనాల్ యాత్రవరకే గదా!" వీలయినంత గుంభనంగానే అన్నాడు రామదాసు.

చమత్కారాన్ని గ్రహించడానికి కొంతసేపు పట్టిందేమో, ఆ తర్వాత గలగలా నవ్వేస్తూ అంది ఎమరాల్డా – "ఫరవాలేదు, ముసలివాళ్ళు పడుచు పిల్లల్ని పెళ్ళాడడం ప్రపంచవ్యాప్తంగా పరిపాటైపోయింది."

చిన్న చిన్న జట్లుగా ప్రయాణికులు వ్యాను లోపలికొచ్చేస్తున్నారు. బెంగాలీ కుటుంబాలు రెండు. బెంగుళూరుకు చెందిన నడివయసు దంపతులు. హానీమూన్ సంచారంలో ఉన్న పడుచు జంటలు రెండు – మొత్తం పదిహేనుగురు యాత్రికులే. ఆరున్నర కావడంతోనే సీటులో కూర్చోడానికి ఉంకిస్తూ డ్రయివరు వ్యానుకు దగ్గరగా తచ్చాడుతున్నాడు.

"మిస్ ఎమరాల్డా! ఓ విషయం అడగొచ్చా?"

"నిరభ్యంతరంగా! అడగండి!"

"మధ్యవర్తి ఒకరు పరిచయం చేసేదాకా కొత్తవాళ్ళతో మాట్లాడ్డం మీ సంప్రదాయం కాదే! మీరింత జోరుగా ప్రపంచంలోకి దిగడం – చెప్పొద్దూ, చాలా ఆశ్చర్యంగా ఉంది..."

"సంప్రదాయమనిగానీ, పెద్దలు చెప్పిపోయారనిగానీ, పుస్తకాల్లో శాసనంలా ఉందని గాని అనుకోకుండా నేను నా స్వంత బుద్ధితో, స్వంత ఆలోచన పైన నడవాలను కుంటున్నాను. పక్కపక్కనే కూచున్నా మనుషులు తమ నడుమ మైళ్ళ లెక్కల్లో అంతరం ఉన్నట్టు భావించే సంప్రదాయంలో ఉండి ఉండీ నాకు మొఖం మొత్తింది. మానవ సమూహాల మధ్య జీవిస్తున్న మనిషి తనను తాను ఏకాకిగా ఎందుకు మలుచుకోవాలో నాకర్థంగాదు. ఎడమొఖం, పెడమొఖంగా కూర్చొనేవాళ్ళు విరోధులు. మనిషికీ మనిషికీ మధ్య ఆప్యాయతల, ఆత్మీయతలు నెలకొన్న చోటుకోసం నేను అన్వేషణలో ఉన్నాను. ఈ దేశంలో భావ వినిమయానికి భాషా సమస్య గూడా ప్రతిబంధకం కాలేదంటే మీరు

నమ్ముతారా? నేను ఫీల్డు వర్క్‌కోసం వెళ్ళి పల్లెల్లో, బస్తీల్లో మధ్యతరగతి కుటుంబాల్లో మజిలీ చేశాను. అక్కడి ఆడవాళ్ళకు ఇంగ్లీషు బొత్తిగా రాదు నాకు ద్రావిడ భాషల్లో పరిచయం శూన్యం. అయినా, వాళ్ళ భావాన్ని నేను, నా ఇంగితాన్ని వాళ్ళు ఇట్టే తెలుసుకోగలిగేవాళ్ళం."

"మిస్ ఎమరాల్డా! మీ 'అబ్జర్వేషన్' నాకు చాలా సంతోషప్రదంగా ఉంది. మీలాంటి టూరిస్టుల అభినందనలే మాకు గర్వకారణం" అన్నాడు రామదాసు.

వ్యాను కదిలింది. తమిళ డ్రయివర్లు టూరిస్టు వాహనాలు నడపడంలో ఎంతటి సిద్ధహస్తులో అయిదు నిమిషాల్లోనే తెలిసొచ్చింది. అరగంట సేపట్లో పట్టణ శివార్లు వెనక్కు వెళ్ళిపోయాయి. ప్రభాత మందపవనాలు వ్యానులోని ప్రయాణీకులకు గిలిగింతలు పెడుతున్నప్పటికీ, బయటి వాతావరణం మటుకు ఏమంత ఆహ్లాదకరంగా లేదు. వైఘై నదిలో నీటి జాడలేలేవు. ఇసుక వరపులతో బరాబయలుగా ఉంది. రహదారికిరువైపులా వ్యాపించిన పొలాలు వర్షంకోసం, నదీజలాలకోసం వేచి చూస్తూ దాహతాపంతో ఆవిర్లు వెలిగక్కుతున్నాయి. కానీ, వ్యాను ముందుకు దూసుకుపోతున్నకొద్దీ ప్రకృతి సన్నివేశాలు చాలా త్వరత్వరగా మారిపోసాగాయి. కొడైకెనాల్ పర్వత ప్రాంతాలకు చేరువగా వెళ్తున్న కొద్దీ చల్లటి నీడలతో పచ్చని చెట్లు స్వాగతమివ్వసాగాయి.

వ్యాను పత్తలగుండులో ఆగింది. చాలా చిన్న ఊరు పత్తలగుండు. తమిళనాడు పర్యాటక శాఖ వారి టూరిస్టు హోటలే గనుక లేకపోయినట్టయితే ఆ ఊరి ముఖం చూసేవాళ్ళెవరూ ఉండరు. టేబిలు దగ్గర కూచున్నాక ఎమరాల్డాతో సంప్రతించి రామదాసు ఉపాహారాన్ని ఎంపిక చేశాడు. ఆర్డరిచ్చింది అతడే గనుక బిల్లుగూడా అతని చేతికే వచ్చింది. "వద్దు. బిల్లు చెల్లిస్తాను" అంటూ అడ్డు తగిలింది ఎమరాల్డా. "అమ్మాయ్! కొడైకెనాల్‌నుంచి తిరిగొచ్చేదాకా నవ్వు నా గెస్టువి" అన్నాడు రామదాసు.

"ఎందుకులెండి! మీ భారతదేశంలో నాకు స్వేచ్ఛ దొరికే అవకాశమే లేనట్టుంది". ఋంగముఖం పెడుతూ అంది ఎమరాల్డా.

ఘాట్ రోడ్ మొదలైంది. తూర్పు దిక్కుగా వ్యాపించి, ఉత్తరాన ఒక చిన్న మలుపు తిరిగి, మళ్ళీ పశ్చిమ దిశగా విస్తరించిన ఉన్నత పర్వత పంక్తులు ఆకారంలో ఉన్నాయి. కిందలి లోతట్టు ప్రాంతం కొండల నడుమ లోయగా కనిపిస్తూ దక్షిణ దిగ్భాగాన పెద్ద మైదానంగా మారిపోయింది. వ్యాను పైకి వెళ్తున్న క్రమంలో లోయలోని చెరకు, అరటి, కొబ్బరితోటలు తమ అస్తిత్వాన్ని కోల్పోయి చివరికొక పచ్చటి తివాచీగా రూపం మార్చుకున్నాయి. కొండకోన పార్శ్వంలో 45 డిగ్రీల కోణంలో గోడ కానించి పెట్టిన నిచ్చెనలా పైకి పోతున్న బాట కిటు కిందలి భాగంలోను, అటు పై భాగంలోనూ పెరిగిన యూకలిప్టస్ చెట్లు ఒక పెట్టని చలువపందిరిలా రూపొందాయి. వ్యాను రోడ్డుపైన పరుగెడుతున్నట్టు లేదు. చలికాలపు ఉదయాల్లో వీచే శీతల పవనాల్లో తేలిపోయినట్టే ఉంది.

"అరగంట హాల్టు. టూరిస్టులంతా దిగొచ్చు. డమ్ డమ్ ఫాల్స్ చూడవలసింది ఇక్కడినుంచే" అంటూ డ్రయివరు వాహనాన్ని ఆపేశాడు.

దిగిన చోట రోడ్డు పక్కన సన్నగా ఓ పార్కు ఏర్పాటుచేసి, రక్షణగా అంచుల్లో పిట్టగోడ నిర్మించారు. గుబురైన చెట్ల నీడల్లో సిమెంటు బెంచీలే వేశారు. అక్కడినుంచి చూస్తే కొద్ది కిలోమీటర్ల దూరంలో పడమటి వైపు పర్వతం పైనుంచి ఆకాశాన్ని తొలుచుకుని కిందికి దూకుతున్నట్టుగా డమ్ డమ్ జలపాతం కానవస్తోంది. పచ్చటి పర్వత సానువుల నడుమ దివినుంచి భువికి వేసిన రహదారి ఏమోనని భ్రాంతి గొలిపే దృశ్యం అది!

"కొండవేటు పైనుంచి బండలపైకి దూకే శబ్దానికి అనుకరణగా దీనికి డమ్ డమ్ జలపాతమని పేరొచ్చిందట! దగ్గరికి వెళ్తే చెవులు దిమ్మెక్కిపోతాయని చెబుతుంటారు" అన్నాడు రామదాసు.

"అయితే, దూరంనుంచి చూడడమే మంచిది. శబ్ద కల్లోలాలతో ఘూర్ణిల్లిపోయే ప్రపంచంనుంచి పారిపోయి వచ్చినదాన్ని ప్రశాంతి వైపే నా ప్రయాణం."

"మంచి మాటన్నావమ్మా ఎమరాల్డా! ఇంచుమించుగా భారతీయ వేదాంత సారమంతా అదే! చీకటి నుంచి వెలుగులోకి, అసత్యంనుంచి సత్యంలోకి, మృత్యువునుంచి అమృతత్వంలోనికే మానవుడి ప్రస్థానం."

"అవ్యవస్థలోనుంచి వ్యవస్థలోకి – అంటూ ఒక మాట చేర్చలేదెందుకండీ మీరు?"

"ఏ రంగంలోనైనా వ్యవస్థ అనేది ఉండి తీరాలన్నది మా విశ్వాసం. ఇందులో రెండభిప్రాయాలకు తావే లేదు."

"అదృష్టవంతులు." నిట్టూరుస్తూ అంది ఎమరాల్డా.

"అమ్మాయ్ ఎమరాల్డా! నీ మాటల వెనుక చేదైన అనుభవమేదీ లేదు గదా?" కొంచెం తటపటాయిస్తూనే ప్రశ్నించాడు రామదాసు.

ఎదుటివారి వ్యక్తిగత విషయాలను గురించిన ప్రసక్తి తీసుకురావడం సంస్కార సమ్మతంగా ఉండదని రామదాసుకు తెలియకపోలేదు. అయినా, అంతటి చిన్న వయసులోనే ఆ కన్నెపిల్ల మనసుకు తగిలిన గాయమేపాటిదో తెలుసుకోవడం అతని పాలిటికి తప్పనిసరైపోయింది.

"కరుణా సాగరుడైన భగవంతుడి నవ్వులతోను, అతడి తోటలో పూచిన పువ్వులతోను పసిపిల్లలను ఉపమిస్తూ ఉంటారు. అయితే, ఆ పసిపిల్లల్లో తల్లి ప్రేమకు, తండ్రి వాత్సల్యానికి నోచుకున్న వాళ్ళని మాత్రమే భగవంతుడి బిడ్డలని నేననుకుంటాను. తల్లితండ్రులు జీవించి ఉండి గూడా ప్రేమాభిమానాలకు నోచుకోనివాళ్ళని సైతాన్ బిడ్డలని అనుకోవడానికి నేను వెనుకాడను. ఎందుకు చెబుతున్నానంటే అంకుల్ – నేనూ ఒక ఇంటి తోటలో పూలమొక్కగానే పుట్టాను. పాది కట్టి, నీరు పెట్టి, ఎరువు వేసి నన్ను కంటికి రెప్పలా చూసుకోవలసింది పోయి, నిర్దాక్షిణ్యంగా పెకలించి అవతలికి గిరవాటు పెట్టేశారు. సరిగ్గా నా బుద్ధి నాకు వచ్చీరాని వయసునుంచీ నేను హాస్టలు ప్రాణినైపోయాను. హాస్టల్లో తల్లితండ్రుల్లేని పిల్లలెందరో ఉండేవారు. వాళ్ళకయ్యే ఖర్చు ప్రభుత్వమే భరించేది. నా తల్లితండ్రుల మధ్య కుదిరిన ఒప్పందమేమిటో నాకు తెలియదు. వాళ్ళల్లో ఎవరు పంపించేవారో తెలియదు. అనాథ పిల్లలకున్నూ, నాకున్నూ అంతే తేడా! దాంపత్య బంధంనుంచి విడివడి వేరుపడిపోయిన తర్వాత గూడా వాళ్ళు ఈ ప్రపంచంలో నా

ఉనికికి, మనిషికి తమ బాధ్యత కొంత ఉందని నమ్మి, ఎంతో దయగా నా పోషణ కింద కొంత డబ్బును హాస్టలుకు చెల్లించేవారు. 'నాగరికత పురోగమిస్తోంది. విలువలు మారిపోతున్నాయి. సెంటిమెంట్లన్నీ వట్టి ట్రాష్' అని ఈసడించుకుంటున్నారు. కానీ, ఇదంతా ఒక పసిపిల్లకేం తెలుస్తుంది? దానికి తల్లి ఒడిలో కూర్చోవాలని ఉంటుంది. మెడచుట్టూ చేతులు వేసుకోనిచ్చి, వీపు మీద తనను మోస్తూ ఆమె ఇల్లంతా తిరగాలని ఉంటుంది. బాత్‌రూమ్‌లో స్నానం చేయిస్తూ, ఒళ్లు రుద్దే తల్లి మృదుస్పర్శలో పులకించి పోవాలని ఉంటుంది. 'ఈ గౌను వేసుకుంటావా బేబీ? పోనీ, ఇది? మరేది? ఓహో ఇదా' అంటూ గారాము చేసే తల్లి చేత తనకు నచ్చిన దుస్తుల్ని ఎన్నిక చేయించుకోవాలని ఉంటుంది. వెహికిల్ ఇంటి ముంగిట నిలిస్తే పరుగెత్తుకుంటూ వెళ్ళి గుమ్మంలోనే తండ్రి కాళ్ళకు పెనవేసుకు పోవాలని ఉంటుంది. రెండు చేతులతోనూ పైకెత్తినప్పుడు ఆయన ఛాతికి హత్తుకుపోవాలని ఉంటుంది. బయటకు బయల్దేరినప్పుడల్లా ఆయన ఇచ్చే ముద్దుకు ప్రతిఫలంగా 'టాటా' చెప్పాలని ఉంటుంది. ఏ పెట్టె మరుగునన్నో తాను దాక్కుని, 'పాపేదీ, పాపేదీ' అని ప్రశ్నించుకుంటూ ఇల్లంతటా కలయతిరిగేలాగా తల్లితండ్రుల్ని ఆట పట్టించాలని ఉంటుంది. ప్రతి పసిపాపకు జన్మహక్కైన ఈ ముద్దుమురిపాల ముచ్చట్లు తీరే అవకాశం నాకు లేకపోయింది. ఎవరికీ కాబట్టని అడవిమొక్క చందంగా నా బాల్యం గడచిపోయింది. పడుచుప్రాయమున్నూ అందుకు డిటో. అసలు నేను స్వదేశంలోనే ఉన్నానో, విదేశాల్లో తిరుగుతున్నానో, అటూ ఇటూగాక మధ్యలో ఏ సముద్రంలోనైనా దూకేశానో, ఏ నదీ ప్రవాహంలోనైనా కలిసి కొట్టుకుపోయానో – ఆలోచించే వ్యక్తి మచ్చుకొకరైనా ఈ ప్రపంచంలో లేరంటే – ఇంతకుమించిన దౌర్భాగ్యాన్ని మరెక్కడైనా ఊహించగలరా మీరు?..."

ముఖం అవతలికి తిప్పుకోవడంవల్ల ఎమరాల్డా కళ్ళు చెమ్మగిల్లిందీ, లేనిదీ రామదాసు తెలుసుకోలేకపోయాడు. కానీ, డమ్ డమ్ జలపాతం లాంటి దుఃఖం ఆమె గుండెల్లో హెూరు పెడుతోందని మాత్రం గ్రహించగలిగాడు. ఇప్పుడీ పది నిమిషాల వ్యవధిలో బహిర్గతమైంది అందులో ఒక పాయ మాత్రమేనేమో!

యాత్ర మళ్ళీ ప్రారంభమైపోయింది. లోయ లోతుల్ని ఆరా తీస్తున్నట్టుగా, ఆకాశం ఎత్తుల్ని అంచనా వేస్తున్నట్టుగా పెరిగిపోయిన నేరేడు, మామిడి, పనసలాంటి ఫలవృక్షాల మధ్యనుంచి వ్యాను పరుగెడుతోంది. వెడల్పాటి ఆకులతో లావుపాటి తీగలు ఆ చెట్లకల్లుకుపొయ్యాయి. అటవీ శాఖవారు ఆ వృక్ష సముదాయానికి నడుమగల ఖాళీ జాగాలో అందుబాటుకు వచ్చినంత మేరకు ద్రాక్షతీగలు పెంచి, చిన్న చిన్న పందిళ్ళు వేసేశారు. అంతకంతకూ చెమ్మదనం ఎక్కువై కొండల్లో పుట్టిన ఊట నీళ్ళు కిందకి దొర్లివచ్చి రోడ్డు పక్కనగల కాలువల గుండా ప్రవహిస్తున్నాయి. నీరెండలో ప్రారంభమైన కొడైకెనాల్ యాత్ర మొదట చల్లటి నీడల్లోకి, ఆ తర్వాత ఏ.సి ఆగారాలలోకి, ఆపైన ఏకంగా ఫ్రిజ్‌లోకే తరలివెళ్తున్నట్టుగా తోచింది. సంచులు, సూట్‌కేసులు తెరిచి ప్రయాణికులు స్వెట్టర్లు, మఫ్లర్లు, శాలువాలూ పైకి తీశారు.

మిట్టమధ్యాహ్నానికి కొంచెం ముందూ వెనుకగా వ్యాను గమ్యస్థానం చేరుకోగలిగింది. 'వేసవి విశ్రాంతి కేంద్రం, అందాల ప్రకృతికి ఆటపట్టు, కొడైకెనాల్‌కు

స్వాగతం' అంటూ సాదరంగా ఆహ్వానిస్తున్న తోరణం కింద సముద్ర మట్టంనుంచీ ఎత్తునుగూడా గుర్తించారు - 7,300 అడుగులు.

'ఏడువేలుం చిల్లర అడుగులే గదా! అయితేనేమి? అనుకోడానికి వీల్లేకుండా, మధ్యాహ్నం పన్నెండు గంటలవేళ కొడైకెనాల్ పర్వత శిఖరాల్లో, అవి తమ ఒడిలో దాచుకున్న పచ్చటి లోయల్లో దట్టంగా పొగమంచు కురుస్తోంది.

తేమనేల, చెమ్మదనంతో కూడిన గాలి, మిట్టపల్లాలు, ఎగుడుదిగుడు వీధులు, ఏ మేరకు జాగా దొరికినా దానికి సరిపోయేటట్టు పొందికగా కట్టుకున్న గృహాలు, ఇరుకు వీధులు వచ్చి కలిసే ఓ బజారులో పచారీకొట్లు, మందుల షాపులు, టీ బంకులు, రెండో మూడో హోటళ్ళు, కొండవాలు వెంట దిగిపోయే సన్నటి మెట్ల వరుసలు, ఆ సోపానపంక్తులకు అటూ, ఇటూ కొండంతటా వివిధ వాస్తు శిల్ప విన్యాసాలతో నిర్మితమైన జనావాసాలు, తెల్లటి ఆకాశం కింద పచ్చటి కొండ కోనల ఆవరణలో కొడైకెనాల్ పట్టణం అతిలోక సుందరమైన ఏ గంధర్వ నగరంలాగానో కానవచ్చింది.

వ్యాను బజారుగుండా వెళ్ళి ఊరికి దూరంగా షాపింగు సెంటరు దగ్గర ఆగింది. ఆడవాళ్ళని, పిల్లల్ని ప్రలోభపెట్టే బొమ్మలు, దండలు, గాజులు, పర్సులు, తలపిన్నులు, ప్లాస్టిక్ సామాన్లు మొదలైనవాటికోసం ప్రయాణికులెందరో షాపుల దగ్గర మూగి ఉన్నారు. వాళ్ళనక్కడికి చేరవేసిన బస్సులు, వ్యాన్లు, కార్లు, జీపులు దూరంగా ఒక పార్కింగ్ ప్లేస్‌లో విడిసి ఉన్నాయి.

తెరిచి పట్టుకున్న తలుపు దగ్గర నిలబడి హెచ్చరించాడు డ్రయివరు -

"ఎవరో ఒకరు జాగు చేసినా కనిపించకుండాపోయినా, మిగిలిన ప్రయాణికులకు ఇబ్బంది కలుగుతుందని మరిచిపోకండి! చూడవలసిన ప్రదేశాలన్నీ ఇక్కడికి చాలా దగ్గరగానే ఉన్నాయి. ఇదిగో, ఈ వైపున నూరు గజాల దూరం నడిస్తే 'కోకర్స్ వాక్' అనే కొండ అంచు దగ్గర ఉంటారు. 1872లో కోకర్స్ అనే ఇంగ్లీషు దొర కనిపెట్టడం వల్ల దానికీ పేరు వచ్చిందట! అక్కడినుంచి కిందికి చూస్తే 'పిల్లర్ రాక్స్' - అంటే స్తంభాలలాంటి రాళ్ళు కనిపిస్తాయి. ఇక కుడివైపునగల తోటలో నుంచి పది నిమిషాలపాటు నడిస్తే 'సైలంట్ వ్యాలీ' దృశ్యం చూడొచ్చు. గుండెలు చిక్కబట్టుకుని చూడాలి దీన్ని! పాతాళమేననుకోండి. కళ్ళు గిర్రున తిరిగిపోతాయి. మీరు మనసులోనే పెట్టుకోండి - దీన్ని 'సూయిసైడ్ స్పాట్' అని కూడా అంటారు. ఒక క్షణం గుండె చిక్కబట్టుకుంటే ఊహకందని మృత్యుదేవత నోట్లో బుడుంగున జారిపోవచ్చు. సైలంట్ వ్యాలీ గోడకు ఉత్తరంగా వెళ్తే 'కురింజి ఆండవన్ టెంపుల్' వస్తుంది. ఆ గుడినుంచి దిగువ బాటగుండా ఊరి వైపు తిరిగి రావాలి. మలుపులో అప్పర్ లేక్ - ఆకాశ తటాకం చూడొచ్చు. కొంచెం ఈవలికి వస్తే పడవల్లో షికారు తిరిగి రావడానికి వీలున్న 'కొడై సరోవరం' కానవస్తుంది. ఏం చూస్తారో, ఏమిటో? వానకూడా వచ్చేటట్టుంది. కమాన్, క్విక్, క్విక్. రెండు గంటలకల్లా మీరు బజార్లో బ్లూ డైమండ్ హోటలు దగ్గరుండాలి. రెండు నుంచి రెండున్నర దాకా లంచ్ టైమ్. ఓ అరగంటసేపు విరామం. మూడు గంటలకల్లా వ్యాను తిరుగు ప్రయాణానికి సిద్ధంగా హోటలు ముందుంటుంది..."

వ్యాను డ్రయివరు గైడ్‌గా కూడా తన కర్తవ్యం నిర్వహించాక, రామదాసు, ఎమరాల్డా 'కోకర్స్ వాక్' వైపు నడిచారు. 'కొండ అంచు. దాటి వెళ్ళకండి' అన్న హద్దు దగ్గరే ఆగిపోయారు. పది బారల దూరంలో ఏమున్నదీ కనిపించడం లేదు. సహజసిద్ధమైన రాతిస్తంభాలు దట్టమైన పొగమంచులో అయిపు తెలియకుండా మాయమైపోయాయి.

"పోనీలే ఎమరాల్డా! కాసేపిక్కడ కూచుందామా" అన్నాడు రామదాసు.

"ఏం చేద్దాం సార్! పొందవలసిన కనీసపు సదవకాశాలను సైతం పొంద లేకపోవడం మానవ జీవితంలో గొప్ప దురదృష్టం" అంది ఎమరాల్డా.

"అమ్మాయ్ ఎమరాల్డా –" అర్ధోక్తిలో ఆగిపోయాడు రామదాసు. గొంతుకలో నుంచి ఊడిపడని ప్రశ్నలేవో అతడి కళ్ళల్లోనుంచి ఆమెవైపు ప్రసరించాయి.

"మా హాస్టల్లో వందమందికి పైగా పిల్లలుండేవారు. ఎప్పుడైనా ఒళ్ళు నలతకు గురైతే తోడి పిల్లలు ఆ విషయం చెప్పుకోవడం, ఆ మాట ఆయా చెవిలో పడడం, ఆమె డాక్టరు దగ్గరికి తీసుకెళ్ళడం, డాక్టరేవో మందుబిళ్ళలివ్వడం, జ్ఞాపకమున్నప్పుడు మింగి, మరిచిపోయినప్పుడు మరిచిపోతే చివరి కెట్టాగో జబ్బు నయం కావడం – ఇలా జరుగుతుండేది. అంతకుమించి సాదర పరామర్శలుండేవి గావు. ప్రపంచంలో మనుషులనేవాళ్ళు ఎందరైనా ఉండొచ్చు. కానీ, 'నా వాళ్ళు' అని చెప్పుకోవడానికి కొందరుండాలి. 'స్కూల్లో పిల్లల్లేరా' అని మీరనవచ్చు. 'టీచర్లు లేరా' అనవచ్చు. ఉండొచ్చు. ఉంటారు. కానీ, సమాజంలోని వ్యవస్థల్లో 'బడి' అనే సంస్థ మొదటిది కాదని మనం గ్రహించాలి. ఆ మొదటిదేదో మీకు తెలుసు. ఆ కౌటుంబికానందం బడిలో ఫీజు కడితే దొరకదు. బజార్లో డబ్బిస్తే దొరకదు. 'నేనే కుటుంబానికీ చెందినదాన్ని కాను' అనే భావన నా మనసులోనుంచి జీవితానందాన్ని తుంచి పారేసింది. నా జీవనోత్సాహాన్ని కాలరాచి పారేసింది. నా జీవితానికి సంబంధించిన పునాది ఇలా గ్రక్కదలిపోవడానికి కారణమేమిటో మీరూహించి ఉంటారు. అసలింతవరకూ నా తల్లితండ్రులెందుకు విడిపోయారో నాకు తెలియదు. మా నాన్న రెండో భార్యతో కాపురం చేసింది గూడా కొద్దికాలం మాత్రమే. చట్టరీత్యా విడిపోయాక మూడో పెళ్ళి చేసుకున్నాడు. పెళ్ళయిన ఆరు నెలలకే ఆమె ఎందుకు చనిపోయిందన్నది పెద్ద మిస్టరీ! ముగ్గురు భార్యల్ని కాదుగదా, ముప్పైమందిని చేసుకున్నా ఆయనకెవరితోనైనా సామరస్యం కుదిరి ఉండేదా అని నా అనుమానం. ఆయన ఎడారి బ్రతుకుతో పోల్చి చూస్తే అమ్మ జీవితమే కొంత నయం. రెండో భర్త ఆమెకు కొంత ఆస్తినైతే దిగవిడిచాడుగానీ, తాను మాత్రం థాయ్‌లాండుకు వెళ్ళి అక్కడేదో బిజినెస్‌లో స్థిరపడిపోయాడు. ఆ ఆస్తిపైన వచ్చే ఆదాయంతో ఆమె తానూ, ముగ్గురు కూతుళ్ళూ జీవించాలి. ఎప్పుడైనా తన దగ్గరికి వస్తానని రాస్తే 'ఇంట్లో ఉన్నవి రెండే బెడ్‌రూమ్స్. నిన్ను నేనెక్కడ అకామడేట్ చేయగలను? కావాలంటే హోటల్లో గది బుక్ చేస్తాను. నువ్వక్కడ బసచేసి, పూట పూటకూ వచ్చి మాతోబాటుగా భోజనం చేసి వెళ్ళొచ్చు...' అని రాస్తుంది. కాలేజీలో ప్రవేశించగానే నాకు స్కాలర్‌షిప్ లభించింది. ఆ డబ్బు నా అవసరాలకన్నింటికీ సరిపోతుండేది. భోజనానికేమీ ముఖం వాచిపోయిన దాన్నిగాను. ప్రత్యేకించి అందుకోసమని ఒకరింటికి వెళ్ళాల్సిన అవసరమేముంది? అలాంటి

ఉద్దేశాలు కట్టిపెట్టేశాను. నాకెట్లాగో ఈ చదువొకటి అబ్బింది. ఈ రంగంలో నేను రాణించగలనని మా ప్రొఫెసర్లు కొందరు అనుకున్నారు. సలహాలిచ్చి తోడ్పడ్డారు. రీసెర్చి వ్యాపకంపైన ఇలా కొట్టుకొచ్చేశాను. అయినా ఇదొక మజిలీయే గదా!..."

అవును మరి! ఎమరాల్డా జీవిత యాత్ర అంతా ఇకముందే ఉంది. కానీ, గమ్యం మాత్రం ఆమెకు తెలిసిరావడం లేదు.

'కోకర్స్ వాక్' నుంచి పది నిమిషాల నడక వాళ్ళని తీసుకెళ్ళి జీవితానికీ, మృత్యువుకు మధ్యగల అంచు దగ్గర నిల్చోపెట్టింది. మంచు దుప్పట్లతో గట్టిగా ముసుగు పెట్టుకున్న మృత్యులోయ అంతుబట్టని రహస్యంలా, ఆంతర్యం బయటికి కనిపించనివ్వని నంగనాచిలా నిద్రపోతోంది.

ఎమరాల్డాయే మౌనభంగం చేసింది - "సూయిసైడ్ మానియా - అంటారు. ఇలాంటి ప్రదేశాల దగ్గరికి వచ్చినప్పుడు ఆ ఉన్మాదం మరింతగా ప్రకోపిస్తుందేమో! సరిగ్గా ఇదే కాదుగానీ, లోకంలో ఇలాంటి మానియాలు చాలా ఉన్నట్టున్నాయి. పరెగ్జాంపుల్, నా ఎరుకలో శరవణన్ అనే ఆకతాయి యువకుడున్నాడు. అతడి మానియాను గురించి చెబితే మీరు దిగ్భ్రాంతి చెందకుండా ఉండరు..."

"శరవణన్! ఎవరమ్మా అతను." రామదాసు ప్రశ్నించాడు.

"ఉన్నాడు లెండి! నేను చాక్‌లెట్టునయితే నమిలి మింగేయాలన్నది అతడి మానియా! నేను కూల్‌డ్రింకునైతే గుటగుటా తాగెయ్యాలన్నది అతడి మానియా! క్రూయల్ ఫెలో, ఎలా కొరికేశాడో చూశారా?"

అప్పటివరకూ రామదాసు చూడలేదుగానీ, ఎమరాల్డా కుడిచెవికి పక్కగా చెంపపైన గోళ్ళు దిగబడేటట్టు గట్టిగా రెండు గాట్లు కనబడుతున్నాయి. నొచ్చుకుంటూ అతడన్నాడు- "అయినా, ఇంత తెంపరితనమా! ఊరికే వదిలి పెట్టావటమ్మా అతణ్ణి?"

"తిరువణ్ణామలైలో నేనొక ఇంట్లో దిగాను. ఆ ఇంటి కుర్రాడే ఇతను. తల్లితండ్రులు చాలా మంచివాళ్ళు. ఎటొచ్చీ సరిగ్గా చదువుకోక రికామీగా తిరిగే ఈ కొడుకుదే వాళ్ళకు పెద్ద సమస్య. కొత్త ప్రదేశాల్లో దారి తోడుగా ఉంటాడని నాతోబాటు పంపించారు. అబ్బాయి గూడా ఆదిలో బుద్ధిగానే వ్యవహరించాడు. తిరుక్కోయిలూరు, వృద్ధాచలంల మీదుగా కుంభకోణం వచ్చాము. స్వామిమలై, తిరువయ్యార్‌లు దర్శించి తంజావూరు చేరుకున్నాము. తంజావూరునుంచి ట్రిచీ. తీరా మాకా శ్రీరంగ దేవాలయం చూడ్డానికే రెండు రోజులు పట్టింది. ఇందాకా చెప్పానుగదా! రోజులొక్కటొక్కటిగా గడుస్తుంటే, అతడి ప్రవర్తనలో మార్పు రావడం గమనించాను. తనకు చాలా ఇంపితమైన తినుబండారాన్ని చూసినట్టుగా నావైపు చూస్తుండేవాడు. మాట్లాడుతూ మాట్లాడుతూ ఆగిపోయి రెప్పలార్పకుండా నావైపు గ్రుడ్లప్పగించేసేవాడు. పోతే పోనీలెమ్మని ఊరుకున్నాను. అంతటితో ఎక్కడ ఊరుకున్నాడు? నిన్నటి ఉదయం ఆరు గంటలకు తరువాతి కార్యక్రమం గురించి మాట్లాడేందుకని గదిలోకి వచ్చాడు. మాటల నడుమ ఏం పూనకం వచ్చిందో గానీ ఎముకలు విరిగిపోయేటట్టుగా బిగ్గరగా కావిలించుకుని, ఇదిగో ఇలా గాట్లు పెట్టేశాడు. కొద్ది క్షణాల్లోనే నేను తటపటాయించుకుని గ్రుడ్లురిమి

చూస్తూ విదిలించి పారేసేసరికి మళ్ళీ పిల్లిలా తయారైపోయాడు. గదిలోనుంచి అవతలికి గెంటి 'నీ తల్లితండ్రుల మంచితనాన్ని చూసి నిన్ను వదిలి పెడుతున్నాను. వెళ్ళిపో. నీ ముఖం నాకు చూపించొద్దు' అని చీవాట్లు పెట్టాను. ఖంగుతినిపోయి ఉంటాడు బహుశా. తన గదిలో దూరి గడియ పెట్టుకున్నాడు. ఆ అవకాశం నాకు బాగా పనికొచ్చింది. సామాన్లు సర్దుకొని, లాడ్జీ బిల్లు చెల్లించి బయటపడ్డాను. నా కోసమే ఉన్నట్టుగా లాడ్జీ ముంగిట మధురకొచ్చే బస్సు కనిపించింది..."

మళ్ళీ కాసేపటివరకు రామదాసు నోట మాట పెకలిందిగాదు. కాస్త చనువిచ్చిన నేరానికి ఓ అమ్మాయిపైన దూకి అఘాయిత్యం చేయజూడడం ప్రాచ్య సంస్కృతిలో ఒక భాగమా అని ఈ ఫ్రాన్సు అమ్మాయి అడిగితే, తానెక్కడ ముఖం పెట్టుకోవాలి?

తిరుగు ప్రయాణంలో గూడా సంభాషణ అట్టే కొనసాగలేదు. కిటికీ పక్కన కూచున్న ఎమరాల్డా దస్సిపోయినట్టు గాఢంగా నిద్రపోయింది. రామదాసుగూడా ఉండి ఉండి కునికిపాట్లకు లోనవుతూ వచ్చాడు. ఆరోజు రాత్రి హోటల్లో భోజనం చేస్తున్నప్పుడే ఎమరాల్డా రామదాసు దగ్గర సెలవు తీసుకుంది.

"ఉదయం అయిదు గంటల బస్సుకే నేను పాండిచ్చేరి బయల్దేరుతున్నాను. ఈ నెలాఖరుకల్లా స్వదేశంలో ఉంటాను. ఎక్కడ స్థిరపడతానో, ఏమవుతానో తెలియదు గనుక నా అడ్రసు ఇవ్వలేను. అందుకు మీరు నన్ను మన్నించాలి. కొడైకెనాల్ యాత్రలో ఈ మీ సహ యాత్రికురాల్ని మరచిపోరుగదూ?"

ఆ విదేశీ అమ్మాయిపట్ల జాలి, ఆందోళన, అభిమానం లాంటి భావాలు రామదాసు గుండెను ఉక్కిరి బిక్కిరి చేశాయి. ఆ ఉద్వేగంలో ఏం మాట్లాడాలో తోచక అతడు ఓ కాగితంపైన తన చిరునామాను రాసి ఆమె చేతిలో పెట్టాడు. ఆ కాగితం ముక్కను ఆమె పదిలంగా తన హ్యాండ్‌బ్యాగులో వేసుకుంది.

***

డమ్ డమ్ జలపాతం, కోకర్స్ కొండ అంచు, సైలంట్ వ్యాలీ, ఆ మనోహర విలక్షణ ఆహ్లాదప్రదమైన వాతావరణం, ఆ పరిసరాల్లో సొంత బిడ్డలా తన సరసన నడిచిన ఎమరాల్డా – వెరసి కొడైకెనాల్ యాత్రంతా ఒక కలగా మారిపోయాక, దాదాపు నాలుగేళ్ళ అనంతరం రామదాసుకొక ఉత్తరం వచ్చింది. తపాలా ముద్రనుబట్టి చూస్తే అది అనుకోని చోటునుంచి వచ్చిన ఉత్తరం. ఆశ్చర్యంతో చించి చూశాడు.

"డియర్ అంకుల్! గుర్తున్నానా ఎమరాల్డాని! భూమి గుండ్రంగా ఉందని రుజువు చేయడం కోసం ప్రపంచమంతా తిరిగి మళ్ళీ పాండిచ్చేరికే వచ్చి చేరాను. ఇక్కడి ఫారిన్ లాంగ్వేజస్ ఇన్‌స్టిట్యూట్‌లో ఒక ఉద్యోగం దొరికింది. అంతర్జాతీయ మానవతా కేంద్రం 'ఆరోవిల్'లో ఆశ్రయంకోసం ప్రయత్నిస్తున్నాను. ఈలోగా మీతో కొంచెం పని తగిలింది. ఈ ఉత్తరం చేరిన వారం రోజులలోగా మీరొకసారి ఇక్కడికి రాగలరా? మీ రాకకోసం వేచి ఉన్నాను – మీ అభిమానపాత్రురాలు, ఎమరాల్డా."

ప్రశాంతమైన వాతావరణంలో కొంతకాలం గడపదలచుకునే వాళ్ళకందరికి ఒక నిరంతర ఆకర్షణ అరవిందాశ్రమం. పైగా, ఒక కారణంగూడా దొరికిపోయింది గదా. రెక్కలు కట్టుకున్నట్టుగా వెళ్ళి వాలిపోయాడు రామదాసు.

స్నానపానాదులన్నీ ముగించి వాలు కుర్చీలో సోలిపోయిన రామదాసు ఎదుట కూర్చుని నింపాదిగా ప్రశ్నించింది ఎమరాల్డా.

"చెప్పండి అంకుల్! మీరన్వేషిస్తూ వచ్చిన శాశ్వత సత్యమేదైతే ఉందో, అది మీకు దొరికిపోయిందా?"

"మంచి మాటేనమ్మా." తన ఆంతర్యాన్ని తానే వెదుక్కుంటున్నట్టుగా చెప్పుకు పోసాగాడు రామదాసు. "ఎన్నో ఆశ్రమాలు తిరిగాను. ఎందరో స్వాముల్ని దర్శించాను. ఏమేమో యోగసాధనాలు చేసి చూశాను. అనుభవాలుగా ఉపకరించాయేగానీ, వీటివల్ల నాకు సదుత్తరం మాత్రం లభించలేదు. వెన్నముద్ద అరచేత పెట్టుకుని, నెయ్యికోసం ఊరంతా తిరిగినట్టయిపోయింది. ఆలోచనాపరులు గొప్ప గొప్ప రహస్యాలను చిన్న చిన్న మాటలతోనే సెలవిచ్చారని గ్రహించడానికి చాలాకాలం పట్టింది. వాళ్ళు భగవంతుడికి పేరుగానీ, రూపంగానీ, గుణగణాలుగానీ లేవన్నారు. ఆదిమధ్యాంతరహితుడన్నారు. ఆ లక్షణాలను బట్టి చూస్తే 'అతనికి' ఓ భౌతికాకారం ఉన్నట్టు తోచదు. 'భగవంతుడు' అనేది ఒక భావన మాత్రమే! కొందరి పాలిటికి అది అచంచలమైన నమ్మకం. తమ తమ నమ్మకాలను బట్టి వాళ్ళు భగవంతుడికి పేర్లు పెట్టుకుని, అనేక రూపాలు తొడిగి, చుట్టూరా రకరకాల కథలల్లుకుని తృప్తి పడుతున్నారు. నా నమ్మకాన్ని బట్టి నేను భగవంతుడు ఒక వ్యక్తిగా గానీ, శక్తిగా గానీ వేరుగా లేడనీ, అనంతమైన సువిశాల విశ్వంద్వారా తనను తాను ఆవిష్కరించుకుంటున్నాడనీ అనుకుంటున్నాను. భూమి, ఆకాశం, నీరు, గాలి, సూర్యచంద్రులు, నక్షత్రాలు – అన్నీ భగవత్స్వరూపమేనను కుంటున్నాను. సృష్టి స్థితి లయాలనే వాటిలో 'స్థితి' అనేది ఒక నియమానికి లోనై ఉండడం మనకు విదితమే! నక్షత్రాలు విశ్వాంతరాళంలో ఒక క్రమపద్ధతిలో సంచరిస్తున్నాయి. రేయింబవళ్ళు ఒక నిర్ణీత పద్ధతిలో ఏర్పడుతున్నాయి. ఋతువులు తమ తమ ధర్మాలను ఖచ్చితంగా పాటిస్తున్నాయి. భూమి పంటలతో ఫలవృక్షాలతో ఫలించి, ప్రాణిలోకాన్ని ఆదుకుంటూ ఉంది. ఇలా విశ్వజీవన సరళి అంతా ఒక అనుల్లంఘనీయ నియమానికి లోబడి నడుస్తున్నప్పుడు మానవ జాతిగూడా ఒక కట్టుబాటుకు లోబడి నడుచుకోవడమే శ్రేయస్కరమని నేను గ్రహించాను. నేను తెలుసుకోగలిగిన శాశ్వత సత్యమేదైనా ఉంటే, అది ఇదేనమ్మా ఎమరాల్డా!"

ఇంతగా ఆలోచించలేదనుకోండి. కానీ, నేనూ మీ దారిలోనే నడుస్తున్నానని చెప్పుకోవాలి. కొన్ని కొన్ని సంసారాలను చూశాక నాకు కుటుంబ వ్యవస్థపట్ల నమ్మకం పోయింది. ఏకాకిగానే ఉండిపోదలచుకున్నాను. కానీ, మానసికమైన ఒంటరితనంవల్ల పాతికేళ్ళ జీవితంలో నేను పోగొట్టుకున్నవి అన్నీ ఇన్నీ కావు. ఏటికెదురీదినట్టుగా ఎందుకు జీవించాలి? పదివేల ఏండ్ల మానవ నాగరికత అనే ఫలవృక్షం కాచిన అమృతఫలాన్ని ఎందుకు కాదనుకోవాలి? ఎదురీదడం మాత్రమే గాదు, యాత్ర సజావుగా సాగిపోవడం కోసం నిర్మితమైన పడవను విధ్వంసం చేసుకోవడంగూడా అంతులేని అవివేకమేగదా. దాపరికం లేకుండా చెప్పాలంటే, మంచి స్నేహితుడిలాంటి భర్త, ముద్దొచ్చే బిడ్డలు, ముచ్చటైన ఇల్లు – ఇదంతా నా పాలిటికొక మధుర స్వప్నమైపోయింది. ఆ తీయటి కల

నిజం కావడం కోసమే రెండు మూడేళ్ళుగా వేచి ఉన్నాను. శుభవార్త ఏమిటంటే, ఈ ప్రతీక్షణలో నేనొక కాలిక్కి రాగలిగానని తేల్చుకోడానికి సంతోషిస్తున్నాను..."

ఆశ్చర్యాతిరేకంవల్ల రామదాసు కళ్ళు పెద్దవైపోయాయి. "ఇంతకూ నీకు నచ్చిన, నీవు మెచ్చిన ఆ జీవిత సహచరడెవరమ్మా?" అని ప్రశ్నించాడు.

"తెలిస్తే మీరు దిగ్భ్రాంతి చెందకుండా ఉండరు. ఎవరోగాదు, తిరుచినాపల్లి హోటల్ రూంలో గాట్లు పడేటట్లుగా నన్ను కొరికేశాడే... ఆ ఆకతాయి కుర్రాడే!"

"ఏమిటమ్మా ఇది? నిజమేనా నువ్వు చెబుతున్నది?" విభ్రాంతికి లోనై, విస్మయంతో ప్రశ్నించాడు రామదాసు.

"జగమొండి అనుకోండి! ఇక్కడికొచ్చి దండపాణిగారిద్వారా నా చిరునామా సంపాదించాడు. వారానికొక ఉత్తరం రాసి పోస్టు చేయడం మొదలుపెట్టాడు. నేను గనుక మన్నిస్తే బుద్ధిగా చదువుకుంటానని మాట ఇచ్చాడు. ఇచ్చిన మాట నిలబెట్టుకున్నాడు. గూడా! గడచిన సంవత్సరమే పి.జి పూర్తి చేశాడు. ప్రస్తుతం చిదంబరం (అణ్ణామలై) యూనివర్సిటీలో రీసెర్చి చేస్తున్నాడు. జీవితంలో నాకు ఉత్తరాలు రాసిన మొదటి వ్యక్తి అతనే! నన్ను ప్రేమించినవాడు, నా సాహచర్యంకోసం పరితపించేవాడు, నేను నా జీవితం నిరర్థకమనుకున్నవాడు అతనే! మనం ప్రేమించే వ్యక్తిని చేసుకోవడంకన్నా, మనల్ని ప్రేమించే వ్యక్తిని పెళ్ళి చేసుకోవడం మంచిదని ఎక్కడో చదివాను. నా మనసుకూడా ఎందుకో నాకు తెలియకుండానే అతడివైపు మొగ్గిపోయింది. ఇక్కడికొచ్చిన మూడు నెలల్లోనూ దాదాపుగా ప్రతి వారాంతంలోనూ కలుసుకుంటున్నాము. ఒకసారి తిరువణ్ణామలై వెళ్ళొచ్చాము. దేశం, మతం, భాష అనే పట్టింపులు లేకుండా మానవ జాతికి చెందినదానినన్న ఉదార భావనతో శరవణన్ తల్లితండ్రులు మా వివాహానికి సమ్మతించారు. రిజిస్ట్రారు ఆఫీసుకు దరఖాస్తు పెట్టుకుని, ప్రాథమిక తతంగాలన్నీ పూర్తి చేయడమైంది. పెళ్ళి కార్యం పూర్తి కావడానికి ఇంకొకసారి వెళ్ళొస్తే చాలు..."

"సరేనమ్మా! ఎన్నెన్నో సంస్కృతుల్ని తనలో విలీనం చేసుకున్న ప్రాచ్య సంస్కృతి మీ వివాహాన్నిగూడా హర్షిస్తుందనే నా నమ్మకం..." అంటూ ఆనంద తన్మయత్వంలో మైమరచిపోయినవాడల్లా, మళ్ళీ తేరుకుని కొనసాగించాడు రామదాసు. "మరైతే నాతో ఏమిటో పని తగిలినట్టు రాశావు గదమ్మా! అదేమిటో చెప్పలేదే!"

"చెప్పబోతుండగా మీరే అడిగేశారు. శరవణన్‌కైతే తల్లితండ్రులు, బంధుమిత్రులు అందరూ ఉన్నారు. నాకెవరూ లేరు గదా! నా పక్షాన కనీసం ఒకరైనా ఉండాలనుకున్నాను. పోగా, బాహ్య కారణం గూడా లేకపోలేదు. వివాహపత్రంలో సాక్షి సంతకం మీదే!" అంది ఎమరాల్డా.

❖ ఇండియా టుడే – 20 జనవరి, 1996. ❖

# రాయలసీమ గబ్బిలం

"దండాలు సామీ దండాలు! ఎండికొండ ఎలుపా, దండాలు! ఎద్దునెక్కే దేవరా దండాలు! పాపకరమాలు బాపేవాడా, దండాలు! ఊళ్ళుదాటి, ఏళ్ళుదాటి, కొండలు దాటి, కోనలు దాటి, పొలాలు దాటి, బీళ్ళు దాటి వొస్తిసామీ, యింత దూరమొస్తే! వచ్చినందుకు నిన్ను జూడగంటి! నేనొచ్చిన పని అట్లా వుండనీ! నిన్ను జూచిన కతన నాజలమ దన్యమైపోయ!" అంటా నేను పరమేశుడి పాదాలపైన వాలిపోయినాను.

కన్నుల్లోనుంచి దయారసం కురిపిస్తా, ఆయన చల్లగా నా కల్ల జూచినాడు, చూచి అనినాడు గదా-

"సంతసించినాను లేవే తబిసి పక్షీ! నీ భక్తికి మెచ్చినాను, చాలా దూరంనుంచి వచ్చినట్టు చెబుతున్నావు, ఏ వూరు మీది? ఏం పనిమీద వచ్చినా వింత దూరం?"

ఇంకేముంది! సామి సెలవిచ్చినాడు గదా! జంకుగొంకులు లేకుండా నేను నా సొదవెళ్లబోసుకుంటి - "మనవి చేస్తాను సామి! నువ్వు వుండే మంచుకొండలకు దచ్చినంగా భరతుడేలిన దేశముండాది గదా? ఆ దేశంలో తెలుగోల్లుండే తిల్లింగ బూములుండాయి గదా! ఆ బూముల్లో ఒక భూమి సామీ, రాయలసీమ! ఆ రాయలసీమలో మాది చిత్తూరు మండలం! చిత్తూరికి ఉత్తరంగా కడపకు బోయే తాౖరోడ్డుపైన నలభై నాలుగో మీటరురాయి దగ్గర తూరుపుగా మలుపుతిరిగి నాలుగ్గడియల సేపు నడిస్తే మా వూరొచ్చేస్తాది. నాగులేరు గట్టున వుండేది మావూరు. నన్నూరు కడపలుండేది మా వూరు! పెద్ద పెద్ద మీసాల మోతుబరులుండేది మా వూరు! నాగులపాడని పేరు! అదేసామి మా వూరు!"

"మంచిది, మంచిది. ఇంతకు నీవు వచ్చిన పనేమిటో? చెప్పుకో" అన్న ఎచ్చరిక చెప్పినాడు సామి.

"చిత్తం దేవరా! జరిగిందీ, జరగబోయేదీ అన్నీ తెలిసిన మహన్నతభావుడివి! నీకు తెలియని వివరాలా! అయినా అడిగితివి కాబట్టి చెప్తావుండా! మర్రిచెట్టు దాపున ఆముదం చెట్టు మాదిరిగా, పెద్ద కొండపక్కన చిన్న గుట్ట మాదిరిగా, ఏనుగు నీడలో మేకపిల్ల మాదిరిగా ఆ పెద్ద వూరికి కూతవేటుదూరంలో ఒక చిన్న వూరు, వెలివాడ - అంటారు దాన్ని! ఆ పెదవాడకు, ఈ వెలివాడకు మధ్యన ఎప్పుడో ఓబికాలంలో చోలరాజులు కట్టించిపోయిన ఒక గుడి వుంది. నేనుండెద్దైతే ఆ గుడిలోనే గానీ, ఆ దేవుడి పేరు చెప్పాలంటే మాత్రం నోరు తిరగదు. ఎరామరేశ్వరుడో, ఏందో, ఆ గుడిపనిపైన నన్నొకరు పంపించినారు సామీ రాయబారం."

పరమశివుడి కన్నుల్లో ఆలోచన చిందులు ద్రొక్కింది. నుదురు కుచించుకపోయి మూడోకన్ను మూతపడింది. గొంతు సవరించుకుంటూ, ఆయన అనినాడు గదా "నువ్వుండవే రాత్రించరీ! గబ్బిలాల రాయబారమంటేనే నేను ఖంగుదిని పోయినాను. యాభైయేళ్ల క్రితం ఒకసారి యిట్లాగే జరిగింది. ఆ గబ్బిలం వడ్డించి పోయిన వడ్డింపులు నాకింకా అరగనేలేదు"...'

"మన్నించాల సామీ! అప్పుడొచ్చింది నేను గాదు. అది కోస్తా గబ్బిలం, నేను రాయలసీమ గబ్బిలాన్ని!" అని సరిది చెప్పుకొంటి.

"ఏ గబ్బిలమైతే నేమిలే! గొంతు కోసుకోడానికి ఏ కత్తి అయిన ఒక్కటే గదా! అని ఎడాపెడా దులిపిపారేసిందనుకో! నరుల్లో కొందర్ని ముట్టుకుంటే అంటు తగుల్తుందని చెబ్తూ, మానవులు పందుల్ని, నందుల్ని, పాముల్ని పూజచేయడంలోని ఆంతర్యమేమిటి స్వామీ' అని ఆరా తీసింది. దురాచారాల్ని ఖండించని చదువేం చదువని ఈసడించి పారేసింది. పుట్టరానిచోట పుట్టినందువల్ల ఎన్నెన్ని కోయిల పాటలు, ఎన్ని వెన్నెల రాత్రులు, ఎంతటి కమ్మ నెత్తావులు, ఎంత కాంతి, ఎంత శాంతి వృథా అయిపోయిందో గదా అని ఎత్తిపొడిచింది. కడగొట్టు జాతులనబడేటి వాటి కన్నీటి మబ్బులు పిడుగులైరాలి ఈ సమాజాన్ని బద్ధలు చేయవా అని గద్దించింది. సర్వజీవులూ నీకు సమానమని చెబుతారే, అయితే ఈ అవలక్షమేమిటి సామీ? అని నిలదీసి అడిగింది. ఎందుకు లేవే తబిసి గుబ్బెతల రాణి! దాని వాదానికి తట్టుకోలేక నా హిమశైలసింహాసనమే కదిలిపోయింది. తలపైని చంద్రరేఖ సైతం మారిపోయ్యేటట్టు నా బుర్ర వేడెక్కిపోయింది. ఆకారం చిన్నదే! ముక్కూ మొగమూ వేర్వేరుగా కానరాని చీకటి ముద్దలాగే వుంటుంది. అయితేనేమి? అలిసిపోక, సొలసిపోక, పట్టిన పట్టు విడవక నా లోకానికి వచ్చింది గదా! కదలిక లేని నిండు చెరువులో గుండ్లు పడవేసి పెద్ద సంచలనం కలిగించింది గదా! ఎలాగో దాన్ని సముదాయించి పంపించేసేదాకా నాకు ఊపిరాడలేదు గదా! చాలని దానికి మళ్లీ నువ్వొక్కతెవి దాపురించావా? నువ్వేం రాయబారం తెచ్చావే, నా మ్రింగరాని కవళ్లమా!" ఆక్రోశించినట్టుగా అడిగినాడు మూడు కన్నుల సామి.

'మహన్నబావుడికి కోపం వచ్చేసినట్టుందిరా బాబూ' అని నేను 'మన్నించు తండ్రీ' అని చెంపలు వాయించుకుంటిని. 'లోకాలనేలేటి సామి! మహాదేవ! ఆలించినా నీవే! పాలించినా నీవే! దీనులను బ్రోవగా, ఆర్తులన్ కావగా నీవే గదా దిక్కు...' అని ఒక దండకం దండకం అంతా వల్లం చేస్తి. బోలా శంకరుడు గదా! శాంతిమూర్తి అయిపోయినాడు పాపం! 'సరేలేవే గబ్బిలయా! నువ్వు వచ్చిన పనేమిటో చెప్పు' అని ఆనతిచ్చినాడు.

"ఏముంది సామీ! కోస్తా గబ్బిలమొచ్చిపోయి చాలాకాలమైంది గదా! అయినా పరిస్థితులు పూర్తిగా మారిపోయినట్టు చెప్పడానికి వీల్లేకుండా వుంది. నేనేమో కోస్తా గబ్బిలమంత చొరవైనదాన్ని గాకపోతిని, తమరు కోప్పడితే నాకు నోరు పెగలదు, మనసుంచి, నెనరుంచి కొంచెం చెవి ఒగ్గివింటే మనవి చేసుకుంటా...?"

"పరిస్థితులు మారలేదా!" అక్కజవతి పోతూ కొనసాగించినాడు సామి. "వర్ణ భేదాల పేరుతో ఎవరికీ అన్యాయం జరగరాదని, సమస్త జనులకూ సాంఘిక న్యాయం ఒకేరకంగా రూపొందాలని నేను చెప్పి పంపినాను గదా! ఈ ధర్మాన్ని నెలకొల్పేందుకు రాట్నాన్ని మోసుకుంటూ, దుడ్డుకర్ర చేతబట్టుకుని ఒక గుజరాతు ముసలాయన గూడా వచ్చినాడు గదా? గాంధీలు, వినోబాబావేలు, అంబేద్కర్లూ! అలా ఎందరో పూనుకున్నా మీ పరగణాల్లో సమాన న్యాయం, నెలనాటుకోలేదా?" అంటూ వాపోయినాడు.

"ఏం జెప్పుదును సామీ! అంగవంగ కలింగ...... అంటూ యాభై రాజ్యాలున్నాయని గదా పెద్దలు చెప్పింది! మా రాయలసీమ ఆ లిస్టులో చేరని యాభై ఏడో దేశమైపోయింది. నాలుగు పడగల ఐందవ నాగరాజుని గదా మునుపటికి కోస్తా గబ్బిలం చెప్పింది! ఇప్పుడా నాగరాజు కులాల పడగలెత్తింది. పేర్లెందుకుగాని మా వూరనేదే ఒక రాజ్యమైతే

దానికి రాజు పెదరెడ్డి, మంత్రి పెదనాయుడు. కుర్చీలు మారితే మారొచ్చు. అప్పుడు నాయుడు రాజు, రెడ్డి మంత్రి, గ్రామ పంచాయితీ వాళ్లదే. ఒంటి కిటికీ వాళ్లదే! చౌకబియ్యం డిపో వాళ్లదే! గుడి మణియం వాళ్లదే, ఊళ్లో మద్దెస్తాలూ వాళ్లవే, వాళ్లు చేసింది చట్టం. చెప్పింది న్యాయం. ఇంకొకరి మాట ధండలాయించగూడదు. నేనొచ్చింది దేవలం పని పైనా గదా! ఆ సంగతే మనవి చేస్తా. గుడికి సంబంధించి పూజారి మాన్యం వుంది. తిరణాల దినాల్లో దేవుడి పల్లకీ మోసేవాళ్ల మాన్యం వుంది. తప్పుతప్పు. ఒకప్పుడుండేది. ఇప్పుడా మాన్యాలన్నీ పెదబాబుల కనుతాల్లో కలిసిపోయినాయి. గుడి రివాజులన్నింటినీ మావూరి ధర్మప్రభువులు రద్దుచేసి పారేసినారు. ఏడాదిలో మున్నూట అరవై నాలుగు రోజులు సింహద్వారం బందు. ఒక శివరాత్రికి మాత్రం తెరుస్తారు. పడమటి వైపు పారిగోడ నాలుగు బారల మేరకు కూలిపోయింది. పొరుగూరి బాపనాయన ఒకడు ఆ దోవగుండా వారంలో ఒక సోమవారం నాడు మాత్రం వచ్చి దేవుణ్ణి కడిగి, ఓ పువ్వు తలపైన వేసి, ఒక పట్టెడన్నం పెట్టి తన దారిని తాను వెళ్లిపోతాడు. పొద్దుపోయి చీకటి పడినాక ఒక ముసలమ్మ లోపలికొచ్చి ఇనపప్రమిదలో ఒక గంటెడు నూనె పోసి దీపం వెలిగించి పోతుంది. అరగంట సేపట్లో చమురైపోతే, ఆ దీపం కాసేపు రెపరెపలాడి కొండెక్కిపోతుంది. ఆ పైన దేవుడికైనా, నాకైనా మిగిలేది చిమ్మచీకటే! పూజలేదు, ప్రసాదం లేదు, దీపం లేదు, దూపం లేదు. ఆ దేవుడికొచ్చిన గతి చూస్తావుంటే నా గుండె తరుక్కుపోతావుంది. అందుకని జెప్పి అక్కడుండలేక గుడిదాటి, పారిగోడదాటి, నేను చక్కా వెలివాడ సందు గొందుల్లోకి పారిపోతూ వుంటాను – పారిపోతూ వుండగా, ఏం జరిగిందంటే..." "ఏం జరిగింది?" స్వామి ఆత్రంగా అడిగినాడు.

"వెలివాడ నడివీధిలో ఒక రచ్చవుంది సామీ! ఆ రచ్చపైన కుక్కి మంచంలో పడుకోనుండే పైడి మల్లన్న ఎట్లనో నా పొలకువ పసి కట్టేసినాడు. గబ్బిలమా, గబ్బిలమా! నా మనవి ఒకటి వినవా! నేను చెప్పినట్టు చేయవా! అంటూ ఒకటే ప్రాధేయ పడిపోయినాడు."

"ఏమంట? పైడి మల్లన్న కొచ్చిన కష్టమేమైనా వుందా?" స్వామి విచారణ చేసినాడు.

"నేనూ అదే మాట అడిగినాను సామీ! 'చూడు మల్లన్నా! గవుర్మెంటు మరెన్నో విధాలుగా సాయపడతావుంది గదా! వానాకాలం వస్తే వురుస్తుందనుకో అయినా తలచాటుగా ఇండ్లు కట్టించి యిచ్చింది గదా? మీ బిడ్డలకు ఉచితంగా చదువు చెప్పించే ఏర్పాటు చేసింది గదా? మీ సంగతలా వుంచు, మీ వోట్లకోసమైనా నాయకులనబడేవాళ్లు మిమ్మల్ని మంచిగానే చూచుకోవాల్సిన అవసరం వుంది గదా! అయిదేండ్లకొకసారి వోట్ల పండగలొచ్చినప్పుడైనా వాళ్లు మీ వాడలో అడుగుపెట్టి, మీ అరుగులపైన కూచుని, మీరిచ్చే నీళ్ళు తాగుతారు గదా! ఎక్కడైతే వుండాలో అక్కడే వుండిపోయేటట్టుగా, అంతకంటే ఎత్తులకు ఎదగవలసిన అవసరం లేకుండా మీరు బతికి బట్టకట్టడానికి వీలుగా రెండు రూపాయల బియ్యంగూడా యిస్తున్నారు గదా! ఇవన్నీ చాలక మీకింకా ఏం కావలసి వచ్చింది?' అని నేను విదిలించి పారేసినాను. అప్పుడు పైడి మల్లన్న ఏమనినాడో తెలుసునా సామీ"?

"అంగట్లో అన్ని వుంటే ఏం లాభం లేదే గబ్బిలాల దొరసానీ, అల్లుడినోట్లో శని వుండిపోయిందే! కాశీలో విశ్వనాధుడు కుల బేదాలు లేకుండా మనుషులనందరినీ

చేరదీసుకుంటూ వుండాడు. తిరుమలలో ఏడు కొండలవాడి గుడిలోకి లచ్చలాది జనం వెళ్లొస్తావుండారు గదా! వాళ్లల్లో ఎవరినీ 'నువ్వే కులం వాడివి' అని అడిగే వాడు లేడు. ఇంకా రామేశ్వరం, చిదంబరం, తిరువన్నామల, బద్రాచలం, శ్రీశైలం, సిమ్మాచలం... యిట్లా ఎన్నో దేవళాలుండాయి గదా! అక్కడెక్కడా కులం పేరుతో గుడిలోకి పోయే వాళ్లని అటకాయించేవాళ్లు లేరు. ఎటొచ్చీ మనవూరి గుడి సంగతే అంతా తారుమారుగా తయారైంది. ఊళ్లో వాళ్ళేమో దేవుడి ముఖమే చూడడంలేదు. వెలివాడ వాళ్లేమో గుళ్లో అడుగుపెట్టడానికి వీల్లేదు. 'అమ్మ తానూ పెట్టదు, అడుక్కో తిననివ్వదు' అన్నట్టుంది గుడిలో దేవుడి విషయంలో గ్రామ పెద్దల పెత్తనం! నాకైతే దేవుడి పరిస్థితి తలుచుకుంటే గుండె తరుక్కుపోతా వుంది. ఏం చేసినాడని పాపం, ఆయనకీ శిక్ష?"

"జీవుడికైనా, దేవుడికైనా నోరుండాలే మల్లన్నా! నోరులేకపోతే, యింతేకత" అంటూ ఓదార్చబోయాను.

"దిక్కులేనివాళ్లకు దేవుడే దిక్కంటారు గదా! ఆ దేవుడికే దిక్కులేకపోతే ఏం చేయాల? ఎవరితో చెప్పుకోవాల?" అని సంకట పడిపోయినాడు మల్లన్న.

నేనేమీ మాటాడలేదు. ఆలోచిస్తా వూరకుండిపోతి.

"మునపటి కిట్లనే, ఇక్కట్లు ముమ్మరమైపోయినప్పుడు నీలాంటి గబ్బిలం ఒకటి నేరుగా కైలాసానికే వెళ్లి వెండికొండ వేలుపుతోనే మొరపెట్టుకునిందంట! ఇప్పుడు నువ్వు మా తరుపున ఆ పనిచేసి పెట్టాల! నిన్ను పిలిచిందందుకే. ముక్కంటి వుండే ఎత్తయిన కొండ యిక్కడికి శానాదూరమే. అయినా సరే! తలుచుకుంటే నువ్వు వెళ్లి రావొచ్చు. వెళ్తే మనపనీ జరిగినట్టుంటుంది. నీకున్నూ పున్నెం కలిసొస్తుంది..." అని రకరకాలుగా బతిమాలుకున్నాడు మల్లన్న.

"అదీ సామీ సంగతి! మల్లన్న పనుపున నేనిట్లా వచ్చినాను. ఇంక వెలివాడ జనాన్ని నీటముంచినా, పాలముంచినా నీదేబారం" అని మనవి చేసి, సామి యిచ్చే బదులు కోసం కాచుకుని వుండిపోయినాను.

ఉండి వుండీ తల పంకిస్తూ ఆయన సెలవిచ్చినాడు. "అవగతమైంది లేవె తబిసి పక్షి! అన్ని సంగతులూ ఆకళించుకున్నాను. నువ్వెళ్లిపో, తాను కోరిన కోనలో వాన కురిసే రోజు చేరువలోనే వుందని మల్లన్నతో చెప్పు. మానవ జాతికి శుభం కలుగుగాక!"

***

నాగులపాడెక్కడ? నాగభూషణుడి నెలవెక్కడ? కైలాసానికి వెళ్లి రావడానికి ఎంతకాలం పట్టిందో ఎరుకలేదు. పగటి వేళల్లో ఏ చెట్లల్లోనో, పొదల్లోనో, ఇండ్ల పైకప్పుల్లోనో తలక్రిందులుగా వ్రేలాడుతూ, రాత్రుల్లో మాత్రం ప్రయాణం చేసి, ఆఖరుకెప్పుడో ఎట్లనో మా వూరు చేరుకున్నా. ఊరి వాలకంలో మార్పొచ్చినట్టుగా తోచి, అదేందో తెలుసుకుందామని, వీదులన్నీ ఒకసారి తిరిగేసినా. ఆశ్చర్యంతో ఊపిరాడ లేదనుకోండి. గుడిలో పడమటి వైపు పారిగోడ కూలిపోయిందన్నారు గదా! దాన్నెవురో ఎప్పుడో తిరిగి కట్టించేసినారు. సింహద్వారంలో తలుపులు తెరిచే వున్నాయి. ద్వార బంధానికి మామిడాకుల తోరణాలు వేలాడుతున్నాయి. దేవళమంత సుబ్బరంగా, తుడిచిపెట్టిన అద్దం మాదిరిగా వుంది. వెలిగిపోతున్న కరెంటు దీపాలతో గుడి ఆవరణంతా పట్టపగల్లా వుంది. సాతాని నాంచారయ్య తట్టనిండా పువ్వులు తెచ్చి పెళ్ళాం బిడ్డలతో

కలిసి దండలు కడుతున్నాడు. పెదరెడ్డిగారు, పెదనాయుడుగారు కూచున్నచోట కూచోకుండా నిల్చున్నచోట నిల్చోకుండా కార్యకర్తలకు పన్లు పురమాయిస్తూ అటూయిటూ తెగ తిరగేస్తున్నారు. ఏమిటబ్బా ఈ విచిత్రమనుకుంటే, ఎవరినన్నా అడుగుదామని గర్భగుడిలోకి దూసుకపోయినాను. బూజుదులిపి, దట్టంగా సున్నం కొట్టేసినందువల్ల అక్కడుండాల్సిన మా వాళ్ళందరూ ఏమైనారోగానీ అయిపులేకుండా పోయినారు. వెంటనే వెలివాడ వైపు పరుగుదీసినా. వీదులకడ్డంగా మూరెడు వెడల్పున్న తెల్లటి గుడ్డల్ని తాళ్లతో బిగించి, మనిషి తలకాయంత అక్షరాల్తో ఏందేందో రాసేసినారు. మొత్తంపైన ఏందో జరిగింది. లేదా జరగబోతావుంది. వాళ్లనీ వీళ్లనీ అడగడమెందుకని నేరుగా రచ్చ దగ్గరికే దారి తీసినా. నా రెక్కల చప్పుడు వినేటప్పటికి మల్లన్న చప్పున్న లేచి కూచున్నాడు. "అబ్బో గబ్బిలమా! ఎన్నాళ్ళకు కనిపిస్తివే నా బంగారు నేస్తమా! బాగుండావా! ప్రయాణం బాగా జరిగిందా? ఎప్పుడొస్తివి?" అని పలకరించినాడు.

"ఏందిలే మల్లన్నా! ఎన్నడిగి ఏం లాభం? వెళ్లిన పని కాయా, పండా అని మాత్రం అడక్కపోతివి" అని నిష్ఠూరపడిపోయినాను.

"నువ్వెళ్లిన పని నెరవేరిందని నెలరోజులప్పుడే తెలిసిపోయింది గదా! నారాయణ జిల్లా కలెక్టరైనాడు. మొన్ననే చార్జి పుచ్చుకున్నాడు. మొదటి పనిగా రేపు మన వూరికొస్తున్నాడు. మన వూరి వేలుపు ఏ రామేశ్వరుడికి అభిషేకం చేయించడంతో డ్యూటీ మొదలుపెడతాడు......"

"అరరే, అవునా! అట్టనా!" అంతకు మించి మాటలు పెకల్లేదు. ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అయిపోయినాను.

భళ్లున తెల్లారింది. కిటకిటలాడిపోతూ జనం అంకాళమ్మ గుడి దగ్గర చేరిపోయినారు. పై వీధి నుంచి రెడ్లొచ్చినారు. మిట్ట వీధి నుంచీ నాయుళ్లొచ్చినారు. కట్టకట్టినట్టుగా వృత్తి పని వాళ్లందరూ వచ్చినారు. వెలివాడ జనమంతా గుడిలోనే వున్నారు. ఉదయం ఎనిమిది గంటలకల్లా బిలబిలమంటూ రెండు, మూడుకార్లు పది, పన్నెండు జీపులూ వచ్చేసినాయి. "కలెక్టరుగారికి జై. కలెక్టరు గారికి జై" అని మిన్నెగిరిపోయేటట్టుగా జనం జయ జయలు పలికినారు. కలెక్టరుగారు లోపలికి వెళ్లి, అభిషేకం చేయించి, తిరిగి వచ్చి పందిరి క్రింద కూచున్నారు. జనం బారులు తీరి ఒక్కొక్కరుగా లోపలికి వెళ్ళి దేవుణ్ణి సేవించుకుని, తిరిగి వచ్చినారు. వరుసలో నిల్చున్న కొందరివైపు చూచి ముఖం చిట్లించుకున్నవారు లేరు. 'వీల్లేదు నీవు లోపలికి వెళ్లడానికి వీల్లేదు' అని అటకాయించిన వాళ్లు లేరు. 'నేను ముందు, నువ్వు వెనుక' అని హక్కు గుప్పించిన వాళ్ళు లేరు. దర్మం నాలుగు పాదాలతో నడవడం ఆరంభమైనట్టే తోచింది.

'ఇదీ పద్ధతి! ఇలా జరగాలి' అని కలెక్టరుగారు పెదవి విప్పి చెప్పలేదు. చెప్పకపోయినా సరే, ఏది ఎలా జరగాలో అలాగే జరిగిపోయింది.

ఇంతకూ ఈ కథ చివర చెప్పాల్సిన ఒక మాట మాత్రం వుండిపోయింది. కలెక్టరు నారాయణ ఎవరోగాదు. పైడి మల్లన్న కుమారుడే.

❖ సీమసాహితి – ఏప్రిల్, 1996 ❖

# కొండారెడ్డి కూతురు

నాగతులసి కొద్ది క్షణాలపాటు నివ్వెరపోయింది. "ఎక్కడో చూచినట్టుందే! ఎవరబ్బావీళ్ళు?" అనుకుంటూ విస్తుపోయింది. ఆగంతుకుల్ని పోల్చుకున్న తర్వాతకూడా ఆమెలో విస్మయం తగ్గుముఖం పట్టిందికాదు. "ఇంతదూరం ఎందుకొచ్చారు వీళ్ళు? చిన్న పనులపైన ఊరు విడిచి దేశం పైన పడేవాళ్లు కాదు కదా! కాలు దీసి ఇలా వచ్చేశారంటే అందుకు ప్రబలమైన కారణం ఏదో ఉండాలి కదా!" అన్న విచికిత్సకు లోనైంది. ఆలోచనలిలా ముమ్మరిస్తున్నా వచ్చిన వాళ్ళను పరామర్శించడం మాత్రం ఆమె మరిచిపోలేదు.

"రండి రండి. ఏం కదిరప్పా బాగున్నావా? మల్లేసూ, క్షేమమేనా? మీ ముఖాల్లో హంగు మీసాలే గదా! అవి తీసేసేటప్పటికీ ఆకారాలే మారిపోయాయి. ఒక పట్టాన గుర్తు పట్టలేకపోయాను. ఇంటి కెందరెందరో వస్తుంటారు. బయటికి వెళ్తే వీధుల్లోను, స్టేషనులోనూ చాలామంది కనిపిస్తారు. కానీ మనూరివాళ్లు కనిపిస్తే కలిగే ఆనందమే వేరు కదా! ఎవరైనా కనిపిస్తారేమోనని చూచి చూచి కళ్లు కాయలు గాచాయి. ఎలాగైతేనేమి! నేనొకతెని వున్నానని మీకైనా జ్ఞాపకం ఉంది. అదే పదివేలు. కూర్చోండి. ఇదిగో సింగమ్మా! మా వూరి వాళ్లొచ్చారు. మంచినీళ్లు తీసుకురావూ?"

"ఇట్లా వచ్చేసినావు గానీ, కండ్లల్లో మెదులుతున్నట్టే వుండేదానివి! నిన్నెట్లా మరిచిపోగలం చిన్నమ్మా! బండి దిగ్గానే కాళ్లకు చక్రాలు కట్టుకున్నట్టుగా యిట్లా దొర్లుకొచ్చేసినాం". అన్నాడు కదిరప్ప. అతడు మాటాడుతుంటే డబ్బాలో గులకరాళ్ళు వేసి గిలకరించినట్టుంది.

సింగమ్మ ఓ పెద్ద చెంబుడు నీళ్లు, లోటాతోబాటుగా పట్టుకొచ్చింది. బాగా దాహం గొని వున్నారేమో, ఆగంతకులు గుక్కపట్టినట్టుగా నీళ్ళంతా లాగించేశారు.

"ఇంకా నిలబడే వుండిపోయారే! ఫరవాలేదు. కూచోండి. బెంచిపైనే కూచోవచ్చు..." అంది నాగతులసి.

వచ్చిన వాళ్లు బెంచివైపోసారి చూచారు. తరువాత ఒకరి ముఖం ఒకరు చూసు కుంటూ, కళ్ళతోనే మాట్లాడుకున్నారు. ఆపైన మరబొమ్మల్లా తటాలున బెంచీపైన కూర్చున్నారు.

"మన ఊరి చెరువు నిండిందా? వరి పంటల్లో ఫలసాయం బాగా వచ్చిందా? వేరుశనగ పంటకు అదునులో వానలు కురిశాయా? మొగిలేటిలో నీళ్లున్నాయా? నిరుడు మన వూళ్లో గంగ జాతర బాగా జరిగిందా?" ఇలా ఎన్నో ప్రశ్నలు గుప్పించింది నాగతులసి. అయితే చెరువులు నిండినా నిండకపోయినా, పంటలు పండినా పండకపోయినా ఏది ఏమైనా కదిరప్పకుగానీ, మల్లేసుకుగాని వచ్చేది, పోయేది ఏమీ వుండదని నాగతులసికి తెలుసు. అవును, లేదు అని ముక్తసరిగా జవాబులు చెప్పడమేగాని అడిగిన ప్రశ్నలపట్ల ఆసక్తి లేకపోవడం గమనించాక, ఆమె గుండెలోనుంచి అసలు ప్రశ్నే ఊడిపడింది. "పోనీలే, మా అయ్య బాగున్నాడా కదిరప్పా? ఆయన ఆరోగ్యానికేమీ ఢోకా లేదుకదా?

ఎప్పుడైనా నన్ను గురించి తలుచుకోడం కద్దా? మాట మాత్రమైనా మీతో అన్నారా?"

ఈ కొద్ది మాటలు ముగించేసరికి నాగతులసి కంఠంలో శోకపు జీర పొరాడింది. చెమ్మగిల్లిన కళ్లను పమిట చెరుగుతో తుడుచుకుంటూ ఆమె ముఖం క్రిందికి దించుకుంది.

"కన్న కూతురివి కదంటమ్మా! నువ్వేమైనా పగదానివా? తలుచుకోకుండా వుంటాడా? అదేంలేదులే. లేదంటే బయటపడి మాట్లాడడు."

బాగా తెలిసిన వాళ్లు వేషాలు వేస్తే అందులో వాళ్లే కనిపిస్తారు గానీ, పాత్రలు కనిపించవు. కదిరప్పను, మల్లేసును గౌను తొడుక్కున్నప్పటి నుంచీ ఎరుగును నాగతులసి. వాళ్ళ మాటల్లో ఓదార్పుకోసం చెప్పేవేవో, అంతరంగంనుంచీ దూసుకొచ్చేవేవో గ్రహించడం ఆమెకు కష్టసాధ్యమేమీ గాదు. కట్టుకున్న భార్య చావు బ్రతుకుల మధ్య సతమత మవుతుండగా ఉంపుడుగత్తె ఇంట్లో తాగి పడివుండినవాడు, తన తోబుట్టువు బ్రతుకును చిమ్మచీకటిలో కడతేర్చినందుకు బావమరిది ఆగ్రహం వెలిగ్రక్కితే, ఆ నేరానికి శిక్షగా అతడి అయిదెకరాల అరటి తోటను నేల మట్టానికి నరికించినవాడు, నోరూరి ఎవరో మామిడి తోపులో ఓ కాయ కోసుకుంటే వాడికి వట్టెవట్టెగా తలక్షవరం చేయించి పలకల దరువుతో పది వూళ్లు మెరవణి తిప్పించినవాడు, ఫర్మానా జారీ కాగానే తన పొలంలోకి మందల తోలించలేదన్న అక్కస్సుతో మందళ్లనందరినీ అడవిలోకి తరిమి, రాత్రి రాత్రంతా గొర్రెల సమూహాల్ని అడుసు మడిలో నిలబెట్టి వాటి సంఘ మరణానికి కారకుడైనవాడు, పొరుగూరి మొదలియార్లపైన కక్ష పెంచుకుని నాలుగు కుటుంబాలకు మగదిక్కులేకుండా చేసినవాడు – అలాంటి కటిక గుండెల కసాయి వాడైన పల్లిపట్టు కొండారెడ్డికి కన్నకూతురు పట్ల మాత్రం దయాదాక్షిణ్యాలు, జాలీ కరుణా ఉంటాయా? ఏం మాట! అందులోనూ తను ఆయన చెప్పుచేతల్లో వుండకుండా ఒక దారంట వెళ్లే దానయ్యతో లేచి వచ్చేసింది కదా!

ఉన్నుంగున తాను పరధ్యానంలోకి జారిపోయినట్టు గుర్తించి, మళ్లీ పైకి తేలి వచ్చింది నాగతులసి. "అవును. ఈ వేళప్పుడు మనవైపునుంచి బండ్లే రాలేదే! మరెందులో దిగారు?" అని ప్రశ్నించింది.

నేను చేతలవాడినేగానీ మాటలవాణ్ణి కాను – అన్నట్టుగా మల్లేసు గోడవైపు తిరిగి కూచున్నాడు. దొర్లిన పొరబాటుకు సంజాయిషీ చెబుతున్నట్టుగా కదిరప్పే కొనసాగించాడు.

"మూడు గంటలకే వొచ్చినాములే చిన్నమ్మా! ఏవో ఇవరాలు తెలుసుకోవలసుండి బజారుకు పోతిమి. అక్కడ్నే పొద్దుపోయింది. ఇల్లెక్కడో యిశారణ జేసి యిక్కడ కొచ్చేటప్పటికి బాగా సీకటి పడిపోయింది..."

"బజార్లో వివరాలా కదిరప్పా! ఏదైనా కొనే పని వుందా?"

"అదే అదే! తెట్టు, ఉలవపాడు, టంగుటూరు, ఈ పాయకట్టులో సపోటా తోటలెక్కువ గదమ్మా! మన ప్రక్కల ఆ పండ్లకు బలే గిరాకీ వుందిలే! పైగా తిరుతణిలో ఆడి కృత్తిక ఉత్సవాలు జరుగబోతావుండాయి. దొరికినన్ని పండ్లుకొని గంపల్లో పెట్టించి బండ్లో ఎక్కించుకుపోయి అమ్ముకుందామనుకున్నాం. మనుషులన్నాక ఏదో ఒక పనిచేసి నాలుగు రూకలు సంపాదించాల గదా!"

"అయ్యో పాపం! నాలుగు రూకలకోసం మీకిలాంటి నాలీసుపన్లు చేయాల్సిన అవసరం వచ్చిందా?" అన్నట్టు నాగతులసి తన చూపులతోనే వాళ్ల పైన దైన్యం కుమ్మరించింది. "భలేవాళ్లే! చేతిలో వెన్న పెట్టుకొని నెయ్యికోసం ఊరంతా తిరిగేవాళ్లు ఉంటారా ఎక్కడైనా? ఈ మాట మా రెడ్డిగారి చెవిలో వేస్తే చాలదా? ఆయన కిక్కడ ఏ ఊళ్లో ఎవరి తోటలో ఏ రకం సరుకు దొరుకుతుందో క్షుణ్ణంగా తెలుసు. ఆయనద్వారా వచ్చారని తెలిస్తే నికరమైన ధరకు పళ్లు బుట్టలు బుట్టలు మీ ముందుకు వచ్చేస్తాయి. ఒకమాట జ్ఞప్తిలో ఉంచుకోండి. మీరు దోరకాయలే కొనాలి. మీరక్కడ బుట్టలు విప్పేసరికి అవే పక్వానికి వస్తాయి. పళ్లు కొన్నారో, రోటిలో వేసి దంచినట్టుగా బుట్టంతా అట్టకట్టిపోతుంది..."

"సరేలే చిన్నమ్మా! నువ్వు చెప్పినట్టే చేస్తాం. రెడ్డిగారికొక్కమాట చెప్పి మాకు నువ్వే సిఫార్సు చెయ్యాల."

"ఎందుకు చెప్పను. ఏదో పెళ్ళి నిమిత్తం నెల్లూరు వెళ్లారు. తొమ్మిది గంటలబండికి వచ్చేస్తారు. పొలాల్లో ఒంటిల్లుకదా. ఇరుగు పొరుగు ఉండరు. అందుకనే ఎట్టి పరిస్థితుల్లోనూ రాత్రుల్లో ఇంటికి రాకుండా ఆగిపోరు."

వచ్చిన పనిలో సగం పూర్తయిన సంతృప్తి కదిరప్ప ముఖంలో కనిపించింది. అయినా అంతలోనే ఒక సందేహం. "అవును గానీ చిన్నమ్మా. ఇంట్లో మీ మామగారు ఒకాయన ఉండాలి కదా. ఆయన ఏ వూరు వెళ్ళినట్లో?"

నాగ తులసి ముఖంలో దిగులు మబ్బులు కమ్ముకున్నాయి. "వెళ్ళిపోయారు. మూడు నెలలయింది ఆ ఊరు వెళ్లిన వారెవరూ తిరిగి రారు" అంది.

కొద్ది నిమిషాలు మౌనంగా గడిచిపోయాక హఠాత్తుగా కర్తవ్యజ్ఞానం కలిగినట్లుగా పైకి లేచింది నాగతులసి – "సరే మీరు కాళ్లు చేతులు కడుక్కురండి. ఏమి తొందర? భోజనాలయినాక మాట్లాడుకోవచ్చు. సింగమ్మా వీళ్లకు స్నానాల గది చూపించు..."

ఆమె నాలుగడుగులు వేసీ వేయకముందే ఒక ధర్మసందేహం వెలిబుచ్చాడు కదిరప్ప. "చిన్నమ్మా! ఈ సంచీ ఎక్కడ పెట్టించమంటావ్?"

నాగతులసి కొంచెం విచలితురాలయిపోయి వెంటనే తేరుకుంది. "మీకలాంటి అనుమానాలేమీ అక్కర్లేదు. మా ఇంట్లో ఏ వస్తువు ఎక్కడ పడేసినా చెక్కుచెదరకుండా ఉండిపోతుంది. పోనీలే, అంతగా విలువైన వస్తువులు ఏమయినా ఉంటె, ఈ గదిలో పెట్టుకోండి. మీరు పడుకోబోయేదికూడా ఇక్కడే."

సింగమ్మ పీటలు వేసింది. విస్తర్లు పరిచింది. భోజనం దినుసులు అమర్చిన పళ్లెరాలు, గిన్నెలు తెచ్చి విస్తర్లకెదురుగా పెట్టింది. వాటి కావల గృహిణి కోసం మరో పీట వేసింది.

స్నానాల గదిలోనుంచి ఈవలికొస్తూ వారించబోయాడు కదిరప్ప – "అదేంది చిన్నమ్మా! నువ్వు కూర్చుంటివా? పనిమనిషి వడ్డిస్తే పోలా."

"కాదులే కదిరప్పా! 'ఇల్లాలు వడ్డిస్తేనే భోజనం చేసేవాళ్లకు తృప్తి' అంటూండేది మా అమ్మ. మీరు కూర్చోండి. ఆకులపైన నీళ్ళు చల్లుకోండి. మనవైపు అంతగా అక్కర్లేనివి,

వీళ్లకు అవి లేనిదే పూట గడవనివి ఏవో తెలుసా? పచ్చళ్లే! రుచి చూసి ఎలా వున్నాయో చెప్పాలి. ఇవి వేయింపులు. ఇక్కడి వాళ్ళేమో వీటిని కూరలు అంటారు. మనకు అన్నం కావాలి అంతే. ఎలాంటి బియ్యమైనా పట్టించుకోం. ఇక్కడ అట్లాకాదు. నెల్లూరు బియ్యపన్నం చూశారా! తుమ్మిపువ్వులు రాసి పోసినట్లుంది. ఉండండి ఉండండి. పచ్చళ్ళలోకి నెయ్యి వేసుకోవడం తప్పనిసరి. ఎందుకు తప్పనిసరో మీకు తెలుస్తుంది. ఈ రోజు వంకాయ కూర చేశాను. దీన్ని మనవైపేమో నూనె వంకాయ అంటాము. వీళ్లు గుత్తి వంకాయ అని అంటారు. మారెడ్డిగారికి ఇదంటే చాలా ఇష్టం. రసంకూడా ఉంది మరి. అయ్యో! బాగా ఆకలిపడి వచ్చినట్లున్నారే. అప్పుడే చివరిదాకా వచ్చేశారన్న మాట! ఇదిగో పెరుగు సంగతి మరిచిపోవద్దు. నెల్లూరు ఎండలకు, వీళ్ళ భోజనంలో కారాలకు పెరుగన్నం తినకపోతే నిభాయించుకోడం కష్టం. సింగమ్మా ఊరగాయ పట్టుకురా. అలాగే పళ్ళేమైనా ఉన్నాయేమో చూడు..."

అతిథులు సుష్టుగా భోజనం చేసి పైకి లేచారు. వంటగదిలో ఒకటి రెండు పనులు సరిపెట్టుకుని నాగతులసి మళ్లీ హాల్లోకొచ్చేసరికి కదిరప్ప, మల్లేసూ చెరొక కిటికీ దగ్గర నిలబడి చీకట్లోకి చూస్తున్నారు.

"అలా చూస్తే మీకేం తెలుస్తుంది? పైకి వెళ్లాలి. ఒకవైపు ఊరు, దానికంచుగా రైల్వే స్టేషను, ఈశాన్యంగా కొండ, కొండపైన గుడి, అదే సింగరాయకొండ. ఆ కొండబట్టే ఈ ఊరికిన్నీ అదే పేరు వచ్చిందట. వెళ్లి చూడొచ్చుగా... వసారాలోనుంచి మెట్లు ఉన్నాయి."

మెట్టెక్కి వాళ్ళు పైకి వెళ్ళిపోయిన తర్వాత కాసేపు ఏం చేయాలో తోచక నాగతులసి హాల్లోనే నిలుచుండిపోయింది. ఏదో ముఖ్యమైన విషయం జ్ఞప్తికి వచ్చినట్లై తల పైకెత్తి గోడ గడియారం వైపు చూసింది. గంట ఎనిమిదిన్నర, బండి లేటు కాకపోతే ఆయన తొమ్మిదిన్నరకైనా ఇల్లు చేరుకోవాలి. అందాకా తనేం చేయాలి? అన్నట్టు అతిథులు పడుకోడానికి గదిలో చాపలు, తలగడలు, దుప్పట్లు ఉన్నాయో లేవో చూసుకోవాలి కదా. లాంథరా చేతబట్టుకుని రెక్కతలుపులు తోసుకుంటూ ఆమె గదిలోపలికెళ్ళింది. సింగమ్మ వారానికి రెండు మూడు సార్లు ఆ గదిలో చెత్త ఊడ్చి శుభ్రం చేస్తూ ఉంటుంది. నేలపైన అట్టే దుమ్ములేదు. చాపలు, దుప్పట్లు ఒక బల్లపైన పేర్చబడి ఉన్నాయి. ఎటొచ్చీ తలగడ మాత్రం ఒకటే కనిపించింది. మిగిలినవి ఏమయినట్టు? మిద్దెపైన గదికడితే దానికోసమని చేయించిన తలుపును గోడకానించి పెట్టారు. తలగడ కోసం అటూ ఇటూ చూడడంలో నాగతులసికి గోడకు తలుపుకు నడుమ తెల్లటి వస్తువేదో కనిపించింది. బహుశా తలగడ వుండవచ్చుననుకుంటూ ఆమె లోపలికి చేయి సాచి ఆ వస్తు విశేషాన్ని ఈవలికి లాగింది. "అబ్బో ఇదేమిటి ఇంత బరువుగా ఉంది." అనుకుంటూ ఆశ్చర్యపడిపోయింది. ఇంతకూ అది తలగడేం కాదు. ఇందాక కదిరప్ప దగ్గర కనిపించిన సంచీ. ఇందులో వాళ్లు రాళ్ళూ, రప్పలూ వేసుకురాలేదు కదా. అతిథుల సామాన్లు శోధించడం సంస్కారం కాదని తెలిసినా ఎందుకో అప్రయత్నంగా ఆమె చేయి సంచీ లోపలికి వెళ్ళింది. దుస్తుల కింద పంచె గుడ్డలో పదిలంగా చుట్టబడి వున్న వస్తువేమిటో

ఆమె చేతి వేళ్లు పోల్చుకున్నాయి. అది వేటకత్తి, వంకర భాగంనుంచి పిడిదాకా వచ్చేసరికి మరొక సాధనంకూడా ఉన్నట్టు తెలిపోయింది. అది వాడి బిచువా.

తలకాయల్ని సొరకాయల్లా తరిగిపారేసేది ఒకటి. గుండెను తూట్లు తూట్లుగా పొడిచిపారేసేది మరొకటి.

నాగతులసి నుదుట గుప్పుగుప్పున స్వేద బిందువులు పొటమరించాయి. గుండె కొట్టుకునే ఉరవడి హెచ్చింది. అయితే అలాంటి భీతావహమైన పరిస్థితిలో సైతం ఆమె బుద్ధి స్తంభించిపోలేదు. సంచీని యథాస్థానంలోకి తోసేసింది. రెక్క తలుపుల్ని మళ్లీ మునుపటిలా వేసి హాల్లోకి వచ్చేసింది. కంపిస్తున్న చేతిలోని లాంధరాద్వారా గోడలపైన ఏర్పడుతున్న వెలుగు నీడల బొమ్మలు భూతాల్లా ఆమెను భయపెట్టజూస్తున్నాయి.

'భగవంతుడా, ఈ కాళరాత్రి ఎలా తెల్లవారబోతుందో' అన్న ఆరాటం, ఆక్రోశం, ఆందోళన ఆమె అంతరాంతరాల్లో సుళ్లు తిరుగుతున్నాయి.

దీపం వెలిగించగానే చీకటింట్లోని వస్తువులన్నీ స్పష్టంగా దృగ్గోచరమైనట్టుగా నాగతులసికి ఇప్పుడు సర్వవిషయాలూ ఆకళింపునకు వచ్చేశాయి. కొండారెడ్డిది కంసుడి దివాణమైతే అందులో చాణూర ముష్టికులు వీళ్ళే! వీళ్లు అతగాడి చేతిలో గురితప్పని ఆయుధాలు.

"ఫలానా అడవిలో, ఫలానా కోనలో, పది కాలాల చెట్టు ఒకటి ఉంది. నాలుగు రోజుల్లోపల అది దూలాలుగా, త్రావులుగా, చెక్కలుగా మారి మన పశువుల కొట్టంలో ఉండాలి!"

"అట్లనే సామీ!"

"పలానా పుండాకోరు న్యాయమని, ధర్మమని భలే పెగ్గె మాటలన్నీ మాట్లాడతా ఉండాడంట. కొండారెడ్డిని వేలెత్తి చూపినోడికి కొంప ఉండకూడదు. వాడిల్లు గుణాతం దగ్గరనుంచి లేపి పారెయ్యాల..."

"అట్లనే సామీ!"

"ఈ పాయకట్టులో పండిన శెనక్కాయ పండినట్టుగా మన గిడ్డంగికి చేరతాఉంటె, ఆ రామాపురం మొదలియార్లకు కన్నుకుట్టింది. నికరమైన ధర అనే మాట చెప్పి మనకొచ్చే రాబడిని తాము తన్నుకుపోతారా? ఒరేయ్ కదిరప్పా..."

"చెప్పు సామీ!"

"ఆ నాలుగు తలలు నేలపై దొర్లాల..."

"అట్లనే సామీ!"

"చెట్లు కూల్చినా, ఊళ్లు కాల్చినా, మనుషుల్ని మట్టుబెట్టినా కొండారెడ్డి బంట్లు చట్టానికి అతీతులుగా ఉండిపోతూ వచ్చారు. ఒకవేళ చట్టం అనుమానించినా నేరాలు నిరూపణ కాలేదు. తోకమాటకేముంది తలకదా ముఖ్యం! ఎన్ని చావులు కళ్ళ చూచినా కొండారెడ్డిలో రక్తదాహం చల్లారలేదు. కొండారెడ్డి కోర్టు అనే కాలసర్పం పడగ పైకెత్తి తమకు నచ్చని వాళ్ల బతుకులపైన విషజిహ్వాలు సాచింది. మృత్యు దంష్ట్రలతో కాటేసింది. ఆఖరికి ఈనాటికి సింగరాయ కొండకూడా ఆ పడగ నీడ కిందకు వచ్చేసింది.

"అయితే ఈనాటి నరగావుకోసం ఉద్దేశించబడిన బలిపశువు ఎవరు? బహుశా తానై ఉండకపోవచ్చు. తానై ఉంటే ఎంతో అనువైన సమయాన్ని వృథా చేయడంలో అర్థం లేదు.!"

"కొండారెడ్డి కావిస్తున్న మారణహోమానికి ఇద్దరు రావలసి వచ్చిన కొత్త సమిధ ఏదో నాగతులసికి తెలిసిపోయింది. ఆ విషయం స్ఫురించేటప్పటికి స్టేషనులోనుంచి రైలుకూతకూడా వినిపించింది. ఆ తరువాత పది నిముషాలకల్లా ఎంతో హెచ్చరికగా క్రిందికి దిగి వచ్చిన అతిథి సత్తములు "ప్రయాణంలో బాగా అలిసిపోయాములే చిన్నమ్మా! పడుకుంటాము." అంటూ గది లోపలికి వెళ్ళిపోయారు. అప్పటినుంచి గదిలో అలికిడి లేదు. అంతా గప్‌చుప్...

గంట తొమ్మిదిన్నర కాబోతుండగా రమణారెడ్డి తిరిగి వచ్చాడు. వచ్చినవాడు బంధువుల వివాహంనుంచి అత్యుత్సాహంతో తేలిపోతూ వచ్చాడు. రాగానే నిద్రపోతున్న ఇంటిని తట్టి లేపేశాడు. భోజనానికి కూర్చున్నప్పటినుంచి పీటపైనుంచి లేచేదాకా పెళ్లి కబుర్లే.

"అబ్బో పెళ్లి ఎంత అట్టహాసంగా పట్టపగలుగా జరిగిందనుకున్నావ్ తులసీ. పుణక వాళ్లేనా, రేబాల వాళ్లేనా, ఆనం వాళ్లేనా, మల్లెమాట వాళ్లేనా ఓహ్! రెడ్డి జనసముద్రమే ననుకో. కనిపించిన వాళ్లందరూ పలకరించారు. "అయ్యో మీ నాన్నగారు పోయారటగా! పుణ్యాత్ముడు గదటయ్యా పాపం. పచ్చి అని పట్టి ఎరుగునా? ఎండు అని విరిచి ఎరుగునా?" అంటూ ఓదార్చని వాళ్లు పాపాత్ములు. వాకాడు పెంచెల రెడ్డిగారయితే "నువ్వు మీ నాయనగారి పేరిట ఒక గట్టి పని చెయ్యాలయ్యా. దానికి ప్రారంభోత్సవం నేను చెయ్యాల" అన్నాడు.

చివరికి వచ్చేటప్పటికి అచ్చటి సన్నివేశంలో ఏదో అసంగతమైన పరిస్థితి ఉన్నట్టు రమణారెడ్డి గ్రహించాడు. "ఏం తులసీ? నా మాట లేవయినా నీ చెవిలో పడుతున్నాయా? అసలు నీ ఆరోగ్యం బాగుందా?" అని ఆరా తీశాడు.

"నిజమేనండీ! ఒళ్ళంతా నలతగా ఉంది. కణతలు పగిలిపోతున్నాయి. అందుకనే ఈ పూట భోజనంకూడా మానేశాను. మీ పాటుకు మీరు భోజనం చేసి పడుకోండి. ఏదయినా అంజనం రుద్దుకుని వేడిగా ఒక లోటా పాలు తాగి నేను కొంచెం ఆలస్యంగా పడుకుంటాను."

నిజానికి భర్త ప్రసంగ వర్షం కురిపించినంతసేపూ నాగతులసి మనసు స్వగతాల వెంట సంచరిస్తోంది. కొండారెడ్డి తన తండ్రి. రమణారెడ్డి తన భర్త. వెంకట కృష్ణారెడ్డి తన మామగారు. అయితే ఈ రక్త సంబంధాలను ఆమె కాసేపు మరిచిపోదలచుకుంది. ఒక మనిషిపైన ఇంకొక మనిషి గొంతుక దాకా కార్పణ్యం నింపుకోవాలంటే అందుకు బలీయమైన కారణం అంటూ ఉండితీరాలి. అయితే గొంతు కొరికి గొర్రె పిల్లను కబళించడానికి తోడేలుకు బలీయమైన కారణం మాట దేవుడెరుగు, అసలు కారణాలే ఉండనక్కరలేదు. ఆ మాట కొస్తే కారణాలను అది కల్పించుకోగలదు. కొండారెడ్డి దండనీతి అంతకంటే మెరుగ్గా లేదు.

అసలింతకూ ఏం జరిగింది? సింగరాయకొండ వాస్తవ్యులైన తండ్రీ కొడుకులు వెంకటకృష్ణా రెడ్డి, రవణారెడ్డి గిత్తల బేరంకోసం దేశంపైకి బయలుదేరారు. నృసింహ జయంతి సందర్భంలో సింగరాయకొండ గుడిలో బ్రహ్మోత్సవాలు జరగడం పరిపాటి. ఆ తిరణాలకు పెద్ద హంగు ఎడ్ల పందాలు. ఎడ్లు పూన్చిన బండ్లపై నిల్చుని, పగ్గాలు చేతబట్టుకుని కోడె ప్రాయం రైతు యువకులు పరుగు పందాల్లో పాల్గొంటారు. కోడెలు ఎంత పసందుగా ఉంటే అంత ప్రతిష్ఠ. కొమ్ములు వెనక్కి వాలి చంద్రవంకల్లా మలుపు తిరిగి ముందుకు రావాలి. పలువరస మధ్యస్థంగా ఉండాలి. కాళ్ళల్లో దిటవు ఉండాలి. శరీరంపైన సుళ్లు ఉండకూడదు. పొట్ట మరీ పెద్దదిగా ఉండరాదు. మూపురం ముచ్చటగా ఉండాలి. మొత్తంపైన ఇవి గిత్తలా, దేవతా గుర్రాలా అన్నట్టుండాలి. వెండి రూపాయి నాణాల్ని పల్లెలలో పదిలపరచుకుని నెల్లూరు జిల్లా శివార్లు దాటి తిరుత్తణి ప్రాంతాలకు వచ్చేసిన సింగరాయకొండ రైతులకు అలాంటి గిత్తలు పల్లిపట్టులో కొండారెడ్డి కొట్టంలో ఉన్నాయని తెలిసింది. ఏడాది క్రితం ఒకనాటి సాయంకాలం మసక చీకట్లు అలుముకుంటున్న మునిమాపు వేళప్పుడు వాళ్లు పల్లిపట్టులో అడుగుపెట్టి కొండారెడ్డిని భేటీ చేశారు. అప్పటి నుంచీ ఊహించడానికైనా సాధ్యంకాని సంఘటనలు, దిగ్భ్రమ కలిగించే నాటకీయ సన్నివేశాల్లా జరిగిపోయాయి. కొండారెడ్డి వెయ్యినుంచి తొమ్మిది వందలకు దిగిరావడం, వెంకటకృష్ణారెడ్డి ఏడున్నర నుంచి ఎనిమిదిన్నరదాకా ప్రాకడం, వంద రూపాయల తేడాలో బేరం కుదరకపోవచ్చునన్న పరిస్థితి పొడసూపడం, చెప్పిన ధరకు తలవొగ్గకుండా తనతో బేరానికి దిగే మొనగాళ్లు ఇంతకాలానికి పుట్టుకొచ్చారా అనే కినుకతో కొండారెడ్డి భ్రుకుటి ముడిపడడం, అయినా అతడు తన స్వభావానికి భిన్నంగా ఎనిమిది వందలకే సమ్మతించి, ముభావంగానే సదరు వైరాన్ని తుడిచేసుకోవడం, మరునాటి ఉదయం తెల్లవారుఝూమున కోడెల్ని బయలుదేరదీయవచ్చుననే ఉద్దేశ్యంతో ఆరోజు రాత్రి భోజనంచేసి కొండారెడ్డి మహిడీలోనే పడుకున్న ఎద్దుల బేరగాళ్ళపైనబడి, చీకట్లో గుర్తు తెలియని శాల్తీలు కొందరు పగ్గాలతో నిగ్గదీసి స్తంభాలకు విరిచి కట్టి ఉడాయించడం, ఈ గొడవంతా ఏమిటో అర్థంకాక అప్పటికప్పుడు అక్కడ గుమిగూడిన పరివారంతో కొండారెడ్డి సింగరాయకొండ రైతుల్లోని పడుచువాడు తన కుమార్తె కొంగుపట్టి లాగినట్టు ప్రకటించడం, ఆ దురాగతానికి ప్రతిక్రియగా మరునాడు వాళ్ళ తలలు నున్నగా గీయించి, సున్నపు బొట్లు పెట్టించి పల్లెపట్టు వీధుల్లో ఊరేగింపు చేయనున్నట్టు తీర్మానించడం, ఇంతపనీ జరిగాక ఇల్లూ, ఊరూ, మాటుమణిగి రాయి రాయి కరిగే రాత్రివేళ ఒంటినిండా ముసుగు కప్పుకున్న ఓ వ్యక్తి పగ్గాలు తెగకోసి తలుపులు తెరచి వాళ్ళకు విముక్తి కలిగించడం, మెరుపు వేగంతో ముందూ వెనకా చూడకుండా దౌడు తీస్తున్న ఆ తూరుపు రెడ్లు రెండు మూడు మైళ్ళ దూరం వెళ్లిన తరువాత తమను వెన్నంటి ఇంకొక మూడో వ్యక్తి వస్తున్నట్టు పసిగట్టి, వెనుదిరిగి చూసేసరికి వాళ్ళకు తాను కనిపించడం...

ఇదే కథా క్రమం. అప్పుడిక వెనుదిరిగి వెళ్ళి కొండారెడ్డికి కూతురుగా బ్రతకడం కన్నా, ఈ బ్రతుకు ఏమైపోయినా పర్వాలేదని నాగతులసి తేల్చి చెప్పేసింది. ఉత్త పుణ్యానికి

ఒక యువకుడిపైన తన కొంగు పట్టుకున్నట్టు అభాండం పడింది గనుక జీవితంలో అతడికే కొంగు పరచాలన్న దృఢనిర్ణయానికొచ్చేసింది.

***

పడుకోగానే రమణారెడ్డికి నిద్రపట్టినట్టుంది. అతడు గాఢంగా నిద్రపోతున్నట్టు తేల్చుకున్నాక పడకగది తలుపు మూసి నాగ తులసి హాల్లోకి తిరిగి వచ్చింది. గోడకానించి పెట్టిన వాలు కుర్చీని లాక్కెళ్లి హాలుకు మధ్యగా వేసుకుంది. లాంథర తన పాదాల కల్లంత దూరంలో పెట్టుకుని, వాలు కుర్చీలోకి నిశ్చలంగా సోలిపోయింది. ఈలోగా ఆమె ఆలోచనకూడా ఒక కొలిక్కి వచ్చేసింది.

కొండారెడ్డి కూతురై పుట్టిన నేరానికిగాను తాను కావాలంటే అర్ధాంతరపు చావు చావడానికైనా సిద్ధమే. కాని నిరపరాధి అయిన భర్త శరీరంపైన మాత్రం ఈగనైనా వాలనీయదు. కన్ను చెమర్చకుండా కొండంత పాపాన్ని మూటగట్టుకున్న కొండారెడ్డి కూతురుగా తాను కాస్తంత పుణ్యం చేయడానికిగాను నిబ్బరంగా ఉండగలదా? ఉంటుంది. తప్పకుండా ఉంటుంది. మిన్ను విరిగి నెత్తిపై పడినా తాను చెక్కు చెదరదు.

"ఊరుకున్నారేమిత్రా! రండి. ఈవలికి రండి. అయితే ఒక్కటి మటుకు నిజం. నా అంతు చూడకుండా మీరు ముందుకు కదల్లేరు. దయ్యం పోతూ పోతూ ఒక కొమ్మను విరిచినట్టుగా, నేనుకూడా గట్టిగా గావుకేక పెట్టకుండా చావను. ఆత్మరక్షణకోసం ఎల్లప్పుడూ అందుబాటులో ఉంచుకునే లైసెన్స్ తుపాకి అప్పుడు నా భర్తకు ఉపకరిస్తుంది. భార్యను చంపి పైకి వస్తున్న వాళ్ళను కాల్చేస్తాడు. గనుక చట్టానికి అతన్ని చెనకే వీలుండదు...!"

గంట పదకొండయింది. కాలం తాబేలులా చాలా మందకొడిగా సాగుతోంది. పరిసరాలలోని కీచురాళ్ల ఎలుగులు, జమ్మికుంటలోని కప్పల బెకబెకలు వాయిద్య గాళ్లకు బొత్తిగా సంబంధం కుదరని పాటకచేరిల్లా కర్ణకఠోరంగా వినవస్తున్నాయి. ఉండీఉడిగీ స్టేషన్నుంచి రైలు కూతలు ఫిరంగి కాల్పుల్లా వెలువడుతున్నాయి. గోడగడియారంలోని లోలకపు సవ్వడి నగారం మోతలు నాగతులసి వీనుల్లో ధ్వనిస్తోంది. రోజు మారేందుకు గుర్తుగా గడియారం పన్నెండుసార్లు మోగింది.

ఒకటి... రెండు... మూడు... నాలుగు... ఐదు నిమిషాలు గంటల్లా బారలు చాస్తున్నాయి. గంటలు యుగాల్లా పరీక్షిస్తున్నాయి. ఎట్టఎదుట గోడపైన ఒక బల్లి రెండు జానల దూరంలో ఉన్న కీటకాన్ని కబళించాలని ఊరిస్తోంది. పొంచి పొంచి అది ముందుకు ఉరికినప్పుడల్లా ఆ కీటకం అందీ అందకుండా ఎగిరిపోతోంది. అయితే బల్లిలో వేటాడే కాంక్ష అంతకంతకూ మిక్కుటమై పోతేందేకాని తగ్గడంలేదు. బల్లికి చెలగాటంగాను, కీటకానికి ప్రాణసంకటంగాను ఉన్న ఈ ప్రదర్శనం ముగింపుకు వచ్చేదెప్పుడు?

ఉన్నట్టుండి శరీరంలో విద్యుత్ ప్రవహించినట్లే నాగతులసి ఉలిక్కిపడింది. సవ్వడి కాకుండా గది తలుపులు తెరుచుకోవడం లేదు కదా. మనుషులు తెరిచినట్లు లేదు. తలుపులు వెనక్కి వెళ్లినందువల్ల ఏర్పడిన అవకాశంలో రెండు మానవాకారాలు దుస్తులు తొడుక్కున్న దారు విగ్రహాల్లా కానవస్తున్నాయి. అడుగుల చప్పుడు వినిపించకుండా ఈ

హాల్లో కొచ్చేశాయి. ఆమెకు వాటికీ ఇప్పుడు ఉన్న మధ్య దూరం అయిదు అడుగులకు పరిమితమైంది.

కదిరప్ప చేతిలో వాళ్లు తెచ్చుకున్న సంచి చుట్టలు చుట్టుకొని బుసలు కొడుతున్న శ్వేతనాగులా కన్పిస్తోంది. ముట్టుకోరాని వస్తువును ముట్టుకున్నందువల్ల కంపరాన్ని వదిలించుకోవడానికి అన్నట్టుగా కదిరప్ప దానిని క్రిందకి జారవిడిచేశాడు. మరుక్షణాన వాళ్లిద్దరు వెన్నెముకలో సత్తా పూర్తిగా కోల్పోయినట్టు నాగతులసి ఎదుట భూపతనమయి పోయారు. అలా పడిపోవడంలో ఫాలతలాలు వెళ్లి ఆమె పాదాలు సోకుతుండగా, చిరకాల సముపార్జిత పాపసంచయనంనుండి వెలువడిన జీవాత్మల్లా వాళ్లు గొంతు విప్పేశారు.

"అమ్మా మహాలక్ష్మి! మేమెందుకొచ్చామో మీకు తెలిసిపోయింది. ఏడేడు జల్మాలు కాగే నూనెలో తోయించి మగ్గి మాడేటట్టు చేసినా ఆ పాపాలు పోయేవికావు. ఏదైనా పాపిష్టి పని చేయాలనుకుంటే ఆ రోజు పెద్దమ్మగారి ముఖం చూచేవాళ్లం కాదు. ఇప్పుడు నీ ముఖం చూసినా అట్లనే బిక్కచచ్చిపోయినాము. చల్లటి చేతుల్తో నీవు పెట్టిన అన్నం అరగకముందే నీ భర్తను పొలివెట్టడానికి, నీ కొంపను గుండం చేయడానికి తెగబడినాం. మాకు బుద్ధొచ్చింది తల్లీ! నీవు మా తప్పును మన్నించినట్లు చెబితే కాని మేము నీ పాదాలు వదిలిపెట్టం."

"ఏమిటి తులసీ! ఇంకా పడుకోలేదా ఎవరితో మాట్లాడుతున్నావు" వెనకనుంచి రమణారెడ్డి గొంతుక విన్పించింది.

"ఇందాక చెప్పటానికి మర్చిపోయాను. మా ఊరి వాళ్లొచ్చారు చూడండి! మా వైపు సపోటాలు బాగా ధర పలుకుతాయట. తీసుకువెళ్ళి అమ్ముకోవాలని వచ్చారు. వీళ్ళతో మాట్లాడుతూ కూర్చున్నా....."

"భలేదానివే! ఇక తెల్లవారదా ఏమిటి! కబుర్లన్నీ ఇప్పుడే తవ్వి తలకెత్తుకోవాలా?"

"ఔను నిజమే! వస్తున్నా పదండి. ఏం కదిరప్పా మీరు వెళ్లి పడుకోండి..." భర్త వెంట ఆమె లోపలికి వెళ్ళింది.

మర్నాడు తెల్లవారేసరికి వాళ్లు సింగరాయకొండ ప్రాంతంలో లేరు. రాయలసీమ యాసతో మాట్లాడే ఇద్దరు వ్యక్తులు – పహిల్వానులలాంటి వాళ్లు – విశాఖపట్నం వైపు వెళ్ళే రైలెక్కినట్టు నాలుగురోజుల తరువాత నాగతులసికి కర్ణాకర్ణిగా తెలిసింది...

❖ . ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక – 1 మే, 1996. ❖

# ఆగని వేగం

పాకాల నుంచి దక్షిణాదిగా కాట్పాడి వైపు వెళ్ళే రైల్లో ప్రయాణం చేసిన వాళ్లు పూతలపట్టు, చిత్తూరు, రామాపురం, బొమ్మసముద్రంలాంటి ఊళ్ళ పేర్లు వినివుంటారు. అవన్నీ ఆ దారిలోని స్టేషన్లు. అప్పట్లో రైలుబండ్లు మరీ వేగంగా, పందెపు గుర్రాల్లా పరుగెత్తేవి కావు. మెల్లగా మందకొడిగా నడిచేవి. ఉదయం ఆరుగంటలకు పాకాలనుంచి బయల్దేరేవి. బండిలో వెళ్ళి, రామాపురం చేరుకునేసరికి ఏడున్నర కావచ్చేది. బండిలోనుంచి అవలీలగా ప్లాట్‌ఫారంపైకి దూకి 'చిన్నాయినా, చిన్నాయినా' అని పిలుస్తూ ఆరెంఎస్ పెట్టెవైపు పరుగులంకించుకునేవాణ్ణి. తన సంచిని చేతికి తీసుకుంటూ, నావైపు చూచి 'ఒరే అంజీ! నువ్వా! ఫరవాలేదే! తోడు లేకుండా ఒంటిగా వచ్చేసేటంతటోడివైపోయినావే! మీ అమ్మా, నాయినా బాగుండారా?' అని ఆప్యాయంగా పలకరించేవారు చిన్నాయిన.

తలకు తువ్వాలా చుట్టుకుని, పైకెత్తి పొందికగా గోచీపెట్టి కట్టుకున్న ఎనిమిది మూళ్ళ పంచపైన డిపార్టుమెంటు వాళ్ళిచ్చిన కార్ చొక్కా తొడుక్కుని, భుజానికి వెనుకగా వేలాడేసిన తపాలా సంచి ముందు భాగాన్ని ఎడమచేత్తో పట్టుకుని, గజ్జలు గల్లు గల్లు మనే గిలకల బాణాకర్రను కుడిచేతి వేళ్ళ మధ్య బిగించి, అంతెత్తు ఆకారంతో ప్లాట్‌ఫారంపైన నడుస్తుంటే నేను మా చిన్నాయిన వైపు కళ్ళప్పగించి చూచేవాణ్ణి. పక్కన పడుకోబెట్టుకుని మా జేజమ్మ చెప్పిన కథలెన్నో జ్ఞప్తికొచ్చేవి. ఎవరబ్బా ఈయన? బొబ్బిలి పాపారాయుడా? కనిగిరి కాటమరాయుడా? చెంజికోట బురుజుపైన గస్తీ తిరిగే సిపాయా?

పొలం గనుమలపైన నడిచి, చెరువుకట్ట పైనుంచీ ముందుకుసాగి, మావిడి తోపుల మధ్య నీరెండిపోయిన ఇసుక డొంకల దారిగుండా ముందుకుసాగి, మిట్టలెక్కి, కళ్ళాలు దిగి, చిట్టడివిని అధిగమించి నెమళ్ళదిన్నె వైపు దూసుకుపోయేవాళ్ళం. మా చిన్నాయన నడిచే తీరే విచిత్రం. దట్టంగా చీలలు తాపడం చేసిన పాత చెప్పులు కిర్రు కిర్రుమంటూ వుండబట్టి సరిపోయిందిగానీ లేకుంటే పాదాలు నేలకానకుండా అలాగ్గా గాలిలో తేలిపోతున్నాడేమో ననుకోవలసిన పరిస్థితి. ఆయనది నడక. నాదేమో పరుగు.

తొమ్మిదికంతా నెమళ్ళదిన్నె.

ఒక పాత పెంకుటింటి వీథివైపు గదే పోస్టాఫీసు. కాడ ఒకటి విరిగిపోవడంవల్ల నూలు దారంతో చెవికి చుట్టుకున్న కళ్ళద్దాలతో ముసలి పోస్టుమాస్టరు గది తలుపు తెరిచి పెట్టుకుని, పెద్ద పెట్టె దగ్గర కునికిపాట్లు పడుతుండేవారు. "సంచీ వచ్చింది సారూ! కోసి జాబులు సార్టు చెయ్యండి. ఇంటికెళ్ళొచ్చేస్తా" నంటూ చిన్నాయిన గృహోన్ముఖుడైపోయేవాడు. వంటింటి అరుగుపైన సత్తు డేగిసా నిండుకూ కూటి నీళ్ళతో కలిపి పెట్టిన చద్దన్నాన్ని ఎరగడ్డ పాయలు నంజుకుంటూ సంతృప్తిగా జుర్రేసేవాడు. జాగు చెయ్యడానికి ఎడమేదీ? కాలంతో పందెమొగదంటయ్యా మనిషికి! వచ్చిన టపానంతా ఉత్తరాలుగా, రిజిష్టర్డు ఆర్టికల్స్‌గా, మనియార్డర్లుగా వింగడించి చేతి సంచిలో వేసుకుని, 'సుఖమా మన రాజ్యమెల్ల సుఖమా?' అన్నంత దర్పంగా పల్లెలపైకి 'బీటు' వెడలేవాడు. నా మట్టుకు నాకు గూడా ఆయన వెంట ఊళ్ళు తిరగడమంటే భలే ఖుషీగా వుండేది.

నెమళ్ళదిన్నెకొక మైలు దూరంలో ఎంటవలపాడని ఒక ఊరు. ఆ ఊళ్ళో ఒక నాయుడుగారికి మిలిటరీలోవున్న కొడుకుల దగ్గరనుంచి ఉత్తరాలో పత్తరాలో దబ్బో దస్కమో తరచుగా వస్తుండేవి. వాటిని ముట్టచెప్పే నిమిత్తం వెళ్ళినప్పుడల్లా మా చిన్నాయనకు కంచు చెంబు నిండుకూ చిక్కటి మజ్జిగ బక్షీషుగా లభిస్తుండేది. ప్రయత్నలోపం లేకుండా నేనుగూడా దారిపొడుగునా సరికిపండ్లు, వెల్లికాయలు, సద్దకంకులు ఉపాహారంగా సేకరించుకునేవాణ్ణి. ఎంటవలపాడునుంచి ఓ అరగంటసేపు నడిస్తే ప్రపంచమంతటితో ఆఖరైపోయినట్టుగా ఒక కొండకింద కొన్ని పూరిండ్లు నిద్రమత్తులో జోగుతుండేవి. దానిపేరు పోతురాజుగడ్డ. నాకు తెలిసినంతలో ఆ ఊరికెప్పుడూ ఉత్తరం వచ్చినట్టు లేదు. అందువల్ల ఆ ఊళ్ళో అడుగుపెట్టకుండా కొంచెం దూరంనుంచే వైదొలగి కూనపల్లె, బైరాగుల మఠం, పులకుంటలమీదుగా మధ్యాహ్నం పొద్దు పడమటికి తిరిగేటప్పటికీ నెమళ్ళదిన్నెకు తిరిగొచ్చేవాళ్ళం. అప్పుడిక ఆదరాబాదరాగా కొంచెం రాగిపిండితో చేసిన నూకబియ్యం సంగటి ముద్దలు రెండింటిని పచ్చి మిరపకాయలతో పామిన చింతాకు పుల్లగూరతోనో, వేరుశనగ్గింజల పొడి మిళాయించిన అనపగింజల తియ్యగూరతోనో గుటుకు గుటుకున దిగమింగి మళ్ళీ పోస్టాఫీసుకు వెళ్ళి తపాలా కట్ట అందుకున్నాడంటే, దాన్ని రైల్లో అందించి తిరిగొచ్చేసరికి నెమళ్ళదిన్నె లోయనంతా ఘసక చీకట్లు పొదివి పట్టుకుంటూ వుండేవి. పొంత బానలో కాగిన నీళ్ళతో తనివిదీరా స్నానంచేసి, సుష్టుగా భోజనంచేసి, ఇంటి ముంగిట రేగి చెట్టుక్రింద నులకమంచంపైన దిగువ తిరుపతిలో గోవిందరాజుల మాదిరిగా పడుకున్నాడంటే, పవ్వళించినప్పటినుంచీ పదాలే పదాలు!

'పడ వెళ్ళిపోవుచున్నది, పందరిచేర పడవెళ్ళి పోవుచున్నది' అనో, 'బండిరా పొగ బండిరా, దొర లెక్క రైలు బండిరా' అనో, అట్లా కాదని శ్రోతలకు కూడా కొంత జోక్యం వుండాలనుకుంటే అప్పటికప్పుడు మార్పులతో, చేర్పులతో పాటను కాస్త సవరించేవాడు.

"గోదావరమ్ములో, భద్రాచలమ్మున
సీతారాముల పెళ్ళి, చూచి వత్తమా మళ్ళీ!
వస్తావంట్రా అంజీ! రావా ఏమే చిన్నీ!..."

చిన్ని అంటే మా పిన్ని. మా అమ్మకు చెల్లెలు. అదామెకు చిన్నాయిన పెట్టుకున్న ముద్దుపేరు.

"సరేలే! కోపులు బాగానే వుండాయి" అన్న చిన్నమ్మ మాటలు ఇంటిలోపలి నుంచి వినవస్తుండేవి.

***

తూర్పు కొండపైన ఒకకాలు, పడమటి కొండపైన ఒక కాలు మోపి, ఆంజనేయస్వామి ఆకాశంలో సంచరించే సూర్య భగవానుడి దగ్గర చదువు నేర్చుకున్నాడని ఒక పౌరాణిక గాథ. మా చిన్నాయన వెంట నడుస్తూ ఆయన చెప్పే కబుర్లు వినడం అంతకు తక్కువదనేమీ గాదు.

"ఒరే అంజీ! మా చిన్నప్పుడు మేము తిరుపతి కొండకు వాలాయంగా ఇలూ తీర్థం వెళ్ళొచ్చేవాళ్ళం. రాత్రి బండికి తిరుపతిలో దిగేదిన్నీ, ధర్మసత్రంలో పడుకునేదిన్నీ,

తెల్లవారి నాలుగ్గంటలకే లేచేదిన్నీ అయిదుకే వొంటెక్కడం మొదలు! వక్క నలిగేటంత సేపట్లో అలిపిరి గాలి – గోపురం. ఆవేళప్పుడు చెమట పట్టి చొక్కాయ తడిసిపోయేదంటే ఇక చూస్కో..." ఇది యాత్రారంభం.

"తుంబురు తీర్థం! ఎప్పుడైనా వింటివా! ఏడాది కొక్కరోజు మాత్రమే జనం వెళ్ళేచోటు. ఒక పున్నమి రేయి వెళ్ళాలి. కొండపేట్ల మద్దెన ఇరుకుదారి. అర్ధరాత్రయ్యే టప్పటికి చందమామ నడిమింటికొచ్చేస్తాడు. ఇరుకు మార్గంలో నడుస్తావుంటే వెన్నెల వెల్తురులో ఈదులాడినట్టే ఉంటుంది. చూచేదానికి వెయ్యి కండ్లుండాల! గంధర్వులు స్నానంచేసి వెళ్ళే చోటని చెప్తారు.

"ఒరే అంజీ! ఇంకొకసారి అయిదారు మందితో కలిసి నాగతీర్థం వెళ్ళొస్తిని. నిటారు బండలు, వెదురు బొంగులగుండా దిగాల. కాలు జారిందో సున్నంలోకి ఎముక దొరకదు. కిందికీ, ఇంకా కిందికీ దిగివెళ్తే మిట్ట మధ్యాన్నమైనా ఎండ నేల పైన పడని పెద్ద పెద్ద చెట్ల నీడల్లో బండల మధ్య వరసగా ఏడు మడుగులు. ఖాళీ కిరసనాయిలు డబ్బాలతో కట్టుకున్న పడవల మీద దాటాలి. మడుగులో వేలిని ముంచినారంటే తడిసినంత మేరకు తునిగిపోయినట్టే వుంటుంది. అంత చల్లగా వుంటాయి నీళ్ళు."

ఒక్క తిరుపతి కొండేనా! దక్షిణ దేశంలో మా చిన్నాయన తిరిగి రాని దర్శనీయ స్థలాలెక్కడున్నాయి? ఒకసారట గుంపుతో కలిసి శ్రీశైలం యాత్ర చేస్తున్నాడట...

"...దోరణాల మార్గం. కొండకెక్కుతూ దిగుతూ వెళ్ళాలి. పొద్దుపోయింది. చీకటిపడింది. రాత్రి. రామా రామా భగమంతుడా! ఈ యాత్ర సాగేనా? ఆగేనా' అని దిగులు మాలో కమ్ముకొస్తావుంది. అప్పుడేమయిందంటేరా అంజీ, ముందుండి గుంపును నడిపిస్తున్న ఒక గడ్డపాయన గొంతుక విప్పేసినాడు – నాయనలారా! బతుకంటే అడివి లాంటిది. అందులో అగ్నానమనే చీకటి. నాయనలారా! మనసనే ఆకాశంలో మబ్బుల గుట్టల్లాగా దిగుళ్ళు. హోరుమంటూ కొట్టే పెనుగాలి. దారి సరిగ్గా తెలియడం లేదు. ఇప్పుడేం చెయ్యాలి? ఏదీ అందుకోండి...

చేదుకో మల్లయ్య చేదుకో!
చేయి విడువక మమ్ము ఆదుకో!
నెమ్మనములో నిన్ను నమ్మితిమిరా సామి!
శివశివా మమ్మింక చేదుకో!
భవహరా మమ్మింక చేదుకో...

ఆనాటి యాత్ర సంగతి నాకు తెలియదు. పాడుతూ పాడుతూ చిన్నాయిన అల్లితామరలు దండిగా వుంచిన పులికుంట చెరువుకట్టపైన, నా కట్టెదుట ఆనంద నృత్యం సల్పిన దృశ్యం మాత్రం యింకా నా కళ్లకు కట్టినట్టే వుంది.

ఎగువ అహోబిలంలో ఆకాశాన్నంటే కొండల నడుమ రాతి మండపంలో నిలబడి కుంభీపాతంగా దూకిన జడివానలో ప్రకృతి బీభత్సం ఎదుట తలవాల్చిన అనుభవం, పన్నెండు మైళ్ళచుట్టు కైవారమ్మున అరుణాచలాన్ని ఒకటి ముప్పావు గంటలో ప్రదక్షిణం చేసివచ్చిన వైనం, చేతి సంచిలో కొబ్బరికాయ వున్నట్టు భ్రమించి తరుముతున్న కోతి

బారినుంచి తప్పించుకోడం కోసం ఒక క్షేత్రంలో నదీప్రవాహంలోకి ఉరకవలసి వచ్చిన ఉదంతం - ఇలా త్రవ్విన కొద్దీ కథలే! తరచిన కొద్దీ గాధలే!

నాలుగు ఇంగ్లీషు ముక్కలు నేర్చుకున్నాక నేను సిందుబాదు నౌకా యాత్రల్ని గురించి చదివాను. గలివరు బ్రాబ్డింగు విదేశ యాత్రల్ని గురించి చదివాను. కొలంబస్, వాస్కోడిగామాల సాహస యాత్రల్ని గురించి చదివాను. అయితే వాటికన్నింటికీ పునాది రాళ్ళు మా చిన్నాయిన స్వానుభవాల్లోనే వున్నాయన్న అభిప్రాయం నుంచి బయట పడలేకున్నాను.

హైస్కూల్లో లెక్కల టీచరుగా పనిచేసి ఇటీవలే నేను రిటైరయ్యాను. విద్యార్థులకు కాలం-పని, కాలము-దూరము లెక్కలు నేర్పడమంటే నాకు చాలా సరదా. నా సరదాలో నేనుంటూ ఒక పర్యాయం మా చిన్నాయన్ను గురించి లెక్క ఒకటి చేసి చూచాను. రామాపురానికీ నెమళ్ళదిన్నెకు మధ్య దూరం అయిదుమైళ్ళు, రెండుసార్లు తిరిగేటప్పటికీ పది మైళ్ళు. టపా బట్వాడా చేయడానికి పల్లెల పైన తిరగవలసి వచ్చే దూరం అయిదు మైళ్ళు. తపాలాఫీసు పనిచేసేది పాతిక రోజులే ననుకున్నా నెలకు 25 × 15 = 375 మైళ్లు. ఎందుకైనా మంచిది, ఇంకొక పాతిక కలుపుకో. నెలవారీ నడక 400 మైళ్ళు. సంవత్సరానికి 4800 మైళ్ళు. సౌలభ్యం కోసం ఇంకొక ఇన్నూరు కలుపుకో. అయిదు వేలు. 40 సం.ల సర్వీసులో నడిచిన దూరం రెండు లక్షల మైళ్ళు. మూడు లక్షల ఇరవైవేల కిలోమీటర్లు. పదవీ విరమణ చేసిన తర్వాతనైనా ఊరికే కూర్చుని వుండరు గదా. ఈ ఇరవై ఏండ్లకూ కలిపి ఎనభై వేలే ననుకో. జీవితకాలంలో నడిచిన మొత్తం దూరం నాలుగు లక్షల కిలోమీటర్లు. ఎవరూ అనుకోలేరుగానీ, అనుకుంటే మా చిన్నాయిన పేరును గిన్నిస్ బుక్కు సిఫార్సు చేయవచ్చునేమో!

“కళ్ళున్నందుకు చూడాలి. చెవులున్నందుకు వినాలి. చేతులున్నందుకు పని చెయ్యాలి. కాళ్ళున్నందుకు తిరగాలి. ఏమిరా అంజీ ఆఖరి క్షణం దాకా బతకాలి. బతికుండగానే చనిపోకూడదు” అంటూ మా చిన్నాయిన ఒకసారి నాకు జీవన గీతోపదేశం చేశాడు.

ఏ సినిమాలో విన్నానో గుర్తులేదు. ఏ కవిరాశాడో మరచిపోయాను. కానీ ఉపనిషత్ సూక్తిలా అది మాట మాటకీ జ్ఞప్తికొస్తూనే వుంటుంది.

‘సాగుమా సాహిణీ!

ఆగని వేగమే జీవితమూ...”

పాటకు పల్లవి మాత్రమేనా యిది? జీవితానికి నిర్వచనం కాదా?

***

సహస్రచంద్ర దర్శనమంటారు. ఆ ఉత్సవమైతే చేసుకోలేదుగానీ మా చిన్నాయన వెయ్యి నిండు పున్నములు చూడగలిగాడు. మా చిన్నమ్మ కనుమరుగై పదేళ్ళయింది.

ఆయన కొకడే కుమారుడు సీతాపతి. పాదాలు అరిగేటట్టుగా తిరిగి, చెమటోడ్చి తండ్రి సంపాదించిన పెట్టుబడితో తమ్ముడు బుద్ధిగా చదువుకున్నాడు. డిగ్రీలో వాడికొచ్చిన మార్కుల్ని చూచి ఎమ్మెస్సీ ఫిజిక్సులో పిలిచి సీటిచ్చారు. అందులో యూనివర్సిటీకంతా

ఫస్టొచ్చాడు. రాసి పడేసిన మొదటి అప్లికేషనుకే పాండిచ్చేరి యూనివర్సిటీలో పదవి దొరికింది. సముద్రతీరంలో దీపగృహ అపార్ట్‌మెంట్స్ అన్న పేరుతో ఒక ఆకాశ హార్మ్యం, అందులో అయిదో అంతస్తులోని ఫ్లాట్‌లో తమ్ముడి నివాసం. లిఫ్టుందిగానీ, హమేషా అది మరమ్మతు నపేక్షిస్తూ వుంటుంది. 'నడిచింది చాల్లే! ఇక ఊరుకో' అంటూ ఒక అజ్ఞాత శక్తి ఏదో సవాలు విసరినట్టుగా అయిదారేళ్ళనుంచీ మా చిన్నాయన్ను మోకాటి నొప్పులు పీడిస్తున్నాయి. 'మెట్లెక్కి దిగొద్దు. అనవసరంగా నడవొద్దు' అని డాక్టర్లు గట్టిగా సలహా యిచ్చారు.

చిన్నాయన్ను చూచి రావడం కోసం ఏడాదికొకసారైనా నేను పాండిచ్చేరి వెళ్ళొస్తూ వుంటాను. వెళ్ళినప్పుడల్లా నొచ్చుకుంటూ తమ్ముడు నాతో చెబుతుంటాడు – 'చూడన్నా! చెబ్తే ఈయన చెవిలో వేసుకోడు. ఇరుపూటలా డాబాపైకి వెళ్ళిపోతాడు. పచార్లు చేసినంతసేపూ చేసి, ఆపైన అక్కడే సిమెంటు బెంచ్‌పైన కూర్చుండిపోతాడు. ఒంటికి ఎండ చురుక్కుమంటూ సోకితేగానీ కిందికి దిగి రాడు. ఏం చేయమంటావు చెప్పు..."

ఉదయం తొమ్మిదికీ పదింటికీ మధ్య డాబా నుంచి దిగిరాగానే స్నానాదికాలు ముగించి మా చిన్నాయన తూర్పువైపు కిటికీ దగ్గర ఈజీచైర్లో కూచుంటాడు. అర ఫర్లాంగు దూరంలో సముద్రం అలుపూ సొలుపూ లేకుండా అనంత జీవనగీతం ఆలాపిస్తూ వుంటుంది. 'కదలికలో నువ్వూ నేనూ ఒకటేలే! హాట్స్ ఆఫ్ టు యూ' అన్నట్టుగా తరంగ హస్తాలుసాచి అభినందనలు తెలుపుతూ వుంటుంది.

మధ్యాహ్న భోజనానంతరం ఒక కునుకు తీశాక ఆయన తన స్థానాన్ని పడమటివైపు కిటికీ దగ్గరకు మార్చుకుంటారు. అల్లంత దూరంలోని ప్లే గ్రౌండులో పిల్లలు ఆడుకుంటూ వుంటారు. ఆ క్రీడల సంరంభంలోనుంచి పెల్లుబికే జీవనోత్సాహాన్ని ఆయన చూపులద్వారా తన గుండెల్లోకి ఆవాహన చేసుకుంటూ వున్నట్టు కనిపిస్తాడు.

'వద్దు కదలొద్దు' అని కడలిలో కెరటాలను కట్టడి చేయగలిగిన వాడెవరు? ఆపెయ్యండి, ఆటలు మానెయ్యండి అని పిల్లల ముంగాళ్ళకు బంధం వేయగలిగిన వాడెవడు? అట్లాగే కదలొద్దు. మెదలొద్దు. స్తబ్ధతకు లోనై జడపదార్థంగా పడివుండు అని మా చిన్నాయన్ను శాసించగలిగినవాడు సైతం ఈ ఇలాతలంపైన లేడు. ఆ మేరకు కాలపురుషుడు గూడా ఆయన ముందు బలాదూరు!

❖ ఆంధ్రజ్యోతి ఆదివారం అనుబంధం – 21 జులై, 1996. ❖

# యుగారంభం

పన్నెండు గ్రామాల చిన్న సంస్థానం నారగిల్లు. అందులో ఒక ఊరు మాది. సంస్థానం చిన్నదైతే పాళ్యమనీ, దాని పరిపాలకుణ్ణి పాళేగాడనీ వ్యవహరించడం రివాజు. సన్నిధానంలోనైతే 'దొరవారూ' అని సంభావించడం మర్యాద. రాజ్యం చిన్నదైనా, హోదా పరిమితమైనా దొరవార్ల పేర్లు మాత్రం పెద్దవే! మా పాళేగారి పేరేమిటో తెలుసా? నారగంటి వీర ప్రతాప ముద్దు నారసింహ నాయనివారు. అంగుళం వెడల్పుతో సరిగంచు వచ్చిన నారాయణవనం పంచతో, పొట్టి చొక్కాపైన మోకాళ్లదాకా వ్రేలాడే వెండి బొత్తాముల కోటుతో, గిరజాల జుత్తుతో, పొట్టు తీసేసిన కందగడ్డలాంటి ముఖంతో ఆయన చారిత్రిక యుగాల నాటి నగర కొత్వాలులా ఉండేవాడు. ముందూ వెనుకా పదిమంది దాకా బరాబరులు పలుకుతుండగా, ఆయన అప్పుడప్పుడూ దివాణం గుర్రంపైన గ్రామ సంచారానికి వేంచేయడం చూడదగ్గ వేడుక. దొరవారొస్తున్నారంటే ఆరోజు ఊరికంతా పండగే! మేళతాళాలతో, పంబల వాద్యాలతో, పిల్లంగోవి చిందులతో ఎదురేగి వెళ్ళి, ఎడనీటితో పానకాలతో దాహశాంతిచేసి, రచ్చగట్టుపైన చల్లటి నీడలో మంచాలు వేయించి, చలువ పందిరిలో మంచినీటి కడవలు, నీరు మజ్జిగ దుత్తలు పెట్టించి, మధ్యాహ్నాం భోజనానికి యేటలు రోయించి, నసాళానికంటేటట్టుగా మసాలా పోపులు పెట్టించి గ్రామస్తులు దొరవారిని అతిధ్య సత్కారాల్లో ముంచి లేవనెత్తారు.

అప్పటికప్పుడు నులకమంచంపైన తయారైన తాత్కాలిక తక్తుపైన కూర్చున్నాక వివాదాలు వచ్చినవాళ్లు, తగాదాలు పడిన వాళ్లు దొరవారి ఎదుటికొచ్చి మూగిపోయేవారు. కేసుల పరిష్కారంతో పొద్దు నడిమింటి కొచ్చేది. భోజనానంతరం గ్రామ చావడిలో విశ్రాంతి. ప్రొద్దు వాటారినప్పటినుంచీ చావడి ముందున్న ఆవరణ పోటీలతో, పందాలతో ఉరకలెత్తే ఉత్సాహ సముద్రమైపోయేది. గుండ్లు పైకెత్తడాలు, పరుగెత్తే ఎద్దుల బండిని చేతితో ఒడిసిపట్టి లాగి నిలబెట్టడాలు, మోచేతితో కొబ్బరికాయను చిత్తుచిత్తుగా కొట్టడాలు– ఇలాంటి పోటీల్లో గెలిచిన వాళ్ళకి బహుమతులు ఇచ్చేశాక, దొరవారు పరివారంతో కలిసి పెట్రోమాక్స్ లైట్ల వెలుతుర్లో రాత్రి భోజనానికి కూర్చునేవారు. కట్టలు కట్టలుగా తమలపాకుల, పట్టెడు పట్టెడం వక్కలు పళ్లెరాల్లో వచ్చేసేవి. పాళెగారితోబాటు గ్రామ పెద్దలుకూడా తాంబూల చర్వణానికి ఉపక్రమించేవారు.

భుక్తాయాసానికీ, రాత్రి విరామానికీ మధ్య రసవత్తరమైన సన్నివేశం ఒకటి రూపు దిద్దుకుంటూ ఉండేది.

పెండ్లికొడుకును వెన్నంటి ఉండే తోడుపెండ్లికొడుకులా దొరవారి నెల్లప్పుడూ అనుసరించే వ్యక్తి ఒకతనుండేవాడు. భుజం పైన్నుంచీ జందెం. లేత సొరపిందెలాంటి జుత్తు. చేతికి బంగారు కంకణం, చెవులకు అంటు పోగులు. కట్టుకున్న పంచపైన భుజాలు పైన్నుంచీ వ్రేలాడే శాలువా తప్పితే మరే అచ్ఛాదనమూ ఉండేదిగాదు. బక్కపలచటి మనిషి, దొరవారి గ్రామ సంచారపు మజిలీలో చివరిఘట్టం ఎప్పుడూ ఆయన మూలంగానే రక్తి కడుతూ ఉండేది.

రాత్రి తొలి జామున తాంబూల సేవనం చేస్తూ కూర్చున్న పాళేగారు – 'ఏరి? ఎక్కడ అయ్యవారు?' అని పరామర్శించేసరికి, ఆయన తెరలోపలినుంచీ రంగంపైకి

వచ్చే పాత్రలా, దొరవారి ఎదుటకు వచ్చి సిరిచాప పైన కూర్చునేవాడు. 'వస్తిరా అయ్యగారూ! ఒక మంచి మాట చెవిలో వెయ్యండి' అనేవారు పాళేగారు. సిద్ధంగా ఉన్నట్టు ముఖ భంగిమద్వారా వ్యక్తంచేసే వారేగానీ, అంతకుమించి అయ్యగారు పెదవైనా కదిపేవాడు కాదు. అప్పుడిక దొరవారే ఛాయిస్ తీసుకోవలసి వచ్చేది. 'నీరాట వనాట ములకు పోరాటం బెట్లు కలిగే? అదేంది? గజేంద్రమోక్షమా! ఆ కథ చెప్పండి' అనో, 'కట్టుకున్న పట్టాన్ని పావురాలెత్తుకపోయిన కథ... నలోపాఖ్యానం గదూ! అది చెబ్తారా?' అనో, 'ఆహా. మహానుభావుడు కదండీ భర్తృహరి! ఎంత బాగా చెప్పినాడు. 'కాల మహిమ? కొంచెం అందుకుంటారా" అనో – ఇలా పాళెగారు ఏదో ఒక అంశాన్ని తానే సూచించేవారు. వినే ఆయనలో పెల్లుబికిన ఆసక్తిని బట్టి, చెప్పే ఆయనలో భావావేశం పరవళ్లు దొక్కేది. కర్పూరపు పెళ్లల్లాగా, కలకండ ముక్కల్లాగా, రువ్విన పువ్వుల్లాగా ఆయన గొంతుకలోనుంచీ మాటలు ఊడిపడేవి.

'అది మహాదుర్గం. దుర్గంలో రాచనగరం. అందులో నిండు పేరోలగం, అల్లదిగో వారే భటులు, నటులు, గాయకులు, వందిమాగధ విదూషకులు. అదంతా గడచిన గాథ. ఇప్పుడక్కడ కనిపించేది మొండి గోడలు. తిరిగేవి గుంట నక్కలు. పెరిగేవి ముండ్ల మొక్కలు. ఇదంతా కాలం చేసిన జాలం, ఆ కాల మహిమను మనం గమనిస్తున్నామా? కాలాన్ని ఫలవంతం చేసుకుంటున్నామా? లేదే! విద్యలు నేర్చి వినుతికెక్కింది లేదు. ధైర్యంతో సాహసకార్యాల జోలికి వెళ్లింది లేదు. దానధర్మాలు చేసింది లేదు. ఇలాంటి బ్రతుకు బ్రతికి ఏం సార్థకం? చీకటింట్లో పెట్టిన దీపాలలాంటి వాళ్లం. మాతృ యౌవనమనే వనాన్ని విచ్ఛేదం చేయడానికి ఏర్పడిన గొడ్డళ్ళలాంటి వాళ్లం. కాలమనే మహాప్రవాహం గట్టున నిల్చున్న చెట్లలాంటివాళ్లం. ప్రవాహం గట్లను కోసేసిన కొద్దీ వేర్లు తెగిన తరువులు ఆ ప్రవాహంలోనే పడి కొట్టుకపోయినట్టుగా మనం చివరకు కాలగర్భంలో కలిసిపోతాం...' అని విషయాన్ని పూర్తిగా పునశ్చరణ చేసిగానీ వదిలి పెట్టేవాడు కాదు అయ్యగారు. 'ఆహా, ఆహా! ఒక్కొక్క పలుకూ వరహా చేసేదిగదండీ! చూస్తిరా, నా ఒళ్లెట్లా రోమాంచమై పోయిందో"నని దొరవారు కోటు చేతులపైకి తీసి, చేతులు ముందుకు సాచేవారు.

నాకప్పటి కింకా పదేళ్లయినా నిండలేదు. పై చదువులకోసం పట్నం వెళ్లాక పాళెగాళ్లందరూ సాధారణంగా మద్యపానలోలురై, మదోన్మత్తులై, ప్రజాకంటకులై ఉంటారని వింటూ వచ్చాను. మరైతే మా నారగింటి పాళేగారి తీరు మాత్రం అందుకు భిన్నంగా గోచరిస్తూ ఉండేది. ఏమైనా చదువుల్లో పడిపోవడంవల్ల నేను తదితర విషయాలను గురించి అట్టే ఆలోచించలేదు. ఈలోగా పది పన్నెండేళ్లు గడిచిపోయాయి. దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. జాతీయ ప్రభుత్వం గీచిన ఒక్క గీతతో పెద్ద పెద్ద సంస్థానాలే రద్దయిపోయాయి. పెద్ద రాజ్యాలకే దిక్కులేకపోతే, ఇక నారగింటి పాళ్యం అడ్రస్ ఎక్కడ? జీవనభృతి క్రింద గవర్మెంటువారు పాళేగారికి ఎంతోకొంత నష్టపరిహారం ఇస్తున్నారేమో! చాప చిరిగి చిరిగి చదరంత అయిందేమో! ఏమిటో మరి. అందును గురించి స్పష్టంగా నాకేమీ తెలియదు. పట్టించుకోనూ లేదు.

ఎం.ఏ. పరీక్ష రాసి వచ్చి, ఇంటిదగ్గర కాలక్షేపం చేస్తూ వచ్చిన కొత్తలో, ఒకరోజు నాకు నాయని వారి దగ్గరనుంచి పిలుపువచ్చింది. నాతో ఆయనకే పని పడి ఉంటుందో తెలియక ఆశ్చర్యపడిపోయాను. అయినా పెద్దమనిషి పిలవనంపాక వెళ్లాలిగదా! మా

ఊరికి, నారగింటికీ రెండు మైళ్ల దూరం. ఆపాటి దూరం నడచివెళ్లడం ఒక లెక్కలోని పనికాదు. అయితే పిలవనంపిన కారణమేమిటో తెలియక జంకుగొంకులతోనే బయల్దేరి వెళ్లాను. తీరా వెళ్లాక తెలిసింది. నా హోదా పెరిగిపోయినట్టు నాయనివారే సెలవిచ్చారు. నారగింటి పాళ్యం ఏరియాలో మొట్టమొదట ఎంయే పరీక్షకు కూర్చున్న వాణ్ణి నేనేనట! అందులోనూ అభిమాన పార్యాంశంగా తెలుగు తీసుకున్నానని తెలిశాక ఆయన ఆనంద పరవశుడైపోయాడు.

"చదువుల్లోకంతా పెద్ద చదువుకదంటయ్యా ఎమ్మే అంటే! అందులో తెలుగంటే మాటలా! మహాభారతం పజ్జెనిమిది పర్వాలూ చదివే ఉంటావు. భాగవతంలో అన్ని స్కంధాలు నోటికొచ్చే ఉంటాయి. రామాయణాల్లో మేలైనదేదో గ్రహించే ఉంటావు. మాదేముంది? చదివే వాళ్లు చదవగా, అర్ధ వివరణ చేసేవాళ్లు చేయగా, అర్ధమైనంత అర్ధం కాగా, జ్ఞాపకం ఉన్నంతవరకూ జ్ఞాపకముండగా, మరిచిపోయినంత మేరకు మరిచిపోగా మిగిలిందేకదంటయ్యా మా సాహిత్య కోశం! నీ సంగతట్లా కాదే! నీ మాదిరిగా ఒక చదువరి మా పాయకట్టులో ఉన్నాడంటే అది మాకెంతో గొప్ప కదా! నువ్వు తరచుగా మా దగ్గరికొచ్చి పోతూ ఉండాల" అని ఆప్యాయంగా సమాదరణ చేశాడు.

మేమిద్దరమేగాక అప్పుడా హజారంలో మాతోబాటుగా మరో వ్యక్తి ఒకత నుండిపోయాడు. ఎముకల పటువు, కండరాల బిగువు. కుచ్చుగా ప్రారంభమై సూదుల్లా కొనదేలిన మీసాల సోయగం – ఈ హంగుల్ని బట్టి నేనతనొక వస్తాదై వుంటాడనుకున్నాను. నాయని వారు నా ఇంగితాన్ని కనిపెట్టి సందేహనివృత్తి చేయడానికి పూనుకున్నారు. "జవ్వాది రంగభట్టునే ఎరుగువా గోపాలం! మా కొలువులో కవిపీఠం ఈ కుటుంబీకులదే! వీళ్ళ తాతగారి పేరు మాధవభట్టు, నువ్వూ చూచే ఉండొచ్చు. గ్రామ సంచారాలల్లో నన్ను వెన్నంటి ఉండేవాడు. కంచుకంఠం మాధవభట్టు అని ప్రఖ్యాతి. పద్యం చదివినాడంటే ఫర్లాంగు దూరం వినిపించాల్సిందే! రాత్రి భోజనాలైన తర్వాత ఆయన వచ్చి నాలుగ్గడియలపాటు పురాణ ప్రవచనం చేసి వెళ్తేగానీ మా నాయనగారికి నిద్రపట్టేదిగాదు. భారతంలో ఆది పంచకం, పోతన్నగారి భాగవతం, గోన బుద్ధారెడ్డి రంగనాథ రామాయణం, కంకంటి పాపరాజు ఉత్తర రామాయణం మా పారాయణ గ్రంథాలు. పోతే వీళ్ల తండ్రి లక్ష్మణభట్టున్నూ, నేనున్నూ ఒకే ఈడు వాళ్లం. ప్రాచీన గ్రంథాలన్నీ క్షుణ్ణంగా చదువుకున్నాడేగానీ అతడి కెందుకో పురాణాల కన్నా ప్రబంధాలంటేనే ఇష్టం. పాపం, తండ్రి బ్రతికుండగానే ఆ కాలంలో పోయినాడు. తాతగారికి వృద్ధాప్యం దాపురించడం వల్లనైతేనేమి, తండ్రి అర్థాంతరంగా ఇహలోక యాత్ర ముగించడం వల్లనైతేనేమి, రంగభట్టు చదువుపైన శ్రద్ధ పెట్టే వాళ్లు లేకపోయారు. అయినా ఇంగువ కట్టిన గుడ్డ కదా! వాసన పోతుందా! మనవాడు ఎక్కడెక్కడ వెదికి పైకి తీసినాడో గాని, టుమ్రి పుస్తకాలు కొన్ని పట్టేసినాడు. శేషం వేంకటపతి శశాంక విజయమంటే ఇతనికి ప్రాణంతో సమానం. ముద్దుపళని రాధికా సాంత్వనమంటే వల్లమాలినంత ఇష్టం. కూచిమంచి జగ్గకవి చంద్రరేఖా విలాపమంటే సరేసరి! వాచోవిధేయం!"

మాధవభట్టు నుంచి ప్రారంభించి రంగభట్టు దగ్గరికి వచ్చేసరికి నా పని మలయకూటం నుంచీ బయల్దేరి థార్ ఎడారిలోకి వచ్చి పడిపోయినట్టయింది. అందుకు తగ్గట్టు అప్పటికి నేనేదో శత్రు శిబిరానికి చెందినవాడినైనట్టు, అతడు అనుమానంగా నావైపు చూడడంకూడా నాక్కొంచెం ఇబ్బందిగానే ఉండిపోయింది.

నేను జాగ్రత్తగా వాకబు చేసి తెలుసుకున్నాను. చిన్నవో, చితకవో – రంగభట్టు కావ్యాలేవీ రాసినట్టు లేదు. పట్టుమని పది పద్యాలైనా రాసి ఉంటాడా– అని నా అనుమానం. లేదంటే చాటువులు, సమస్యాపూరణాలు, దత్తపదులు కొన్ని సంగ్రహించుకొచ్చి (అవి తానే రాసినట్టు మభ్యపెడుతూ) దొరవారిని అలరించేవాడు. చాలని దానికి ఏ పండుగో, పబ్బమో వచ్చినప్పుడు సామాగ్రితోపాటు సంభావనగూడా స్వీకరిస్తూ ఆశువుగా తోపించేటట్టు పాళేగారిపైన కొన్ని పద్యాలు గుప్పించేవారు.

మాటలోన, మంచి మనసులో, నిండైన
గుండెలోన , మేటి గుణములందు
ఎవరు నీకు సాటి ఈ వసుంధరయందు
నారగింటి ముద్దు నారసింహా!
ఎముకలేని చేయి, ఎద మెత్తనైనది
తిరుగులేని మాట, దీన జనుల
కొంగు పసిడి వగుచు కొలువు దీరితి వయ్య
నారగింటి ముద్దు నారసింహా!
కలిమి యన్న నీది, బలిమియన్నను నీది
చెలిమి నీది, గొప్ప తెలివి నీది
తేజరిల్లినావు దినరాజు చందాన
నారగింటి ముద్దు నారసింహా!"

పొగడ్తంటే ఎవరికైనా ఇష్టమే గదా! పద్యాలు విన్నంతసేపూ విని, ఆ తర్వాత నాయనివారు "నాయనా గోపాలం! ఎట్లా ఉంది రంగభట్టు కవిత్వం?" అంటూ ప్రశ్నించి, నన్ను ఇరకాటంలో పెట్టేసేవారు.

ఉన్నమాట చెబితే నిష్ఠూరం, లేనిమాట చెప్పడం ఆత్మవంచన. అక్షరాస్యుడైనవాడు ఓపిక పట్టి వెయ్యి పద్యాలు చదివేస్తే ఎన్నో కొన్ని రెడీమేడ్ పద బంధాలు బుర్రలో ప్రవేశించి తిష్ఠ వేసుకుంటాయి. అవసరాన్ని బట్టి అవి టకీమని స్ఫురణకు వస్తూ పాద పూరణలోకి పొందికగా ఒదిగిపోతూ పద్యాన్ని రేవుకు చేరుస్తాయి. ఈ కూసు విద్యవల్ల కవులుగా చలామణీ అయినవారు ఎందరులేరు! అది సరే! ఈ మాట నాయనివారికి నేనెలా చెప్పగలను? అందుకని ఈ ఒక్క విషయంలో మాత్రం మూగనోము పట్టేశాను.

అయినా నా మౌన సాధన అలా ఎంతోకాలం కొనసాగడానికి వీల్లేకపోయింది. ఆఖరుకు మొగమాటం వదిలిపెట్టి కవిత్వం పట్ల నా అభిప్రాయమేమిటో తేల్చి చెప్పక తప్పింది గాదు.

"మహాకవులు పద్యాన్ని తమ చెప్పుచేతల్లో నడిపించారు. తాము ప్రకటించ దలచుకున్న భావాన్ని అక్షరాలా పద్యంలో పలికించారు. అయితే మధ్య యుగాల నాటికి తలిశెట్టి రామారావుగారి కార్టూన్‌లో ప్రబంధ సుందరిలా, పద్యం పదాడంబరంతో బరువెక్కి పోయింది. మళ్లీ కొన్ని వందల యేండ్లు గడిచేసరికి పద్యాల చరిత్రలో మరింత పిదపకాలం వచ్చేసింది. ప్రేయసీ ప్రియుల్ని వాళ్లు పడకటింటికి వెళ్లిపోయినా వదిలిపెట్టకుండా కవులు వెంబడిస్తూ వచ్చారు. కాలక్రమాన ఈ స్థితి మరింతగా దిగజారి చిత్రకవిత్వమంటూ ఒకటి రాజ్యం చేయసాగింది. ఏడాక్షర కవితలు, రెండక్షరాల కవితలు, ఖడ్గబంధాలు,

గోమూత్రికా బంధాలు– ఇంకా ఇలాంటి గజకర్ణ, గోకర్ణ, టక్కుటమారా విద్యలెన్నో బలిసిపోయాయి. చూస్తూ చూస్తూ ఉండగానే ఆ గారడీ విద్యలుకూడా అడుగంటి, గురువును లఘువుగా కుదించి, లఘువును గురువుగా లాగి, గణభంగం జరగకుండా కఠోర సాధనచేసి, ప్రాసలకోసం ప్రయాసపడి, యతులకోసం మతులు పోగొట్టుకుని ఎట్లాగైనా పద్యాలల్లాలన్న కక్కుర్తి ప్రబలిపోయింది. చిత్రింపదలచుకున్న అందమైన అమ్మాయి, చిత్రణ పూర్తయ్యేసరికి మీసాలతో గడ్డాలతో తయారైనట్టు, చెప్పదలచుకున్న భావానికి, చెప్పిన విషయానికి దూరం పెరిగిపోతున్నప్పుడు ఛందస్సును పట్టుకుని ఎందుకు వ్రేలాడాలి? శుభ్రంగా రసాత్మకమైన వాక్యాలతోనే పబ్బం గడుపుకోవచ్చుగదా! కవితా విన్యాసంలో కొంత లయ ఉంటే చాలు. వచనంలోనైనా కవిత రాయొచ్చునంటున్నారు ఆధునికులు, కొందరు రాసి మెప్పిస్తున్నారు కూడా!" అని విన్నవించుకున్నాను.

"ఎవరి సంగతో మనకొద్దు, నువ్వు రాయగలవా?" అని నిలదీసి అడిగారు నాయనివారు.

అప్పటికి నేనేమీ బదులు చెప్పలేదు. ఎప్పటికీ చెప్పకపోయినా బాగుండేది. కానీ ఉబలాటం ఉండనిస్తుందా? నా కవితలు కొన్ని అచ్చయిన కాలేజీ మేగజైన్లు, అముద్రిత కవితలు నిద్రపోతున్న రెండు నోట్ పుస్తకాలు పట్టుకెళ్లి దొరవారికి నివేదించుకున్నాను.

ఆయన త్రిప్పినంతసేపూ పుటలు త్రిప్పి చూచి, ఆ తరువాత తల పంకిస్తూ "అప్పుడే నేననుకొంటిని లేవయ్యా! రాయగలిగిన ముఖం మాదిరే ఉంది నీది. మంచిది. నువ్వొక పని చెయ్. రాత్రి కిక్కణ్నే భోజనం చేసి పడుకో. తెల్లవారు జామున ఒక పనుంది" అన్నారు. ఏం పనబ్బా అది! ఆ రాత్రి నాకు సరిగ్గా నిద్రపట్టలేదు.

నా ఒక్కడితోనేగాదు. రంగభట్టుతోగూడా పనిబడినట్టుంది నాయని వారికి. మరునాటి ప్రాతఃకాలం ఆరుగంటలకల్లా ఆయన మమ్మల్నిద్దర్నీ ఊరి ముందర చెరువు దగ్గరకు తీసుకెళ్లారు.

అర్ధచంద్రాకారంగా ఒక మైలు దూరం పొడవున్న చెరువు కట్ట. కట్టను ఒరుసుకుంటూ దబకలాడుతున్న స్వచ్ఛమైన నీరు. జలాశయానికి తూరుపు సరిహద్దుగా పచ్చటి కొండలు, జలతారు పోగుల్లా జాల్వారుతున్న మంచుసోనల్లోనుంచీ అప్పుడప్పుడే కొండపైకి వస్తున్న సూర్యబింబం. సూర్యకిరణాల ప్రసారంవల్ల చెరువు నీటితో మిలమిలలాడుతూ ఏర్పడిన వెలుగుబాట. కట్ట పొడుగునా నిలబడిన పాతకాలపు తరువుల్లో లేయెండ వెలుగులు పడి తళతళా మెరిసిపోతున్న రావి ఆకులు...

ఆ దృశ్యాన్ని మేము కవితలో నిబంధించాలట!

దొరవారి ఆదేశం!!

"సాయంకాలందాకా గడువిస్తున్నా. మీరు రాసిందేదో నా చేతిలో పెట్టి వెళ్లండి" అంటూ ఆయన మెట్లు దిగి దివాణం వైపు వెళ్ళిపోయారు.

రంగభట్టుగూడా మీసాలు పురి తిప్పుకుంటూ ఎంతో గుంభనంగా ఆయన్ను వెంబడించారు. నేను మాత్రం చెట్టు బోదెకానుకుని చెరువు కట్టపైనే కూలబడిపోయాను.

రోటిలో తలదూర్చాక రోకటి పోటుకు వెరచి లాభమేముంది? కవిత రాయడం వేరు. ఆ పని పైన పోటీకి తలపడడం వేరు. మొదటి దానిలో ఒత్తిడి ఉండదు. అందీ అందనట్టుండే భావం అందుబాటులోకి వచ్చేదాకా వేచి ఉండొచ్చు. కొంతకాలం గడచిన

తర్వాత మళ్లీ ఒకసారి చదివిచూచి, అవసరమైన చేర్పులూ మార్పులూ చెయ్యొచ్చు. పోటీలో ఇదంతా కుదరదు గదా! పందెమన్నాక పరుగెత్తాల్సిందే! ముందూ వెనకా చూచుకోడానికి వీలుండదు.

నేను అలా కూర్చుని ఉండగానే జాము పొద్దెక్కింది. కడుపులో పేగులు నకనక లాడుతున్నాయి. నీరసంతో కనురెప్పలు బరువెక్కి వాలిపోయాయి. కళ్ళు తెరుచుకున్నప్పుడు ఎట్టఎదుట కనిపించిన దృశ్యం కళ్లు మూతలు పడేసరికి అంతరంగంలోకి వచ్చి నిలిచిపోతోంది. చెదిరిపోకుండా ఆ దృశ్యాన్ని మనసులో చిక్కబట్టుకున్నాను. ఎప్పుడో ఏ క్షణాన్నో బుర్రలో ఓ మెరుపు మెరిసింది.

"మంచు వలిపం కట్టుకున్న ప్రకృతి సుందరి
తన నుదట పెట్టుకున్న కుంకుమ బొట్టులా
తూరుపు కొండ రొమ్ముపైన
సూర్యబింబం మెరిసిపోతోంది..."

అరరే. ఒక భావం స్ఫురించిందే! ఇలాగే మరికొన్నింటిని పదాల్లోకి పొదగడమే గదా కవిత్వమంటే! ప్రయత్నించి చూద్దామన్న పట్టుదల నాలో పీరం వేసింది.

"ఎంత చూచినా తనివితీరని అందాలు
స్వచ్ఛమైన చెరువు నీటి అద్దంలో
మరీ మరీ చూచుకుంటూ
సృష్టి కాంత మురిసిపోతోంది
విశ్వసౌధంలో జరగబోయే
శుభకార్యాన్ని వీక్షించే నిమిత్తం
దివినుండి దిగి వచ్చే సుర వనితలకోసం
చెరువు కడ్డంగా వేసిన వెలుగుబాట
వెండి తివాచీలా కన్నులపండువగా ఉంది.
చల్లగా మెలమెల్లగా వీచే మలయ సమీరంలో
రెపరెపలాడిపోతూ,
బాలభానుడి బంగారు కాంతుల్లో
మిలమిల లాడిపోయే ఆకులతో
రావిచెట్లు పల్లెపైకి వింజామరలు వీస్తున్నాయి.
భావించి చూచేవాళ్లకీ
ప్రశాంత ప్రభాతవేళ
కన్నతల్లి ఒడిలా హాయిగా ఉంది
మధురగానం విన్నంత ఆనందంగా ఉంది
భగవంతుడి సాక్షాత్కారంలా అద్భుతంగా ఉంది..."

మెట్లు మెట్లుగా భావాలను పేర్చుకుంటూ వెళ్లే ప్రయత్నం ఇట్లాగే కొనసాగింది. చివరకు మనసేదో అనిర్వచనీయ రసానందంలో లయించినట్టు ఒక మధురానుభూతితో తనువు పులకించింది.

మడిచిన కాగితాలను నాయని వారికి చేర్పించి, నేను చక్కా మా ఊరికి వెళ్లిపోయాను.

అప్పటికెట్లాగో పరీక్ష అయితే రాశానుగానీ, ఫలితాల పట్ల నాకట్టే నమ్మకం లేదు. రెండు మూడు రోజులదాకా నారగింటివైపు తిరిగి మళ్లీ చూడకుండా మా ఊళ్లోనే ఉండిపోయాను. నాలుగోరోజు నాయనివారి దగ్గరినుంచి పిలుపు రానే వచ్చింది. బెదురు మనసుతోనే బయల్దేరి వెళ్లాను. దివాణం ముంగిట సైకిలు నేర్చుకుంటున్న నాయని వారి మనవడు 'రండి, రండి, తాతగారు పూజగదిలో ఉన్నారు. వస్తే మిమ్మల్ని కూచోమన్నారు' అన్నాడు.

గడపలో ద్వారబంధానికటూ, ఇటూ పెద్ద అరుగులున్నాయి. కుడివైపు అరుగుపైన కూచుంటూ, అపరిచిత వ్యక్తి ఎవరో ఎడమవైపు అరుగుపైన కూర్చుని ఉన్నట్టు గమనించాను. పేరు పెట్టి నన్ను పలకరించిన తర్వాతగానీ పోల్చుకోలేకపోయాను. ఎవరోకాదు... రంగభట్టే! పోల్చుకోలేకపోయినందుకు కారణం – మూతిపైన మీసాలు లేకపోవడమే! మీసాలుండిన లోటు బరాబయలుగా ఉంది.

"ఏమిటండీ భట్టుగారూ! ఎందుకిలా చేశారు!" అని ప్రశ్నించాను.

"పోటీలో ఓడిపోయినాను గదయ్యా! నాయనివారికి నా పద్యాలు నచ్చలేదు. నీ కవిత్వం నచ్చింది. అందుకనే మీసాలు తీసేశాను" అన్నాడు బుంగముఖం పెడుతూ రంగభట్టు.

లోపలికి వెళ్ళి నాయనివారితో భేటీ కాగానే, నా అంతర్యాన్ని నివేదించుకున్నాను– "అయ్యా, ఇది చాలా అన్యాయం. తమరలా సెలవిచ్చి ఉండకూడదు. రంగభట్టు ముఖం చూస్తుంటే ఏడుపొస్తుంది" అన్నాను.

వడగాలిలో కదిలిన ప్లాస్టిక్కు పువ్వులా నాయనివారి పెదవులపైన ఓ శుష్కహాసం మెదిలింది. "అయ్యో, ఇందులో నేను చెప్పింది ఏముంది నాయనా! తన పద్యాలు వీగిపోవడంతో తనంతట తానే తీసేసినాడు. అయినా మీసాలకేముంది? కొద్ది రోజుల్లోనే వచ్చేస్తాయి. ఆ మాటకొస్తే నా రాజ్యం పోయినా నేనేం చింతించలేదే! పొయ్యేవి పోకా మానవు. వచ్చేవి రాకా మానవు. దివాణంలో ఒక నగారా ఉండేది తెలుసునా నీకు? కొడితే దాని మోత మీ ఊరిదాకా గూడా వినిపిస్తుండేది. మూడు నెలలప్పుడు అది నెర్రెలు పడిపోతే ఎత్తుకపోయి మూలగదిలో పారేయమన్నాను. నగారా మాటకేముంది గానీ, దివాణానికి మిగిలిన ఆఖరు గుర్రంగూడా అయిదారు నెలల క్రిందట తనువు చాలించింది. ఇక్కడికొస్తూ చూస్తివిగదా, నా మనమడు సైకిల్ సవార్ నేరుస్తున్నాడు. రాయగలిగిన వాళ్లున్నంతకాలం పద్యం ఉంటుంది. లేకపోతే దాని స్థానంలో మరొకటి వస్తుంది. మొత్తంమీద జీవితయాత్రలో సేదదీర్చే చలువ పందిరి గదంటయ్యా కవిత్వమంటే? అది ఉండాల.

ఏదో ఒక రూపంలో ఉండి తీరాల! ఏదీ, 'కదిలేది కదిలించేదీ, పెనునిద్దర వదిలించేదీ, మునుముందుకు నడిపించేదీ...' అని వల్లిస్తూ ఉంటావే, ఆ కవిత ఒకసారి పూర్తిగా చెప్పు" అన్నారు నాయనివారు!

❖ ఆంధ్రప్రభ వారపత్రిక – 24 జులై, 1996. ❖

# మాయలేడి

ఉద్యోగికి దూర భూమి లేదంటారు. నేన్నమ్మను. అందకపోతేగదా ద్రాక్షపళ్లు పుల్లన! అందితే తియ్యగానే వుంటాయి. సత్తావున్నవారు స్వస్థలంలోనే ఉద్యోగం సంపాదించుకోగలరు. అక్కడ తగిన ఉద్యోగం లేకపోతే తనకంటూ ఒక పోస్టు క్రియేట్ చేయించుకోగలరు. రాజ్యం వీరభోజ్యమంటారు గదా! ఉద్యోగమున్నూ అంతే!

కరువు కాటకాలు వచ్చినప్పుడు రాయలసీమ ప్రజలు – బీదా బిక్కీ జనమేననుకోండి – పొట్ట చేతబట్టుకుని నదీ తీరమైదానాలకు వలస వెళ్లడం పరిపాటే! అందుకు భిన్నంగా ఒక విద్యావంతుడు బ్రతుకుతెరువుకోసం ఉత్తరాదినుంచి దక్షిణాదికి కొట్టుకొచ్చేశాడంటే ఏమనుకోవాలి? అదైనా భారీ గెజెటెడ్ ఉద్యోగమైతే ఆ సంగతి వేరు. ఇంతజేసీ హైస్కూలు టీచరు పోస్టు. 'ఈ మాత్రానికి నాలుగు జిల్లాలు దాటి యింతదూరం వచ్చారేమండీ మేష్టారుగారూ?' అంటే ఏడవలేక నవ్వు ముఖం పెట్టి 'ఉద్యోగికి దూర భూమి లేదు గదండీ!' అంటూ పాత లోకోక్తినే వల్లించాడు. ఆ బింకానికి వెనుక ఎంతటి దైన్యం గూడు కట్టుకుని వుందో మాకప్పటికి తెలియదు. ఆలోగా సర్టిఫికేట్లు తిరగేసి చూసిన ఆఫీసు గుమాస్తావల్ల విషయం కొంతవరకూ బోధపడింది. ఒకటి రెండు నెలల్లో ఆయనకు ముప్ఫై నాలుగోయేడు పూర్తి కావస్తోందట! ఇంకొక సంవత్సరం దాటితే ఉద్యోగార్హతకు కాలదోషం పట్టినట్టే! ఎవరు చెప్పగలరు? బహుశా యిదే చివరి అవకాశం కావచ్చు. అందుకని ఎండుటాకులా యిలా గిరవాట్లు తింటూ వచ్చినట్టున్నాడు మహానుభావుడు!

ఉద్యోగం సంపాదనలో వెనుకబడినప్పటికీ మిగిలిన విషయాల్లో నరహరి శర్మగారిది ముందంజేనని చెప్పాలి. ఇరవై రెండు వచ్చేసరికల్లా పెళ్లయిపోయింది. ముప్ఫైయేళ్లకల్లా ముగ్గురు బిడ్డల తండ్రి. అయితే అప్పటికే జీవితంలో ఎన్నో ఢక్కా మొక్కీలు తిన్న శర్మగారి భార్య అదంతా గొప్ప పురుష ప్రతాపమని భావించలేదు. పురుష లక్షణమైన ఉద్యోగమనేది ఒకటి లేకపోతే ఎంత జన్మభూమి అయినా నరక సదృశమేననీ, ఎంత దగ్గరి వ్యక్తులైనా శత్రుతుల్యులేనని ఆమెకు తెలిసిపోయింది. మరింక భర్తకు ఉద్యోగం దొరికిన చోటు ఆమెకు పుణ్య స్థలంగా తోచడంలో విడ్డూరమేముంది? శర్మగారు ఉద్యోగంలో చేరిన వారం రోజులకే ఆమె బిడ్డలతోను, కొద్దిపాటి లగేజితోను వచ్చి మా వూర్లో దిగబడిపోయింది. చిన్న చుట్టిల్లు అయినా చాలు, సర్దుకోగలనంటూ స్థానికులైన మాకు భర్తద్వారా రాయబారం పెట్టించింది. కనీసపు సదుపాయాలతో కూడిన చిన్న పెంకుటింటినే చూచి పెట్టగలిగాను. చిల్లరకొట్టులో ఖాతా ఏర్పాటు చేశాను. పాలు, వంట చెరకు, కూరగాయలు మొదలైనవి నా పూచీమీద వాళ్ల యింటికి చేరేటట్టు ఆయా వ్యక్తులకు పురమాయించాను. మనుషులంటే మారుగబ్బుగా నడుచుకుంటూ వచ్చిన శర్మగారి భార్యకు ఎదుటివారి సద్భావ సౌజన్యాలపట్ల ఎక్కడలేని నమ్మకం పుట్టుకొచ్చేసింది. మొగమాటం లేకుండా ఎదుటికొచ్చి నిలబడి 'అన్నయ్యగారూ! మీ మేలు జన్మజన్మలకు మరచిపోలే' మంటూ చేతులు జోడించింది. పాపం, శర్మగారుగూడా మనసువిప్పి తన సోదంతా నా దగ్గర వెళ్లబోసుకున్నాడు.

"నాయనా బాలాజీ! నువ్వదృష్టవంతుడివి. పుట్టి పెరిగిన చోటనే నీకు ఉద్యోగం దొరికింది. ఉద్యోగంకోసం ఊళ్లు తిరగడమంటే ఏమిటో, మెట్లెక్కి దిగడమంటే ఏమిటో, ఉదయం ఎన్నో ఆశలతో నిద్రలేచి రాత్రుల్లో నిరాశగా పడుకోవడమంటే ఏమిటో నీకు తెలియదు. పడిన పడుబాట్లు ఆధారంగా సిద్ధాంత వ్యాసం రాసి పి.హెచ్.డి పట్టా పొందలేదు గానీ ఆ విద్యలో నేను అపారమైన అనుభవం గడించాను...' అనే పేరెప్పుడైనా విన్నావా? ఆ పట్నానికి ఏడు కిలోమీటర్ల దూరంలో మా వూరు – మానికొండ. మానికొండ సుందరనరసింగప్పెరుమాళ్లు అంటే ఒక కాలంలో ఒక వెలుగు వెలిగిన వైనం. చిన్న గుట్టపైన ముచ్చటైన గుడి. స్వామికి నవరత్న ఖచితమైన కిరీట, కేయూర, కంకణ, కంఠహారాది జవహరీ రెండు వీశెలదాకా వుండేది. మడి మాన్యాలకు కొదువేలేదు. గుడిలో దేవుడు కలకలలాడుతూ వుండినంతకాలం క్రింద అగ్రహారంకూడా మృష్టాన్నాలతో, పట్టు పీతాంబరాలతో, అగ్నిహోత్రాలతో, వేదగానాలతో అందాలకు నిలయంగా, ఆనంద ధామంగా వుంటూ వచ్చింది. ఇదంతా ఏనాటి మాట? నేను పుట్టక మునుపటి మాట. నా బుద్ధి నాకు వచ్చేటప్పటికి పరిస్థితులు పూర్తిగా వికటించాయి. క్షాత్ర తేజంనుండి మెరిసే సూర్యవంశపు రాజులకు, కోర మీసాల కొసల్ని జులపాలదాకా పెంచే తెలగ నాయుళ్ళకు గుడి ధర్మకర్తృత్వం పైన పేచీ వచ్చింది. ఉభయ వర్గాలు కోర్టుకు వెళ్లాయి. వాళ్లు హాజరుపరిచిన సాక్షుల కథనాన్ని విని విని, దాఖలు చేసిన రికార్డుల్ని చదివి చదివీ మునసబులకు మతులు పోయాయి. జడ్జీలు జుత్తులు పీక్కున్నారు. అఖరుకు హైకోర్టు గోడల్నికూడా అదరగొట్టేయాలన్న సంకల్పంతో కేసు హైదరాబాదుకేసి నడిచింది. ఈలోగా క్రింది కోర్టులిచ్చిన తీర్పుల మేరకు కొంతకాలం రాజులు, కొంతకాలం నాయుళ్లు ధర్మకర్తలుగా వుండి, చివరికెవరి పాలవుతుందో తెలియని గుడిలోని దేవునిపైన వైరాగ్యం పెంచుకుని, ఎంత దైవమైనా ఎత్తువారి చేతి బిడ్డేగదా అన్న కోపంతో వెక్కసపడిపోయి ఆయన భోగ భాగ్యాలను ఒక్కొక్కటిగా కత్తిరించడం మొదలెట్టారు. దిక్కులు తోచని హైకోర్టు మనుషులు చేసే గుడి మణియాన్ని రద్దుచేసి, స్పెషలాఫీసరును నియమించే సరికి నూనె అందక కొడిగట్టిన మట్టి ప్రమిదె దీపం చుట్టూ ముసరుకున్న చీకట్ల నడుమ సుందర నరసింగప్పెరుమాళ్లు మాసిన ఏకవస్త్రంతో, వన్నె తరిగిన పట్టెనామాలతో, పనికిమాలిన గిల్టు నగలతో వెలవెలపోతూ కనిపించాడు. అర్చకుడుగా మా నాన్నగారు నేర్చుకున్న నిత్యానుష్టానాలు, కరావలంబన స్తోత్రాలకు గుడిలోపలగానీ, బయటగానీ పూచిక పుల్లంత పరపతిగూడా లేకపోయింది. చిరకాలపు కైంకర్యానికి ఫలితంగా భగవంతుడాయన కిచ్చిందే ఒక ఆయవారపు చెంబు అయితే, ఆయన నాకేమిస్తారు? పైపెచ్చు ఏడుగురు సంతానంలో నేనొకడినై పోతిని. ఉప్పు తిని పోయిన గోడలతో, పెంకులు విరిగిపోయిన పై కప్పుతో, పెచ్చులెగిరిపోయిన నేలమట్టంతో జ్యేష్ఠాదేవి కొలువు కూటంలా తయారైన ఆ యింట్లో రచ్చలు, రగడలు, ఏడ్పులు, నిట్టూర్పులేగానీ నవ్వులు మాత్రం వినిపించేవిగావు. మానికొండ హైస్కూల్లో చదువు ముగించేదాకా మా యింట్లో నాకు తిండి దొరకడమే హెచ్చు. ఆ పరిస్థితుల్లో అంతకుమించి చదువుకోవాలని అనుకోవడం అత్యాశేనని నాకు తెలుసు. మండీలో లెక్కలు రాయడం, హోటల్లో టిఫిన్లందివ్వడం, థియేటర్లో టిక్కెట్లివ్వడం – యిలా చిన్నపని ఏదైనా దొరుకుతుందేమోనన్న ఆశతోనే నేను పట్నంలో కాలు మోపాను. అక్కడికి వెళ్లాక తెలిసొచ్చింది. బీద బ్రాహ్మలకు ఉచితంగా అన్నం పెట్టడమనే సాంప్రదాయం భారతదేశంలో ఇక్ష్వాకుల కాలంనుంచీ

వుందట! బ్రతుకుదెరువుకోసం నేను కాలుమోపిన పట్నంలో గూడా అలాంటి వాటిలో ఇంకా ఒక అన్నసత్రం మాత్రం కొన ప్రాణాలతో మిగిలి రారున చనిపోవడానికి గానీ, జబర్దస్తీగా జీవించడానికి గానీ వీల్లేకుండా ఆశ్రితులైనవారి కొకపూట భోజనం మాత్రం పెడుతోందట. నదిలోబడి కొట్టుకపోతూ దొరికిన కొయ్య దుంగను ఆలంబనగా పెట్టుకున్న వాడిలా నేను ఆ అవకాశాన్ని చేజిక్కించుకున్నాను. ఆశాకిరణం ఒకటి కనిపించేటప్పటికి చదువుకోవాలన్న కోరిక మళ్లీ చిగురించింది. ఉదయం అయిదు గంటలకు లేచి, పేపర్లను ఇళ్లకు చేరవేస్తూ, ఆ పనిమీద వచ్చిన అదనపు రాబడితో, ఎట్లాగో ఇంటరు చదువులోగూడా గట్టెక్కగలిగాను. ఒక ప్రక్క బ్రతకడం కోసం, యింకొక ప్రక్క చదువుకోవడంకోసం పరిస్థితులతో జరిపిన పోరాటంలో నేనప్పటికి పూర్తిగా అలసిపోయాను.

దానికితోడూ ఒంటిపూట భోజనం పెడుతూ వచ్చిన అన్నదాన సత్రానికిగూడా అప్పటికి నూకలు చెల్లిపోయాయి. నా కాళ్ల మీద నేను నిలబడడంకోసం ఎన్నో ఆలోచనలు చేసి చూచాను. ఇతరుల మెహర్బానీతోగానీ, స్వంత పెట్టుబడితోగానీ అవసరం లేకుండా, స్వంత బాధ్యత మీద నడుపుకోడానికి వీలున్న వ్యాసంగంగా నాకు స్ఫురించిందొక్కటే. ట్యూషన్లు చెప్పుకోవడం. అయిదారుగురితోనే ప్రారంభించాను. క్రమక్రమంగా ఉదయం ఇరవైమందీ, సాయంకాలం ఇరవై మందీ చేరడంవల్ల నెలకు నాలుగైదువందలదాకా కళ్ల జూడడానికి వీలయింది. నా జీవితంలో నాకదే పెద్ద సంపాదన. రోజులట్టా ఆనందంగా గడిచిపోయి వుండేవేనేమో! పులిమీద పుట్రగా వేలు విడిచిన మేనమామ ఒకాయన నాకు తారసిల్లాడు. నన్ను మించిన ప్రయోజకుడు మరొకరు లేనట్టు ఆయన తన మూడో కూతురిని నాకిచ్చి పెళ్లి చేశాడు. ఆ పెళ్లిలోనూ, పెళ్లయిన కొత్తలోనూ ఏమానందం అనుభవించానో, అంతే సంగతులు! తరువాత జీవితమంతా కృష్ణపక్షమే. కట్టుకున్న భార్యకు, కన్నబిడ్డలకు కనీసపు కోరికలు తీర్చాలన్నా నా సంపాదన సరిపోదని నిరూపణ అయిపోయింది. నా పాలబడిన నేరానికి వాళ్ల బ్రతుకునలా ఇసుకపర్రగా వదిలేయడం అమానుషమనిపించింది. ప్రయత్నలోపమేమీ లేదు. ప్రయివేటుగా బియ్యే పాసయ్యాను. బియ్యీడీ చేశాను. కాలికి బలపం కట్టుకుని ఆఫీసుల చుట్టూ తిరిగాను. ఉద్యోగం నా పాలిటికి మాయలేడి అయిపోయింది. ఒకరాజుగారు రెకమండ్ చేస్తే ఒక నాయుడుగారు అడ్డు తగిలేవారు. ఇంటర్వ్యూ చక్కగా చేశాంగదా, ఉద్యోగం ఖాయమనుకుంటే నలుడి పంచగుడ్డను పావురాలెత్తుకపోయినట్టుగా దాన్ని ఏ బంగార్రాజో, బాపినాయుడో తన్నుకపోయేవారు. ఆర్డరు చేతికొచ్చింది కదా అని ఆనందించడానికి వీలుండేదిగాదు. చేతికందిన కవళం నోటి కందితేగదా! బూరగపండు తినడంకోసం వేచి చూచే చిలక చందమైపోయింది నా బతుకు! నాయనా బాలాజీ! ఏం జెప్పమంటావు? ఒకటిగాదు. రెండుగాదు. నిండుగా పదేళ్లు. అడితే ఆడొచ్చు – కోకో ఆట! తావు చూసుకుని కూచోబోతానా, అదే క్షణంలో గూబ గుంయ్‌మనేటట్టు 'కో' అంటూ కేక! మళ్ళీ పరుగెత్తు పరుగెత్తు! పరుగో పరుగు! ఎప్పుడయ్యా నాకు తావు దొరికేది? కాదంటే ఆడొచ్చు – మూజికల్ ఛేర్స్! ఉన్న కుర్చీలు తొమ్మిదైతే చుట్టూ పరుగెత్తే వాళ్లం పది మందిమి. గుండె ధిగ్గుమనేట్టుగా విజిల్ వినిపించేటప్పటికి మిగిలిన తొమ్మండుగురూ కుర్చీల్లో బైటాయించి వుంటారు. మొదటి రౌండులోనే నేను అవుట్..."

కొద్ది నిమిషాలదాకా మౌనంగా వుండిపోయి నేనన్నాను – "ఏమైనా ఫరవాలేదు లెండి మేష్టరుగారూ! మీరు మార్గాంతరం గురించి ఆలోచించడం చాలా మంచిదైపోయింది.

ఇక్కడికొచ్చి చేసిన తొలి ప్రయత్నంతోనే ఫలితం కనిపించినందుకు ఎంత సంతోషంగా వుందో చెప్పలేను. అర్హత కలిగిన వ్యక్తికి న్యాయం జరిగిందంటే యిక్కడ ధర్మం కాస్తా మిగిలి వున్నట్టే లెక్క..."

శర్మగారు పెదవులు బిగించి పట్టుకుని తీక్షణంగా చూస్తూ నా తెలివితేటల్ని ఆరా తీస్తున్నటుగా ప్రశ్నించారు. "బాబూ బాలాజీ! ఈ ప్రాంతం మట్టుకు దేశంలో ఒక భాగం కాదంటావా?"

నేను తల్లక్రిందులైపోయాను. మబ్బు గుర్రాలపైన తేలిపోతున్న నా ఊహను భూమార్గం పట్టించాను. ఉన్న అవకతవకలు, అవలక్షణాలు దేశం ఎల్లెడలా వున్నాయి. అందుకే ప్రదేశమూ మినహాయింపుగాదు. అయినా యిక్కడ పాదం మోపడంతోటే వెదకబోయిన తీగ ఈయన కాళ్లకు చుట్టుకున్నదంటే...

"అందుకు కారణం ఇంద్రజాలమేమీ కాదులే!" కొనసాగించాడాయన. "ఇంటర్వ్యూ బోర్డులో ఎవరుండినా, ఎవరుండకపోయినా డి.ఇ.ఓ.గారుంటారన్నది అందరికీ తెలిసిన విషయమే గదా! బండి దిగగానే నేను వివరాలు వాకబు చేసి తెలుసుకున్నాను. ఆయన పేరు జోగి సోమయాజి. ముక్కుకు సూటిగా వెళ్ళేరకమని అన్నారు. అంతకంటే నేరమెక్కడైనా వుందా? రాజ్యాధినేతల ఉక్కు పిడికిలి ఆయన తలపైన మొట్టికాయ వేయని చోటే లేదట! వాళ్లతో వచ్చిన వివాదాలకు, ఏర్పడిన గొడవలకు యింకొకరెవరైనా అయితే హై బీపీతో అయిపు లేకుండా పొయ్యేవారట! ఆయన నీతే ఆయన్ను కాపాడి వుంటుందని జనవాక్యం. పైపెచ్చు ఆయన రిటయిరు కావడానికింక మిగిలివున్నదల్లా రెండు నెలలు మాత్రమే! తోడ్పడితే అలాంటివాడే నాకు తోడ్పడాలన్నది నా నమ్మకం గూడా! మరునాటి ప్రాతఃకాలం ఆ యింటి యిల్లాలు తలుపు తీయగానే నేను లోపలికి చొరబడ్డాను. సోమయాజులుగారి పాదాలపైన పడలేదుగానీ, పడినంత పని చేశాను. ఏడవలేదుగానీ ఏడ్చినంత పని చేశాను. వింటే విను, వినకపోతే పొమ్మన్నట్టుగా, టేప్‌రికార్డర్ ఆన్ చేసినట్టు నా గోడంతా ఏకబిగిన వినిపించేశాను. ఎందుకులే? ఆయనగారి ముఖం జేవురించిపోయింది. కళ్లు ఎర్రబడ్డాయి. 'మధ్యాహ్నం ఇంటర్వ్యూ అయితే, తెల్లవారే టప్పటికి నా దగ్గరకొచ్చి చెవిలో రొదపెడుతున్నావు. ఎంత ధైర్యమయ్యా నీకు! వెళ్లెళ్లు జాప్యం చేశావో, పోలీసులకు ఫోన్ చేస్తాను. నిన్ను ఇంటర్వ్యూకే డిస్క్వాలిఫై చేస్తా'నంటూ అదరగొట్టేశారు. 'నిందు మనంబు నవ్య నవనీత సమానము, పల్కులాఖండల శస్త్రతుల్యము' అన్నారు గదయ్యా నన్నయ్యగారు! ఆ మాట సోమయాజులుగారి పట్ల సార్థకమైంది. ఆయన చెక్కు చెదరకుండా నా పక్షాన నిలిచారు..."

ఎట్లాగో తన పబ్బం గడిచిందన్న సంతృప్తికన్నా, దాని నేపథ్యంలో ఎదురైన మనోగ్లాని శర్మగారిని నీడల దెయ్యంలా వెంటాడుతూ వున్నట్టు నేను గమనించాను. నా తాహత్తేమిటో తెలుసుకోకుండా కొన్ని పెద్దపెద్ద బాధ్యతలను భుజాన వేసుకోజూడడం నాకాదినుంచీ వున్న అలవాటే? ఆ మేరకు అసలు సమస్య ఎంతటి తీవ్రమైనదో తెలుసుకోకుండా ఏదో పొడి పొడి మాటలతోనే ఆయన్ను ఓదార్చ బోయాను.

"పడ్డ కష్టాలన్నీ పడ్డారు. ఇక మీదట మీకెలాంటి బాధలుగానీ వుండవు లెండి మేష్టారుగారూ! నిశ్చింతగా వుండండి."

ఒకటి రెండు క్షణాలు నావైపు అయోమయంగా చూచి ఆ తరువాత అందుకున్నారు శర్మగారు.

"నా ఒక్కణ్ణి గురించి కాదయ్యా నా బాధ! ఇదేమిటిలా జరుగుతోందన్నదే నా విచికిత్స. ప్రాణి పుట్టుక చాలా యాదృచ్ఛికమైన విషయం. నేను ఉత్తర ధ్రువంలో ఎస్కిమోల పిల్లాడినై పుట్టి వుండొచ్చు. బ్రిటీషు దీవుల్లో అచ్చం ధవళకాంతి శరీరఛాయతో పుట్టి వుండొచ్చు. ఇంకా ఆఫ్రికాలో, కొరియాలో, జపాన్‌లో ఎక్కడైనా పుట్టి వుండొచ్చు. భారతదేశాంతర్గతమైన ఆంధ్రప్రదేశంలో ప్రత్యేకించి ఫలానా 'తెగ'లో పుట్టాలని నేనే దేవుణ్ణో ప్రార్థించలేదు. నేను పుట్టకముందు అనేక దశాబ్దాలనాడే దానికి 'అగ్రవర్ణ'మన్న కితాబు ఒకటి కట్టబెట్టమని మనువుల్నిగానీ, ప్రజాపతుల్నిగానీ నేను కోరలేదు. 'నువ్వు పుట్టిన దేశం గొప్పది. నీ కులం గొప్పది. నీ పూర్వులు గొప్పవాళ్ళు?' అంటే సంతోషించడం సామాన్య మానవుల స్వభావం. ఒకప్పుడు నాకున్నూ మహదానందంగానే వుండేది. మా అగ్రహారంలో సంస్కృత భాషా విశారదులైన వృద్ధ పండితులు (అప్పటికే వాళ్లు ఒంటిపూట భోజనమైనా కడుపు నిండా చేయలేని దుర్దశలోకి వచ్చేశారన్నమాట అటుంచు) చెప్పుకోగా నేను చాలాసార్లు విన్నాను. మేము భారతీయ సంస్కృతీ పరిరక్షకులం. ఆర్షధర్మమనే మహాసౌధానికి బలమైన పునాదులం. మంత్రులమై రాజ్యాలను పాలన చేశాము. సేనానులమై యుద్ధాలు నిర్వహించాము. ఋత్విజులమై యాగాలు జరిపించాము. ఘనాపాఠీలమై వేదాలను తిరగ చదివాము. ఆచార్యులమై అజ్ఞాన తమస్సులను పారదోలాము. పురోహితులమై జనాన్ని పురోగతులకు నడిపించాము. బాగుంది. ఈ ఘనకీర్తి బాగానే వుంది. ఒప్పుకుంటాను. కానీ భూసురుడినన్న కితాబు నాకు భోజనం పెట్టడం లేదే! బ్రాహ్మడినై పుట్టినందుకు పదేళ్లు ఉద్యోగం లేకుండా అలమటించానే! రేకెత్తని తాజా పూలదండనైతే ఎవరైనా మెడలో వేసుకోడానికి ఉబలాట పడతారు. పువ్వులన్నీ రాలిపోయాక, అవశేషపు నూలు దారాలు ఉరి పోసుకోడానికి తప్పితే మరెందుకు పనికొస్తాయి? వృత్తుల్ని బట్టి వర్ణాలన్నావు, ఆ నియమం ఎక్కడ ఏడ్చింది? బ్రాహ్మడు బాటాలో చెప్పులమ్ముతున్నాడు. క్షత్రియుడు బల్లదగ్గర కూర్చుని కచేరిలో ఉద్యోగం చేస్తున్నాడు. ఆర్థిక స్తోమత వున్నవాళ్లెవరైనాసరే, కుల మత భేదాల పాటింపు లేకుండా వ్యాపార, వాణిజ్య రంగాలలోకి నిరాఘాటంగా దూసుకుపోతున్నారు. శరీర దారుఢ్యం సరిపోతే చాలు భారత జాతీయుడెవడైనా మిలిటరీలో చేరొచ్చు. వృత్తుల రీత్యా వర్ణ వ్యవస్థకు అర్థం లేకుండా పోయింది. అయినా ప్రభుత్వం చట్టరీత్యా కొన్ని సదుపాయాలు కల్పించి కొందర్ని మాలిమి చేసుకుంటోంది. మరి కొందర్ని మీ చావు మీరు చావండి అని గాలికి వదిలేస్తోంది. అంగబలం, అర్థబలం, అధికారబలం వున్నవాళ్లు తమ కోసం, తమ వాళ్లకోసం ఇతరుల అవకాశాలను గూడా గద్దల్లా తన్నుకపోవడంలో ఆరితేరిపోయారు. ఇలా ప్రజల్లో కొందరు ముద్దు బిడ్డలుగాను, కొందరు సవతి బిడ్డలుగానూ పరిణమిస్తే ఎలా? 'ఎల్లలోకము లొక్కయిల్లై, వర్ణ భేదములెల్ల కల్లై' అన్న మహానుభావుణ్ణి మనం వేదికలపైన మెచ్చుకుంటాము. వర్ణాశ్రమ ధర్మాలను పునరుద్ధరించమనేవారి అడుగు జాడల్లో నడుస్తాము. ఎప్పుడు నాయనా ఈ దేశానికి విముక్తి? ఎప్పుడు బాబూ ఈ దేశంలో సమ ధర్మమూ, సమసమాజమూ నెలకొనేది?"

ఓ యబ్బో, చిన్న మట్టిగడ్డే ననుకున్నాను. ప్రేలిపోయాక తగు మాత్రపు అగ్నిపర్వతమని తెలిసింది. అయినా వ్యక్తిమాత్రుడు కంఠశోష పెట్టుకోగలడే తప్ప వ్యవస్థనెలా బాగు చేస్తాడు? ఆ పని మహామహామహనీయుల వల్లనే సాధ్యం గాకపోయింది గదా!

యుద్ధానికీ యుద్ధానికీ మధ్యనే శాంతి అంటారు. కొందరి బ్రతుకున్నూ అంతే! శర్మగారికి మా వూరెంతగానో నచ్చింది. మా వూరి వాళ్లకున్నూ ఆయన అభిమాన పాత్రుడయ్యాడు. మావూరి గ్రామీణ సమాజంలో ఆ కుటుంబం పాలలో పంచదారలా కలిసిపోయింది. కానీ ఏం లాభం? అలా ఒక సంవత్సరకాలం గడవకముందే రాబందు రెక్కల నీడలా ట్రాన్స్ఫరొచ్చి ఆయన పైన వాలింది.

అదెలా జరిగిందంటె -

మా వూరికి 16 కి.మీ దూరంలో వున్న ఒక పెద్ద గ్రామం అయినంపాడు. ఎస్సెస్సీ పబ్లిక్ పరీక్షకు కూర్చున్న వాళ్లందరూ ఇంగ్లీషు సబ్జెక్టులో ఫెయిల్ కావడం వల్ల, ఆ వూరి హైస్కూలు పరీక్షా ఫలితాల్లో రికార్డు సాధించింది. అందుకు కారకుడైన ఇంగ్లీషు టీచరు సిగరమాకుల వరదారెడ్డిని డి.ఇ.ఓ. గారి ఫర్మానా పైన యాజమాన్యం పనిష్మెంటు చర్య క్రింద కర్ణాటక సరిహద్దులోని గాలివీడుకు బదిలీ చేసింది. వరదారెడ్డి రిలీవయ్యాడేగాని గాలివీడువైపు మాత్రం తిరిగి చూడనేలేదు. అందుకు బదులుగా జిల్లా ముఖ్య పట్టణానికి నాలుగైదుసార్లు వెళ్లొచ్చాడు. ఒకసారి హైదరాబాద్‌గూడా దర్శించాడు. సర్పయాగ ప్రమాదంనుంచి బయటపడదలచిన తక్షకుడిలా సదరు వరదారెడ్డి ఏ ప్రజాప్రతినిధి సింహాసనానికి చుట్టుకున్నాడో గాని నరహరిశర్మగారిని గాలివీడుకు బదిలీ చేసి, మా హైస్కూల్లో ఏర్పడిన ఖాళీలో ఆయన్ను నియమించారు. ఆ విధంగా ఒళ్లు వంచి చిత్తశుద్ధితో డ్యూటీ నిర్వహించిన నేరానికిగాను తండ్రి యయాతి ముసలితనాన్ని తనపైకి అవగాహన చేసుకున్న పూరుడిలా, పాపుల పాపాలకుగాను తాను బలైపోయిన క్రీస్తు ప్రభువులా నరహరిశర్మగారు నూలు తెగిన గాలిపటంలా గాలివీడుకు కొట్టుకపోయారు.

నాలుగైదేళ్లు గడిచిపోయాయి. ఉత్తర ప్రత్యుత్తరాలు కొనసాగించే మానసిక స్వస్థత శర్మగారికి ఉండాలనుకోడం దురాశే! బావిలో పడేసిన గుండ్రాయిలా ఆయన అతీగతీ తెలిసిందిగాదు. ఉన్నట్టుండి ఒకసారి స్పాట్ వాల్యూయేషన్ కేంద్రంలో ఎదురు పడిపోయాడు. మనిషి చిక్కి సగమైపోయాడు. ఎడారిలో దారితప్పి పోయినవాడిలా వాడి, వడిలి, రూపే మారిపోయింది. "నాయనా బాలాజీ, నువ్వు క్షేమమా? నీ తల్లితండ్రులు క్షేమమా? నీ భార్యాబిడ్డలు క్షేమమా? మన సహోపాధ్యాయులందరూ క్షేమమా?" అని పేరు పేరునా అందరి కుశల వర్తమానాలు అడిగి తెలుసుకున్నారు. చివరకు "మీ సంగతేమిటి మేష్టరుగారూ?" అని నేనడిగితే "నాయనా! మేమంతా క్షామం" అని నిర్వేదం ప్రకటించారు. "ఏమిటి స్వామీ? ఎందుకలా అంటున్నారు?" అన్నాను. "మరేమనను బాబూ! అది పల్నాటి సీమకు తోబుట్టువులాంటి పడమటి గడ్డగదా! గడ్డీ గాదమూ, బోద దుబ్బులు, కంప మొక్కలు తప్పితే మరేవీ మొలిచి బ్రతకవు గదా! దేవ మాతృకలైన ఎత్తుపల్లాల ఎర్రదుమ్ము నేలలుగదా! ఏం చేయగలం చెప్పు! అరమైలు దూరం నుంచీ తెప్పించుకున్న మంచినీళ్ళను టానిక్కులా వాడుకుంటాం. ఏ వస్తువు కావాలన్నా దబడబలాడే రేకుల బస్సుపైన పాతిక మైళ్లల్లో వున్న బస్తీకి చేరుకుంటాం. తప్పీదారీ ఎప్పుడైనా ఓ న్యూస్ పేపరు ఊళ్లోకి వచ్చేస్తే అడ్వర్‌టైజ్‌మెంట్ల దగ్గరినుంచి 'ఎడిటర్ అండ్ ప్రింటెడ్' దాకా చదివి, ప్రపంచ వార్తల్ని తెలుసుకుంటాం. స్కూల్లో తరగతి గదుల పూరికొట్టాల పైన కప్పు ఎగిరి పోవడంవల్ల వున్న ఒకేఒక రావిచెట్టు నీడలో బోదెకు చుట్టూరా మేమూ, పిల్లలమూ ఏంచక్కా వివిధ వయోరూపాల బోధిసత్వులంలా కూర్చుంటాం. పెద్దపిల్ల గాయత్రికి పదిహేనో యేడు. టెన్త్ క్లాసు కొచ్చింది. వచ్చే సంవత్సరం ఏం చదువుతుందో,

ఎక్కడ చదువుతుందో నన్నడగొద్దు. కుర్రాడికి పతంజలి అని పేరు పెట్టానని నీకు తెలుసుగదా! వాడు బ్రహ్మ సూత్రాలకు భాష్యం ఆలోచిస్తున్నట్టు ఆకాశంకేసి చూస్తూ కూచుంటాడేగానీ, చదువుపైన మొగ్గు జూపడంలేదు. చిన్న పిల్ల దేవయానికి వేలు చూపిస్తే, హస్తం మ్రింగేసే తెలివి తేటలున్నాయి. ఉంటే సరిపోయిందా? అవి వినియోగమయ్యే అవకాశాలు చూపించాలి గదా! ఏమిటో నాయనా, బ్రతుకిలా తెల్లవారింది. ఎలా ప్రొద్దుపోతుందో తెలియదు" అంటూ ఆయన ఉసూరుమన్నారు.

కసువుకుప్పలో పడిపోయిన సూదిలా ఆ తర్వాత చాలాకాలం వరకు కనిపించకుండా పోయారు నరహరిశర్మగారు. ఒక సన్నిహిత వ్యక్తి జీవించివున్నాడనడానికి నిదర్శనం ఎప్పుడో ఎక్కడో హఠాత్తుగా తారసిల్లడమే! అదే జరిగింది. ఈసారి పుత్తూరు బస్‌స్టాప్‌లో కార్వేటి నగరం వెళ్ళే బస్సుకోసం వేచి వుండగా, తిరుత్తణి – నగిరి – నాగలాపురం బస్సునుంచి దిగి, ఒక చేత పొడుగాటి సన్నటి బరువైన సంచీతోనూ, మరొకచేత పకడ్బందీగా ప్యాక్ చేసిన అట్టపెట్టెతోనూ తిరుపతి బస్సులు నిలిచేవైపుగా సాగిపోతూ కనిపించారు నరహరిశర్మగారు. పరుగెత్తుకుంటూ వెళ్ళి దారికడ్డంగా నిలబడిపోయాను. "ఏమిటంటే మేష్టరుగారూ! ఎక్కడికిలా? ఇప్పుడెక్కడున్నారు? ఈ లగేజి అంతా ఎవరికోసం?" అంటూ ప్రశ్నలు గుప్పించాను.

అంతటి ఉద్వేగ సందర్భంలోగూడా నేను కొంచెం తెలివిగా ప్రవర్తించాననే చెప్పుకోవాలి. అదేమిటండీ 'ఏమిటండీ మేష్టరుగారూ! ఇలాగైపోయారు!' అంటూ దిగులు వెళ్ళబోసుకోకపోవడం. అలా చేసి వుంటే పాపం, శర్మగారు వలవలా ఏడ్చేసి వుండేవారేమో! పలువురు ప్రయాణీకులుండేచోటు గదా! అలాంటి సన్నివేశం ఒకటి తయారుగాకపోవడం చాలా మంచిదైపోయింది.

మనిషి ఎట్టఎదుటనే వున్నా గొంతుక మాత్రం నూతిలో నుంచి వినిపించినట్టుంది.

"బాలాజీ, బాగున్నావా నాయనా! నా ప్రస్తుత నివాసం జమ్మికోట. తమిళనాడు సరిహద్దుకు క్రోసెడు దూరం. ఏ రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థగానీ పట్టించుకోని ఏకాంత, అజ్ఞాత, అరణ్య సీమ. ఆ మాటకొస్తే గాలివీడుకు, జమ్మికోటకు మధ్య నేను మరి కొన్ని వూళ్ళుగూడా దర్శించాను. అందువల్ల జిల్లా నైసర్గిక స్వరూపం, చారిత్రక విశేషాలు, సాంఘిక పరిస్థితుల, రాజకీయ వాతావరణం మొదలైన వాటిని గురించి క్షుణ్ణంగా ఆకళించుకుని నా లోక జ్ఞానాన్ని యిబ్బడి ముబ్బడిగా పెంపొందించుకోగలిగాను. నాపైన ఎన్నో ప్రయోగాలు చేసిన తర్వాత మన మేనేజిమెంటువారు ఆఖరుకు నాకన్ని విధాలా లాయల్ అయిన చోటేదో నిర్ధారణ చేయగలిగారు. అదే జమ్మికోట. మిగిలిన ప్రపంచంతో నామమాత్రమైన సంబంధాలు మాత్రమే కలిగి వుంటుంది గనుక దాన్ని బహిరంగ చెరసాల అనొచ్చు. అందులో నాకు పునరాలోచనకు తావులేని జీవిత శిక్ష..."

అదే ధోరణిలో వదిలిపెడితే శర్మగారెక్కడ మాట్లాడీ మాట్లాడీ, డస్సిపోతారోనని నేను భయపడిపోయాను. అందుకని దారి మళ్ళించడంకోసం "యిలా ఎక్కడికి వెళ్తున్నారో చెప్పలేదే?" అని ప్రశ్నించాను.

పెద్ద కుమార్తె గాయత్రి బియ్యే మూడో సంవత్సరంలో వుందట. పరీక్షలకు సిద్ధంకావడంకోసం సెలవులిచ్చారు. బుద్ధి స్తబ్ధమై పోయే జమ్మికోటకు రాకుండా ఆమె హాస్టల్లోనే వుందట. తల్లి బిడ్డ కిష్టమైన తినుబండారాలు తయారుచేసింది. శర్మగారు చెరకు ముక్కలు సేకరించారు. వాటిని కుమార్తెకిచ్చి రావడంకోసం ఈ తిరుపతి ప్రయాణం.

ముందుగా వెళ్తుంటే నేనాయన్ను వెనుకవైపునుంచి చూస్తూ నిల్చున్నాను. ముడతలు పడిన పంచపైన ముదురు కాషాయ రంగు జుబ్బా తొడుక్కున్నారు. దయ్యాన్ని చూచి జడుసుకున్నట్టుగా తల వెంట్రుకలు నిక్కబొడుచుకుని గాలిలో కదులుతున్నాయి. అరిగిపోయిన హవాయి చెప్పుల్లోని పాదాలపైన దుమ్ము ఒక వరస పేరుకపోయింది. సులోచనాలెక్కడ జారి క్రింద పడిపోతాయోనని, తల కొంచెం పైకెత్తి ఆకాశంవైపే చూస్తున్నారు. ఈ తీరు తెన్నులతో ఆయన మామూలు ప్రపంచానికి చెందిన వ్యక్తిలా లేడు. ఉన్నా దానికి దరిదాపుల్లో తారట్లాడుతున్నట్టున్నారు.

***

నరహరి శర్మగారు నాకు పుత్తూరు బస్‌స్టాండులో కనిపించిగూడా ఏడెనిమిదేళ్లు గడచిపోయాయి. ఆయన జీవిత వృత్తాంతాన్ని యథాతథంగా ఒక కథగా రాసి, దుఃఖభాగుడనో దైవోపహతుడనో పేరుబెట్టి, ఏ పత్రికకైనా పంపాలన్న సంకల్పం ఈ వ్యవధిలో నాకెన్నోసార్లు కలిగింది. కానీ అంతలోనే 'ఎందుకులే బాబూ! ముంజేతి కంకణానికి అద్దాలెందుకు! ఈ వాస్తవాలన్నీ ఎవరికి తెలియనివి? జీవన పోరాటంలో పరాజితులైన దురదృష్టవంతుల గుండెల్లోని విషాదాన్నంతా ఒక చోటికి చేరిస్తే అది మహాపర్వతాలనే మీరిపోతుంది. ఉన్నచోట వుండిపోకుండా అందులో కొంత త్రవ్వి తీసి మళ్లీ లోకంపైకి వెదజల్లడమెందుకని నన్ను నేను మందలించుకుంటూ వచ్చాను. అయితే ఇటీవల రెండు నెలల క్రిందట జిల్లా హెడ్‌క్వార్టర్స్‌లో పి.సి.సర్కార్ ఇంద్రజాలం లాంటి ఆశ్చర్యకరమైన సన్నివేశం ఒకటి ఎదురయ్యాక, శర్మగారిని గురించి కథ రాయడం ఒక అనివార్య అత్యవసర చర్యగా పరిణమించింది. ఆ ప్రేరణను త్రోసిరాజన లేక ఈ పనికి పూనుకున్నాను.

సూర్యోదయానంతరం జరిగిన ఒక పెళ్లికి హాజరై, కళ్యాణ మండపములోనే ఉపాహారం తీసుకుని, తొమ్మిది గంటల ప్రాంతంలో నేను కొత్త బస్‌స్టేషనువైపు నడచిపోతున్నాను. ఓవర్‌బ్రిడ్జి పైన నడుస్తుండగా ఆటో ఒకటి నన్ను దాటుకుంటూ సాగిపోయి, పది బారల దూరంలో ఆగిపోయింది. అందులోనుంచి ఎవరో ఒకాయన గొంతెత్తి బిగ్గరగా నన్ను పేరు పెట్టి పిలుస్తున్నాడు.

వెనుదిరిగి వెళ్లి ఆటో దగ్గర నిలబడి, వంగి లోపలికి చూశాను.

"నేనేనయ్యా, నీ పాత స్నేహితుణ్ణి! చాలా కాలమైపోయింది కలసి. ఎప్పటికప్పుడు నీకు ఉత్తరం రాయాలనే అనుకోడం. ఏమిటో, ఆ పనంటే నాకు బద్ధకం. ఎన్నో కబుర్లు చెప్పుకోవలసి వుంది. కూచో, కూచో..."

బాగా పరకాయించి చూచిన తర్వాతగానీ ఆయన నరహరిశర్మగారని నేను తెలుసుకోలేకపోయాను. మడత నలగని ప్యాంటు తొడుక్కున్నాడు. పళపళలాడిపోతున్న గోధుమ రంగు సిల్కు జుబ్బా వేసుకున్నాడు. వెడల్పాటి ఫ్రేముగల కళ్లద్దాలలోంచి వెలువడుతున్న చూపుల్లో దైన్యచ్ఛాయలు కానరావటం లేదు. చెప్పినట్టుగానే వినే కుదురుపాటుతనం క్రాఫింగుకుగూడా అలవడినట్టుంది. వయసుకు తగిన శరీర పటుత్వం, అంతకు తగిన ఉత్సాహం ఆయనకిప్పుడు అలవోకగా దక్కిన సొమ్ములుగా వున్నాయి. ఇదంతా ఏ అమృతపానంవల్ల, లేదా ఏ కాయకల్ప చికిత్సవల్ల సాధ్యమైందో అంతు పట్టడం లేదు.

"శ్రీ కన్య ఎదురుగా వెళ్లుబాబూ! మేమక్కడ దిగిపోతాం" అంటున్నారాయన.

హోటల్లో ఎ.సి. రూము ఆ వేళప్పుడు రద్దీగా లేదు. ఓ మూలగా కుర్చీల్లో కూచున్నాము.

"నాయనా బాలాజీ! మొదట క్షమాపణ చెప్పుకోవాలయ్యా నీకు! పొరపాటు జరిగిపోయింది. అమ్మాయి పెండ్లికి ఆహ్వానం పంపలేకపోయాను. అసలాహ్వాన పత్రికలు అచ్చువేయలేదనుకో! హఠాత్తుగా, అనుకోకుండా జరిగిపోయింది..."

కాస్త తటపటాయిస్తూ అడిగాను. "ఏమైనా ప్రేమ వివాహమా మేష్టరుగారూ?"

"అదేలే వర్ణాంతరం గూడా! అబ్బాయి పేరు ఆనందరెడ్డి. బుద్ధిమంతుడు. బాగా చదువుకున్నాడు. పంచాయతీరాజ్‌లో అసిస్టెంటు ఇంజనీరు. చింతగుంట మండల ప్రజాపరిషత్ ప్రెసిడెంటుకు అన్నగారి కుమారుడు. జిల్లా పరిషత్ వైస్ ఛైర్మన్‌తోగూడా దగ్గరి చుట్టరికం వుంది. మా అమ్మాయి బియ్యీడీకూడా అయింది గదా! అయినా భర్త జిల్లా పరిషత్‌లో ఉద్యోగం వద్దనేశాడు. శ్రీపురం కాలనీలో 'లిటిల్ ఏంజెల్స్ కాన్వెంట్' అని వుందిలే! దానికి కరస్పాండెంటూ, హెడ్ మిస్ట్రెస్ కూడా మా అమ్మాయే! రెండేళ్లలోనే సంస్థ బాగా వికాసదశలోకి వచ్చేసింది. గాయత్రి మాటకేం గానీ మా అబ్బాయికిగూడా ఒకదారి దొరకడమే నాకు గొప్ప రిలీఫ్. చచ్చి సేయంగల విన్నపాలతో బియ్యే పాసై గోళ్ళు గిల్లుకుంటూ ఉండేవాడు. ఎట్లాగో ఆ సమస్యకూడా తీరిపోయి, వెల్‌ఫేర్ డిపార్టుమెంటులో ఉద్యోగమైంది వాడికి! హాస్టలు వార్డెను..."

ఉష్ణోగ్రత, రక్తపీడన, గాలిలో తేమ మొదలైన వాటిని కొలవడానికి సాధనా లున్నాయి. ఆశ్చర్యాతిరేకంతో స్థాయీ భేదాలు కొలవడానికి మట్టుకు వున్నట్టు లేవు. అవధులు దాటిన ఆశ్చర్యం అనుభవైక వేద్యం మాత్రమే. ఆ స్థితిలో బహుశా బాహ్య ప్రపంచంతో సంబంధాలు తెగిపోతాయేమో! అందువల్లనే ననుకుంటాను, వెయిటర్ బల్లదగ్గర నిలబడి 'ఏం కావాలి' అని మళ్లీ మళ్లీ వాకబు చేయడం నా చెవి దాకా రానే లేదు.

"తాజాగా చేసిన స్వీట్స్ ఏమైనా వుంటే పట్టుకురా" అంటున్నారు శర్మగారు. అప్పటికి నా బాహ్య స్మృతిగూడా నా కొచ్చేసింది. మనసంతటా నిండిపోయిన ఆశ్చర్యం ముఖంలో ద్యోతకం గాకుండా జాగ్రత్తపడుతూ "చిన్నమ్మాయి బాగా తెలివైందని చెబుతుండేవారు గదండీ! ఏం చేస్తోంది?" అని అడిగాను.

"తెలివైందే! మెడిసిన్ మూడో సంవత్సరంలో వుంది. కానీ... కానీ ఏమిటంటే బాలాజీ..."

"ఫరవాలేదు, చెప్పండి సార్! నేను నాలోనే దాచుకుంటాను. బయటెక్కడా పొక్కనీయను" అని మాట యిచ్చాను.

"అబ్బే ఇతరులకు తెలిస్తే వాళ్లేదో తలగొట్టి మొలేస్తారని కాదయ్యా నా ఉద్దేశ్యం. నువ్వేమనుకుంటావో అనే నా బెంగ. నాకున్న కొద్దిమంది శ్రేయోభిలాషుల్లో నువ్వొక్కడివి. నా జీవితంలోని ఏ రహస్యాన్నిగాని నీ నుంచి దాచుకోలేదు. ఇంతకూ ఇదేమైనా దాచి పెడితే దాగే విషయమా? ఎప్పుడో ఒకప్పుడు బహిరంగమైపోయేదే గదా! ఏం లేదు. ఈ రెండో పిల్ల దేవయాని పెళ్లిగూడా సాంప్రదాయ బద్ధంగా జరిగేట్టు లేదు. అందున గురించి ఆమె ఒక నిర్ణయానికొచ్చేసింది. ఏం చేద్దాం చెప్పు. అక్కా, బావా దానికి వత్తాసు..."

గొంతు తగ్గించి "అబ్బాయి ఎవరండీ?" అని ప్రశ్నించాను.

"ఉన్నాడులే. టి.పి. నాయర్. దొరబిడ్డలా వుంటాడు. హవుస్ సర్జన్ చేస్తున్నాడు. తాంద్ర పురాన్ నాయర్..."

విజ్ఞానశాస్త్రం కులాంతర, మతాంతరం, ఆ మాటకొస్తే దేశాంతర వివాహాలకు గూడా అడ్డు చెప్పదు. పైగా ఎంతటి దూరపు సంబంధమైతే అంత మంచిదనే అంటుంది. చట్టం వాటికి అండగా నిలుస్తుంది. ప్రభుత్వాధినేతలు ప్రోత్సహిస్తారు. సాంప్రదాయవాదులు తాము దేన్నయితే సాంప్రదాయమనుకుంటున్నారో, దాన్ని సృష్ట్యాది నుంచి చెక్కు చెదరకుండా కాపాడుకుంటూ వచ్చిన కులంగానీ, మతంగానీ, జాతిగానీ ఒక్కటి, కనీసం ఒక్కటైనా ఈ ధరాతలంపైన వుందా? 'నువ్వే మనుకుంటావోననే నా బెంగ,' అని నన్నేమిటో మన్నన చేస్తూ శర్మగారన్నారు గానీ, లేనిది వున్నట్టుగా భావిస్తూ భ్రమల్లో బ్రతుకు వెళ్లదీసే చాదస్తపు మూర్ఖవాదుల జాబితాలో నేను మాత్రం నా పేరెందుకు నమోదు చేసుకుంటాను? కులంగానీ, సాంప్రదాయంగాని ఆయనకు బాసటగా నిలిచిందా. కవచమై రక్షించిందా? హక్కుల్ని కాపాడిందా? లేదే?

శర్మగారైనా ఈ మాత్రపు అవగాహన లేనివారు కారని నాకు తెలుసు. అందువల్ల అధిక ప్రసంగం జోలికి వెళ్లకుండా, ప్రస్తుత సందర్భంలోకి సాగి వచ్చేశాను.

"అన్నట్టు మీ రిప్పుడెక్కడ పనిచేస్తున్నారో చెప్పలేదే! జమ్మికోటలో జీవిత శిక్ష మాట ఏమైంది?" అన్నాను.

శర్మగారు తేలిగ్గా నవ్వేశారు – "హైకోర్టు తోసేసింది లేవోయ్ బాలాజీ! ఆరునెలలయింది నేను బదిలీ అయివచ్చి. ట్రంకు రోడ్డుపైన మూడో మైలురాయి దగ్గర ఇండస్ట్రియల్ ఏరియాలో ఒక హైస్కూలుంది గదా! అక్కడ పనిచేస్తున్నాను. హెడ్మాస్టరుగారు చాలా పెద్ద మనిషి, లేటుగా వెళ్లినా పట్టించుకోడు. 'పడుతూ లేస్తూ ఎందుకొచ్చారండీ? ఎట్లాగో అడ్జస్ట్ చేసుకోవచ్చు గదా!" అంటాడు. నాకలాంటివి నచ్చవని నీకు తెలిసిందే! లేటయినప్పుడల్లా సగం రోజుకు సెలవు దరఖాస్తు యిచ్చుకుంటూ వుంటాను. అయినా ఎంత కాలంలే? ఇంకొక రెండేళ్లలో నాకు యాభై అయిదు నిండిపోతాయి. వాలంటరీ రిటైరుమెంటు పుచ్చుకుని మా అమ్మాయి కాన్వెంటులో చేరిపోదామనుకుంటున్నాను..."

సముద్రంలో పడవ ప్రమాదానికి లోనైనవారు కొన్ని రోజుల తర్వాత సురక్షితంగా తీరానికి చేరుకున్నారన్న వార్తను చదివినప్పుడు, కాలి కూలిపోతున్న విమానంలోంచి ప్రయాణీకులు పదిలంగా బయటపడ్డారని విన్నప్పుడు, గనుల్లో మూసుకపోయిన సొరంగాల్లో యిరుక్కుపోయిన కార్మికులు క్షేమంగా వెలుపలికి చేరవేయబడ్డట్టు తెలిసినప్పుడు మనసుకు మహదానందం కలుగుతూ వుంటుంది. శర్మగారితో కలిసి హోటలు గదిలో కూర్చున్న సమయంలో నాకలాంటి ఆనందమే కలిగి వుండొచ్చునని అనుకుంటున్నాను. అయినా ఆ ఆనందాన్ని నేను మాటల్లోకి అనువదించలేకపోయాను. బొత్తిగా సాదాసీదాగా ఒక్కమాట మాత్రం చెప్పగలిగాను.

"మేష్టరుగారూ! ఇక మీ పిల్లల్ని గురించి మీకు దిగుల్లేదండీ!"

మీ వారసుల్ని గురించి – అని వుంటే బాగుండేదేమో! మీరేమంటారు.

❖ రచన – 1997. ❖

# మా బొంబాయి ప్రయాణం

ఉద్యోగ విరమణ చేసిన తర్వాత నాకు చేయడానికి నిర్దిష్టమైన పనేదీ లేకపోయింది. పత్రికలతోను, పుస్తకాలతోను ఎంతసేపని వేగించగలను? లేదంటే మా ఆవిడతో కబుర్లు పెట్టుకోవచ్చు. ఒక్కటే ఇబ్బంది! అణువునుంచి, బ్రహ్మాండంవరకు దేన్ని గురించి మొదలుపెట్టినా, మా ఆవిడ దాన్ని లాగి పట్టుకుని తెచ్చి తెచ్చి ఆఖరుకు తనకూ, తన సంసారానికో, నాకూ నా నరవారానికో అంటగట్టేస్తుంది. అందుకని పొద్దుపోని సమయాల్లో నేను వీధిపైపు వసారా ముంగిట మా పెద్దలు కట్టించిపోయిన అరుగుపైన కూచుని కాలహరణ చేస్తుంటాను. "ఏమండీ! టి.వి ఆన్ చేసేస్తిరా?' అంటుంది మా ఆవిడ లోపలినుంచి. నా పాలిటికి మా వీధి టి.వి సెట్టులాంటిదని ఆవిడ అభిప్రాయం. అరుగుపైన కూచోడంవల్ల ఎన్నో కథలూ, గాథలూ నా చెవిలో పడుతుంటాయంట! అక్కడ కూచోవడంవల్లనే గ్రామం రాజకీయాలు సామాజిక విశేషాలు నాకు తెలిసొస్తూ వుంటాయట! పైగా ఎన్నెన్ని పాత్రలు, ఎన్నెన్ని ఉద్వేగాలు – మందగమనాలు, ఉరకలు, పరుగులు, పలకరింపులు, పరిహాసాలు... నిజమే! మా ఆవిడ ఊహను కొట్టి పారెయ్యలేను. అయితే అంతటితో ఆగదే కథ! "ఏమండీ! ఏ సీరియల్లో ఎన్నో ఎపిసోడ్ చూస్తా వున్నారు?" అంటూ ఎలుగిస్తుంది వుండి వుండీ! ఎందుకులెండి! ఇదంతా టి.వి కొనలేకపోయిన నా ప్రయోజకత్వాన్ని ఎద్దేవా చేసే హేల!

ఒకనాటి సాయంకాలం అయిదు గంటలప్పుడు మా వీధి టి.వి సెట్టులో ఒక అపరిచిత వ్యక్తి ఉత్తరపు కొసలో వున్న సాయిబులవాడనుంచీ, మా ఇంటివైపు నడిచొస్తూ నాకు కనిపించాడు. ఖచ్చితమైన అడ్డ పంచకట్టు, అరచేతుల ముతక చొక్కా, భుజంపైన గళ్ల తువ్వాలా, పొంకమైన కుదిమట్టపు ఆకారానికి బింకం దిద్దుతున్న కోరమీసాలు. ఈ వాలకంతో అతడు అచ్చమైన రైతు బిడ్డలా వున్నాడు. దగ్గరగా వస్తున్న కొద్దీ అతడి ముఖం చిడిముడిపాటుతోను, కోపాతిరేకంతోనూ ముటముటలాడిపోతూ వుండడం నేను గమనించాను. అయితే వసారాలో నేను కనిపించేసరికి ఆ ముఖ కవళికలు మారిపోయాయి. హఠాత్తుగా అతడు ప్రసన్నవదనుడైపోయాడు. చిరుదరహాసం ముఖంలో వెలుగులు విరజిమ్ముతుండగా, 'దండాలు సార్! బాగుండారా? నేను జ్ఞప్తిలో వుండానా మీకు?' అని పలకరిస్తూ నా ఎదుటకొచ్చి నిల్చున్నాడు.

తన సర్వీసు కాలాన్ని ఏడెనిమిది ఊళ్లకు పంచిపెట్టిన ప్రతి ఉపాధ్యాయునికీ ఎదురయ్యే చిక్కొకటి వుంది. అదేమిటంటే జిత్తెడు నిక్కర్లపైన జానెడు చొక్కాలు తొడుక్కున్న ఒకనాటి బుల్లి విద్యార్థులు పెరిగి పెద్దవాళ్ళయిపోయి మీసాలతో, గడ్డాలతో, ఏ బజారులోనో, బస్సు ప్రయాణంలోనో, హోటళ్ళలోనో ఎదురుపడి నమస్కారమండీ అంటూ పలకరించడం! అప్పుడిక చూచుకోవలసిందే తమాషా! పట్టుకోదలచిన ఆవుదూడ మెడలోకి ఉచ్చులు విసిరినట్టుగా 'క్లూ' రాబట్టడంకోసం ఎన్ని ప్రశ్నలైనా గుప్పించాలి. 'ఏం చేస్తున్నావురా నాయనా! ఎక్కడున్నావు? హెల్త్ ఇన్స్పెక్టరుగా వున్నావా తిరుపతి మునిసిపాలిటీలో! నువ్వు మర్రిపాడులో నా దగ్గర చదువుకున్నావు కదూ! ఏమిటీ,

మఠ్రిపాడుకాదా, శేషాపురమా! శేషాపురంలో నూకల చంద్రయ్య కొడుకువి గదూ! కాదా...?!' ఈ పద్ధతిలో చీకట్లోకి తూటాలు పేల్చుతూ వుండవలసిందే! అయితే ఈ పడుబాట్లన్నీ పడవలసిన అవసరం లేకుండా ఆగంతకుడు సజావుగా తన వివరాలన్నీ వల్లించి పుణ్యం గట్టుకున్నాడు – 'మీ దగ్గర చదువుకున్నాడ్నే. కట్టకింద పల్లెమాది కదిరి నరసయ్య కొడుకుని...'

నాకు 'క్లూ' దొరికిపోయింది. మనసు పొరల్లోనుంచీ పాత జ్ఞాపకాలు ఉవ్వెత్తున పొంగి పైకొచ్చేశాయి. 'ఓరి నువ్వట్రా వెంకట్రమణా! అమ్మో అమ్మో ఎంతవాడైపోయావురా! నువ్వు చెప్పబట్టి సరిపోయింది గానీ, లేకుంటే బిక్కమొఖం వేసుకుని చూస్తుండిపోయేవాణ్ణే! రా, కూచో, చాలా దూరం వచ్చేస్తివే. ఏం పనిమీదొచ్చినావు?' అంటూ నేనుగూడా ఎంతో ఆప్యాయంగా పాత శిష్యుణ్ణి దగ్గరికి రాదీసుకున్నాను.

ఆత్మీయంగా పలకరించేటప్పటికి వెంకట్రమణ మనసంతా విప్పి తన ఆత్మ ఘోషనంతా నాతో వెళ్ళబోసుకున్నాడు.

"ఏం చెప్పేది సార్! ముందుకు మూడడుగులేస్తే వెనక్కు అరడుగులేసినట్టుంది రైతు పరిస్థితి. నేనయిదో తరగతిలో వుండగా మీరు మా వూరి నుంచీ వొచ్చేస్తిరి. అప్పట్లో అది బంగారు కాలం అనుకోవాల. తలచుకోగానే వానలు పడి, చెరువులు, సముద్రాల మాదిరిగా అంచులదాకా పొంగివచ్చి, ఏడాదికిరుగార్లు పంటలు పండితే రైతు ఈ భూభారమంతా చిటికెనేలితో మోసెయ్యడా సార్! వరసగా అయిదారేండ్లు సరిగా వానల్లేక, పంటలు చేతికందక పోయేటప్పటికి ఏటిలో బోర్లేసేసిరి, ఏటి గట్లలో బోర్లేసేసిరి. ఏటిలో నీటి జల అడుగంటిపోయె. చెరువులకు వరదలు రావడం పాతకాలం నాటి కతలైపోయె. ఊరి దాపున వుండే నేల గదా, ఎందుకైనా మంచిది – పడివుంటే ఎప్పటికైనా పనికొస్తుందని ఆశపోతులైన వాళ్లు చేతనైనంత మట్టుకు చెరువు బయల్లో గూడా ఎన్‌క్రోచ్‌మెంట్లకు పూనుకొని, ఇన్నూట యాభై అడుగుల లోతున బోరింగేస్తే ఇక కపిల బావుల్లో నీళ్ళెక్కడుంటాయి? వట్టిపోయి అట్టడుగున జిల్లేళ్ళు, ఉమ్మెత్తలు బలిసిపోయ. ఇన్నూట యాభై చాలదని ఇంకొకడు మున్నూరు దాకా వెళ్తే వాడి తల దన్నే వాడొకడు ఏకంగా నన్నూరుదాకా వెళ్లిపోయ. రాబోయే కాలాల్లో పాతాళాన్ని తాకినా నీటి చెమ్మ అందకపోవచ్చునంటూ బెదరగొట్టేసిరి. బతుకంటే బెదురుపాటు. బతుకంటే దిగులు. బతుకంటే భయం. ఇట్లా వుంది సార్ మా గతి..."

ప్రారంభమైన కొత్త ఎపిసోడ్‌లో తన భర్తకు కూడా ఒక పాత్ర లభించినట్టు పసికట్టిందేమో, మా ఆవిడ ఈవలికి వచ్చి గుమ్మంలోనుంచీ తొంగి చూసింది.

"తెలియడం లేదా కామాక్షీ! కట్టకింద పల్లెలో కదిరి నరసయ్య కొడుకు వెంకట్రమణ! పొట్టి బుడమకాయలా వుండేవాడు. ఇప్పుడు గట్టి యోధుడిలా తయారైనాడు గదూ!" అన్నాను.

"అవునా?"... విస్తుపోతూ కొనసాగించింది మా ఆవిడ "నాయనా వెంకట్రమణా! మీ అమ్మా, అయ్యా బాగుండారా? అయిదారేండ్లు మీ యింటి పక్కన మిద్దింట్లోనే కాపురముంటిమి, గుర్తుందా? మీ అమ్మ ప్రతిరోజు ఓ గుండు చెంబు నిండుకూ చిక్కని

పాలిచ్చేది. మా యింటి వాడుకకంతా సరిపోయేదనుకో! వుండుండు నాయనా, గుక్కెడు కాఫీ తాగిపోదువుగానీ..."

"ఉద్దేశం మంచిదే! కానీ కరెంటుండొద్దూ?... మేముకూడా కరెంటు స్టౌదాకా వచ్చేసినాములే వెంకట్రమణా!" అన్నాను.

"సార్, సార్! ఆ కరెంటు మాట మాత్రం నా ముందర చెప్పొద్దు. నాకు ఏడుపొస్తుంది" అంటూ ఆక్రోశించాడు వెంకట్రమణ. 'కడుపుమంట కాపురానికి రేజీకటి మొగుడు దాపురించినట్టుగా ఈ కరెంటనేది మా దుంపతెంచి మా చేతి కిచ్చేస్తూ వుంది. ఇంట్లో దీపం వెలిగింది గదా అని మడి దగ్గరికి పరిగెత్తితే, వచ్చింది రానూ వచ్చి, పోనూ పోవడంవల్ల, తీగ మొద్దు నిద్రపోతూ వుంటుంది. ఎప్పుడొస్తే అప్పుడే వేసుకుందాం లెమ్మని కొంచెం ఒరిగితే, మళ్ళీ తెల్లారుజామున మెలకువొచ్చేటప్పటికి షెడ్డు ముందరి లైటు వెలిగిపోతూ వెక్కిరిస్తూ వుంటుంది. కరెంటొచ్చింది. నిలిచింది కూడా అనుకోండి! అందరూ ఒకేసారి స్విచాన్ చేసేస్తే ఓల్టేజీ చాలక చాలా మోటార్లు నీళ్ళెత్తడం మానేస్తాయి. ఎందుకులెండి! కరెంటు డిపార్ట్‌మెంటేమో పిల్లి. రైతులు ఎలుకలు. పిల్లికేమో చెలగాటం. ఎలకలకేమో ప్రాణసంకటం..."

"అయితే సేద్యం బొత్తిగా గిట్టుబాటుగా లేదంటావా వెంకట్రమణా?" విస్మయంతో ప్రశ్నించాను.

"సరేలెండి! మజ్జిగకే దారి లేకపోతే ఇక పెరుగుకు చీటీ గూడానా! కట్టుబాటుకే దోవ లేకపోతే ఇక గిట్టుబాటు సంగతి అడగొచ్చునా? ఎరువులు వెయ్యకపోతే పంటకు సత్తువ వుండదు. మందులేయకపోతే రోగాలు బతకనివ్వవు. నారు నాటాల. కలుపు తియ్యాల. పంట కొయ్యాల. వాదె కొట్టాల. ఈ పన్లకంతా మనుషులు కావాల. రెండు పూటలా అన్నం పెట్టి ముప్పై రూపాయలిచ్చినా మనుషులు దొరక్కపోయిరి. పంట ఇల్లు చేరినాక లెక్కచూసుకుంటే, పెట్టుబడి రూపాయి అయితే, ఫలితం యాభైపైసలే! చెల్లెండ్లు పెండ్లి కెదిగి వొచ్చేసిరి. రెవిన్యూ బిళ్ళమీద చేవ్రాలు పెట్టడం మామూలైపోయ! అప్పుడాలోచిస్తి. ఇట్లా కాదురా నాయనా, ఇట్లనే కొనసాగితే ఓడ మునిగిపోతుందిరా తండ్రీ – అనుకుంటి. 'మాదర్చేద్ దేవుడికి గోదర్చేద్ పత్రి' అంటారు గదా! సరిగ్గా అటువంటి పనే చేసేస్తి..."

"ఏం చేస్తివిరా నాయనా?" అంటూ నిర్ఘాంతపడిపోయాను.

"ఒక వ్యాపారస్తుడుండాడనుకోండి సార్! చింతపండులో నష్టం వొస్తే మిరప కాయలు. మిరపకాయల్లో నష్టం వొస్తే పసుపు. ఇట్లా బిజినెస్ మార్చుకోడా! రైతు మాత్రం వరి పంటనే పట్టుకుని ఎందుకు వేలాడాల? ఈ ఆలోచన మనసులోకి రాంగానే ఒక ఎకరా నేల చెరకు తోటకు, ఇంకొక ఎకరా శనక్కాయలకు కేటాయించేస్తిని. మిగిలింది పదెకరాల మెట్ట. అందులో తాతల కాలం నాటి మూడెకరాల ముదురు మామిడి తోపుతో కలిసిపోయేటట్టుగా, మిగిలిన ఏడెకరాల్లోను ఓ బోరింగేయించి మామిడి మొక్కలు నాటించేస్తిని. ఇదేమో లేదోట. రెండు మూడేండ్లనుంచీ కోత కొస్తావుంది. ఈ మొత్తం తోటలో అయిదు సంవత్సరాల మాసూల్ని (ఫలసాయాన్ని) ఒకటిన్నర లక్షల రూపాయలకని వగదెంచి అమ్మేస్తిని..."

"మరింకేమయ్యా! మంచి ఆదాయమే గదా! టంచనుగా రెండున్నరవేలు నెల జీతంమొచ్చినట్టే! కడుపులో చల్ల కదలకుండా హాల్లో ఒక తూగుటుయ్యాల వేయించుకొని, అది మెల్లగా ఊగుతుంటే నువ్వు తూగుతూ వుండిపోరాదా?" అన్నాను.

"సార్, సార్! ఏపాటి అదృష్టమైనా అడిగి రావాలగదా! లేదే! మళ్ళీ ఆ బాటలో కూడా ఎదురుదెబ్బలే తినాల్సివొచ్చెనె! వాడెవుడుసార్, రహమత్ బాషాగాడు! మీకు తెలిసే వుండాల. నేనడిగొచ్చిన రాతకొద్దీ వీడు నాకు దాపురించినాడు. రహమత్ బాషా అంటే గాలివీడు చినమస్తాన్ సాయిబు కొడుకు కదరా! నూరు ఆరైనా, ఆరు నూరైనా మస్తాన్ సాయిబు మాటకు నిలబడినోడు గదా! ఆ సాయిబు బతికినంత కాలం మన కట్టకింది పల్లెతోటల్లో ఇంకొక బేరగాడెవుడైనా అడుగు పెట్టినాడా? నీకేం భయంలేదు. పులి కడుపున మేక పుడ్తుందా? ముందూ వెనకా చూడకుండా నీ తోట రహమత్ బాషాకిచ్చెయ్యమని అందరూ చెవిలో యిల్లు గట్టుకుని చెబ్తే, నేను నమ్మితి. నమ్మినందుకు నన్ను నట్టేట్లో ముంచినాడు గద సార్! అడ్వాన్సు పేరుతో మొదట – ఒక అయిదువేలు పారేసినాడు. తొలి సీజను ఆఖరైనప్పుడు ఇరవైవేలు నా చేతిలో పెట్టినాడు. రెండో సంవత్సరం గోజారి, గోజారి ఇరవై అయిదువేలు రాల్చినాడు. ఇకంతే సార్! మూడోయేడు నష్టాలొచ్చేసినాయని పత్తా లేకుండా పోయినాడు. నాలుగో సీజను ఎప్పుడో జులై నెలలో పూర్తయింది. ఇప్పుడు జనవరి ఆఖర్లోకి వచ్చేసినాం. ఇప్పటివరకు నాకు ముట్టింది యాభైవేలు. ఈ లెక్కన వీడు ఒప్పందం నిలబెట్టుకుంటాడా, కళ్ళల్లో కారం చల్లతాడా అని నా అనుమానం. నూరంటే నోరు నొచ్చును. అన్ని వాయిదాలు పెట్టినాడు. పై శనివారం అంటాడు. వచ్చేనెల అయిదో తేదీ అంటాడు. పండుగపోయిన మరుసటి రోజు రా అంటాడు. వద్దే వద్దు, నువు రానే వొద్దు. నేనే వొచ్చి డబ్బు నీ చేతికిచ్చి వొస్తాను అంటాడు. ఇట్లా ఎంత కాలమైనా మేఘాల్లో మెరవణి తిప్పిస్తాడే గాని, కాసు కళ్లకు జూపించడమే! ఇప్పుడిది వాడు పెట్టిన ఆఖరి గడువు. 'సరిగ్గా నాలుగ్గంటల కింటికి రా. ఒకవేళ నేను లేకపోయినా నా భార్య దగ్గర ఇచ్చిపోతాను. నీకివ్వాల్సిన డబ్బులో ఒక యాభైవేలు ఆమె పువ్వుల్లో పెట్టి నీ చేతికిస్తుంది' అని అరచేతిలో సొర్గం చూపించినాడు. బస్సెక్కి వొచ్చి లంగరు ఖానాలో దిగి, ఇంతకుముందే ఇట్లా నడిచి మీ యింటిముందునుండే రహమత్ బాషా ఇంటికి వెళ్తి. ఇంట్లో లేడనే భార్య చెప్పడం! నమ్మొచ్చునా ఆ మాట! సొరంగం మాదిరిగా ఒక ఫర్లాంగు దూరం వుండే యిల్లు. అందులో ఏ అడ్డు గోడ వెనకన, లేదా ఏ మూట చాటున నక్కి కూచున్నాడో ఏం చెప్పగలం? 'డబ్బు సంగతి నాకేం తెలీదే! నాతో ఏమీ చెప్పలేదే!' అంటుంది బీబీ. చూస్తిరా సార్, వాడు నన్నెంత చచ్చు దద్దమ్మగా చేసి నిలబెట్టినాడో! అయితే ఒకటి. ఈ రోజు తప్పించుకున్నాడు సరే! రేపైనా నా చేతికి దొరకడా? మర్నాటికైనా నా పిడికిట్లో చిక్కడా? చొక్కాయ పట్టుకుని బరబరా బజార్లోకి ఈడ్చుకపోతాను. పదిమంది పెద్ద మనుషుల్ని చేర్చి ఇంతగా వగలేనోడివి, వ్యాపారంలో కెందుకు దిగితివి?' అని అడుగుతాను. నువ్వు తినేది అన్నమా, గడ్డా అని నిలదీస్తాను. ఆ రహమత్‌గాడు ఏమనుకుంటా వుండాడో నాకు తెలియదు. నేను కదిరి కాటమరాయుడి మనవణ్ణి. నరసయ్య కుమారుణ్ణి. నా డబ్బు నాకు ముట్టకపోతే నేనీ మాంగోనగర్‌నే తల్లక్రిందులు చేసి పారేస్తాను...'

అసలు పేరయితే వేరే వుంది కానీ, మామిడి కాయల ఎగుమతిలో దక్షిణాది రాష్ట్రాలలో ఒక ప్రధాన కేంద్రమైన తర్వాత మా వూరు 'మాంగోనగర్'గా ప్రసిద్ధికెక్కిపోయింది. ఇన్నూరు మందికి పైనా చోటా బడా వ్యాపారస్తులు (వీరిలో ఎక్కువమంది ముస్లింలు) యుద్ధభూమిలో స్కంధావారాలు వేసినట్టుగా, కొబ్బరిమట్టలతో అరవై డెబ్బై కొటాయిలు వేసి, పడమర మొలకల చెరువునుంచీ తూర్పున శ్రీకాళహస్తిదాకా, ఉత్తరాన తలకోన నుంచి దక్షిణాన సత్యవీడు దాకా మామాడితోపుల మహాసూలంతా సంవత్సరాల పథకం కింద కొనేసి, తమ రాజ్యాన్ని ఇంచుమించుగా జిల్లా అంతటికీ విస్తరించుకున్నాక మాంగోనగర్ జయపతాకం దూర ప్రాంతాలకు తెలిసేటట్టు రెపరెపలాడసాగింది. మందులు కొట్టడానికి, కాయలు దించడానికి జట్లు జట్లుగా బయల్దేరి వెళ్ళే వ్యవసాయ కార్మికులు, సీజను ప్రారంభం కాగానే తోటల దగ్గరనుంచి మండీల దాకా కాయలు రవాణా చేసే ట్రాక్టర్లు, మినీ లారీలు, అహమదాబాదు, నాగపూర్, బొంబాయిల వైపునుంచి కదిలే గుట్టల్లా వచ్చి రోడ్డుపైన నిలబడిపోయే రాక్షస లారీలు, వాటికి సరుకెక్కించే కూలీలు, మహానగరాల్లోని పళ్ళ మార్కెట్‌లకు మాంగోనగర్‌లో మండీలకు మధ్య దళారీలుగా వ్యవహరించడంకోసం వచ్చి విడిది చేసే సేట్లు, శ్రీమంతులు, వీళ్ళందరి కోసం నెలకొన్న కూల్‌డ్రింక్ షాపులు, మందు కొట్లు, నాష్టా అంగళ్ళు, భోజన హోటళ్ళు; ఈ రద్దీలో నుంచి దారి చేసుకోలేక స్కూటర్లు, బస్సులు ఎక్కడివక్కడే నిలిచిపోవడంవల్ల ఏర్పడే ట్రాఫిక్ జామ్‌లు, ఇదంతా ఒక గ్రామీణ ప్రాంతంలో ఒక అర్బన్ గందరగోళానికి జరిగిన రూపకల్పన లాగే వుంటుంది. ఒక సీజనులో వ్యాపారం జోరుగా సాగితే మావూరి పాదుషాలు టి.నగర్‌నుంచో, మాంబళం నుంచో దొంగిలించి తెచ్చినట్టుగా మా వూళ్ళో సరికొత్త భవంతులు కట్టేస్తారు. ఫ్రిజ్‌లతో, కలర్ టీవీలతో, దివాన్‌మంచాలతో, అద్దాలు బిగించిన గాడ్రెజ్ బీరువాలతో, వెస్పా రాజ్‌దూత్ హీరో హోండాలాంటి వాహనాలతో ఊరినంతా నింపేస్తారు. అయితే పన్నెండేళ్ళకొకసారి కాచే దేవతా వృక్షంలా మామిడికాయల వ్యాపారం సానుకూలంగా కొనసాగడం కూడా అయిదారేళ్ళకొక్కసారి మాత్రమే. మిగిలిన సీజన్లు కొన్నింటిలో లాభాలు అంతంత మాత్రంగానే వుండొచ్చు. కొన్ని సందర్భాల్లో పెట్టిన పెట్టుబడి కూడా రాకపోవచ్చు. కొన్ని సంవత్సరాలలో భారీ నష్టాలు ఎదురుకావచ్చు. ఏమైనా లాభనష్టాలు రెండింటినీ ఒకేరకంగా స్వీకరించడానికి అలవాటుపడిపోయింది మాంగోనగర్! పులిసిన కల్లును, కరుగుతున్న సీసాన్ని ఒకేరకమైన చిత్తవృత్తితో సేవించే సంయమీంద్రుడిలా అది గెలుపుకు పొంగిపోదు, ఓటమికి క్రుంగిపోదు, పదును వానకు పదరదు. తాటాకు మంటలకు బెదరదు. అలాంటి 'ఉక్కు కోట' మాంగోనగర్‌ను తాను తల్లక్రిందులుచేసి పారేసేటట్టు వెంకట్రమణ చెబుతుంటే నాకు నవ్వొచ్చింది. అయినా భావ్యంగా వుండదని నవ్వును వెలుపలికి రానివ్వకుండా లోలోపలే దాచుకున్నాను.

"నాయనా వెంకట్రమణా! రహమత్ బాషాకూడా నీ మాదిరిగా నా దగ్గర చదువుకున్నవాడే! వయసులో చిన్నవాడైనా బుద్ధిమంతుడు. నీ డబ్బు ఎగ్గొట్టి వాడెక్కడికి పోతాడు చెప్పు, మళ్ళీ రైతుల దగ్గరికి రావాల్నా లేదా! వాడికి నేను చెబుతాన్లే. నువు తొందరపడొద్దు" – అంటూ పాత శిష్యుణ్ణి సముదాయించడానికి ప్రయత్నించాను.

***

మా వూరికి పడమటగా ఒక ఫర్లాంగు దూరంలో మామిడితోపు లోపలికి చొచ్చుకుపోయినట్టు సినిమా థియేటరుంది. ఏర్ కండిషన్డ్ కాకపోయినా ముదురు మామిడిచెట్ల కొమ్మలు పంకాల్లా కదిలిపోతూ చల్లటి గాలిని ప్రసరిస్తుంటాయి. ఊళ్ళో కరెంటు లేకపోయినా థియేటరుకు జనరేటరుంది. అందువల్ల మా వూరివారి పాలిటికి ఇంటికన్నా థియేటరే పదిలం! వెంకట్రమణ నాతో మాట్లాడిన నాటి సాయంకాలం నేను మొదటి ఆటకు వెళ్ళి, పై వరుసలోనే ఒక మూలగా కూచున్నాను.

సినిమా ప్రారంభం కావడానికి రెండు నిమిషాలు ముందుగా రెండు ఆకారాలు ఎంతో సయోధ్యగా ఒకదాని చేయి ఒకటి పట్టుకుని రంగశాలలో ప్రవేశించాయి. వెంకట్రమణను మాత్రం కొద్ది క్షణాల్లోనే పోల్చుకున్నాను. రెండో శాల్తీని పోల్చుకునేసరికి ఆశ్చర్యంతో బిత్రబిగుసుకుపోయాను. ఎవడోగాదు. సాక్షాత్తు రహమత్ బాషా!

కనిపించగానే చొక్కా పట్టుకుని బజార్లోకి లాక్కెళ్తానన్న ప్రతిజ్ఞ ఏమైంది? పెద్ద మనుషుల నడుమ పరువు తీసేస్తానన్న సవాలేమైంది? నీట తడిసిన టపాగాయలా వెంకట్రమణ ఎందుకు తుస్సుమన్నాడో నాకు బోధపడనే లేదు. అయితే ఒకటి. అమ్మేవాడికి కొనేవాడికి మధ్య అవగాహన ఏర్పడడం మంచిదే గదా! అంతకుమించి నేనా విషయాన్ని పట్టించుకోలేదు.

అయితే మరునాటి ఉదయం నేను టిఫిను చేశాక దినపత్రిక చూచుకుంటూ వుండగా చడీ చప్పుడు లేకుండా సెల్లరూ బయ్యరూ ఇద్దరూకూడా హాల్లోకి వచ్చేశారు. వీరబ్రహ్మంగారి ఎదుట సిద్ధయ్యలా నా పాదాల కిరువైపులా నేలపైన్నే బైటాయించేశారు. "ఏమిరా నాయనా, ఇట్లా వచ్చేసినారు?" అంటూ పలకరించాను.

"ఏం చెప్పేది సార్! మీరు మాకొక కత చెప్తా వుంటిరే, వాలిని గురించి! వాలితో పోట్లాడేదానికి ఎవుడైనా పోనివ్వండి. అట్లా వెళ్ళినవాడిలోనుంచి సగం బలం వాలికే దఖలుపడిపోయేదంట! ఈ రహమత్ బాషా ఆ వాలికేమాత్రం తీసిపోయే వాడుగా లేదు. కొండంత కోపంతో వెళ్ళినా సరే, ఆ కొండను దూదిపింజగా మార్చేసి 'ఉఫ్'మని వూది పారెయ్యడం వీడి చేతనౌను. అమ్మో, మాటల మంత్రగాడే ననుకోండి! అందుకనే ఇట్లా కాదని వీణ్ణి మీ దగ్గరికి ఈడ్చుకొచ్చేస్తిని. ఆ చెప్పే మాటేదో మీరూ వినాల. మళ్ళీ ఆ మాటలో ఏదైనా నేబందు వస్తే, ఊళ్లో వీడికి ఉప్పు పుట్టకుండా చెయ్యాల. మీరే నాకు జవాబ్దారీ, ఇంక నేను ఏది మాటలు నమ్మేది లేదు...'

"పరవాలేదు జవాబ్దారీగా వుంటానని ఒప్పుకోండి సార్" వెంకట్రమణ మాటలకు అడ్డుతగులుతూ ప్రారంభించాడు రహమత్‌బాషా. "పొద్దు పుట్టే ప్రొద్దు పోతే రోజుకు పదిసార్లయినా మీ ఇంటి ముందునుంచి తిరగాల్సినవాణ్ణి. మీ మాట మీరిపోతానా! 'నీతి లేనివాడు కోతికంటె చీడు' అని నూరిపోసింది మీరే గదా! వ్యాపారమన్నాక ఒకప్పుడంతా కలిసే రావచ్చు. ఇంకొకప్పుడు చుక్కెదురూ కావచ్చు. ఏమైనా గాలివానలు పట్టుకొని కాయలు ఒడిశూరమూ (పూర్తిగా) రాలిపోతే, వున్న నేల తెగనమ్మి, రైతుల కప్పుతీర్చిన గాలివీడు చినమస్తాన్ సాయిబు కొడుకుని సార్ నేను! అంతకూ యింతకూ లేదంటే మీరు పెద్ద మనసుచేసి నా కష్టాలు, బాధలూకూడా చెవిలో ఏసుకోవాల. కోటి

విద్దెలు కూటి కోసరమే గదా! అందులో మామిడి కాయల బిజినెస్సుకు మించిన మాయాబజారు యింకొకటి వుండదు. ఎట్లాగంటారా? ఒకతోట ఎర్రావారి పాళెం దగ్గరుంటుంది. ఇంకొకటి పలమనేరు దగ్గర దండుపల్లెలో వుంటుంది. మరొకటి కార్వేటినగరం యిలాకాలో వుంటుంది. ఒక్కొక్క తోట దగ్గిరా ఎవణ్ణో ఒకణ్ణి నమ్మి కావలికి పెట్టాల. వాడే దొంగైపోతే ఏం చెయ్యాల? అదట్లా వుండనీ. చెట్టుకు పూత పుట్టినప్పటినుంచి, కాయ బొంబాయి మార్కెట్లో అమ్మకమయ్యేలోగా ఎన్నెన్ని గండాలు! మడత తెగులు, మరక రోగం, పసుపుచుక్క రొస్టు - ఇవికాక మంచు జాస్తి అయితే తేనెమంచు, సరిగ్గా వానల్లేకపోతే కాయ సైజుకు రాక గిడసబారిపోవచ్చు. చింతకాయల కాలంలో పెనుగాలులు వీచినా, గాలివానలు పట్టుకున్నా కాయలు కుప్పలు తెప్పలుగా రాలిపోవచ్చు. వానతో కలిసి వడగండ్లు కూడా పడినాయంటే, మామిడికాయల వ్యాపారస్తుడి తలపైన శనిదేవుడు కూచున్నట్టే! సరే, అన్ని గండాలూ తప్పించుకుని సరుకు మండీలోకి వచ్చిందే అనుకోండి, సమయానికి లారీలు దొరక్కపోవచ్చు. నేను వెంకట్రమణ తోట కొని నాలుగేండ్లయింది కదా! అంతకుముందు రెండేండ్లనుంచి వానలకు కటకటగా వుంది. పాతికవంతు పంట మాత్రమే బేరానికందింది. రావలసిన డబ్బులో సగమైనా చేతికి రాలా. అయినా ఎట్లనో వెంకట్రమణకు ఇరవైవేలు చెల్లిస్తి. ఆపై సంవత్సర మేమయిందంటే, లారీ ఇక్కడినుంచి బయల్దేరేదాకా బాగుంది. సగం దూరం వెళ్ళేటప్పటికి జోరుమంటూ జడివానలు ముంచుకొచ్చినాయి. అడ్డంగా ఏరేదో పొంగి పొర్లింది. లారీ ఈ పక్కన నిల్చిపోయింది. వారం రోజులవరకు కదిలే వీల్లేకపోయింది. పూర్తిగా పాడైపోతుందని అయినకాడికి అక్కడివాళ్లకు సరుకమ్మి పారేస్తినని లారీ డ్రయివరు చెప్పడం. అందులో నిజమెంతో అబద్ధమెంతో ఆ దేవుడికే తెలియాల. అయినా అప్పుడు కూడ ఎట్లనో ఒకట్ల వెంకట్రమణకు ఒక మొత్తం ముట్టజెప్పుకుంటి. నాలుగో సంవత్సరం నష్టాలకు తట్టుకొని నిలబడడమే కష్టమైపోయ. ఈసారి ఇట్లా కాదనుకుంటి కిటుకేందో తెలుసునా సార్! మేమంతా డబ్బు చేతిలో పెట్టుకోని వ్యాపారం చేసేటోళ్ళంకాదు. ఎవురి అంతస్తుకు తగినట్టుగా వాళ్ళు బొంబాయినుంచి అప్పులు తెచ్చుకుంటారు. మా అల్లా దేముడు మక్కాలో వుండేట్టుగా, మీ యిందువుల దేముడు కాశీలో వుండేట్టుగా మామిడి పండ్ల దేముళ్ళు బొంబాయి క్రాఫోర్డు మార్కెట్లో వుంటారు. కట్టకింద పల్లెలు మట్టి గొట్టుకుపోయినా, మాంగోనగర్‌లు మగ్గి మురిగిపోయినా అక్కడ బొంబాయి క్రాఫోర్డు పండ్ల మార్కెట్టు మాత్రం దినమ్మూ ఒక తాళి కట్టించుకునే పెండ్లికూతురు మాదిరిగా కలకల్లాడిపోతూ వుంటుంది. మా మామిడి పండ్ల దేముళ్లే నిత్య పెండ్లి కొడుకులు. మన కాయల్ని వాళ్ళు నికరంగా ఎంతకమ్మిందీ మనకు తెలియదు. ఇంతకమ్మినామని రాసి పెట్టిన లెక్కను చూపిస్తారు. అందులో వాళ్ళ కమిషను వాళ్ళు మినహాయించుకుని మిగిలింది మన ముఖాన పారేస్తారు. ఇంతకూ నా దేముడెవురో చెప్పలేదే! తోతారాం రాధేశ్యాం! వింటిరా సార్! ఈ దఫా ఆ మహానుభావుడు తోతారాం రాధేశ్యాం దర్శనం మీకు చేయించాలని నేనొక తీర్మానానికొచ్చేసినాను. ఎందుకంటారేమో! మా ఎవ్వారంలో మీరు పెద్దమనిషిగా వుండాలని వెంకట్రమణ కోరుకున్నాడు. అందుకని ఇతగాడు మీకు నాలుగు

బుట్టల నిండుగా మల్‌గూబా, నీలం, కోలేపాడ్, బేనిషా పండ్లు ఇనాముగా ఇచ్చేటట్టు చెప్పినాడు. అప్పటికి నేనేనా నెల తక్కువగా పుట్టినోణ్ణి. నేను నా వంతు గురుదక్షిణగా మీకోసారి బొంబాయి చూపించాలని తలపెట్టినాను. ఏం బాదరబందీలుండవు. వ్యాపారం సాలు తీరూ ఎట్టా వుండినా మర్యాదా మన్ననా మాత్రం చెప్పతరం గాదు. వెంకట్రమణ కూడా వస్తాడు. ముగ్గురం ఇక్కడి రేణిగుంటలో త్రూ రైలెక్కేద్దాం. అక్కడ విక్టోరియా టెర్మినస్సుకే కారొస్తుంది. మనల్ని తీసుకపోయి లాడ్జిలో దించేస్తారు. మెస్‌లో ఫస్టుక్లాసు భోజనం. పలానా నాష్టా కావాలంటే అది నిమిషాల్లో రెడీ. కారులోనే ఊరంతా తిప్పి, చూడాల్సినవన్నీ చూపిస్తారు. రేపు బయల్దేరతామనగా ఈరోజున తోతారాం రాధేశ్యాం మనల్ని భేటీకి పిలిపిస్తారు. ఆ మారాజు నాకిచ్చే డబ్బులో నేను యాభైవేలు మీ చేతుల్లో పెట్టేస్తాను. మీరట్లనే దాన్ని వెంకట్రమణ కిచ్చెయండి. ఈ ఎవ్వారమంతటితో పైసల్! ఈ ప్రయాణం వల్ల మీకు కలిగే ఖుషీలు రెండు. ఒకటి బొంబాయి బస్తీ చూడ్డం. రెండు తోతారాం రాధేశ్యాం దర్శనం చెయ్యడం! లేలేత అరిటాకు మాదిరుండీ జరీ అంచు పంచను బిళ్ళగోచీ పెట్టుకుని కట్టుకునే తీరే పసందు. చెమటకు ఒళ్ళు చిరచిరలాడి పోతుందని బనీనుగానీ, చొక్కాగానీ తొడుక్కోడు. అరటి కంబాలు మాదిరిగా తొడలు. నా కాళ్ళంత లావుగా చేతులు. సరికొత్త చాకిరేవు బాన మాదిరిగా బొజ్జ. పొట్టి క్రాపింగుపైన తెల్లటి గుడ్డతో కుట్టిన మడతటోపీ గ్యారంటీ. కళ్ళకు నల్లటి చలవద్దాలు వుండి తీరాల్సిందే! మాగి పక్వానికి వచ్చిన రుమానీ పండ్లు రాసిపోసినట్టే వుంటాడు. హల్వాలో, గులాబ్ జాంలో, రసగుల్లాలో ఏం తింటాడో తెలియదు. కూల్‌డ్రింకులో, ఫ్రూట్ జూసులో, చెరుకు పానకాలో ఏం తాగుతాడో తెలియదు. ఒళ్ళు నున్నగా నిగనిగలాడిపోతూ వుంటుంది. ఈగ వాలిందంటే, కాళ్ళకు పట్టు దొరక్క సర్రున జారిపోవలసిందే!"

శరీరానికి బంగారు మలామా వేసుకుని, పద్మాసనం వేసుకుని కూర్చున్న చిన్న సైజు గోమటేశ్వరుడిలా నా మనోనేత్రాల ఎదుట తాండవింపసాగాడు తోతారాం రాధేశ్యాం. వెళ్ళాలి. తప్పకుండా బొంబాయి వెళ్ళాలి. ఎలాగైనా ఓ ఈగను ప్రాణాలతో పట్టుకుని అగ్గిపెట్టెలో వేసి తీసుకెళ్ళాలి. దాన్ని తో.రా. శరీరంపైన వదిలిపెట్టాలి. జలపాతంలో వ్రేళ్ళు తెగిన చెట్టులా అది ఆ శరీరంపైన ఎలా జారిపోతుందో తిలకించాలి. ప్రస్తుతానికిదే నా జీవితాశయం!

❖ ఆంధ్రజ్యోతి వారపత్రిక – 27 జూన్, 1997. ❖

# గాలివీడునుంచి న్యూయార్క్‌దాకా

**త**లవని తలంపుగా గొప్పయోగం ఒకటి వచ్చి వచ్చి తన కాళ్లకు చుట్టుకుంటుందని మల్లారెడ్డి ఏమైనా కలగన్నాడా? మేనల్లుడు మధుసూదనరెడ్డి స్వదేశానికి వచ్చినపుడల్లా పిలిచివెళ్తున్న మాట నిజమే. "నువు బయల్దేరి వచ్చెయ్ మామా! మిగిలిన ఏర్పాట్లన్నీ చేసి పెట్టే పూచీ నాది!" అంటూ బాధ్యత వహిస్తున్నాడు గూడా! అయితే అంగీకారం పొందకనే ప్రయాణానికొక ముహూర్తం నిర్ణయించి, తనకెరుక పరచగలడని మల్లారెడ్డి అనుకోలేదు. విదేశప్రయాణ మంటే ఇష్టంలేక గాదు. వదలని పీడలా ఈ చెంచు రాముడొకడు దాపురించాడే! అదే వచ్చిన ఇబ్బంది!

అట్లాగని మల్లారెడ్డి గురించి తక్కువ అంచనాలు వేసుకోరాదు. పదనువాన పైనబడినా అతడు బెదిరేవాడు గాదు. పిడుగుపాటుకు జడిసేవాడు కాదు. కాకపోతే గడచిన పదేళ్లుగా మిట్టపాళెం చెంచురామానాయుడితో ఏర్పడిన పార్టీ తగాదాల్లో మరొకడూ, మరొకడూ అయితే తట్టుకునేవాడేనా!

ఏ తగాదా అయినా ప్రారంభం కావడం చిన్న కారణంవల్లనే గదా! అది చిలికి చిలికి గాలివానగా మారడానికి అసెంబ్లీ ఎన్నికలు తోడ్పడ్డాయి. ప్రత్యర్థులిద్దరూ రంగంలో దిగారు. గెలవడానికైతే మల్లారెడ్డి గెలిచాడే గానీ, మేఘూల్ని పర్జన్యాస్త్రంతో పటాపంచలు చేసినట్టుగా, అతడి విజయగర్వానికి చెంచురామానాయుడు గండికొట్టేశాడు. ఎన్నికల్లో అవకతవకలకు పూనుకున్నట్టు కోర్టులో నిరూపించి, అర్ధాంతరంగా పదవిని వూడగొట్టి పుణ్యం గట్టుకున్నాడు. "ఒరే చెంచు రామా! నీళ్లులేని చెరువులో నీ తల పుర్రెను ఎండిన తాటిబొచ్చెను తన్నినట్టుగా తన్నకపోతే నా పేరు మల్లారెడ్డే కాదు!" అంటూ మల్లారెడ్డి ఘోర శపథం చేశాడు. మొండెంపైన తలకాయతో చెంచు రామానాయుడు సజీవుడై తిరుగుతున్నంత కాలం, ఆ శపథానికి కాలదోషం పట్టిందని చెప్పడానికి వీల్లేదు. అయితే ఈలోగా తాత్కాలికోపశమనంగా నాలుగువందల చెట్టున్న చెంచురామానాయుడి నిమ్మతోటలో ఓరోజు తెల్లవారేసరికి మొదళ్లు మాత్రం మొండిచేతుల్లా కనిపించాయి. చెట్లన్నీ కుప్పకూలిపోయాయి.

"అయిదారువేల వోట్లు రిగ్గింగు చేయించి అప్పట్లో నాకు పదవి రాకుండా చేసినాడు. ఇప్పుడేమో బంగారమటువంటి నిమ్మతోటను పొట్టన పెట్టుకున్నాడు. ఈబోడి మల్లారెడ్డిగాడు కుక్క చావు చచ్చేదాకా నేను నిద్రపోతానా?" అని ప్రతిజ్ఞ చేశాడట చెంచురామానాయుడు. ఆ వర్తమానాన్ని అట్టే ఖాతరు చేసినట్టు లేదు మల్లారెడ్డి. అయినా ఎందుకైనా మంచిదని పొరుగు జిల్లానుంచి నలుగురు కిరాయి గూండాలను దిగుమతి చేసుకుని, వాళ్లను తనకు హోల్‌టైమ్ అంగరక్షకులుగా నియమించుకున్నాడు.

అయిదేళ్ల క్రిందట కొండదొరువులో ఒక పదెకరాల మామిడితోట బేరానికి వచ్చింది. 'మాటా పలుకూ' ఖరారు చేసుకుని నాయుడు రిజిస్ట్రారాఫీసుకు వెళ్ళడానికి సిద్ధంగా వున్నాడు. ఆ దశలో రేటు బాగా పెంచి ఆ తోటను మల్లారెడ్డి గుట్టుచప్పుడుగా

కొట్టేశాడు. ఏం లాభం? వ్రతమైతే దక్కిందిగాని ఫలం దక్కలేదు. ఊరికి దూరంగా వున్న తోట. కాపుదారీ కష్టసాధ్యం. తోపులోనే యిల్లు కట్టించి కావలిగా అందులో ఒక యానాది కుటుంబాన్ని కాపురం పెట్టించాడు మల్లారెడ్డి. ఒక రాత్రివేళ ముసుగు మనుషులు కొందరొచ్చి యానాది సుబ్బయ్యను సున్నంలోకి ఎముకలేకుండా నలగ్గొట్టిపోయారు. ఆ దెబ్బతో రెండు రోజులు గడిచేలోగా యానాది కుటుంబం అయిపు లేకుండా అంతర్ధానమై పోయింది. పేరుకు మాత్రం మామిడితోపు. కొమ్మలుండవు. కాయలుండవు. కలపకు పనికొచ్చే చెట్లుండవు. ఎన్నిసార్లు వేయించినా కంచె వుండదు. మహసూలు కొనడానికి మండీ సాహేబు లెవరూ ముందుకు రారు. తోట సంగతి మనసుకొచ్చినప్పుడల్లా మల్లారెడ్డి జాడు బిగిస్తాడు. పళ్లు గీటిస్తాడు. కళ్ళల్లోనుంచీ చంద్రనిప్పులు రాలుస్తాడు.

ఇప్పుడైనా తన అమెరికా ప్రయాణం గురించి ముందుగా తెలిసివుంటే, కళ్లల్లో నిప్పులు పోసుకునే వాడే చెంచు రామానాయుడు. మరేమీ చేతగాక పోయినా పోలీసులతో లాలూచీపడి 'క్లియరెన్సు సర్టిఫికెట్టు' అయినా చేతికి రాకుండా చూచేవాడు.

అయితే మల్లారెడ్డి తన జాగ్రత్తలో తానుండిపోయాడు. క్లియరెన్సు, పాస్‌పోర్టు సకాలంలోనే సంపాదించాడు. ఎటొచ్చీ వీసా దగ్గరే కొంచెం గొడవ వచ్చేటట్టు తోచింది. ఆంధ్రాకౌంటర్ దగ్గర నిల్చున్న అమెరికన్ ఉద్యోగిని మల్లారెడ్డివైపు ఎగాదిగా చూచింది. జులపాలజుత్తు. బొద్దు మీసాలు, గరుడపక్షి ముక్కు. వీధినాటకంలో రాజవేషంలా సరిగంచు పంచకట్టు. పొడుగాటి పూర్తి చొక్కా, విసనగపు మడువుతో ఇరుభుజాలపైన్నుంచీ పూలదండలా వేలాడుతున్న అంగవస్త్రం. మల్లారెడ్డిది అమెరికా వెళ్లొచ్చే ముఖంలా లేదు. కోడెల బేరంకోసం సంతకు బయల్దేరిన ఖామందులా వున్నాడు.

"ఏం పనిమీద వెళ్తున్నారండీ మా దేశం?" అమెరికన్ మహిళ అచ్చమైన తెలుగులో ప్రశ్నించింది.

"అదేమమ్మా! మా మేనల్లుడు మధుసూదన రెడ్డి వుండడం షికాగోలోనే గదా! పోగా మా వదినగారి కొడుకు జగ్గారెడ్డి డెట్రాయిట్ అనే చోట అవేవో కంప్యూటర్లంటనే, వాటికి మాలీసు చేస్తావుండాడంట! దల్లాసులో మా వూరోడే, మా దాయాదుల కుర్రోడు పట్టుచీరల బిజినెస్‌లో డాలర్లు పండిస్తా వుండాడు. ఆస్టనా, ఊస్టనా అదేందో అందులో..."

"వద్దొద్దు. చాల్లెండి! ఇంతకీ టికెట్టు ఖర్చు వాళ్లే పెట్టుకుంటున్నారా? మీరు కొంటున్నారా?"

ఉలికిపాటువల్ల కలిగిన వుక్రోషంతో మల్లారెడ్డి జేబులో వున్న పాస్‌బుక్కును, పైకి తీసి కౌంటరుపైకి సాచాడు. "ఇది స్టేటు బ్యాంకుది. ఇంకా రెండు బ్యాంకుల్లో ఖాతా వుంది. ఇవిగాక ఫిక్సెడ్ డిపాజిట్లు గూడా..."

"మంచిదండీ రెడ్డిగారూ! మీ అకౌంటు పుస్తకాలు చూడనక్కర్లేదు. మీకు ఆరునెలల గడువుండే వీసా యిస్తున్నాను. నెమ్మదిగా అమెరికా అంతా తిరగొచ్చు. క్షేమంగా వెళ్లి లాభంగా తిరిగిరండి!" అమెరికా ఆవిడ మాటల ధోరణిలో ఇంచుమించు క్షమాపణ ధ్వనించినట్టే వుంది.

"మంచి మాటనినావులే పిండిబొమ్మా! ఆరునెలలదాకా నేనమెరికాలో వుండిపోతే ఇంకేమైనా వుందా? చెంచురాముడి మోచేతులకే మీసాలు పుట్టుకురావా? వాడి కత్తికి

ఎదురుండదు. మావాళ్లకు దిక్కుండదు. కోటను శత్రువుల కప్పజెప్పి దొంగదోవలో పారిపోయి నట్టేగదా!" అనుకున్నాడు మల్లారెడ్డి.

అర్ధరాత్రి ఏ ఒంటిగంటకో మద్రాసు విమానాశ్రయంనుంచి ప్రయాణం ప్రారంభమైంది. పక్కన పక్కా అరవాయన ఎవరో కూర్చున్నాడు. మల్లారెడ్డి నోరు మెదపడానికి వీల్లేకపోయింది. తెల్లవారు జామున ఢిల్లీలో రెండు మూడు గంటల విరామం. ప్రయాణికుల్ని బోయింగ్ విమానంలోకి మార్చారు. ఈసారి పక్కనెవరో ముప్ఫైయేళ్లకు పైబడని యువకుడొకడు కూచుని వున్నాడు. ఏభాష వాడో తెలియడమెట్లాగ? ఏడో తరగతి దాకా చదువుకున్న తన ఆంగ్ల భాషా పరిజ్ఞానమంతా ఉపయోగించి "విచ్‌ప్లేస్... యూ కమింగ్?" అన్నాడు మల్లారెడ్డి.

అబ్బాయి చిరునవ్వు చిందిస్తూ "నేను తెలుగువాడినేనండీ! చిత్తూరు జిల్లాలో కలకడ దగ్గర మావూరు. ఇంజనీరింగు చదివి ఓ కట్టడాల నిర్మాణం కంపెనీలో పని చేస్తున్నాను. పిట్స్‌బర్గ్ దగ్గర" అన్నాడు

–మంచిది. బాగానే వుంది. అయితే వీడు అస్మదీయుడో, తస్మదీయుడో తెలుసుకోడం ఎట్లా? ఆ విషయం తెలిస్తేనే గదా ఇతడికి ఆకులో పెట్టాల్సిందీ, లేక కంచంలో పెట్టాల్సిందీ తేలేదీ! మీరే కులస్థులబ్బాయీ అంటూ సూటిగా అడగడం ఏం బాగుంటుంది?

ఆ ప్రశ్ననే మరొక విధంగా మార్చుకున్నాడు – "నీ పేరేంది నాయనా?"

"గోపాలకృష్ణమూర్తి అంటార్లెండి! మీరు 'మూర్తీ' అంటే చాలు!"

– ఓరి వీడిల్లు బంగారంగానూ! ఉచ్చులోనుంచీ తప్పించుకున్నాడే – అనుకున్నాడు మల్లారెడ్డి. ఫరవాలేదు. గుంభనంగా మాటలు మొదలు పెడ్తే ఎక్కడో ఒకచోట దొరికిపోకపోతాడా?

"మాదిగూడా దూరాభారమేమీ కాదులే! రాయచోటి దగ్గర గాలివీడే మా వూరు. గిత్తలబేరం కోసరం మీ ఇలాకా అంతా తిరిగినోళ్లమే! కలకడ, గుర్రంకొండ, మహలు అదంతా మాకు కొట్టిన పిండే! ఏం నాయనా, కొండాపురం రెడ్లకు పోతుగుంట నాయుళ్లకు మధ్యన పార్టీలు ఎట్లా వుండాయి?"

"ఆ మాటెందుకులెండి! కొట్టుకు చస్తున్నారు. వాళ్ల పుణ్యమా అని మా పాయకట్టులో ఇరవైముప్ఫై వూళ్లవాళ్లకు పగల్లో తిండి సయించదు. రాత్రుల్లో నిద్రపట్టదు. రోడ్డుపైన పోతున్న బస్సును ఆపి, అందులోనుంచి ఒకణ్ణి కిందికి లాగి, నలుగురైదుగురు ఎదురు పార్టీ మనుషులు బాకులతో, బిచువాలతో పొడిచి పారేశారు. నా మొగుణ్ణి చంపినోళ్లు చచ్చేదాకా నేను బొట్టూ దారమూ తీసేది లేదని అతడి భార్య వ్రతం పట్టింది. హంతకులు పరారైపోయారు. వాళ్లు చేతికి చిక్కలేదన్న అక్కస్సుతో వీళ్లు వాళ్ళ కొంపలకు అగ్గిపెట్టేశారు. కసువు వాములు కాల్చేశారు. పొట్టేళ్ళను పట్టుకొచ్చి కోసి తినేశారు. ఇది జరిగిన పది దినాలకు ఆ పార్టీ నాయకుణ్ని మదనపల్లె నాలుగురోడ్ల కూడలిలో నాలుగు వందలమంది చూస్తుండగా నరికి పారేశారు. కాష్ఠం కాలుతూనే వుంది. డబ్బాలకొద్దీ నెయ్యి పోస్తూనే వున్నారు. దీనికి అంతెక్కడండీ బాబూ?"

"అహఁ, అదికాదు. ఎవరిది పైచెయ్యిగా వుందని అడిగినాను..."

అబ్బాయి మరీ పేట్రేగిపోయాడు. "గొంతు కోసుకోడానికి ఏ కత్తి అయితే నేమండీ? అందుకు మీ కత్తి అయితే ఒకటి, నా కత్తి అయితే ఒకటా? నీ కొడుకుల్లో మంచోడెవుడు అని అడిగితే – అదిగో, పూరికొట్టంపైన నిలబడి నిప్పులు రాల్చుతున్న కొరివి త్రిప్పుతున్నాడే, వాడే మంచోడు – అన్నాడట తండ్రి. మీరడిగిన ప్రశ్నకు చెప్పాలంటే నేనూ అట్లాగే సమాధానం చెప్పాలి. అంతెందుకు ఓ మాట చెప్పనా! రెండు వారాల స్వల్పవ్యవధిలో నేనెందుకు వచ్చిపోతున్నానో తెలుసా? తీరని జబ్బుతో మంచాని కంటుకపోయి నన్నే కలవరిస్తున్న మా అమ్మను చూడ్డంకోసం. అంతగా ఆమె కుంగిపోవడానికి కారణం అర్థాంతరమైన మా తమ్ముడి చావు! వాడికే పార్టీతోనూ ప్రమేయం లేదు. వెనుకనుంచి చూస్తే ఒక పార్టీ లీడరు ముద్దుల కొడుకులా వుండడమే వాడి దోషం. చిన్న రాజాకోసం పొంచివుండిన కిరాయి ఖూనీకోర్లు ఓ చలికాలపు సాయంకాలం మసక చీకట్లో మనిషిని సరిగ్గా పోల్చుకోలేక సొంతపనిపైన కొండాపురం వెళ్లివస్తున్న మా తమ్ముడిపైనపడి సఫాచేసి పారేశారు. శరీరం దొరకలేదు. శరీర భాగాలు మాత్రమే దొరికాయి. మూతి బిగగట్టిన గోతాన్ని చూపించి 'ఇదిగోనమ్మా నీ కొడుకు' అని మా అమ్మకందజేశారు..."

మల్లారెడ్డి మాట్లాడలేకపోయాడు. మాట్లాడినందుకు కించపడిపోయాడు.

"బయల్దేరివస్తుండగా మా అమ్మ ఏమని చెప్పిందో తెలుసాండీ?"

"ఏం చెప్పింది?"

అబ్బాయి కంఠం గాద్గదికమైపోయింది – "నాయనా! నువ్వీదేశానికి రావొద్దురా! లచ్చనంగా ఆ దేశంలోనే వుండిపోరా! వారానికొకసారి ఫోనులో మాటాడరా, చాలు – అందండీ."

వికలమైన మనసును మరమ్మత్తు చేసుకోడానికన్నట్టుగా, మూర్తి సంచిలోనుంచీ ఓ పుస్తకం పైకి తీశాడు. చదువుతున్నంతసేపు చదువుకుని ఆపైన నిద్రలోకి జారుకున్నాడు.

దీపాలు ఆర్పేసి, కిటికీకడ్డంగా తెరలు దించేయడంతో విమాన అంతర్భాగంలోనికి రాత్రివేళ కమ్ముకొచ్చేసినట్టయింది. మల్లారెడ్డిగూడా బయల్దేరిన చోటును, గమ్యాన్ని, బంధుమిత్రుల్ని, శత్రువుల్నీ, కక్షల్ని, కార్పణ్యాల్నీ, పోలీస్‌స్టేషన్లనీ, కోర్టు కేసుల్నీ అన్నింటినీ మరిచిపోయి గాఢనిద్రా వివశుడైపోయాడు.

***

సాయంకాలం నాలుగ్గంటలకెప్పుడో ఫ్లయిట్ లండన్‌లో ఆగింది. విమానాన్ని శుభ్రం చెయ్యడంకోసం, ఇంధనం నింపడంకోసం అవసరమైన రెండు మూడు గంటల వ్యవధిలో ప్రయాణికులు ఏరోడ్రోమ్‌లో ఒకచోట సుఖోపవిష్టులై సేదదీర్చుకున్నారు. మళ్లీ ప్రయాణం కొనసాగింది. ఎంతసేపు గడిచినా పగలే. చీకటి జాడలే లేవు. తేదీగూడా మారదట! తానేదో మాయాలోకంలోకి చొచ్చుకపోతున్నట్టే తోచింది మల్లారెడ్డికి! న్యూయార్కు మహానగరం చేరువకు వస్తున్నకొద్దీ అతడి మనసులో భయం నీడలేవో అలముకోసాయి. దేశంకాని దేశం, ఇంగ్లీషు భాష కొంచెమో నంచమో అర్థమైనా, ఈ తెల్లవాళ్ల యాసలో

అది బోధపడి చావదు. తన అమెరికా యాత్ర సక్రమంగా జరగడమనేది ప్రస్తుతానికి చింతల రవీంద్ర రెడ్డి అనే 'నపురు' (వ్యక్తి)పైన ఆధారపడి వుంది. అతడు విమానాశ్రయంలో తనకోసరం వేచి వుండాలి. ఒకవేళ అనుకున్నట్టుగా అనుకున్న సమయానికి అతడు రాలేకపోతే తనగతేం కావాలి? ఎవర్ని అడగాలి? ఏమని అడగాలి?

చింతల రవీంద్ర రెడ్డి అంటే షికాగోలో వున్న తన మేనల్లుడు మధుసూదనరెడ్డికి ప్రాణస్నేహితుడు. తిరిగి వచ్చేటప్పుడు న్యూయార్కులో ఆగడం కుదరకపోవచ్చును గనుక, సదరు రవీంద్ర రెడ్డి అక్కడి ఏర్‌పోర్టులో తనను కలుసుకుని తన ఇంటికి తీసుకెళ్తాడు. దర్శనీయ స్థలాలనన్నింటినీ దర్శించే ఏర్పాట్లు చేస్తాడు. ఆపైన షికాగో ప్రయాణం. ఇదంతా తన మేనల్లుని ప్లాను. అయితే ఆదిలోనే హంసపాదు అనినట్టుగా ఇందులో ఒక తిరకాసుంది. ఈ రవీంద్రరెడ్డితో తనకిదివరకు ముఖపరిచయమైనా లేదు. ఒకరినొకరు గుర్తుపట్టడమెట్లనో అర్థం కావడం లేదు. కొత్తగడ్డపైన దిగినప్పటినుంచీ సంకటాలేనేమో!

ఈ మూర్తి అనే అబ్బాయి సాయపడతాడమోననుకుంటే అదిగూడా అడియాసే అయిపోయింది. 'పిట్స్‌బర్గ్ ఫ్లయిట్ పట్టుకోడానికి అరగంటకన్నా వ్యవధి వుండదండీ! లగేజీ కలెక్ట్ చేసుకునేదాకా నేను మీకు కంపెనీ యివ్వగలను' అన్నాడు. ఆ తర్వాత నీ పాట్లు నీవేనని గదా అంతరార్థం!

ధగద్ధగాయమానంగా కళ్లకు మిరుమిట్లు గొలిపే దృశ్యం, ఇలాంటిదింకొక టుంటుందా అన్న సందేహానికి ఆస్కారమిస్తూ మనిషిని ఆశ్చర్యంలో ముంచేసే సన్నివేశం, ఆధునిక వాస్తుశాస్త్రం సాధించిన మహాద్భుతం - వెరశీ అదే జాన్‌కెనడీ అంతర్జాతీయ విమానాశ్రయం. అమెరికాదేశపు సంపదకు, వైభవానికీ, ఎంతటి మహత్కార్యాన్ని అయినా సాధించగలవాళ్ల సమర్థతకు అది ప్రతీకగా పొడగట్టింది. అసలే నేల ఈనినట్టుగా క్రిక్కిరిసిపోయి కదులుతున్న జనసందోహం. షాపులకు, హోటళ్లకు, టెలిఫోను బూతులకు, ఇంకా వివిధాగారాలకు చుట్టూ అర్థచంద్రాకారంతో సాగిపోతున్న నడవదారిలో గోడలకు, నేలకు, పై కప్పుకు తావడం చేసిన పాదర్శకపు ఫలకాలలోనుంచీ సజీవమానవమూర్తుల్లా కదిలి వస్తున్న ప్రతిబింబాలనుకూడా కలుపుకుంటే అదొక జనసముద్రంలాగే కానవచ్చింది. అందులో ఒక బిందువై కలిసిపోయాక, ఇక తన వ్యక్తిత్వానికి లెక్కా, పక్కా ఎక్కడిది? అసలిలాంటి బృహన్నిర్మాణం ఒకటి యిక్కడ కట్టిపెట్టేశారంటే - అందుకు కారణం ఇక్కడి కొచ్చినవాళ్లకందరికీ ఎవరి అల్పత్వం వారికి బాగా తెలిసిరావడం కోసమేనేమో! ఇక్కడ తాను గాలివీడు మల్లారెడ్డి కాడు. అడ్రసులేనివాడు. అనామకుడు.

లగేజీ కలెక్ట్ చేసుకుని మూర్తిగూడా వెళ్లిపోయిన తర్వాత తాను మరింతగా ఒంటరివాడై పోయినట్టు తోచింది. వివిధ దేశాల, వివిధ భాషల, వివిధ వేషాల, వివిధ వయసులవాళ్లతో ఏర్పడిన జనప్రవాహంలో ఈదుకుంటూ, ఎదురీతవల్ల కలిగిన ఆయాసంతో పదిబారలకొకచోట ఆగిపోయి ముందుకు తేరిపార చూస్తూ భారతీయు లెవరైనా ఎదురైతే వాళ్ల ముఖంలోకి ఎంతో ఆతురతగా చూపులు సారిస్తూ, ఎట్లాగో ముందుకు కొట్టుకపోతున్న మల్లారెడ్డికి కోరిన కోనలో కురిసిన వానలా, సున్నితమైన పలకరింపు పన్నీటి చిలకరింపులా వినిపించింది.

"ఏమండీ నమస్కారం! మల్లారెడ్డిగారంటే మీరే గదూ! ఏదీ, సూట్‌కేసు యిలా యివ్వండి!"

"ఎట్లా గుర్తుపట్టివి నాయనా?" విస్తుపోతూ అడిగాడు మల్లారెడ్డి.

"మధుసూదన్ రాశాడులెండి! ఆనవాళ్లన్నీ వివరించాడు. అయితే వాటికన్నా చిట్టచివర అతడు రాసినమాట ఒకటి నాకు బాగా ఉపకరించింది. ఏం రాశాడో చెప్పమంటారా? 'మయసభలో రారాజు దుర్యోధనుడిలా జాన్‌కెనెడీ ఏర్‌పోర్టులో ఎవరైనా కనిపిస్తే, ఆయన మా మల్లారెడ్డి మామేననుకో' అన్నాడు."

ఎండిపోయిన పెదవుల్ని నాలుకతో తుడుపుకుంటూ "అట్లనా, అట్లనా" అని విరగబడి నవ్వబోయాడు మల్లారెడ్డి.

***

"మనం ఎట్లా వెళ్లాల? ఇల్లిక్కడికెంత దూరం?" – మెయిన్‌గేటు దాటివచ్చి పేవ్‌మెంటు అంచున నిల్చున్నాక ప్రశ్నించాడు మల్లారెడ్డి.

"ఇంటికెంతో దూరం లేదు. డెబ్భై అయిదు మైళ్లే. ఓ గంటసేపు ప్రయాణం. నా కారుకు కొంచెం రిపేరొచ్చింది. వర్క్‌షాపులో వుంచేశాను. అబ్బాయిని కాన్వెంటునుంచి తీసుకరావడంకోసం నా భార్య రెండో కారు తీసుకెళ్లింది. నేనొక ఫ్రెండును రిక్వెస్టు చేశానులెండి! అతడు తన కారులో నన్ను తీసుకొచ్చాడు. చూచారుగదా, కనుచూపానినంత వరకు కార్లే! తన కారుకు పార్కింగ్ ప్లేసు దొరక్క అతడు రోడ్లపైన తిరుగుతూ వున్నాడు. వస్తాడు లెండి! మనం యిక్కడున్నట్టు పసిగట్టగానే వచ్చేస్తాడు. అందాకా మీరు, అదిగో ఆ కుర్చీలో కూచోండి."

పదినిముషాలలోగా కారొచ్చింది. సామాన్లు డిక్కీలో పడేసి రవీంద్ర అతిథితో పాటుగా వెనుక సీట్లో కూచున్నాడు.

డ్రయివరు సీటులోవున్న అతడి స్నేహితుడు వెనుదిరిగి మల్లారెడ్డి వైపు చూస్తూ అన్నాడు – "నమస్కారాలండీ! ఇందాక రవి మిమ్మల్ని గురించి చెబుతున్నాడు. మీలాంటి పెద్దలు రావడం మాకెంతో ఆనందం. ఎన్నో విశేషాలు తెలుసుకోవచ్చుగదా!"

"ఇంతకూ నా మిత్రుణ్ని మీకు పరిచయం చేయలేదుగదండీ! అనంతపురం దగ్గర సింగనమల వాళ్లవూరు. పదేళ్లనుంచీ ఇక్కడొక యూనివర్సిటీలో పనిచేస్తున్నాడు. పేరు ఆర్.ఎస్.తుమ్మల. 'మిస్టర్ తుమ్మల' అంటే పలుకుతాడు."

"తుమ్మల! అదేంపేరు?" ఆశ్చర్యం ప్రకటించాడు మల్లారెడ్డి.

"ఇక్కడంతేలెండి! అసలు పేరు తుమ్మల రామచంద్రనాయుడు. అది ఆర్.ఎస్. తుమ్మలగా మారిపోయింది. అట్లాగే నన్నుగూడా చింతల రవీంద్ర రెడ్డి అంటే ఎవరికీ తెలియదు. ఆర్.ఆర్.చింతల అనాలి."

"ఎందుకూ?"

"మేము కులాల్ని రద్దు చేసెయ్యాలనుకుంటున్నాం. అందుకు ప్రాతిపదికగా కులనామాల్ని తుడిచి పారేశాం."

"అట్లా చేసినందువల్ల మీకొరిగేదేముందో?"

"ఏర్‌పోర్టులో చూచారుగదా! తెల్లజాతివాళ్లు, ఆఫ్రికానీగ్రోలు, తూర్పుదేశాల ముస్లిములు, ఆగ్నేయాసియా బౌద్ధులు, భారతీయులు యింకా ఎందరెందరో దేశాల సరిహద్దులు తుడిచేసుకొనివచ్చి ఈ దేశంలో స్థిరపడిపోయారు. సృష్టిలో ఒకదేశం మాత్రం భాగమై, ఇంకొకటి కాకపోతుందా? ఈ వలసలవల్ల అన్ని దేశాలూ మనవేనన్న భావన బలిసింది. ప్రస్తుతానికి మతాలైతే మాసిపోలేదుగానీ, మా బిడ్డపాపలు పెరిగి పెద్దవాళ్లయితే వాళ్ల మధ్య స్నేహాలకు, వివాహాలకు మతాలు అడ్డుగా వుంటాయని మేమనుకోడంలేదు. ఈ భావాల మార్పులో కొండలే బెండ్లుగా ఎగిరిపోతుంటే, ఇక కులాల పట్టింపు ఎక్కడుంటుంది? మనిషి జాతీయ పరిధినుంచి బయటపడి, అంతర్జాతీయ స్థాయిని అందుకుని విశ్వ మానవుడుగా రూపొందాలన్నది మేమాశిస్తున్న మొదటి సోపానం. దేశం, భాష, మతం, కులం లాంటి బాహ్య విషయాలద్వారా మనిషిని గుర్తించడం. కాలదోషానికి గురైపోతున్న న్యాయం, ఔదార్యం, సౌజన్యం, ఉపకారచింతన, ప్రేమ, సహనంలాంటి దివ్యగుణాలే మనిషిని జంతువునుంచీ వేరుచేస్తాయని మేము నమ్ము తున్నాం. మనిషిలో మానవత్వమే ముఖ్యమన్నది మా అభిమతం!"

"ఇదేమన్నా కొత్త మతమా?" ఎద్దేవా చేస్తున్నట్టుగా అడిగాడు మల్లారెడ్డి.

"అబ్బే కాదండీ! ఇది మేము కనిపెట్టిందేమీ కాదు. ఎల్లలోకములొక ఇల్లు కావాలనీ, జాతి భేదాలన్నీ కల్లలు కావాలనీ, జ్ఞానదీపం ఒకటి మాత్రం నిశ్చలంగా నిలిచి వెలగాలనీ తెలుగు మహాకవి గురజాడ అప్పారావుగారు ఈ శతాబ్ది ప్రారంభంలోనే అన్నారు. బహుశా రాబోయే శతాబ్దంలోనైనా ఆయన కల నిజం కావాలని కోరుకోగూడదంటారా?"

మల్లారెడ్డి నిరుత్తరుడై పోయాడు. ఆయనకో విషయం మాత్రం స్పష్టంగా తెలిసి పోయింది. శౌర్యగాథలు, పౌరుషవృత్తాంతాలు వీళ్ల చెవికెక్కేటట్టులేవు. బాంబుప్రేలుళ్లూ, పట్టపగలు ఖూనీలు, రక్తపాతాలు, గృహదహనాలు వీళ్లకు ఉత్తేజం కలిగించేట్టు లేవు. మరైతే వీళ్లు తనద్వారా ఎటువంటి విశేషాలు తెలుసుకోవాలని ఆశిస్తున్నారు?

ఈ ప్రశ్నకు సమాధానం ఆరోజు రాత్రి పడుకోడానికి ముందుగా తెలిసొచ్చింది. రాత్రి భోజనానంతరం భార్యాభర్తలు ప్రశ్నలు గుప్పించారు. భారతదేశంలో నిరక్షరాస్యతా నిర్మూలనం కోసం, వెనకబడిన ప్రాంతాల్లో అభివృద్ధికోసం 'ఎన్నారై'లు నిధులు సమకూర్చి పంపుతున్నారు గదా! ఆ పనులు సవ్యంగా జరుగుతున్నాయా? సత్యసాయిబాబావారి సమాజసేవలు అందవలసిన వారికందరికీ అందుతున్నాయా? బాబాఆమ్టే పేరు విన్నారా? ఆయన నిస్సహాయుల కందిస్తున్న తోడ్పాటును గురించి ఏమైనా చెప్పగలరా? మదర్ థెరెస్సాను మానవరూపంలో వున్న దేవత అన్నారు గదా! ఆమెకా ఘన గౌరవం దక్కడం సముచితమేనంటారా? గాంధీ మహాత్ముని తర్వాత మళ్లీ అంతటి వ్యక్తి ఈనాటి భారతదేశంలో ఎవరైనా వున్నారా?

చిక్కిబిక్కరిస్తూ దిక్కులు చూచాడు మల్లారెడ్డి. అక్షరాలు రానివాడి చేతికి మహాభారతం యిచ్చి చదవమన్నట్టుంది – అతడి పరిస్థితి.

***

న్యూయార్కు నగరంలో వున్న వారం రోజులూ ఏడు క్షణాల్లా గడిచిపోయాయి. రవీంద్ర భార్య మల్లారెడ్డికి 'బాబాయి' హోదా యిచ్చేసింది. ఉదయం తొమ్మిదింటికి

అబ్బాయిని కాన్వెంటులో దిగవిడిచిన తర్వాత ఆమె మల్లారెడ్డినట్లాగే నగర సందర్శనంకోసం తీసుకెళ్లిపోతుంది. ఆకాశ హార్మ్యాలెక్కించింది. భూగర్భ రైళ్ళలో ప్రయాణం చేయించింది. డిపార్ట్‌మెంటల్ స్టోర్సు తిప్పించి ఆయన కవసరమైన వస్తువులు కొనిపెట్టింది. చైనీస్ రెస్టారెంట్లకు, ఇటాలియన్ కఫేలకు తీసుకెళ్లి విదేశీ వంటకాలు రుచిచూపించింది. మధ్యాహ్నాల్లో అచ్చమైన ఇండియన్ హోటళ్లలో అసలైన ఆంధ్రా భోజనం పెట్టించింది. మధ్యాహ్న భోజనానంతరం ఆయన హడ్సన్ నదీ తీరపు పచ్చిక బయళ్లలో సేదతీరుతుండగా ఆమె చేరువగా కూర్చుని అమెరికా కబుర్లెన్నో ఏకరువు పెట్టింది.

మల్లారెడ్డి ఉదయం ఆరింటికి నిద్ర లేస్తాడు. ముఖం కడుక్కుని ఈవలికి వచ్చేసరికి తాగడానికి ఒక లీటరు నీళ్లు సిద్ధంగా వుండాలి. అరున్నరకల్లా కాఫీ. పంచదార తక్కువగానే వేయాలి. ఆపైన ఓ గంటసేపు ఉదయకాలపు వాహ్యాళి. తిరిగి వచ్చాక స్నానం. ఉపాహారంలో ఇడ్లీలైతే ఆరు, దోసెలైతే మూడు. సాంబారు, చట్నీ వున్నా, వుండకపోయినా కారప్పొడి తప్పనిసరి. మధ్యాహ్నం టంచనుగా ఒంటిగంటకు భోజనం సిద్ధంగా వుండాలి. కూరగాయల్లో బీర, బెండకాయలంటే చాలా ఇష్టం. కాకరకాయ మాట మాత్రం ఎత్తనేరాదు. కోడి గుడ్లంటే పరమచిరాకు. చికెన్‌బిర్యానీ, మటన్‌కుర్మా ఆయనకు ఫేవరేట్ వంటకాలు. పచ్చిమిరపకాయలంటే ప్రాణం లేచివస్తుంది. ఉప్పూకారం సుష్టుగా తగిలించాలి.

శ్రీమతి రవీంద్ర ఒకటి రెండు రోజుల్లోనే మల్లారెడ్డి రుచులు, అభిరుచులు గ్రహించేసింది. అప్పటి నుంచి ఆయన "నాకిది కావాలమ్మా! ఫలానా దినుసు చేయవమ్మా!" అని అడగవలసిన అవసరం లేకపోయింది.

"నాయనా రవీ! నువ్వడిగొచ్చిన వరం గొప్పది. కాకపోతే బంగారంలాంటి అమ్మాయి దొరకడం ఎంత అదృష్టం! ఏ అమ్మ గన్న బిడ్డోగానీ ఇది పరాయిదేశమన్న అభిప్రాయం కలగకుండా నన్నాదరించింది. అమ్మా నీరజా! ఏ కొరతాలేని సంసారం గదమ్మా నీది! ఈ మల్లారెడ్డి నీకేమివ్వగలడు చెప్పు..."

"మీరు మాత్రమే ఇవ్వగలిగినదొకటుంది. ఇప్పుడు కాదులెండి! బయల్దేరడానికి ముందుగా చెబుతాను" – అంది నీరజ.

"వద్దొద్దు. మీరలా అడక్కండి!" – అడ్డుతగులుతూ అన్నాడు రవీంద్ర. "మా నీరజ సంగతి మీకు తెలియదు. ఏదో పెద్ద కొండలకే సన్న చేస్తూ వుంటుంది. ఇప్పుడే చెబుతున్నా మీకు! మళ్లీ నన్ను తప్పుబట్టి లాభం లేదు. నీరజ మీరనుకున్నంత మంచిదేంకాదు. దాపరికం లేకుండా తనను గురించి ఉన్నదున్నట్టుగా చెప్పేయమన్నానా! ఎక్కడ చెప్పింది? మభ్యపెడుతూనే కాలం గడుపుతూ వుంది..."

"అదేమయ్యా రవీ! మాటకూ మాటకూ పొంతన లేకుండా మాట్లాడితే ఎట్లా? ఇంతకూ అమ్మాయిమీద నీ ఆరోపణ ఏంది?"

'ఇందాకా 'ఏ అమ్మ గన్న బిడ్డో' అన్నారు గదా! వాస్తవం తెలిస్తే మీ పాదాల క్రింద నేల కరిగిపోవడం ఖాయం. తల్లి పేరుకేముందిలే! ఎవరైనా పెట్టుకోవచ్చు. తండ్రి పేరు మాత్రం చెప్పి వుండదనే నా నమ్మకం. విన్నారా? ఆయన పేరు కొమ్మినేని శ్రీరాములు చౌదరిగారు. గుంటూరు జిల్లాలో నరసరావుపేట దగ్గర చిన్నవూరు. వీళ్లన్నయ్యా, నేనూ

కాకినాడ ఇంజనీరింగు కాలేజిలో కలిసి చదువుకున్నాం. సెలవుల్లో అప్పుడప్పుడూ వీళ్ల వూరికి వెళ్లొస్తూ వుండేవాణ్ణి. అప్పట్లో ఈవిడ మనసు దోచేసుకుని నన్ను పెళ్లాడేసింది. కానీ విడ్డూరమేమంటే - అంతపని జరిగినా తోకచుక్కలు పొడవలేదు. ఉల్కలు రాల్లేదు. అగ్నివర్షం కురవలేదు. అందువల్ల మా పెళ్లి మూలంగా ధర్మానికేమీ సేగికలగలేదనే అనుకున్నాం..."

"ఏంది నాయనా నువ్వు చెప్పేది. నీరజ నాయుళ్లమ్మాయా?" నిర్ఘాంతపడిపోతూ అడిగాడు మల్లారెడ్డి.

"అంతేనా? ఇంకొక రహస్యం గనక చెప్పేశానంటే మీ పాదాల ముందర బాంబు ప్రేలినట్టే! వీళ్ల చెల్లెలినిచ్చింది మీ జిల్లాలోనే!"

"మా జిల్లాలోనా? ఎక్కడ? ఏవూరు?"

"మిట్టపాళెం చెంచురామానాయుడుగారి చిన్న కోడలు పంకజం స్వయానా వీళ్ల చెల్లెలే!"

మింగుడుపడని వెలగకాయ గొంతుకలో పడ్డట్టయింది. మింగలేక, కక్కలేక మల్లారెడ్డి ఉక్కిరిబిక్కిరి అయిపోతుండగానే నిమిషాలు గంటలుగా మారిపోయాయి.

***

బయల్దేరవలసిన రోజు రానే వచ్చింది. రవీంద్ర అయిదుగంటలకల్లా ఆఫీసునుంచీ వస్తాడు. సాగనంపడంకోసం భార్యాభర్తలిద్దరూ విమానాశ్రయానికి వస్తారు. సాయంకాలం ఏడింటికే షికాగో ఫ్లయిట్.

భోజనం చేసిన తర్వాత కాసేపు కునుకుతీసి లేచాడు మల్లారెడ్డి. తాగడానికి మంచినీళ్లు తెచ్చి యిస్తూ కుర్చీలో కూర్చుంది నీరజ.

"నేనేమడిగినా ఇస్తానన్నారుగదా బాబాయ్! అడగమన్లేదే! నాపైన కోపమొచ్చి నట్టుంది మీకు" - ఆమె మెల్లగా ఉపక్రమించింది.

"అయ్యో అదేం లేదమ్మా! ఇంకా మేమే ఎంతో కాలంనుంచీ మూర్ఖంగా బతుకు సాగిస్తున్నాం. వయసులో చిన్నవాళ్లయినా మీరు చెప్పిన మంచి మాటలు కొన్ని మనసులోనే గట్టిగా నిలిచిపోయినాయి. అమెరికా రాకముందు నాకిద్దరు కూతుళ్లే. ఇప్పుడు ముగ్గురు కూతుళ్లనుకుంటున్నా. నీకేం కావాలో అడుగు. కొండమీది కోతినైనా పట్టుకొచ్చి విమానంలో రవాణా చేయగలను. ఇది నాలుకా, తాటిపట్టా?"

"అబ్బే, అలాంటిదేమీ కాదు బాబాయ్! మీరు నాకో మాట యివ్వాలి..."

"మాటే కదా! దానికేం భాగ్యం? అడుగు."

నేలవైపు చూస్తూ కూచున్న నీరజ గొంతుసవరించుకోబోయింది. అంతలో తటపటాయిస్తూ మౌనం వహించింది.

"ఏమమ్మా, మాటాడవు?"

"చెబుతున్నా బాబాయ్! ఆలోచించే మీరో నిర్ణయానికి వస్తే చాలు. పోరు నష్టమనీ, పొందు లాభమనీ అంటారు. పోరు మానేసి మీరు పొందే కోరుకుంటే బాగుండదూ?"

"అంటే?"

"శత్రువును గెలవడంకన్నా శత్రుత్వాన్ని నిర్మూలించడం గొప్ప విషయమంటారు గూడా! మీరొప్పుకుంటారా బాబాయ్?"

"చెప్పు. వివరంగా చెప్పు."

"ప్రతివారమూ నేను, మా చెల్లెలూ పదిహేను నిమిషాలపాటు ఫోనులో మాట్లాడుకుంటూ వుంటాం. పెళ్లై అత్తారింటికెళ్లాక మా పంకజంలో జీవనోత్సాహమంతా సమసిపోయింది. 'ఏం చెప్పమంటావక్కా! ఏరోజు ఏ దుర్వార్త వినవలసి వస్తుందోనన్న భయంతో సహజీవనం చేస్తున్నాము. యుద్ధగుడారాల నడుమ, ఎదురు కాల్పుల మధ్య దినదినగండంగా బ్రతుకుతున్నట్టుంది. తలకాయలు సొరకాయల్లా తెగిపోవడం, పచ్చినెత్తురుతో భూదేవి చెమ్మగిల్లడం, చచ్చినవాళ్ల భార్యాబిడ్డలు ఆలగోదు, బాలగోదుగా విలపించడం – ఈ కథలు ఎంతకాలమని వినగలం చెప్పు?' అంటూ వాపోతుంది. రాయలసీమలో ఇచ్చేశాము దానికేం బాధలేదు. ఆ ప్రదేశాలన్నా, మనుషులన్నా దానికెంతో ఇష్టం. ఏడాదికంతా పదిపదిహేను పదున్లవాన కురిస్తే చాలునంటుంది. ఆ మాత్రం వానకురిస్తే ఏర్లు సాగుతాయట. చెరువులు నిండిపోతాయట. పంటలకు కొదవేమీ వుండదట. 'ఇద్దరంటే ఇద్దరు మనసు మార్చుకుంటే చాలు, ఈ ప్రాంతం నందనమే! కానీ వాళ్లు మార్చుకోరు. మారరు' అంటూ కుమిలిపోతుంది. ఏం బాబాయ్ మీరు సమ్మతిస్తారా, పాత సంగతులు మరిచిపోయి, కొత్త అధ్యాయం ప్రారంభించడానికి?"

పదిపదిహేను నిమిషాలదాకా ఆలోచిస్తూ వుండిపోయాడు మల్లారెడ్డి. ఆ తర్వాత ఉన్నట్టుండి నిర్ణయానికి చేరువగా వచ్చినట్టుగా "కానీ ఈ ప్రసక్తి అటువైపునుంచీ రావాలగదమ్మా!" అన్నాడు.

"ఆ పూచీనాది, సరేనా బాబాయ్?" ఫోను చేతికి తీసుకుని ఓ పెద్ద సంఖ్యను డయల్ చేసింది నీరజ. "...హలో! నేను మామయ్యా నీరజని... మూడురోజులుగా నేను మీతో జరిపిన తెల్లవారు జాము చర్చలన్నీ ఒక కొలిక్కి వచ్చేశాయి. మల్లారెడ్డి బాబాయి ఇదిగో ఇక్కడే వున్నారు. ఆయనతోనే మాట్లాడాలి మీరు..." రిసీవరును మల్లారెడ్డి చేతికందించింది.

"ఏమయ్యా నాయుడూ!... ఓహో అట్లనా, మంచిది మంచిది. ఒకటేనయ్యా ఆశ్చర్యం. ఒక ఆడకూతురు ఎంతపని చేసిందో చూస్తివా? మనమూ వుండాం. ఎందుకూ? మాటలతో పోయే దానికి ఈటెలు తెచ్చుకున్నాం... అవునవును. మనమూ బాగుండాల. మనచుట్టూ వున్నవాళ్లూ బాగుండాల... ఈ బుద్ధి పదేండ్లనాడే కలిగుంటే, ఎంత నష్టం జరగకుండా పోయేదోగదా! తీరా బాగా చేతులు కాలినతర్వాతగానీ ఆకులు పట్టుకోకపోతిమే! అదేనయ్యా నా బాధ!... సరే, ఇకనేం? నిశ్చింతేగదా! రెండు మూడు నెలలుండే వస్తాన్లే. ఇదిగో అమ్మాయితో మాట్లాడు. చల్లటి మాట నువ్వే చెవిలో వెయ్!"

❖ ఆంధ్రప్రభ వారపత్రిక – 19, జనవరి, 1998. ❖

# అరచేతిలో గ్లోబు

ప్రియమైన నీరజక్కయ్యా, నమస్కారం. నీ ఉత్తరం చేరింది. నీకీ ఉత్తరాలు రాసే బెడద తప్పడంకోసం ఇంట్లో ఫోన్ పెట్టించుకోలేని నా అశక్తతకు మన్నించు. అశక్తత మాట అటుంచి, కాలంతో పోటీపడి ఫోన్‌లో ముక్తసరిగా మాట్లాడడం కన్నా, ఉత్తరాల్లో నింపాదిగా మనసువిప్పి విషయ నివేదన చేసుకోవడమంటేనే నాకిష్టం. అన్నట్టు నువ్వు 'ట్రావెలాగ్ రాశావా? రాస్తున్నావా? అసలు రాసే ఉద్దేశం ఉందా?' అని నిలదీసి అడిగావు. అక్కయ్యా నువ్వు కోపగించుకోకపోతే నేనొకమాట చెబుతాను. మాటల్లోగానీ, చేతల్లోగానీ పదిమందినీ అనుసరిస్తూ నడుచుకుంటేనే మనకు భద్రత. లోకంలో ఉన్న నిశ్చితాభిప్రాయా లకు వ్యతిరేకంగా ఎవడైనా మాట్లాడితే, వాడికి మునుపటికెన్నడో భూమి గుండ్రంగా ఉందని చెప్పిన శాస్త్రవేత్తకు జరిగిన సత్కారమే జరుగుతుంది. భారతీయ నాగరికతకు ప్రస్తుతం అమెరికా భజన అన్నది కలికితురాయిగా కుదిరిపోయింది. 'మా పెదనాన్నగారి అల్లుడికి వేలువిడిచిన తమ్ముడు స్టేట్స్‌లో వున్నా'డని చెప్పుకోవడం చాలా గొప్ప. "నా కొడుకు జాబు రాసినాడమ్మా. నలభై ఏడో అంతస్తులో ఉన్నవాడి ఆఫీసులో కూచుని రాసినాడంట' అని చెప్పుకోవడం మరింత గొప్ప.

ఇటీవల నేను, కొడుకూ కోడలూ, కూతురూ అల్లుడూ కూడా అమెరికాలో ఉన్న ఓ పెద్దమనిషితో మాట్లాడుతూ ఉండి, బుద్ధిమాలి నా అమెరికా అభిప్రాయాలు కొన్నింటిని బయట పెట్టడానికి ప్రయత్నించాను. మనిషి అగ్రహోదగ్రుడైపోవడమంటే ఏమిటో అప్పుడే తెలిసింది.

'భారతదేశం గూడా ఒక దేశమా? భారతీయులుగూడ మనుషులేనా? వీళ్ళు తింటున్నది తిండేనా? బతుకుతున్నది బతుకేనా?' అన్నట్టుగా ఆయన ఛీత్కారప్రాయంగా నావైపు చూశాడు.

'చాల్లేవయ్యా నువ్వున్నూ, నీ మిడిమిడి జ్ఞానమున్నూ! నక్క ఎక్కడ, నాగలోకమెక్కడ?' అంటూ దులిపిపారేశాడు. అంతెందుకు, ఏదో డెప్యుటేషన్ మీద స్టేట్స్‌లో రెండేళ్ళుండి వచ్చిన వారి వంశాంకురం – అయిదేళ్ళ కుర్రాడు, 'డర్టీ ఇండియా! మనకొద్దే వద్దు. లెటజ్ గో టు అట్లాంటా మమ్మీ' అంటూ తల్లితండ్రుల్ని మురిపించడం చూసి నేను నా విస్మయాన్ని దిగమింగుకున్నాను. మన మాట, మన తిండి, మన గాలి, మన నీరు మొదలైన వాటిపట్ల చాపకింద నీరులా ఇలా అసహ్యం విస్తరించడం చూస్తుంటే నాబోటి అర్భకులకు మతిపోతూ వుంది. ఈ పరిస్థితిలో నేనేం ట్రావెలాగ్ రాయగలను చెప్పు. లేదంటే నిర్భయంగా నా అభిప్రాయాలు బయటపెట్టుకోవడానికి నువ్వొక్క దానివైనా వున్నావు. అదైనా ఎంత అదృష్టం!

రాకపోకలకు చార్జీలు భరించి, అక్కడ ఆతిథ్యమివ్వగలిగిన వాళ్ళుగూడా సమకూరితే మామూలు వారపుసంతకు వెళ్ళి ఎరుగని వాడుగూడా అమెరికా వెళ్లి రావచ్చు. ఒకానొక కళలోకొంత ప్రవేశమో, అభినివేశమో కలిగి ఉండడం నాకు సమకూరిన గొప్ప అర్హతైపోయింది.

సంయుక్త రాష్ట్రాలలోని తెలుగు సాంస్కృతిక సంస్థల సమాఖ్య ఒకటి అన్ని సదుపాయాలకూ హామీ ఇచ్చి, వివిధ నగరాల్లో వేణుగాన కచ్చేరీలు ఏర్పాటు చేయకపోతే నాది అమెరికా వెళ్ళివచ్చే ముఖం గాదు. ఒకమాట చెప్పనా అక్కయ్యా! ఈ ప్రయాణాని కంతా అంతర్వాహినిగా ఉన్నది ఎట్లాగైనా నిన్ను కలుసుకోవాలన్న సంకల్పమే! అప్పటికి నువ్వుత్తరం రాసి అయిదారేళ్ళయిపోయింది. నేను రాసిన ఉత్తరాలేమో 'అడ్రస్ జాడ తెలియడం లే'దన్న రిమార్కుతో తిరిగొచ్చేశాయి. మనకు కావలసినవాళ్లు విశాల ప్రపంచంలో ఎక్కడో ఒకచోట ఉన్నారనుకోవడంలో గొప్ప సంతృప్తి ఉంది. హఠాత్తుగా అంతర్ధానమైపోయి, ఆ తరువాత వాళ్ళ అజాపజా తెలియపోతే ఏమనుకోవాలి? ఈ విషయం జ్ఞప్తికొచ్చినప్పుడల్లా నాకు ఏడుపొస్తుండేది. చిన్నప్పుడే తల్లి పోయిందా, తండ్రి మారు మనువు చేసుకున్నాడా, సొంత ఇంట్లోనే నేను పరాయివాడినైపోయానా, అప్పట్లో పెద్దమ్మ ఆదరణ దొరక్కపోతే నా బతుకేమైపోయేదో?

ఆమె నన్ను నెల్లూరు తీసుకొచ్చేసింది. ఆమె ఒళ్లో నువ్వు, నీ ఒళ్ళో నేను కూర్చుని తీయించుకున్న ఫొటో నీకు గుర్తుందా అక్కయ్యా 'ప్రతి ఏడాదీ సూళ్ళూరుపేట వెళ్ళి చెంగాళమ్మను సేవించుకునేవాళ్ళం. వెంకటగిరిలో నాటకాలు చూసేవాళ్ళం. వారానికి రెండుమూడుసార్లయినా రంగనాయకస్వామిని దర్శించేవాళ్ళం. పెన్నానది ఇసుకతిన్నెల్లో బొమ్మరిళ్ళు కట్టుకునేవాళ్ళం. వంతెనపైన వెళ్ళే రైల్లోని ప్రయాణికులకు చేతులూపుతూ వీడ్కోలు చెప్పేవాళ్ళం. ఆ మాటకొస్తే నా చిన్ననాటి స్మృతులన్నీ నీతో ముడిపడినవేకదా. అలాంటి నువ్వు నీ అతీగతీ గురించి ఒక చిన్న క్లూ అయినా మిగల్చకుండా అజ్ఞాతంలోకి జారిపోతావా? తలచుకున్న కొద్దీ నీపైన నాకు కోపంగూడా వస్తుండేది. జాన్ కెనడీ అంతర్జాతీయ విమానాశ్రయంలో దిగి అమెరికా నేలపైన తొలి అడుగులు వేస్తుండగా నా మనసులో మెదలినవన్నీ నిన్ను గురించిన జ్ఞాపకాలే.

'ఓరుగంటి నీరజాదేవి అండ్ భూపతిరాజా ఒక కూతురుంటుంది వాళ్ళకు. పిట్స్‌బర్గ్ దగ్గర సిల్వర్‌టన్ ఇండస్ట్రియల్ ఏరియాలో ఉండేవాళ్ళు. ఏమండీ, వాళ్ల పేర్లు ఎక్కడైనా విన్నారా? ఆచూకీ ఏమైనా చెప్పగలరా?' అంటూ ఓ రికార్డు తయారుచేసి మనసులో పదిలపరచుకున్నాను. ఎక్కడికి వెళ్ళినా, ఎవరిని కలుసుకున్నా 'తప్పిపోయిన అక్కయ్య'గా నీ ప్రసక్తి తెస్తూ వచ్చాను. 'ఊఁహూ! తెలియదండీ. అలాంటి పేర్లే విన్నట్లు లేదండీ' అన్న జవాబుతో నా తల దిమ్మదిరిగిపోతూ వచ్చింది.

అమెరికాలో నా పర్యటన చికాగో నగరంనుంచి ప్రారంభమైంది. డల్లాస్, ఆస్టిన్, హ్యూస్టన్ నగరాలు కేంద్రంగా టెక్సాస్ రాష్ట్రంలో చాలా ప్రదేశాలు చూశాను. కెనడా వీసా సంపాదించి అట్లావా, టొరంటో పట్టణాలకు వెళ్ళాను. తిరిగివచ్చి డెట్రాయిడ్‌లో కొన్నాళ్ళుండి నయాగరా మీదుగా బఫెలో చేరుకున్నాను. అక్కయ్యా! ఆ ఊళ్ల పేర్లూ, ఆ ప్రయాణాలు నీకు తెలియనివా? వాటిని గురించి ఏకరవుపెడుతూ నిన్ను విసిగించను. అయితే, బయటికి చెప్పుకోవడానికి వెనుకాడుతూ, నా మనసులోనే దాచుకున్న అభిప్రాయాలను నీతో పంచుకోక తప్పదు. ఎన్నో ఆకాశహర్మ్యాలు, ఎన్నో రోడ్లు, ఎన్నో డిపార్ట్‌మెంట్ స్టోర్లు – అన్నీ ఒకదానికొకటి డిటోగా కానరావడమే అమెరికా నగరాల ప్రత్యేకత అనుకుంటాను.

ఎప్పుడూ తలుపులు మూసి ఉండడం వల్ల స్టిల్ చిత్తరువులా కానవచ్చే ఇళ్లు, లోపల ఎవరున్నారో తెలియకుండా చీమలబారుల్లా సాగిపోయే కార్లు, పాదచారులు నడయాడని రోడ్లు నాకు విసుగుదలను కలిగించాయనే చెప్పాలి. తెలుగు రక్తం పంచుకుపుట్టి అమెరికా నేలపైన నివసిస్తున్న అన్నదమ్ముళ్ల, అక్కచెల్లెళ్ల జీవన విధానమే నా పరిశీలనకు తరిగిపోని ముడివస్తువుగా పరిణమించింది. మామూలుగా నేను భార్యాభర్తలిద్దరూ ఉద్యోగుల్లా ఉన్నవారి ఇళ్ళలోనే బస చేశాను.

వాళ్ళు ఆరింటికల్లా నిద్ర లేస్తారు. ఇంటిని తుడిచిపెట్టి, బోకులు కడిగిపెట్టి, స్నానపానాలు ముగించి, మొక్కజొన్న పిండి ముక్కలు పాలల్లో కలుపుకొని చద్దన్నం తిన్నట్టు గబగబా నోట్లో వేసుకుని చెరొక కారుపైన చెరొక దిశగా ఉద్యోగ విధులకు వెళ్ళిపోతారు.

ఆఫీసు పక్షులన్నీ గూళ్ళు చేరుకునే అపర సంజవేళల్లో చీమల నడకతో పోటీ పడినట్టు ముందూ, వెనకా సాగే కార్లకు అనుగుణ్యంగా తమ కారు వేగాన్ని సర్దుకుంటూ సాయంకాలం ఏడింటికిగాని ఇల్లు చేరుకోలేరు. రిమోట్ కంట్రోల్‌తో తలుపులు తెరిపించుకుని పేరు పెట్టి బిడ్డల్ని బిగ్గరగా పిలుస్తూ ఇంట్లోకి దూసుకొస్తారు. అదంతా వాళ్ళ చాపల్యం మాత్రమేగాని ఆవేళప్పుడు అమెరికన్ పడుచువాళ్ళెక్కడైనా ఇంట్లో ఉంటారా! భార్యాభర్తలకదంతా ఆలోచించుకునే తీరిక మాత్రం ఎక్కడిది? డ్రస్ మార్చుకుని వెళ్ళి వంటగదిలో పడతారు. వేడి వేడిగా తయారుచేసుకున్న ఖాద్య పదార్థాలను ఆవురావురంటూ తినేస్తారు. రోజుకంతా ఈ ఏకభోజనమే వాళ్ళు నోచుకున్న మృష్టాన్నం. భోజనానంతరం ఉత్తరాలు చూసుకోవడం, ఫోన్‌కాల్స్ చెయ్యడం 64 పేజీల దినపత్రికను ఒకసారి తిరగెయ్యడం – ఇంతటితో ఆరోజుకని దాచిపెట్టుకున్న జవసత్త్వాలన్నీ ఖర్చయిపోగా, నిద్రలో నడచినట్టుగా వెళ్ళి సొమ్మసిల్లినట్టుగా పడకపైన వాలిపోతారు. స్థానిక హోటళ్ళలో ఇంగ్లాండు దేశపు డాగ్ హెడ్స్‌గానీ, ఇటలీ దేశపు ఫిజ్జులుగానీ, చైనా దేశపు చేపల వేపుళ్ళుగానీ మైసవి, అర్ధరాత్రికెప్పుడో ఇల్లు చేరుకుంటూ టీవీలో భయంకర, బీభత్స దృశ్యాలను, కర్ణ కఠోర ఘోరధ్వనులను వసంతవైభవాలుగా, కోకిలాలాపాలుగా ఆస్వాదిస్తూ, తెల్లవారుజామున ఎప్పుడో నిద్రలోకి జారుకునే వంశోద్ధారకులకు మధ్యాహ్నం పదకొండుకో, పన్నెండుకోగానీ తెల్లవారదు. ఆ లెక్కన తల్లితండ్రులు, వారి బిడ్డలు ఒకరి ముఖం ఒకరు చూసుకోవడం సెలవు రోజుల్లో మాత్రమే ఒనగూడే అపురూప సన్నివేశమని చెప్పుకోవచ్చు.

'అమెరికా జీవితం మీపైన నెరపిన ప్రభావాల్లో ప్రముఖమైనదేది?' అని నేనొక నడివయసు డాక్టరమ్మనడిగాను.

'తెలియడం లేదా నాయనా. ఇదిగో, ఇలా డబ్బును మింట్ చేసే యంత్రాలుగా మార్చడం' అంటూ ఆమె బదులిచ్చింది. భవిష్యత్తును గురించిన భయాలు ఆమె కళ్ళల్లో చీకటి నీడల్లా పాకడం గమనిస్తూ నేను భయపడి పోయాను. 'అదేమిటండీ! కష్టాలు పడితేనేగదా సుఖాలు?' అంటూ ఓదార్చబోయాను. ఆమె నవ్వింది. ఆ నవ్వు ఏడవలేక నవ్వినట్టుంది.

'పోనీ, మన దేశానికి తిరిగొచ్చేయగూడదా? పరమ పావని భారతమాత కోట్లాదిమందిని మోస్తూనే ఉందిగదా, మీరు తిరిగొస్తే ఆమెకు బరువైపోతారా?' అన్నాను.

'ఎందుకులే బాబూ. ఇప్పుడక్కడి బంధువులతో మాకు కోల్డ్‌వార్ జరుగుతోంది. ఇక్కడ అమెరికాలో తమకో డబ్బులు కాసే చెట్టుందనీ, దీన్ని అక్కడినుంచి కదిలిస్తే డబ్బులు వెళ్ళి తమ ఒడిలో రాలిపోవాలని ఆశించడం వాళ్ళకు రివాజైపోయింది. బాధలూ, కష్టాలూ, దుఃఖాలూ ఉత్తరాల నిండా పెట్టి పంపిస్తే ఎంతకాలమని ఆ ఏడుపు కుండలతో అభిషేకించుకోగలం? ఇదిగో అక్షయపాత్ర. ఎవరికి కావలసినంత వారు తీసుకోవచ్చు ననగల పరిస్థితి ఉంటే మేము ఇండియాకు రావచ్చు. అలా జరగకపోతే మేము నయాగరాలో దూకినా వాళ్ళు పట్టించుకోరు. తమ్ముడూ రంగశాయీ! ప్రపంచాన్ని నడిపేది మానవతా సంబంధాలనేవాడు పరమ మూర్ఖుడు. ఆర్థిక సూత్రాలేనన్నవాడు మహా మేధావి. నువ్వీ అమెరికా దేశంలో ఏ నగరానికైనా వెళ్ళిచూడు. యూనివర్శిటీల్లో, ఫ్యాక్టరీల్లో, ఆస్పత్రుల్లో తదితర సంస్థల్లో ఉద్యోగం చేస్తున్న నూనూగు మీసాల భారతీయ యువకులు మనుషులుగా ఉంటూ యంత్రాలుగా మారిపోతున్న దశలో నీకు కనిపిస్తారు. వారంలో అయిదురోజుల పొడుగునా ఊపిరి తిప్పుకోకుండా పనిచేస్తూ బట్టలుతుక్కోవడం, ఇస్త్రీ చేసుకోవడం, కావలసిన వస్తువులేవైనా కొనుక్కోవడం మొదలైన పనులకు శనివారాలు కేటాయించి, ఆదివారాల్లో ఏ స్నేహితుడినో కలుసుకోవడానికి వందలకొలదీ మైళ్ళు కారులో వెళ్ళొస్తూ అద్దాల గదిలో ఊరపిచ్చుకల్లా బందీలై బతుకుతున్న యువకుల్ని చూసి నువ్వు జాలి పడకుండా ఉండగలవా? రెండు వారాల సెలవులో స్వదేశానికి వెళ్ళి, అప్పటికే తల్లితండ్రులు చూసిపెట్టిన సంబంధాల్లో ఒకటి ఎన్నిక చేసుకుని, సాంప్రదాయిక వివాహ తతంగంతో పాటుగా సర్కారు రిజిస్ట్రేషన్ పత్రాలనుగూడా సంపాదించుకుని, వీలైతే కొత్త భార్యతోను, లేకుంటే ఆరు నెలల్లో తప్పకుండా తిరిగివచ్చి తీసుకెళ్తానన్న వాగ్దానంతోనూ చక్కా ఆకాశమార్గం పట్టేవాళ్ళ దయనీయ పరిస్థితి నీ గుండెల్ని కలచివేయడం లేదా! భూమ్యాకర్షణ శక్తిని దాటుకుని అంతరిక్షంలోకి దూసుకుపోయే రాకెట్లలా, తమ బిడ్డలు మాతృ దేశాభిమానాన్ని వదలుకుని మరొక సమాజపు మానసపుత్రులైపోయే ప్రమాదాన్ని మనవాళ్ళెందుకు గుర్తించరు? సుదూర దేశంలో తమ బిడ్డల ఉనికికి, మనికిగల ఏకైక దాఖలా ఫోన్‌పైన జరిగే సంభాషణలుగా మాత్రమే పరిణమించిన తర్వాత, ఇక కలిగే ఆనందమంతా వాళ్ళు పంపే డాలర్లవల్లనే గదా. తల్లితండ్రులకు, వారి బిడ్డలకు మధ్యగల అనుబంధాలు సైతం ఆర్థిక సూత్రాల చేతుల్లోకి వెళ్ళిపోతున్న ఈ మహామారీచ మానవ నాగరికతా యంత్రంలో మనమందరం మరచీలలు కావలసిందేనా? ఈ అనర్థాన్ని గురించి మీ సామాజిక శాస్త్రవేత్తలు మీకేమీ చెప్పడంలేదా? మీ కవితలు, కథలు, నవలలు హెచ్చరించడంలేదా? అదంతా అలా ఉంచు. నా పరిస్థితిని గమనించావా నువ్వు? ఎట్లాగూ నువ్వు వంటింట్లో కుందేల్లా దొరికిపోయావుగదా! ప్రతిరోజూ ఒక గంటసేపు నీ వేణు నాదనం వినాలన్న కోరిక, అదెంత సులభసాధ్యమైనా నెరవేరిందా? ఇదిగో ఆ గదిలో నేను షెల్ఫ్‌పైన తెలుగు పుస్తకాలు విప్పి చూసే దిక్కులేకుండా కట్టలుకట్టలుగా పడి ఉండడం నువ్వు గుర్తించలేదా? తాకిందల్లా బంగారమైపోయే మైదాను రాజుకన్నా ఏం సుఖసంతోషాలున్నాయయ్యా మాకు? నాయనా రంగశాయీ, నామాట ఒకటి ఆలకిస్తావా బాబూ, డబ్బుకోసం కావలిస్తే నువ్వు కచ్చేరీలు చేసుకో. కానీ, ఏ

చెరువు కట్టపైన్నో, ఏటి ఇసుకతిన్నెలపైన్నో, ఏ రమణీయ ప్రకృతి స్థలాల్లోనో కూచుని నీ ఆత్మానందంకోసం ఎప్పుడైతే నీ వేణువునుంచి రాగాలు, నాదాలు కురిపిస్తావో, అదే నీ జీవితంలో బతికిన క్షణాలుగా భావించు.

ఆఖరు మజిలీ న్యూయార్కు. సోమవారం సాయంకాలపు విమానంలో స్వదేశానికి బయద్దేరవలసి ఉండగా శనివారం నాడు నగరం శివార్లలో నా కార్యక్రమంతోపాటు వనభోజనాలు గూడా ఏర్పాటు చేశారు. భోజనానంతరం విశ్రాంతి తీసుకుంటున్న పౌరబృందాల నడుమ నేను ఆఖరుసారిగా నా అరిగిపోయిన రికార్డును ఆన్ చేశాను. సమూహాలకు దూరంగా కొంచెం వైదొలగి కూర్చున్న ఓ నలభై ఏళ్ళ భద్ర మహిళ నావైపు సాగి వచ్చింది.

'ఏమిటండీ! ఏమన్నారు? ఓరుగంటి నీరజాదేవా? నెల్లూరివారేకదూ? హైస్కూలు టీచరు. మాకు సోషల్ స్టడీస్‌కు వస్తుండేది. ఆవిడగారెక్కడున్నదీ నేను చెప్పగలను.'

నా ఆనందానికి అవధులు లేకపోయింది. 'అమ్మా, మీకు పదివేల నమస్కారాలు. చిమ్మచీకటిలోకి చొచ్చుకవచ్చిన కాంతికిరణంలా ఉన్నారు నాకు. ఏదీ చెప్పండి, అడ్రస్ రాసుకుంటాను' అన్నాను.

'ఉండండి సార్! వివరంగా చెప్పనివ్వండి' అంటూ ఆమె నన్ను జనాంతికంగా తీసుకెళ్ళింది. 'ఆ ఊరిపేరు ఓల్డ్ హైడ్ పార్కు. తెలిసినవాళ్ళెవరో ఉన్నారని మావారు ఏడాదిక్రితం నన్నావూరికి తీసుకెళ్ళారు.

అది చిన్న బస్తీ. అందులో తెలుగు కుటుంబాలు అయిదారున్నట్టు తెలిసింది. ఆ ఇంటి గృహిణి వాళ్ళ వివరాలు చెబుతుండగా నీరజాదేవిగారి పేరు వినిపించి ఉలికిపడ్డాను.

'ఇంటిపేరు ఓరుగంటివారేనా' అని అడిగి తెలుసుకున్నాను. నంబర్ తీసుకుని వెంటనే ఫోన్ చేశాను.

'మేడమ్ నా పేరు పద్మరాణి. మాదీ నెల్లూరే. మీ స్టూడెంటుని. మూడేళ్ళుగా న్యూయార్కులో ఉంటున్నాను. మిత్రుల్ని కలుసుకోవడంకోసం ఈరోజు ఉదయమే ఇక్కడికి వచ్చాను. మీరిక్కడ ఉన్నట్టు తెలిసింది. అభ్యంతరం లేకపోతే ఇప్పుడే వచ్చి కలుసు కుంటా'నన్నాను.

ఒక నిమిషం నిశ్శబ్దం. ఆ తర్వాత ఆమె గొంతు పెకలింది. 'మంచిదమ్మాయ్. నేనర్జంటుగా ఒక చోటికి వెళ్తున్నాను. తిరిగి రాగానే కబురు చేస్తాను' అంటూ ఆమె టకీమని రిసీవర్ పెట్టేసింది. అయితే, ఆమెకా ఉద్దేశం లేదని నాకు స్పష్టంగా తెలిసిపోయింది. మళ్ళీ పలకరించదలచుకుంటే, నేనెక్కడున్నానో ఏమిటో తెలుసుకోవద్దా? కారణం ఏదైతేనేమి, ఆమె పూర్వ పరిచయాలను, స్నేహాలను పునరుద్ధరించుకునే ధ్యాస లేకుండా అజ్ఞాతంగా ఉండిపోదలచుకుంటున్నదని నేను గ్రహించగలిగాను.

పద్మరాణి మూలంగా నాకు నీ ఫోన్ నంబర్ తెలిసింది. ఆ మాత్రం ఆధారం దొరకడమైనా అదెంత భాగ్యం. అమెరికాలో ఫోన్ నంబర్ దొరకడమంటే ఆలీబాబాకు గుహను తెరిచే మంత్రం తెలిసినట్టేగదా.

తిరిగి వెళ్ళగానే నాకాశ్రయమిచ్చిన అభిమాని ఇంట్లోనుంచి నీకు ఫోన్ చేశాను. అలా చేస్తున్నప్పుడు నేనుగూడా పద్మరాణి చేస్తున్న పొరపాటే చేస్తున్నానన్న విషయం నా మొద్దు బుర్రకు తోచిందే గాదు. నంబర్ డయల్ చేయగానే నీ గొంతు వినిపించింది. నా

భావోద్విగ్నతలో నేనేం మాట్లాడానో గుర్తులేదు. 'నీరజక్కయ్యా నేను రంగశాయిని. అయిదారు వారాలుగా అమెరికాలోనే ఉన్నా. నిన్ను కలుసుకోవాలని శతవిధాలుగా ప్రయత్నించాను. ఇప్పుడెట్లాగో నీ నంబర్ దొరికింది. సోమవారమే తిరుగు ప్రయాణం. ఉన్న వ్యవధల్లా...'

ముక్కు బద్దలయ్యేటట్టు ముఖంమీద గుద్దానన్నట్టుగా 'వెరీ సారీ! రాంగ్ నంబర్' అంటూ నువ్వు ఫోన్ కట్టేశావు.

గొంతు మార్చుకోవడానికి విఫలప్రయత్నం చేశావులే. అప్పటికి నేనేనా నెల తక్కువగా పుట్టినవాణ్ణి 'నీకూ బెబ్బెబ్బే, నీ అబ్బకూ బెబ్బెబ్బే' అన్నట్టుగా నువ్వు నన్నుగూడా మభ్యపెట్టజూస్తున్నావని నాకు తెలిసిపోయింది.

అయినా సరే నా అమెరికా యాత్రకంతా ఫలశ్రుతిగా నీ అజ్ఞాతవాసానికి భంగం కలిగించి తీరాలన్న నిర్ణయానికి వచ్చేశాను.

'మహేష్‌బాబుగారూ. నూరు అరైనా, ఆరునూరైనా రేపు మనం ఓల్డ్ హైడ్ పార్క్ వెళ్ళిరావాలి' అన్నాను.

'ఓల్డ్ హైడ్ పార్కా! అదెక్కడుందో ఎరుగుదురా! ఆరేడు వందల మైళ్ళకు తక్కువుండదు. కారులో వెళ్ళిరావడం గురించి ఊహించలేము. ఫ్లైట్‌లో వెళ్ళాల్సిందే. గంటో, గంటన్నరో ఏరోడ్రోమ్‌నుంచి టాక్సీలోగూడా వెళ్ళాల్సి ఉంటుంది.

'ఫరవాలేదు. ఎంత ఖర్చయినా నేను వెనుదీయను. మీరు తోడుగా ఉంటే చాలు' నన్నాను. అమెరికా ఖండంలోని ప్రయాణ సదుపాయాలు అభ్యుదయ పరంపరాభివృద్ధిగా వర్ధిల్లుగాక. మరునాటి ఉదయం పదిగంటలకల్లా మేము ఓల్డ్ హైడ్ పార్కులో గ్రీన్ ఉడ్ డ్రైవ్ నం. 69 ఇంటి ముంగిట నిలబడి కాలింగ్ బెల్ మోగించాను. ఆదమరచి ఉన్నావేమో, నువ్వు తటాలున తలుపు తెరిచి రెడ్‌హ్యాండెడ్‌గా నాకు పట్టుబడిపోయావు. 'నీరజక్కయ్యా ఇది నీకు న్యాయమేనా? నాపట్ల ఇంత నిర్దయ వహించడం నీకు తగునా' అంటూ నీ చేతులు పట్టుకున్నాను. కన్నీటి కొలకులైపోయిన కళ్ళల్లోనుంచి ఆ క్షణాల్లో నువ్వు నాకుగానీ, నేను నీకుగానీ స్పష్టంగా కనిపించి ఉండమేమో.

డగ్గుత్తికతో 'రండి, రండి' అంటూ లోపలికి దారి తీశావు.

కాఫీ కలుపుకొచ్చే మిషపైన నువ్వు వంటగదిలోకి తప్పుకున్నావు. నేను ఇల్లంతా కలయజూస్తున్నాను. గృహ వాతావరణంలో తెలియని వెలితి ఏదో నా మనసును స్పృశిస్తూ ఉంది. ముగ్గురుండవలసిన గ్రూప్ ఫొటోలో ఇద్దరినే చూస్తుంటే గుండెలో ముల్లు దిగినట్టయింది. నీతోబాటుగా ఫొటోకు దిగిన కుర్ర దొరసానిని రాధిక అనుకోవడానికి ఆధారాలేమీ కనిపించడం లేదు. మూడేళ్ళ చిట్టి రాధికతో నువ్వొకసారి స్వదేశానికి వచ్చావు గుర్తుందా అక్కయ్యా. అప్పుడు నేను వేణువుపైన సాధనలు చేస్తూ కృష్ణశాస్త్రి తిలక్‌లను అధ్యయనం చేస్తూ నిష్పూచీరాయణ్ణిగా ఉండేవాణ్ణి. ముద్దులొలికే రాధికను రెండు చేతులతోనూ పైకెగురవేసి పట్టుకుంటూ, 'రాధీ! నేను నిరపరాధీ! ఏనాడు మనకు షాదీ, ఆ నాడు మనకుగాదీ' అంటూ ముదలంకించుకునేవాణ్ణి.

'నా మాటలకేముందిగానీ, ఈ వృద్ధ వివాహానికి మీ బావగారొప్పుకుంటారేమిరా' అంటూ నువ్వు నవ్వేదానివి. మరైతే ఏరీ, ఆ బావగారు ఇప్పుడేరీ? 'ఏవి తల్లీ నిరుడు కురిసిన హిమసమూహములు?'

కాఫీ ఇచ్చాక భోజనం సిద్ధం చేసే నెపంమీద నువ్వు మళ్ళీ వంట గదిలోకి జారుకున్నావు. కొద్దిపాటి పుణ్యకాలం అలాగే గడచిపోనివ్వకుండా నేనుకూడా నీ దగ్గరికి వచ్చి కూర్చున్నాను. ఇసుకలో నుంచి తైలం తీయవచ్చునంటారు. తీయవచ్చునేమోగానీ, అదెంత కష్టసాధ్యం? దాదాపు పదిహేనేళ్ళ తర్వాత వివాహ జీవితం విచ్ఛిన్నమైపోవడానికి కారణాలేమిటో నీనుంచి రాబట్టడం గూడా దుస్తరమైపోయింది. ఎట్లానో చూచాయగానైనా బయటపడ్డావు.

'ఎందుకులే రంగశాయీ? కంపెనీ ఉత్పత్తుల ప్రచారం కోసం ఏడాదికి రెండు మూడుసార్లు దేశాలు తిరిగే ఉద్యోగమైపోయింది. వెళ్ళిన ప్రతిచోటా ఏవో కొన్ని అఫైర్లు మామూలైపోయాయి. ఏంలేదు, అమెరికా కెలాగైనా రప్పించే పూచీ వహిస్తే చాలుగదా, వలలో పడడానికి సిద్ధం కానిదెవరు? వాళ్ళ ఉత్తరాలు, రాసక్రీడల ఫొటోలు కనీసం నాక్కనిపించకుండా చూడాలన్న ధ్యాసయినా లేకపోతే ఏం చెయ్యాలి? కొంపదీసి అలాంటి శాల్తీ ఒకటి కొద్ది మాసాల వ్యవధిపైన ఇక్కడికొచ్చేస్తే ఇక తిరుగుళ్ళ కడ్డేముంది?

మాంసం తినొచ్చు. అభ్యంతరంలేదు. ఎముకల దండను మెడలో వేసుకుని అదొక గొప్పగా భావిస్తూ ఎదుటికొస్తే ఎలా భరించడం? మొదటి అయిదేళ్ళూ రథం ఒడిదుడుకులతోనే సాగినా సర్దుకున్నాను. రెండో అయిదేళ్ళతో పరిస్థితి విషమించింది. కించపాట్లను భరిస్తూ రాతిబొమ్మలా ఉండిపోయాను. మూడో అయిదేళ్ళలో శ్రుతిమించి రాగాన పడిపోయింది. ఆత్మాభిమానానికి అగ్నిపరీక్ష. ఈ నిర్ణయం తీసుకోవడం అనివార్యమైపోయింది. అదీ సంగతి. ఇంతకుమించి నన్నేమీ అడగొద్దు. అన్నపు మెతుకులే ఆరోగ్యప్రదమనుకోక, రత్నాలు బొక్కవచ్చుననుకుని పెళ్ళికి మునుపు ముఖపరిచయమైనా లేని వ్యక్తి వెంట ఇక్కడికి రావడమే నేను చేసిన ఘోరమైన తప్పిదమైపోయింది.

కష్టకాలంలో డిగ్రీ చదువు పనికొచ్చింది. ఎవరికీ తెలియకుండా నా ఏకాంత వాసంలో నేనుండిపోతూ, ఇలాగే చివికి కుంగి కృశించి, నశించిపోవడానికే జీవిస్తున్నాను.

ఒరేయ్ తమ్ముడూ, నీ పర్యటనానుభవాలను నువ్వొక యాత్రాచరిత్రగా రికార్డు చేస్తావు గదూ. అందులో దుఃఖభాజనమైపోయిన ఈ దీనురాలి జీవితానికి గూడా కొంచెం తావివ్వు. ఊరూ. పేరూ మాత్రం మారుస్తావు గదూ.'

ఏనుగుల సమూహం స్నానంచేసి వెళ్ళిన అడవి కొలనులా నా మనసంతా కలవరంతో నిండిపోయింది. ఎట్లాగో కొంతసేపటికి మానసిక శక్తులన్నింటినీ కూడ దీసుకుని, 'అక్కయ్యా, మరి... మరి రాధిక ఏదీ' అని ప్రశ్నించాను.

'ఫ్రండ్స్‌తో కలిసి నిన్న సాయంకాలమనగా వెళ్ళింది. ఎక్కడికి వెళ్ళిందో, ఎప్పుడొస్తుందో తాను ఫోను చేస్తేగాని తెలియదు. ఇట్లాగే ఎప్పుడైనా 'ఈ రోజు నేను ఫలానావాణ్ణి పెళ్ళి చేసుకున్నానమ్మా. ఒక అపార్ట్‌మెంట్ తీసుకున్నాం. వారాంతాల్లో నువ్వొచ్చిపోవచ్చు. మేమూ వీలయినప్పుడల్లా వస్తుంటాము' అని చెప్పడానికిగూడా ఫోనే ఉపయోగించుకుంటే ఆశ్చర్యపడవలసిందేమీ ఉండదు.

అప్పుడు నేను ఇంకా ఇంకా ఒంటరి దాన్నయిపోతాను. ఒక సమాజం నుంచి పూర్తిగా వేర్లను పెల్లగించుకుని, మరొక సమాజానికి తమ భావి జీవితపు ఆనందాలన్నీ

అప్పనంగా దఖలు పరచి ఈ త్రిశంకు స్వర్గంలో లక్షలాదిమంది విదేశీయ తల్లితండ్రుల్లా నేనూ తలకిందులుగా వేలాడుతూ ఉంటాను.

వాతావరణం విషాదంతో బరువెక్కిపోయాక, ఒకరి ముఖం ఒకరు తేరిపార జూసుకునే స్థయిర్యం మనకు లేకపోయింది. వీడ్కోలివ్వడానికి ముందుగా గుమ్మానికావల నిలబడి మౌనపు తెరను కాస్తా ఒత్తిగించుకుంటూ నువ్వడిగావు – 'తమ్ముడూ, రంగశాయీ, అమెరికా యాత్రకంతా సారాంశంగా ఒక మాట చెప్పమని మన దేశంలో ఎవరైనా అడిగితే నువ్వేం చెబుతావో తెలుసుకోవచ్చా?'

నీకు కొంచెం ఊరటగా ఉండాలనుకున్నానేమో తెలియదు. స్ఫురణకు వచ్చిన మాటలు కొన్ని వల్లించాను– 'అమెరికాలో నేను చాలా ప్రదేశాలు తిరిగాను. వెళ్ళిన ప్రదేశాలన్నింటా 'మీదే ఊరు' అని ప్రశ్నిస్తే, వాళ్ళిచ్చిన జవాబుల్ని బట్టి మన హైదరాబాదు, నిజామాబాదు, విశాఖ, విజయవాడ, తిరుపతి, అనంతపురం లాంటి నగరాలన్నీ అమెరికాకు వలస వెళ్ళిపోయినట్టు గ్రహించాను. వంశధార, నాగావళి, గౌతమి, కృష్ణ, పినాకిని లాంటి నదులన్నీ వెళ్ళివెళ్ళి మిసిసిపీలో కలిసినట్టు తోచింది. చూశారా, గ్లోబు గ్లోబంతా అరచేతిలోకి వచ్చేసినట్టు లేదూ?'

నీరసంగా నువ్వప్పుడన్నమాట నా చెవుల్లో ఇంకా మార్మోగుతూనే ఉంది.

'గ్లోబు అరచేతిలోకి వస్తే సరిపోయిందా? జీవితంలోకి ఆనందం రావద్దా'

❖ ఇండియా టుడే – 30 జూన్, 1998. ❖

# నిరంతర ప్రయాణికుడు

మధ్యాహ్న భోజనానంతరం కొంతసేపు నిద్రపోయి లేవడం నా అలవాటు. ఆ రోజు మధ్యాహ్నం భోజనం చేయగానే రైలెక్కాను. బండి కుదుపులే తూగుటుయ్యాలగా ఒళ్లు తెలియకుండా నిద్రపట్టింది. మేలుకునే సరికి గంట నాలుగైంది.

గదులు గదులుగా విభజింపబడిన రెండో తరగతి కంపార్టుమెంటులో ప్రక్క గదిలోనుంచి బిగ్గరగా మాటలు వినిపిస్తున్నాయి. 'ఈ గొంతు ఎక్కడో విన్నట్టుందే!' అనుకున్నాను.

చెవి వొగ్గి విన్నాక కొద్దిక్షణాల్లో పోల్చుకున్నాను గూడా! అతడి పేరు రంగపతి.

వానాకాలపు ఏటి వరదలా అతడి వాక్ప్రవాహం అడ్డూ ఆపూ లేకుండా సాగిపోతూ వుంది.

"ఏమండీ! తిరుపతి నుంచి హైదరాబాద్ వెళ్లవలసి వున్నప్పుడు మీరు 'వెంకటాద్రి'ని ఎందుకెన్నుకుంటారు సార్? 'రాయలసీమ'లో జర్నీ హాయిగా వుంటుంది గదా! సాయంకాలం మూడున్నరకు రైలెక్కితే మరునాటి ఉదయం ఎనిమిదింటికల్లా నాంపల్లిలో దిగీయొచ్చుగదా!

కడపలో భోజనం చేసి పడుకుంటే నిద్రలేచేసరికి మీరు హైదరాబాద్ శివార్లలో వుంటారు. హైదరాబాద్ ప్రయాణానికి నేనెప్పుడూ 'రాయలసీమ'నే ప్రిఫర్ చేస్తాను. ఇప్పుడైతే అనంతపురం వెళ్తున్నాను గనుక, వెంకటాద్రిలో వెళ్లడం తప్పనిసరైపోయింది."

"ఇంతకీ అనంతపురం ఏం పనిమీద వెళ్తున్నారు?" ఎవరో ప్రశ్నించారు.

"ఆ మాటెందుకులెండి! అనంతపురంలో మా చిన్నమామగారి అమ్మాయి పెళ్లి. పెట్టి పుట్టినవాడు. ఆయనకేం కొదువ? పెద్ద బిజినెస్సుంది. పది పదిహేనువేలదాకా అద్దెవచ్చే ఇండ్లున్నాయి. నలుగురు కొడుకులూ నాలుగు దిక్కుల్లో పెద్ద ఉద్యోగాలు చేస్తున్నారు. కానీ ఏం లాభం? ఆయనకు లేనిదల్లా అంగబలమే! వారం రోజులు ముందుగా వచ్చి కార్యం నిర్వహించి పోవలసిందిగా నాకొక ఉత్తరం రాసి పడేశాడు! అయితే ఆ ఉత్తరం వచ్చేటప్పటికి నేనెక్కడ వున్నాను?"

"ఎక్కడున్నారు?" ఓ శ్రోత కుతూహలం వెలిబుచ్చాడు.

అందుకున్నాడు రంగపతి–

"అప్పుడు నేను మెడ్రాస్‌లో వున్నాను. ఆ మెడ్రాస్‌కైనా ఎలా కొట్టుక వెళ్ళాను? విజయవాడలో మా నాన్నగారి స్నేహితుడొకాయన వున్నాడు. చదివించడానికైతే కొడుకును డాక్టరీ చదివించాడుగానీ, ఉద్యోగం సంపాదించిపెట్టలేక సతమతమైపోతున్నాడు.

ఇటీవల గవర్మెంటు హాస్పిటల్స్‌లో కొన్ని వేకన్సీలు ఏర్పడినట్టు తెలిసింది. తెలియగానే తక్షణం బయల్దేరి రమ్మంటూ ఉత్తరం రాశాడు. విజయవాడకు 'తిరుమల'లో వెళ్ళి, కాండిడేట్‌ను వెంటబెట్టుకుని, 'గోదావరి'లో హైదరాబాదు చేరుకున్నాను. తీరా అక్కడికి వెళ్ళాక ఒక పెద్ద సిఫారస్ పట్టుకొస్తేగానీ, పని సానుకూలం గాకపోవచ్చునని తెలిసింది.

ఆ సిపార్సు చేయవలసిన ఆసామి ఎక్కడున్నాడు? మెడ్రాస్‌లో వున్నాడు. వెళ్ళినంత దూరం మళ్ళీ తిరిగొచ్చి రేణిగుంటలో దిగి, అట్లాగే 'సప్తగిరి'లో వెళ్ళి మెడ్రాస్‌లో వాలాను. రెకమెండేషన్ లెటర్ సంపాదించేసరికి రెండురోజులు పట్టింది. దాన్ని కాండిడేట్ చేతికిచ్చి, అతణ్ణి హైదరాబాద్‌కు పంపించేశాను. నేడు మెడ్రాస్‌నుంచి తిరిగొచ్చేసరికి – బల్లపైన ఈ తాఖీదు కనిపించింది..."

"అదేం తాఖీదో?" ఇద్దరు ముగ్గురు ఏకకంఠంతో ఆశ్చర్యం ప్రకటించారు.

"అదేనండీ మా చిన్న మామగారి ఉత్తరం. పెళ్ళికి రమ్మని రాశారన్నానే, అది!"

"ఈ తిరుగుళ్లతో మీకు బేజారుగానే వుండొచ్చు పాపం!" ఒకాయన సానుభూతి ఒలకబోశాడు.

"ఎందుకు చెబుతార్లెండి! పడుకుని నిద్రపోతుంటాను. దడదడమంటూ శబ్దం వినిపిస్తుంది. రైలు వంతెనపైన వెళ్తూ వుంటుంది. హఠాత్తుగా మేలుకుని వుంటానుగదా! ఇల్లలుకుతూ పేరు మరిచిపోయిన ఈగలా, రైల్లో ఎక్కడికి వెళ్తున్నానో గుర్తుకురాదు. ఎక్కడినుంచి బయల్దేరానో జ్ఞప్తిలో వుండదు. ఏ పనిమీద వెళ్తున్నానో స్ఫురించదు. ప్రక్క స్టేషన్లో రైలాగేదాకా, నా గతి అంతే!

ఆగిన తర్వాత ఆ స్టేషను పేరేమిటో తెలిసొస్తుంది. ఓహో, ఇది బంగారు పేట స్టేషన్. కాట్పాడి – బెంగుళూరు మార్గం. బెంగుళూరులో దిగి హిందూపురంలో జరిగే ఒక గృహప్రవేశానికి వెళ్లాల్సి వుంది... ఇలా ఒక్కొక్కటిగా విషయాలన్నీ జ్ఞప్తికొచ్చేస్తాయి..."

ఆ పాటికి రంగపతిపట్ల సహ ప్రయాణీకులకు ఎనలేని భక్తి ప్రపత్తులు కలిగి పోయినట్టే వున్నాయి. ఒక వ్యక్తి ఎంతో వినయంగా వాకబు చేస్తున్నాడు – "ఏమండీ! ఈ బండిలో భోజనాలెక్కడ?" అని.

"ధర్మవరంలో పెడతార్లెండి!" అందిపుచ్చుకున్నాడు రంగపతి.

"రైల్వే రెస్టారెంటులోకి వెళ్లి భోంచేసినా చేయవచ్చు. ప్లాట్‌ఫారంపైన పెరుగన్నం, పులిహోరా పొట్లాలు దొరుకుతాయి. నంజుకోడానికి వడలుంటాయి. కావాలంటే పళ్లు కొనుక్కోవచ్చు. అంతెందుకు? రైలు ప్రయాణాల్లో ఏదేది ఎక్కడెక్కడ దొరుకుతుందో నన్నడగండి! క్షుణ్ణంగా చెప్పగలను.

తెనాలి స్టేషన్లో పాలకోవా కారుచౌక. సింగరాయకొండ సపోటాపళ్లకు ప్రసిద్ధి. తాడిపత్రి జామకాయలంటే కలకండతో సమానం. పనసతొనలు తినాలంటే శ్రీరంగం వెళ్ళాలి. నెల్లూరి నుంచీ శ్రీకాళహస్తిదాకా నిమ్మకాయలు కొల్ల అగ్గవ. కోడూరు, రాజంపేట స్టేషన్లలో అరటిపండ్లు ఎవరు కొన్నా డజన్ల లెక్కన కొనరు. అలాగె గెలలు గెలలుగా కొనేస్తారు. మీరు ఢిల్లీనుంచి దక్షిణాదికి రైల్లో ప్రయాణం చేశారా ఎప్పుడైనా?

నాగపూర్ ప్రాంతాల్లో కమలాపళ్ళు బుట్టలు బుట్టలుగా సీట్ల క్రింద పెట్టుకుంటూ వుంటారు. మామిడి పళ్ళల్లో రకాలయితే ఎన్నెన్నో వున్నాయిగానీ, ఆ రకాలకన్నింటికీ రాజు మల్‌గూబా. మీరు మల్‌గూబా మామిడిపళ్ళు తి...త్తి...త్తినా... లంటే..."

గ్రామఫోను ముల్లు గాడి తప్పినట్టుగా రంగపతి ప్రసంగం అర్ధాంతరంగా ఆగిపోయినందుకు కారణమేమిటో తెలిసిందిగాదు. ఈలోగా కంపార్టుమెంటుకటువైపు

ద్వారం దగ్గర ఏదో అలజడి చెలరేగుతున్నట్టు తోచింది. "ఏమయ్యా, నిన్నే అడగడం! నువ్వెక్కిందెక్కడ? ఎక్కడికెళ్తున్నావు? టిక్కెట్టెక్కడ?" గదమాయింపు స్పష్టంగా వినవచ్చింది.

టికెట్టులేని ప్రయాణికుడు సంజాయిషీ ఏమిటో వినరావడంలేదు.

టి.టి.ఇ. మండిపడిపోతున్నాడు – "ఇదేం మీ తాతల బండి అనుకున్నావా? కట్టవయ్యా పెనాల్టీ! తిరుపతినుంచి కట్టు. నూట ఇరవై మూడు రూపాయలు ఎత్తు. పైకి తియ్యవయ్యా డబ్బు..."

సరిగ్గా, అప్పుడే నాకు రంగపతి దర్శనం లభించింది. మెల్లగా సాగబారి టాయ్‌లెట్‌వైపు వెళ్తూ, అతడు నాకు కనిపించాడు.

టికెట్టులేని ప్రయాణికుల పొలకువ టి.టి.ఇ.ల కెట్లాగో తెలిసిపోయేటట్టుంది. అల్లంతదూరంనుంచే అతడు రంగపతి ముంగాళ్లకు బంధం వేసేశాడు.

"అయ్యా, ఏమండీ–మిమ్మల్నే! కాసేపుండండి సార్? టిక్కెట్టు చూపించి వెళ్దురు గానీ..."

రంగపతి ముఖం వెలవెలపోయింది. కానీ టికెట్టులేని యిక్కట్టును అధిగమించగలిగే తన అసమాన కౌశలం గుర్తుకొచ్చిందేమో, మరుక్షణంలోనే తేరుకున్నాడు. కిటికీకడ్డంగా 'పాసేజి'లో ఠీవిగా నిలబడి, నింపాదిగా జేబులో చేయి వేశాడు. అయితే అతడు జేబులోనుంచి టిక్కెట్టు పైకి తీస్తాడనుకున్న వాళ్ళకు ఆశాభంగం మాత్రమే మిగిలింది. పైకొచ్చింది సిగరెట్టు పెట్టె మాత్రమే!

"ఏది సార్? ఎక్కడ మీ టిక్కెట్టు!" అంటూ టి.టి.ఇ దగ్గరికొచ్చేశాడు.

"హిహ్హిహ్హి! రైల్వే వాళ్ళంగదండీ!" నవ్వలేక నవ్వేశాడు రంగపతి. "గుంతకల్లు డివిజన్‌లో రిలీవింగ్ స్టేషను మాష్టరులేడూ, చిదంబరం ఆయన మా అన్నగారే!"

"నేనడిగింది బంధుత్వాలను గురించి కాదండీ! మీ టికెట్టును గురించి..." టి.టి.ఇ విదిలించి పారేశాడు.

"చూడండి సార్! యూనియన్ సెక్రెటరీ సుబ్బరాజు తెలుసా మీకు? ఆయన స్వయంగా నా బావమరిది. ఇంకా కావలిస్తే వాకబుచేసి..." అంటూ గింజుకోసాగాడు రంగపతి.

"అయ్యా, నాక్కావలసింది టిక్కెట్టు. అది చూపిస్తే మంచిది. అలాకాదా, పెనాల్టీ కట్టాలి. అదొక పద్ధతి. లేదా కదిరిలో పోలీసులకు హాండోవర్ చేస్తాను. అది మూడో పద్ధతి..."

రంగపతి ముఖం చిన్నబోయింది. సూదుల్లా తొలిచేస్తున్న తోటి ప్రయాణికుల వాడి చూపులకు తట్టుకోలేక అతడు పెడముఖం పెట్టుకున్నాడు. అల్లాగే రెండడుగులు వెనక్కువేసి టాయ్‌లెట్ వైపుకు జారుకున్నాడు.

"పెద్దమనిషి వేషం వేస్తే సరిపోయిందా? చేష్టలు గూడా అందుకు తగ్గట్టుగానే వుండాలి. ఈయనగారు నా చేతికి దొరికిపోవడం ఇదే మొదటిసారి కాదండోయ్! రెండు నెలల క్రితం ఇట్లాగే తగులుకున్నట్టు తగులుకుని ఎలాగో ఉడాయించేశాడు. ఈసారి అలా జరగదులెండి! నా జాగ్రత్తలో నేనుంటాను..." ఇంచుమించు స్వగతంలా చెప్పుకుంటూ, రైల్వే ఉద్యోగి రంగపతిపైన్నే నిఘా పెట్టేశాడు.

రిలీవింగు స్టేషను మాష్టరు చిదంబరంగానీ, యూనియన్ సెక్రటరీ సుబ్బరాజుగానీ రంగపతికి దూరపు బంధువులవునో కాదో నాకు తెలియదు. కానీ నాకు మాత్రం అతడితో కాస్తా దూరపు బంధుత్వం వుంది. వాళ్ళది మా పొరుగూరు మల్లవరమే! నిజానికి వాళ్లదేమంత కలిగిన కుటుంబం గాదు.

తండ్రి పంచాయతీ బోర్డు ఆఫీసులో గుమాస్తాగా పనిచేస్తుండేవాడు. కొడుకును తనకన్నా ప్రయోజకుడుగా చేయాలని ఆ తండ్రి శతవిధాలా ప్రయత్నించాడు. రంగపతి కాలేజి మెట్లయితే ఎక్కాడుగానీ, డిగ్రీ మాత్రం పుచ్చుకోలేదు. వాక్చాతుర్యంపైన నమ్మకం ఎక్కువేమో మరి, అతడు మాటలతోనే ప్రపంచాన్ని గుప్పిట్లో పెట్టుకోవచ్చునని భావిస్తూ వుంటాడు. ఒళ్లువంచి పనిచేయడమంటే మహా చిరాకు. పనికొచ్చే ఏ పనికైనా అతడు విముఖుడే!

బరువు మోయకుండా, బాధ్యత లేకుండా సుఖ జీవితం గడపాలనుకునేవాడికి పెళ్ళి చేయాలనుకోడం పెద్ద తప్పు. రంగపతి తల్లిదండ్రులు ఆ తప్పిదానికి పాల్పడ్డారు. గుడ్డిలో మెల్లగా ఎంతో కుదురైన అమ్మాయి ఆ ఇంటికి కోడలుగా వచ్చింది. ఎలిమెంటరీ స్కూల్లో టీచరుగా పనిచేస్తూ ఆమె నాలుగు రాళ్లు సంపాదిస్తుంది. అదిలించి, బెదిరించి ఆమె సంపాదనలో ఒక నికరవాటా చేజిక్కించుకుని రంగపతి ఇలా ఊళ్ళపైనబడి తిరుగుతుంటాడు.

బండి కదిరి స్టేషన్లో ఆగగానే చిన్న ఊరేగింపు ఒకటి ప్లాట్‌ఫారం పైన బయల్దేరింది.

మాసిన, చిరిగిన, మాసికలు పడిన దుస్తులతో, రేగి, చుండ్రుబట్టి, దుబ్బులా తయారైన జుత్తుతో, వాడి, వసివారిపోయి, చీకట్లే పారాడుతున్న ముఖాలతో దాదాపొక పాతికమంది శాల్తీలు ఆ మెరవణిలో పాల్గొంటున్నారు. వయసునుబట్టి చూస్తే నూనూగు మీసాల వాళ్లదగ్గరినుంచి, కోరమీసాల నలభై యేళ్లవాళ్ళదాకా ఆ గుంపులో వున్నారు.

దొంగల ముఠాకు 'బాస్'లా, టికెట్‌లెస్ ప్రయాణికుల సంఘానికి గౌరవాధ్యక్షుడిలా – కాస్తా విభిన్నమైన వ్యక్తిగా రంగపతి ఆ జట్టుతో నడుస్తున్నాడు.

***

పై సంఘటన జరిగిన కొత్తలో, ఏదో పెళ్లికి హాజరుకావడంకోసం నేను మల్లవరం వెళ్లవలసి వచ్చింది. పందిరిలో ప్రక్కన్నే కూచుని వున్న ఆ ఊరి పెద్దమనిషి ఒకాయనతో మాట్లాడుతూ వుండి, మాటల సందర్భంలో "ఏమండీ! రంగపతి సంసారం ఎలా వుంది?" అని వాకబు చేశాను.

"ఏముందీ? ఈనాటికీ, రేపటికీ, మరెప్పటికైనా అది డిటోనేకదా! సంపాదించకుండా డబ్బు, పనిచేయకుండా తిండి, పడుకున్నచోటల్లా నిద్ర – ఇదంతా ఎవరికి కలిగే అదృష్టం! అలాంటి అదృష్టవంతుడు గదయ్యా రంగపతి! ఇక అతడి సంసారమంటావా? పరవాలేదు. భర్తనీడ పడకపోతే, జగదాంబ కాపురాన్ని దివ్యంగా లాక్కుపోగలుగుతుంది.

అటు బడిలో డ్యూటీ నిర్వహించడంలోగానీ, ఇటు సంసారాన్ని చక్కబెట్టుకోవడంలో గానీ ఆమెను వేలెత్తిచూపించగలమా? సాధ్యం కాదు. పిల్లల్ని పెంచే తీరు మాత్రం?

ఇంటిపనుల్లో సాయపడ్డం దగ్గరినుంచీ, బుద్ధిగా చదువుకునేదాకా ఆ కూతురూ, కొడుకూ ఆణిముత్యాలేగదయ్యా! పుణ్యంకొద్దీ పురుషుడు, పూజకొద్దీ బిడ్డలు - అంటారుగదా! గత జన్మలో జగదాంబ అట్టే పుణ్యం చేసినట్టు లేదు. పూజలు మాత్రం గొప్పవే చేసి వుంటుంది."

పుణ్యాలను గురించి, పూజలను గురించి నాకేమీ తెలియదు. అయితే జగదాంబ ఆలోచనల పంథాకూడా ఏమిటో నాకు తెలిసొచ్చింది. తనబిడ్డలు పెరిగి పెద్దవాళ్ళయ్యాక, వాళ్ళ తండ్రిలా కాకపోయినా, నిజంగా అవసరాలు ఏర్పడినప్పుడైనా రైలు ప్రయాణం చేయవలసి వుంటుంది గదా! అప్పుడిక టిక్కెట్టు కొనుక్కునిగానీ రైలెక్కగూడదన్న స్థితికి, నియమానికి వాళ్ళు కట్టుబడి వుండాలన్నది ఆమె గుండె లోలోతుల్లోని కోరికై వుంటుంది.

❖ స్వాతి - 14 ఆగష్టు, 1998. ❖

# కర్ణామృతం

ఏమండీ, కర్ణామృతమన్న మాట అందరూ విన్నదేకదా! ఏమిటది? వేణునాదమా? వీణాగానమా? కలకంఠి కూజితమా? కాదు. వీటికి మించింది మరొకటి వుంది. అదేమిటో? తొందరపడకండి సార్! మనవి చేస్తున్నా.

'ఉడుముకేలరా ఊళ్ళో పెత్తనం అంటారు. నిజమే! ఊళ్ళోకి వచ్చేస్తే... ఎక్కడ దాక్కోవాలి? ఏం తినాలి? ఏ విధంగా బయటపడాలి? ఇలా అన్నీ చిక్కులే దానికి! చిన్నాజీ పరిస్థితికూడా ఇంచుమించు అలాగే అయిపోయింది. అతడు పుట్టి పెరిగింది... అడవిలో పల్లె. మనిషిన్నీ అడివిపువ్వులాంటివాడే! అయిదు మైళ్ళ దూరంలోని పేటకొండలో వున్న... చిన్న హైస్కూల్లో చేరడంతో ఆ అడవిపువ్వు గాలికి కొట్టుకొచ్చి నాగరికతా ప్రభంజనంలో పడిపోయినట్టయిపోయింది.

పులిమీద పుట్రలా... ముగ్గురు కూతుళ్ళున్న మేనమామ ఒకతను... కనీసం ఒక్క కూతురినైనా చౌకబేరంతో సాగనంపాలనుకోడం... చిన్నాజీ పాలిటికి పెద్ద కుట్రైపోయింది. ఆ మేనమామ అతణ్ణి తీసుకెళ్ళి ఇంటరులో చేర్పించాడు. అందులో గట్టెక్కగానే "చాల్లేరా అబ్బాయ్! ఎక్కువగా చదివితే అజీర్ణమే గదా! వుండు, నిన్ను నేను ప్రయోజకుణ్ణిగా చేస్తానం"టూ బెంగుళూరు తీసుకెళ్ళి ఫ్రూట్ టెక్నాలజీలో డిప్లొమా చేయించాడు. ఆ కోర్సు పూర్తికాగానే మేనమామ కూతురికన్నా ముందుగా ఉద్యోగమే అతణ్ణి వలచివచ్చింది.

ఫలవృక్షాల కేంద్రం కోడూరులో "పినాకినీ ఫ్రూట్ క్యానింగ్ ఇండస్ట్రీస్"లో టెక్నీషియన్‌గా చేరిపోయాడు.

జూన్‌తో అయిదు సంవత్సరాల కోర్సు పూర్తయింది.

ఎం.డిగారి దగ్గరనుంచి కబురొచ్చిందంటే... "ఏమైందో ఏంపాడో! ఏం గతిరా దేవుడా" అనుకుంటూ బెంబేలు పడిపోయాడు. తీరా వెళ్ళి కలిశాక భయపడాల్సిన విషయమేమీ కాదని తెలిసింది. "చూడవయ్యా చిన్నాజీ! నువ్వు నాకు నచ్చావు. మన ఇండస్ట్రీకి ఒక అమూల్యాభరణంగా కుదిరిపోయావు. నీకు మంచి భవిష్యత్తు వుంటుందని నా నమ్మకం. ఫ్రూట్ టెక్నాలజీలో కొత్త కొత్త పద్ధతులు కనిపెట్టడంలో ఆరితేరిపోయిన దేశం ఒకటుంది. మూడు నెలల 'రిఫ్రెష్‌మెంట్' కోర్సు నిమిత్తం నిన్నక్కడికి పంపిస్తున్నాము. ఇండియానుంచి వెళ్తున్న అయిదుగురు డెలిగేట్స్‌లో నువ్వొకడివి" అన్నారు ఎం.డి.గారు. చిన్నాజీ ఆనంద సంభ్రమాశ్చర్యాలతో ఉక్కిరిబిక్కిరైపోయాడు. 'అడివిలో పల్లె' ఎక్కడ? ఆస్ట్రేలియా ఎక్కడ? చిన్నాజీకి విదేశీ ప్రయాణం అలా ఒనగూడింది.

కొత్త దేశం ఎలా వుంది? తిండి తిప్పలేమిటి? ఎదురైన పరిస్థితులేమిటి? స్వదేశానికి వెళ్ళాక... ఎవరైనా అడిగితే చెప్పాలిగదా! విశేష సంఘటనలను గురించి విలక్షణ సన్నివేశాలను గురించి రాసి పెట్టదలచుకున్నాడు చిన్నాజీ. వెళ్ళినరోజు రాత్రి పడుకోడానికి ముందుగా ఆ పనికి శ్రీకారం చుట్టాడు.

ఆగస్టు 7 : మదరాసు నుంచి బయల్దేరి... మలేషియా... క్వీన్‌లాండ్‌ను చుట్టుకుని... మా విమానం సిడ్నీలో నేలను తాకేసరికి... భళ్ళున తెల్లవారింది. రాత్రంతా సరిగ్గా నిద్రలేదనే చెప్పాలి. మూడు సీట్ల వరుసలో... నా పక్కన ఆంగ్ల దంపతులెవరో కూర్చున్నారు. వాళ్ళు మాట్లాడుతుంటే పచ్చి కొబ్బరాకుతో పీకలు తయారుచేసి 'పీ, పీ' అంటూ ఊదినట్టే వుంది. వెనుకవైపు సీట్లను మలేషియా ముస్లింలు ఆక్రమించారు. వాళ్ళ పలుకుబడిలో అనునాసికాల రొద చెప్పతరం గాదు. ముక్కు మూసిపెడితే, నాలుకపైనుంచి ఒక్క పదమైనా ఊడిపడేటట్టు తోచదు. ముందు వరుసలో కూచున్న ఫిలిప్పైన్స్ బౌద్ధులు, ఎన్నో కొన్ని శతాబ్దాల కిందట జనవ్యవహారం నుంచీ మాయమైపోయిన ఓ పాత భాషను, పునరుద్ధరణ చేయడం కోసం... సాధన చేస్తున్నట్టున్నారు. వివిధ లోహాల పాత్రల్లో గులకరాళ్ళు వేసి గిలకరించినట్టుందని చెప్పుకోవచ్చు. అంతేగానీ వాళ్ళు మాట్లాడుకుంటున్నారని చెప్పుకోవడానికి మనసొప్పడంలేదు. ఎట్లాగో అర్ధరాత్రి తరువాతెప్పుడో మగత నిద్రపట్టింది. సిడ్నీలో దిగేసరికి కింద భూమి, పైన ఆకాశం, చుట్టూరా దిక్కులు తప్పితే పరిచితమైనవేవీ కనిపించలేదు. ఏరోడ్రోమ్‌లో నుంచి బయటపడటంకోసం దూసుకెళ్తున్న జనసందోహంలో కానవచ్చిన జీవనోత్సాహమే నన్ను ముందుకు నెట్టుకుంటూ వెళ్ళింది. ఎగ్జిట్ ద్వారానికింక పది బారల దూరం వుందనగా ఒక బ్యానర్‌పైన "ముర్రేఫ్రూట్ క్యానింగ్ అండ్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్, గ్రీన్ వ్యాలీ డౌన్స్" అన్న పేరు కనిపించేదాకా మనసులో దిగులు దిగులుగానే వుండిపోయింది. బ్యానర్ దగ్గర నుంచి ఈవలికి వచ్చిన వ్యక్తులిద్దరు "ఆర్ యూ ఎన్ ఇండియన్? యువర్ నేమ్ ప్లీజ్?" అని పలకరించారు. ఏం చెప్పాలో తటాలున తోచక "యస్ యస్ ఐయామ్ చిన్నాజీ!" అన్నాను. 'ఇంతటితో నీ పని క్లోజ్ ఇక మా పని ప్రారంభం' అన్నట్టుగా వాళ్ళు చెరొక వైపునుంచీ పట్టుకుని, నన్ను తీసుకెళ్ళి వ్యానులో పడేశారు. ఇంకా నగరం సరిగ్గా మేలుకోలేదు. భవనాలు, సౌధాలు, ప్రాసాదాలు అని చెప్పుకోదగ్గ జనావాసాల మధ్యనుంచి విశాలమైన రోడ్లగుండా వాహనం పరుగిడుతోంది. శివార్లు దాటేటప్పటికి రెండు గంటలు పట్టింది. ఆ పైన దిక్కుల చివర్ల ద్వారా వ్యాపించిన గోధుమ పొలాల గుండా మూడు గంటల ప్రయాణం. అక్కడినుంచి ఘాటురోడ్డు మొదలు. ఎక్కి దిగేటప్పటికి కొత్త లోకాలలోకి ప్రవేశిస్తున్నట్లు పచ్చగా ఒక లోయ కానవచ్చింది. బహుశా 'గ్రీన్ వ్యాలీ' అంటే ఇదేనేమో! దృశ్యాలు కనుల నిండుగా వున్న మాట నిజమేగానీ, నన్ను రిసీవు చేసుకున్న యువకులు 'బీర్ క్యాన్' ఒకటి తెరచి పట్టుకుని, ఆన్‌చేసిన టేపు రికార్డరులో – కాళ్ళకు గజ్జలు కట్టుకొన్న అస్థిపంజరాలు కొన్ని సల్పుతున్నట్టున్న వికట నాట్యానికి అనుగుణ్యంగా... భూతాలు పాడుతున్నాయి. ఉండివుండి ఉన్మాదులెవరో ముక్తాయింపులు గుప్పిస్తున్నారు. నాయనా, చెవిలో శూలాలు దిగేయడమంటే ఇదేనేమో! శిక్షణాలయం చేరుకునేసరికి గంట పన్నెండు దాటింది. స్నానంచేసి దుస్తులు మార్చుకుని డైనింగ్ హాల్లోకి వెళ్ళాను. ప్రపంచమంతటి నుంచీ వచ్చిన అరవైమంది డెలిగేట్లు మాటల్ని తూటాల్లా విసురుతూ, తినుబండారాల్ని ఉండ్రాళ్ళకు మల్లే నోట్లోకి గిరాటు కొడుతున్నారు. భారతదేశపు డెలిగేట్లు నలుగురూ భోజనం కాగానే డైనింగ్ హాల్లోనే నన్ను సంధించేశారు.

వరండాలోకి తీసుకెళ్ళి పరామర్శించడానికి ప్రయత్నించారు. వాళ్ళల్లో శ్రావణ్ ముఖర్జీ, బలభద్రపాత్రోలకు బెంగాలీ, ఒరియాల్లో తప్పితే ఇంగ్లీషులో నాలాగే అంతంత మాత్రం పరిజ్ఞానం మాత్రం వున్నట్టు గ్రహించాను. మిగిలిన ఇద్దరూ ఉత్తరప్రదేశ్ నుంచీ వచ్చారు. వీళ్ళకు హిందీ కొట్టిన పిండి.

"ఆప్ కా శుభ్‌నామ్? ఆప్ కహాసే అయే హై? కహా నౌకరీ కర్‌తే హై? ఆప్ కీ తరఫ్ క్యాక్యాఫల్ మిల్‌తేహై?" అంటూ ప్రశ్నలు రువ్వి చూశారు. చివరకు ఆశాభంగానికి గురైపోయి... పొసగని భార్యకు విడాకులిచ్చేసిన భర్తలకు మల్లే వాళ్ళ గదుల్లోకి వాళ్ళు వెళ్ళిపోయారు. ఒక్కొక్కరికి ఒక గది కేటాయించడం నా పాలిట పెద్ద వరమైపోయింది. చివరగా ఓ మాట చెప్పాలి. ఈరోజు జీవితంలో చూచి ఎరుగని ప్రదేశాలు చూచాను. పరమ రమణీయమైన ప్రకృతి విలాసాలను దర్శించాను. నిజానికెంతో ఆనందంగా వుండాల్సింది. కాని ఎందుకో, ఏమిటో ఉత్సాహంగా లేదు. ఏదో పోగొట్టుకున్నట్టుంది. ఏమిటది? ఏమైవుంటుంది?

ఆగస్టు 29 : పోయిన వారాంతంలో మమ్మల్ని తోటలకు ప్రసిద్ధి చెందిన ముర్రే పరివాహక ప్రాంతాలకు తీసుకెళ్ళారు. ఆఫ్రికా పీచ్, పియర్, యాపిల్, ద్రాక్ష... ఇంకా ఎన్నో రకాలు... గుత్తులు గుత్తులుగా వ్రేలాడుతుంటే... ఎంత ముద్దొస్తున్నాయో! తోటల మధ్య ఓ హోటల్లో వెన్నతో మిళాయించిన ఫ్రూట్ సలాడ్ పెట్టించారు. 'శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ' అన్నారు పోతన్నగారు. నన్నడిగితే ఆ ఫ్రూట్ సలాడ్‌ను రుచి చూచిన జిహ్వే జిహ్వంటాను. ఎడారులు భగవంతుడి ఆగ్రహానికి గురయితే, పండ్ల తోటలు ఆయన అనుగ్రహానికి గుర్తు అనుకున్నాను. బాగానే వుంది. కానీ మనసులో ఏదో వెలితిగానే వుందే! చేజారిపోయిందేదో దొరికి నట్టేలేదే! ఏమిటది? ఏమైవుంటుంది.

సెప్టెంబర్ 15 : ముర్రే నదికి ఉపనది 'రాడ్లింగ్'. దానిపైన అపురూప దృశ్యమేదో కానవస్తుందన్నారు. రెండువందల కిలోమీటర్ల బస్సు ప్రయాణం. ఎత్తయిన కొండపేటు నుంచి దూకే జలపాతం, 'సిల్వర్ ఫాల్స్' అంటారట! ఫాల్స్ మాటకేంగాని దానికొక ఫర్లాంగ్ దూరంలో నదికడ్డంగా ఒక వంతెన నిర్మించారు. ఆ వంతెనపైన నిల్చుంటే ఎదురుగా జలపాతం. పైన ఆకాశం, క్రింద ప్రవాహం, చుట్టూరా నిమ్నోన్నతాలకు ఆచ్ఛాదనగా పచ్చని ప్రకృతి. ఆ మనోహర దృశ్యాన్ని ఎంతసేపు చూసినా తనివితీరదు. కళ్ళు తరించినట్టయింది. తిరిగి వచ్చాక కూచున్నా, పడుకున్నా, కళ్ళు మూసినా, తెరిచినా ఆ దృశ్యమే మనో నేత్రాల్లో తాండవిస్తోంది. అయినా మళ్ళీ ఏదో గుబులు. స్వదేశంలో వుండగా అనుభవానికి వచ్చింది గాదు. ఎందుకీ విషాదం? ఎందుకిలా మనసును తొలిచేస్తోంది? ఆలోచించాను, ఆలోచించాను.

స్ఫురించదే! ఏమిటది? ఏమై వుంటుందది?

అక్టోబర్ 22 : ఈరోజు ఆదివారం. రాత్రివేళ. పది గంటలయింది. నా ఆస్ట్రేలియా మకాంలో యిది మరపురాని రోజనుకోవాలి. దాదాపుగా ఖండానికంతా కేంద్ర స్థానంగా వున్న ఓ టూరింగ్ స్పాట్‌కు మమ్మల్ని విమానంపైన తీసుకెళ్ళారు. స్వదేశానికి వెళ్ళదానికున్న వ్యవధి కొద్దిరోజులే గదా! మేమందరమూ షాపింగ్ సెంటర్లోకి జొరబడ్డాము. మధ్యాహ్న

భోజనానంతరం ఓ మ్యూజియం దర్శించాము. ఓ 'జూ' అంతటా కలయతిరిగాము. గంట నాలుగయింది. అయిదింటికల్లా తిరుగు ప్రయాణంకోసం విమానాశ్రయంలో వుండాలి. మృగశాలనుంచీ ఈవలికొచ్చేసరికి ఓ గుట్టపైన తెల్లటి కట్టడం ఒకటి కనిపించింది. గోపురం, మండపం, ధ్వజస్తంభం, ఏమిటది? గుడికాదు కదా! మా యింగితాన్ని గ్రహించినట్టుగా "ఎస్, దటీజ్ ఏ టెంపుల్! యు మే గో అండ్ సీ యిట్! బట్ యూ షుడ్ రిటర్న్ ఇన్ 15 మినిట్స్" అన్నాడు గైడు. వంద మెట్లున్నాయేమో, గబగబా ఎక్కిపోతున్నాను. స్వదేశీ నేస్తాలు నలుగురితోపాటు మరికొందరు విదేశీ డెలిగేట్లు కూడా నావెంట వస్తున్నారు. పంచ పైన బనీను తొడుక్కొని భుజాలపైన్నుంచీ అంగవస్త్రం వేసుకున్న ఓ కుర్రస్వామి మంత్రాలు చదువుకుంటూ మండపంలో కానవచ్చాడు. గర్భగుడిలో నుంచీ పుష్పమాలాంకృతుడైన 'బాలాజీ' దర్శనమిచ్చారు. ఒళ్ళు మైమరచిపోయి 'మీరు తెలుగువాళ్ళా స్వామీ?' అన్నాను. "మీరు ఆంధ్రానుంచీ వస్తిరా? మాది తిరుపతి, మీవూరు?" అన్నాడు కుర్రస్వామి.

"పాకాల, దామల్ చెరువు, వల్లివేడు... ఆ పేర్లు విన్నారా? ఆ ప్రాంతంలోనే మావూరు, 'అడవిలో పల్లె'. చాలా దూర దేశం వచ్చేసినట్టనుకున్నా! ఇక్కడ ఈ గుడి, ఈ దేవుడి కైంకర్యంలో మీరు – ఇదంతా చూశాక మా అడవిలో పల్లెకు, ఆస్ట్రేలియాకు అట్టే దూరం లేదనిపించింది.

తిరుపతిలో మీ ఇల్లెక్కడ స్వామీ?"

"దిగువ తిరుపతిలో... గోవిందరాజస్వామి గుడిదగ్గర... దక్షిణ మాడవీధి తెలుసునా? అక్కడ్నే మా ఇల్లు. నా పేరు పి.బి.వరదాచారి"

"పి.బి. అంటే? ప్రతివాది భయంకర, కాదుగదా?"

"అదే మా యింటి పేరు. మీకెలా తెలుసు?"

దేవుణ్ణి దర్శించుకొని వెళ్ళి మెట్లపైన కూచున్న తోటి శిక్షణార్థులు "ప్లీజ్, చిన్నాజీ! టైమ్ ఈజ్ ఓవర్! హరీఅప్" అని గొడవ చేస్తున్నాడు.

నేను పట్టించుకోలేదు. "నాకెలా తెలుసునంటారా స్వామీ! ఇంటరులో మా తెలుగు లెక్చరర్ ప్రతివాది భయంకర భావనాచారిగారు, పి.బి.బి అనేవాళ్ళు. మేం మాత్రం, 'పిల్లల్ని భయపెట్టే భల్లూకం' అనుకునే వాళ్ళం. పాపం శమించుగాక! చెంపలేసుకుంటున్నాను. నాకు తెలుగులో నాలుగు ముక్కలొచ్చాయంటే అదంతా ఆ మహానుభావుడు పెట్టిన భిక్ష." "చిన్నాజీ! వుయ్ డోంట్ బాదర్ అబవుట్ యూ! గోయింగ్ అవే ఫ్రమ్ దిస్ ప్లేస్! యు మే స్టే హియర్..." అల్టిమేటం జారీచేసి మిత్రులు కొండ దిగిపోతున్నారు.

"ఆ ప్రతివాది భయంకర భావనాచారిగారు మా పెదనాన్నగారే! నేనాయన తమ్ముడి కుమారుణ్ణి".

"అట్లాగా స్వామీ! మా భావనాచారి మేష్టరుగారు బాగున్నారా? ఎక్కడున్నారు? ఏం చేస్తున్నారు? వారి తమ్ముడి కుమారుడైన మిమ్మల్ని, ఈ దేశంలో చూడగలగడం – ఎంత అదృష్టం?"

"చిన్నాజీ! ఇట్‌ఈజ్ ఆల్‌రెడీ లేట్! యూ ఆర్ వార్న్‌డ్ టు కమ్‌హియర్ ఎట్‌వన్స్"
మెగా ఫోనులోంచీ గైడు గొంతు చించుకుంటున్నాడు.

"స్వామీ! ఓ మంగళహారతి యిప్పించరూ?"

"అంతకంటేనా. యిదిగో... మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాత్మనే, చక్రవర్తి తనూజాయా, సార్వభౌమాయ మంగళం. పుంస్యాం మోహనరూపాయ, మేఘశ్యామల మూర్తయే."

"సెలవుస్వామీ! నమస్కారం, వెళ్ళొస్తా! జ్ఞాపకముంచుకుంటారు గదూ! నా పేరు చిన్నాజీ. ఊరు అడవిలోపల్లె. తిరుపతి దగ్గరే..."

తిరిగొచ్చాక గదిలో కూచుని రాస్తున్నాను. గంట పదయింది. మంగళాకారుడైన స్వామి మంగళహారతి వెలుగుల్లో కనిపిస్తూనే వున్నాడు. మెట్లు దిగుతుండగా గుడిలో గంట మ్రోగడం వినిపిస్తూనే వుంది. శరత్కాలపు పండు వెన్నెలలు పరవళ్ళు దొక్కినట్టుగా నా మనసంతటా ఆనందమే విరిసిపోయింది. ఎందుకో చెప్పనా? చాలారోజుల తర్వాత నేను... మధురంగా, మార్దవంగా, మంజులంగా, మోహనంగా నా తల్లి పలుకు విన్నాను...

మీరూ విన్నారు గదండీ! వేణునాదానికి, వీణా గానానికి కలకంఠి కూజితానికి మించి వీనుల విందైనదేమిటో తెలిసిపోయింది గదా! నమస్కారం!!

❖ ఆంధ్రజ్యోతి దినపత్రిక ఆదివారం అనుబంధం - 11 ఏప్రిల్, 1999. ❖

# కూతురు కాపురం

రైలాగింది. ద్వారం దగ్గర పోరాట పటిమకు సంబంధించి బల ప్రదర్శనం జరుగుతోంది. ఎక్కేవాళ్లకు, దిగేవాళ్లకు మధ్య జరుగుతున్న పోరాటం, టికెట్‌తో అవసరంలేని వినోదం కదా! చూస్తూ నిల్చుండిపోయానేమో, "ఏమండీ! లోపలికొచ్చే ఉద్దేశం లేదా? అక్కడే ఉండిపోతారా?" అంటూ అశరీరవాణిలా మాటలు వినిపించాయి. ఉలిక్కిపడి ఎట్లాగో లోపలికి దూసుకపోయి, అటువైపు ద్వారం దగ్గర మలుపుతిరిగి, అరలు సర్వే చేసుకుంటూ ముందుకెళ్తున్నాను. మూడో అరలో కిటికీ పక్కనే సీటు దొరక పుచ్చుకుని నాకు కూడా కొంచెం తావు రిజర్వు చేసుకుని "రండి రండి! ఇటు, యిటు..." అంటూ రాజేశ్వరి బరాబరులు పలుకుతోంది. ఎవరో కాదులెండి! మా ఆవిడే! అప్పటికే ఎదుటి సీట్లోని పెద్ద ముత్తయిదువతో మాటలు కలిపినట్టుంది... "చూచారా! బామ్మగారూ! ఇదీ వరస. నేను పిలవకపోయాననుకోండి! ఇకనంతే సంగతులు! కాక్ ఆఫ్ ప్లాట్‌ఫారమేననుకోండి..." తన దుస్థితిని నివేదించింది.

"ఎందుకులే తల్లీ! నేనడిగొచ్చిందిగూడా అంతే! మహానుభావుడు. ఉలకడు. పలకడు. పదును వానకైనా పదరడు. ఎండ, చలి, గాలి – దేన్నీ లెక్కపెట్టడు. యోగిసత్తము డనుకోవలసిందే? లంకంత సంసారాన్ని నేను కాబట్టి ఎట్లానో నెట్టుకొస్తున్నాను..." – ముక్తాయింపుతో ముసలావిడ శ్రుతి కలిపింది.

"అన్నట్టు మీరు మాతోబాటు స్టేషనులో రైలెక్కినట్టు లేదే! ఎక్కడినుంచి వస్తున్నారు బామ్మగారూ?" – వాకబు చేసింది రాజేశ్వరి.

"పెనుగొండ – అని పేరు విన్నావా? ఆ వూరమ్మా మాది. మా ఇంటాయనగూడా అంతో యింతో పేరున్నవాడే! ఈ కాలం భర్తపేరు చెప్పగూడదనేం లేదు గదా! నేనూ కొంచెం మీరిపోయాననుకో! సంగ్రహంగా జి.యస్.రావుగారంటారు. గిరినాథరావు గారన్నమాట! మా వారని చెప్పుకోడం కాదుగానీ కొండంత గుండెమ్మా ఆయనది. 'దయ' అనేది ఆయన ఇంటిపేరు. 'దాక్షిణ్యం' అన్నది వాళ్ల గోత్రం పేరు. ఎవరెవరు ఏది కావాలని వచ్చినా, తన దగ్గరున్నట్టయితే మారు మాట లేకుండా ఇచ్చేస్తారు. 'ఇలాగైతే ఎలాగండీ?' అంటే, 'చెలమలో తీసిన కొద్దీ నీళ్లూరుతాయిలేవే పిచ్చిదానా!" అంటారు. వెఱ్ఱిమారాజు, ఎన్ని జన్మల బంధమో, నాపాలబడ్డారు. గీచిన గీటు దాటడు గదా! 'అబ్బో, ఎంత అదృష్టమో' అనుకుంటారమ్మా లోకులు నన్ను గురించి..."

"మరి మీరు మిమ్మల్ని గురించి ఏమనుకుంటారు బామ్మగారూ?" – ఇంటర్వ్యూకు కూర్చున్న పత్రికా విలేఖరిలా అడిగింది రాజేశ్వరి.

"వద్దులేమ్మా! ఆత్మస్తుతి తప్పు కదూ?".

పెద్దామెగూడా వీలయినంత గడసరితనంతో రాజేశ్వరి విసిరిన ఉచ్చులోనుంచి తప్పించుకుంది.

'ఎవరోగానీ ఈమె సామాన్యురాలుగాదు. తనలాంటి లేతబుర్రల్ని ఎన్నింటిని చూచిందో! ఈవిడతో వీలైనంత సత్యసరళంగా మాట్లాడా'లని అనుకున్నట్టుంది రాజేశ్వరి "మీరు చెప్పకపోతే మాత్రం ఆ మాత్రం తెలుసుకోలేకపోతామంటారా బామ్మగారూ?

ముంజేతి కంకణానికి అద్దం కావాలా? పచ్చి పసుపుకొమ్ము దంచి ఆ పిండితో చేసిన బొమ్మలా ఉండిపోతిరి. తూరుపు ఆకాశంలో పొడుచుకొచ్చే సూర్యబింబంలాంటి బొట్టు. ఎర్రరాళ్ల కమ్మలపైన తెల్లరాళ్లు పొదిగిన మాటీలు, కెంపుతో మిలమిలలాడే ముక్కుపుడక, ఈ వయసులోనే ఇలా ఉన్నారంటే, ఇక మీ ప్రాయంలో మీరెంత బాగుండేవారో! మీ కడుపున ఓ ఆడబిడ్డ పుట్టివుంటే ఆ యమ్మా మరీ ఎంత బాగుండేదో..."

"ఉందమ్మా వుందీ..." గబాలున అందిపుచ్చుకుంది పెద్దావిడ – "నాటికీ నేటికీ అది తీర్చిదిద్దిన అందాల కొలువేగదమ్మా! బిడ్డకేం పేరు పెట్టాలో తోచలా, మా ఇంటికొచ్చి పోతూ వుండే సాధువుల్ని అడిగాము. ఒకాయన "కళ్లు పెద్దవిగా ఉన్నాయి గదా! విశాలాక్షి అనగూడదా?' అన్నాడు. ఇంకొకాయన 'అరరే, కనుపాపలు చేపపిల్లల్లా సంచలిస్తున్నాయి గదమ్మా, మీనాక్షీ అనరాదూ?' అన్నాడు. 'ఈ బంగారు తీగకు మరొకపేరు, మరొకపేరు ఎందుకు? హేమలత అంటే సరిపోలా?' అన్నాడు మరొకాయన. 'మీ యింట్లో 'లలిత' పుట్టిందమ్మా!' అంటూ ఒక యోగి పరవశించిపోయాడు. తండ్రికదంటే ప్రాణం. నాకూ గారాబమేగానీ, ఆడబిడ్డపైన మమకారం పెంచుకోవచ్చునా? ఏనాటికైనా ఓ అయ్య చేతికి పట్టిచ్చి, అత్తారింటికి సాగనంపాల్సినవాళ్లమే గదా? అక్కడేనమ్మా వచ్చింది చిక్కు. దానిది బొత్తిగా 'లవ్' వ్యవహారమైపోయింది..."

"లవ్వా? ఎవర్ని ప్రేమించిందండీ బామ్మగారూ?" – రాజేశ్వరి పాలిటికి కథ రసపట్టులోకి వచ్చేస్తున్నట్టే వుంది.

"ఎవరో, ఊరేమిటో, పేరేమిటో – తల్లెవరో, తండ్రెవరో – కులమేమిటో, గోత్రమేమిటో – డ్యాన్సు మాష్టరట. ఉదయం లేస్తే డ్యాన్సే. పొద్దుపోతే డ్యాన్సే. ముతక బట్టలు తప్పితే మరొకటి కట్టడు. ఏ తల్లి పిలిచి పెడితే అక్కడ తినేస్తాడు. రూపమైతే బాగానే ఉండేదనుకో, మనిషిగూడా గుంభనంగానే వుంటాడు. కానీ, చిల్లిగవ్వ ఆస్తిలేదు. ఏంజూసి వలచిందో ఈ పిల్ల! 'చేస్తే ఆయనకే చెయ్యండి. లేకుంటే ఇలాగే వుండిపోనివ్వండి!' అంటూ మంకుపట్టు పట్టేసింది. అపురూపంగా ఒక బిడ్డను కనిపెట్టుకున్నవాళ్ళం. తప్పలేదమ్మా మాకు. ఇచ్చేశాం. ఇక మనకేం హక్కుంటుంది? ఆయనగారు పెళ్లాన్ని మన రాళ్లసీమనుంచి, ఈ కోస్తావైపు తీసుకొచ్చేశాడు..."

"పోనీలేండి! ఏదో ఒక కళ చేతిలో వుందిగదా! బతకలేకపోరు. ఏమండీ, బామ్మగారూ! అమ్మాయికిప్పుడు కొరతేమీ లేదుగదా?"– పాపం, రాజేశ్వరికైనా సమాధానం చాలా పాజిటివ్‌గా రావాలనే వుంది.

ముసలావిడ కొనసాగించింది.

"మా యింటి మాణిక్యాన్ని చేబట్టాక ఆయనకంతా కలిసొచ్చిందిలే తల్లీ! మేడలొచ్చాయి. మండువాలొచ్చాయి. పాయసాలొచ్చాయి. ప్రాసాదాలొచ్చాయి. అలంకారాలొచ్చాయి. ఆడంబరాలొచ్చాయి. వచ్చిపోయే బలగం బలిసింది. ఎటొచ్చీ అప్పటికీ యిప్పటికీ అల్లుడుగారు మాత్రం భోళారాయుడే! పాదాలపైన పడేవాడికి, నెత్తిపైన చేయి పెట్టేవాడికి తేడా ఏమిటో తెలియదుగదా! ఎదుటికొచ్చినవాడెవడు? వాడి అంతస్తేమిటి? ఆంతర్యమేమిటి?– అని తెలుసు కోకుండా కోరిన గొంతెమ్మ కోరికలన్నీ

తీర్చడమేనా? అందువల్ల చిక్కులు రావూ? వచ్చాయమ్మా, వచ్చాయి. నారాయణమూర్తి గారని ఈయనకొక స్నేహితుడున్నాడులే! మహానుభావుడు. ఆయనవల్ల ఎన్నిసార్లు గడచి గట్టెక్కినాడో..."

"బామ్మగారూ! మనమళ్లను గురించి, మనవరాళ్లనిగురించి చెప్పకనేపోతిరే..." రాజేశ్వరి కొనసాగిస్తున్న ఇంటర్వ్యూ నిరాఘాటంగా సాగిపోతోంది.

"ఇద్దరు బిడ్డలూ మనవళ్లేనమ్మా!" కొనసాగిస్తోంది బామ్మగారు...

"అందులో పెద్దబ్బాయి వెయ్యిళ్ల వేలుపు. ఏ యింట్లో అడుగుపెడితే ఆ యింట్లో అన్నీ శుభాలే ఒనగూడుతాయని ఒక నమ్మకం ఏర్పడిపోయింది. అందరూ ఆహ్వానించడమే. అందరూ షడ్రసోపేతంగా విందులు పెట్టడమే. పేరుకేం తక్కువలేదు. కానీ పెళ్లయితే చేసుకోలేదు. ఆ లోటు పూరించడానికన్నట్టుగా చిన్నబ్బాయికి రెండు వివాహాలు, ముద్దులు మూటలు గట్టే కోడళ్లు. లోక వ్యవహారాలన్నీ భర్తవైతే, ఈ భార్యలు బచ్చాన బొమ్మల్లా తిరుగుతూ ఇంటి పనులు చక్కబెట్టుకుంటారు. అత్తకు కాసంతపని పెట్టరు. ఆమె కాలుపైన కాలు వేసుకుని కూచోవలసిందే..."

"చాలా సంతోషమండీ బామ్మగారూ! ఇప్పుడు అమ్మాయినీ బిడ్డల్ని చూచిరావడం కోసమని బయల్దేరినట్టున్నారు కదండీ!" అంది రాజేశ్వరి.

పెద్దావిడ ముఖంలో విచారతరంగం ఒకటి పారాడింది. "ఏం సంతోషమో ఏమో! ఈ మధ్య అమ్మాయి యింట్లో దొంగలు పడ్డారట. వాళ్లేమైనా చెప్పి పంపించారా? కర్ణాకర్ణిగా తెలిసింది. ఎంతపోయిందో, ఏమిటో? అమ్మాయి దిగులు పడిపోయిందేమోనని నా బెంగ. అందుకేనమ్మా వెళ్తున్నా..."

రైలు కృష్ణానది వంతెనపై తిరుగిడుతోంది. ప్రయాణీకులు పెట్టెలు, బుట్టలు సర్దుకుని దిగిపోవడానికి సిద్ధమౌతున్నారు. ఫ్లాట్‌ఫారం వచ్చేస్తుంటే నేను రాజేశ్వరి వెలుపలికి చూస్తున్నాము. నీటిలోనుంచి నీడ జారిపోయినట్టుగా ముసలావిడ ఎప్పుడు దిగిపోయిందో తెలియదు. కొంతసేపటికి ఫ్లాట్‌ఫారంపైన కిటికీలోనుంచే కనిపించింది. రాజేశ్వరి విస్మయపడిపోతూ "ఏమిటండీ బామ్మగారూ! చెప్పకుండానే దిగిపోయారే! ఇక్కడేనా మీ అమ్మాయి వుండడం?" అని ప్రశ్నించింది.

"ఇదేనమ్మా! అదిగో ఆ కొండపైన కనిపించడంలా; ఆ యిల్లే!"

ఆనందాశ్చర్యవిభ్రమాలతో రాజేశ్వరి తత్తళించిపోయింది. "అదేనా? ఆ యిల్లేనా? మీ అమ్మాయి పేరేమిటన్నారండీ బామ్మగారూ?"

"పేరు నేనెక్కడ చెప్పానమ్మా? అందరికీ తెలిసిందేలే, కనకదుర్గ..."

'కనకదుర్గ, కనకదుర్గ...'– రాజేశ్వరి పెదవులు సవ్వడిలేకుండా చలిస్తున్నాయి. జనసమూహంలో కనుమరుగైపోయిన బామ్మగారు మళ్లీ కనిపించనేలేదు.

❖ ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక – 19, ఏప్రిల్, 1999. ❖

# ధర్మయ్య కల

ఒక మరపురాని అనుభవం - పెండ్లిమర్రి వెళ్ళిరావడం.

మా ఆవిడకు తల్లి తరపు బంధువులుండడం ఆ ఊళ్లోనే. ప్రత్యేకించి పనేదీ లేకపోయినా మునుపు కేవలం చుట్టపుచూపుగానే ఆ ఊరికెళ్లొస్తూ ఉండేవాళ్లం.

బ్రతుకు బ్రతుకంతా ఫక్తులెక్కల వ్యవహారమైపోయిన తర్వాత అలాంటి రాకపోకలు తగ్గిపోయాయి.

అయితే ఈలోగా తీరని రుగ్మతగా మా ఆవిడకు కాలినొప్పి ఒకటి దాపురించడమేమిటి? ఎన్ని రాజవైద్యాలు చేయించినా అది లొంగిరాక పోవడమేమిటి? అప్పుడిక ఆవిడకు తన మేనమామ నాటువైద్యమే గత్యంతరంగా తోచడమేమిటి? ఆయా కారణాల వల్ల మేము ఉన్నట్టుండి పెండ్లిమర్రికి బయల్దేరవలసి వచ్చింది.

గన్నేరు చెట్టు గుబురులో పూలగుత్తిలా కొండకోనలమధ్య ఓ గుట్ట దాపున వున్న పెండ్లిమర్రి చాల అందమైన ఊరే.

కానీ అందాలు, సదుపాయాలు కలిసి సహజీవనం చేయాలని ఎక్కడుంది.

నీటి ఎద్దడికి ఆ ఊరు పెట్టింది పేరు. ఆడవాళ్లు అరమైలుదాకా నడిచివెళ్లి బావుల్లో దిగి నీటి కడవల్ని తలకెత్తుకుని, సర్కస్‌లో కమ్ములమీద నడిచినట్టు పొలంగట్ల వెంట వస్తుండేవాళ్లు. ఇప్పుడైతే గుట్ట మొదట ఓ బోరింగు బావి వేశారు. అక్కడ నీటి పంపు తెల్లవారు జామున నాలుగు గంటలనుంచి రాత్రి తొమ్మిదింటిదాకా దబడబమంటూ మోదుకుంటూ ఉంటుంది.

బస్సెక్కాలన్నా, ఇన్ని మిరియాలో జీలకర్రో కొనుక్కోవాలన్నా మూడు కిలోమీటర్ల దూరంలో వున్న పేటకొంపకు నడిచి వెళ్లాల్సిందే. వానాకాలాల్లో ఆ దారి వట్టి రొంపీ రొచ్చుగా తయారైపోతుంది. పొలాలకాధారం వాన నీరే. సకాలంలో వానలు పడితేనే పంట, లేకపోతే జనానికి కడుపుమంటే.

ఆ పరిసరాల్లో ఆ పల్లెటూళ్లో తాను, తన భార్య, చిన్న కొడుకు, కోడలు, వాళ్ల బిడ్డలిద్దరు, పాలిచ్చే రెండు జెర్సీ ఆవులు - ఈ మాత్రం బలగంతో మట్టి గోడల ప్రహరీ లోపల ధర్మయ్య కాపురం.

ఏండ్లుగా పూండ్లుగా పూరి కప్పు గుడిసెల్లోనే బ్రతుకుతూ వచ్చి, జీవిత చరమాంకంలో ఒక్కింత భద్రతకోసం అర్రులు చాస్తూ ఇటీవలే అతడొక బండ్ల మిద్దె వేయించుకున్నాడు. దానికి ద్వారబంధాలైతే వున్నాయి గానీ ఇంకా తలుపులు బిగించలేదు. చెరకు గానుగాడి నాలుగు రూకలు చేతికొస్తేగాని తలుపులు చేయించడం, కొత్త బట్టలు కొనడం, హైస్కూలుకు వెళ్తున్న అమ్మాయికొక ముక్కుపోగు కొనిపెట్టడం - ఇలాంటి పనులకు వెసులుబాటుండదు.

అయితే ఒకటి. దొంగలనేవాళ్లున్నూ కొందరుంటారు. వాళ్లకున్నూ కొన్ని ప్రలోభాలుంటాయి. అనవసరంగా వాళ్లలాంటి ప్రలోభాలకు గురిగాకుండా ఉండడంకోసం తండ్రీ కొడుకులిద్దరూ ద్వారాల కడ్డంగా నులకమంచాల్లో పడుకుంటున్నారట. అయినా

కరెంటులేని ఓ చీకటి రాత్రివేళ దొంగ లెలాగో సడీ చప్పుడూ గాకుండా మంచం దాటుకుని యింట్లో దూరారట. కొన్ని పాత గుడ్డలు దప్పితే వాళ్లకు మరేమీ దొరకలేదు. "వెర్రిముండాకొడుకులు కూలి పాటయినా దక్కలేదు, పాపం" అంటూ ధర్మయ్య నొచ్చుకున్నాడట.

మేము పేటలో బస్సు దిగాము. డొంకదారి వెంట నడిచాము. ఊరు దగ్గిరకొస్తోంది. చెరువుకట్టపైన నడుస్తుండగా మదురగోడకీవైపున రాతిబండపైన నిల్చున్న ధర్మయ్య మనమడు, మనుమరాలు "వస్తున్నారొస్తున్నారు. మన ఊరికెవరో చుట్టాలొస్తున్నారు" అంటూ ప్రకటించేశారు. వస్తున్నది తమ చుట్టాలేనని తెలుసుకున్నాక బుర్రుపిట్టల్లా ఎగిరి వచ్చి నా చేతిలోని సంచిని, మా ఆవిడ చేతిలోని ప్లాస్టిక్ బుట్టని లాక్కుని తుర్రుమంటూ పరుగందుకున్నారు. మేము తీరా యింటిముందుకెళ్లేసరికి "పెద్దమ్మ, పెదనాన్న వచ్చేశారోచ్" అంటూ యింట్లో వాళ్లనందరినీ బయటికి లాక్కొచ్చేశారు. ఆ పిల్లలు మమ్మల్ని అలాగే పిలుస్తారు మరి. వాళ్లమ్మ నన్ను "మామా" అంటుంది. మా ఆవిడను "అత్తా" అంటుంది. వాళ్ల నాన్న మమ్మల్ని అన్నా, వదినలుగా సంభావిస్తాడు. అసలు సంబంధం మా ఆవిడ ధర్మయ్యకు మేనకోడలుగావడం. దీన్నిబట్టి చూసుకోవాలి. అయినా ఈ పనికిమాలిన విచికిత్సలన్నీ ఎందుకు? మమ్మల్ని చూడగానే వాళ్లకు కలిగిన సంబరాన్నీ, మాకు ఆతిథ్య మర్యాదలు చేయడంలో వాళ్లు కనబరచిన ఆసక్తినీ చూస్తుంటే మేమక్కడికి వెళ్లడంలో పొరబాటు పనేమీ చేయలేదనిపించింది. ఆ యింటి యిల్లాలు తెచ్చి యిచ్చిన చిక్కటి మజ్జిగను తాగుతుంటే జీవితంలో కోల్పోయిన కమ్మదనాన్ని ఆస్వాదిస్తున్నట్టే తోచింది.

మేనకోడలు కాలినొప్పికి చికిత్స చేయించుకోడం కోసం వచ్చిందని తెలిసిన తర్వాత ధర్మయ్య యింకొక్క క్షణమైనా యింటి దగ్గర తామసించలేదు. నన్ను గూడా వెంటబెట్టుకుని వెంటనే ప్రకృతి పొత్తిళ్లలోకి బయల్దేరాడు. ఊరికి ఒరుసుకున్నట్టుగా వున్న గుట్ట నెక్కి, దిగితే ముందుగా ఎదురయ్యేది వాళ్ల మామిడి తోటే. నలభై యేళ్లకు మునుపు వాళ్లది పెద్ద సమిష్టి కుటుంబంగా ఉన్నప్పుడు ఆ చుట్టుపట్ల ఆ తోటకు చాలా ప్రసిద్ధి ఉండేది. అక్కడలేని ఫలవృక్షాలుగానీ, పూల మొక్కలుగానీ ఉండేవి కావు. నేను మొదటిసారిగా సపోటాపండ్లు రుచి చూచిందక్కడే! పగిలిన దానిమ్మలెంత మధురంగా ఉంటాయో గ్రహించిందక్కడే! బొప్పాయి పండ్ల ముక్కలు, తియ్యటి ఐస్‌క్రీంలా నోట్లో కరిగిపోతాయని తెలుసుకున్నదక్కడే! ఆ రోజులు పోయాయి. ధర్మయ్య తమ్ముళ్లు తమ భాగం తాము పంచుకుని, అయినకాడికి తెగనమ్మి, వెళ్లి పట్నంలో చేరిపోయారు. అదుపుదప్పినందువల్ల ధర్మయ్య కొచ్చిన భాగంకూడా ఖిలపడిపోయింది. పోయినవి పోగా మిగిలివున్న మామిడి చెట్లతోబాటు, కబిన బావిగట్టున నాలుగు కొబ్బరి చెట్లు మాత్రం నిలబడి వున్నాయి. ధర్మయ్య దూరంగా గొడ్లు మేపుకుంటున్న కుర్రాణ్ణి పిలిచి "ఒరే అబ్బీ! చెట్టెక్కి ఎడనీరు కాయలు కోసి ఒకటో రెండో ఈయనకు కొట్టివ్వరా! నేనీలోగా అడివిలోకి వెళ్ళొచ్చేస్తాను..." అంటూ పొదల మాటున్నుంచీ మాయమైపోయాడు. ఎంతకాలం గడిచినా, ఎన్ని అవాంతారాలు వాటిల్లినా సృష్టిలోని కొన్ని మూలపదార్థాల ధర్మాలకు సేగి అనేది ఉండదట. కొబ్బరినీళ్లుకూడా అట్లాగే అమృతప్రాయంగా ఉన్నాయి.

చుట్టూరా పచ్చటి కొండలు, మధ్యలో లోయ, అడవి, మామిడి తోపులు, పొలాలు, పైన ఆకాశం, మధ్యాహ్నపు సూర్యుడు, చెట్ల నీడలు – ఈ హంగులన్నింటితోనూ ఆ ప్రదేశం పెద్ద నిశ్చల వర్ణచిత్రంలా వుంది. చిట్టడవిలో బుడుంగున మునిగిపోయిన ధర్మయ్య మళ్ళీ ఎప్పటికో ఒక గంటసేపటికి పైకి తేలాడు. "మందాకు దొరికింది నాయనా! ఇంటికెళ్లి పసరు తియ్యాల్సిందే" నన్నారు. "సరే. పదండి వెళ్దాం" అన్నాను. "ఉండుండు వట్టి చేతులతో వెళ్తే ఎలా? కూరకేదైనా కోసుకెళ్ళాలగదా" అంటూ మడికయ్యల్లో పడి మిరపదోటవైపు దారితీశాడు.

సన్నటి పొలం గనుమలపైన నడచి వెళ్తుండగా నేను ధర్మయ్యను వెనుకవైపునుంచీ చూస్తున్నాను. ఆయనకెంత లేదన్నా డెబ్భైయి అయిదేళ్లకు తక్కువుండదు. అయినా అతడి వెన్నెముక వంగలేదు. కాలాన్ని జయించినట్టుగా ఆయన నిటారుగా చకచకా నడవ గలుగుతున్నాడు. తన కళ్ల ఎదుట పుట్టి పెరిగిన వాళ్ళు, తాను స్వయంగా పెంచిన వాళ్ళుగూడా ఈ నేలతో, నీటితో, గాలితో సంబంధాలు తెంచుకుని సుఖ జీవనాన్ని అన్వేషిస్తూ వెళ్లిపోయారు. ధర్మయ్య అలా పారిపోలేదు. వీరుడిలా పరిస్థితులతో పోరాడుతూనే వున్నాడు. ఎన్నో కరువులొచ్చాయి. ధర్మయ్య ఎదురొడ్డి నిలబడ్డాడు. ఎన్నెన్నో కష్టనష్టాలెదురయ్యాయి. ధర్మయ్య క్రుంగిపోలేదు. నమ్మిన వాళ్ళే మోసం చేశారు. ధర్మయ్య దిగులుపడలేదు. పెద్దకొడుకును పెద్దచదువులే చదివిస్తే, అతడు పెద్ద ఉద్యోగం సంపాదించి, పెద్ద కుటుంబంలోని అమ్మాయిని పెళ్లాడి, ఆ పెద్దవాళ్ల ప్రాపకంలో పట్టణంలోనే స్థిరపడిపోయాడు. ధర్మయ్య కన్నీరు పెట్టుకోలేదు. ఎందరెందరో రక్తబంధువులు – తనకంటే పెద్దవాళ్ళు చిన్నవాళ్లూకూడా – తన చేతుల్లోనే కళ్లుమూశారు. మానవుడికి జనన మరణాలు అత్యంత సహజమనుకున్నాడు ధర్మయ్య. అయితే బొందిలో ఊపిరి ఉన్నంతవరకూ మనిషి తనకోసం, తనతోడివారికోసం పాటు పడవలసిందే! ఋణపు తిండి తినడం కంటే దేశద్రోహం లేదనుకున్నాడు. కర్మవీరులు చరిత్ర పుటల్లోనే ఉంటారనుకోడం తప్పు. వాళ్ళు వాస్తవ ప్రపంచంలో, నిజజీవితంలోకూడా ఉంటారు.

భోజనానంతరం పేషంటు కాలికి పట్టువేసే చికిత్స ముగిసింది. ప్రశాంతంగా ఉంటుందని నాకోసం ప్రహరీకి వెలుపల వేపచెట్టు కింద మంచం వేయించారు. నిద్రలేచేటప్పటికి ఎండలు తగ్గి, నీడలు బాగా పొడుగుసాగాయి. ఇంటికోడలు ఫలహారం తెచ్చి పెట్టింది. ధర్మయ్య కబుర్లలో పడ్డాడు. తుఫానులెప్పుడూ ఆంధ్ర ప్రాంతం పైన్నే విరుచుకుపడతాయి. ఎందువల్ల? ఆ మధ్య ఉత్తరాదిలో ఎక్కడో బొగ్గుగనులు కూలి అందులో పనిచేసేవాళ్లు కొందరు భూస్థాపితమైనట్టు తెలిసింది. వాళ్లని ఈవలికి తీశారా లేదా? చంద్రమండలంలో ప్రాణులు నివసించడం లేదట. ఎందుకని? కలియుగంలో ధర్మం ఒంటికాలిపైన్నే నడుస్తుందంటారు. అయితే ధర్మం కాలాన్ని బట్టి మారుతుందా? కాలం దేన్ని బట్టి మారుతుంది? రాత్రి భోజనాలై పడుకున్న తర్వాత కూడా యిట్లాగే ఏవో గడ్డు ప్రశ్నలు వేస్తూ వచ్చాడు ధర్మయ్య. మాటల సందర్భంలో మా నియోజకవర్గం ఎం.ఎల్.ఏ ప్రసక్తి వచ్చింది. "నాయనా నీకు రఘుపతి తెలుసునా?" అని అడిగాడు ధర్మయ్య "అయ్యో తెలియకేం – ఇద్దరం అయిదారేళ్లు కలిసి చదువుకున్నాం" అన్నాను. "అట్లాగా – అయితే ఉండు. ఇప్పుడు గాదు, తెల్లవారినాక చెప్తా" నన్నాడు.

మరునాటి ఉదయం ధర్మయ్య ఎప్పుడు నిద్రలేచాడో తెలియదు. నేను కాలకృత్యాలు తీర్చుకుని వచ్చేటప్పటికి ఆయన అటకమీది నుంచి పాత దస్తరాలన్నీ దించేశాడు. పుస్తకాల కట్టలు విప్పి దేనికోసమో వెతుకుతున్నాడు. ఆ అన్వేషణ ఎప్పటికి తెములుతుందో తేలడంలేదు. నేను కాఫీ సేవిస్తూ వంటింటి ముందు అరుగుపైన కూర్చున్నాను. ఓ అరగంట గడిచేలోగా మడిచిన పాత కాగితాలు పట్టుకుని ధర్మయ్య చరచరా నా దగ్గరికొచ్చేశాడు.

"నాయనా రాజశేఖరం, మన రాయలసీమను రాళ్లసీమంటారు. కరువు సీమంటారు. కన్నీటి సీమనిగూడా అంటారు. మనకిన్ని ఫర్మానాలు వచ్చినాయంటే ఎందువల్ల? జలాధారాలు లేకపోవడంవల్ల, ఒక సంవత్సరం చాలినంతగా వర్షాలు పడినాయంటే మళ్ళీ రెండేళ్లదాకా మనకు బొటాబొటిగానే వానలు కురుస్తాయి. ఆ పైన సంవత్సరం వానలు బొత్తిగా ఎగదీసినా ఆశ్చర్యపడనక్కరలేదు. అప్పుడేమవుతుంది? కయ్యలు నెర్రెలు పడిపోతాయి. బావుల్లో చెట్లు మొలుస్తాయి. గొడ్డుకు గరికపోచ దొరకదు. అయితే దీనికంతా మనిషేం చెయ్యగలడని కొందరనుకోవచ్చు. మనిషి చేయగలిగిందిగూడా వుంది. ఆ చేయవలసిన పని ఒక్కొక్క ఊరికీ ఒకరకంగా ఉంటుంది. ఒక్కొక్క పాయకట్టును ఒక విధంగా ఉంటుంది. ఇప్పుడు మన పాయకట్టును చేరిన రెండు మూడువేల ఎకరాలు సుభిక్షంగా ఉండాలంటే అందుకొక ఆలోచన ఉంది. ఈ ఆలోచన ఈనాటిదిగాదు. ఇప్పటికి నలభైయేళ్లుగా ఇది నా మనసులో మెదలుతూ వుంది. హైస్కూలు డ్రాయింగు మాస్టర్ని కలిసి చదరంగా ప్లాను గీయించినాను. నకళ్లు తీయించినాను. ధర్మ దొరలకు పోస్టులో పంపించినాను. పట్టించుకున్న నాథుడు లేడు. ఇప్పుడున్న ఎం.ఎల్.ఎ. నీకు బాగా తెలిసినాయన అని తెలిసేటప్పటికి మళ్ళీ ఈ సంగతి జ్ఞప్తికొచ్చింది. ఇదిగో, దీన్ని 'గుండాల బయలు అడివి' అంటారు. నడిచివెళ్తే ఇక్కడినుంచి మూడు గంటల ప్రయాణం. దీనికి ఉత్తర దక్షిణాల్లో వింటిదబ్బల్లాగా రెండు కొండలున్నాయి. కొండల కడ్డంగా తూర్పుదిక్కున అడ్డకట్టవేయిస్తే అయిదారు మైళ్ళ మేరకు సముద్రంలా నీళ్ళు నిలుస్తాయి. ఆ గుండాల బయలు చెరువు నిండి మరకపోతే, ఆ నీళ్లు మొగిలి వాగులోకొస్తాయి. మొగిలివాగు మూడు మైళ్ళదూరం ముందుకురికిన తర్వాత, చెన్న రాయప్ప గండిగుండా బయటపడుతుంది. ఆ గండిని పూడ్చేస్తే పది పన్నెండు నిలువుల లోతున నీళ్లు నిల్చిపోతాయి.

ఈ చెన్నరాయప్ప చెరువుగూడా నిండిందంటే, దానికింద రామాపురందాకా వున్న ఏడు చెరువులూ ఆ మరవ నీళ్లతోనే నిండిపోతాయి. పైనీటిని తూములద్వారా వదిలిపెట్టి, గుండాల బయలు చెరువులోగానీ, చెన్నరాయప్ప చెరువులోగానీ స్థిరంగా కొంత నీటిని నిలవపెట్టొచ్చు. అప్పుడు క్రింది వైపు బావుల్లో నీళ్లింకిపోవు. అర్థాంతరంగా పంట లెండిపోవు. ఏమంటావు రాజశేఖరం – నాయన్నాయనా, నీకు పుణ్యముంటుంది. నువ్వెట్లాగైనా ఎం.ఎల్.ఎ. ద్వారా ఈ పని జరిగేటట్టు చూడాలి."

***

ఆనాటి సాయంకాలం మేము పెండ్లిమర్రి నుంచి తిరిగొచ్చేశాము. వచ్చి పదిరోజులైంది. అయినా ధర్మయ్య మాటలు నా చెవిలో గింగురుమంటూనే ఉన్నాయి. గాంధీగారు మహాత్ములు. ఆయన కన్న కలలు చాలా గొప్పవే కావచ్చు. నెహ్రూగారు మహనీయులు. ఆయనగూడా తన స్థాయికి తగ్గ కలలే కని ఉండొచ్చు. వాళ్ల కలలతో పోల్చి చూస్తే మా ధర్మయ్యన్నది చాలా చిన్న కలే గావచ్చు. అయినా కొన్ని వేల కుటుంబాలు సుఖసంతోషాలతో నిర్విచారంగా బ్రతకడమంటే సామాన్యమా? పెండ్లిమర్రినుంచి వచ్చినప్పటినుంచీ వాకబు చేస్తూనే వున్నాను. ఎం.ఎల్.ఎ. రఘుపతి హైదరాబాదు వెళ్లినట్లు తెలిసింది. తిరిగి రాగానే వెళ్లి అతణ్ణి కలుసుకోవాలి...

❖ సోవియట్ భూమి. ❖

# రుద్రభూమి

"నేను నా చిన్నతనంలో మా తాతగారితో కలిసి స్మశానానికి వెళ్ళాను. నేను తిరిగి వచ్చేశాను. ఆయన అక్కడే ఉండిపోయాడు" అన్నాడట ఒక కవిసత్తముడు.

మా తాతగారు నేను పుట్టకమునుపే వల్లకాటికి వేంచేశారు. అందువల్ల ఆయనద్వారా నాకు స్మశాన సందర్శన భాగ్యం లభించే అవకాశం లేకపోయింది. నేను రుద్రభూమి కెళ్ళింది కన్నారావుతో కలసి.

కన్నారావుని నేను నా మిత్రుడని చెప్పుకోను. ఎందుకంటే నాపట్ల అతడికున్నది గురుభావం. "నేను మీ శిష్యుడివంటివాణ్ణి స్వామీ," అని అతడే నాతో ఎన్నోసార్లు అని ఉన్నాడు. కానీ చూస్తూ చూస్తూ అంతటి భారీసైజు మనిషిని నా శిష్యుడని ఎలా చెప్పుకోగలను? అందుకు తగిన యూనిఫారం దుస్తులు తొడిగి వదిలిపెడితే అసలు సిసలు డి.ఎస్.పి లా ఉంటాడు కన్నారావు. ఆకారపుష్టిలో మాత్రమే కాదు. ఆర్థిక సౌష్టవం రీత్యాగూడా అతడే విశిష్టుడు. టౌనులో అతడికి మూడిండ్లున్నాయి. పది రిక్షాబళ్ళు అద్దెకు తిరుగుతున్నాయి. ఎక్కడో పల్లెలో ఉన్న పొలాలపైన వచ్చే గింజలు అతనికి భోజనానికి సరిపోతాయి. పెట్టి పుట్టిన అదృష్టంలోనూ, డబ్బులు సంపాదించడంలోనూ, సుఖంగా మనగలగడంలోనూ నిస్సందేహంగా గురుత్వం అతడిదే! ఎటొచ్చీ నేను అంతో యింతో వ్రాతగాణ్ణి. అప్పటి కదేదో అతి మానుషమయిన పనైనట్టు నేను కనిపించినపుడల్లా "మేష్టరుగారూ! సునాయాసంగా ఎలా వ్రాసి పడేస్తారండీ!" అంటూ ఆశ్చర్యపడుతుంటాడు కన్నారావు. ఒకసారి "అదెంత పనిలేవోయ్ కన్నారావ్! వ్రాయగలిగిన పేనా ఒకటి చేతిలో ఉండాలి. అందులో సిరా ఉండాలి. ఎవరైనా రాసి పారెయ్యొచ్చు" అన్నాను. "ఏం మాటలెండి! ట్రై చేసి చూసి ఉండకపోతే నేనూ అలాగే అనుకునేవాణ్ణి. తిండిపోతు సుబ్బారాయుడు లేడటండీ! వాణ్ణి గురించి మీకు తెలిసే ఉండాలి. పాపిష్టి ముండావాడు, ఎరువులన్నీ బ్లాకులో తగలేశాడా, చక్కెరబస్తాలను గిడ్డంగి దగ్గరే మారుబేరానికి అమ్మేశాడా. ఆ మధ్య ఆటోరిక్షాలుకొని సైకిలురిక్షావాళ్ళ నోళ్ళల్లో దుమ్ముగొట్టటానికి గూడా జూచాడు. వాడిపైన ఓ కరపత్రం వేయాల్సి వచ్చింది. తెల్లవారు జామున మూడు గంటలవరకు ప్రయత్నించాననుకోండి. ఒక గీత ముందుకు సాగితే ఒట్టు... ..."

చచ్చానురా బాబో అనుకున్నాను. ఈ కన్నారావు కరపత్రాలు, ఆకాశరామన్న ఉత్తరాలు మొదలయినవి రాసేవాళ్లకున్నూ, కథలు, నవలలు మొదలైనవి వ్రాసే వాళ్ళకున్నూ స్వభావంలో తేడా ఏ మాత్రముండదన్నట్టు భావిస్తున్నట్టున్నాడు!

"ఏదైనా వ్రాయాలంటే దండిగా చదవాలోయ్ కన్నారావు" అనేవాణ్ణి.

"అబ్బో! అబ్బో నేను చదవని పుస్తకాలా! రుద్రయ్య అంగడంతా ఖాళీ చేసేశానే అనేవాడు కన్నారావు,

"ఏదీ! మరైతే మీ యింట్లో పుస్తకమన్న వస్తువు ఎక్కడా కనిపించదే!" మొదటిసారిగా ఆ మాట విన్నప్పుడు విస్తుపోతూ అడిగాను.

"అబ్బే, అవన్నీ తెచ్చి ఇంట్లో ఎక్కడ పెట్టుకుంటామండీ! అదేమైనా అయ్యేపనా పొయ్యేపనా! చదవడమూ, యిచ్చెయ్యడమే! రోజుకొకటి చొప్పున తెచ్చుకుంటూ ఉంటాను..."

'అయ్యో కన్నారావు,' అనుకుంటూ మనసులోనే జాలిపడి "ఐతే దాన్ని అంగడన కూడదమ్మా! లైబ్రరీ అనాలి" అంటూ సవరించాను.

కన్నారావు ఒక్క పెట్టున నవ్వేశాడు – "ఊంహూ, రుద్రయ్య దగ్గర ఆ పప్పులేమీ ఉడకవండోయ్ గురువుగారూ! ఉచితంగా మీకు పుస్తకాలిస్తే యిక రుద్రయ్య బట్ట తడిపి కడుపుపైన వేసుకోవలసిందే! చెవులు నులిమి ముందుగా అద్దె డబ్బులు వసూలు చేసుకొని, ఆ తరువాత అతడు పుస్తకం చేతికిస్తా...డు..."

నేను పల్లెటూరివాణ్ణి. అడపా దడపా ఎప్పుడో పట్టణానికి వెళ్తుంటాను. పట్టణంలోవున్న నాలుగైదు పుస్తకాల షాపులూ నాకు చిరపరిచితమే. కానీ ఈ రుద్రయ్య ఎవడో, అతడి పుస్తకాల దుకాణం ఎక్కడున్నదో నాకు తెలియదు. ఎప్పుడయినా తీరిక దొరికినప్పుడు అక్కడికి వెళ్ళాలని అనుకుంటూ ఉండేవాణ్ణి, ఎవరు చూచారు ఏ పుట్టలో ఏ పాములైనా వుండొచ్చు.

నాలోని రచయితపట్ల కన్నారావుకు తిరుగులేని గురి ఏర్పడి వుండడానికి కారణముంది చూచారా, అది చాలా విచిత్రమయినదేనని చెప్పాలి. ఇరవై ఏళ్ళ క్రితం లోకానికి నా కళ్ళు విచ్చుకుంటూ, విచ్చుకుంటూ ఉన్న రోజుల్లో నేనొక నాటకం వ్రాశాను. తరువాతి కాలంలో అలాంటి నాటకం వ్రాసినందుకు సిగ్గుపడ్డాననుకోండి! ఆ విషయం ఇక్కడ అప్రస్తుతం. కన్నారావు ఆ నాటకంలో ఓ చిన్న వేషం వేశాడు. ఆ పాత్రకున్న ఒకటి రెండు పవర్‌ఫుల్ డైలాగ్సునూ మోతగా ఒప్పజెప్పి కరతాళధ్వనులు పుచ్చుకున్నాడు. ఆ క్షణంనుంచీ నేనొక మహారచయితనన్న విశ్వాసం అతడి రక్తంలో జీర్ణించి పోయింది. అంతకుమించి యిటీవలి కాలంలో పత్రికల్లో పడ్డ రచనల్నిగానీ అచ్చయిన పుస్తకాల్నిగానీ అతడు చూచిన పాపాన పోయినట్టు లేదు.

ఎప్పుడెదురైనా కుశల ప్రశ్నలు పూర్తికాగానే అతడు తప్పనిసరిగా అడిగే ప్రశ్న : "గురువుగారూ! మీరింకా ఆ యింట్లోనే అద్దెకున్నారా?"

"అదే యిల్లు. అదే సంపాదన, అదే సంసారం. మార్పే లేదు" అంటాను.

కన్నారావు నొచ్చుకుంటాడు. "ఇది పనిగాదండి గురువుగారూ! మీరేం లాభం లేదండి! మీకంటే ఒక తరం వెనకాల పుట్టిన రైటర్లు ఎలా బ్రతుకుతున్నారో తెలుసా మీకు? ఒకాయన కాపురం మూడంతస్తుల మేడ లోనట! ఇంకోకాయన కార్లల్లోగానీ నేలపైన తిరగడట... ..."

బహుశా వాళ్ళెవరో సినిమాలకు వ్రాసేవాళ్ళయి వుండాలి. లేదా తెలుగు తప్పించి మరో భాషలోనైనా వ్రాస్తూ వుండాలి. ఆ వివరాల జోలికి వెళ్ళాలన్న ఆసక్తి నాకు లేదు. అందువల్ల " ఆ విశేషాలన్నీ నీకెవరు చెప్పారు బాబూ?" అన్నాను.

"రుద్రయ్య చెప్పాడు లెండి! అతడికీ విషయాలన్నీ కొట్టిన పిండి."

"అలాగా! ఆ రుద్రయ్య నొకసారి చూచినా బాగుండిపోవును." అంటూ చిరకాల వాంఛను మళ్ళీ ఒకసారి బయటపెట్టాను.

"ఎప్పుడో ఎందుకూ? ఇప్పుడే వెళదాం పదండి!"

నేను రుద్రయ్య షాపుకెళ్ళడం అలా కుదిరింది. ఇదివరకు నేనెన్నోసార్లు బలాదూర్లు తిరిగిన మెయిన్ బజారులోనే వుంది రుద్రయ్య షాపు. కానీ, తీరా కన్నారావు తీసుకొచ్చి వదిలేదాకా అక్కడ ఇలాంటి షాపు ఒకటి ఉన్నట్టు తెలియకపోవటమే విచిత్రం. ఆ కొట్టు చాలా యిరుకుగా ఒక గొందిలా ఉండడమే యిందుకు కారణం గావచ్చు. పైపెచ్చు రుద్రయ్య తన పుస్తకాల వ్యాసంగం లోకులకందరికీ తెలియవలసిన అవసరం లేదనుకున్నాడేమో, కొట్టుకడ్డంగా ఒక గోనెపట్ట తెరకట్టాడు. తెరతొలిగిస్తే కొట్టు ఒక పాతాళ బిలంలా కనిపిస్తుంది. సంతలో టోకుగా కూరగాయలు కొని, లూజుగా లారీలోపోసి తరువాత యిచ్చవచ్చినట్టుగా బుట్టలకెత్తినట్టు, సైజు, సబ్జక్టు అన్న పట్టింపులేకుండా అక్కడ పుస్తకాలు స్టాండులో గుప్పబడి యున్నాయి. పుస్తకాలు పాతగిల్లినకొద్దీ అదొకరకం వాసన పుట్టుకొస్తుంది. అలాంటి వాసనతో అదొక చిన్న గిడ్డంగిలా వుంది.

"పిల్చుకొచ్చేశానోయ్! రుద్రయ్యా! చెబుతుండే వాణ్ణిగా, వీరే గురువుగారు......" అంటూ పేరుతో సహా నన్ను పరిచయం చేసిపెట్టాడు కన్నారావు.

"అలాగా! రండిసార్! కూచోండి" అంటూ వినయంగా లోపలికి ఆహ్వానించాడు రుద్రయ్య.

కూచోమన్నాడేగానీ పుస్తకాల స్టాండుల మధ్య గనుక నేను కుర్చీ వేసుకుని కూచుంటే! తరువాత లోపలికి, బయటకి రాకపోకలు బంద్పైపోయేటట్టున్నాయి. అంచేత నిల్చునే చేతికి దొరికిన పుస్తకాన్ని పైకితీసి చూడసాగాను.

కాఫీ గ్లాసుతో దగ్గరి కొచ్చేశాడు రుద్రయ్య. "పుస్తకాలు చూస్తున్నారా సార్! చూడండి. మీకు పనికొచ్చేవి గూడా ఉండొచ్చు. సార్! నిజం చెబుతున్నాను సార్! మీకు చాలా పేరుంది. పుస్తకాల కొనుగోలుకు వెళ్ళినప్పుడల్లా అక్కడివాళ్ళు మిమ్మల్ని గురించి అడగటమే. గంటా గవర్రాజని ఓ పబ్లిషరున్నాడు సార్! అతడి టర్నోవరు లక్షల్లో వుంటుంది లెండి. అతడైతే ఎలాగైనా పుస్తకం వ్రాయించి పెట్టమని సతపోరు పెడుతున్నాడు సార్!"

"ఏదీ! ఆ గంటా గవర్రాజు పుస్తకాలిక్కడున్నాయా?" అన్నాను.

"అదిగో ఆ రెండు వరసల నిండుకూ అవే! అంతా వందల లెక్కలోనే కొనుగోలు! మాకు వంద దెబ్బయి అయిదు పడుతుంది. మేం దజనుకు పదిహేను గిట్టుబాటు అయ్యేట్టుగా అమ్ముతుంటాం."

"మరైతే ఈ పుస్తకం మీది రేటుకూ, మీ హోల్ సేల్, రీటయిల్ రేట్లకూ సంబంధం వున్నట్టు లేదే!" అన్నాను.

"ఇ హి హీ" అన్నాడు రుద్రయ్య "ఈ వ్యాపారంలో చాలా లొసుగులున్నాయి లెండి గురువుగారో! అదిగో ఆ అటక మీద వున్న పుస్తకాలనైతే మేము వీశలలెక్కలో కొంటాం. పోనీ యివి చూడండి. లైబ్రరీ ఎడిషన్లకంటే అందంగా లేవూ! ఇది నాకు అరవై పర్సెంటు కమీషను పైన దొరికాయి......"

పాత పుస్తకాల వాసన. కాఫీ ప్రభావం, రుద్రయ్య చెప్పిన వివరం ఈ మూడింట్లో ఏది కారణమో చెప్పలేను. నాకు స్వల్పంగా తల తిరుగుతున్నట్లుంది.

కామినీ, శాకినీ, ఢాకినీ, పిశాచాల గురించి నేను విని వున్నాను. ప్రత్యక్షంగానే చూచే అవకాశం రుద్రయ్య కొట్టులోనే లభించింది. ఏం లేదు ఓ పుస్తకం తియ్యి, ముఖపత్రం వైపు చూడు. కామినీ పిశాచం వచ్చి నీ కనుపాపల్లో నిలుస్తుంది. "నన్ను చూడు, నా అందంచూడు" అన్నట్టుగా ఓ మోహినీ పిశాచం బట్టలు విప్పుకొని పైకి వచ్చేస్తున్నట్టే వుంటుంది. తలలు విరబోసుకున్న జీబు దయ్యాలు, బట్టలో ఒళ్ళు దాచుకుని, మిట్టపళ్ళు మాత్రం ముందుకు చాపే ముసుగు దయ్యాలు, తలపుర్రెలు, కంకాళాలు, నెత్తురు మడుగులో శవాలు, పెట్టెతియ్యి, శవం, గదిలో ప్రవేశించు, శవం.

చేసిన పాపం చెప్పుకుంటే పోతుందంటారు. నేనొకటి రెండు పుస్తకాలు తెరిచి అడుగు పెట్టరాని చోట్లల్లో అడుగు పెట్టాను.

రాక్షసరతులు, సమిష్టి సంభోగాలు, ఏకలింగ మైధునాలు, తిండీ, నీళ్ళూ, బ్రతుకూ, పరమార్ధమూ అంతా అదే అయినట్లుగా స్త్రీ పురుషులు కుక్కల్లా పందుల్లా వ్యవహరించే వల్లకాటి నాగరికత, అంతా అక్కడే ఉంది. భగవంతుడా! నాకిప్పుడు కాళ్ళు కంపించి పోతున్నాయి. ఒళ్ళంతా చెమటలు పోశాయి. కళ్ళు గిర్రున తిరుగుతున్నాయి. ఉన్నట్టుండి శవాల జాతరలో పీనుగుల కుంభమేలాలో, ఆటవిక దిగంబరుల పాశవిక ప్రవృత్తుల నడుమ నేను చిక్కుపడిపోయాను.

అప్పటికి తనకు కావలసిన పుస్తకం ఒకటి ఎన్నిక చేసినట్టున్నాడు కన్నారావు. వీరబాహుడి దగ్గిర కాటిసుంకం చెల్లిస్తున్నాడు.

"ఇక వెళదామా కన్నారావ్!" అన్నాను.

నామాట ఆక్రోశంలా వినిపించిందేమో! రుద్రయ్య వులికిపడ్డాడు.

"గురువుగారూ! ఇక్కడ కొన్ని పుస్తకాలుండాలి. చూచారా?" అంటూ పరుగెత్తు కొచ్చాడు.

నిజమే! అవి చాలా మంచి పుస్తకాలు. ఏ పబ్లిక్ లైబ్రరీలోనో ఉంచతగినవి. ఏ సాహిత్యాభిమాని పుస్తక సంచయంలోనో తావుచేసుకోవలసినవి. పాపం. అకాల మరణం పొంది యిక్కడికి వచ్చినట్టున్నాయి.

"వెళదామా?" అన్నాడు కన్నారావు. అప్పటికి నేను మెట్లుదిగి రోడ్డుపైన ఉన్నాను.

పదిబారల దూరం నడిచాక రహస్యంగా నాతో అన్నాడు కన్నారావు– "మేష్టరుగారూ! కొట్టుక్రింద నేల మాళిగ లాంటిదొకటుంది. దానినిండా పుస్తకాలే వున్నాయి. రుద్రయ్య ఎంతో నమ్మకమయిన వాళ్ళకుగానీ వాటిని చూపించడు. మీకైతే అభ్యంతర ముండదనుకుంటాను. చూస్తారా ఒకసారి..."

"ఓహో! సుప్రాప్తి కలదన్నమాట! వద్దులే కన్నారావ్! వాటిని నిద్రలేపొద్దు. అవతల నాకింకొక అరగంటలో బస్సుంది."

అంటూ పరుగందుకొన్నాను–

❖ పుస్తక ప్రపంచం. ❖

## రచయిత గురించి



జననం: 5, అక్టోబరు 1930
మరణం : 1, ఏప్రిల్ 1999

పుట్టింది : మొగరాల, చిత్తూరు జిల్లా.

విద్యాభ్యాసం : చిత్తూరు. ఉపాధ్యాయ వృత్తి. 1950 నుంచి తుదిశ్వాసవరకు సాహిత్య వ్యాసంగం. 300కు పైగా కథలు, రెండు నవలలు, కొన్ని నవలికలు, నాటకాలు, గేయాలు, ఎన్నో సాహితీ వ్యాసాలు రాశారు.

వెలువడిన కథాసంపుటాలు : వర్షించిన మేఘం, ప్రాణదాత, తాను వెలిగించిన దీపాలు, పునర్నవం, కళ్యాణకింకిణి, కమ్మతెమ్మెర, వక్రగతులు - ఇతర కథలు, వగపేటికి, వినోదప్రదర్శనం, రేవతి ప్రపంచం, పోలికలు కుశలమా!, జీవితానికి నిర్వచనం, కూనలమ్మ కోన, పాంథశాల, మధురాంతకం రాజారాం కథలు - మూడు సంపుటాలు...

సంపాదకత్వం : తొలినాటి తెలుగు కథలు, ఒక దశాబ్ది తెలుగు కథలు, ఆం.ప్ర. సాహిత్య అకాడెమీ ప్రచురణలు - "తెలుగు కథకులు - కథనరీతులు" విశాలాంధ్ర ప్రచురణాలయం వారి ప్రచురణ.

* పెక్కు తమిళ రచనలకు అనువాదం.
* అనేక కథలు తమిళం, కన్నడం, హిందీ, ఆంగ్ల భాషల్లోకి అనువదించబడ్డాయి.
* 'చిన్న ప్రపంచం - సిరివాడ', నవల రష్యన్ భాషలోకి తర్జుమా చేయబడి ప్రచురితమైంది.
* షికాగో తానా మహాసభల్లో పాల్గొన్న సందర్భంలో ఉత్తర అమెరికా పర్యటన (జూలై- ఆగస్టు 1995).

### పొందిన అవార్డులు - అందుకున్న సత్కారాలు :

* 1968 లో కథారచనకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు.
* అనువాద రచనకు తంజావూరు తమిళ విశ్వవిద్యాలయం వారి అవార్డు.
* 1993లో "మధురాంతకం రాజారాం కథలు" పుస్తకానికి కేంద్ర సాహిత్య అకాడెమీ బహుమతి.
* 1994 లో శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేటు ప్రధానం.
* 1996 లో అప్పాజోస్యుల - విష్ణుభొట్ల ఫౌండేషన్ (అమెరికా) వారి ప్రతిభామూర్తి పురస్కారం.

* * *